# భారత
# స్వాతంత్ర్య సమర చరిత్ర








చరిత్ర విద్యార్థులకు,
అన్ని పోటీ పరీక్షలకు
ఉపయోగపడే గ్రంథం.

ముక్కామల నాగభూషణం

# భారత
# స్వాతంత్ర్య సమర చరిత్ర

చరిత్ర విద్యార్థులకు, అన్ని స్థాయిల్లో
పోటీ పరీక్షలకు ఉపయోగపడే గ్రంథం.

ముక్కామల నాగభూషణం



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**Bharatha Swathanthrya Samara Charitra**
By Mukkamala Nagabhushanam

ప్రచురణ నెం 2350/1521R
ప్రతులు 1000
ప్రథమ ముద్రణ జూలై, 1990
ద్వితీయ ముద్రణ ఆగస్టు, 2003



వెల: రూ.120.00

ప్రతులకు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
E-mail visalaandhraph@yahoo com

విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్/సుల్తాన్ బజార్) హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి



ముద్రణ

## అంకితం

స్వాతంత్ర్య సమరంలో
అసువులు బాసిన అమరమూర్తులకు......

# విన్నపము

1987లో, ఆకాశవాణి విజయవాడ కేంద్రంనుండి, స్వాతంత్ర్య సమర చరిత్రపైన కొన్ని ప్రసంగాలు చేశాను 1988లో సంగీత రూపకాన్ని రచించాను అదికూడా విజయవాడ కేంద్రంనుండి ప్రసారమైంది వాటిని విన్నవారనేకులు, స్వాతంత్ర్య సమరచరిత్రను వివరంగా వ్రాయవలసినదిగా నన్ను కోరారు పుస్తకాన్ని తాము అచ్చు వేయిస్తామనికూడా తెలియజేశారు అలాంటి వారిలో శ్రీ దాసరి నాగభూషణరావుగారొకరు కాగా, వారి కోరికను కాదనలేక, వివరించిన చరిత్రను విశాలాంధ్ర ప్రచురణాలయం వారికిచ్చాను

నా ఈ స్వాతంత్ర్య సమర రచనకు, అనేకమంది పెద్దల రచనలు తోడ్పడినాయి. వారి రచనలనుండి, అధికార పత్రాలనుండి సేకరించిన సమాచారాన్ని పొందుపరచినచోట్ల, ఆయా రచయితల పేర్లను, పుస్తకాల పేర్లను, అధికార పత్రాల వివరాలనుకూడా వివరించాను. ఆ పెద్దలందరికీ నా కృతజ్ఞతలు.

**-ముక్కామల నాగభూషణం.**

# విషయసూచిక

# ప్రపంచ తలమానికం - ప్రాచీన భారతం

ప్రాచీన భారతదేశం00లో పెంపొందిన సంస్కృతి, నాగరికత పశ్చిమాసియా, మధ్యాసియా, దూరప్రాచ్య, ఆగ్నేయాసియా దేశాలలో ప్రతిఫలించాయి ప్రపంచంలో మొట్టమొదటి గ్రంథం మన ఋగ్వేదం మన ఉపనిషత్తులు, ఇతిహాసాలు, కాళిదాసాదుల రచనలు ప్రపంచ ప్రజల మన్ననలను, నేటికీ అందుకుంటున్నాయి సున్నాను కనిపెట్టి, దాని స్థాన విలువను నిర్ణయించి, గణిత శాస్త్రాన్ని ప్రపంచానికి ప్రసాదించినది భారతదేశమేనని వివిధ దేశాల శాస్త్రవేత్తలంగీకరించారు

ఈ ఔన్నత్యానికి కారణం ఇతర దేశాలతో మన పూర్వులేర్పరుచుకున్న వర్తక, వాణిజ్య, సాంస్కృతిక సంబంధాలు

నిజమే ఐదారువేల సంవత్సరాల క్రితం భారత ఉపఖండంలోని అధిక సంఖ్యాక ప్రజలు దుంపలూ, తూళ్లూ, చేపలు మున్నగువాటిని తింటూ జీవించినమాట నిజమే విశాల ప్రాంతాలను అజ్ఞాన తిమిరం ఆవరించివున్నమాటకూడా నిజమే

కాని ఎడారుల మధ్య కనిపించే సుక్షేత్రంవలె, ఐదువేల సంవత్సరాల క్రితం, అక్కడక్కడ కొన్ని నాగరికతా కేంద్రాలు వెలశాయి సముద్రం మధ్యలో మంచినీటి బుడగలా శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం పొటమరించింది

సింధు నాగరికత విలసిల్లిన కాలంలో భూమార్గ, జలమార్గాలద్వారా వ్యాపారం జరిగేది సింధు నాగరికుల ఓడలు అరేబియా సముద్ర తీరంలోని లోథాల్, సుత్కజన్‌దార్, సోత్కాకోహ్ మొదలగు రేవులనుండి బయలుదేరి బహ్రీన్ దీవికి చేరేవి

ఉత్తరాన మగధ రాజ్యం, దక్షిణాన శాతవాహన రాజ్యం బలపడిన పిమ్మట, బంగాళాఖాతం రేవులనుండి బయలుదేరిన ఓడలు, ఎగుమతి దిగుమతి వ్యాపారం కొరకు ఇండోనేషియా, వియత్నాం మున్నగు ఆగ్నేయాసియా దేశాల వరకేగాక, చైనాలోని కాంటన్ వరకూ వెళ్ళేవి అరేబియా సముద్ర రేవులనుండి బయలుదేరిన ఓడలు ఆఫ్రికా ఖండంలోని జాంజిబార్, దారెస్సలామ్ రేవులకు వెళ్లేవి పర్షియన్ సింధుశాఖద్వారా ఇరాన్, ఇరాక్‌లతోను, ఎర్రసముద్రంద్వారా ఈజిప్టుతోను ఎగుమతి దిగుమతి వ్యాపారం జరిగేది

కాబట్టి ఆయా దేశాల ఓడరేవులవద్ద మనవారు గిడ్డంగులు నిర్మించారు వాటి రక్షణ కొరకు సాయుధులను తీసుకువెళ్ళారు వసతి సౌకర్యాలు ఏర్పాటు జేశారు కాగా విదేశాలకు వెళ్ళేవారి సంఖ్య బాగా పెరిగింది

మొదట్లో కళింగనుండి, మాళ్వానుండి అనేకమంది సాహసవంతులు వెళ్ళారు తరువాత గుజరాత్, ఆంధ్ర, తమిళనాడు వగైరా ప్రాంతాలనుండి వెళ్ళారు. హిందూ, బౌద్ధమతగురువులు, శిల్పులు కూడా వెళ్ళారు

హిందూ-బౌద్ధ మతాలతోపాటు మన సాహిత్యం, కళలు కూడా ఆయా దేశాలలో - ముఖ్యంగా ఆగ్నేయాసియా దేశాలలో - విస్తరించాయి మన యోధులు, శ్రీవిజయ, కాంభోజ, చంపూ, ముజాపహిత్ రాజ్యాలను స్థాపించారు వాటి అధికారం మలేషియా, ఇండోనేషియాల నుండి ఫిలిప్పీన్సు, ఫార్మోజాల వరకూ విస్తరించింది భారతీయ సంస్కృతి

చైనా, జపాన్, మంగోలియాలపై ప్రసరించింది

ఆ విధంగా మన పూర్వులు మత, సాంస్కృతిక సంబంధాలుగల 'గ్రేటర్ ఇండియా'ను నిర్మించగలిగిన విషయం, డాక్టర్ హెచ్ జి క్వారిజ్ మున్నగువారి రచనల ద్వారా తెలుస్తోంది

అయినా ఇంగ్లీషు వారిలా మనవారు, ఇతర దేశాల సంపదను దోచుకురాలేదు ఆయా దేశాల ప్రజలతో కలసి మెలసి జీవిస్తూ, వారి అభివృద్ధికి తోడ్పడ్డారు

## తిరోగమనం

అలా విదేశాలలో భారతీయ సంస్కృతి, నాగరికత విస్తరిస్తున్న సమయంలోనే దేశంలో తిరోగమనం ప్రారంభమైంది ఉపఖండంలో అనేక చిన్న చిన్న రాజ్యాలు ఏర్పడ్డాయి రాజులు అన్యోన్య కలహాలలో మునిగి వినాశకర యుద్ధాలకు తలపడ్డారు దోపిళ్ళు పెరిగాయి ఉత్పత్తులు తగ్గాయి. కరువు కాటకాలతోపాటు మత మారణహోమం ప్రజ్వరిల్లింది ప్రజలు నిర్వీర్యులయ్యారు

మత గురువులు చెప్పిన ధర్మ సూత్రాలు నావికాబలం క్షీణించడానికి దారిదీశాయి సముద్రయానం చేయకూడదని బౌధాయన, నారద, మనుధర్మ సూత్రాలు శాసించాయి సముద్రయానం చేసినవారు ప్రాయశ్చిత్తం చేసుకున్నప్పటికీ మోక్షం సిద్ధించదని వారితోపాటు వారి బంధువులకు కూడా నరకం తప్పదని బృహన్నారదీయ పురాణం హెచ్చరించింది సముద్రయానం చేసినవారిని సనాతనులు వెలివేశారు

సముద్రయానం నిషిద్ధమైంది కాబట్టి నావికులు కరువయ్యారు సముద్రాంతర వ్యాపారాన్ని వర్తకులు నిలిపివేశారు ఎగుమతి వస్తువుల ఉత్పత్తి కేంద్రాలు మూతబడ్డాయి

పదో శతాబ్దంలో చోళరాజులకు, శ్రీ విజయరాజులకు మధ్య జరిగిన నావికా యుద్ధంలో ఉభయ నావికా బలాలు దెబ్బతిన్నాయి జీవించడానికి వేరుమార్గం లేని వారనేకమంది అరబ్బుల నావికాబలంలో చేరారు అరేబియా సముద్రం మీద ఆధిక్యత సంపాదించిన అరబ్బుల నావికాబలం ఇండియాను చుట్టి వెళ్లి ఇండోనేషియా, మలేషియాలలో తిష్టవేసింది కాబట్టి గ్రేటర్ ఇండియా బదాబదలైపోయింది భారతదేశం సామ్రాజ్యవాదుల హస్తగతమైంది



# పోర్చుగీసుల ప్రవేశం

భూమార్గాల ద్వారా భారతదేశంతో వ్యాపారం చేయడం పశ్చిమ యూరప్ దేశాలవారికి సాధ్యం కాలేదు కనుక సముద్ర మార్గాన్ని కనుగొనేందుకు ప్రయత్నించారు అలా ప్రయత్నించిన వారిలో కొలంబస్ ముఖ్యుడు కాని ఆయన ఓడ ఇండియాకు చేరడానికి బదులు అమెరికా ఖండానికి చేరింది

అటు పిమ్మట వాస్కోడిగామా కేప్ ఆఫ్ గుడ్ హోప్‌ను చుట్టి, ఆఫ్రికా తూర్పుతీరంలోని రేవులకు చేరాడు కాని ఇండియాకు చేరలేకపోయాడు కాబట్టి అహమ్మద్ బిన్ మజీద్ అనే నావికునకు కోరినంత ధనమిచ్చి, అతని సహాయాన్ని పొందాడు ఇకనేం? ఆ నావికుడు (1497లో) కిల్వాఫోర్డ్‌లో నున్న వాస్కోడిగామా ఓడను తిన్నగా కాలికట్‌కు నడుపుకొచ్చాడు

అయినా పోర్చుగీసువారు తెచ్చిన సరుకులు నాసిరకంగా వుండడంవల్ల, వాటిని భారతీయులు కొనలేదు కాబట్టి భారతదేశంలో లభించే వస్తువులను కొనడానికి అవసరమైన ధనం పోర్చుగీసువాళ్ళకు లభ్యం కాలేదు కనుక వాళ్లు దుష్ట చర్యలకు పూనుకున్నారు తీర ప్రాంత పట్టణాల మీదను, గుజరాత్‌వారి ఓడల మీదను ఫిరంగులు కాల్చుతూ, వాటిని దోచుకుంటూ బలపడ్డారు

1500 సంవత్సరంలో కాలికట్‌లో ఫాక్టరీని నిర్మించారు 1506లో గోవాను ఆక్రమించారు 1509లో కాంబే జలసంధిలో తిష్టవేశారు 1535లో గుజరాత్ పాలకుడైన బహదూర్‌షాతో సంధి చేసుకుని, దియూ (డయ్యూ)లో కోటను నిర్మించారు మరికొద్ది కాలంలోనే బహదూర్‌షాను హత్యజేసి, అరేబియా సముద్రం మీద ఆధిపత్యాన్ని సంపాదించారు అటు పిమ్మట శ్రీలంక రేవులపైన, బంగాళాఖాతంలోని రేవులపైన కూడా ఆధిపత్యాన్ని పొందారు ఆ బలంతో హుగ్లీ పట్టణాన్ని, దాని పరిసర ప్రాంతాలను ఆక్రమించి బెంగాల్లో తిష్ట వేశారు

పొగాకు మీద పన్ను వేశారు క్రైస్తవ మతంలో చేరవలసిందిగా ప్రజలను నిర్బంధించారు చుట్టు ప్రక్కల గ్రామాలను దోచుకుంటూ, చేతికి దొరికిన ప్రజలను తీసుకుపోయి విదేశాలలో బానిసలుగా అమ్మివేశారు కాగా ప్రజలు వారికి 'బుడత కీచులు' అని పేరు పెట్టారు

ఆ క్రూర కృత్యాలను సహించలేక రఘునాధనాయకుడు 1615లో దేవికోటను ముట్టడించి, చోళునితోపాటు పోర్చుగీసు వారిని కూడా ఓడించాడు తరువాత శ్రీలంకలోని జాఫ్నాకు వెళ్లి, అచ్చట తిష్టవేసిన పోర్చుగీసులను తరిమివేశాడు కనుక దక్షిణ భారతదేశంలో బుడతకీచులకు ఎదురుదెబ్బ తగిలింది కాని పోర్చుగీసువాళ్ల బలం బెంగాల్లో పెరగసాగింది

ఆ ప్రమాదాన్ని అరికట్టేందుకు జహంగీర్ తన సైన్యాన్ని పంపాడు కాని ఫలితం పూజ్యమైంది. పైగా పోర్చుగీస్ నావల దాడులు ఎక్కువయ్యాయి వారి మదమణిచేందుకు పనికొస్తారనే ఉద్దేశ్యంతో జహంగీరు పాదుషా, బ్రిటిష్-డచ్చి కంపెనీలకు అదనపు సౌకర్యాలు కల్పించాడు ఢాకా, పాట్నా, ఆగ్రా వంటి పట్టణాలలో బ్రిటిష్ - డచ్చి కంపెనీల వ్యాపార కేంద్రాలు నెలకొన్నాయి 1615లో ఇంగ్లండు రాజు ఒకటవ జేమ్సు

రాయబారిగా థామస్‌రో, జహంగీర్ దర్బారులో ప్రవేశించాడు కాగా బ్రిటిష్-డచ్చి కంపెనీల వాళ్ళు బాగుపడ్డారు అయినా వారు పోర్చుగీసు వాళ్ల మీద యుద్ధానికి తలపడలేదు

అందువల్ల 1632లో షాజహాన్ చక్రవర్తి హుగ్లీ పట్టణాన్ని ముట్టడించాడు అనేక రోజుల ముట్టడి తర్వాత వొకనాటి రాత్రి మెరుపుదాడి చేసి పట్టణాన్ని స్వాధీనం చేసుకున్నాడు అనేకమంది పోర్చుగీసు సైనికులు హతమయ్యారు నాలుగువేలమంది ఖైదీలుగా చిక్కారు కాగా బుడత కీచుల నుండి రాగల ప్రమాదం తప్పింది కాని బ్రిటిష్ వాళ్ల పాలన దాపురించింది

## పాశ్చాత్యకంపెనీల పోటీ

1600 సం లో రిజిష్టరు చేయబడిన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వాళ్లు అనతికాలంలోనే బలపడ్డారు 1612లో సూరత్‌లో వ్యాపార కేంద్రాన్ని స్థాపించారు 1639లో చెన్నపట్టణంలో కోటను నిర్మించుకునేందుకు, చంద్రగిరి రాజుల అనుమతి పొందారు తరువాత కలకత్తా వద్ద తిష్ట వేశారు

1602లో ప్రారంభమైన డచ్ (హాలండ్) కంపెనీ వాళ్లు నాగపట్టణం, మచిలీ పట్టణం, చిన్సురా, ఢాకా పట్టణాలలో వ్యాపార కేంద్రాన్ని స్థాపించారు

1664లో స్థాపించబడిన ఫ్రెంచి కంపెనీ వాళ్లు పాండుచేరి, యానాం, చంద్ర నగరాలలో స్థావరాలు నెలకొల్పారు

ఆ స్థితిలో ఛత్రపతి శివాజీ 1664లో ఒకసారి, 1670లో మరొకసారి సూరత్ రేవు పట్టణం మీద దాడి చేసి, పట్టణంతోపాటు గిడ్డంగులను కూడా కొల్లగొట్టాడు అందువల్ల పాశ్చాత్య కంపెనీల వాళ్లు బంగాళాఖాతం రేవులపైన కేంద్రీకరించారు అయినా గుజరాత్‌లోని ధనిక వర్తకులతో తమకుగల సంబంధాలను పెంచుకుంటూ, వారి ద్వారా ఎగుమతి, దిగుమతి వ్యాపారాన్ని సాగించారు కాబట్టి బోహ్రా, బనియా మున్నగు కులాలకు చెందిన దేశీయ వ్యాపారులు మేటలు వేశారు అలా మేటలు వేసిన వారిలో ఢిల్లీ పాదుషాల బంధువులు కూడా వున్నారు కనుక తమకు అవసరమైన అనుమతి పత్రాలను సులువుగా పాశ్చాత్య కంపెనీలు సంపాదించగలిగాయి

కాని పాశ్చాత్య కంపెనీల మధ్య యుద్ధాలు ప్రారంభమయ్యాయి ఇండియాతో జరిగే ఎగుమతి, దిగుమతి వ్యాపారం మీద గుత్తాధిపత్యం కొరకు వారు యుద్ధాలకు దిగారు 1625లో ఆంగ్లో-డచ్-నౌకదళాలు పోర్చుగీసు వాళ్ల నోడించి, వాళ్ల ఆస్తులలో కొన్నిటిని పంచుకున్నాయి 1642లో డచ్ వాళ్లకు వ్యతిరేకంగా బ్రిటిష్‌వాళ్లు, పోర్చుగీసు వాళ్ళు ఏకమయ్యారు ఇరువురూ కలిసి 1652లో డచ్ వారి నోడించారు 1669లో పోర్చుగీసు రాకుమారిని ఇంగ్లండు రాజు ఛార్లెస్ వివాహమాడినప్పుడు బాంబే రేవు పట్టణాన్ని పోర్చుగీసు రాజు తన కుమార్తెకు అరణంగా యిచ్చివేశాడు అలా బలపడినప్పటికీ బ్రిటిష్ కంపెనీ బానిసల వ్యాపారం మానలేదు

బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వాళ్లు ఇండియాకు వచ్చినప్పుడు, ఇక్కడ అమ్మగలిగిన వస్తువులేవీ వారి వద్ద లేవు. కనుక 30వేల పౌన్ల విలువగల వెండి, బంగారాలు ఇచ్చి సుగంధ ద్రవ్యాలు, సిల్కురవసెల్లాలు వగైరా సరుకులను కొనుగోలు చేశారు అలా కొన్ని సంవత్సరాలపాటు కొన్నారు కాని ఎంత కాలమలా కొనగలరు?

ఇంగ్లండులో నున్న వెండి యావత్తూ ఇండియాకు చేర్చబడుతోందని ఆంగ్లేయులు ఆందోళన ప్రారంభించారు ఆ వ్యాపార పద్ధతిని ఆపవలసిందిగా వత్తిడి తెచ్చారు అందువల్ల కంపెనీవారు ఇండియాలో కొన్న వాటిలో కొన్నిటిని ఆఫ్రికా, అమెరికా ఖండాలలోగల బ్రిటిష్ కాలనీలలో అంటగట్టడం ద్వారాను, బానిసల వ్యాపారం చేపట్టడం ద్వారాను వెండి, బంగారాలను సమకూర్చుకున్నారు

ఇండియాతో వ్యాపారం ప్రారంభించిన ఆంగ్లేయులకు వెండి అవసరమైంది కాబట్టి వెస్ట్ఇండీస్‌లోను, స్పానిష్ అమెరికాలోను బానిసలను అమ్మి, వెండిని సమకూర్చుకున్నారు అని ఐ సి ఎ నౌల్సు ప్రకటించాడు

బ్రిటిష్ ప్రభుత్వ మద్దతు కలదుగాబట్టి కంపెనీవారికి అలాంటి పనులు సాధ్యమయ్యాయి అలా బలపడిన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీవారు 1696లో కలకత్తా నగర నిర్మాణం ప్రారంభించారు 18వ శతాబ్దారంభంలో ఫోర్టు విలియం నిర్మించారు 1740 వరకూ వారి పని సాఫీగా సాగిపోయింది

## బ్రిటిష్ - ఫ్రెంచి కంపెనీల పోరాటం

ఆ దశలో ఫ్రెంచి కంపెనీ గవర్నర్ డూప్లే ఒక పథకం వేశాడు ఖర్చు తక్కువ, ఫలితమెక్కువగా వుంటుంది గనుక, భారతీయులను సిపాయీలుగా చేర్చుకుని, ఇంగ్లీష్ వాళ్ల పని పట్టాలని, భారతదేశంతో జరిగే విదేశీ వ్యాపారం మీద గుత్తాధిపత్యం సంపాదించాలనీ ఉవ్విళ్లూరాడు కాగా 1740లో భారత యువకులను సిపాయీలుగా చేర్చుకుని సైనిక శిక్షణ నిప్పించాడు 1744లో మద్రాసులోని ఆంగ్లేయుల మీద దాడి చేసి, సెంట్ జార్జి కోటను స్వాధీనం చేసుకున్నాడు కాని నిలుపుకోలేకపోయాడు

ఆ యుద్ధంలో భారత సిపాయీల పోరాట పటిమను చవిజూచిన బ్రిటిష్ వాళ్లు 1746 నుండి భారత యువకులను సిపాయీలుగా చేర్చుకోసాగారు అలా ప్రారంభమైంది సిపాయీల రిక్రూట్‌మెంట్ అందువల్లనే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఇండియాను ఆక్రమించగలిగారు అయితే విదేశీ సైన్యంలో సిపాయీలుగా భారత యువకులెందుకు చేరినట్లు?

ఆ దశలో దేశం నిర్వీర్యమైవుంది. ఔరంగజేబ్ దండయాత్రలు, మహారాష్ట్రులకు - మొఘల్సుకు మధ్య జరిగిన యుద్ధాలు, షియా-సున్నీ కొట్లాటలు, జాట్ రైతుల తిరుగుబాటు, సిక్కుల తిరుగుబాటు, బందిపోటు మూకల దోపిడి, ప్రజల నెత్తిన పాలకులు రుద్దిన యుద్ధ ఖర్చులు మున్నగునవన్నీ కలసి ప్రజల జీవితాన్ని నాశనం జేశాయి ఛత్రపతి శివాజీలాంటి వాడుకూడా అహమ్మద్‌నగర్, బీజపూర్ నవాబుల పాలనలోగల గ్రామాలను పట్టణాలను కొల్లగొట్టాడంటే, ఇతరులమాట వేరే చెప్పనక్కర లేదు గదా? ఆ దశలో ఎక్కడ జూచినా యుద్ధాలే ఎటుజూచినా దోపిడీలే కాగా కరువు కాటకాల బారిపడి అలమటించిపోతున్న నిరుపేద యువకులను - కొద్దిపాటి జీతభత్యాలిచ్చి - సిపాయీలుగా చేర్చుకోవడం బ్రిటిష్ - ఫ్రెంచి కంపెనీలకు సాధ్యమైంది

## సర్కారు జిల్లాలు ఫ్రెంచి వారి హస్తగతం

1748లో హైదరాబాద్ నవాబ్ నిజాముల్ ముల్క్ మరణించగానే, అధికారం కొరకు కుటుంబ కలహం ప్రారంభమైంది వెంటనే డూప్లే రంగప్రవేశం జేశాడు కెప్టెన్

బుస్సీ నాయకత్వాన ఐదువందల మంది ఫ్రెంచి సోల్జర్సును, రెండువేలమంది భారత సిపాయీలను హైద్రాబాద్‌కు పంపి, ముజఫర్‌జంగ్‌కు పట్టం కట్టాడు ముజఫర్‌జంగ్ బంధువైన చందాసాహెబ్‌కు ఆర్కాట్‌నవాబ్ గిరిని కట్టబెట్టాడు కనుక ఫ్రెంచివారి సైనిక వ్యయాన్ని ముజఫర్‌జంగ్ భరించాడు

అయినా డూప్లేకు సంతృప్తి కలుగలేదు కాబట్టి నవాబ్ నెత్తిన సైనిక సహాయ ఒడంబడికను రుద్దాడు కాగా ఉత్తర సర్కారులు (జిల్లాలు) ఐదింటిలోను, నాలుగు సర్కారులు ముస్తఫానగర్ (కొండపల్లి), ఏలూరు, రాజమండ్రి, శ్రీకాకుళం - ఫ్రెంచి కంపెనీవారి స్వాధీనమయ్యాయి

ఈ నాలుగు సర్కారుల్లోను ఫ్రెంచివారు శిస్తులు వసూలు చేసుకునేందుకు విజయనగర పాలకుడైన విజయరామరాజు తోడ్పడ్డాడు కనుక విజయరామరాజుకు అండగా నిలబడిన బుస్సీ బొబ్బిలి కోటను ధ్వంసం చేశాడు ఆ యుద్ధంలో బొబ్బిలి వీరులనేకులు మరణించారు చివరకు తాండ్ర పాపారాయని చేతిలో విజయరామరాజు మరణించాడు

రాజ్యాధికారముంటేనేగాని వ్యాపార గుత్తాధిపత్యం సిద్ధించదని బ్రిటిష్ కంపెనీవాళ్లు కూడా గ్రహించారు కాబట్టి 1749లో తంజావూరు యువరాజుగానున్న షాజీని చేరదీసి, ఆయన శత్రువును ఓడించి దేవికొట్టయ్‌ని ఆక్రమించారు షాజీగతి అధోగతిగా మారింది

## బెంగాల్ బ్రిటిష్‌వారి హస్తగతం

బెంగాల్లో మొఘల్ పాదుషాల అధికారాన్ని త్రోసివేసిన సిరాజుద్దౌలా ఆంగ్లేయుల నోడించి కలకత్తాలో నిర్బంధించాడు కానీ 1752 జనవరి 2న కలకత్తాను తిరిగి క్లైవ్ స్వాధీనం చేసుకున్నాడు

1756లో బెంగాల్ సింహాసనం కొరకు జరిగిన యుద్ధంలో సిరాజుద్దౌలా గెల్చాడు ఆయన ప్రత్యర్థి పారిపోయి కలకత్తాలోని ఆంగ్లేయుల చంకలో దూరాడు అతనిని అప్పగించేందుకు ఆంగ్లేయులు నిరాకరించినందున, సిరాజుద్దౌలా మెరుపుదాడి చేసి, కాసింబజారును కలకత్తాను ఆక్రమించాడు

సిరాజుద్దౌలాను ఎదిరించేందుకు మద్రాసునుండి కెప్టెన్ క్లైవ్, అడ్మిరల్ వాట్సనుల నాయకత్వాన ఒక సైనిక దళం కలకత్తా చేరింది కాని సిరాజుద్దౌలాను జయించగలమనే ధైర్యం క్లైవుకు లేదు కాబట్టి కుట్రలు పన్నాడు

జగత్‌సేట్, అమీచంద్‌లాంటి పేరుమోసిన వడ్డీ వ్యాపారులతోనేగాక, రాజా దుర్లభరాయ్, మహతాబ్‌రాయ్‌వంటి ప్రముఖ జమీందార్లతో కూడా బ్రిటిష్ కంపెనీకి వ్యాపార సంబంధాలున్నాయి కనుక వారి ద్వారా సిరాజుద్దౌలా సేనాధిపతియైన మీర్‌జాఫర్‌ను క్లైవ్ కలుసుకున్నాడు యుద్ధంలో తనకు విజయం సిద్ధించేందుకు తోడ్పడితే, మీర్‌జాఫర్‌ను సింహాసనం మీద కూర్చుండబెడతానని బాసచేశాడు

1757 జూన్ 23వ తేదీన 'ప్లాసీ' అనే చోట యుద్ధం ప్రారంభమైంది క్లైవ్ సైన్యంలో 800మంది బ్రిటిష్ సోల్జర్లు, 2200 మంది భారత సిపాయీలూ వున్నారు సిరాజుద్దౌలా సైన్యంలో 18వేల గుర్రపురౌతులు, 50వేల పదాతి సైనికులూ వున్నారు అయినా మీర్ జాఫర్ చేసిన ద్రోహంవల్ల క్లైవ్‌కు విజయం సిద్ధించింది

క్లైవ్ చేసిన బాస ప్రకారం మీర్‌జాఫర్‌ను గద్దెనెక్కించాడు. కాని 1760లో బెంగాల్

గవర్నర్ వాన్‌సిటార్ట్ మీర్‌జాఫర్‌ను తొలగించి, మీర్‌ఖాసింకు పట్టంగట్టాడు తిరిగి 1764లో బ్రిటిష్ కంపెనీ అధికార్లు మీర్‌ఖాసిమును తరిమేసి, డమ్మీ నవాబుగా మీర్‌జాఫరును నిలబెట్టి, దివానీ (పన్నుల వసూలు) హక్కులు తమ చేతుల్లో వుంచుకున్నారు అప్పటినుండీ బెంగాల్, అస్సాం, బీహార్ ప్రాంతాలలో బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారానికి ఎదురులేకుండా పోయింది కుట్రలు సాగించేందుకు క్లైవ్‌కు తోడ్పడిన జగత్‌సేట్, అమీచందులు – కంపెనీ అధికార్ల కుట్రలకులోనై దివాళా దీశారు అంటే, వాళ్లు తవ్విన గోతిలో వాళ్లే పడ్డారన్న మాట

## కంపెనీ డైరెక్టర్ల హెచ్చరిక

"లాభాల కొరకు ఏర్పడిన కంపెనీ, ఎడతెగని యుద్ధాలకు పూనుకోవడం వల్ల నష్టాలు కలుగుతున్నాయి కాబట్టి యుద్ధాలలో తలదూర్చకుండా, వ్యాపారం మీద కేంద్రీకరించండి" అని ఫ్రెంచి కంపెనీ డైరెక్టర్లు తమ అధికార్లను ఆదేశించారు బ్రిటిష్ కంపెనీ డైరెక్టర్లు కూడా అలాగే భావించి, తమ అధికార్లకు ఈ విధంగా వ్రాశారు

"బ్రిటిష్‌లో తయారైన వస్తువులను ఇండియాలో అమ్ముకునేందుకు తగిన మార్కెట్లను ఏర్పాటు చేసుకోవలసిన అవసరమున్నప్పుడు అనుసరించవలసిన ఎత్తుగడలు వేరు కాని ఇప్పుడా అవసరం లేదు ఇండియాలో అమ్మడానికి తగిన వస్తువులు బ్రిటన్‌లో లేవు ఇండియాలో లభిస్తున్న వస్తువులను కొని, ఇతర దేశాలలో అమ్మి లాభాలు గడించడమే కంపెనీ ధ్యేయం కాబట్టి భూభాగాలను జయించేందుకు యుద్ధాలలో మునిగి నష్టాలు భరించడం దేనికి?" అని ప్రశ్నించారు

అందుకు జవాబుగా 1765 సెప్టెంబరులో క్లైవ్ ఇలా వ్రాశాడు

"బెంగాలును స్వాధీనం చేసుకోవడంవల్ల ఆదాయమేమాత్రం తగ్గదు వచ్చే ఏడు ఆదాయం రెండున్నర కోట్ల వరకూ వుంటుంది తరువాత మరో ముప్పై లక్షల వరకూ పెరుగుతుంది. ఏ పరిస్థితిలోను సివిల్, మిలిటరీ ఖర్చులు అరవై లక్షలకు మించవు ఇప్పటికే బెంగాల్ నవాబ్ అలవెన్సులను 42 లక్షలకు తగ్గించాం మొఘల్ పాదుషాకు, నవాబు ఇవ్వవలసిన కప్పమును 26 లక్షలకు తగ్గించాము కాబట్టి కంపెనీకి అదనంగా 122 లక్షల ఆదాయం ఖచ్చితంగా లభిస్తుంది అందువల్ల మొత్తం ఆదాయం, 3 కోట్ల 72 లక్షల రూపాయలకు పెరుగుతుంది. ఈ ఆదాయం ఏయేటికాయేడు పెరుగుతూనే వుంటుంది "

అప్పటినుండీ, ముడి సరుకులను ఎగుమతి చేసి, పారిశ్రామిక వస్తువులను దిగుమతి జేసుకునే దేశంగా ఇండియాను తమ గుప్పెటలో పెట్టుకోడానికి ఆంగ్లేయులు తీవ్రంగా ప్రయత్నించారు "ఆ ఉద్దేశ్యంతోనే నేను బెంగాలును స్వాధీనం చేసుకున్నాను" అని 1772లో క్లైవ్ బ్రిటిష్ పార్లమెంటరీ కమిటీ ముందు సాక్ష్యమిచ్చాడు

## సర్కారు జిల్లాల ఆక్రమణ

కాగా కల్నల్ ఫోర్డు నాయకత్వాన బ్రిటిష్ సైనిక దళం 1766లో ఉత్తర సర్కారుల్లో ప్రవేశించింది. అంతకుముందే లోపాయికారీగా తమతో ఒడంబడిక చేసుకున్న ఆనందగజపతిరాజు తోడ్పాటుతో ఫ్రెంచివారి నోడించి, మచిలీపట్టణాన్ని ఆక్రమించింది. తరువాత హైదరాబాద్ నవాబును కూడా బ్రిటిష్ వారు తమ వైపుకు తిప్పుకున్నారు

అందువల్ల ఫ్రెంచి కంపెనీ బలం బాగా తగ్గిపోయింది వారి స్వాధీనంలోని ఉత్తరసర్కారులు 1767లో బ్రిటిష్ వారి స్వాధీనమయ్యాయి కొన్ని గిరిజన ప్రాంతాలను విజయనగరం మహారాజు ఆక్రమించుకున్నాడు

సర్కారుజిల్లాలలో వసూలైన రెవిన్యూ మొత్తంలో, సివిల్ మిలిటరీ ఖర్చులుపోను, సగభాగం మిగిలింది బెంగాల్లోను అలాగే మిగిలింది గదా? అలా మిగిలిన మొత్తాన్ని వ్యావసాయక, పారిశ్రామిక అభివృద్ధి కొరకు ఖర్చు పెట్టడం ధర్మం కాని ఆ పని జరగలేదు ఏయేటికాయేడు మిగిలిన మొత్తాన్ని కంపెనీ లాభంక్రింద జమ కట్టుకొని, ఏదైనా ఖర్చుపెడితే దాన్ని కంపెనీ పెట్టుబడిగా చూపించారు

ఆ డబ్బుతోనే ఇండియాలో లభించే వస్తువులు కొన్నారు వాటిని ఇతర దేశాలలో అమ్మగా వచ్చిన ధనాన్ని ఇంగ్లండులో స్పిన్నింగ్ అన్డ్ వీవింగ్ యంత్రాల నిర్మాణానికి, స్టీమ్ ఇంజన్ల నిర్మాణానికి పెట్టుబడి పెట్టారు

"బెంగాలును స్వాధీనం జేసుకున్న పిమ్మట మూడేళ్లపాటు, ఒక్క సవరను బంగారమైనా చెల్లించకుండా, ఇండియాతో వ్యాపారం జేయడం సాధ్యమైంది" అన్నాడు ఎల్ క్ర్యాఫ్టన్

"అనేక ఏళ్లపాటు బెంగాల్లో వసూలైన రెవిన్యూలో కొంత భాగాన్ని - ఇండియాలో సరుకులు కొని, ఇంగ్లండుకు ఎగుమతి జేసేందుకు - ఉపయోగించారు" అని 1783లో నియమించబడిన కామన్సు సభా కమిటీ రిపోర్టు

## కర్ణాటక ఆక్రమణ

బ్రిటిష్ ఎత్తుగడల వల్ల కలగనున్న ప్రమాదాన్ని మైసూరు పాలకుడైన హైదరాలీ, ఆయన కుమారుడు టిప్పు సుల్తాన్ గుర్తించారు నావికా బలం యొక్క అవసరాన్ని గుర్తించి, దాని నిర్మాణానికి పూనుకున్నారు ఆ తండ్రీ కొడుకు లిద్దరూ దాదాపు 30యేళ్లపాటు బ్రిటిష్ సైన్యాలను తరిమికొడుతూ, వారి రాజ్యవిస్తరణ కాంక్షను వమ్ము చేయగలిగారు బ్రిటిష్ వారి రాజ్యకాంక్షను విఫలం జేసేందుకు తనతో చేతులు కలప వలసిందిగా హైదరాలీ నైజాం నవాబుకు, అయోధ్య నవాబుకు విజ్ఞప్తి చేసినా వారు కలిసి రాలేదు

తండ్రి మరణానంతరం టిప్పుసుల్తాన్ మరొకమారు అయోధ్య, హైదరాబాద్ నవాబులకు విజ్ఞప్తి చేశాడు బ్రిటిష్ వారి నోడించేందుకు తనతో చేతులు కలిపితే మహారాష్ట్రులు విధించే షరతులకన్నింటికీ ఒప్పుకుంటానని మహారాష్ట్ర పాలకులకు లేఖ వ్రాశాడు సైన్య సహాయం కొరకు అఫ్ఘన్ రాజుకు, నెపోలియనుకు కూడా ఉత్తరాలు వ్రాసి, రాయబారులను పంపాడు ఆ ప్రయత్నాలన్నీ విఫలమైనప్పటికీ చలించకుండా యుద్ధ ప్రయత్నాలు సాగించాడు ఆయుధాల తయారీ కొరకు కార్ఖానాలు నిర్మించాడు

హైదరాలీ మంచి యుద్ధ నిపుణుడు టిప్పు సుల్తాన్ కూడా నిపుణుడే కాబట్టి కొన్ని సమయాలలో బ్రిటిష్ సైన్యాలకు పూర్తి పరాజయం కలిగే పరిస్థితి కూడా ఏర్పడింది హైదరాలీ ఆకస్మిక మరణంవల్ల ఒకసారి ఆ పరిస్థితి తప్పిపోయింది

"నా శత్రువు శత్రువు నా మిత్రుడు" అనే నీతిని మహారాష్ట్ర పాలకులు చేపట్టడంవల్లను, ఆది నుండి తుది వరకూ రాజ్యకాంక్షతో నైజాం నవాబులు అందజేసిన సహాయంవల్లనూ - టిప్పు సుల్తానుతో జరిగిన యుద్ధాలలో - బ్రిటిష్ వారు పైచేయి

సంపాదించగలిగారు చివరకు టిప్పుసుల్తాను ఆశించిన ఫ్రెంచి సైనిక సహాయం కూడా - బ్రిటన్-ఫ్రాన్స్‌ల మధ్య జరిగిన ఒడంబడిక వల్ల - ఆగిపోయింది కాగా 1799లో టిప్పుసుల్తాన్ వీర మరణం జెందాడు అందువల్ల ఆంగ్లేయుల పంట పండింది మరొక ఇరవై ఏళ్లలో పీష్వాల కొంప కూలింది ఇంకొక ముప్పై ఏళ్లు గడిచేటప్పటికి దేశమంతా బ్రిటిష్ వారి స్వాధీనమైంది

## రైతు హక్కుల హరింపు

బ్రిటన్‌లో భూమి యావత్తూ రాజుది ఆయనచే నియమింపబడిన ప్రభువులకు, దానిమీద హక్కు సంక్రమిస్తుంది ఇండియాలో పంట పొలాలపై హక్కు రైతులది పన్ను విధించే హక్కు మాత్రమే రాజుది రాజుకు చెల్లించవలసిన పన్నును గ్రామ పంచాయతీలు వసూలు చేసి యిచ్చేవి భూముల అమరకం కూడా పంచాయితీలే చేసేవి వివిధ గ్రామ పంచాయతీల మధ్య నేవైనా సమస్యలు పొడసూపితే సమితి సభ్యులు పరిష్కరించేవారు నాలుగు పొలిమేరల మధ్యగల భూముల మీద మాత్రమే గ్రామ పంచాయితీ అధికారం చెల్లేది

పన్నులు విధింపు, వాటి వసూళ్ళ వ్యవహారమంతా కేంద్రంలోని పరిషత్తు చేతిలో వుండేది మనుధర్మ సూత్రాల ప్రకారం పండిన పంటలో ఆరోవంతు పంటను పన్ను క్రింద తీసుకునేవారు యుద్ధ సమయాలలో నాలుగోవంతు పంటను తీసుకునేవారు

రాజులు, నవాబులు తమకిష్టులైన వారికి ఈనాములు, జాగీరులు, జమీలు కట్టబెట్టినప్పటికీ, వారికి పంట పొలాల మీద హక్కు సంక్రమించేదికాదు ఎవరి పరిధిలో వారు పన్నులు వసూలు చేసుకునే హక్కు మాత్రమే వారికుండేది అయినా జమీందార్లు, ఈనాందార్లు, జాగీర్దార్లు పంచాయతీ పాలనను నిర్వీర్యం చేయగలిగారు

బ్రిటన్‌లో భూమి హక్కు రాజుదిగాబట్టి, అక్కడ అమలు జరిగిన పద్ధతినే కంపెనీ పాలకులు బెంగాల్ మద్రాస్ ప్రెసిడెన్సీలలో కూడా అమలు జరిపారు అంతవరకూ జాగీర్దార్లు, జమీందార్లు మున్నగువారు నవాబులకు చెల్లిస్తున్న కప్పమును పెంచారు వారు లేనిచోట్ల పన్నుల వసూళ్ల హక్కును వేలం వేశారు

ఇజారాదార్ల పాట మొత్తం పెరిగినా, జమీందార్లు కట్టవలసిన కప్పమును పెంచినా, ఆ బరువు భారమంతా రైతులమీద పడేది

కంపెనీ అధికారుల మెప్పును పొందేందుకు జమీందార్లు లంచాలు సమర్పించే వారు లేకపోతే వారి జమీలు ఊడిపోయేవి కనుకనే 1784లో నూజివీడు జమీందారు నారయ్య అప్పారావు తన ఎస్టేటును పోగొట్టుకోవలసి వచ్చింది కాని రైతుల అండదండలతో ఆయన కంపెనీవాళ్ల నెదిరించి, తన ఎస్టేటును నిలుపుకోగలిగాడు. అలాగే 1785లో వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు కూడా రైతులను కూడగట్టుకొని ఇబ్రహీంపట్నం వద్ద కంపెనీ సిపాయీల నెదిరించి తన ఎస్టేటును నిలుపుకున్నాడు.

## సన్యాసుల పోరాటాలు

అందరికంటే ఎక్కువగా సన్యాసులు, ఫకీరులు పోరాడారు 60వేల మంది సన్యాసులు త్రిశూలాలు, కత్తులు పుచ్చుకొని పోరాడుతూ, కలకత్తా వరకూ చొచ్చుకు పోయారు. కాని బ్రిటిష్ సోల్జర్ల ఫిరంగి దెబ్బలకు తట్టుకోలేక వెనుదిరిగిపోయారు

అయినా 1764 నుండి 1799 వరకూ సన్యాసులు, ఫకీరులు కలిసి అనేక చోట్ల బ్రిటిష్ సైన్యాలపై పోరాడారు

సన్యాసులు, ఫకీరులు సర్వసంగ పరిత్యాగులనే అభిప్రాయముంది అయినా వారు పోరాడడానికి ప్రబలమైన కారణాలున్నాయి

పెద్ద బందిపోటు దొంగగా కారల్‌మార్క్స్ వర్ణించిన క్లైవ్ 1757లో "మూర్షిదాబాద్ పట్టణం విస్తీర్ణంలోను, జనాభాలోను మాత్రమేగాక, సంపదలో కూడా లండన్‌తో తులతూగుతుంది" అన్నాడు అలాంటి పట్టణంతో సహా బెంగాల్లోని అనేక ప్రాంతాలు బ్రిటిష్‌వారి నిలువు దోపిడికి గురయ్యాయి అదెలా సాధ్యమైందో వివరిస్తూ రాబర్ట్ ఆర్మ్ అనే రచయితకు క్లైవ్ ఇలా వ్రాశాడు

"నీ చరిత్ర రచనకు కావలసిన సమాచారం, సంపుటాలకొద్దీ నావద్ద వుంది అందులో పోరాటముంది, జిత్తులున్నాయి పితలాటకాలున్నాయి కుట్రలున్నాయి రాజకీయాలున్నాయి ఇంకా ఏమున్నాయో ఆ దేవుడికి తెలియాలి " అలాంటి దుష్ట చర్యలను, బెంగాల్ ప్రజల బాధలను చూచి సహించలేని సన్యాసులు శ్మశాన వైరాగ్యాన్ని విడిచిపెట్టి కర్మయోగులయ్యారు వారితో ఫకీరులు చేతులు కలిపారు మతభేదం మాసిపోయింది మజ్నూషా నాయకత్వం వహించాడు

మజ్నూషా మంచి శక్తి సామర్థ్యాలు గలవాడు కాబట్టి 1766లో మెకంజీ సైన్యాల నోడించాడు మరొక పోరాటంలో కమాండర్ కీత్‌ను హతమార్చాడు తరువాత పదేళ్లపాటు తమ సైనిక బలాన్ని పెంచుకునేందుకు అనేక చోట్లకు వెళ్లాడు తమతో చేతులు కలపవలసిందిగా జమీందార్లకు విజ్ఞప్తి చేశాడు జమీందార్లు వినకపోయినా నిరుత్సాహ పడకుండా, తిరిగి పోరాటానికి సిద్ధమయ్యాడు

1776లో బ్రిటిష్ సైన్యంతో తలపడి వందలాది సైనికులను హతమార్చి, లెఫ్టినెంట్ రాబర్ట్‌సన్‌ను గాయపరిచాడు తరువాత అనేక గెరిల్లాల పోరాటాలు చేశాడు 1786లో లెఫ్టినెంట్ బ్రైనాన్ సైన్యంతో తలపడినపుడు గాయపడి, మఖన్‌పూరుకు తప్పించుకు పోయాడు కాని, గాయం నయంగానందున వీరమరణం చెందాడు

తరువాత భవానీ పథక్, దేవీ చౌధరాణీలు నాయకత్వం వహించారు మైమన్‌సింగ్, రంగపూర్ యుద్ధాలలో బ్రిటిష్ సైన్యానికి తీవ్రమైన నష్టాలు కలిగాయి కాబట్టి బ్రిటిష్ సేనానులు పైశాచిక చర్యలకు పూనుకున్నారు సన్యాసులు, ఫకీరులు సంచరించే ప్రాంతాల మీద విరుచుకుపడి అనేక గ్రామాలను కొల్లగొట్టారు కొన్నింటిని తగలబెట్టారు కొందరు పౌరులను నడిబజారుల్లో ఉరిదీశారు కాగా అడవుల్లోనున్న సన్యాసులకు సరఫరాలు నిలిచిపోయాయి అందువల్ల 1789–90 సంవత్సరాలలో బొగూరా అరణ్యంలో జరిగిన పోరాటాలలో సన్యాసులు, ఫకీరులు ఓడిపోయారు అయినా 1799 వరకూ గెరిల్లా పోరాటాలు కొనసాగాయి ఆ త్యాగధనులను వారెన్ హేస్టింగ్స్ ఇలా వర్ణించాడు

"వీళ్లు హిందూస్థాన్ జిప్సీలు, ప్రకృతిని తట్టుకోగల దృఢకాయులు, సాహసులు, అంతులేని ఉత్సాహవంతులు, మొండివాళ్లు కాబూల్ నుండి చైనా వరకు గల హిమపర్వత ప్రాంతం వీరి వశంలో వుండేది "

(వీరి సాహసకృత్యాలు బంకించంద్రుని ప్రభావితం చేశాయి కనుకనే 1883లో ఆయన "ఆనందమఠ్" అనే నవల వ్రాశాడు ఆ నవలలోనిదే సుప్రసిద్ధ వందేమాతరం గేయం.)

# ఆంగ్లేయుల ద్విముఖ పాత్ర

బ్రహ్మకు నాలుగు ముఖాలుంటే, ఇంగ్లండుకు కనీసం రెండు ముఖాలుండేవి ఈస్టిండియా కంపెనీ వర్తకులు, వారిని బలపరిచే ప్రభువులు (లార్డ్సు) ఒక ముఖం నూతనంగా తలెత్తిన పారిశ్రామిక వేత్తలు, వారిని బలపరిచే లిబరల్సు మరొక ముఖం ఈ రెండు ముఖాలూ 1770లో స్పష్టంగా కనుపించాయి

మధ్య తరగతి ఆంగ్లేయుల చొరవతో, ఇండియా నుండి దోచుకున్న డబ్బుతో ఇంగ్లండులో పరిశ్రమలు ప్రారంభమయ్యాయి పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం తలెత్తింది ఆ వర్గానికి స్వేచ్ఛా వ్యాపారం కావాలి కాబట్టి బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీకి గల గుత్తాధికారాన్ని రద్దు చేయవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వం మీద వత్తిడితెచ్చారు వారిని లిబరల్సు బలపరిచారు లార్డ్సు వ్యతిరేకించారు కాగా తమ చేజిక్కిన కంపెనీ రిపోర్టును లిబరల్సు బ్రిటిష్ పార్లమెంటులో చదివి వినిపించారు అందులో ఇలా వుంది

"1770లో వచ్చిన కరువు వల్ల బెంగాల్ ప్రెసిడెన్సీలో కోటి మంది ప్రజలు చనిపోయారు అయినా రెవిన్యూ ఆదాయం పెరిగింది దయాదాక్షిణ్యాలు లేకుండా, తీవ్ర చర్యలకు పూనుకోవడం వల్ల పెరుగుదల సాధ్యమైంది "

అందువల్ల ప్రభువుల పట్టు కొంత సడలింది కాగా "రెగ్యులేటింగ్ చట్టం (1773)" అమల్లో కొచ్చింది ఆ చట్టప్రకారం బెంగాల్ గవర్నరుగా నున్న వారెన్ హేస్టింగ్సును గవర్నర్ జనరల్‌గా నియమించారు ఆయనకు సహాయంగా నలుగురు సభ్యులతో కూడిన కౌన్సిల్‌ను ఏర్పాటుచేశారు అయినా వారెన్ హేస్టింగ్సు ప్రజలను కొల్లగొట్టగలిగాడు

1764-75 మధ్య కంపెనీ ఆదాయం దాదాపు నాలుగురెట్లు పెరిగింది 1770లో వచ్చిన కరువువల్ల బెంగాల్లో కోటిమంది చనిపోవడమేగాక, కొన్ని ప్రాంతాలు మరుభూములుగా మారాయి. సామాన్య ప్రజలతోపాటు కొందరు ఈనాందార్లుకూడా అడవుల్లోకి పోయి ఆకులు, దుంపలు తిని బ్రతకవలసి వచ్చింది కాగా స్వేచ్ఛా వ్యాపారాన్ని బలపరిచిన ఆర్థిక శాస్త్రవేత్త ఆడం స్మిత్ ఇలా విమర్శించాడు

"ఈస్టిండియా కంపెనీ వర్తకులిప్పుడు ఇండియాలోని విశాల ప్రాంతాలను పాలిస్తున్నారు కాబట్టి పాలకులుగా వారొక కర్తవ్యాన్ని నిర్వహించాలి భారతీయులు ఎగుమతి చేసే వస్తువులకు సాధ్యమైనంత ఎక్కువ ధర రాబట్టి, వారు దిగుమతి చేసుకునే వస్తువులు సాధ్యమైనంత చవుకగా లభించేటట్లు చూడాలి కాని కంపెనీ పాలకులు వ్యాపారులుగదా? కనుకనే భారతీయుల వస్తువులను సాధ్యమైనంత చవుకగా కాజేసి, వారికవసరమైన వాటిని సాధ్యమైనంత ఎక్కువ ధరకు అమ్ముతున్నారు వ్యాపారులే పాలకులుగావడం వలన ఇండియాకు కీడు సంభవించింది" (ఆడమ్‌స్మిత్ వెల్తు ఆఫ్ నేషన్సు)

దీనికి కారణం హేస్టింగ్సు సాగించిన దోపిడీ చర్యలే కాబట్టి ఆయనను గవర్నర్ జనరల్ పదవి నుండి తొలగించాలని, లార్డ్ క్లవరింగ్, కల్నల్ మాన్సన్, ఫిలిప్ ఫ్రాన్సిస్ (గవర్నర్ జనరల్ కౌన్సిల్ సభ్యులు) పట్టుబట్టారు హేస్టింగ్సు చేసిన దురాగతాలను, ఆయన కూడబెట్టుకున్న సంపదను నందకుమార్ వెల్లడించసాగాడు కనుక హేస్టింగ్స్ వెళ్లి, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తియైన "జస్టిస్ ఇంపె"ను ఆశ్రయించి, ఆయన సహాయంతో ఫోర్జరీ నేరం మోపి నందకుమారును ఉరితీయించాడు ఆ పని జరిగిన

పిమ్మట 1777లో మాన్సన్, క్లవరింగ్ మరణించారు కాగా హేస్టింగ్సుకు ఎదురులేకుండా పోయింది

అయినా కుట్రలకు, దోపిడీలకు, అధికారుల అవినీతికి సంబంధించిన పత్రాలను ఫిలిప్ ఫ్రాన్సిస్ రహస్యంగా ఇంగ్లండులోని విగ్సు (లిబరల్సు)కు అందజేశాడు కనుక వారు కంపెనీకి వ్యతిరేకంగా ఆందోళన ప్రారంభించారు టోరీలు (కన్సర్వేటివ్‌లు) కంపెనీని సమర్థించారు కాగా రెండు పార్టీల మధ్య ఘర్షణ ప్రారంభమైంది

కాని, అమెరికాలో బ్రిటిషు వారి పాలన అంతంగావడంవల్ల ఉభయపార్టీల మధ్య ఘర్షణ తగ్గింది అయినా విలియం పుల్లర్టన్, బర్కిలాంటి లిబరల్సు కంపెనీ దురాగతాలను విమర్శించడం మానలేదు కాగా బ్రిటిష్ ప్రభుత్వం వారొక విచారణ కమిటీని నియమించారు ఆ కమిటీ వారు పార్లమెంటుకు సమర్పించిన రిపోర్టులో ఇలా వుంది

"ఈస్టిండియా కంపెనీవారు ఇండియాలో కొన్న సరుకులకు తమ డబ్బు చెల్లించలేదు లేదా, తమ సరుకులనైనా ఇవ్వలేదు రెవిన్యూ ఖాతాలో మిగిలిన సొమ్మును, తమ లాభం క్రింద జమకట్టుకొని, ఆ సొమ్ముతోనే సరుకులు కొన్నారు తమ పెట్టుబడిగా కంపెనీవారు చూపించే డబ్బు, ప్రభుత్వ రెవిన్యూ ఖాతాలో మిగిలిన దప్పేగాని ఇంగ్లండు నుండి తీసుకు వెళ్ళింది మాత్రం కాదు "

ఈ రిపోర్టును చూచి 1783లో బ్రిటిష్ ప్రధానమంత్రి ఫాక్సు, పార్లమెంటులో ఒక బిల్లును ప్రవేశపెట్టాడు కంపెనీ డైరెక్టర్లను తొలగించి, వారి అధికారాలను పార్లమెంటుచే నియమింపబడిన కమీషనర్లకు అప్పగించేందుకు ఈ బిల్లు ఉద్దేశించబడింది కాని కంపెనీ వారితోపాటు ప్రభువులు కూడా వ్యతిరేకించడంవల్ల అది వీగిపోయింది కనుక ఫాక్సు మంత్రి వర్గందిగిపోయింది విలియం పిట్ మంత్రివర్గం అధికారాన్ని చేపట్టింది

అందువల్ల ఇంగ్లండు రాజకీయాలలో ఇండియా సమస్య కీలక సమస్యగా పరిణమించింది ఈస్టిండియా కంపెనీలో షేర్సు లేని వ్యాపారులు, పారిశ్రామిక పెట్టుబడిదారులు కలిసి, కంపెనీకి వ్యతిరేకంగా ఆందోళన ప్రారంభించారు వారి స్వేచ్ఛా వ్యాపార నినాదం అనేకమందిని ఆకర్షించింది కాగా 1784లో కామన్సు సభవారీ క్రింది తీర్మానం చేశారు.

"ఈస్టిండియా కంపెనీ అధికార్లు లంచగొండులుగా, నమ్మక ద్రోహులుగా వ్యవహరించి, భారతీయుల విశ్వాసాన్ని వమ్ముజేశారు ఇండియాను కొల్లగొట్టేందుకు ప్రతివారితోను పేచీలకు, యుద్ధాలకు దిగి, తమకిచ్చిన అధికారాన్ని దుర్వినియోగం చేశారు "

కాబట్టి కంపెనీ వ్యవహారాలపైన డైరెక్టు కంట్రోలును విధిస్తూ విలియం పిట్ ప్రవేశపెట్టిన బిల్లును పార్లమెంటు ఆమోదించింది అయినా కంపెనీ డైరెక్టర్ల అధికారం యధావిధిగానే కొనసాగింది కంపెనీ వ్యవహారాలను అదుపులో పెట్టే అధికారం మాత్రమే బ్రిటిష్ ప్రభుత్వ పరమైంది కాగా నికృష్టమైన ద్వంద్వ పరిపాలన ప్రారంభమైంది

అలా అటూ ఇటూ ఊగిసలాడిన పిమ్మట 1786లో లార్డ్ కారన్ వాలీస్‌ను గవర్నర్ జనరల్‌గా నియమించారు లంచగొండి ప్రభుత్వ యంత్రాంగాన్ని క్షాళనం చేసి, ఇండియాలోని పరిస్థితులను చక్కదిద్దే బాధ్యతను ఆయన కప్పగించారు

అంతమాత్రాన సరిపోదని, వారెన్ హేస్టింగ్సుపైన క్రిమినల్ నేరం మోపి

విచారించాలని ఎడ్మండ్ బర్క్, షెరిడాన్, ఫాక్సు వగైరా ప్రముఖులు పట్టుబట్టారు కాగా 1788లో హేస్టింగ్సుపైన క్రిమినల్ విచారణ ప్రారంభమైంది కాని 1789లో ఫ్రాన్సులో వచ్చిన విప్లవాన్ని జూచి భయపడిన టోరీలు, లిబరల్సు ఏకమయ్యారు ఎడ్మండ్ బర్క్ సహితం ఫ్రెంచి విప్లవ నాయకులను తెగతిట్టిపోశాడు మరి కొద్దికాలంలోనే నెపోలియన్‌తో యుద్ధం ప్రారంభమైంది కాబట్టి, హేస్టింగ్సుపై విచారణను వాయిదా వేశారు

ఈలోగా కారన్ వాలీస్ ఒక మినిట్సు వ్రాశాడు "కంపెనీ పాలనలోగల భూభాగాలలో మూడోవంతుమేర అడవి జంతువులకు ఆలవాలమైన అరణ్యాలుగా మారిపోయాయి"(లార్డ్ కారన్‌వాలీస్ మినిట్సు 18-9-1789)

కాబట్టి టోరీలు, లిబరల్సు కూడా ఒక ముఖ్య విషయాన్ని తెలుసుకున్నారు హేస్టింగ్సును శిక్షించడమంటే, మొత్తం కంపెనీని శిక్షించినట్లవుతుందని, అందువల్ల ఇంగ్లండ్ నవ్వులపాలుకాక తప్పదని గ్రహించారు కాగా 1795లో వారెన్ హేస్టింగ్సుపైన విచారణను రద్దు చేశారు క్లైవ్ చర్యలను గురించి సాగించిన విచారణ మాదిరిగానే, ఈ విచారణ కూడా ఒక ఫార్సుగా ముగిసింది అయినా చరిత్రను పూడ్చిపెట్టలేరుగదా?

కనుకనే జార్జి కార్నెవాల్ లెవిన్ 1858లో కంపెనీ పాలనను రద్దు జేయాలని కోరుతూ బ్రిటిష్ పార్లమెంటులో ఇలా దుయ్యబట్టాడు

"1765-84 మధ్యకాలంలో అధికారాన్ని చలాయించిన కంపెనీ ప్రభుత్వం వంటి విశ్వాసఘాతుక, అత్యాశాపూరిత, లంచగొండి ప్రభుత్వం నాగరిక ప్రపంచ మందెక్కడా ఏర్పడి వుండలేదు "

విమర్శలెంత ఘాటుగా వున్నా ఒక విషయం మాత్రం స్పష్టం వారు టోరీలుగాని, విగ్సుగాని-వ్యాపార పెట్టుబడిదారులుగాని, పారిశ్రామిక పెట్టుబడిదారులుగాని, ఇండియాను ఉద్ధరించేందుకు వారుపూనుకోలేదు ఎవరి స్వార్థం వారిదే గావడంవల్ల ఘర్షణపడ్డారు అవసరమనుకున్నపుడు ఏకమయ్యారు ఇండియాను దోచుకున్నారు

## వివాదార్ణవ సేతువు

బెంగాలును, మద్రాసు ప్రెసిడెన్సీలోని కొన్ని ప్రాంతాలను బ్రిటిష్ కంపెనీవారు ఆక్రమించిన పిమ్మట జిల్లా కోర్టులు, సదర్ ఆదాలత్ (అప్పీలు) కోర్టులు స్థాపించి, వాటిపైన సుప్రీంకోర్టులు (ఈనాటి హైకోర్టులు) నెలకొల్పారు వాటిలో న్యాయాధిపతులు బ్రిటిష్‌వారు వారికి భారతీయ న్యాయసూత్రాలు తెలియవు. కనుక హిందూ, ముస్లిమ్ ధర్మ సూత్రాలను క్రోడీకరించి, ఇంగ్లీషులోకి అనువదించేందుకు పూనుకున్నారు

హిందువుల ధర్మ సూత్రాలను క్రోడీకరించవలసిందిగా ప్రముఖ సంస్కృత పండితులను వారెన్ హేస్టింగ్సు కోరాడు అంతట వారు "వివాదార్ణవ సేతువు" అనే గ్రంథాన్ని తయారుజేశారు అది సంస్కృతంలో రచించబడింది కాబట్టి దాన్ని పర్షియన్‌లోకి తర్జుమా చేయించి, ఆ తర్జుమాను ఇంగ్లీషులోకి అనువదించుకున్నారు ఈ చాంద్రాయణ వ్రతానికొక కారణముంది

భారతీయ పండితులు, ఇంగ్లీషువారికి సంస్కృతం నేర్పేవారు కాదు కంపెనీ పాలకులు భారతీయులకు ఇంగ్లీషు చదువులు చెప్పించేవారు కాదు ఇంగ్లీషు చదువులు చెప్పిస్తే, ఇంగ్లండులోని శాస్త్ర సాంకేతికాభివృద్ధిని భారతీయులు తెలుసుకుంటారు గనుక

చెప్పించకూడదనుకునేవారు అయినా ప్రైవేటుగా నాలుగు ఇంగ్లీషు మాటలు నేర్చుకున్న వారిని, తమ అవసరం కొద్దీ గుమాస్తాలుగా నియమించుకునేవారు గుమాస్తాలుగా పనిజేస్తూ, ఇంగ్లీషు భాషను వృద్ధి జేసుకున్నవారిని కాస్త పై పదవులలో నియమించేవారు ఇలా నియమింపబడిన వారికి సంస్కృతం అర్థమయ్యేది కాదు సంస్కృత పండితులకు ఇంగ్లీషు అర్థమయ్యేదిగాదు కనుకనే వివాదార్ణవ సేతువును 1772లో పర్షియన్ భాషద్వారా ఇంగ్లీషులోకి అనువదించుకోవలసి వచ్చింది

న్యాయమూర్తులకు సంస్కృతం అర్థం గాకపోవడం ఒక లోపంగా భావించిన సర్ విలియం జోన్సు సంస్కృతం చదివేందుకు పూనుకున్నాడు జోన్సు కలకత్తా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి పలు భాషలలో పండితుడు అయినా ఆయనకు సంస్కృతం నేర్పేందుకు పండితులు నిరాకరించారు చివరకొక ఆయుర్వేద పండితుడు అంగీకరించాడు కాని కొన్ని నియమనిష్టలను విధించాడు అన్నింటికీ అంగీకరించి విలియమ్ జోన్సు సంస్కృత మభ్యసించాడు. అలాగే సర్ ఛార్లెస్ విల్కిన్సుకూడా చదివాడు

## సంస్కృత వాఙ్మయ పరిశోధన

అందువల్ల వారిరువురూ సంస్కృత వాఙ్మయ విశిష్టతను తెలుసుకోగలిగారు 1784లో విలియం జోన్సు "ఆసియా విద్వత్పరిషత్తు"ను స్థాపించాడు కాళిదాసుని శకుంతల నాటకాన్ని ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించాడు స్వయంగా సంస్కృత ముద్రాక్షరాలను తయారుచేసి, ఇంగ్లండులో సంస్కృత గ్రంధాలను ముద్రించే ఏర్పాటు జేశాడు ప్రాచ్య విజ్ఞాన విషయక వ్యాసాలను ప్రచురించుట కొక పత్రికను (జర్నల్ ఆఫ్ ది ఆసియాటిక్ సొసైటీని) ప్రారంభించాడు

సర్ ఛార్లెస్ విల్కిన్సు 1785లో భగవద్గీతను, '87లో హితోపదేశమును అనువదించాడు

1792లో శకుంతల నాటకాన్ని, నికోలాయ్ కరామ్‌జిన్ రష్యన్ భాషలోకి అనువదించాడు సంస్కృత, బెంగాలీ భాషలు నేర్చుకున్న రష్యన్ పండితుడు గెరాసిమ్ లెబదేవ్ 1795లో బెంగాల్ థియేటరును స్థాపించాడు తరువాత సంస్కృత ముద్రాక్షరాలను తయారుచేసి రష్యాకు పంపాడు వాటినుపయోగించి సెయింట్ పీటర్సుబర్గు (లెనిన్‌గ్రాడ్)లో కొన్ని సంస్కృత గ్రంధాలను ముద్రించారు. లెబదేవ్ రచించిన బెంగాలీ వ్యాకరణాన్ని 1801లో ఇంగ్లండులో ప్రచురించారు కాగా సంస్కృత వాఙ్మయ పరిశోధన కనేక పాశ్చాత్యదేశాల పండితులు పూనుకున్నారు

అందువల్ల సనాతనులకొక నూతనోత్సాహం కలిగింది "అంతా మన వేదాలలోనే వుంది" అనే ప్రచారం ప్రారంభమైంది సంస్కృతం నేర్చుకోవాలనే కోర్కెను అనేకమంది వెలిబుచ్చారు. కాగా కంపెనీ ప్రభుత్వం కలకత్తాలో "హిందూ కాలేజీ" అనే పేరుతో ఒక సంస్కృత పాఠశాలను స్థాపించింది దానితోపాటు ఒక అరబిక్ పాఠశాలనుకూడా నెలకొల్పింది కానీ ఇంగ్లీషు పాఠశాలను నెలకొల్పలేదు

## విఫలమైన కుటిలయత్నం

ఇంగ్లీషు చదువులు చెప్పకపోవడమేగాదు ఇంగ్లండులో తయారైన యంత్రాలను సహితం భారతదేశంలోకి రానివ్వకూడదని, ఒకవేళ అవసరమైతే వాటిని ప్రభుత్వమే

తెప్పించి, తమ అజమాయిషీలోనే వుంచుకోవాలని కంపెనీ పాలకులు నిర్ణయించారు ఇందుకు సంబంధించిన రసవత్తరమైన కధ పండిట్ నెహ్రూ చెప్పారు

"నైజాం నవాబ్ కోరినందున ఆయనకొక ఎయిర్ పంపును, మరొక చిన్న ముద్రణా యంత్రాన్ని, సికింద్రాబాద్‌లోనున్న బ్రిటిష్ రెసిడెంట్ తెప్పించి యిచ్చాడు వాటిని జూచి సంతోషించిన నవాబ్, మరికొన్ని విలువైన వస్తువులతోపాటు వాటిని భద్రంగా దాచిపెట్టాడు ఆ విషయమెలాగో కలకత్తాలోని పై అధికారులకు తెలిసింది ముద్రణా యంత్రాన్ని తెచ్చి పెట్టినందుకు రెసిడెంట్‌మీద కారాలు మిరియాలు నూరారు కాబట్టి, ఆ యంత్రాన్ని రహస్యంగా ధ్వంసం చేయిస్తానని రెసిడెంట్ విన్నవించుకోవలసి వచ్చింది" (నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియా)

తరువాత తమ అవసరం కొలది కంపెనీ పాలకులే స్వయంగా కలకత్తా, మద్రాస్ మొదలగు చోట్ల ప్రింటింగ్ ప్రెస్సులు పెట్టారు కాని వాటిని ఇతరులకు అందుబాటులో లేకుండా చేశారు అయినా గ్రంధముద్రణ ఆగలేదు

భగవద్గీత, పంచతంత్రంలాంటి సంస్కృత గ్రంధాలను అనువదించి పాశ్చాత్య పండితులు ప్రచురిస్తున్న సమయంలో, భారతీయ భాషల్లోకి బైబిలును అనువదించి ప్రచురించేందుకు హాలెండ్, ఫ్రాన్స్ దేశాలకు చెందిన క్రైస్తవ మిషనరీలు పూనుకున్నారు దచ్ కంపెనీ వారి స్వాధీనంలోనున్న శ్రీరాంపూర్ (సెరాంపూర్)లో బాప్టిస్టు మిషనువారొక ప్రింటింగ్ ప్రెస్ పెట్టారు తరువాత ఫ్రెంచి మిషనరీలు పెట్టారు కాగా దేశభాషల్లో బైబిలును ముద్రించడం ప్రారంభమైంది

ఇండియాలో మత ప్రచారం జేసేందుకు బ్రిటిష్ మిషనరీలకు, 1813 వరకూ ప్రభుత్వ అనుమతి లభించలేదు కాబట్టి ఇండియాలోనున్న బ్రిటిష్ వారి కొరకు బైబిల్ సూక్తులను ఇంగ్లీషులో ముద్రించడానికి పూనుకున్నారు. కాగా మద్రాస్, కలకత్తాలలో బ్రిటిష్ మిషనరీల ప్రింటింగ్ ప్రెస్సులు నెలకొన్నాయి వాటిలో ఇతర దేశాల క్రైస్తవుల గ్రంధాలనుకూడా ముద్రించారు (ఆర్మేనియన్ భాషలో వెలువడిన మాసపత్రికను 1794లో మద్రాసులో ముద్రించిన విషయం గమనార్హం )



# శాశ్వత ఫైసలా పద్ధతి

పెనుభూతంలా తయారైన పాలనా యంత్రాంగంలో కారన్‌వాలీస్ కొన్ని మార్పులు చేశాడు అవినీతికి పాల్పడిన అధికారులను తొలగించి, సివిల్ సర్వీస్ అధికారులను నియమించాడు ఎప్పటికప్పుడు ఫేష్కష్‌ను (ప్రభుత్వానికి జమీందార్లు చెల్లించే డబ్బును), శిస్తును (రైతులు పండించిన పంటనుండి జమీందారు తీసుకునే భాగమును) పెంచే పద్ధతిని రద్దుజేసి, శాశ్వతమైన ఫైసలా పద్ధతిని (పర్మినెంట్ సెటిల్మెంటును) 1793లో బెంగాల్ ప్రెసిడెన్సీలో ప్రవేశపెట్టాడు

ఆ పద్ధతి ప్రకారం బెంగాల్ జమీందార్లు అదనంగా 90 లక్షల రూపాయలు కంపెనీ ప్రభుత్వానికి చెల్లించవలసి వచ్చింది ఫేష్కస్‌ను చెల్లించడంలో ఏ ఒక కిస్తి (ఇన్‌స్టాల్‌మెంట్) బకాయిపడినా ఎస్టేటును వేలం వేసే షరతుకుకూడా జమీందార్లు అంగీకరించవలసి వచ్చింది

అయినా శాశ్వత ఫైసలా పద్ధతివల్ల భూములమీద సర్వహక్కులూ జమీందార్లకు సంక్రమించాయి రైతులు కౌలుదార్లుగా పరిగణింపబడ్డారు చెరువులు కాలవలు తవ్వినా, వ్యవసాయాభివృద్ధి కొరకు మరే రకమైన పనులు చేసినా, శిస్తును పెంచివేసే హక్కు జమీందార్లకు కల్పించబడినందున, అదే పనిగా ఏదో ఒక సాకుతో జమీందార్లు రైతులను పీల్చి పిప్పి చేశారు అయినప్పటికీ జమీందార్లు చెల్లించే ఫేష్కషను పెంచే అవకాశం ప్రభుత్వానికి - శాశ్వత ఫైసలా పద్ధతివల్ల - లేదుగాబట్టి జమీందార్లు మేటలు వేశారు

1802లో మద్రాస్ ప్రెసిడెన్సీలోకూడా శాశ్వత ఫైసలా పద్ధతిని ప్రవేశపెట్టారు కాబట్టి బ్రిటీష్ సామ్రాజ్య సౌధానికి మూలస్తంభంగా ఉపయోగపడగల జమీందారీ వర్గం బలపడింది పంట పొలాలు, సాముదాయక భూములు, జలాధారాలు, అడవులు, బంజర్లు జమీందార్లు హక్కుభుక్తముల పట్టికలో చేరిపోయాయి పైగా ఇవి వంశ పారంపర్య హక్కులుగా గుర్తింపబడినాయి కాబట్టి జమీందార్లు తమ ఎస్టేటులను అమ్మడానికి, తాకట్టు పెట్టడానికి, ఏజెంట్లను నియమించడానికి అవకాశం కలిగింది

బెంగాల్లోని బర్ద్వాన్ ఎస్టేటులో జమీందారు క్రింద ఏజెంట్లు, వారి క్రింద సబ్ ఏజెంట్లు, వారి క్రింద ఏరియా ఏజెంట్లు, వారి క్రింద విలేజి ఏజెంట్లు వుండేవారు ఎవరికివారే తమ రాబడిని అధికం చేసుకునేవారు

కృష్ణాజిల్లాలోని దేవరకోట ఎస్టేటులోని సాముదాయక భూములను, ఏటి లంకలను, చెరువు లోతట్టులను కాజేసి, చల్లపల్లి జమీందారు వేలాది ఎకరాల స్వంత కమతాన్ని ఏర్పాటు చేసుకోగలిగాడు కొంచెం హెచ్చు తగ్గులతో అన్ని ఎస్టేట్లలోను ఇలాంటి పరిస్థితులే ఏర్పడ్డాయి

తాము తప్పకుండా ప్రతి ఏటా కంపెనీ ప్రభుత్వానికి ఫేష్కస్ చెల్లించాలి గనుక, రైతులు కూడా పండినా పండకపోయినా శిస్తులు చెల్లించాలని జమీందార్లు పట్టుబట్టారు శాశ్వత ఫైసలా పద్ధతివల్ల తాము చెల్లించే ఫేష్కస్ మొత్తాలు పెంచబడినాయి గాబట్టి, పండిన పంటలో సగభాగం ఇవ్వాలనికూడా జమీందార్లు పట్టుబట్టారు

ఒకప్పుడు పండిన పంటలో 1/6 గా వున్న శిస్తు ఇప్పుడు ½ పెరిగింది పండినా పండకపోయినా శిస్తులు చెల్లించాలని జమీందార్లు నిర్బంధించారు పైగా జిరాయితీ హక్కులు వూడిపోయాయి రైతులు కౌలుదార్లయ్యారు కాబట్టి రైతుల పని మునగానాం తేలానాంగా తయారైంది

"శాశ్వత ఫైసలా పద్ధతి బెంగాల్, మద్రాస్ ప్రెసిడెన్సీలలోని రైతులను జమీందార్ల కప్పగించింది జమీందార్లు పీక్కుతింటున్న రైతులను కంపెనీ ప్రభుత్వం కాపాడలేక పోయింది" అని జి డబ్ల్యు నోయెల్ – ఇంగ్లండ్ అన్డ్ ఇండియా అనే గ్రంథంలో వ్రాశాడు

"విలియం పిట్, కారన్‌వాలీస్ కలసి బెంగాల్లోని గ్రామీణ ప్రజల హక్కులను, కృత్రిమ పద్ధతిద్వారా హరించి వేశారు" అని కారల్ మార్క్స్ విమర్శించాడు కాబట్టి కృష్ణా, గోదావరి జిల్లాల రైతులకూ – జమీందార్లకు మధ్య పోరాటాలు ప్రారంభమయ్యాయి 1803లో ప్రారంభమైన పోరాటాలు ఏదో ఒక రూపంలో 1810 వరకూ కొనసాగాయి

సాముదాయక భూములను జమీందార్లు ఆక్రమించకుండా రైతులు అడ్డుకో గలిగారు కంపెనీ సిపాయిల మద్దతుతో జమీందార్లు చేసిన దాడులను తిప్పి కొట్టగలిగారు పంటలు పండనప్పుడు శిస్తులు చెల్లించే ప్రశ్నే లేదు పొమ్మన్నారు తాటి, ఈత చెట్లపైన, పెరట్లో పండే కూరగాయలపైన విధించిన పన్నును తిరస్కరించారు పుల్లరి చెల్లించకుండా అడవుల్లో పశువులను మేపుకున్నారు కట్టెలు కొట్టుకున్నారు డబ్బు చెల్లించకుండా చెరువుల్లో చేపలు పట్టుకున్నారు

అందువల్ల జమీందార్ల రాబడి తగ్గింది కాబట్టి కంపెనీ ప్రభుత్వానికి ఫేష్కస్ చెల్లించేందుకు పట్టణాలలోని వడ్డీ వ్యాపారులవద్దనుండి అప్పులు తీసుకోవలసి వచ్చింది అలా ఎన్నాళ్లు సాగుతుంది? అప్పు పుట్టకపోతే ఎస్టేటును కంపెనీ ప్రభుత్వం వేలం వేస్తుంది కనుక జమీందార్లు దిగొచ్చారు రైతులతో రాజీపడ్డారు

కాబట్టి, చల్లపల్లి జమీందారు ఫేష్కస్ చెల్లించకపోతే, ఎస్టేటులోని రైతు పెద్దలంతా కలసి డబ్బు పోగుజేసి జమీందారుకిచ్చారు అలాంటి చర్యలవల్ల జమీందార్లకు–రైతులకు మధ్య సామరస్యమేర్పడింది

కాని ప్రభుత్వం జమీందార్ల వీపు తట్టింది ఫేష్కస్ బకాయిపడితే, ఎస్టేటును వేలం వేయడం మానుకుంది కాగా ఉబ్బిపోయిన జమీందార్లు తిరిగి విజృంభించారు మళ్లీ రైతులు ఎదురు తిరిగారు

## బెంగాల్ రైతుల పోరాటాలు

కంపెనీ పాలకుల దోపిడీని భరించలేక బెంగాల్ రైతులు సాయుధ తిరుగుబాటుకు పూనుకున్నారు కంపెనీ అధికారుల కుట్రలవల్ల ఎస్టేట్లు కోల్పోయిన మాజీ జమీందార్ల మద్దతు రైతులకు లభించింది కనుక పాలకుల దోపిడీని కొంతవరకూ అరికట్టగలిగారు

ఎవరైనా ఒక జమీందారు రైతులను పీడించకుండా మంచిగా ప్రవర్తించగలిగితే, అలాంటి జమీందారుకు రైతులు తోడ్పడేవారు 1795లో "పంచెత్ ఎస్టేటును కొత్త జమీందారు స్వాధీనం చేసుకుంటోంటే రైతులు ఎదురుతిరిగారు మూడేళ్లపాటు పోరాటం జరిగింది విధిలేక ప్రభుత్వం పాత జమీందారుకు ఎస్టేటును అప్పగించింది అలాంటి పోరాటాలు 1798లో రాయపూర్‌లోను, 1799లో బాలసోర్‌లోను జరిగాయి

1800 సంవత్సరంలో కంపెనీ ప్రభుత్వమొక కొత్త పన్నును విధించింది దాన్ని రద్దు చేయాలని కోరుతూ, మిద్నపూర్‌లో రైతులు ఆయుధాలు చేపట్టారు అనేక గ్రామాలను, కొన్ని పట్టణాలను ఆక్రమించుకొని, మిద్నపూర్‌ను పట్టుకునేందుకు సిద్ధమయ్యారు ఇక లాభం లేదని గ్రహించిన ప్రభుత్వం, కొత్త పన్నును రద్దు జేసింది తరువాత ఏదో ఒక సాకుతో ఎస్టేట్లను వేలం వేయడం మానుకుంది

## మన్యంలో తిరుగుబాట్లు

"పాయసం పెడితే ప్రాణమున్నంతవరకూ కొండ ప్రజలు మనతో వుంటారు రెచ్చగొడితే అజన్మ శత్రువులుగా మారతారు" అన్నాడు కృష్ణదేవరాయలు ఆ విషయం తెలియని కంపెనీ అధికారులు, గిరిజనుల జన్మహక్కులను హరించారు

అడవి సంపదను అనుభవించే గిరిజనుల మీద నిషేధాలు విధించారు పోడు వ్యవసాయం మీద ఆంక్షలు పెట్టారు ఏనుగు దంతాలు, పులి గోళ్లు, దుప్పి చర్మాలు, చింతపండు, సీకాయ, మైనం, తేనె, ఋూరుగుపత్తి, మూలికలు, పునుగు, కస్తూరి, పందికొవ్వు వగైరాలను చవుకగా కాజేసి, దండిగా లాభాలు గడించసాగారు కనుక 1785లో పోలవరం, గూటాల, కొత్తపల్లి ప్రాంతాలలో తిరుగుబాట్లు జరిగాయి

ఆ సమయంలో నాగవరం కోటలోనున్న కొండదొర దేసురెడ్డి గూటాలను ఆక్రమించగా, కంపెనీ సైనికులొచ్చి అయనను తరిమేశారు 1787లో దేసురెడ్డి నాయకత్వాన గిరిజనులు చేసిన దాడినికూడా తిప్పికొట్టారు

అయినా మంగపతిదేవ్ (పోలవరం జమీందారు) పన్నులు సరిగా వసూలు చేయలేకపోయాడు కనుక పేష్కస్‌ను బకాయి పెట్టాడు పేష్కస్ చెల్లించకపోతే మంగపతిదేవును అరెస్టు చేస్తామని, ఎస్టేటును ముక్కలుచేసి కొండరెడ్లకు పంచుతామని కంపెనీ అధికారులు భయపెట్టారు అందువల్ల 1790లో మంగపతిదేవ్ సవతి తమ్ముడు, కోయదొరల నాయకుడైన లింగారెడ్డిని ఆశ్రయించాడు తరువాత కలిదిండి తిమ్మరాజుతో చేతులు కలిపి తిరుగుబాటు చేశాడు కాని కంపెనీ సైనికులా తిరుగుబాటును వెంటనే అణచివేశారు

ఆ స్థితిలో మంగపతిదేవ్ ఒక నాటకమాడాడు కంపెనీకి చెల్లించవలసిన పాత బాకీని వెంటనే చెల్లిస్తానని బాసచేసి, ఎస్టేటును నిలువుకున్నాడు. కాని చెల్లించలేక పోయాడు కాగా కంపెనీ సైనికులు పోలవరం కోటపై దాడి చేసారు మంగపతిదేవ్ పారిపోయాడు కోట నేలమట్టమైంది పోలవరం ఎస్టేటులో సైనిక శాసనం ప్రకటించి, రంప ప్రాంతంలోని ప్రజలను అణచివుంచేందుకు కొత్తపల్లిలోను, ఇందుగపేటలోను సిపాయి దళాలనుంచారు

సిపాయిల జులుమును భరించలేని గిరిజనులు 1800 ఆగస్టు 28న సిపాయిలమీద దాడి చేశారు 31వ తేదీన పురుషోత్తమపట్నంవద్దనున్న కంపెనీ పడవలను పండుదొర స్వాధీనం చేసుకున్నాడు అయినా తిరుగుబాటు భగ్నమైంది

1802లో రంపచోడవరం ప్రాంతంలో రామభూపతి నాయకత్వాన కోయలు చేసిన తిరుగుబాటుకూడా 'విఫలమైంది

చివరకు కంపెనీ కలెక్టర్ బ్రాన్‌ఫీల్ పోలవరం ఎస్టేటును లక్ష్మీనారాయణదేవుకు కట్టబెట్టి, ఆయన మద్దతును పొందగలిగిన పిమ్మట, పరిస్థితులు కొంతవరకూ చక్కబడ్డాయి

## విజయనగరం జమీలో తిరుగుబాట్లు

1794లో విజయనగరం రాజా అధికారాన్ని తగ్గించేందుకు కంపెనీ అధికారులు పూనుకున్నారు అంతకుమునుపు విజయనగర రాజులచే ఆక్రమించబడిన కొండజమీలను తిరిగి ఆయా జమీందార్ల వారసులకు కట్టబెట్టారు కాగా నిజమైన వారసులం మేమేనంటూ

కొందరు తిరుగుబాటు జేశారు వారిలో ముఖ్యుడు ముఖీ రాజగోపాలరాజు

ఆ మరుసటి సంవత్సరం విజయనగరరాజు కంపెనీ సైన్యాలతో తలపడి ఓడిపోయాడు అయినా ముఖీ రాజగోపాలరాజుతోపాటు, ఆయన కుమారుడు వీరభద్రరాజు కూడా విజయనగరరాజుకు అండగా నిలబడడంవల్ల కంపెనీ అధికార్లు కాస్త వెనుకకు తగ్గారు కాని వీరభద్రరాజును పట్టి అప్పగించినవారికి ఐదువేల రూపాయల బహుమతి నిస్తామని ప్రకటించారు

వీరభద్రరాజుతోపాటు, కాకర్ల జగన్నాధరాజు అనే పేరుగల పాయకరావుకూడా కంపెనీ వాళ్లమీద పోరాడుతుండేవాడు ఈ పాయకరావు చనిపోయిన పిమ్మట, ఇతని అనకాపల్లి ఎస్టేటు విజయనగరం వారి స్వాధీనమైంది పాయకరావు భార్యలకు సాలుకు వెయ్యి రూపాయల భరణం మంజూరు చేశారు కాని కొద్ది రోజుల్లోనే అనకాపల్లి ఎస్టేటును కంపెనీ అధికారులు స్వాధీనం జేసుకున్నారు

1802లో పర్మినెంటు సెటిల్మెంటు జరిగిన పిమ్మట, అనకాపల్లి ఎస్టేటును కంపెనీ అధికార్లు వేలం వేయగా, విజయనగరం రాజా కొని, తిరిగి దానిని గోడే ప్రకాశరావుకు విక్రయించాడు పాయకరావు కుటుంబానికి యిచ్చే భరణాన్ని ఆపివేశారు

కాగా రెండవ పాయకరావు తిరగబడ్డాడు అదే సమయంలో వీరభద్రరాజుకూడా ఆకస్మిక దాడులు జేస్తుండేవాడు కాని 1833లో వీరభద్రరాజు కంపెనీ సైన్యాలకు దొరికిపోయాడు 1834లో రెండవ పాయకరావుకూడా పట్టుబడ్డాడు వెంటనే అనకాపల్లి దగ్గర ఆయనను ఉరిదీశారు

## పాలకొండలో తిరుగుబాటు

1796లో పాలకొండ జమీందారు నరేంద్రరావు తిరుగుబాటు చేశాడు కంపెనీ వారు ఆయనను ఓడించి ఎస్టేటును సీతారామరాజుకిచ్చారు ఆయన 1798లో చనిపోయాడు

సాలుకు 5½ వేల చొప్పున చెల్లించే షరతుపై ఎస్టేటును 1802లో వెంకటపతి రాజుకిచ్చారు ఆయనొక విలాస పురుషుడు కాగా ఫేష్కస్ బకాయి పెరిగింది ఎస్టేటును కలెక్టర్ జప్తు చేశాడు కాని ఎస్టేట్ దివాన్ హామీపై విడిచిపెట్టాడు కొంతకాలంపాటు అంతా సవ్యంగానే జరిగింది

తిరిగి జమీందారు విలాసాలు పెరగడంవల్ల ఫేష్కస్ బకాయి పడింది అందువల్ల దివానుకు - జమీందారుకు మధ్య కలతలేర్పడ్డాయి కాగా 1828లో జమీందారు మనుషులు దివానును హత్య చేశారు 1830లో జమీందారుకూడా చనిపోయాడు

జమీందారు కొడుకు కూర్మరాజు చిన్నవాడు కాబట్టి ఆయన సవతి తల్లులలో ఒకామెను ఎస్టేటు మేనేజరుగా, కంపెనీ అధికార్లు నియమించారు అయినా కొండదొరల దోపిడీలు హెచ్చినందున ఎస్టేటును కోర్టు ఆఫ్ వార్డ్సుకు అప్పగించారు కూర్మరాజు మేజర్ అయిన పిమ్మట కూడా ఎస్టేటును తమ స్వాధీనంలోనే వుంచుకున్నారు

అందువల్ల రెచ్చిపోయిన కొందరొకనాడు, కంపెనీ సిబ్బందిమీద దాడిజేసి, ఇద్దరిని చంపి, ఏడుగురిని గాయపర్చారు పది తుపాకులను స్వాధీనం చేసుకుని, జైలుమీద దాడి చేశారు కాని విఫలులై పారిపోయారు

అయినా వారిలో ఆరుగురిని స్పెషల్ కమీషనర్ రస్సెల్ బంధించగలిగాడు

ఐదుగురిని ఉరిదీశారు జమీందారును, ఆయన కుటుంబ సభ్యులను రాయవెల్లూరు జైల్లో బంధించి, ఎస్టేటును కంపెనీ అధికార్లు స్వాధీనం జేసుకున్నారు

ఫేష్కస్ చెల్లించకుండా జమీందార్లు తిరగబడడం, వారికి అండగా గిరిజనులు నిలబడడం దేనికో- విచారించేందుకు కంపెనీ అధికారులు పూనుకున్నారు

"శిస్తుల విషయంలో శాశ్వత ఫైసలా పద్ధతిని ప్రవేశపెట్టి, గంజాం, విశాఖజిల్లాలలో మన అధికారాన్ని వదులుకున్నాం, ఈ జమీందార్లద్వారానే మనమీ ప్రాంతాన్ని పాలిస్తున్నాం కాని, వాయిదాలోపల ఫేష్కస్ కట్టలేని వారి ఎస్టేట్లను జప్తు చేస్తున్నాం కాబట్టి వారు ఎదురు తిరుగుతున్నారు" అని థాకరే అభిప్రాయపడ్డాడు

"అడవి సంపదను ఉచితంగా అనుభవించే హక్కును కోల్పోయిన గిరిజనులతో ప్రత్యక్ష సంబంధం జమీందార్లకున్నది కాని మనకు లేదు ఈ ప్రదేశాలు దట్టమైన అడవులతో, రోగనిలయాలుగా వున్నందున మన అధికారాన్ని ప్రత్యక్షంగా స్థాపించకుండా, జమీందార్లద్వారా పాలించుటకు పూనుకున్నాం కనుకనే జమీందార్లు మనకు ఎదురు తిరిగితే, వారికి గిరిజనుల అండ దండిగా లభిస్తోంది కాబట్టి మార్షల్ లాను ప్రకటించి, తిరుగుబాట్లను అణచివేసి, మన ప్రత్యక్ష పాలనను స్థాపించడం అవసరం" అని జార్జి రస్సెల్ కంపెనీ అధికారులకు నివేదించాడు కాగా కంపెనీ పాలకులు గంజాం, విశాఖపట్నం ఏజెన్సీలను సైన్యాలతో నింపి, మార్షల్ లాను ప్రకటించే అధికారం కలెక్టర్లకిచ్చారు

## కంపెనీ గుత్తాధికారం రద్దు

నెపోలియన్ యుద్ధాలవల్ల, ఇంగ్లాండుకు - ఇతర యూరప్ దేశాలకు మధ్య వ్యాపారం తగ్గింది మైసూరు రాజ్యాన్ని కబళించిన పిమ్మట ఈస్టిండియా కంపెనీ రాబడి పెరిగింది కనుక ఈస్టిండియా కంపెనీలో వాటాలు లేని బ్రిటిష్ వర్తకులు ఆందోళన ప్రారంభించారు ఇండియాతోను, ఇతర ఆసియా దేశాలతోను వర్తక వాణిజ్యాలు సాగించే హక్కు తమకుకూడా ఇవ్వాలని బ్రిటిష్ ప్రభుత్వంమీద వత్తిడి తెచ్చారు ఈ వర్తకులతో పారిశ్రామికులు చేతులు కలిపారు. కంపెనీ వ్యవహారాలను ఘాటుగా విమర్శిస్తూ విగ్స్ (లిబరల్సు) పార్లమెంటులో దుమారం లేపారు కాగా ఈస్ట్ ఇండియా కంపెనీకిగల గుత్తాధికారాన్ని 1813లో బ్రిటిష్ ప్రభుత్వం రద్దు చేసింది బ్రిటిష్ పారిశ్రామికులకు, ఎస్టేట్ హెూల్డర్సుకుకూడా స్వేచ్ఛనిచ్చింది కాని కంపెనీ పాలనను మరో ఇరవై ఏళ్లపాటు పొడిగించింది

## బ్రిటిష్ పారిశ్రామికుల దోపిడి

అందువల్ల కంపెనీవారితోపాటు ఇతర పెట్టుబడిదారులు, వర్తకులతోపాటు పారిశ్రామికులు ఇండియాను దోచుకోడానికి అవకాశం కలిగింది కాని ఇండియాలో తయారైన నూలు బట్టల ఖరీదు, సిల్కు వస్త్రాల ఖరీదు అరవైశాతం తక్కువగా వున్నందున, ఇంగ్లాండులో తయారైన వస్త్రాలు అమ్ముడు పోలేదు ఇనుప పనిముట్లు వగైరాల విషయంలోకూడా అలాగే జరిగింది కాబట్టి బ్రిటిషు ప్రభుత్వం తీసుకోవలసిన చర్యలను సూచించేందుకు ఒక కమిటీని నియమించారు ఆ కమిటీకి సర్ థామస్ మన్రో యిలా చెప్పాడు

"ఇండియాలో ప్రజలకు కావలసిన వాటినన్నింటినీ చేతి వృత్తుల వారు

తయారుచేస్తున్నారు చిన్న పరిశ్రమలు చక్కగా పనిచేస్తున్నాయి వాటిలో తయారవుతున్న వస్తువులు ఇతర దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి కనుక మన వస్తువులు అమ్ముడుపోవు "

కాబట్టి ఇండియానుండి బ్రిటన్‌ద్వారా యూరప్‌లోని దేశాలకు ఎగుమతిచేసే వస్త్రాల కిమ్మతుమీద 80 శాతం పన్ను విధించారు అందువల్ల ఇండియానుండి జరిగే వస్త్రాల ఎగుమతులు తగ్గిపోయాయి

పట్టు వస్త్రాలు, సిల్కు వస్త్రాలు, కలంకారీ అద్దకాలు మొదలగువాటిని బ్రిటనులో నిషేధించారు కనుక బరంపురం, పెద్దాపురం, ధర్మవరం సిల్కు వస్త్రాలకు, బందరు కలంకారీ అద్దకాలకు, శ్రీకాకుళం పట్టుబట్టలకు గిరాకీ బాగా తగ్గింది ఢాకా, మూర్షిదాబాద్‌లాంటి చోట్ల తయారయ్యే సిల్కు రవసెల్లాలు, మజ్లీన్లు మున్నగువాటి గిరాకీకూడా బాగా తగ్గింది

"ఇండియా ఎగుమతి చేసే వస్తువుల మీద విపరీతంగా పన్నులు విధించి, ఇంగ్లాండులోని పరిశ్రమలను కాపాడకపోతే, లాంకషైర్, మాంఛెస్టర్ బట్టల మిల్లులు తప్పకుండా మూతబడేవి స్టీమ్ ఇంజన్లను, ఇతర యంత్రాలను కనిపెట్టినప్పటికీ ఫలితముండేదికాదు" అన్నాడు విల్సన్ (హెచ్ హెచ్ విల్సన్, హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ ఇండియా)

ఇండియానుండి నూలు బట్టల ఎగుమతి, సిల్కు వస్త్రాల ఎగుమతి తగ్గడంవల్ల ఈస్టిండియా కంపెనీ లాభాలుకూడా కొంతవరకూ తగ్గాయి కనుక ఆ కొరతను పూడ్చుకునేందుకు కంపెనీ పాలకులు భారతీయులమీద మోతర్పా పన్ను (వృత్తి పన్ను) విధించారు

## మోతర్పా పన్ను

ఏదో ఒక వృత్తి లేదా వ్యాపారం చేసుకునే వారేగాక ఇంట్లో వుండి, స్వంత పనులు చేసుకున్న వారుకూడా మోతర్పా పన్ను కట్టవలసి వచ్చింది

చాకలి, మంగలి, మాదిగ, వడ్రంగి మొదలగువారంతా, తల 1కి ఏటా రెండు రూపాయల ఐదు అణాలు, కల్లు గీసేవారు పది అణాలు, మాలలు 14 అణాలు, రెండెడ్ల బళ్లకు రెండు రూపాయల ఐదు అణాలు, పెద్ద దుకాణదారులు 11 రూపాయల 12 అణాలు, చిన్న దుకాణదారులు ఆరు రూపాయలు, కూరగాయలు అమ్ముకునేవారు ఒక రూపాయి రెండణాల పన్ను చెల్లించక తప్పేది కాదు

ఈ పన్ను, ఏకులు తయారుజేసే వారి మీద, నూలువడికే వారిమీద, బట్టలు నేసేవారి మీద, వాటిని అమ్మే వారిమీద ఎక్కువగా పడడంవల్ల చేనేత పరిశ్రమ దెబ్బతిన్నది అందువల్ల పత్తి ధర తగ్గింది కాగా లాంకషైర్, మాంఛెస్టర్ బట్టల మిల్లులకు అవసరమైన పత్తి చవుకగా దొరికింది బ్రిటిష్ పారిశ్రామికుల లాభాలు పెరిగాయి మోతర్పా పన్ను వల్ల ఈస్టిండియా కంపెనీ షేరు హోల్డర్ల డివిడెండ్లు పెరిగాయి

ఆ దుస్థితిలోకూడా లంచాల బెడద తప్పేది కాదు తనిఖీ చేయడానికనే సాకుతో కంపెనీ ఉద్యోగులు ప్రజల ఇళ్లలో చొరబడేవారు పన్నులు హెచ్చిస్తామని బెదిరించిగాని, తగ్గిస్తామని ఆశపెట్టిగాని లంచాలు గుంజేవారు పైగా లైసెన్సులకొరకు కంపెనీ ఆఫీసులకు పోయిన ప్రజలు రోజుల తరబడి పడిగాపులు పడి వుండక తప్పేదిగాదు ఈ అన్యాయాలను అక్రమాలను, స్వయంగా చూచిన జె బి డైక్సు అనే కంపెనీ అధికారి కామన్సు సభలో

ఇలా సాక్ష్యమిచ్చాడు'

'రైతు కుటుంబాలలో స్త్రీలు ఏకులు తయారుచేసి, నూలు వడికి తమకు అవసరమైన బట్టలు నేయించుకుంటారు వారి మీదకూడ మోతర్పా పన్ను వేశారు తిరగలేని ముసలమ్మ దారి ప్రక్కన కూర్చుని కూరగాయలమ్ముకుంటే పన్ను వేశారు ఇక వ్యాపారస్తులూ, పారిశ్రామికులూ కట్టవలసిన పన్నులు సరేసరి వారి ప్రక్కనే వుంటూ దండిగా లాభాలు సంపాదిస్తున్న బ్రిటిష్ వర్తకులు మాత్రం పన్నులు చెల్లించనక్కరలేదు కంపెనీ అధికారిగా ఇండియాలో వుంటూ నేను అమలు జరిపిన ధర్మమిదే "

ఇలా ద్విముఖంగా సాగిన దోపిడివల్ల ఇండియాలో నేత పరిశ్రమ దెబ్బతిన్నది కంపెనీ భాగస్వాములతోపాటు ఇంగ్లండులోని బట్టల మిల్లులవారు మేటలు వేశారు

## చేనేతవారి దుస్థితి

1814లో పది లక్షల గజాల వస్త్రాలను మాత్రమే ఇండియాలో అమ్ముకోగలిగిన లాంకషైర్, మాంచెష్టర్ మిల్లుల యజమానులు 1835లో ఐదు కోట్ల పదిలక్షల గజాల వస్త్రాలను అమ్ముకోగలిగారు 1814లో ఇండియానుండి 12 లక్షల 50 వేల వస్త్రాలు ఎగుమతికాగా 1844లో 63వేల వస్త్రాలు మాత్రమే ఎగుమతైనాయి

"యంత్రాలతో తయారుజేసిన వస్త్రాలు ఇండియాలోని నేతపని వారిని నాశనం జేస్తే, యంత్రాలలో తయారైన నూలు, నూలు వడికే భారతీయులను నాశనం జేసింది ఇంగ్లండునుండి ఇండియాకు చేసిన మిల్లు నూలు ఎగుమతి 1818-36 మధ్య కాలంలో 5200 రెట్లు పెరిగింది ఇనుము, కాగితం, పాత్రలు, గ్లాసు వగైరా వస్తువుల విషయంలోకూడా ఇదే పరిస్థితి ఏర్పడింది" అని రజనీ పామీదత్ వెల్లడించాడు (ఆర్ పి దత్ ఇండియా టు డే)

ఇలా హద్దూ పద్దూ లేకుండా సాగిన దోపిడివల్ల వేలాది చేనేత పనివారు వ్యవసాయ కూలీలుగా మారిపోయారు అనేకులు అడవుల్లోకిపోయి ఆకులు దుంపలు తింటూ క్షీణించారు అంటురోగాల బారిపడి మరికొన్ని వేల మంది మరణించారు కాగా చేనేత కేంద్రాలలోని జనాభా విపరీతంగా తగ్గిపోయింది

"ఢాకా పట్టణ జనాభా లక్షన్నరనుండి 30 వేలకు తగ్గింది" అని సర్ ఛార్లెస్ ట్రావెల్యాన్ బ్రిటిష్ పార్లమెంటులో వెల్లడించాడు

ఇలా జనాభా తగ్గడం స్వేచ్ఛా వ్యాపార ఫలితమే బలహీనులను దోచుకునేందుకు బలవంతులకు లభించిన స్వేచ్ఛవల్ల భారతీయులు నరకబాధలనుభవించారు

## దిట్టం(గా) దోపిడీ

1800 సంవత్సరంలో నైజాం నవాబ్ రాయలసీమను కంపెనీ ప్రభుత్వానికి ధారాదత్తం చేశాడు (కనుకనే రాయలసీమకు దత్తమండలమనే పేరు కలిగింది ) అప్పుడా సీమలో 80 మంది పాళెగార్లుండేవారు వారిలో ప్రతి ఒక్కరికీ కొన్ని గ్రామాలు, ఒక కోట, కొంత సైన్యం వుండేది సివిల్ క్రిమినల్ అధికారాలుకూడా వారి కుండేవి వారిని తొలగించి సర్ థామస్ మన్రో అక్కడ రైతువారీ పద్ధతిని ప్రవేశపెట్టాడు కనుక రాయలసీమ రైతులు మన్రోను "మాండవముని" అని, "మండోల్‌దొర" అని కీర్తించారు

కాని వారి ఆనందమెంతో కాలం నిలవలేదు "దిట్టము" పద్ధతిని ప్రవేశపెట్టి,

ఉన్నదంతా కంపెనీ ప్రభుత్వం ఊడ్చుకుపోయింది

"దిట్టము" అనగా ఏటేటా జరిగే భూముల అమరకం ఏర్పాటు ప్రతి ఏటా రెవిన్యూ ఉద్యోగులు గ్రామాలకు వచ్చి, ఏరువాక సాగకముందే, సాగుబడి రిజిస్టర్లు తయారుజేసేవారు భూములు చేతులు మారితే నమోదు జేసేవారు ఎవరూ సాగుజేయక విడిచిపెట్టిన భూములను "తిలాపాపం తలా పిడికెడు" అన్న చందంగా, ఒకొక్క రైతుకు కొంత కొంత భూమి చొప్పున అంటగట్టేవారు అలా మొత్తం సాగుబడిని "కట్టుదిట్టం" చేసేవారు

అంటగట్టిన భూములను రైతులు సాగుజేసినా, చేయకపోయినా శిస్తులు తప్పేవికావు పండినా పండకపోయినా శిస్తులు గుంజేవారు పొలాలను కురచపగ్గాలతో కొలిచి విస్తీర్ణములు పెంచేవారు అందువల్ల శిస్తు మొత్తాలు పెరిగేవి అందుకు అంగీకరించని రైతులను కొట్టి జైల్లో బెట్టేవారు కనుక కొందరు ఊరు విడిచి పారిపోయేవారు కొందరు లంచాలిచ్చి తప్పించుకునేవారు

శిస్తు బకాయిపడిన రైతుల తిండి గింజలను, దుక్కిటెద్దులను, వ్యవసాయ పనిముట్లను ఉద్యోగులు వేలం వేసేవారు అక్కడికీ చాలకపోతే రైతుల ఇళ్లను పడగొట్టి, కలపను వేలం వేసేవారు ఈలాంటి ఘోరకృత్యాలు రైత్వారీ ప్రాంతంలో జరిగితే, జమీందారీ ప్రాంతంలో మరొక విధంగా జరిగేవి

జమీందారీ ప్రాంతంలో పండిన పంటలో సగభాగాన్ని జమీందార్లు తీసుకునే వారు వారు తీసుకున్న భాగాన్ని వారు చెప్పిన చోటుకు రైతులు చేర్చేవారు ఆపైన అమ్మవారి జాతర ఖర్చు, దేవాలయ ఖర్చు, బాజాభజంత్రీల ఖర్చు, వేషగాళ్ల, ఆటగాళ్ల ఖర్చు, ఉద్యోగుల ఖర్చు వగైరా ఖర్చులను రైతులు భరించక తప్పేదికాదు తమ పొలాలను సాగుజేసుకోకముందే రైతులు వెళ్లి జమీందారు పొలాలను సాగుజేయకపోతే శిక్షించేవారు జమీందారు ఇంట్లో పెళ్లి జరిగినా, దినం జేసినా వెట్టి చాకిరిజేసి, ముడుపులు చెల్లించకపోతే వీపులు చిట్లగొట్టేవారు

## దోపిడి నిలయం దేవాలయం

"వెండి, బంగారాలు అవసరమైతే, దేవాలయాలనుండి తీసుకోవచ్చు వాటితో సైన్యాన్ని పెంచుకొని రాజ్యాన్ని విస్తరించుకోవచ్చు కాబట్టి దేవాలయాలు నిర్మించండి" అని క్రీస్తు పూర్వం కౌటిల్యుడు రాజులకు సలహా జెప్పాడు ఆ విషయం బ్రిటిష్ వాళ్లకు తెలిసిందో లేదో చెప్పలేం కాని లాభాల కొరకు దేవాదాయ, ధర్మాదాయాలమీద వారి పెత్తనాన్ని నెలకొల్పారు

దేవాలయాల భూములను, మసీదుల భూములను రెవెన్యూ ఉద్యోగులే కౌలుకిచ్చేవారు కౌలు మొత్తాలు వసూలు జేసేవారు దేవుడి పెళ్లి దగ్గరనుండి, ఊరేగింపు వరకూ అన్ని పనులూ వారే జరిపించేవారు కలెక్టర్లు బూట్లువిప్పి, టోపీలు తీసివేసి విగ్రహాలకు నమస్కరించేవారు కంపెనీ ప్రభుత్వం తరఫున విగ్రహాలకు నూతన వస్త్రాలు సమర్పించేవారు దేవుని రథం ముందు పోలీసులు, సైనికులు బారులుదీరి నడుస్తుండగా, అగ్రభాగాన కలెక్టర్ నడిచేవాడు ఆ దృశ్యం చూసి అమాయక ప్రజలు చప్పట్లు కొడుతూ మురిసిపోయేవారు గుడిలోకి పోయి నిలువు దోపిడి సమర్పించేవారు

తిరువనంతపురం, కంచి, శ్రీరంగం, తిరుపతి, జగన్నాథం మున్నగుచోట్ల దేవుని

ఊరేగింపులు చాలా ఆడంబరంగా జరిపించేవారు ఖర్చులుపోను తక్కిన సొమ్మును లాభాల ఖాతాలో జమకట్టుకునేవారు అందువల్ల కంపెనీ ప్రభుత్వ ఆదాయం పెరిగింది మన మత ధర్మాలను బ్రిటీషువారు అనుసరిస్తున్నారని భారతీయులు సంతోషించారు అంగ్లేయులకు కావలసింది లాభాలనే విషయాన్ని గుర్తించలేకపోయారు ఒక్క తిరుపతిలోనే ప్రతి ఏటా కంపెనీ ప్రభుత్వానికి లక్ష రూపాయల ఆదాయం వచ్చేదని, కంపెనీ ప్రభుత్వ ఉద్యోగి ఏనుగుల వీరస్వామయ్య వెల్లడించాడు

అలా కొన్ని సంవత్సరాలు జరిగిన తరువాత క్రైస్తవ మతగురువులు ఆందోళన ప్రారంభించారు హిందువుల విగ్రహాలకు క్రైస్తవులైన అంగ్లేయులు నమస్కరించడమేమిటని ప్రశ్నించారు కాగా అనేకమంది బ్రిటీష్ ఉన్నతాధికారులు తమ వ్యతిరేకతను వెల్లడించారు మద్రాసు సైన్యాధిపతి రాజీనామా చేసేందుకు సిద్ధపడ్డాడు కనుక 1843లో కంపెనీ ప్రభుత్వం దేవాదాయ ధర్మాదాయాలమీద తన పెత్తనాన్ని వదులుకుంది

## వహాబీల తిరుగుబాటు

అబ్దుల్ వాహబ్ సిద్ధాంతాలను అనుసరించినవారు వహాబీలు వహాబీ ఉద్యమం 1786లో ప్రారంభమైంది మరొక 30 ఏళ్లకు బలపడింది కాగా వహాబీలు అహ్మద్ బ్రెల్వీ నాయకత్వాన 1815లో బెంగాల్ ప్రెసిడెన్సీలో జమీందార్లపైన, వడ్డీ వ్యాపారులపైన దాడులు జేశారు

'ఇస్లామ్ మతధర్మం ప్రకారం ధనిక-బీద తారతమ్యము వుండకూడదు రైతులు పండించిన పంటను కాజేసే హక్కు ఎవరికీ లేదు' అని వహాబీలు చాటి చెప్పారు

బెంగాల్ జమీందార్లలో అత్యధికులు హిందువులు వడ్డీ వ్యాపారులందరూ దాదాపుగా హిందువులే కనుక వహాబీల దాడులు ఎక్కువగా వారి మీదనే జరిగాయి కాని వహాబీలు ముస్లిమ్ జమీందార్లను విడిచిపెట్టలేదు "ఏ మాత్రం పక్షపాతం లేకుండా హిందూ, ముస్లిం భూస్వాముల ఇళ్లమీద వహాబీలు దాడి చేశారు" (హంటర్ ది ఇండియన్ ముసల్మాన్స్)

జమీందార్లకు అండగా నిలబడిన కంపెనీ సిపాయిలతో 1820-24 మధ్యకాలంలో వహాబీలు అనేకసార్లు తలపడ్డారు కాని ఓడిపోయారు అందువల్ల కొందరు వహాబీలు ఫక్తూన్ ప్రాంతానికి వెళ్లి, పఠానుల మద్దతుతో 'సితానా' అనే కోటలో సైనిక కేంద్రాన్ని నెలకొల్పారు తరువాత సిక్కులతో పోరాడి ఓడిపోయారు ఆ పోరాటంలో వారి నాయకుడు సయ్యద్ అహమ్మద్ చనిపోయాడు.

అయినా 1831లో రసిక్ మండల్ నాయకత్వాన నాలుగు వేలమంది వహాబీలు కలకత్తావైపు చొచ్చుకుపోయారు కాని బ్రిటీష్ ఫిరంగుల ఎదుట నిలబడలేక చెదిరిపోయారు తరువాత 1832లో టిటోమీర్ నాయకత్వాన బెంగాల్ జమీందార్లమీద సాగించిన దాడుల్లో అనేకమంది చనిపోయారు అయినా వహాబీల ఉద్యమం ఏదో ఒక రూపంలో 1872 వరకూ కొనసాగింది

## ఫరాజీ ఉద్యమం

హాజీ షరియత్ అల్లా నాయకత్వాన ప్రారంభమైన "ఫరాజీ" ఉద్యమకారులు తోటల యజమానులమీద దాడిజేశారు తోటల యజమానుల్లో ఎక్కువమంది బ్రిటిష్‌వారు

వీరు రైతుల మూలుగులు పీల్చేవారు కనుక రైతులకు అండగా ఫరౌజీ ఉద్యమకారులు నిలబడ్డారు "ఈ భూమి యావత్తూ అల్లాది కనుక భూమిని దున్నేవారి నోళ్లు గొట్టి మేటలు వేసే హక్కు ఎవరికీ లేదు" అంటూ 30 ఏళ్లపాటు ఉద్యమం నడిపారు కొన్ని సందర్భాలలో పోరాడారు అయినా ఫలితం పూజ్యమైంది

వహాబీ, ఫరౌజీ ఉద్యమాలలో పాల్గొని వేల సంఖ్యలో మరణించిన వారందరూ ముస్లిములే కాగా, ముస్లిముల రాజ్యాన్ని తిరిగి నెలకొల్పేందుకు వహాబీలు, ఫరౌజీలు ప్రయత్నిస్తున్నారని కంపెనీ అధికార్లు ప్రచారం జేశారు

కాని క్షితిమోహన్‌సేన్ ఇలా వివరించాడు "ఫరౌజీ ఉద్యమకారులలో పెంపొందిన సోదరభావం, సమానత్వం వారి పోరాట పటిమకు కారణమయ్యాయి కనుకనే వారు జమీందార్లను, నీలి మందుతోటల యజమానులైన బ్రిటిష్ వారిని, ముసల్మాన్ పెద్దలను ఏకముఖంగా ఎదిరించగలిగారు "

## పత్రికల ప్రారంభం-నిర్బంధం

ప్రభుత్వంతోపాటు మిషనరీలుకూడా ప్రింటింగ్ ప్రెస్సులు పెట్టిన పిమ్మట, కొందరు ఇంగ్లీషు జర్నలిస్టులు పత్రికా ప్రచురణకు పూనుకున్నారు 1780లో ఒక చిన్న ఇంగ్లీషు పత్రిక కలకత్తాలో వెలువడింది తరువాత మరికొన్ని వెలువడ్డాయి వాటిలో బ్రిటనుకు సంబంధించిన వార్తలు, అధికారుల ప్రమోషన్లకు, బదిలీలకు సంబంధించిన వార్తలు మాత్రమే వుండేవి కాని క్రమంగా అధికారుల అవినీతికి, ప్రభుత్వ అక్రమాలకు సంబంధించిన వార్తలుకూడా వెలువడేవి

1818లో సెరాంపూర్‌లో వున్న బాప్టిస్టులు "సమాచార దర్పణం" అనే బెంగాలీ వారపత్రికను, మరొక బెంగాలీ మాసపత్రికను ప్రారంభించి, వాటిలో హిందూ మతాన్ని విమర్శిస్తూ వ్యాసాలు వ్రాసేవారు ఆ విమర్శలకు జవాబుగా రామమోహనరాయ్ వ్రాసిన వ్యాసాలను 1818లోనే స్థాపించబడిన "కలకత్తా జర్నల్" అనే ఇంగ్లీషు పత్రిక ప్రచురించేది

రాజారామమోహన్‌రాయ్ సంస్కృతం, పర్షియన్, అరబిక్, ఇంగ్లీషు భాషల్లో పండితుడు ఆయన బెంగాలీలో వ్రాసిన వ్యాసాలను కలకత్తా జర్నల్ పత్రికా సంపాదకుడు జేమ్సు సిల్కు బకింగ్ హాం ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించేవాడు 1821లో "సంపాద కౌముది" అనే బెంగాలీ - ఇంగ్లీషు మాగజైనును రామమోహన్‌రాయ్ ప్రారంభించాడు 1822లో "మిరాత్ ఉల్ అక్బర్" అనే పర్షియన్ భాషా వారపత్రికనుకూడా ప్రారంభించాడు

వాటిలో ప్రభుత్వ కుటిల నీతిని, అధికారుల అవినీతిని వెల్లడించి, విమర్శించే వ్యాసాలు వెలువడేవి కలకత్తా జర్నల్ పత్రికలో మరీ ఘాటైన విమర్శలుండేవి కాబట్టి ప్రభుత్వం ఆ పత్రికా సంపాదకుడు జేమ్సు సిల్కు బకింగ్‌హాంతోపాటు, సహాయ సంపాదకునికూడా దేశంనుండి వెళ్లగొట్టింది. మరొక మాసం రోజుల్లో పత్రికలమీద నిర్బంధాలు విధించింది అందుకు నిరసనగా రామమోహనరాయ్ "మిరాత్-ఉల్-అక్బర్" పత్రికను నిలిపివేశాడు అయినా ప్రజల కష్టాలను గురించిన వార్తలు ఏదో ఒక రూపంలో వెలువడేవి

## బ్రిటిష్ పెట్టుబడిదారుల మధ్య ఘర్షణ

భారత ప్రజల కష్టాలకు కారకులు కంపెనీ పాలకులేనని బ్రిటిష్ పారిశ్రామికులు

వాదిస్తే, పారిశ్రామికులే కారకులని కంపెనీ పాలకులు వాదించేవారు కంపెనీ ప్రభుత్వం ప్రవేశపెట్టిన జమీందారీ పద్ధతివల్ల, భారత రైతాంగం పని మునగానాం – తేలానాంగా తయారైందనే విమర్శకు జవాబుగా 1829లో గవర్నర్ జనరల్ విలియం బెంటిక్ ఇలా చెప్పాడు

"తిరుగుబాట్లకు, విప్లవాలకు ప్రభుత్వం లోనుగాకుండా వుండాలనుకునేవారికి, నేనొక విషయం చెప్పగలను వ్యావసాయక ఉత్పత్తుల దృష్టితో చూస్తే పర్మినెంటు సెటిల్మెంట్ విఫలమైనప్పటికీ అదొక మేలు జేయగలిగింది తమ స్వార్థం కొరకు బ్రిటిష్ పాలనను సమర్థిస్తూ, తమ ప్రజలను అణచివుంచగల జమీందార్లతో కూడిన పెద్ద భూస్వామ్య వర్గాన్ని అది సృష్టించగలిగింది " అన్నాడు

బెంటిక్ అభిప్రాయాన్ని మెటకాఫ్ విమర్శించాడు పంచాయతీ పాలనను తొలగించడంవల్ల దుస్థితి దాపురించిందన్నాడు కంపెనీ ప్రభుత్వంలో అత్యున్నత పదవులు నిర్వహించినవాడు సర్ ఛార్లెస్ మెటకాఫ్ కాబట్టి కంపెనీ పాలన ప్రారంభంకాకముందున్న పరిస్థితిని ఇలా వివరించగలిగాడు

"సహకార పద్ధతిపై రూపొందిన గ్రామీణ ప్రజల యూనియన్లు (సమితులు) చిన్న రిపబ్లిక్కులుగా పనిచేస్తూ, తమ కవసరమైన వాటిని ఉత్పత్తి చేసుకునేవి బయటి వారితో సంబంధం లేకుండా, చాలావరకు స్వతంత్రంగా మనగలిగేవి పైగా చిరకాలం నిలబడగలిగినవిగా కనుపించేవి యూనియన్లో (సమితిలో) నున్న ప్రతి గ్రామం సంతృప్తికి, స్వేచ్ఛకు నిలయమైనదిగా మనగలిగేది " అన్నాడు తరువాత 1835లో ఆయన తాత్కాలిక గవర్నర్ జనరల్‌గా వున్నప్పుడు పత్రికలమీదగల నిర్బంధాలను తొలగించాడు

మెటకాఫ్ వెలిబుచ్చిన అభిప్రాయాన్ని కంపెనీ పాలకులు త్రోసిపుచ్చారు ఇండియాలో ఏర్పడిన దుస్థితికి బ్రిటిష్ పారిశ్రామికులే కారణమన్న తమ వాదనకు బలంగా, 1929 మే నెలలో గవర్నర్ జనరల్ విలియం బెంటిక్ వ్రాసిన మినిట్సును చూపించారు అందులో ఇలా వుంది

"నిరాశాజనకమైన పరిస్థితిని వివరిస్తూ, బోర్డు ఆఫ్ ట్రేడ్ తయారుజేసిన నివేదిక డైరెక్టర్లకు చాలా బాధ కలిగించింది కమర్షియల్ విప్లవంవల్ల ఇండియాలోని పలు వర్గాల ప్రజలు బాధపడవలసి వచ్చింది ఇలా జరిగిన ఉదాహరణ చరిత్రలో ఎక్కడా కన్పించదు "

బెంటిక్ అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ కోప్ అనే పేరుగల లాంకషైర్ పారిశ్రామికవేత్త ఇలా వాదించాడు

"అయితే ఇండియాలోని కష్టజీవులను జూచి నేను చాలా నొచ్చుకున్నాను అయినా ఇండియాలోని చేనేత పనివాని కుటుంబాన్ని గురించి ఆలోచించేదానికంటే, ఇంగ్లండులో వున్న నా కుటుంబాన్ని గురించి నేనెక్కువ ఆలోచించక తప్పదు. కాబట్టి ఇండియాలోని నేత పనివాని కుటుంబం కొరకు నా కుటుంబం సౌఖ్యాన్ని త్యాగం జేయడం వెర్రితనం "

కోప్‌ను విమర్శిస్తూ బెంటిక్ ఇలా అన్నాడు "వాణిజ్య చరిత్రలో ఇంతటి దీన స్థితిని పోలిన ఉదంతం మరొకటి లేదు భారతీయ నేతగాళ్ల ఎముకలు ఇండియాలోని మైదానాలను చలవజేస్తున్నాయి "

పాత ఉత్పత్తి సాధనాల స్థానంలో కొత్త ఉత్పత్తి సాధనాలు కనిపెట్టబడినప్పుడు జరిగే కమర్షియల్ విప్లవంవల్ల ఆదిలో కొందరికి నష్టం జరుగుతుంది అయినా చివరకా

కొత్త ఉత్పత్తి సాధనాలు అభివద్ధికి తోడ్పడతాయి కాని కొత్త ఉత్పత్తి సాధనాలు బ్రిటిష్ పారిశ్రామికుల చేతుల్లో వుండడంవల్ల ఇండియాలో పారిశ్రామికాభివృద్ధికవి తోడ్పడలేదు పైగా అధికారం బ్రిటిష్ వర్తక కంపెనీ చేతుల్లో వుండడంవల్ల ముడిసరుకులను ఉత్పత్తి జేసే దేశంగానే ఇండియా వుండిపోవలసివచ్చింది

ఉత్పత్తి సంబంధాలలో కూడా అలాగే జరిగింది భూమిమీద రైతులకు గల హక్కును భగ్నంచేసి, ప్రభుత్వ ఆస్తిగా పరిగణించినందున రైతులు కౌలుదార్లయ్యారు పండిన పంటలో అధికభాగం కంపెనీకి జమీందార్లకు దక్కింది కంపెనీకి దక్కిన సంపద ఇంగ్లండులో పరిశ్రమల స్థాపనకు తోడ్పడింది జమీందార్లకు దక్కిన సంపద విలాసాలకు ఉపయోగించబడింది అలాగాక కంపెనీకి, జమీందార్లకు దక్కిన పంపదను ఇండియాలో పరిశ్రమల స్థాపనకు వినియోగించి వుంటే పరిస్థితి మరొక విధంగా వుండేది కాని అది సామ్రాజ్యవాదుల పాలసీ కాదుగదా?

ఈ నగ్న సత్యాన్ని కంపెనీ డైరెక్టర్లు, బ్రిటిష్ పారిశ్రామికులు కూడా దాచిపెట్టారు భారతీయుల దుస్థితికి మీరు కారకులంటే, మీరు కారకులని విమర్శించుకున్నారు ఆ విమర్శ కూడా భారతీయుల మీద నున్న దయవల్లకాదు కంపెనీ పాలనను రద్దుచేసి, బ్రిటిష్ ప్రభుత్వ ప్రత్యక్ష పాలనను ప్రవేశపెడితే బ్రిటిష్ పారిశ్రామికులకు లాభం కనుక కంపెనీ పాలనవల్ల భారతీయులు బాధపడుతున్నారని బ్రిటిష్ పార్లమెంటులో నేరారోపణలు చేశారు అందుకు జవాబుగా కంపెనీ పాలకులు, బ్రిటిష్ పారిశ్రామికులపైన ప్రత్యారోపణలు చేశారు అదీ అసలుసంగతి కాగా ఇండియాలో దుస్థితి పెరిగిందేగాని, తగ్గలేదు

## దేశమంతటా పోరాటాలు

అందువల్ల అనేక చోట్ల ప్రజలు ప్రాణాలకు తెగించి ఎదురుతిరిగారు 1814లో వారణాసి వద్ద రాజపుత్రులు తిరగబడి, తమ గ్రామ సముదాయం (సమితి)లో పన్నులు వసూలు చేసే హక్కును వేలం వేయకుండా నిరోధించగలిగారు పన్నుల హెచ్చింపుకు వ్యతిరేకంగా ఒరిస్సా రైతులు 1817లో తిరుగుబాటు చేశారు అలాగే 1826 నుండి 29 వరకూ పూణే జిల్లాలోని 'రాముసీ' తెగవారు పోరాడారు వారికి మాజీ మహారాష్ట్ర సైనికుల తోడ్పాటు లభించింది కనుక పన్నులు తగ్గించేందుకు కంపెనీ ప్రభుత్వం అంగీకరించింది రాజస్థాన్‌లోని 'ఎర్' తెగవారు పన్నులు కట్టకుండా తిరగబడ్డారు

అడవి సంపదను కొల్లగొడుతూ, పన్నులు పెంచుతున్న కంపెనీ ప్రభుత్వంమీద 1825లో భిల్లులు తిరగబడి 23వ రెజిమెంటును ఓడించారు అందువల్ల హైదరాబాద్‌లో నున్న బ్రిటిష్ సైనిక దళమొకటి ఖండేషుకు వెళ్లింది ఆ దళ నాయకుడు సర్ జేమ్స్ ఔట్రామ్ చల్లగా భిల్లులతో సంబంధాలు పెట్టుకున్నాడు వారిపట్ల మంచిగా ప్రవర్తించాడు అందువల్ల భిల్లులు సిపాయీలుగా చేరారు కాని ఇతర గిరిజన తెగల విషయంలో అలా జరగలేదు

1831-32లో ఛోటా నాగపూర్‌లోని 'హెూస్' తెగవారు తిరగబడ్డారు 1832-35 మధ్య కచ్‌లో అశాంతి ప్రబలింది

1836లో ఖోండులు, '39లో కోలీ తెగవారు ప్రభుత్వ సిపాయీలతో పోరాడారు పట్టణాలలో కూడా అశాంతి ప్రబలింది. ఇంటి పన్నుల హెచ్చింపుకు వ్యతిరేకంగా

వారణాసిలో హర్తాళ్ జరిగింది 1816లో విధించిన పోలీస్ లెవీకి వ్యతిరేకంగా బెరైలీలో హర్తాళ్ జరిగింది

## కిట్టూరు సంస్థానంలో యుద్ధం

1824లో ధార్వార్ ప్రాంతానికి రాజకీయాధికారిగా థాకర్ వుండేవాడు ఎలాగైనా కిట్టూరు రాజ్యాన్ని కబళించడం ఆయన ధ్యేయం కనుక కిట్టూరు రాజు చనిపోకముందు చేసుకున్న దత్తత సక్రమంగా లేదని పేచీ పెట్టి, రాజబంధువుల మధ్య చీలికలు కల్పించాడు తరువాత రాజ్యాన్ని స్వాధీనం చేసుకునేందుకు కోటను ముట్టడించాడు

రాణి చెన్నమ్మ ఎదురుదిరిగి పోరాడింది ఆ యుద్ధంలో థాకర్‌తోపాటు ఆయన సైనికులు చాలామంది మరణించారు తక్కినవారు ఖైదీలుగా పట్టుబడ్డారు వీరనారి చెన్నమ్మ విజేతగా నిలిచింది

కాగా మద్రాసు గవర్నరొక కపట నాటక మాడాడు జరిగినదానికి చింతిస్తున్నానని, ఖైదీలను విడిచి పెట్టవలసిందని రాణి చెన్నమ్మకు లేఖ వ్రాశాడు గవర్నరు మాటను వీరనారి చెన్నమ్మ నమ్మి ఖైదీలను విడిచి పెట్టింది వెంటనే జిత్తులమారి గవర్నర్ కిట్టూరుకు పెద్ద సైన్యాన్ని పంపాడు అప్పుడు జరిగిన యుద్ధంలో రాణి చెన్నమ్మ విజృంభించి అనేకమంది బ్రిటిష్ సైనికులను హతమార్చింది కాని చివరకు స్పృహతప్పి రక్తసిక్తమైన శరీరంతో రణరంగంలో పడిపోయింది అలా పడిపోయిన చెన్నమ్మను, ఆమె దత్తపుత్రుడిని బ్రిటిష్ సేనాని బంధించి మద్రాసుకు తీసుకుపోయాడు

అయినా యుద్ధం ముగియలేదు కిట్టూరు ప్రజలు రాయప్ప నాయకత్వాన ఆరేళ్లపాటు గెరిల్లా యుద్ధం సాగించారు కాని మరొక వంచనద్వారా ఆంగ్లేయులు రాయన్నను బంధించి ఉరిదీసిన పిమ్మట యుద్ధం ఆగిపోయింది

వివరాలను పరిశీలిస్తే ఝాన్సీ లక్ష్మీబాయి కంటే మిన్నగా రాణి చెన్నమ్మ పోరాడినట్టు విదితమవుతుంది అయినా ఆ వీర వనిత శౌర్య ప్రతాపాలు ప్రజలకంతగా తెలియకపోవడం విచారకరం

అప్పటికింకా మృతనష్ట సిద్ధాంతం రాలేదు అయినా ఏదో విధంగా స్వతంత్ర రాజ్యాలను కబళించి, తమ రాజ్యాన్ని విస్తరింపజేస్తున్న కంపెనీ పాలకులు, బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రీతిపాత్రులయ్యారు కనుక 1833లో ఈస్టిండియా కంపెనీ పాలనను మరో 20 ఏళ్లపాటు బ్రిటిష్ ప్రభుత్వం పొడిగించింది అందువల్ల ఆంగ్లేయుల దోపిడి మరింత హెచ్చింది.

## ఉప్పు పన్ను

1836లో సాల్టు కమిషన్‌వారు ఉప్పుమీద దండిగా పన్ను వేశారు కనుక కంపెనీ ప్రభుత్వాదాయం పెరిగింది బ్రిటిష్ ఓడ యజమానుల లాభాలు, బ్రిటన్‌లో ఉప్పు పండించే వారి లాభాలుకూడా పెరిగాయి

భారతదేశంలో నౌకా వ్యాపారం కొరకు ఉపయోగించే ఓడల్లో నూటికి 72 వరకూ ఇంగ్లీషువాళ్లవే అవి ఇండియానుండి సరుకులు తీసుకుపోయిన పిమ్మట, తిరుగు ప్రయాణంలో చాలా వరకు ఖాళీగా రావలసివచ్చేది అలా ఖాళీగా సముద్రాల మీద ప్రయాణం చేయడం ప్రమాదకరం కాబట్టి మట్టి, గాజు పెంకులు మున్నగువాటితో

ఓడలను నింపుకొచ్చేవారు ఉప్పుమీద దండిగా పన్ను వేసిన పిమ్మట ఇండియాలో ఉప్పు ధర బాగా పెరిగింది కనుక ఇంగ్లండునుండి వచ్చే ఖాళీ ఓడల్లో మట్టికి బదులు 'షెషైర్'లో తయారైన ఉప్పును వేసుకొచ్చి ఇండియాలో అమ్ముకొని దండిగా లాభాలు గడించారు కంపెనీ పాలకులేపని జేసినా, బ్రిటిష్ పెట్టుబడిదారులందరికీ లాభించేదనుటకు ఇదొక ఉదాహరణ

## ఆంధ్రుల వినూత్న పోరాటం

పాత శిస్తుల హెచ్చింపు, కొత్త పన్నుల విధింపు, కంపెనీ ఉద్యోగుల లంచాలు, జమీందారీ వర్గాల దోపిడీ, మరారీ దండుల బందిపోట్లు ఆంధ్ర కోస్తా జిల్లాలలోని ప్రజల మూలుగులను పీల్చి వేశాయి 1811 లో ఒక కరువు, '23లో మరో కరువు వాటినన్నిటినీ మించిన 'డొక్కల కరువు'-1833లో వచ్చింది తరువాత 1839లోను '41లోను కరువులొచ్చాయి అందువల్ల ఒక్క గోదావరి జిల్లాలోనే జనాభా లక్షా 70 వేలు తగ్గింది అయినా కంపెనీ ప్రభుత్వంగాని, జమీందార్లుగాని ప్రజల గోడును వినిపించుకోలేదు

కాని కాప్టెన్ బకిల్ కరువు నివారణోపాయాన్ని గురించి ఆలోచించాడు బెజవాడవద్ద కృష్ణానదికి అడ్డంగా ఆనకట్ట కట్టేందుకు 1792లో మేజర్ బీట్సన్ తయారుజేసిన ప్లానులు, 1795లో మైఖేల్ టాపింగ్ తయారుజేసిన సర్వే రికార్డులు ఆయనకు లభించాయి కాగా వాటి ఆధారంతో బెజవాడవద్ద ఆనకట్ట నిర్మించేందుకొక నివేదికను తయారుచేసి, 1839లో కంపెనీ పాలకులకు పంపాడు కెప్టెన్ బకిల్ పంపిన నివేదికను పరిశీలించిన పిమ్మట కంపెనీ డైరెక్టర్లు "ఇంతపెద్ద ప్రాజెక్టు అభిలషణీయమూ కాదు, ఆచరణ సాధ్యమూ కాదు" అంటూ తిరస్కరించారు

ఈలోగా రైతుల సహనం నశించింది ఆంధ్ర కోస్తా జిల్లాల రైతులు 'మేడి తిప్పి పాతటం' అనే వినూత్న ఉద్యమాన్ని ప్రారంభించారు మేడి తిప్పి పాతడమంటే, పొలాలు పాడుబెడుతున్నామని కంపెనీ ప్రభుత్వానికి, జమీందార్లకు తెలపడమన్నమాట భజన దళాలేర్పడి రామభజన చేస్తూ గ్రామాల వెంట తిరిగి ప్రచారం జేశాయి పంట పొలాలు పాడుబడ్డాయి రైతులు, కూలీలు, చేతివృత్తుల వారూ కలిసి దుంపలు, తూళ్ళు, ఆకులు తింటూ బ్రతికారు ఆకలికి ఆగలేని వారు మజ్జిగలో మన్ను కలుపుకు తాగారు అందువల్ల అంటురోగాల బారిబడి అనేకులు మరణించారు అయినా "కరువుల వల్ల చస్తేనేం? సమ్మెజేస్తూ చస్తేనేం?" అని భావించిన రైతులు గట్టిగా నిలబడ్డారు కనుక కంపెనీ ప్రభుత్వ ఆదాయం తగ్గింది జమీందార్ల ఆదాయం పూర్తిగా తగ్గిపోయింది

కాగా రైతుల కోర్కెలను తీర్చుతామని ప్రభుత్వంతోపాటు జమీందార్లుకూడా హామీ ఇచ్చారు మేడి తిప్పి పాతిన ఉద్యమాన్ని రైతులు విరమించారు

గోదావరి జిల్లాలోని పరిస్థితులను విచారించి, నివారణోపాయాలను సూచించేం దుకు సర్ హెన్రీ మాంట్‌గోమరీని 1843లో ప్రభుత్వం నియమించింది విచారణ జరిపిన పిమ్మట 1844లో మాంట్‌గోమరీ పంపిన నివేదిక ఇలా వుంది

"రెవిన్యూ ఉద్యోగుల లంచగొండితనం, జలాధారాలను మరమ్మత్తు చేయక పోవడం, జమీందార్ల విలాసాల కొరకు రైతులనదేపనిగా పిండడం, వ్యవసాయాభివృద్ధి కొరకు పెట్టుబడులు పెట్టకపోవడం వంటి కారణాలవల్ల దుర్భిక్ష పరిస్థితు లేర్పడ్డాయి

కాబట్టి వెంటనే జలాధారాల మరమ్మత్తుకు పూనుకోవాలి భూములను సర్వే చేయించి, శిస్తు వసూళ్లను క్రమబద్ధం చేయాలి లంచగొండి తనాన్ని రూపుమాపాలి కొత్త జలాధారాలను నిర్మించేందుకు పూనుకోవాలి" అని మాంట్‌గోమరీ సూచించాడు

కాబట్టి ప్రభుత్వంతోపాటు జమీందార్లుకూడా కదిలారు కోస్తా జిల్లాలోని నీటి వనరుల మరమ్మత్తులు ప్రారంభించారు పొలాలను సర్వే చేయించి, తరంవారీగా శిస్తులను వసూలు చేసుకునేందుకు అంగీకరించారు శిస్తు బకాయీలను పూర్తిగా రద్దుజేశారు

గోదావరినదిపైన ధవళేశ్వరంవద్ద ఆనకట్ట కట్టడానికి సంబంధించిన నివేదికను సర్ ఆర్థర్ కాటన్ 1844లో కంపెనీ డైరెక్టర్లకు పంపాడు '45లో మరొక రిపోర్టు పంపాడు ఆనకట్ట కట్టాలా, లేదా అని కంపెనీ అధికారులు ఊగిసలాడుతుండగానే విశాఖపట్నం ఏజెన్సీలోను, రాయలసీమలోను పోరాటాలు ప్రారంభమయ్యాయి

1845లో విశాఖపట్నం ఏజెన్సీలో ప్రారంభమైన పోరాటం మూడేళ్ళపాటు ఉధృతంగా కొనసాగింది కంపెనీ అధికారుల అక్రమాలకు వ్యతిరేకంగా మురాదారులు తిరగబడితే, కంట్రాక్టర్ల దోపిడీకి వ్యతిరేకంగా గిరిజనులు తిరగబడ్డారు ఇరువురూ కలిసి బారికేడ్లు నిర్మించి వీరోచితంగా పోరాడారు అయినా ఏజెన్సీ ప్రాంతాన్ని సిపాయీలతో నింపగలిగిన కంపెనీ ప్రభుత్వం ఆ తిరుగుబాటును అణచివేసింది

1846లో ఉయ్యాలవాడ నరసింహారెడ్డి నాయకత్వాన సర్వీస్ ఈనాందారులు, మాజీ పాళెగార్లు ఏకమై, రాయలసీమలో సాయుధ తిరుగుబాటు జేశారు ఆ తిరుగుబాటును కెప్టెన్ ఓల్డు అణచివేసి, నరసింహారెడ్డిని ఉరిదీయించాడు

1844లో కొల్హాపూర్, సంతవాడి సంస్థానాధీశులు శిస్తులు పెంచినందుకు రైతులు తిరగబడ్డారు 1844–46 సంవత్సరాల మధ్య మరొకమారు 'కోలీ' తెగవారు తిరుగుబాటు జేశారు 1846లో నాగపూర్‌లోని రోహిల్లాలు సాయుధ పోరాటం సాగించారు ఒరిస్సాలోని ఖోండులు, బీహార్‌లోని సంతాలులు 1855 వరకూ పోరాడారు అలా పోరాడిన చోట్ల ప్రజలకు కొన్ని హక్కులు లభించాయి అయినా మొత్తంమీద పరిస్థితి మెరుగుపడలేదు

## ఆంగ్లేయుల త్రిముఖ దోపిడి

ఈస్టిండియా కంపెనీ గుజరాత్‌ను ఆక్రమించగానే, అక్కడనున్న పరిశ్రమలపైన దండిగా పన్నులు వేసింది అందువల్ల బట్టల పరిశ్రమతోపాటు నావల నిర్మాణంకూడా దెబ్బతిన్నది పంజాబును ఆక్రమించిన పిమ్మట, అక్కడనుండి మధ్య ప్రాచ్యదేశాలకు, జారిష్టు రష్యాకు జరుగుతున్న ఎగుమతులమీద విపరీతంగా సుంకాలు విధించింది కనుక ఆ ఎగుమతులుకూడా నిలిచిపోయాయి

వెస్టిండీస్, దక్షిణ అమెరికా దేశాలకు బానిసలను విక్రయించి దండిగా సంపాదించిన ఆంగ్లేయులు ఇండియాకు వచ్చి నీలిమందు, తేయాకు మున్నగు తోటలు వేశారు కనుక సారవంతమైన భూములు వారి స్వంత ఎస్టేట్లుగా మారిపోయాయి ఆ తోటల్లో పనిజేసిన వేలాది కూలీలు అర్ధ బానిసలుగా లేదా కట్టుబానిసలుగా జీవించవలసి వచ్చింది

ఎస్టేటుదారులతోపాటు బ్రిటిష్ పెట్టుబడిదారులొచ్చి, ఇండియాలో జూట్ మిల్లులు, జౌళి మిల్లులు నిర్మించారు ఇలా సాగిన త్రిముఖ దోపిడీవల్ల భారతీయులు పలు బాధలనుభవించారు ప్రపంచంలో సాటిలేని మేటి పారిశ్రామిక దేశంగా ఇంగ్లండు

అభివృద్ధి చెందింది ఈ స్థితికి కారణమైన ఆంగ్లేయుల దోపిడీని గురించి డాక్టర్ పట్టాభి ఇలా వ్రాశారు

"బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వారు హిందూ దేశమును ఆక్రమించుకొనిన విధానము అనేక విశ్వాస ఘాతుక కృత్యాలతో, వాగ్దాన భంగాలతో, దురాశాపూరితమైన నీచకార్యాలతో నిండి వుంది అలా కళంకమైన చరిత్ర ప్రసక్తి మనకిపుడవసరం లేదు మెషీనులు, స్టీమ్ ఇంజన్లు కనిపెట్టిన పిమ్మట ప్రపంచంలో మేటి పారిశ్రామికాభివృద్ధిని సాధించిన దేశంగా బ్రిటన్ పరిగణింపబడుటకు మూలం, ఇండియానుండి తరలించుకుపోయిన ధనరాసులేననుట నిస్సందేహం ఈ ధనరాసులే మూలధనంగా ఉపయోగపడినాయని చెపితే చాలును "

## ఆనకట్టల నిర్మాణం

అలా దోపిడీకి గురికావడంవలన భారతీయుల కొనుగోలు శక్తి బాగా తగ్గిపోయింది ముడిసరుకుల ఉత్పత్తికూడా తగ్గింది కనుక తమకవసరమైన ముడిసరుకులు దొరుకవని, తాము తయారుజేసిన వస్తువులు ఇండియాలో అమ్ముడుబోవని బ్రిటన్‌లోని పారిశ్రామిక పెట్టుబడిదారులు ఆందోళన చెందారు

"ఇండియాలో విస్తారమైన సుక్షేత్రాలున్నాయి వ్యావసాయక ఉత్పత్తులు పెరిగే అవకాశాలున్నాయి కనుక బ్రిటిష్ పరిశ్రమలలో ఉత్పత్తి జేయబడిన వస్తువులలో అత్యధిక భాగాన్ని భారతీయులు కొనగలరు కాని ప్రస్తుత పరిస్థితిలో ఇంగ్లండునుండి పంపిన పారిశ్రామిక వస్తువులు విడుదలవుతాయా? వాటికిమ్మతుకు తగినన్ని ముడిసరకులను భారతీయులు పంపగలరా? అని సందేహించవలసి వస్తోంది" అని మాంచెస్టర్ ఛేంబర్ ఆఫ్ కామర్సు అధ్యక్షుడు ఆందోళన వెలిబుచ్చాడు

ఇండియాలో జలవనరులను, రహదారులను కంపెనీ ప్రభుత్వం విస్మరించడం వల్ల పరిస్థితి అస్తవ్యస్తమైంది గాబట్టి, వనరుల అభివృద్ధికి పూనుకోవలసిందిగా కంపెనీ ప్రభుత్వాన్ని బ్రిటిష్ పార్లమెంటు ఆదేశించింది

ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణానికి సర్ ఆర్థర్ కాటన్ చేసిన ప్రతిపాదనను కంపెనీ డైరెక్టర్లు ఆమోదించారు కాని పెట్టుబడిమీద నాలుగు శాతం వడ్డీ చెల్లించాలనే షరతు విధించారు

వాస్తవానికి ఆనకట్ట నిర్మాణమునకు ఖర్చు పెట్టిన మొత్తానికి రెట్టింపుకు పైగా మొత్తాన్ని తొలి 45 ఏళ్లలోనే సంపాదించారు 1848నుండి '52 వరకూ అయిన నిర్మాణ ఖర్చులు, 1893-94 నాటి వరకూ అయిన మరమ్మత్తుల ఖర్చులు కలిపి, మొత్తం రూ 1,28,08,662లు పెట్టుబడిగా పెట్టారు ఆనకట్ట నిర్మాణం వల్ల వచ్చిన ఆదాయంలో, వడ్డీ క్రింద చెల్లింపులు, రెవిన్యూ ఖర్చులు వగైరా పోను 1893-94 నాటికి రూ 2,84,88,684ల నికర లాభాన్ని సంపాదించారు

1848లో ఆనకట్ట నిర్మాణం ప్రారంభమైన పిమ్మట ఆర్థర్ కాటన్‌కు జబ్బుజేసి సెలవుమీద వెళ్లడం వలన కెప్టెన్ ఓర్ నిర్మాణ బాధ్యతలు చేపట్టాడు 1850లో ఆర్థర్ కాటన్ తిరిగి నిర్మాణ బాధ్యత వహించాడు 1852 మార్చిలో ఆనకట్ట నిర్మాణం పూర్తయింది ఆ సమయంలో సర్ ఆర్థర్ కాటన్ చీఫ్ ఇంజనీరుగా ప్రమోట్ చేయబడినందున మద్రాసుకు వెళ్ళిపోయాడు కనుక కాలువలు వగైరా నిర్మాణ బాధ్యతలను

అయన తమ్ముడు మేజర్ ఎఫ్ సి కాటన్ నిర్వహించాడు కెప్టెన్ ఓర్ కృష్ణా ఆనకట్ట నిర్మాణ బాధ్యతను స్వీకరించాడు

బెజవాడవద్ద ఆనకట్ట నిర్మాణ ప్రతిపాదనను 1839లో త్రోసిపుచ్చిన కంపెనీ డైరెక్టర్లు, 1845లో ఆనకట్ట బాగోగులను పరిశీలించుటకు కెప్టెన్ లేక్‌ను నియమించారు ఆయన ఆర్థర్ కాటన్‌గారి సలహా సంప్రదింపులతో నివేదికను తయారుజేశాడు ఆ నివేదికను ఆర్థర్ కాటన్ సమర్థించాడు కాగా 1852లో కెప్టెన్ ఓర్ పర్యవేక్షణలో కృష్ణా ఆనకట్ట నిర్మాణం ప్రారంభమైంది గోదావరి ఆనకట్టవల్ల కంపెనీ ప్రభుత్వానికి లాభాలు వచ్చినట్లే కృష్ణ ఆనకట్టవల్లకూడా లాభాలు వచ్చాయి

అయినా ఆనకట్ట నిర్మాణానికి ఖర్చు పెట్టిన డబ్బును అప్పుల ఖాతాలో వ్రాసి, వచ్చిన ఆదాయాన్ని లాభాల ఖాతాలో జమ వ్రాసుకున్నారు అందువల్ల ఎంత ఆదాయమొచ్చినా అప్పు అప్పుగానే మిగిలిపోయింది ఇండియా బ్రిటనుకు చెల్లించవలసిన అప్పుల ఖాతా అలా ప్రారంభమైంది రైల్వేల నిర్మాణం వల్ల ఇండియా బ్రిటనుకు చెల్లించవలసిన అప్పు మొత్తాలు మరీ పెరిగాయి

రహదారుల కొరకు ఖర్చు పెట్టిన డబ్బును రాబట్టుకునేందుకు రైతులమీద రోడ్డు సెస్సు వేశారు కొన్నిచోట్ల ప్రజలను నిర్బంధించి రోడ్లు వేయించారు

## క్రైస్తవ మిషనరీల చర్యలు

బ్రిటిష్ మిషనరీలు క్రైస్తవ మత ప్రచారం చేయకూడదనే నిషేధాన్ని 1813లో తొలగించారు అంతకుముందు డచ్ (హాలెండు) మిషనరీలు ఆ పని చేసేవారు నిషేధం తొలగిన పిమ్మట బ్రిటిష్ మిషనరీల మత ప్రచారం విచ్చలవిడిగా సాగింది వీరితో ఇతర దేశాలవారు పోటీపడ్డారు

1816లో చర్చి మిషన్ సొసైటీవారు మద్రాసులోను, బర్ద్వాన్‌లోను పాఠశాలలు పెట్టి, మత ధర్మాలు బోధించారు బందరులో రెవరెండ్ నోబెల్ అనేకమంది అగ్రకులాల వారిని క్రైస్తవ మతంలో చేర్చాడు గుంటూరు జిల్లాలో అమెరికన్ మిషనరీలు బలపడి, 1833లో వచ్చిన కరువు సమయంలో అన్నంపెట్టి, వేలాది మందిని మతంలో చేర్చుకున్నారు స్కాట్లండ్ చర్చి మిషన్ తరఫున అలెగ్జాండర్ డఫ్ 1830లో కలకత్తాలో పాఠశాలను పెట్టి మత ప్రచారానికి పూనుకున్నాడు. మద్రాసులో పాఠశాల పెట్టిన ఆండర్సన్ అందరినీ మించిపోయాడు.

ఇంగ్లీషు పాఠశాలల్లో చదివి ఉత్తీర్ణులైనవారికి ఉద్యోగాలివ్వబడతాయని 1844లో గవర్నర్ జనరల్ హార్డింజి ప్రకటించడంవల్ల మిషన్ పాఠశాలల విలువ పెరిగింది వాటిలో చదివే విద్యార్థులలో కొందరినైనా మతంలో కలుపుకునేందుకు అవకాశమేర్పడింది అలా కలుపుకున్నవారిలో ఎక్కువమంది మైనర్లుగావడం వలన హిందువుల ఆందోళన పెరిగింది ప్రభుత్వమూ, మిషనరీలు కలిసి హిందూ మతాన్ని తుడిచిపెట్టేందుకు పూనుకున్నారని హిందూమత పెద్దలు ఆగ్రహించెందారు

కనుక మైనర్లుగానున్న బాల బాలికల మతాంతరీకరణకు వ్యతిరేకంగా కోర్టుల్లో పిటీషన్లు దాఖలు చేశారు మైనర్లను మతంలో చేర్చుకోకూడదని బొంబాయి సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది 12 ఏళ్ల దాటిన వారిని చేర్చుకోవచ్చునని మద్రాస్, కలకత్తా సుప్రీంకోర్టులు (నేటి హైకోర్టులు) తీర్పు చెప్పాయి కాగా హిందువుల ఆందోళన చెలరేగింది.

కొందరు ఆంగ్లేయులుకూడా మైనర్ల మతాంతరీకరణను వ్యతిరేకించారు 'క్రైస్తవులు ఆదర్శప్రాయంగా జీవిస్తే క్రైస్తవ మతం విస్తరిస్తుంది చెడుగా ప్రవర్తిస్తూ హిందూ మతాన్ని దూషిస్తే వ్యతిరేకత పెరుగుతుంది" అని విమర్శించారు

"ఇండియాలోనున్న బ్రిటిష్ వారిలో అనేకులకు నీతినియమాలు లేవు వీరి మతము ధనాశాపరుల మతముగా, ఐహిక వాంఛలను తీర్చుకొనుటకు ఏర్పడిన మతముగా హిందువులకు తోచుచున్నది" అని కాంబెల్ విమర్శించాడు

"కంపెనీ ఉద్యోగుల్లో కొందరు ఉంపుడుకత్తెల నుంచుకుంటున్నారు ఈ ఉంపుడుకత్తెలలో చాలామంది వారవనితలే పరిపాలనా సంబంధమైన విషయాలలో సహితం ఈ వారవనితల మాట చెల్లుతోంది" అని న్యాయమూర్తి షోర్ వెల్లడించాడు

"వీరు ఆదివారం నాడైనా దేవుని ప్రార్థించరు స్త్రీల శీలమును మన్నించరు ఉంపుడుగత్తెలనుంచుకొనుట, అధర్మ సంతానమును సృష్టించుట సర్వసామాన్యమైనది వీరి చర్యలు క్రైస్తవ మతమునకు విరుద్ధముగా నున్నవి" అని బిషప్ కారీ జీవిత చరిత్రలో వ్రాశారు కాగా హిందూ మత ధర్మరక్షణకొరకు సనాతన ధర్మసమాజం, బ్రహ్మ సమాజంలాంటి వేర్పడినాయి

## భారతీయుల కోర్కెలు

ఆ దశలో బ్రిటిష్ ఏజెంట్లుగానున్న భారతీయ వ్యాపారులు పైకి రాగలిగారు వారు ప్రైవేటుగా ఇంగ్లీష్ నేర్చుకునేవారు ఈస్టిండియా కంపెనీ వారి నుండి జమీలు సంపాదించుకున్నవారిలోకూడా కొందరు ఇంగ్లీష్ నేర్చుకునేవారు ప్రైవేటుగా నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకొన్నవారు కంపెనీ ప్రభుత్వ ఉద్యోగాలు పొందగలిగేవారు

మొఘల్ పాదుషాల అధికారాన్ని హరించిన వారు ఆంగ్లేయులు గనుక, ఇంగ్లీషు చదవకూడదని ముస్లిములు భీష్మించేవారు కాని వ్యాపార రంగంలోనున్న బోహ్రాలలాంటి వారలా భీష్మించేవారు కాదు

అయినా ఇంగ్లీష్ చదువుకున్నవారిలో హిందువులు, పార్సీలు అత్యధికులుగా వుండేవారు ఇంగ్లండ్‌లో వలెనే ఇండియాలోకూడా పరిశ్రమలు స్థాపించాలని, అందుకు అవసరమైన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించాలని వీరు ఉవ్విళ్లూరేవారు బ్రిటిష్ పార్లమెంట్‌లో జరిగే చర్చలు వీరినాకర్షించేవి బర్క్, షెరిడాన్‌లాంటివారి ఉపన్యాసాలను పత్రికలలో చదివి ముగ్ధులయ్యేవారు ఇండియాలో బ్రిటిష్‌వాళ్లు చేస్తున్న అన్యాయాలను గురించి బ్రిటిష్ పార్లమెంటుకు తెలియజేస్తే ఫలితముంటుందని భ్రమపడేవారు

ఇండియా అభివృద్ధి చెందాలంటే, ప్రజలలో పాతుకుపోయిన అజ్ఞానాన్ని, అంధ విశ్వాసాలను తొలగించడం అవసరమని వారు భావించేవారు కాగా సంస్కరణ కార్యక్రమాలకు కొందరు పూనుకున్నారు వారిలో రాజారామమోహనరాయ్ ప్రసిద్ధుడు

## రాజారామమోహనరాయ్

రామమోహనరాయ్ ప్రజాసేవ బహుముఖంగా సాగింది ఆడపిల్ల పుట్టగానే గంగలో పారేయడం, బలవంతంగా సతీసహగమనం చేయించడం, కాళికాదేవికి బలులు సమర్పించడం, కృష్ణభక్తి పేరుతో స్త్రీ-పురుషులు విచ్చలవిడిగా మెలగడంవంటి దురాచారాలను రూపుమాపేందుకు ఆయన 1815లో ఆర్యసభను స్థాపించారు వేదాలు

చదివి వ్యాఖ్యానాలు వ్రాసి, సనాతనుల ఆటకట్టించి, సతీసహగమనాన్ని ఆపించారు హిందూమతాన్ని అవహేళన చేసిన క్రైస్తవమిషనరీల నెదిరించారు కంపెనీ ప్రభుత్వం స్థాపించిన సంస్కృత, అరబిక్ పారశాలల్లో ఇంగ్లీష్ తరగతులు ప్రారంభించుటకు కృషి చేశారు కాగా కంపెనీ ప్రభుత్వం కలకత్తాలోని హిందూ కాలేజీలో ఇంగ్లీష్ తరగతులనుకూడా ప్రారంభించింది (కొన్నాళ్ల తరువాత హిందూ కాలేజీ పేరును ప్రెసిడెన్సీ కాలేజిగా మార్చారు )

ఇస్లామ్, క్రైస్తవమత ధర్మాలను, హిందూ, బౌద్ధమత ధర్మాలను తెలుసుకోగలిగిన రామమోహనరాయ్, సర్వమానవ సమానత్వాన్ని చాటి చెప్పేందుకు 1828లో బ్రహ్మసమాజాన్ని స్థాపించారు విగ్రహారాధన వేదవిహితం కాదని వ్యతిరేకించారు

మొఘల్ పాదుషా ప్రతినిధిగా 1831లో ఇంగ్లండ్‌కు వెళ్లినప్పుడు, ఇండియాలో రైతులు పడుతున్న కష్టాలను ఆంగ్లేయులకు వివరించారు కంపెనీ అధికారుల అవినీతివల్లను, జమీందార్ల దోపిడివల్లనూ రైతులకు కలుగుతున్న కష్టనష్టాలను వివరించి, వాటి నివారణకు తీసుకోవలసిన చర్యలను సూచిస్తూ, బ్రిటిష్ పార్లమెంటుకొక వినతిపత్రాన్ని సమర్పించారు 1832లో కామన్స్ సభ సెలెక్టు కమిటీ ఎదుట సాక్ష్యంకూడా యిచ్చారు కాని, దురదృష్టవశాత్తూ ఇంగ్లండులోనే పరమపదించారు

## హెచ్.వి.దిరోజియో

హెన్రీ లూయీ వివియన్ దిరోజియో మహామేధావి ఆయన తల్లి హిందువు తండ్రి పోర్చుగల్‌నుండి వచ్చిన క్రైస్తవుడు 20 ఏళ్ల వయసులోనే దిరోజియో లెక్చరర్ కాగలిగాడు వెంటనే కలకత్తాలోని హిందూ కాలేజీలో స్టూడెంట్స్ ఎకడమిక్ కౌన్సిల్‌ను స్థాపించాడు అదే దేశంలో మొట్టమొదటి కౌన్సిల్

అంతటితో దిరోజియో సంతృప్తి పడలేదు ప్రజల హక్కుల కొరకు పోరాడేందుకు, మూఢనమ్మకాలను తొలగించి విజ్ఞానాభివృద్ధిని సాధించేందుకు పూనుకొని 'యంగ్‌బెంగాల్' ఉద్యమాన్ని నిర్మించాడు ఆ విధంగా రామమోహనరాయ్‌గారికంటే ఒకడుగు ముందుకు వేశాడు కాని యంగ్‌బెంగాల్ ఉద్యమాన్ని జూచి భయపడిన సనాతనులు, కంపెనీ పాలకులు కలిసి దిరోజియోను ఉద్యోగంనుండి తొలగించారు అయినా ఆయన పట్టుదల సడలలేదు రామగోపాలఘోష్, ప్యారీ చంద్రమిత్రలాంటి రాజకీయ నాయకులను తీర్చి దిద్దాడు దురదృష్టవశాత్తూ 26 ఏళ్ల వయసులోనే మరణించాడు

ఆయన మరణానంతరం, ఆయన అనుచరులలో కొందరు బ్రహ్మ సమాజంలో చేరారు అప్పుడు బ్రహ్మసమాజానికి ద్వారకనాధ రాగూర్ అధ్యక్షుడు ఆయనొక పెద్ద జమీందారు పైగా పెద్ద వ్యాపారి. మొట్టమొదటి ఇండియన్ ట్రేడింగ్ కంపెనీని స్థాపించినదాయనే

బ్రహ్మసమాజానికి పోటీగా సనాతనులు స్థాపించిన ధర్మసమాజానికి రాజా రాధా కాంతదేవ్ అధ్యక్షుడు. కనుక బెంగాల్ జమీందారులు రెండు ముఠాలుగా చీలిపోయారు

కాని 1837లో శ్రోత్రియాలు, లఖిరాజు ఈనాములు (ప్రభుత్వానికి డబ్బు చెల్లించనక్కరలేని ఈనాములు) మొదలగువాటిని రద్దుజేసేందుకు కంపెనీ పాలకులు పూనుకున్నప్పుడు జమీందారీ వర్గాలవారంతా ఏకమయ్యారు నీలిమందు, తేయాకు మున్నగు తోటల యజమానులైన ఆంగ్లేయులుకూడా జమీందార్లతో చేతులు కలిపారు

అందరూ కలిసి వర్గ బాంధవ్యం నెరపి "జమీందారీ అసోసియేషన్" స్థాపించి భూస్వామ్య వర్గాల ప్రయోజనాలను కాపాడుకున్నారు

## బ్రిటిష్ ఇండియా సొసైటీ

జమీందారీ అసోసియేషన్‌వల్ల లాభం లేదనే భావంతో రామగోపాల ఘోష్ మున్నగువారు 1843లో "బ్రిటిష్ ఇండియా సొసైటీ"ని స్థాపించారు ఆ సొసైటీలో థాంప్సన్, లీత్, ప్యారీ చంద్ర మిత్రా, హరిమోహనసేన్ వంటి మేధావులు, రాజకీయవేత్తలు సభ్యులుగా వుండేవారు విద్యావ్యాప్తికొరకు, వ్యవసాయాభివృద్ధికొరకు కృషి చేసేవారు. కాని, భారతీయులకు, ఇండియాలో నివసిస్తున్న యూరోపియనులకు, ఒకే విధమైన న్యాయ చట్టాలుండాలని ఆందోళన ప్రారంభించగానే థాంప్సన్, లీత్ మొదలగు వర్ణ దురహంకారులు విడిపోయారు అలాగే జమీందారీ అసోసియేషన్‌లోనున్న బ్రిటిష్‌వారుకూడా విడిపోయారు

ఆ దశలో క్రైస్తవ మతగురువులు హిందూమతాన్ని దూషించడం ఎక్కువైంది వారికి కంపెనీ ప్రభుత్వం బాహాటంగా తోడ్పడింది కనుక 1848లో బ్రహ్మసమాజంవారు, ధర్మసమాజం వారు ఏకమై "హిందూ సొసైటీ"ని స్థాపించి, ఇంగ్లీషు పాఠశాలలు ప్రారంభించారు తరువాత "బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్" అనే రాజకీయ సంస్థను నెలకొల్పారు

## బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్

1851లో దీనిని స్థాపించిన వారిలో రామగోపాల ఘోష్, ప్రసన్న కుమార ఠాగూర్, దేవేంద్రనాథ ఠాగూర్, రాజేంద్రలాల్ మిత్రా, హరిశ్చంద్ర ముఖర్జీ, రాధాకాంతదేవ్‌లాంటి ప్రముఖులున్నారు ఇండియాలో మున్ముందుగా ఏర్పడిన రాజకీయ సంస్థ ఇదే

ఇండియాను పాలించేందుకు బ్రిటిష్ పార్లమెంటునుండి ఈస్టిండియా కంపెనీ పొందిన హక్కు 1853తో ముగుస్తుంది కాబట్టి కంపెనీ పాలకుల దుష్ట చర్యలను బ్రిటిష్ పార్లమెంటుకు తెలియజేసి, కంపెనీ పాలన పొడిగింపబడకుండా చూడాలని, ఒకవేళ పొడిగిస్తే కంపెనీ పాలనలో భారతీయులకు తగిన స్థానం కల్పించవలసిందిగా కోరాలని అసోసియేషన్ వారు తీర్మానించారు ఆ తీర్మానంతోపాటు, (1) పన్నులు తగ్గించాలి (2) దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించాలి (3) ఉన్నత విద్యావ్యాప్తికి తోడ్పడాలి (4) భారతీయులకుకూడా ఉన్నత ఉద్యోగాలివ్వాలి (5) న్యాయ చట్టాలను సవరించాలి అనే కోర్కెలకు మరొక 5 కోర్కెలను చేర్చి తయారుజేసిన వినతిపత్రాన్ని రామగోపాలఘోష్ బ్రిటిష్ పార్లమెంటుకు పంపాడు

## రామగోపాల ఘోష్

ఒక చిన్న వర్తక కుటుంబంలో పుట్టిన రామగోపాలఘోష్, హెన్రీ లూయీ వివియన్ దిరోజియోవద్ద విద్యనభ్యసించి, ఒక ఇంగ్లీష్ కంపెనీలో గుమాస్తాగా చేరాడు తరువాత "కల్సాల్ అన్డ్ ఘోష్" కంపెనీలో భాగస్థుడై బాగా సంపాదించాడు కాని సంపాదించిన దంతా రాజకీయ కార్యకలాపాలకు, సంఘ సంస్కరణోద్యమానికి ఖర్చుపెట్టాడు

పత్రికల ప్రాముఖ్యత నెరిగినవాడుగాబట్టి ముందుగా ఆయన స్పెక్టేటర్ పత్రికను,

తరువాత దర్పణ్ అనే మరో పత్రికను ప్రారంభించాడు పిమ్మట "జ్ఞానాన్మను" పత్రికకు సంపాదకత్వం వహించాడు స్త్రీల విద్యను, వితంతు వివాహాలను ప్రోత్సహించాడు ఆ రోజుల్లో ఆయన వక్తృత్వాన్ని గురించి, ధీశక్తిని గురించి లండన్ టైమ్సులాంటి పత్రికలు సహితం ప్రశంసించేవి

## బాంబే అసోసియేషన్

బాంబేదర్పణ్ అనే ఆంగ్లో-మరాటా వారపత్రికను స్థాపించిన బాలశాస్త్రి జంబేకర్ కంపెనీ పాలనను విమర్శిస్తూ వ్యాసాలు వ్రాసేవారు పూణేనుండి వెలువడే మరారీలు వారపత్రిక 'ప్రభాకర్' లో మూఢ నమ్మకాలను, జమీందారీ వర్గాల విలాసాలను విమర్శించిన వ్యాసాలు వెలువడేవి కాగా కొంత సంచలనం కలిగింది కనుక 1852లో రామకృష్ణవిఠల్, నైరోజీ ఫర్దూంజీ, దాదాభాయ్ నౌరోజీ మున్నగువారు కలసి బాంబే అసోసియేషన్ స్థాపించారు తరువాత బ్రిటిష్ పార్లమెంటుకొక వినతిపత్రాన్ని పంపారు.

ఆ పత్రంలో ఈస్టిండియా పాలనను విమర్శించారు భారతీయులను పాలించేందుకు ఉదార దృష్టిగల ప్రభుత్వ విధానమును ప్రవేశపెట్టవలసినదిగా బ్రిటిష్ పార్లమెంటును అర్థించారు దేశంలోని విద్యాభివృద్ధి నిమిత్తం కంపెనీ పాలకులు కేటాయించిన రెండు లక్షల రూపాయలు చాలవని, ఆ మొత్తాన్ని పెంచి ప్రెసిడెన్సీకొక యూనివర్శిటీ చొప్పున స్థాపించాలని కోరారు విద్యావంతులైన భారతీయులను కౌన్సిల్సులోను, ఉన్నతోద్యోగాలలోను చేర్చుకోవాలని, ప్రజలకు ఉపయోగపడే పనులకు (పబ్లిక్ వర్క్సుకు) హెచ్చు మొత్తాలు కేటాయించాలని విజ్ఞప్తి చేశారు భారతీయులకు వర్తించే సివిల్, క్రిమినల్ చట్టాలు ఇండియాలో నివసించే యూరోపియనులకుకూడా వర్తింపజేయాలని కోరారు

"చట్టం దృష్టిలో అందరూ సమానులే" నన్న వాదన ఇంగ్లండ్‌లో సంచలనాన్ని కలిగించింది బ్రిటిష్ పత్రికలు నిప్పులు చెరిగాయి కాని భారతీయులపట్ల సానుభూతిగల సర్ ఎడ్వర్డు ర్యాన్, సర్ ఎర్స్కిన్ పెర్రీ, జోసెఫ్ హ్యూమ్, జాన్ బ్రయిట్ మున్నగు ప్రముఖులు భారతీయులను సమర్థిస్తూ ఇంగ్లండులో ప్రచారం చేశారు

అయినా బాంబేలోని పెట్టుబడిదారుల్లో కొందరి కాళ్లు వణికాయి ఇంగ్లీషువారికి కోపం తెప్పించిన బొంబాయి అసోసియేషన్‌లో సభ్యులుగా వుండజాలమని సర్ జెమ్సెట్జీ జీజీభాయ్, రామలాల్ ధాకర్సీదాస్, మహమ్మద్ అమాన్ రొగే, మానెక్‌లాల్ ఉర్సెట్జీ వగైరాలు రాజీనామా చేశారు

## హిందూ లిటరరీ సొసైటీ (మద్రాసు)

కంపెనీ పాలనలోగల ప్రజల విద్యాభివృద్ధి కొరకు సాలుకొక లక్ష రూపాయల చొప్పున ఖర్చు పెట్టవలసిందిగా 1813లోనే బ్రిటిష్ పార్లమెంటు ఆదేశించినప్పటికీ, కంపెనీ పాలకులాసొమ్మును సరిగా ఖర్చు పెట్టడం లేదని, పాఠ్యపుస్తకాలుకూడా సరిగా లేవని వివరిస్తూ 1820లో వెన్నెలకంటి సుబ్బారావు (సదర్ అదాలత్ కోర్టులో) ఇంటర్‌ప్రిటర్) మద్రాస్‌లోని స్కూల్ బుక్ సొసైటీవారి కొకలేఖ వ్రాశాడు

రాష్ట్రంలోని వీధి బడులలో నేర్పే విద్యతోపాటు, ప్రైవేట్ పాఠశాలల్లో నేర్పుతున్న విద్యకూడా ఎలా వుందో తెలుపవలసిందిగా మద్రాసు గవర్నర్ సర్ థామస్ మన్రో 1822లో జిల్లా కలెక్టర్లను కోరాడు. అంతట వారు అందజేసిన నివేదికలు జూచి అసంతృప్తి

చెందిన గవర్నర్ 1826లో "కమిటీ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్" అనే విద్యాభివృద్ధి సంఘాన్ని నెలకొల్పాడు దాని ఖర్చుల కొరకు సాలుకు నాలుగువేల రూపాయల చొప్పున కేటాయించి, అందులో ఏడువందల రూపాయలు మద్రాస్ స్కూలు బుక్ సొసైటీకి ప్రత్యేకించాడు

మద్రాసులో క్రైస్తవ మిషనరీలు స్థాపించిన పాఠశాలలు మతాంతరీకరణకు ప్రోది చేయడంవల్ల ఆందోళన చెందిన వెంబాకం రాఘవాచార్యులు (మేజిస్ట్రేట్), ఏనుగుల వీరాస్వామయ్య (హైకోర్టులో తెలుగు తర్జుమాదారు), కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లై మున్నగు ప్రముఖులు కలిసి హిందూ లిటరరీ సొసైటీని స్థాపించారు కొన్ని పాఠశాలలు ప్రారంభించారు వాటిలో చేరిన బాల బాలికలకు ముఖ్యంగా ఇంగ్లీషు, లెక్కలు, సైన్సు బోధించారు కొంచెం ఇంగ్లీషు నేర్చుకున్న వాళ్లకు జార్జి నార్టన్ (అడ్వకేట్ జనరల్) స్వయంగా రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయాలపైన సరళమైన రీతిలో ఉపన్యాసా లిచ్చేవాడు కాబట్టి ఆయన ఉపన్యాసాలు వినేందుకు ఇంగ్లీషు తెలిసినవారు చెవి కోసుకునేవారు

కనుక ఇంగ్లీషు భాషపైన, సైన్సుపైన ప్రజల మక్కువ పెరిగింది శ్రీనివాసపిళ్లై, గాజుల లక్ష్మీనరుసు సెట్టి మున్నగువారు పూనుకొని, మద్రాసులో ఒక కాలేజీని నెలకొల్పవలసిందిగా గవర్నరును అర్థిస్తూ ఒక మహజరును తయారుజేశారు దానిపైన 70 వేల మందితో సంతకాలు చేయించి, జార్జి నార్టన్‌ద్వారా గవర్నరుకు అందజేశారు

1835లో మెకాలే విద్యావిధానాన్ని అంగీకరించిన కేంద్ర ప్రభుత్వం సూచించిన విధంగా ఇంగ్లీషు విద్యను, ప్రకృతి శాస్త్ర విజ్ఞానమును విస్తరింపజేయవలెననే ఉద్దేశ్యం గవర్నర్ ఎల్ఫిన్‌స్టనుకు వుండేది కనుక మద్రాసులో కాలేజీని నెలకొల్పేందుకు అంగీకరించాడు 1839లో జార్జి నార్టన్ అధ్యక్షతన మద్రాస్ యూనివర్శిటీ బోర్డు ఏర్పడింది 1841లో మద్రాసు యూనివర్శిటి అనే పేరుతో ఒక ఇంగ్లీషు హైస్కూలును ప్రారంభించారు క్రమంగా ఆ హైస్కూలు కాలేజీగా వృద్ధి పొందింది 1857లో మద్రాస్, బొంబే, కలకత్తా యూనివర్శిటీలు స్థాపించబడినాయి

ధర్మకార్యముల కొరకు పచ్చియ్యప్ప మొదలియార్ మరణశాసనంలో కేటాయించిన 6 లక్షల రూపాయలను ఆయన వారసులు దిగమింగారన్న విషయం లిటరరీ సొసైటీవారికి తెలిసింది కనుక హెర్బర్టు కాంప్టన్ సహాయంతో కోర్టుద్వారా ఆ మొత్తాన్ని స్వాధీనం చేసుకున్నారు ఆ డబ్బుతో 1842లో పచ్చియ్యప్ప విద్యాలయాన్ని స్థాపించారు. దానికి అనుబంధంగా ఆడపిల్లల పాఠశాలను నెలకొల్పేందుకు శ్రీనివాసపిళ్లై 75 వేల రూపాయల విరాళమిచ్చాడు అలా ప్రారంభమైంది నేటి పచ్చియ్యప్ప కళాశాల

విద్యావ్యాప్తి జరిగినంతమాత్రాన చాలదని, ప్రజలు కష్టనివారణ కొరకు కృషి జేయడం అవసరమని జార్జి నార్టన్, గాజుల లక్ష్మీనరుసు సెట్టి ప్రభృతులు భావించారు

## మద్రాసు నేటివ్ అసోసియేషన్

1844 లో లక్ష్మీనరుసు సెట్టి అధ్యక్షతన మద్రాసు నేటివ్ అసోసియేషన్ స్థాపించబడింది అందులో పలువురు వర్తకులు, మేధావులు సభ్యులుగా చేరారు

సెట్టి చాలా సమర్థుడు రాజకీయ చైతన్యంగలవాడు. ప్రైవేట్‌గా ఇంగ్లీషు నేర్చుకున్నాడు సిద్ధులు సెట్టి అండ్ కంపెనీ ప్రొప్రయిటర్‌గా ఎగుమతి దిగుమతి వ్యాపారం చేసి బాగా ఆర్జించాడు. అలా ఆర్జించినదంతా ప్రజల క్షేమంకొరకు ఖర్చుచేశాడు. 1844లో 'క్రెసెంట్' అనే ఇంగ్లీషు పత్రికను ప్రారంభించి, దాని సంపాదకుడుగా హార్లేని

నియమించాడు ఆ పత్రికద్వారా మిషనరీల నెదుర్కొన్నాడు ప్రజలకష్టాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చాడు

1846లో లక్ష్మీనరుసు సెట్టి అధ్యక్షతన మద్రాసులో మొట్టమొదటి రాజకీయ సభ జరిగింది ఆ సభలో అంగీకరింపబడిన వినతిపత్రంమీద 12 వేల మంది సంతకాలు చేసి బ్రిటిష్ పార్లమెంటుకు పంపారు కనుక కంపెనీ అధికారులు కక్షౖరజేశారు సెట్టిగారికి అనేక చిక్కులు కల్పించారు అయినా ఆయన జంకలేదు

సహృదయులైన జార్జి నార్టన్, జాన్ బ్రూస్ నార్టన్, న్యాయమూర్తి లెవిన్‌వంటి వారి సహాయం లక్ష్మీనరుసు సెట్టికి దండిగా లభించింది కనుక ఆయన లార్డ్ ఎలెన్‌బరో, లార్డ్ ఆల్బమెరల్, జాన్ బ్రైట్, డెన్బీ సేమర్‌లాంటి బ్రిటన్ పార్లమెంటు సభ్యులతో స్నేహ సంబంధాలు పెంచుకోగలిగాడు వారిద్వారా బ్రిటిష్ పార్లమెంటుకు వినతిపత్రాలు పంపి, కంపెనీ పాలకుల దుష్టచర్యలను వెల్లడించగలిగాడు

వినతిపత్రాలలో రైతుల కష్టాలు, నీటి వనరులు, రోడ్లు, మోతర్ఫా పన్ను, అధిక శిస్తులు, చేనేత పనివారి దుస్థితి, క్రైస్తవ మిషనరీల అక్రమాలు మున్నగువాటికి సంబంధించిన వివరాలుండేవి కాగా వాటిని చదివి జాన్ బ్రైట్ చాలా బాధపడ్డాడు "పశువుల మేతకు పనికి వచ్చే బంజరు భూమిలా ఇండియాను మన ఆంగ్లేయులు ఉపయోగించుకుంటున్నారు" అంటూ పార్లమెంటులో నిశితంగా విమర్శించాడు మరొక పార్లమెంటు సభ్యుడు డెన్బీ సేమర్ 1852లో ఇండియాకు వచ్చి, లక్ష్మీనరుసు సెట్టితో కలిసి, మద్రాసు ప్రెసిడెన్సీలోని కొన్ని గ్రామాలను చూచి వెళ్లాడు తాను చూచిన ఘోరకృత్యాలను గురించి బ్రిటిష్ పార్లమెంటులో మాట్లాడుతూ.

"శిస్తులు కట్టలేని రైతులను మండుటెండలో వంగబెట్టి వారి వీపులమీద బండలెత్తడం, చేతివేళ్ళ గోళ్ళలో సూదులు గ్రుచ్చడం, తలను కాళ్లను కలిపి కట్టి చెట్టుకు వ్రేలాడగట్టడం, మోకాలి మడతల్లో కంకరరాళ్లుబెట్టి నొక్కడం, కొరడాలతో బాదడం గాడిద తోకకు రైతు జుట్టును ముడివేసి బజార్లలో ఈడ్పించడంలాంటి ఘోరకృత్యాలు జరుగుతున్నాయి" అంటూ దుయ్యబట్టాడు

డెన్బీ సేమర్ వెల్లడించిన దురంతాలను గురించి విచారణ జరిపేందుకు పార్లమెంటు కమిటీ నియమించబడింది ఆ కమిటీవారు మద్రాసు వచ్చి విచారణ చేసి, డెన్బీ సేమర్ చెప్పినవన్నీ నిజమేనని అంగీకరించారు పైగా శిస్తులు కట్టలేని రైతుల నెత్తిన మలమూత్రాలు గుమ్మరిస్తున్నారని, వాళ్ల భుజాలమీద పాకీవాళ్లనెక్కించి వీధులవెంట తిప్పుతున్నారని, అన్నం, నీళ్ళు లేకుండా చీకటి గదుల్లో బంధించి హింసిస్తున్నారని వివరించిన నివేదికను పార్లమెంటుకు సమర్పించారు.

కాగా మద్రాసు నేటివ్ అసోసియేషన్‌మీద కంపెనీ అధికార్లు నిప్పులు చెరిగారు కనుక పలువురు నాటుకోటి చెట్టియార్లు, మరికొంతమంది ధనిక వర్తకులు అసోసియేషన్‌నుండి తప్పుకున్నారు అయినా బెంగాల్, బాంబే అసోసియేషన్లకంటే ఎక్కువగా ప్రజల కష్టాలను గురించి, ముఖ్యంగా రైతుల కష్టాలను గురించి పట్టించుకున్న కీర్తి గాజుల లక్ష్మీనరుసు సెట్టి అధ్యక్షతనగల మద్రాసు నేటివ్ అసోసియేషన్‌కు దక్కింది

## బ్రిటిష్ పెట్టుబడిదారుల దురాశ

ఎవరెంతగా విమర్శించినా లేక అర్థించినా లెక్కజేయకుండా బ్రిటిష్ ప్రభుత్వం కంపెనీ పాలనను 1853లో తిరిగి పొడిగించింది అలా పొడిగించడం బ్రిటిష్

పెట్టుబడిదారుల విస్తృత ప్రయోజనాలకొరకు రూపొందించిన వ్యూహానికి తగినట్లుగానే జరిగింది

1848లో ఫ్రాన్సులో వచ్చిన విప్లవం విఫలమైనప్పటికీ, ఆ విప్లవం ప్రపంచ పెట్టుబడిదారుల – ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడిదారుల కళ్లు తెరిపించింది

"పెట్టుబడినంతా ఇంగ్లండులో కేంద్రీకరిస్తే కార్మికవర్గం బాగా బలపడుతుంది అధికారాన్ని హస్తగతం చేసుకోగల శక్తిగా తయారవుతుంది కాబట్టి ఇండియా, ఆస్ట్రేలియా, అమెరికాలాంటి దేశాలలోకూడా పెట్టుబడులు పెట్టడం అవసరం అంతేగాక, వివిధ రంగాలకు పెట్టుబడిని విస్తరించడంకూడా అవసరమే అలాచేస్తే, వివిధ ఖండాలలోనున్న పెట్టుబడి కేంద్రాలలో దేనిపైన దాడి జరిగినా, ఇతర కేంద్రాల సహాయంతో అణచివేయవచ్చు" అని బ్రిటిష్ ప్రభుత్వం భావించింది

పెట్టుబడిదారుల వ్యూహాన్ని మార్క్సు, ఏంగెల్సులు గ్రహించారు ఇండియానుండి చైనా వరకుగల మార్కెట్లను పాశ్చాత్య పారిశ్రామిక వస్తువులతో నింపడానికిగల ప్రాముఖ్యతను కమ్యూనిస్టు మానిఫెస్టోలో వివరించారు తరువాత ఫ్రెంచి కమ్యూన్ విఫలంగావడానికి – బూర్జువా వర్గ విస్తరణకూగల సంబంధాన్ని కూడా అర్థం చేసుకున్నారు ఆ విషయాన్ని వివరిస్తూ 1852లో ఏంగెల్సు, మార్క్సుకు ఒక లెటరు వ్రాశాడు తిరిగి సవివరంగా మరో లెటర్ వ్రాశాడు దానికి జవాబుగా మార్క్సు ఇలా వ్రాశాడు

" ప్రపంచవ్యాప్తంగా మార్కెట్లను స్థాపించి, అందుకు అనుగుణమైన రీతిలో పారిశ్రామిక ఉత్పత్తిని పెంచడమే బూర్జువా సమాజంయొక్క ప్రత్యేక కర్తవ్యం ప్రపంచం గుండ్రంగా వుంది కాబట్టి చైనా, జపానులవరకూ మార్కెట్లను విస్తరించడంతోపాటు, కాలిఫోర్నియానుండి ఆస్ట్రేలియా వరకూ సాధించిన కాలనైజేషన్‌వల్ల బూర్జువా సమాజంయొక్క లక్ష్యం పూర్తయినట్లేనని భావించవచ్చు కాబట్టి మనకొక పెద్ద ప్రశ్న ఎదురవుతోంది అదేమిటంటే– యూరప్ ఖండంలో తప్పనిసరిగా సోషలిస్టు విప్లవం వస్తుంది కాని ఒక చిన్న ప్రాంతంలో విప్లవంవస్తే అది – ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తూ బలపడుతున్న బూర్జువా సమాజం చేతిలో – దెబ్బ తినకుండా మనగలుగుతుందా? అన్నదే ఆ ప్రశ్న" అన్నాడు మార్క్సు

"ఇండియా దేశపు ఉపరితలాన్ని బ్రిటిష్ స్టీమ్ (ఆవిరి ఇంజన్లు), సైన్సు (శాస్త్ర విద్య) పెకలించి వేశాయి వ్యవసాయానికి – వస్తూత్పత్తి పరిశ్రమకూ మధ్యగల సంబంధాన్ని త్రెంచివేశాయి భారత గ్రామీణ ఆర్థిక వ్యవస్థ వ్యవసాయం మీదను, అవసర వస్తువుల ఉత్పత్తి మీదను నిర్మింపబడింది రాట్నం, మగ్గం కీలకమైనవిగా వుండేవి కాని వాటిని బ్రిటిష్ దురాక్రమణదారుడు ధ్వంసం జేశాడు" అని మార్క్సు వివరించాడు

పట్టణాలలోనున్న చిన్న పరిశ్రమలు మూతబడుతోంటే, పట్టణ ప్రజలు పల్లెటూళ్లకు తరలివెళ్ళారు కనుక పల్లెటూళ్ళు క్రిక్కిరిసిపోయాయి గ్రామీణ ఆర్థిక వ్యవస్థ యొక్క సమతూకం భగ్నమైంది వ్యవసాయరంగంమీద ఒత్తిడి పెరిగింది నిర్దాక్షిణ్యంగా శిస్తులు, పన్నులు వసూలుజేసుకున్న ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధికి తోడ్పడలేదు 1850–51లో కంపెనీ ప్రభుత్వ రెవిన్యూ రాబడి 29 కోట్లు ఖర్చు 25 లక్షలు మాత్రమే కాబట్టి తక్కిన మొత్తమంతా బ్రిటనుకు చేరింది

"పాలనా వ్యయం, లాభం, వడ్డీల చెల్లింపుకొరకు ప్రతి ఏటా ఇండియా 7 కోట్ల 50 లక్షల రూపాయలు బ్రిటనుకు చెల్లిస్తున్నది ఇదిగాక, ఇంగ్లీషు వ్యాపారులు, కంపెనీ

ప్రభుత్వ అధికారులు మరికొంత మొత్తాన్ని ఇంగ్లండుకు పంపుతున్నారు ఈ ఆదాయాలు ఇంగ్లండులో పరిశ్రమల అభివృద్ధికి పెట్టుబడిగా ఉపయోగపడుతున్నాయి" (మార్క్సు, కాపిటల్ వాల్యూమ్-3)

"ఎదురులేని ఆధిక్యతగల బ్రిటిష్‌వారు ఇండియాను ఆక్రమించి ఇండియనుల నాగరికతకు మూలమైన ప్రజాసంస్థలను, పరిశ్రమలను ధ్వంసం చేశారు ఇండియనుల గొప్పదనానికి కారణమైన వాటినన్నింటినీ నేలమట్టం చేశారు ఇండియాలో బ్రిటిష్ పాలనకు సంబంధించిన చరిత్ర పుటలను తిరగేస్తే, విధ్వంసం తప్ప మరేదీ కనిపించదు పునర్నిర్మాణమేదైనా ప్రారంభమైతే, అది అనేక శిధిలాలమధ్య కనిపించీ, కనిపించకుండా వుంది అయినా ఇండియాలో పునర్నిర్మాణానికి తగిన అవకాశం కలుగుతుందని చెప్పవచ్చు" (మార్క్సు, న్యూయార్కు డైలీ ట్రిబ్యూన్)

దేశమంతా కంపెనీ పాలనలోకి రావడం, టెలిగ్రాఫ్ సిస్టమ్ ఏర్పాటు కావడం, ఇంగ్లండు-ఇండియాలమధ్య నావికా యానం పెరగడం, కంపెనీ ప్రభుత్వానికి అవసరమైన ఉద్యోగులకొరకు ఇంగ్లీషు పాఠశాలలు ప్రారంభించడం, కంపెనీ సైన్యంలో అత్యధిక సంఖ్యలో భారత సిపాయీలు వుండడం 1835లో ఇండియన్ జర్నలిస్టులు పత్రికా స్వాతంత్ర్యాన్ని సాధించుకోగలగడంవంటి వాటిని మార్క్సు నిశితంగా పరిశీలించగలిగాడు

"ఇండియాలో పండుతున్న పత్తిని, లభిస్తున్న యితర వస్తువులను చౌకగా కాజేసేందుకు ఇంగ్లీషు పారిశ్రామికులు ఇండియాలో రైలు మార్గాల నిర్మాణం ప్రారంభించారు కాని రైలు ఇంజన్లను ఇండియాలో ప్రవేశపెట్టిన తరువాత, విస్తరించే రైలు మార్గాల నిర్మాణానికి, వాటి మరమ్మత్తులకు అవసరమైన కార్ఖానాలను ఇండియాలో నెలకొల్పక తప్పదు ఇనుము, బొగ్గు అపారంగాగల ఇండియాలో ఇతర ఫ్యాక్టరీల స్థాపనకు రైల్వే కార్ఖానాలు దోహదం చేస్తాయి. అందువల్ల ఇండియాలో సంప్రదాయసిద్ధంగా వస్తున్న 'కూలి విభజన' అంతరిస్తుంది నూతన కార్మికవర్గం అవతరిస్తుంది-- కాని ఫ్యాక్టరీల నిర్మాణం నూతన కార్మికవర్గ ఆవిర్భావం జరిగినంత మాత్రాన, వాటి ఫలితాన్ని ఇండియనులు పొందలేరు బ్రిటన్‌లోని ధనికవర్గాన్ని బ్రిటిష్ కార్మికవర్గం గద్దెనుండి దింపినప్పుడు, లేదా ఇండియనులు తమంతట తామే బలపడి ఇంగ్లీషువారి పాలనను అంతం చేసినప్పుడు మాత్రమే, పరిశ్రమల స్థాపనవల్ల కలుగగల ఫలితాలను ఇండియనులు పొందగలరు" అని మార్క్సు వ్రాశాడు

అలా మార్క్సు వ్రాసిన సమయంలోనే, రవాణా మార్గాల అభివృద్ధిని గురించి వివరిస్తూ గవర్నర్ జనరల్ డల్హౌసి యిలా మురిసిపోయాడు.

"ఇండియా యిప్పటికే చెప్పుకోదగినంతగా పత్తిని పండిస్తోంది కాని ఇంగ్లండు యింకా అధికంగా కావాలంటోంది దేశంలోని మైదానాలనుండి ఓడరేవుల వరకూ రైలు రోడ్డు రవాణా మార్గాలను నిర్మిస్తే, ఇంగ్లండుకు అవసరమైనంత నాణ్యమైన పత్తిని ఇండియా ఎగుమతి చేయగలదు ఓడరేవులకు దూరంగానున్న మార్కెట్లకు సహితం, యూరప్‌లో తయారైన వస్తువులను సరఫరా జేసేందుకు తగిన చర్యలు తీసుకోబడుతున్నాయి . ఎవరూ ఊహించలేనంత విస్తృతంగాను, లాభదాయకంగాను, భూగోళంలోని ఈవలివైపున మన మార్కెట్లు తెరువబడుతున్నాయి" (లార్డ్ డల్హౌసి - మినిట్సు ఆన్ రైల్వేస్ 1853)

# ప్రథమ స్వాతంత్ర్య సమరం

"ఇండియా ఖర్చుతో, ఇండియనులే సిపాయిలుగానున్న ఇండియన్ సైన్యమే ఇండియాను ఇంగ్లీషువారి బానిసత్వంలో అణచివుంచుతోంది" అని 1853లో మార్క్స్ వివరించాడు

ఆనాడు కంపెనీ ప్రభుత్వ సైన్యంలో 2 లక్షల 23 వేల మంది భారత సిపాయిలుండేవారు బ్రిటిష్ సోల్జర్సు 45 వేల మంది మాత్రమే వుండేవారు అయినా బ్రిటిష్ అధికారుల ఆజ్ఞానుసారం సిపాయిలు పోరాడేవారు కాని, తమ సంప్రదాయాలకు భంగం కలిగినప్పుడు తిరగబడేవారు

1780లో విశాఖపట్టణంలో సిపాయిలు తిరగబడి, బ్రిటిష్ అధికార్లలో కొందరిని చంపారు కాని, పలువురు తమ ప్రాణాలు కోల్పోయారు స్థానిక సర్వీసుల కొరకు రిక్రూట్ చేయబడిన గుంటూరు సిపాయిలు మైసూరు వెళ్లడానికి నిరాకరించారు.

"బొట్టు పెట్టుకోవద్దు, గడ్డాలు గొరిగించి టోపీలు పెట్టుకోండి" అని 1806లో బ్రిటిష్ సేనానులు ఆజ్ఞాపించినప్పుడు రాయవెల్లూరు సిపాయిలు తిరగబడి సైన్యాధిపతిని చంపారు కాని, పలువురు కాల్చి వేయబడ్డారు మచిలీపట్నంలో తిరగబడిన నలుగురు సిపాయిలు ఫిరంగి కాల్పులకు గురయ్యారు ఆ స్థితిలో మద్రాసు ప్రెసిడెన్సీలోని సిపాయిలందరూ తిరుగుబాటుకు సిద్ధమయ్యారు కనుక బ్రిటిష్ సేనానులు కొంత వెనకడుగువేశారు

మద్రాసు ఆర్మీలోని 34వ పటాలం 1844లోను, 22వ పటాలం '49లోనూ; 60వ పటాలం '50లోనూ, 38వ పటాలం '59లోను తిరుగుబాటు చేశాయి – 1806, 1812, 1827, 1855 సంవత్సరాలలో హైద్రాబాద్‌లోని పటాలాలు తిరగబడ్డాయి

1824లో జరిగిన బర్మా యుద్ధంలో పాల్గొనడానికి నిరాకరించిన 47వ బెంగాల్ దళాన్ని బ్రిటిష్ అధికారులు శిక్షించి, పిమ్మట రద్దుజేశారు 1844లో బెంగాల్ సైన్యంలోని 7 బెటాలియనులు తిరుగుబాటు చేశాయి. అలా ఎక్కడ తిరుగుబాటు చేసినా అనేకమంది సిపాయిలు ఆత్మార్పణ జేయవలసి వచ్చింది

సిపాయిలలో సంఘీభావాన్ని పెంపొందించి, ఏకముఖంగా తిరుగుబాటు చేయిస్తే బ్రిటిష్‌వారి పీడ విరగడవుతుందని కొందరు దేశభక్తులు భావించారు. తాంతియా తోపే, మౌల్వీ అహమ్మద్ షా మున్నగువారు సిపాయిలతో రహస్య సంబంధాలు పెట్టుకున్నారు. తక్కెడతోపాటు తుపాకినిదెచ్చి ఇండియాను ఆక్రమించారని, బైబిల్‌తోపాటు బాకు పుచ్చుకొని ఇండియనుల మతధర్మాలను నాశనం చేస్తున్నారని ప్రచారం చేశారు సిపాయిల తిరుగుబాటులో ప్రజలు పాల్గొంటారని, కొందరు సంస్థానాధీశులుకూడా చేతులు కలుపుతారని నచ్చజెప్పారు

సిపాయిలెంతకాలం సర్వీసులోవున్నా సార్జెంటు పదవితో సరి. జీతభత్యాలు తక్కువ పూరి గుడిసెల్లో కాపురం – యుద్ధంవస్తే, ముందుపీఠీన నిలబడి పోరాడాలి బ్రిటిష్ సోల్జర్లు మాత్రం ఫిరంగి దళాలలో వుండేవారు. పైపదవుల్లో నియమింపబడేవారు కుటుంబాలతోపాటు బంగళాలలో నివసించేవారు దండిగా జీతాలు, పెన్షన్లు పుచ్చుకునేవారు కాగా సిపాయిల అసంతృప్తి క్రమంగా కక్షగా మారింది

"హిందూమత ధర్మం ప్రకారం సముద్రయానం నిషిద్ధం కనుక నల్లమందు యుద్ధంలో పాల్గొనేందుకు ఓడలెక్కి చైనాకు వెళ్లలేము" అని విన్నవించిన సిపాయీలను 1856 లో ఫిరంగి మూతులకు కట్టి బ్రిటిష్ సేనానులు కాల్చివేశారు ఈ పైశాచిక చర్యవల్ల సిపాయీల గుండెలు మండాయి

ఎన్‌ఫీల్డ్ తుపాకుల తూటాలపైన ఆవుకొవ్వు పూశారని హిందూ సిపాయీలలోను, పంది కొవ్వు పూశారని ముస్లిం సిపాయీలలోను ప్రచారం జరిగింది కాగా 1857 మార్చిలో బారక్‌పూర్ సిపాయిలు కొవ్వు తూటాలను ఉపయోగించేందుకు నిరాకరించారు వెంటనే బ్రిటిష్ సోల్జర్లు కవాత్ మైదానంలోకొచ్చారు వారిని చూడగానే మహావీరుడు మంగళపాండ్యా బ్రిటిష్ సేనానులమీద కురికాడు ఒకరిని చంపి, మరొకరిని గాయపరిచాడు కాని, పట్టుబడిపోయి ఉరికంబమెక్కాడు ఆయనతోపాటు మరొక సుబేదారుకూడా అశువులు బాశాడు పరిస్థితి ప్రమాదకరంగా మారింది అయినా సిపాయిలు కొవ్వు తూటాలను ముట్టుకోలేదు ఇక లాభం లేదనుకున్న బ్రిటిష్ సేనానులు బారక్‌పూర్, బర్హన్‌పూర్ సిపాయీల నందరినీ డిస్మిస్ చేశారు

ఆ వార్త విని అంబాలా, లక్నో మున్నగుచోట్లగల సిపాయిలు కంపెనీ ఆఫీసులను, అధికారుల భవనాలను తగులబెట్టారు కనుక సిపాయీల పనిబట్టేందుకు కంపెనీ అధికారులొక పథకం వేశారు

సిపాయిలు మరొక పథకం పన్నారు 1857 జూన్ 23న, ప్లాసీ యుద్ధ విజయపు శతవార్షికోత్సవాన్ని కంపెనీ పాలకులు జరుపుకునే సమయంలో, దేశమంతటా విప్లవ ధ్వజమెత్తాలని నిర్ణయించుకున్నారు "ఆనాడు బ్రిటిష్‌వారంతా తాగి తందనాలు తొక్కుతుంటారు గాబట్టి విజయం తథ్యం ఒకవేళ యుద్ధం కొనసాగినా వేసవి గాడ్పుల్లో నిలబడి బ్రిటిష్ సోల్జర్లు పోరాడలేరు" అని విశ్వసించారు కాని, తలవని తలంపుగా మేనెల 10న మీరట్‌లో తిరుగుబాటు జరిగింది.

## మీరట్ తిరుగుబాటు

కొవ్వు తూటాలను వాడేందుకు మీరట్ సిపాయిలు నిరాకరించిన వెంటనే బ్రిటిష్ ఫిరంగిదళం రంగంలో దిగింది 85 మంది సిపాయీలను అరెస్టుచేసి పదేళ్ళ శిక్ష వేశారు అయినా త్వరపడితే, జూన్ 23న జరపదలచుకున్న పథకం భగ్నమవుతుందని తక్కిన సిపాయిలు వూరుకున్నారు.

జూన్ 23 పథకం ప్రజలకు తెలియదు కనుక కవాత్ మైదానంనుండి బారక్సుకు వెళుతున్న సిపాయీలను ప్రజలు అడ్డగించారు. "ఎంతకాలమిలా బ్రతుకుతారు?" అని ప్రశ్నించారు. "తోటి సిపాయీలను అవమానించి శిక్షించిన తెల్లవాళ్లను కాల్చి పారేయకుండా, పిరికిపందల్లా వెనుదిరుగుతారా?" అని తిట్టిపోశారు "మీరూ మేమూ కలిసి తిరగబడితే బ్రిటిష్‌వాళ్ళు మట్టి కరుస్తారు" అని ఉసిగొలిపారు ఆ రాత్రంతా సమావేశాలు జరిగాయి మర్నాడు తెల్లవాళ్ళ ఇళ్లకు పనివాళ్లెవరూ వెళ్లలేదు బ్రిటిష్ ఆఫీసర్లు, సోల్జర్లు చర్చికి వెళ్లారు వెంటనే సిపాయిలు, ప్రజలు కలిసి ఆయుధాగారంమీద దాడిచేసి ఆయుధాలను చేజిక్కించుకున్నారు జైళ్ళలోవున్న తమవారిని విడిపించుకున్నారు పట్టణం విడిచిపోదలచిన బ్రిటిష్‌వాళ్ళను విడిచిపెట్టారు ఎదురు తిరిగిన వాళ్ళను మట్టుబెట్టారు మీరట్ కంటోన్మెంటు సిపాయీల వశమైంది కనుక ఢిల్లీ కోటను

పట్టుకునేందుకు మే 11న బయల్దేరారు దారిలో రైతుల తోడ్పాటు వారికి దండిగా లభించింది

మీరట్ సిపాయిలతో ఢిల్లీ సిపాయిలు చేతులు కలిపారు పట్టణ ప్రజలు జేజేలు పలుకుతూ స్వాగతం చెప్పారు ఢిల్లీ పట్టణంతోపాటు ఎర్రకోటకూడా సిపాయిల స్వాధీనమైంది కెప్టెన్ డగ్లస్, కలెక్టర్ హచ్చిన్‌సన్ మున్నగువారిని సిపాయిలు చంపేశారు ఇంగ్లీషువాళ్ళ భవనాలను తగులబెట్టారు

సిపాయిలలో అత్యధికులు హిందువులు, అయినా వారు మతభేదాలకు లోనుగాలేదు నామమాత్రపు మొగల్ పాదుషాగానున్న బహదూర్‌షాను గద్దె నెక్కించాలనుకున్నారు అయినా 80 ఏళ్ళ వృద్ధుడు, బలహీనుడు అయిన బహదూర్ షా అందుకు అంగీకరించలేదు కాని, ఆయన భార్య చెప్పిన వీర వచనాలు విని, కొడుకుల ఉత్సాహం జూచి సింహాసనమధిష్టించాడు 21 ఫిరంగులు మ్రోగాయి జయజయధ్వానాలు చెలరేగాయి

వెంటనే బహదూర్ షా గోవధను నిషేధించాడు దేశాన్ని పాలించాలనే దుర్బుద్ధి తనకు లేదని, అందరూ కలిసి చక్రవర్తినిగాని, పాలక మండలినిగాని ఎన్నుకోవడం అవసరమని గ్వాలియర్, పాటియాలా మున్నగు రాజులకు జాబులు వ్రాసి దూతలను పంపాడు అయినా ఆ మహారాజ బిరుదాంకితులు బహదూర్ షా కోర్కెను మన్నించలేదు, సిపాయిలకు అండగా నిలబడనూలేదు

కాని హిందూ ముస్లిమ్ ప్రజలు – ముఖ్యంగా రైతులు సిపాయిలతో కలిసి పోరాడారు అయోధ్య, బుందేల్‌ఖండ్ ప్రాంతాల రైతులు ప్రభుత్వ కార్యాలయాలమీద, జమీందార్ల భవనాలమీద దాడిచేసి వాటిని స్వాధీనం చేసుకున్నారు వాటి రక్షణ కొరకు సాయుధ దళాలను నిర్మించారు ఇతర కేంద్రాలలోనున్న బ్రిటిష్‌వారికి ఆహార పదార్థాలు అందకుండా నిరోధించారు

ప్రజల సహాయంతో సిపాయిలు మే 21న ఆలీఘర్‌ను స్వాధీనం చేసుకున్నారు మే 31 నాటికి లక్నో, బరైలీ పట్టణాలను, జూన్ 4న కాన్పూరును, 6న అలహాబాదును విముక్తి చేశారు విముక్తి జేసిన పట్టణాలలో స్థానిక ప్రభుత్వాల నేర్పరిచారు కనుక మీరట్, ఢిల్లీ, లక్నో మున్నగు ప్రాంతాలలో బ్రిటిష్ కంపెనీ పాలన అంతమైంది

"ఒకవైపున ఇది సిపాయిల తిరుగుబాటు, మరోవైపున ప్రజల పోరాటం ఈ రెండూ కలిసి ఒక సాంఘిక విప్లవంగా సంలీనమయ్యాయి కేవలం సిపాయిల తిరుగుబాటే దీనికి కారణమని వాదించడమంటే, చిరకాలంగా ఇండియాలో సాగుతున్న దుష్టపరిపాలనను మరుగుపరచడమే అవుతుంది" అని సర్ రాబర్టు గార్డినర్, బ్రిటిష్ పార్లమెంటుకు పంపిన నివేదికలో వివరించాడు

అయినా పరిస్థితి వక్రీకరించింది మీరట్ తిరుగుబాటు విషయం తెలియగానే పాట్నా, కలకత్తా మున్నగుచోట్లనున్న సిపాయిల ఆయుధాలను బ్రిటిష్ అధికారులు లాగేసుకున్నారు కనుక లక్షా నలభైవేలమంది సిపాయిలు పళ్లు కొరుకుతూ కూర్చోవలసి వచ్చింది

ఢిల్లీ విముక్తి వార్త తెలియగానే పంజాబ్, సరిహద్దు రాష్ట్రాలలోనున్న బ్రిటిష్ సేనానులు జాగ్రత్తపడ్డారు. ధనపు సంచులు గుమ్మరించి, పఠాన్ నాయకులను కూడగట్టుకున్నారు. మొఘల్ పాదుషాల వారసుడైన బహదూర్ షాను బ్రతకనిస్తే, సిక్కుల

గతి అధోగతి కాగలదని ప్రచారం జేశారు అయినా నమ్మకంలేక పెషావర్, లాహోర్ కేంద్రాల్లోని సిపాయీల ఆయుధాలను తీసివేసుకున్నారు

## సంస్థానాధీశుల ద్రోహం

పెషావర్‌లో సిపాయీల ఆయుధాలను బ్రిటిష్‌వారు గుంజుకున్న వార్త తెలియగానే 'హోఢీమర్దన్' కేంద్రంలోని సిపాయీలు తిరగబడ్డారు నలువైపులనుండి చుట్టుముడుతున్న బ్రిటిష్ సోల్జర్సును చెదరగొట్టి కాశ్మీర్‌లో ప్రవేశించారు కాని కాశ్మీర్ మహారాజు వేయిమంది సిపాయీలను చంపించి తెల్లదొరల మెప్పు పొందాడు

'అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న' అన్నట్లుగా, నాభా సంస్థానాధిపతి తన సైన్యాన్ని బ్రిటిష్‌వారికి అండగా పంపించాడు ఆ విషయం తెలియగానే జలంధర్, పిల్లూరు కేంద్రాల సిపాయీలు నాభా సంస్థాన సైన్యాన్ని అడ్డగించి మట్టుబెట్టారు తరువాత సట్లెజ్ నదిని దాటి లూథియానాను స్వాధీనం చేసుకున్నారు ఫిరోజ్‌పూర్ సిపాయీలు బ్రిటిష్ సోల్జర్సును తరిమివేసి ఢిల్లీ వెళ్లారు అలా అనేక సిపాయి పటాలాలు ఢిల్లీ వెళ్లడంవల్లను, సిక్కు సంస్థానాధీశులు బ్రిటిష్‌వారితో చేతులు కలపడంవల్లను, పంజాబ్ రాష్ట్రంలో సిపాయి విప్లవం సమసిపోయింది

ఉత్తరాదిన సిక్కు సంస్థానాధీశులు, కాశ్మీర్ మహారాజు మున్నగువారు ద్రోహం చేస్తే, దక్షిణాదిన నైజాం నవాబ్ ద్రోహం చేశాడు జూన్ 17న మౌల్వీ అల్లావుద్దీన్, తోర్బజ్‌ఖానుల నాయకత్వాన హైదరాబాద్ పట్టణ ప్రజలు, రోహిల్లాలు కలిసి బ్రిటిష్ రెసిడెన్సీమీద దాడి చేశారు అది సహించలేని నవాబ్ అరబ్ సైనికులను పంపి ప్రజల దాడిని చెదరగొట్టాడు అక్కడికి తృప్తిలేక తోర్బజ్‌ఖానును తుపాకి గుళ్ళకు ఎరజేసి ఆయన శవాన్ని ఉరికంబానికి వేలాడదీయించాడు మౌల్వీ అల్లావుద్దీనుకు యావజ్జీవ శిక్షవేసి అండమాన్ దీవులకు పంపాడు

అలా నైజాం నవాబ్ తమకు అండగా వున్నందున ఔరంగాబాద్‌లోని సిపాయి దళాలను మీరట్‌కు పంపేందుకు బ్రిటిష్ సేనానులు పూనుకున్నారు కాని సిపాయీలు నిరాకరించారు ఆ వ్యతిరేకతను సహించలేని బ్రిటిష్ సేనాని 24 మంది సిపాయీలను ఫిరంగులకు కట్టి కాల్చివేశాడు ఒకరిని ఉరిదీయించి, 105 గురికి జైలు శిక్షలు వేశాడు అందువల్ల దక్షిణ భారతంలో కంపెనీ ప్రభుత్వానికి ఢోకా లేకుండా పోయింది

తమ సైనికులలో చాలామంది సిపాయీలతో చేతులు కలిపి పోరాడుతున్నప్పటికీ గ్వాలియర్, ఇండోర్ సంస్థానాధీశులు గోడమీది పిల్లివాటంగా కూర్చున్నందువలన మహారాష్ట్ర, గుజరాత్ ప్రాంతాలలో కూడా బ్రిటిష్‌వారికి ప్రమాదం కలగలేదు కనుక బొంబాయి ప్రాంతంలోని బ్రిటిష్ సోల్జర్లు ఝాన్సీ ప్రాంతానికి వెళ్లగలిగారు

## వీరవనితల శౌర్యం – బ్రిటిష్‌వారి క్రౌర్యం

1824లో కిట్టూరు మహారాణి చెన్నమ్మ బ్రిటిష్‌వారి నెదిరించి పోరాడినట్లే, 1857-58 సంవత్సరాలలో ఝాన్సీ మహారాణి లక్ష్మీబాయి, అయోధ్య నవాబ్ సతీమణి హజరత్ మహల్ బేగం పోరాడారు వారి శౌర్యగాథలు చరిత్రకెక్కాయి కాని, ప్రథమ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వేలాది సామాన్య స్త్రీల త్యాగమయ గాథలు చరిత్రలో సరిగా కనిపించడంలేదు అజీజాన్, మీనాకుమారీల త్యాగం మాత్రం కొద్దిగా కనిపిస్తోంది

అజీజాన్ మహారాణికాదు ఆమె ఒక నాట్యకత్తె పోరాటం ప్రారంభం కాకముందు ఆమె ఇల్లు విప్లవకారుల సమావేశ కేంద్రంగా వుండేది 1857 జూన్ 5న కాన్పూరు కోటను సిపాయీలు ముట్టడించినప్పటినుండీ ఆమె గుర్రాన్ని ఎక్కి తిరుగుతూ, సిపాయీలను ముట్టడికి పురికొలుపుతూ, సక్రమంగా సరఫరాలు అందజేస్తూ పోరాడింది అలా మూడు వారాలపాటు పోరాడిన పిమ్మట కాన్పూరు కోట విప్లవ సిపాయీల వశమైంది

కోటను సిపాయీలకు స్వాధీనం జేసేముందు బ్రిటిష్ సైన్యాధిపతి వీలర్ ఒక షరతు పెట్టాడు స్త్రీలు, పిల్లలతోసహా తమను అలహాబాదుకు సురక్షితంగా పోనిస్తే, రక్తపాతం లేకుండా కోటను స్వాధీనం జేస్తానన్నాడు ఆ షరతుకు నానాసాహెబ్ అంగీకరించాడు కాని బెనారస్, అలహాబాద్ ప్రాంతాలలో నరరూప రాక్షసుడు జనరల్ నీల్ సాగించిన మారణకాండకు గురైన ప్రజల విషాద గాథలు విని ఉడికిపోయిన సిపాయీలు, ప్రజలు కలిసి, స్త్రీలు పిల్లలతో సహా అనేకమంది ఆంగ్లేయులను చంపేశారు నానాసాహెబ్ అడ్డుపడినా లాభం లేకపోయింది

ఆ ఉదంతం విని మండిపోయిన బ్రిటిష్ సర్వ సేనాని కాంప్‌బెల్ జూలై 17న కాన్పూరును ముట్టడించాడు కొద్దిరోజుల్లోనే కాన్పూర్ అతని వశమైంది నానాసాహెబ్ సిపాయీలతోపాటు తప్పించుకొని బిదూర్‌వైపుగా వెళ్ళిపోయాడు అప్పుడు కాన్పూరులో జనరల్ నీల్ సాగించిన మారణకాండ వర్ణనాతీతం అజీజాన్ రహస్యంగా కాన్పూరులోనే వుండి బాధితులకు సేవజేసింది

కాన్పూరును పట్టుకున్న పిమ్మట జనరల్ కాంప్‌బెల్ లక్నోను పట్టుకునేందుకు తన సేనలను నడిపించాడు ఆ విషయం తెలియగానే తాంతియా తోపే దాడిచేసి కాన్పూరును తిరిగి స్వాధీనం చేసుకున్నాడు కాని, డిసెంబర్ 6న కాన్పూర్ మళ్ళీ బ్రిటిష్ సేనల వశమైంది ఇక లాభం లేదని వీరనారి అజీజాన్ ఆత్మహత్య చేసుకుంది

1857 సెప్టెంబర్ 15న బ్రిటిష్ సేనలు నాలుగువైపులనుండి ఢిల్లీని ముట్టడించాయి మొఘల్ చక్రవర్తి బహదూర్ షా భార్య జీనత్ మహల్ బేగంతోపాటు ఆమె పుత్రులుకూడా రణరంగంలో నిలబడి సిపాయీలను ఉత్సాహపరుస్తూ పోరాడారు 1857 మేలో చక్రవర్తి బాధ్యతలను స్వీకరించేందుకు వెనకాడిన తన భర్తకు ధైర్యం చెప్పిన వీరనారి జీనత్ మహల్ బేగం కాగా, రెట్టించిన సాహసంతో సిపాయీలు పోరాడారు బ్రిటిష్‌వారి ముప్పేటదాడి విఫలమైంది ముగ్గురు బ్రిటిష్ సేనాధిపతులు గాయపడ్డారు ఒకరు మరణించారు 66గురు సైనికోద్యోగులుకూడా మరణించారు 1100 మంది సైనికులు నేలకొరిగారు అయినా అదనపు సేనలను సమకూర్చుకొని, బ్రిటిష్ సేనానులు మళ్ళీ దాడి చేశారు సిపాయిలు ఎంత వీరోచితంగా పోరాడినా ఫలితం లేకపోయింది సెప్టెంబర్ 25న ఢిల్లీ బ్రిటిష్‌వారి స్వాధీనమైంది కనుక బ్రిటిష్ సైన్యాలు వారాల తరబడి ఢిల్లీని దోచుకున్నాయి అనేక వేలమంది అమాయక ప్రజలను ఊచకోత కోశాయి తైమూర్ దండయాత్రలోగాని, నాదిర్ షా దండయాత్రలోగాని జరగనంత విధ్వంసానికి ఢిల్లీ పట్టణం గురైంది

బహదూర్ షా కొడుకులలో ఇద్దరిని, ఒక మనుమడిని పట్టుకున్న జనరల్ హడ్సన్ వాళ్ల తలలు నరికి, వాటినొక పళ్లెంలోపెట్టి, వాటిపైన రుమాలు కప్పి "ఈస్టిండియా కంపెనీ మీకు ఇవ్వకుండా ఆపివేసిన నజరానా ఇదిగో తీసుకోండి" అంటూ బహదూర్ షా ముందు పెట్టాడు మానవులెవరూ అలాంటి పని చేయలేరు కాని, హడ్సన్ చేశాడు

ప్రతిఫలమనుభవించాడు లక్నో యుద్ధంలో సిపాయీల గుళ్ళు తగిలి మట్టికరిచాడు

ద్వీపాంతరవాస శిక్ష విధించి బహదూర్ షాను, ఆయన భార్య జీనత్ మహల్ బేగమును బర్మాలోని 'తంగూ' జైల్లో నిర్బంధించారు అక్కడే వారు మరణించారు వారి మూడో కొడుకు తప్పించుకొని మక్కాకు వెళ్లిపోయాడు మరో కొడుకు కుంటివాడై, ఫకీర్‌గా జీవించాడు అలా ముగిసింది మొఘల్ పాదుషాల వంశం

1857 మే నెల 30న లక్నోలో సిపాయీల తిరుగుబాటుకు అయోధ్య నవాబ్ భార్య హజరత్ మహల్ బేగమ్ నాయకత్వం వహించింది ఆ సమయంలో అయోధ్య నవాబ్ వజీర్ అలీషా బ్రిటిష్‌వారి నిర్బంధంలో వున్నాడు కనుక ఆ వీరనారి నాయకత్వం అవసరమైంది

లక్నో పట్టణం సిపాయీల వశమైంది కాని బ్రిటిష్‌వారంతా సర్ హెన్రీ లారెన్సు నాయకత్వాన రెసిడెన్సీలో వుంటూ ప్రతిఘటించారు కనుక సిపాయీలకు బ్రిటిష్ వారికి మధ్య నెలల తరబడి పోరాటం జరిగింది జూలై 4న హెన్రీ లారెన్సు బాంబు దెబ్బ తగిలి మరణించాడు అయినా రెసిడెన్సీలో వున్నవారు లొంగలేదు వారికి మద్దతుగా జనరల్ ఔట్రాం, జనరల్ హేవ్‌లాక్ సైన్యాలొచ్చి, లక్నో పట్టణాన్ని స్వాధీనం జేసుకునేందుకు ప్రయత్నించాయి కాని విఫలమయ్యాయి తరువాత తన సైన్యంతో జనరల్ నీల్‌కూడా వచ్చాడు అయినా సిపాయీలు లొంగలేదు

హజరత్ మహల్ బేగమ్ నాయకత్వాన సిపాయీల్లు పోరాడుతోంటే, మౌల్వీ అహమదుల్లా నాయకత్వాన రెండు లక్షల మంది లక్నో ప్రజలు సిపాయీలకు అండగా నిలబడ్డారు అప్పుడు జరిగిన పోరాటంలో మానవరూప రాక్షసుడు జనరల్ నీల్ హతమయ్యాడు కాగా బ్రిటిష్ సర్వసేనాధిపతి స్వయంగా లక్నో వచ్చాడు 9వేల మంది నేపాలీ సైనికులనుకూడా వెంట తీసుకొచ్చాడు అన్ని సైన్యాలను ఏకంజేసి 45 వేల మంది సైనికులతో దాడి చేశాడు అయినా హోరాహోరీగా పోరాటం నెలరోజులపాటు జరిగింది ఢిల్లీ పాదుషా కొడుకులను చిత్రవధచేసిన జనరల్ హడ్సన్ ఆ పోరాటంలో హతమయ్యాడు చివరకు 1858 మార్చి 19న లక్నో బ్రిటిష్‌వారి వశమైంది హజరత్ మహల్ బేగంతోపాటు సిపాయీలుకూడా తప్పుకొని బెరైలీలో ప్రవేశించారు

బ్రిటిష్ సేనలు రెండు వారాలపాటు పట్టణాన్ని దోచుకుంటూ హత్యాకాండ సాగించాయి అందుకు నొచ్చుకున్న గవర్నర్ జనరల్ కానింగ్ సిపాయీల పోరాట పటిమను, లక్నో ప్రజల సాహసాన్ని ప్రశంసించాడు

1858 మేలో బెరైలీ పట్టణంకూడా పతనమైంది కనుక సిపాయీలు హజరత్ మహల్ బేగం, మౌల్వీ అహమ్మదుల్లాల నాయకత్వాన షాజహాన్‌పూర్, బారీ ప్రాంతాలలో మోహరించారు అక్కడకూడా ఓటమి కలిగిన పిమ్మట, అనేక ప్రాంతాలలో నిలబడి ప్రతిఘటిస్తూ గెలుస్తూ ఓడుతూ ఉత్తరదిశగా వెళ్ళిన బేగం, చివరకు తన సిపాయీలతోపాటు నేపాల్ పర్వత శ్రేణులలో ప్రవేశించింది

అయినా ఆమె ఆత్మగౌరవం మొక్కబోలేదు 1858 నవంబర్ 1న ఈస్టిండియా కంపెనీ పాలనను రద్దుజేస్తూ, విక్టోరియా రాణి చేసిన ప్రకటనను హజరత్ మహల్ బేగం సవాల్‌జేసి ఖండించింది

హజరత్ మహల్ బేగం ఎంత ఆత్మగౌరవంతో పోరాడిందో, అంత మానవత్వాన్ని ప్రదర్శించింది లక్నోలో బ్రిటిష్ సోల్జర్సు జరిపిన ఘాతుక చర్యలకు ప్రతీకారం

చేయతలపెట్టిన సిపాయీలను వారించి, బ్రిటిష్ స్త్రీలను, పిల్లలను తన నివాసంలోకి రప్పించి కాపాడింది శత్రువులు చుట్టుముట్టినా బెదరక, కన్నకొడుకును వెంటబెట్టుకొని నేపాల్ పర్వత పంక్తులలో ప్రవేశించిన హజరత్ మహల్ బేగం అచటనే అదృశ్యమై పోయింది. అయినా ఆమె నేటికీ ఉత్తరప్రదేశ్ జానపద గేయాలలో సజీవంగా దర్శనమిస్తోంది

మృతనష్ట సిద్ధాంతంద్వారా ఝాన్సీ రాజ్యాన్ని కబళించిన బ్రిటిష్ అధికారులు లక్ష్మీబాయ్‌పట్ల అగౌరవంగా ప్రవర్తించారు అయినా లక్ష్మీబాయ్ సహనం వహించింది బ్రిటిష్‌వారి మీద యుద్ధం ప్రకటించిన సిపాయీలకు నాయకత్వం వహించేందుకు నిరాకరించింది హవల్దార్ గురుబక్ష్ నాయకత్వాన సిపాయీలు ఝాన్సీ కోటను ముట్టడించినప్పుడు, కోటలోని ఆంగ్లేయులకు ఆమె తన మందిరంనుండి రహస్య మార్గంద్వారా రొట్టెలు, కాఫీ పంపిందని కొందరు వ్రాశారు పంపలేదని కొందరు వ్రాశారు.

కోటను ముట్టడించడంతోగాని, అందులోనున్న బ్రిటిష్ సోల్జర్సును సిపాయీలు చంపడంతోగాని లక్ష్మీబాయ్‌కి సంబంధంలేదని బ్రిటిష్ అధికారి మార్టిన్ అంగీకరించాడు

అయినా తిరుగుబాటు చేశారనే నేరంమోపి, జనరల్ హ్యూరోజ్ 1853 మార్చి 23న ఝాన్సీ కోటను ముట్టడించాడు ఇక లాభం లేదనుకున్న లక్ష్మీబాయ్ సిపాయీలకు నాయకత్వం వహించింది ప్రజలందరినీ కూడగట్టి ఒక్క త్రాటిమీద నిలబెట్టింది బ్రిటిష్ సైన్యానికి ఆహారపదార్థాలు అందకుండాజేసింది కాని గ్వాలియర్, టెహ్రీ, ఘర్వాల్ సంస్థానాధీశులు పంపిన ఆహార పదార్థాలు బ్రిటిష్‌వారికందాయి కోటను రక్షించు కునేందుకు రాణి నాయకత్వాన సిపాయీలు ప్రాణాలకు తెగించి పోరాడారు అయినా కోట బ్రిటిష్ సేనల వశమైంది రాణి పురుషవేషంతో, ఎనిమిదేళ్ళ కొడుకును వీపుకు కట్టుకొని, గుర్రమెక్కి శత్రువలయాన్ని ఛేదించుకుంటూ కాల్పీకి బయలుదేరింది అప్పుడు వెంబడించిన బ్రిటిష్ సోల్జర్సును చిందరవందరజేసి, వారి సేనానిని ముక్కలుగా నరికింది

ఈలోగా విప్లవ సిపాయీలు గ్వాలియర్‌ను ఆక్రమించారు గ్వాలియర్ మహారాజు తన అనుచరులతోపాటు ఆగ్రాకు వెళ్లి బ్రిటిష్ వారి ఆశ్రయం పొందాడు గ్వాలియర్‌లో నానాసాహెబ్ ప్రతినిధిగా రావుసాహెబ్ అధికార బాధ్యతలు చేపట్టాడు తాంతియా తోపే సైనిక బాధ్యతలు స్వీకరించాడు కనుక ఝాన్సీరాణి గ్వాలియరుకువచ్చి, హ్యూరోజ్ సైన్యాన్ని నిలువరించింది బ్రిగేడియర్ స్మిత్ గుర్రపు దళాన్ని వెనక్కునెట్టింది కాని హ్యూరోజ్ సైనికులు గ్వాలియర్ కోటలో జొరబడగలిగారు కోటలోనున్న విప్లవ సిపాయీలు తప్పించుకుపోయారు ఝాన్సీరాణి మాత్రం-శత్రు వలయంలో చిక్కుబడిపోయింది ఆ వలయాన్ని ఛేదించి సిపాయీలతో కలవడానికి ఆమె తెగించి పోరాడింది ఎడాపెడా శత్రువులను నరుకుతూ కొంత దూరం పురోగమించింది అయినా ఆమెకు, ఆమె ఎక్కిన గుర్రానికికూడా కత్తి దెబ్బలు తగిలినందున తప్పించుకుపోలేకపోయింది దారిలో అడ్డంగావున్న ఒక కాలువను దాటలేక ఆమె గుర్రం వెనకడుగువేసిన సమయంలో ఒక బ్రిటిష్ సోల్జర్ విసిరిన కత్తి దెబ్బకు ఆమె కుడి చెంప తెగిపోయింది మరో దెబ్బ ఆమె రొమ్ముకు తగిలింది అయినా ఆ స్థితిలో కూడా ఆ బ్రిటిష్ సోల్జరును బలిగొన్నది తరువాత ఆ వీరనారీమణి శరీరం శత్రువులకు చిక్కకుండా, ఆమె అనుచరులు అగ్ని సంస్కారం చేశారు

బీహార్‌లోని దినాపూర్ సిపాయీలకు జగదీశ్‌పూర్ రాణా కుమార సింహుడు

నాయకత్వం వహించాడు ఆయన 80 ఏళ్ల వృద్ధుడు అయినా యుద్ధతంత్రం బాగా తెలిసినవాడు కనుక బెనారస్, ఆలంఘర్ ప్రాంతాలలో బ్రిటిష్ సైన్యాలనోడించాడు బ్రిటిష్‌వారు ఆక్రమించిన జగదీశ్‌పూరును తిరిగి స్వాధీనం చేసుకున్నాడు తుపాకీ దెబ్బ తగిలి ఊగిసలాడుతున్న తన కుడిచేతిని తానే స్వయంగా కత్తితో నరికి గంగానదిలో పారవేశాడు మరొకమారు జగదీశ్‌పూర్ మీదకు వచ్చిన బ్రిటిష్ సైన్యాన్ని ఓడించి, ఆ సైన్యాధిపతిని సంహరించి, అనేకమంది బ్రిటిష్ సైనికులను బలిగొన్నాడు కాని 1858 ఏప్రియల్ 26న స్వగృహంలోనే దివంగతుడయ్యాడు తరువాత ఆయన తమ్ముడు అమరసింహుడు మరొక ఏడాదిపాటు బ్రిటిష్ వారితో పోరాడాడు కాని ఫలితం పూజ్యమైంది కాగా శత్రువుల చేజిక్కడం ఇష్టంలేని జగదీశ్‌పూర్ రాణివాస స్త్రీలు 150 మంది అగ్నిగుండంలో దూకి అసువులు వీడారు కనుకనే "అదొక బ్రహ్మాండమైన విప్లవం కేవలం సిపాయీల తిరుగుబాటు మాత్రమేకాదు" అన్నాడు డాక్టర్ డఫ్

తాంతియా తోపే, బహదూర్ ఖానులు పట్టుబడి ఉరికంబాలెక్కారు మౌల్వీ అహమ్మద్ షాను వంచనతో హత్యజేసిన పావెన్ రాజు, బ్రిటిష్ వాళ్లనుండి యాభైవేల బహుమతి పొందాడు హజరత్ మహల్ బేగం, నానా సాహేబ్, అజ్మల్లాఖాన్‌వంటి యోధులు అజ్ఞాతవాసంలోనే అదృశ్యమైపోయారు మీనాకుమారివంటి యువతులు చిత్రహింసలకుగురై అసువులు వీడారు

ఆ సమయంలో సిపాయీలకంటే ఎక్కువగా రైతులు, యితరులు మరణించారు జనరల్ నీల్, జనరల్ హడ్సన్‌లాంటి కిరాతకుల బారిపడి ఎందరు మరణించారో లెక్కలేదు జనరల్ నీల్‌చే హత్య చేయబడినవారే పదివేలవరకూ వుంటారని చరిత్రకారులు వ్రాశారు అలహాబాద్, అయోధ్య మున్నగు ప్రాంతాలలోగల చెట్ల కొమ్మలకన్నింటికీ ప్రజలను వ్రేలాడగట్టి జనరల్ నీల్ ఉరిదీయించాడు పైగా రోజుల తరబడి ఆ శవాలను అలాగే వుంచాడు అందువల్ల గవర్నర్ జనరల్ కానింగ్, నీల్‌ను మందలించి అతని హెూదాను తగ్గించవలసి వచ్చింది అలాగే గ్రామాలను తగలబెట్టి స్త్రీలు, పిల్లలు, వృద్ధులతోసహా అనేకమంది ప్రజలను మంటల్లోకి తోసివేయడాన్నికూడా గవర్నర్ జనరల్ ఖండించాడు కాని ఆ పని బహిరంగంగా చేయలేదు వాటిని బహిరంగంగా ఖండించడం అవసరమని సలహా యిచ్చిన వారికి గవర్నర్ జనరల్ యిలా జవాబిచ్చాడు

"ఆ పని చేయను, ఎన్ని తిట్టినా పడతాను, కాని ప్రపంచం ముందు నా దేశాన్ని భయంకరంగా చిత్రించి అవమానపరిచే పని మాత్రం చేయలేను " ఆ విప్లవంవల్ల స్వతంత్ర సంస్థానాలుండవలసిన అవసరాన్ని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించింది సార్వభౌమాధికారాన్ని ప్రవేశపెట్టి, సంస్థానాధీశులను, ప్రజావిప్లవాలనుండి రక్షించే బాధ్యతను చేపట్టింది మృతనష్ట సిద్ధాంతంద్వారా గుంజుకున్న ధార్, కొల్హాపూర్ మున్నగు సంస్థానాలను ఆయా దత్తపుత్రులకు కట్టబెట్టింది కాగా సంస్థానాధీశులు బ్రిటిష్ వారి తొత్తులుగా మారారు

సిపాయి విప్లవం విఫలమవడానికి ప్రధాన కారణం అనేకమంది సంస్థానాధీశులు జేసిన ద్రోహం. పైగా సిపాయీలకు యుద్ధ వ్యూహం తెలియకపోవడం మరొక కారణం సిపాయీ పటాలాలనేకం ఢిల్లీలో నెలల తరబడి కూర్చొని, యితర ప్రాంతాలకు విప్లవాన్ని విస్తరించవలసిన అవసరాన్ని గుర్తించకపోవడంవంటి కారణాలు కూడా వున్నాయి

విప్లవం సమసిపోయినా ప్రజల క్రోధాగ్ని చల్లారలేదు నానాసాహేబ్ బంధువు రావుసాహేబ్ 1862లో హైదరాబాద్ చేరుకున్నాడు ఆయనకు రామరతన్‌జీ, రుక్మారెడ్డి

మున్నగువారు తోడ్పడ్డారు విప్లవ సేనను సమకూర్చుకునేందుకు వారొక పథకాన్నికూడా తయారుచేశారు కాని ఆ పథకం రూపుదాల్చకముందే నిజాం ప్రభుత్వానికి తెలిసిపోయింది. వెంటనే ప్రభుత్వాధికార్లు రంగంలో దిగి అనేకమందిని అరెస్టు చేశారు రుక్మారెడ్డికి యావజ్జీవ శిక్ష విధించి, మరొక 40 మందికి వివిధ రకాల శిక్షలు వేశారు రామరతన్‌జీని అరెస్టు చేయగానే ఆయన ఆత్మహత్య చేసుకున్నాడు రావుసాహెబ్‌తోపాటు కృష్ణారావు, మరొక యువతి తప్పించుకుపోయారు వారి వెంటబడిన నిజాం ప్రభుత్వ పోలీసులను ప్రజలు అడ్డగించడంవల్ల, వారికాపని సాధ్యమైంది కాని కొన్నాళ్ళ తరువాత రావుసాహెబ్ బ్రిటిష్‌వారికి పట్టుబడి కాన్పూరులో ఉరితీయబడ్డాడు

చాందా జిల్లాలోని అహీరా జమీందారు బాపూరామ్ తిరుగుబాటుచేసి ఉరి తీయబడ్డాడు ఆరేపల్లి జమీందారు వెంకట్రావు ద్వీపాంతర శిక్షకు గురయ్యాడు వీరిని గురించి తెలుగులో వ్రాసిన పాటలను అక్కడి ప్రజలు పాడుకుంటారు

గోదావరిజిల్లాలోని కారటూరు గ్రామాధికారి సుబ్బారెడ్డికి బ్రిటిష్‌వారి మీద పగ పెరిగింది కనుక నానాసాహెబ్ ఉత్తర భారతదేశాన్ని విముక్తిజేసి, దక్షిణాదికి సైన్య సమేతంగా వస్తున్నాడని ప్రచారంజేసి, తిరుగుబాటును లేవదీశాడు ఆ తిరుగుబాటును కూడా బ్రిటిష్ సోల్జర్లు అణచివేసి, సుబ్బారెడ్డిని ఉరిదీశారు అలా వేలాది ప్రజలు, సిపాయీలు ప్రాణాలర్పించినా, ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం బ్రిటిష్‌వాళ్లకొక కుదుపు కుదిపింది కనుకనే జి డబ్ల్యు ఫారెస్టు ఇలా వ్రాశాడు

"పాలకులకు, చరిత్రకారులకు కూడా సిపాయీల తిరుగుబాటు అనేక హెచ్చరికలు చేసింది బ్రాహ్మణుడు–శూద్రుడు, మహమ్మదీయుడు–హిందువు ఏకమై, మనకు వ్యతిరేకంగా విప్లవ శంఖం పూరించగలరనే హెచ్చరిక అన్నిటికంటే ముఖ్యమైనది



# బ్రిటిష్ ప్రభుత్వ శుష్క వాగ్దానాలు

1858 నవంబర్ 1న కంపెనీ పాలనను రద్దుచేసి, విక్టోరియా రాణి పాలనను ప్రవేశపెట్టారు సంస్థానాధీశులకు అభయ హస్తమివ్వడంతోపాటు, నాలుగు శుష్కవాగ్దానాలను కూడా రాణి ప్రకటించింది (1) బ్రిటిష్ పౌరులతో సమంగా భారతీయులను చూస్తాం (2) భారతీయుల మతస్వేచ్ఛకు భంగం కలుగనివ్వం (3) అర్హత, చిత్తశుద్ధిగల భారతీయులను ఉన్నత పదవులలో నియమిస్తాం (4) జాతీయ పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడతాం అంటూ మతగురువులు, పారిశ్రామికులు మొదలగు వారిని మురిపించింది కాని అందుకు భిన్నంగా బ్రిటిష్ ప్రభుత్వం వ్యవహరించింది

ఉన్నత పదవులలోకి భారతీయులు రాకుండా చేసేందుకు ఐ సి ఎస్ పరీక్షా కేంద్రాన్ని లండనులో ఏర్పాటుజేశారు పరీక్షకు హాజరయ్యే అభ్యర్థుల వయోపరిమితిని 19 ఏళ్లుగా నిర్ణయించారు కనీసం వయో పరిమితినైనా పెంచవలసిందిగా సాహిత్య సమితి (కాకినాడ)లాంటి అనేక భారతీయ సంస్థలు చేసిన విజ్ఞప్తిని త్రోసిపుచ్చారు "సైనిక వైద్య రంగాలలో పదవులకు భారతీయులు పనికిరారు" అంటూ ఇండియా కార్యదర్శి వైస్రాయికొక హుకుం జారీ చేశాడు

మత విషయాలలో మరో మార్గమవలంబించారు మిషనరీలు స్థాపించిన విద్యాలయాలకు గ్రాంట్లు యిచ్చారు బైబిల్ బోధనకు అనుమతినిచ్చారు కాగా అనేక అక్రమాలు జరిగాయి అయినా హిందూ-ముస్లిమ్ మత పెద్దలు పెదవి కదపలేదు

జాతీయ పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడకపోగా, అడ్డంకులు కూడా కల్పించారు 1860-70 ప్రాంతంలో భారతీయులు స్థాపించిన జౌళి మిల్లులను చూచి, లాంకషైర్ మిల్లుల యజమానులు ఆందోళన చేయడంవల్ల, వారి వస్త్రాలమీద విధింపబడిన దిగుమతి సుంకాన్ని ఇండియా ప్రభుత్వం రద్దుజేసింది అటు తరువాత 1882లో ఉప్పుమీద, మద్యంమీద తప్ప, తక్కిన వస్తువులమీద దిగుమతి సుంకాన్ని రద్దుజేసింది

బ్రిటిష్ పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకులను సరఫరాజేసి, ఆ పరిశ్రమలో తయారైనవాటిని కొనగల దేశంగా భారతదేశాన్ని తయారుజేయడమే బ్రిటిష్‌వారి ధ్యేయం కనుకనే రైలుమార్గాలు, ఆనకట్టల నిర్మాణంలాంటి పనులకు పూనుకున్నారు అదొక నగ్నసత్యం కాగా మాంట్‌గోమరీ మార్టిన్ ఇలా విమర్శించాడు.

"బ్రిటిష్‌వారి వ్యవసాయ క్షేత్రంగా ఇండియాను పరిగణించడం అన్యాయం. అక్రమం పైగా ప్రమాదకరం "

ప్రమాదం ఇండియాకే కాని బ్రిటనుకుకాదు కనుక బ్రిటిష్ ప్రభుత్వం తన పెట్టుబడిదారీ వర్గాల లాభాలను పెంచేందుకు పూనుకుంది ఇంగ్లండులో రిజిష్టరు చేయబడిన లిమిటెడ్ కంపెనీలు ఇండియాలో పని ప్రారంభించాయి. వాటికి అవసరమైన పెట్టుబడిని సమకూర్చేందుకు బ్యాంకులను స్థాపించారు 1853-67 మధ్యకాలంలో స్థాపించిన నాలుగు ఎక్స్ఛేంజి బ్యాంకులతో తృప్తి చెందక, 1876లో ప్రెసిడెన్సీ బ్యాంకులను క్రమబద్ధం చేశారు బ్రిటిష్‌వారు పెట్టే పెట్టుబడికి, డిపాజిట్లకు ఇండియా ప్రభుత్వం హామీ యిచ్చింది ఏయేటికాయేడు వారి లాభాలను, వడ్డీని చెల్లించుటకు అంగీకరించింది కాని చెల్లించడమెలా? అనే ప్రశ్న ఎదురైంది కనుక కల్నల్ సైక్స్ ఒక ఉపాయం చెప్పాడు

"చెల్లింపులు సక్రమంగా జరగాలంటే, ఇంగ్లండునుండి ఇండియా దిగుమతి చేసుకునే పారిశ్రామిక వస్తువులకంటే, చాలా ఎక్కువ కిమ్మత్తుగల ముడిసరుకులను ఇండియా ఇంగ్లండుకు ఎగుమతి చేయాలి"

సైక్స్ చెప్పినట్లేజేశారు ముడి సరుకుల ఎగుమతిని పెంచడంతోపాటు, బియ్యం, గోధుమల ఎగుమతిని 5 రెట్లు పెంచారు అందువల్ల దిగుమతి జేసుకున్నవాటి విలువకంటే, ఎగుమతిజేసినవాటి విలువ 40 శాతం వరకూ ఎక్కువగా వుండేది. అలా మిగిలి మొత్తాన్ని ఇండియా ప్రభుత్వం బ్రిటిష్ పెట్టుబడిదారుల లాభాలకు వడ్డీలకు జమకట్టేది అందువల్ల కరువు వాతబడిన భారతీయులు 1850-75 మధ్య కాలంలో 50 లక్షలమంది మరణించారు

## కష్టజీవుల పోరాటాలు

ఆంగ్లేయుల దోపిడి, భారతీయుల ఆకలి చావులు, విక్టోరియా రాణి వాగ్దానాల బండారాన్ని బట్టబయలు చేశాయి ఆకలి బాధతో మలమలమాడి చావడంకంటే, బానిసలుగానైనా బ్రతకడం మేలని భావించిన నిరుపేదలనేకులు బర్మా, మలయా, దక్షిణాఫ్రికా, వెస్ట్ ఇండీస్‌లకు కూలీలుగా వెళ్లిపోయారు ఇండియాలోని బ్రిటిష్‌వారి తోటల్లో పనిజేసే పేదలు కట్టుబానిసలైపోయారు పలువురు కౌలుదార్లు తమ సర్వస్వాన్నీ కోల్పోయారు అయినా బ్రిటిష్‌వారి తోటలు పెంచకపోతే కొరడా దెబ్బలు, జైలు శిక్షలు తప్పేవికాదు కనుక ప్రాణాలకు తెగించి బెంగాల్ ప్రెసిడెన్సీలోని కౌలుదార్లు, కూలీలు ఎదురు తిరిగారు పోలీసు దాడులను తిప్పి కొట్టడమేగాక, నీలిమందు వగైరా తోటల యజమానులైన బ్రిటిష్‌వారిమీద ఎదురు దాడులు సాగించారు వారు వ్రాయించుకున్న తప్పుడు కాంట్రాక్టులను, అప్పు పత్రాలను రద్దు చేయించుకున్నారు కనుక కొందరు తోట యజమానులు మూటాముల్లె సర్దుకొని ఇంగ్లండుకు వెళ్లిపోయారు మూడేళ్లపాటు వీరోచితంగా జరిగిన ఆ పోరాట సమయంలో కొన్నిచోట్ల రైతు సంఘాలేర్పడినాయి మరొక పదేళ్ల తరువాత ప్రారంభమైన పోరాటాలలో ఆ రైతు సంఘాలు ప్రముఖ పాత్ర వహించాయి

పేద రైతులుగా, కౌలుదార్లుగానున్న ముస్లిములకు మద్దతుగా వహాబీలు మరొకసారి ప్రభుత్వంమీద తిరుగుబాటు చేశారు కాని ఓడిపోయారు 1864లో అంబాలావద్ద జరిగిన పోరాటంలో పట్టుబడిన వహాబీలకు ద్వీపాంతరవాస శిక్ష విధించినట్లే 1871లో పాట్నావద్ద పట్టుబడిన వహాబీలకు కూడా ద్వీపాంతరవాస శిక్ష విధించేందుకు ప్రభుత్వం పూనుకుంది కనుక రెచ్చిపోయిన వహాబీలు, పబ్లిక్ కోర్టులో జడ్జిని కత్తితో పొడిచి చంపారు అటు తరువాత లార్డు మేయోను అండమాన్ దీవుల్లో షేర్ ఆలీ అనే వహాబీ హత్య జేశాడు అలా తెగించి హింసా చర్యలకు పూనుకోవడంవల్లను, కేవలం ముస్లిముల కొరకు మాత్రమే పోరాడడంవల్లను వహాబీ ఉద్యమం విఫలమైంది అలాగే ఫరాజీ ఉద్యమంకూడా భగ్నమైంది

ఆ స్థితిలో శిస్తులను వస్తురూపంలోగాకుండా రొక్క రూపేణా వసూలుజేసేందుకు ప్రభుత్వం పూనుకుంది పండిన పంటలో ఎక్కువ భాగం కావాలని జమీందార్లు పట్టుబట్టారు పోలీసులను, రౌడీలను వెంటబెట్టుకుపోయి రైతుల ధాన్యాన్ని, ఇతర వస్తువులను జమీందార్లు తీసుకుపోవడం సర్వసామాన్యమైంది వ్యవసాయ రంగంలో

ప్రవేశించిన మార్వాడీ, గుజరాతీ పెట్టుబడిదారులు వడ్డీ వ్యాపారంద్వారా సారవంతమైన భూములను హస్తగతం చేసుకోసాగారు ఇలా అన్ని వైపులనుండి సాగిన దోపిడీని భరించలేక, దేశమందనేక ప్రాంతాలలో రైతులు ఎదురుతిరిగారు

1870లో కెన్‌గ్లియా నాయకత్వాన మహారాష్ట్రలో చిన్న తిరుగుబాటు జరిగింది 1872లో జమీందార్లను, పోలీసులను ఎదిరించి బెంగాల్లోని పాబ్నా, బోగ్రా జిల్లాల రైతులు వీరోచితంగా పోరాడారు జమీందార్ల మేడలమీద దాడిజేసి, శిస్తు డిమాండ్ నోటీసులను, కాంట్రాక్టు పత్రాలను చింపి పారేశారు జమీందార్లు పట్టుకుపోయిన తమ ధాన్యాన్ని, వస్తువులను తిరిగి తెచ్చుకున్నారు కాగా ప్రభుత్వం సైన్యాన్ని రంగంలో దింపి, ఆ రెండు జిల్లాల రైతులను చిత్రహింసల పాల్జేసింది వందలకొలది రైతులను కాల్చి చంపింది అయినా పట్టువిడవకుండా పోరాడిన రైతులు కొన్ని హక్కులను పొందగలిగారు

## వాసుదేవ బల్వంత ఫాడ్కే

కరువులు కాటకాలు పెరుగుతున్న సమయంలో శిస్తులు పెంచిన ప్రభుత్వ చర్యకు నిరసనగా, వాసుదేవ బల్వంత ఫాడ్కే తన ఉద్యోగానికి రాజీనామా చేశాడు తరువాత నిరుపేదల కష్ట నివారణ కొరకు ఉద్యమాన్ని ప్రారంభించే తలంపుతో మహారాష్ట్రలో పర్యటించాడు. 1879లో 'రాముసీ' తెగవారు సాగించిన పోరాటానికి నాయకత్వం వహించిన హరినాయక్‌తో చేతులు కలిపి, వడ్డీ వ్యాపారులకు, ప్రభుత్వానికి వ్యతిరేకంగా పెద్ద ఉద్యమాన్ని నిర్మించాడు ఏడు జిల్లాలలో రైతులు, గిరిజనులు, చేతివృత్తులవారు, చిన్న వర్తకులు ఉద్యమంలో చేరారు అనేక సంఘటనలు, దుర్ఘటనలు జరిగాయి చివరకు ప్రభుత్వమాయనను బంధించి, యావజ్జీవ శిక్ష విధించి, ఏడెన్ జైలుకు పంపింది అయినా అనతికాలంలోనే ఫాడ్కే జైలునుండి తప్పించుకున్నాడు. కాని వెంటనే పట్టుబడిపోయాడు. తిరిగి కోర్టు విచారణ జరిగింది అప్పుడాయన చిరునవ్వుతో ఇలా అన్నాడు

"అవమానకరమైన దాస్యంకన్నా మరణమెంతో గౌరవప్రదం . స్వతంత్ర భారత రిపబ్లిక్కును స్థాపించడమే నా ధ్యేయం నా త్యాగం మా బానిసత్వాన్ని పోగొట్టగలిగితే నేనెందుకు భయపడాలి?" కాగా కష్టజీవులను, మధ్యతరగతివారిని ఏకంజేసి, స్వాతంత్ర్యోద్యమాన్ని నిర్మించుటకు పూనుకున్నవారిలో ఆద్యుడుగా వాసుదేవ బల్వంత ఫాడ్కే చిరస్మరణీయుడయ్యాడు

## నామధారీ ఉద్యమం

"సిక్కు మతస్థుల మధ్య హెచ్చు తగ్గులుండకూడదు. ప్రజలు విలాసాలకు ఎగబడకుండా నిర్మలంగా జీవించాలి" అని చాటి చెప్పేందుకు నామధారీ ఉద్యమం ప్రారంభమైంది అనేకమంది నిరుపేదలా ఉద్యమంలో చేరారు వారితోపాటు సామాన్య కుటుంబాలకు చెందిన సిక్కు సైనికులుకూడా చేరారు కనుక సిక్కు సైన్యాలకు అధిపతులుగానున్న ఫ్యూడల్ ప్రభువులు కళ్లెర్రజేసి, అధికారాన్ని తమ గుప్పిట్లో పెట్టుకునేందుకు ప్రయత్నించారు కాని, వారి ప్రయత్నాలను ప్రజలచే ఎన్నుకోబడిన పంచాయతీలు వమ్ము జేశాయి కాగా సిక్కు సైన్యాధిపతులు బ్రిటిష్‌వారితో కలిసి కుట్రలు పన్నారు సిక్కుల రాజ్యం బ్రిటిష్‌వారి హస్తగతమైంది నాభా, పాటియాలా మున్నగు సంస్థానాధీశులు తలెత్తారు

కొంతకాలంపాటు రంజిత్‌సింగ్ సైన్యంలోవున్న రామసింగ్ నామధారీ ఉద్యమానికి నాయకుడయ్యాడు ఆయన ఒక ఆశ్రమంలో వుంటూ సిక్కుమత ధర్మాలను ప్రజలకు బోధించేవాడు కాబట్టి ఆయన చేపట్టిన కార్యకలాపాలను బ్రిటిష్ అధికారులు తెలుసుకోలేకపోయారు అందువల్ల 1865 నాటికి నామధారీ ఉద్యమ సభ్యుల సంఖ్య 50 వేలు దాటింది

ప్రజలను పీల్చి పిప్పి జేస్తున్న సంస్థానాధీశులను రామసింగ్ గర్హించాడు గురునానక్ బోధించిన సమానత్వాన్ని చాటి చెప్పాడు సంస్థానాధీశులకు, వారిని బలపరచిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా బలమైన ఉద్యమాన్ని నిర్మించాడు పంజాబ్ రాష్ట్రాన్ని 22 మండలాలుగా విభజించి, ఉద్యమ వ్యాప్తి కొరకు యిరవై యిద్దరు నాయకులను నియమించాడు రాష్ట్రంలో స్వంత పోస్టల్ సిస్టమును ఏర్పాటు జేశాడు విదేశీ వస్తువులను, ఇంగ్లీషు పాఠశాలలను, కోర్టులను బహిష్కరించవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ జాతీయ పాఠశాలలు నెలకొల్పాడు తదుపరి తన అనుచరులలో కొందరికి సైనిక శిక్షణకూడా యిప్పించాడు (55 ఏళ్ల తరువాత, ఇంగ్లీషు పాఠశాలలను, కోర్టులను, వస్తువులను బహిష్కరించవలసిందిగా గాంధీజీ కోరిన విషయం గమనార్హం )

అందువల్ల గురు రామసింగ్ కార్యక్రమాలలోని అంతర్యాన్ని ప్రభుత్వం తెలుసుకోగలిగింది కనుక విభజించి పాలించే సిద్ధాంతాన్ని ప్రయోగించి సిక్కులకు, ముస్లిములకు మధ్య కలతలు సృష్టించింది సిక్కు సంస్థానాధీశులను ఉసికొల్పి, ప్రజలమీద ఉధృతంగా దాడులు చేయించింది

ఆ దాడులను సహించలేని యువకులనేకమంది ఉగ్రవాదులుగా మారారు దాడులు, ఎదురు దాడులు ప్రారంభమయ్యాయి గురు రామసింగ్ వారించినా వినకుండా ఉగ్రవాద యువకులంతా కలిసి 1872లో "మేలోధ్‌కోట"పైన దాడిచేసి బ్రిటిష్ సేనానులు పన్నిన వలలో చిక్కిపోయారు అలా పట్టుబడిన సిక్కు యువకులనందరినీ లూధియానా కమీషనర్ కేవన్, ఫిరంగి మూతులకు కట్టి పేల్చివేశాడు ఆ సమయంలో 13 ఏళ్ల సిక్కుబాలుడొకడు అకస్మాత్తుగా ఉరికి, కేవన్‌దొర గడ్డం పట్టుకు వేలాడుతోంటే, ప్రక్కనున్న సైనికులాబాలుని చేతులు నరికి కేవన్ దొరను విడిపించారు (కేవన్ రాక్షసకృత్యాలను వెరెష్ కాగిన్ అనే రష్యన్ చిత్రకారుడు కాన్వాస్‌పై చిత్రించి పదిలపరిచాడు )

అలాంటి వీర కిశోరాలుగల నామధారీ ఉద్యమం ఉగ్రవాద చర్యలకు, మత కుల విభేదాలకు లోనై బలహీనపడింది గురు రామసింగ్ బర్మాలో ప్రవాస శిక్షననుభవిస్తూ 1885లో కీర్తిశేషుడయ్యాడు సిక్కు సంస్థానాధీశులు మరొకమారు తమ స్వార్థాన్నీ, దేశద్రోహాన్ని రుజువుచేసుకున్నారు అలా జరిగిన నామధారీ సిక్కుల తిరుగుబాటే కూకా వీరుల తిరుగుబాటుగా చరిత్రకెక్కింది

## రంపచోడవరం పోరాటం

అనాదిగా రంపచోడవరం, ధారబంధ వగైరా ప్రాంతాలలో గిరిజనులు అనుభవించిన స్వేచ్ఛను, 1813లో కంపెనీ ప్రభుత్వం చేసిన రెవిన్యూ సెటిల్‌మెంటు హరించింది ఆ సెటిల్‌మెంటు ప్రకారం ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క మున్సబ్‌దారును నియమించారు ఆయన క్రింద మురాదార్లుండేవారు జీలుగు, కల్లు, విప్పసారాలమీద 'చిగురుపన్ను' విధించి వేలం పాటలు పెట్టేవారు చిగురు పన్నుకు తోడుగా మరికొంత సొమ్మును

మున్సబ్‌దారు వసూలు చేసుకునేవాడు కంట్రాక్టర్ల దోపిడి విపరీతంగా వుండేది లంచాలు మరిగిన పోలీసులు, అధికారులు గిరిజనులను తొక్కిపెట్టేవారు కాగా రంపపితూరీగా ప్రసిద్ధి చెందిన తిరుగుబాటు ప్రారంభమైంది 1879 మార్చిలో ప్రారంభమైన తిరుగుబాటు జూలైనాటికి గెరిల్లా యుద్ధంగా మారి, నైజాం సంస్థాన సరిహద్దుల్లోని రేకపల్లెవరకూ విస్తరించింది

మున్సబ్‌దారుగా నియమింపబడిన మాధవరామ భూపతిదేవ్ సాగించిన దోపిడివల్ల కష్ట నష్టాల పాలైన మురాదారులు కూడా రంగంలో దిగారు కాగా, గోదావరి, విశాఖ జిల్లాలలోని విశాల ప్రాంతాలు గెరిల్లా దళాల వశమయ్యాయి సైనికులను తీసుకొచ్చిన రెండు స్టీమ్ లాంచీలను గెరిల్లాలు గోదావరిలో ముంచేశారు తొమ్మిది షదాతి సైనిక దళాలను వెనుకకు నెట్టారు వారిలో అనేకమందిని హతమార్చారు కనుక బ్రిటిష్ అధికారులు మున్సబ్‌దారులను తొలగించి, మురాదారులను సంతృప్తిపరిచారు కుట్రలను పన్ని, లంచాలు గుమ్మరించి, గెరిల్లా నాయకుల మధ్య కలహాలు సృష్టించారు ఇకనేం? విముక్తి చేయబడిన ప్రాంతాలకు "నేనే రాజును" అని ఒకరు ప్రకటించుకోగా, "నేనే మహారాజును" అని మరొకరు ప్రకటించుకున్నారు ఉద్యమం బలహీనపడింది బ్రిటిష్ వారిచ్చిన లంచాలు తిన్న ద్రోహులు ధారబంధ చంద్రయ్యను రహస్యంగా హత్య జేశారు పేరు మోసిన గెరిల్లా నాయకుడు అమ్ములరెడ్డిని బంధించి, బ్రిటిష్ అధికార్ల కప్పగించారు చివరకు తమ్మన దొర మున్నగువారి వీరమరణంతో ఉద్యమం విఫలమైంది

అలా ఎన్ని ఉద్యమాలు విఫలమైనప్పటికీ లెక్కజేయకుండా సంతాలులు, గోండులు, కుకీలు, నాగులు మున్నగు గిరిజనులు బ్రిటిష్‌వాళ్ల దోపిడీకి వ్యతిరేకంగా అనేక తిరుగుబాట్లుజేశారు వేలాది గిరిజనులు మరణించారు

## ఫ్యూడల్ ప్రభువుల పంట

అలా ప్రతిరోజూ ఏదో ఒక ప్రాంతంలో తిరుగుబాటును ఎదుర్కొనవలసి రావడంవల్ల అనేకమంది ప్రభుత్వ సైనికులు మరణించారు ప్రభుత్వ ఆదాయం తగ్గి, అప్పులు పెరిగాయి అలాంటి క్లిష్టస్థితిలో ప్రభుత్వం మరొక సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది కాశ్మీర్, ఇండోర్, గ్వాలియర్, జయపూర్ మహారాజులు రహస్యంగా రష్యా చక్రవర్తితో జరిపిన రాయబారాల విషయం బ్రిటిష్ ప్రభుత్వానికి తెలిసింది కాగా ఫ్యూడల్ ప్రభువులను సంతృప్తిపరచేందుకు పూనుకుంది

సంస్థానాధీశుల కొడుకులు మాత్రమే చదువుకునేందుకొక కాలేజీని అజ్మీరులో స్థాపించారు గ్వాలియర్ కోటను సింధియాకు స్వాధీనం చేశారు. మైసూరు పాలనను మహారాజాకు అప్పగించారు కాశ్మీరును డోగ్రా వంశస్థునకు కట్టబెట్టారు ఇండోర్, గ్వాలియర్, జయపూర్ సంస్థానాలకు మరికొన్ని ప్రాంతాలను కలిపారు సంస్థానాధీశులు స్వంత సైన్యాలను కలిగివుండడానికి అనుమతించడంతోపాటు, వారికి మరికొన్ని బిరుదులు, హక్కులుకూడా యిచ్చారు కనుక 662 మంది సంస్థానాధీశులు, బ్రిటిష్ సామ్రాజ్య సౌధానికి మూలస్తంభాలుగా నిలబడ్డారు జమీందార్ల విషయంలోకూడా బ్రిటిష్ ప్రభుత్వం అలాగే ప్రవర్తించింది జమీందార్ల కొడుకులకొక కాలేజీని లక్నోలో నెలకొల్పింది అయోధ్య ప్రాంతంలో అదివరకు ఆక్రమించుకున్న 23,522 జాగీర్లలో, 23,157 జాగీర్లను తిరిగి జాగీరుదార్లకు అప్పగించింది

అలా ఫ్యూడల్ ప్రభువులను సంతృప్తిపరుస్తూ, ప్రజల కళ్లనీళ్లు తుడిచేందుకు ప్రభుత్వం ఫామిన్ కమిషనును నియమించింది ఆ కమిషన్ రిపోర్టు 1880లో వెలువడింది అందులో ఇలా వుంది

"దురదృష్టవశాత్తూ ఇండియాలో అత్యధిక శాతం ప్రజలు వ్యవసాయంమీద ఆధారపడుతున్నారు పంటలు దెబ్బతిన్న తరుణంలో ప్రజలను ఆదుకోగల వృత్తులు ఇండియాలో లేవు కాబట్టి వ్యవసాయంమీదగల వత్తిడిని తగ్గించేందుకు తగిన వృత్తులను కల్పించకపోతే కరువు నివారణ సాధ్యంగాదు " అయినా యితర వృత్తులను కల్పించేందుకు ప్రభుత్వం పూనుకోలేదు సరిగదా, రైతులను మరింతగా పిప్పిజేసింది

## రైతులమీద మోపిన భారం

ఈలోగా ఇండియా ప్రభుత్వం చెల్లించవలసిన అప్పులు పెరిగాయి రైల్వేల నిర్మాణం కొరకు బ్రిటిష్ పెట్టుబడిదారులు చేసిన ఖర్చులను దొంగ లెక్కలద్వారా విపరీతంగా పెంచి చూపించారు ఆఫ్ఘనిస్తాన్, చైనా దేశాలతో తాను చేసిన యుద్ధాల ఖర్చులను, వివిధ రకాల యితర ఖర్చులను బ్రిటిష్ ప్రభుత్వం ఇండియా నెత్తిన రుద్దింది

"సిపాయిల తిరుగుబాటును అణిచేందుకు అయిన ఖర్చులను, చైనా, అబిస్సినియాలాంటి దేశాలతో చేసిన యుద్ధాల ఖర్చులను, చైనా, పర్షియాలలో బ్రిటిష్ రాయబారులను నియమించడానికి అయిన ఖర్చులను, ఇంగ్లండునుండి ఇండియాకు వేసిన టెలిగ్రాఫ్ లైన్ల ఖర్చులను, టర్కీ పాలనకు లండనులో స్వాగతమిచ్చిన సమయంలో అయిన ఖర్చులను, మధ్యధరా సముద్రంలోకి పంపిన అదనపు యుద్ధ ఓడల ఖర్చులను అభం శుభం తెలియని భారత రైతుల మీద రుద్దారు" అని ఎల్ హెచ్ జెంక్స్ ప్రకటించాడు

భూమిశిస్తును, నీటి తీరువాను పెంచడంతోపాటు ప్రభుత్వం రోడ్డు సెస్సునుకూడా విధించింది కనుక 1858-70 మధ్యకాలంలో పన్నుల వసూళ్లు రెట్టింపు అయ్యాయి రొక్క రూపంలో శిస్తులు చెల్లించవలసి వచ్చినందుకు రైతులు తమవద్దనున్న చిన్నం చితుకు వెండి, బంగారాలను అమ్మి కట్టారు. అలా రైతులు కోల్పోయిన వెండి, బంగారాలు లండనుకు చేరి, పౌండు స్టెర్లింగ్ విలువ పెరగడానికి ఉపయోగపడ్డాయి అక్కడికీ పన్నుల బాధ తప్పనందున పలువురు రైతులు తమ పొలాలను తాకట్టుపెట్టి, పెచ్చు వడ్డీలతో అప్పులు తెచ్చి శిస్తులు చెల్లించారు కాని అప్పులు తీర్చలేకపోయారు అందువల్ల వారి పంట పొలాలు వడ్డీ వ్యాపారుల హస్తగతమయ్యాయి లక్షలాది రైతులు కౌలుదార్లయ్యారు పశ్చిమోత్తర, సింధు రాష్ట్రాలలో పదిలక్షల ఎకరాల పంటభూమి వ్యాపారవర్గాల చేతుల్లోకి పోయింది పంజాబు రైతులు అమ్మివేసిన పొలాలలో 45 శాతం వరకూ వడ్డీ వ్యాపారులకు, వర్తకులకు దక్కాయి. మహారాష్ట్రలోని సతారా జిల్లాలో జరిగిన మార్పు మరీ విపరీతం ఆ జిల్లాలో గత పంటభూమిలో మూడోవంతు వ్యాపారవర్గాల స్వాధీనమైంది జమీందార్లు, జాగీర్దార్లు, మాల్‌గుజారీలు దేశమంతటా అనేక లక్షల ఎకరాలను స్వాహా చేశారు కౌలు మొత్తాలను పదిశాతంనుండి యాభైశాతంవరకూ పెంచారు దానితోపాటు మరికొన్ని దోపిడీ పద్ధతులను ప్రవేశపెట్టారు అందువల్ల పెరిగిన రైతుల క్రోధాగ్నిమీద చన్నీళ్లు చల్లేందుకు ప్రభుత్వం శిస్తు తగ్గింపులాంటి చట్టాలు చేసింది కాని అవి అమలుజరగలేదు. అయినా ప్రభుత్వం ఫ్యూడల్ వర్గాలకు అనుకూలం గనుకనూ, భూకమతాలు పెద్దవిగా వుంటే తమకవసరమైన వ్యావసాయికోత్పత్తులు పెరుగుతాయనే నమ్మకమున్నందువల్లనూ కళ్లు మూసుకుంది

ఆ దశలో ఎంత ఎక్కువగా సాధ్యమైతే అంత ఎక్కువగా వ్యావసాయకోత్పత్తులను ఎగుమతి చేయడం ప్రభుత్వ ధ్యేయంగా వుండేది ఆగ్నేయాసియా, ఆఫ్రికా, ఓషియానా దేశాలలో ఫ్రెంచి, డచ్, జర్మన్ పెట్టుబడిదారుల పోటీని తట్టుకునేందుకు బ్రిటన్ ఇండియామీద ఎక్కువగా ఆధారపడేది 1862-65 మధ్యకాలంలో అమెరికాలో జరిగిన అంతర్యుద్ధంవల్ల అక్కడనుండి బ్రిటన్‌కు వచ్చే పత్తి దిగుమతులు ఆగిపోయినందున ముడి పత్తి కొరతను బ్రిటన్ ఎదుర్కోవలసి వచ్చింది కాబట్టి ఇండియాలో పండిన పత్తినంతా ఊడ్చి తీసుకుపోయేవారు కాగా పత్తిపంట విస్తీర్ణం మూడురెట్లు పెరిగింది చేనేత మగ్గాల సంఖ్యకూడా బాగా పెరిగింది అందువల్ల ఇండియాలో నూలు మిల్లుల స్థాపనకు అవకాశమేర్పడింది

## జౌళి మిల్లుల స్థాపన

పార్సీ, గుజరాతీ, మార్వాడీ పెట్టుబడిదారులు నల్లమందు వ్యాపారం, వడ్డీ వ్యాపారం వగైరాలద్వారా కూడబెట్టిన డబ్బుతో, చిన్న చిన్న నూలు మిల్లులను స్థాపించారు బ్రిటిష్ పెట్టుబడిదారుల ఏజెంట్లుగా వుంటూ గడించిన అనుభవం జాతీయ పెట్టుబడిదారులకున్నది కనుక 1854లో చిన్న నూలు మిల్లును స్థాపించి, అందులో తయారైన నూలును చైనా, జపాన్ దేశాలకు ఎగుమతి చేసి లాభాలు గడించారు కాగా మరికొన్ని మిల్లుల స్థాపనకు పూనుకున్నారు కాబట్టి బ్రిటిష్ పెట్టుబడిదారులు కలవరపడ్డారు పారిశ్రామిక రంగంలో భారతీయులు ప్రవేశించకుండా అరికట్టేందుకుగాను ఇండియాలో పరిశ్రమల స్థాపనకు తమకు అనుమతినివ్వాలని, తమ యంత్ర పరికరాల దిగుమతిమీదగల సుంకాన్ని రద్దు చేయాలని బ్రిటిష్ పారిశ్రామిక పెట్టుబడిదారులు ఆందోళన సాగించారు అందువల్ల బ్రిటిష్ యంత్రాలమీద, యంత్ర పరికరాలమీద విధించబడిన దిగుమతి పన్నును ఇండియా ప్రభుత్వం రద్దు చేసింది

కనుక కొందరు బ్రిటిష్ పెట్టుబడిదారులు బొంబే, కాన్పూర్ వంటిచోట్ల బట్టల మిల్లులు నెలకొల్పారు మరికొందరు బొగ్గు-ఇనుము వగైరా గనుల త్రవ్వకం ప్రారంభించారు స్కాట్లండు పెట్టుబడిదారులు బెంగాల్లో జూట్ మిల్లులు స్థాపించారు అందువల్ల రైల్వేల నిర్మాణం ఊపందుకుంది

1861లో దేశీయ పెట్టుబడిదారులొక పెద్ద జౌళి మిల్లును స్థాపించగలిగారు అప్పటినుండి 1880 నాటికి బొంబే, అహమ్మదాబాద్ మున్నగుచోట్ల దేశీయ పెట్టుబడిదారులు నిర్మించిన జౌళి మిల్లుల సంఖ్య 150కి పెరిగింది వాటిలో యాభైవేలమంది కార్మికులు పనిచేసేవారు

ఆ దశలో పలు ప్రాంతాలలోగల చేనేత కేంద్రాలుకూడా అభివృద్ధిని సాధించగలిగాయి మిల్లు నూలు విరివిగా లభించటంవల్ల చేనేత పారిశ్రామికుల సంఖ్య పెరిగింది 1891జనాభా లెక్కల ప్రకారం, చేనేత కార్మిక కుటుంబాల సభ్యుల సంఖ్య నాలుగున్నర కోట్లుగా నమోదు అయింది కాబట్టి బట్టల మిల్లుల్లో ఉపయోగించే నూలుకంటే, రెండున్నర రెట్లు ఎక్కువ నూలును చేనేతవారు ఉపయోగించారు కనుక దేశీయ పెట్టుబడిదారుల నూలు మిల్లులు లాభాలు సంపాదించగలిగాయి వీటిని దెబ్బకొట్టాలనుకున్న లాంక్‌షైర్ మిల్లు యజమానుల కోర్కె నెరవేరలేదు. అతి తక్కువ కూలి చెల్లించి కార్మికులతో పని చేయించుకున్నందున దేశీయ పెట్టుబడిదారులు నిలబడగలిగారు

కాగా లాంక్‌షైర్‌లో మిల్లు యజమానులు ఆందోళన లేవదీశారు "తక్కువ కూలి-ఎక్కువ పని"ద్వారా బలపడుతున్న భారతీయ పెట్టుబడిదారులవల్ల తమకు నష్టం కలుగుతోంది కాబట్టి, బ్రిటన్‌లోలాగానే ఇండియాలో కూడా ఫ్యాక్టరీ యాక్టును అమలు జరపాలని డిమాండ్ చేశారు తాము ఎగుమతిజేస్తున్న వస్త్రాలమీద ఇండియాలో విధిస్తున్న దిగుమతి సుంకాన్ని రద్దుజేయాలని కూడా ఆందోళన జేశారు అయినా భారతీయ పెట్టుబడిదారులతోపాటు, ఇండియాలో బట్టల మిల్లులు స్థాపించిన బ్రిటిష్‌వారుకూడా వ్యతిరేకించడంవల్ల, ఫ్యాక్టరీల చట్టాన్ని చేసేందుకు ప్రభుత్వం ఒప్పుకోలేదు కాని దిగుమతి సుంకాన్ని రద్దుజేసింది అయినా పెద్దగా లాభం లేకపోవడంవల్ల, ఇండియాలో తయారవుతున్న వస్త్రాలమీద మూడున్నర శాతంవరకూ ఎక్సైజ్ డ్యూటీని విధించింది అందువల్ల ఇండియాలో మిల్లులు నెలకొల్పిన బ్రిటిష్ పెట్టుబడిదారులు ఆందోళన చెందారు కనుక వారిని సంతృప్తిపరిచేందుకు ప్రభుత్వం ఎక్స్ఛేంజి బ్యాంకుల నుపయోగించింది ప్రెసిడెన్సీ బ్యాంకులను క్రమబద్ధంజేసి, బ్రిటిష్ పెట్టుబడిదారుల ఋణ సౌకర్యాలను పెంచి, దేశీయ పెట్టుబడిదారుల ఋణ సౌకర్యాలను తగ్గించింది ఋణ సౌకర్యం తగ్గడం, ఎక్సైజ్ డ్యూటీ చెల్లించవలసిరావడంతోపాటు, దేశీయ పెట్టుబడిదారులు తమ ఫ్యాక్టరీలలో పనిచేసే సాంకేతిక నిపుణులకు ఎక్కువ జీతాలు చెల్లించవలసి వచ్చింది ఈ సాంకేతిక నిపుణులంతా ఆంగ్లేయులే యంత్రాలను ఇంగ్లండునుండి దిగుమతి చేసుకోవడంవల్ల సాంకేతిక నిపుణులను, ఇంజనీర్లనుకూడా ఇంగ్లండునుండి తీసుకురావలసి వచ్చింది కాగా వారు అడిగినంత మొత్తం చెల్లించవలసిరావడంవల్ల దేశీయ పెట్టుబడిదారులు ఆర్థిక వత్తిళ్లకు లోనయ్యారు కాని, ఆ స్థితినుండి బయట పడేందుకు కార్మికుల రక్తం పిండారు పిల్లలు, ముదుసలులు అనే విచక్షణ సహితం లేకుండా కార్మికులతో రోజుకు 18 గంటలవరకూ పని చేయించుకొని, నిలబడ్డారు

ఒకవైపునుండి సామ్రాజ్యవాదులు, మరొకవైపునుండి జమీందారులు, వడ్డీ వ్యాపారులు సాగించిన దోపిడీవల్ల తమ సర్వస్వాన్నీ కోల్పోయి, నిరుపేదలుగా మారిన రైతు కుటుంబాల స్త్రీలు, పిల్లలుకూడా కాసిని గంజినీళ్లకొరకు ఫ్యాక్టరీలలో పనిజేసేందుకు సిద్ధపడేవారు కాబట్టి వారి రక్తం పిండేందుకు మిల్లు యజమానులకు అవకాశం కలిగింది అందువల్ల వేలాది ఫాక్టరీ కార్మికులు, గని కార్మికులు కృశించి నశించిపోయేవారు అయినా పెట్టుబడిదారులు లెక్కజేసేవారు కాదు పరిశ్రమల పాటవంకొరకు నిరుపేదల రక్తం పిండక తప్పదని భావించేవారు కాగా ఆ విషయాన్ని అమృత బజార్ పత్రిక యిలా స్పష్టపరిచింది

"పెరుగుతున్న పరిశ్రమలు కూలిపోవడమా? లేక కార్మికుల మరణ శాతం పెరగడమా? అన్న సమస్యలలో ఏదో ఒకదానిని ఎంచుకోవలసివస్తే, మొదటిదానికంటే రెండవదానిని ఎంచుకోవడమే మిక్కిలి అవసరం "

**(అమృత బజార్ పత్రిక తేదీ : 2-9-1875)**

ఇదీ ఆనాటి పరిస్థితి కథియవాడ్, కచ్, గుజరాత్ ప్రాంతాలవారైన గుజరాతీలు, పార్సీలు, ఖోజాలు, మోమిన్లు, బోహ్రాలు పారిశ్రామిక వాణిజ్య రంగాలలో బలపడసాగారు రాజపుటానాకు చెందిన మార్వాడీలు వడ్డీ వ్యాపారంలోను, వర్తకంలోను నిమగ్నమయ్యారు సింధీలు, చెట్టియార్లుకూడా వర్తక, వాణిజ్యాలలో ప్రవేశించారు వీరంతా సామ్రాజ్య వాదులతో సఖ్యతగా వుంటూ, తమకేవేవో హక్కులు కావాలని అర్థిస్తూ, సామాన్య ప్రజలను

పీల్చి పిప్పిచేసేవారు అయినా బాంబే అసోసియేషన్ పెదవి కదిపేది కాదు కనుక మధ్యతరగతి మేధావులు కలిసి 1870లో "పూనా సార్వజనిక సభ"ను స్థాపించి, కార్మికులకు అండగా నిలబడ్డారు

## కార్మిక సమ్మెల ప్రారంభం

అనాడు ఇండియాలో నున్న పరిశ్రమల్లో అత్యధిక భాగం బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతుల్లో వుండేవి నాగపూర్, కాన్పూర్, బాంబేలలో బట్టల మిల్లులు, బెంగాల్లో జనపనార మిల్లులు, రైల్వేలు, బ్యాంకులు, గనులు, అస్సాంలో తేయాకు తోటలు, బీహార్‌లో నీలిమందు తోటలు, దక్షిణాదిన కాఫీ తోటలు బ్రిటిష్‌వారి చేతుల్లో వుండడంవల్ల, అధిక సంఖ్యాక కార్మికులు, కూలీలు వారి క్రిందనే పనిచేసేవారు వారికి ఆదివారమైనా సెలవుండేదికాదు జీతాలు కూడా తక్కువగానే వుండేవి పైగా దొరల దౌర్జన్యమెక్కువగా వుండేది

అలా బ్రిటిష్ పెట్టుబడిదారులు, దేశీయ పెట్టుబడిదారులు పెట్టిన బాధలను భరించలేని కార్మికులు తెగించారు 1877లో నాగపూరు బట్టల మిల్లుల్లో మొట్టమొదటి కార్మిక సమ్మె జరిగింది కాగా ఏడు సంవత్సరాలలోపు పిల్లలతో పనిచేయించుకోకూడదని ప్రభుత్వం నిషేధించింది పనిగంటలనుకూడా కొద్దిగా తగ్గించింది కాని అవి సరిగా అమలు జరగలేదు కనుక 1882లో మద్రాసులోను, బాంబేలోను కార్మికులు సమ్మె చేశారు రైల్వే కార్మికులు, ఓడరేవుల కార్మికులుకూడా సమ్మెలకు పూనుకున్నారు 1890లో మరొక 25 సమ్మెలు జరిగాయి కాబట్టి కార్మికులకు కొద్దిపాటి హక్కులు లభించాయి

## మధ్యతరగతి మేధావుల పత్రికలు - రచనలు

బ్రహ్మ సమాజ నాయకుడు శశిపాద బెనర్జీ కలకత్తా వద్దగల బాలానాగూర్ జూట్ మిల్లు వర్కర్లకు రాత్రి పాఠశాలలు పెట్టాడు ప్రేమ, నిజాయితీ, పరిశుభ్రత మున్నగు విషయాలపైన పాఠాలు జెప్పాడు 1874లో "భారత శ్రమజీవి" పత్రికను స్థాపించాడు ఆ పత్రికద్వారా కార్మికుల కష్టాలను గురించి యజమానులకు నివేదించేవాడు కనుక కార్మికులకు కాస్త మేలు జరిగేది ఆయన సేవలను జూట్ మిల్లుల మేనేజర్ అలెగ్జాండర్‌కూడా మెచ్చుకునేవాడు అయినా శశిపాద బెనర్జీ కార్మిక సంఘ నిర్మాణం కొరకు పూనుకోలేదు ఎంతవరకూ మానవతా దృష్టితోనే కృషి చేశాడు కనుక కార్మికుల్లో వర్గ చైతన్యం కొరవడింది

1880లో ఎన్ ఎం లోఖన్డే దీనబంధు పత్రికను స్థాపించి, జౌళి మిల్లు కార్మికుల దీనస్థితిని వెల్లడించేందుకు పూనుకున్నాడు. బాంబేలో కార్మికులకు తగిన సలహాలనిస్తూ, వారి సంఘటిత శక్తిని పెంచేందుకు కృషిజేశాడు తరువాత మద్రాసు, అహమ్మదాబాద్, కలకత్తాలలో మధ్యతరగతి మేధావుల ఆధ్వర్యాన అనేక కార్మిక సభలు, సమావేశాలు జరిగాయి ఆదివారం సెలవు కొరకు, జీతాల పెంపు, పనిగంటల తగ్గింపు కొరకు ఆందోళన జరిగింది కనుక 9 ఏళ్లలోపు వయసుగల పిల్లలతో పనిచేయించుకోవడాన్ని ప్రభుత్వం నిషేధించింది 9-18 ఏళ్ల మధ్య వయసుగల వారి పనిగంటలు తగ్గించింది

దీనబంధు మిత్రా "నీల్ దర్పణ్" నాటకం వ్రాసి ప్రదర్శించాడు నీలిమందు తోటల్లో పనిచేసే కూలీల దుర్భర జీవితాన్ని కళ్లకు కట్టినట్లు ప్రజలకు చూపించిందా నాటకం ఇండియాలోనున్న తెల్లదొరల తోటల్లో పనిచేసే కూలీల పరిస్థితే అంత హీనంగా

వున్నప్పుడు బర్మా, మలయా మున్నగు చోట్లగల యూరోపియన్ల తోటల్లో పనిచేస్తున్న కూలీల జీవితమింకెంత దుర్భరంగా వున్నదోనన్న ఆలోచన పలువురు మేధావులకు కలిగింది కాగా కొందరు ఆయా దేశాలకు వెళ్ళి, అక్కడ రబ్బరు, తేయాకు మొదలగు తోటల్లో కూలీలుగా పనిచేస్తున్న భారతీయుల బాధలను వివరిస్తూ నవలలు వ్రాశారు అప్పటినుండి కూలీల బాధలను వివరిస్తూ అధికారులకు అర్జీలు పంపడం, సభలు సమావేశాలు ఏర్పాటు చేయడం ప్రారంభమైంది 1880లో ద్వారకనాథ గంగూలీ నాయకత్వాన అస్సాం తేయాకు తోటల్లో ఆందోళన చెలరేగింది

మీర్ ముష్రాఫ్ హుస్సేన్ "జమీందారీ దర్పణ్" నాటకం వ్రాశాడు ఆ నాటకాన్ని బెంగాల్ గ్రామసీమల్లో అనేకసార్లు ప్రదర్శించారు ఆనాడు బెంగాల్ ప్రెసిడెన్సీలోనున్న లక్షా పదివేలమంది జమీందార్లు సాగించిన దోపిడీని అద్దం పట్టి చూపించిందా నాటకం 1860-70 ప్రాంతాలలో జమీందార్లంతా ఏకమై వివిధ రకాల సెస్సులు విధించడం, భూమి శిస్తును ఏడు రెట్లు పెంచడం, 1859లో రైతులు సాధించుకున్న జిరాయితీ హక్కులను వక్రమార్గాలద్వారా వమ్ము చేయడం, కురచ పగ్గాలతో కొలిచి భూముల విస్తీర్ణాన్ని పెంచి పన్నులు విధించడంలాంటి దుష్టచర్యలను రైతులు సహించలేకపోయారు కాగా పాబ్నా జిల్లాలో తిరిగి ఆందోళన ప్రారంభమైంది బహిరంగ సభలు జరిపి రైతు సంఘాలను ఎన్నుకున్నారు కోర్టు ఖర్చుల కొరకు చందాలు వసూలు చేశారు ఉద్యమం క్రమంగా ఢాకా, మైమన్‌సింగ్, త్రిపుర, బఖర్‌గంజ్, ఫరీద్‌పూర్, బొగురా, రాజషాహి జిల్లాలకు విస్తరించింది అటుపైన పన్నుల నిరాకరణ ప్రారంభమైంది

జమీందార్లు ఎదురుదాడి ప్రారంభించారు పాబ్నా జిల్లాలో జరిగిన కొన్ని దౌర్జన్య చర్యలను సాకుగా తీసుకొని, శాంతిభద్రతలు క్షీణించాయని గగ్గోలు పెట్టారు రైతులమీద కఠిన చర్యలు తీసుకోవలసిందిగా ద్విజేంద్రనాథ టాగూర్ (రవీంద్రనాథ టాగూర్ పెద్దన్న) ప్రభుత్వాన్ని అర్థించాడు జమీందార్ల నాయకత్వంలోనున్న బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ రైతులమీద విరుచుకుపడింది అసోసియేషన్ పత్రిక "హిందూ పేట్రియాట్" మత వైషమ్యాలను రెచ్చగొట్టేందుకు పూనుకుంది హిందూ జమీందార్లకు వ్యతిరేకంగా ముస్లిం రైతులు తిరుగుబాటు చేస్తున్నారని ప్రచారం చేసింది

ఆ ప్రచారాన్ని పలువురు మేధావులు ఖండించారు ఇండియన్ అసోసియేషన్ రైతుల పక్షాన నిలబడింది ఉద్యమానికి నాయకత్వం వహించిన ముగ్గురిలో ఒకరు ఇషన్ చంద్రరాయ్, మరొకరు శంభూపాల్ కాగా మూడవవారు ఖుదీముల్లా కనుక హిందూ పేట్రియాట్ పత్రిక వ్రాతల్లో నిజం లేదని తేలిపోయింది కాబట్టి బెంగాల్ గవర్నర్ కాంప్‌బెల్, ఉద్యమాన్ని అణచివేసేందుకు నిరాకరించాడు రైతు సంఘాల నిర్మాణం, ఆందోళన న్యాయసమ్మతమేనని ప్రకటించాడు అక్కడక్కడ జరిగిన దౌర్జన్య సంఘటలను ఖండించాడు అందువల్ల జమీందార్లు తాత్కాలికంగా వెనక్కుతగ్గారు

నీల్ దర్పణ్, జమీందారీ దర్పణ్ మున్నగు నాటకాలు సృష్టించిన ఆందోళనను గమనించిన వైస్రాయ్ లిట్టన్ 1876లో నాటక ప్రదర్శనలమీద ఆంక్షలు విధించాడు కనుక రచయితలు నవలలు వ్రాసేందుకు పూనుకున్నారు బెంగాల్లో నవలా సాహిత్యం పెరిగింది బంకిం చంద్ర ఛటర్జీ వ్రాసిన "ఆనందమఠ్" నవలతోపాటు "దేవి చౌధరాణి", "సీతారామ్" నవలలు ప్రసిద్ధి చెందాయి ఆనందమఠ్ నవలలోని వందేమాతరం గేయం నాటికీ నేటికీ ప్రజల మెప్పుకు పాత్రమవుతూనే వుంది

బంకిం వ్రాసిన వ్యాసాలుకూడా మధ్యతరగతి హిందూ యువకులను ఆకర్షించాయి వారిలో స్వాతంత్ర్య కాంక్ష మొలకెత్తింది కాని బంకిం చంద్రుడు తన రచనల్లో ఎక్కువగా బెంగాల్ చరిత్రనే వివరించాడు వంగదేశం తన స్వాతంత్ర్యాన్ని ప్లాసీ యుద్ధానికి ముందే కోల్పోయిందనే అభిప్రాయాన్ని కలిగించాడు మొఘల్ పాదుషాల నిరంకుశ కేంద్రీకృత పాలనవల్ల అనేక దుష్ట ఫలితాలు కలిగాయని చాటి చెప్పాడు కనుక జాతీయ భావాలుగల "ముసల్మాన్" పత్రిక బంకింను విమర్శించింది ముస్లిములను నిందిస్తే, వ్యతిరేక ఫలితం కలుగుతుందని హెచ్చరించింది

అలాగే జరిగింది కొందరు ముస్లిం రచయితలు తమ స్వంత జాతీయతను ప్రచారం చేయసాగారు ఔరంగజేబువంటివారిని పొగుడుతూ కొన్ని రచనలుకూడా వెలువడినాయి ఉర్దూ రచయితలైన అల్తాఫ్ హుస్సేన్ ఆలీ, షిబ్లి నోమాని, బెంగాలీ రచయిత కైకోబాద్ రచనల్లో ముస్లిమ్ జాతీయత వ్యక్తమైంది

గిరీష్ చంద్ర ఘోష్ పౌరాణిక గాథలను ఇతివృత్తాలుగా స్వీకరించి నాటకాలు వ్రాశాడు వాటిలో జాతీయభావాలు లేవు గనుక అధికారుల అనుమతితో ప్రదర్శించ గలిగాడు అందువల్ల గత వైభవ పునరుద్ధరణ భావాలకు బలం చేకూరింది

మహాదేవ గోవింద రనడేగారి చారిత్రక రచనలు మహారాష్ట్రలో శివాజీ పూజకు దోహదం జేశాయి తిలక్, కేల్కార్, రాజ్‌వాడేలు శివాజీని, ఆయన గురువు రామదాసును, క్షాత్రధర్మాన్ని పాటించిన అతిరథులుగా చిత్రించారు జ్యోతిబాపూలే శివాజీని శూద్రరాజుగా చిత్రిస్తూ బుర్రకథ వ్రాసి ప్రచారం చేయించాడు

శతపత్ర సీరియల్ ద్వారా, గోపాల హరి దేశ్‌ముఖ్ సాంఘిక సంస్కరణల కొరకు ప్రచారం చేశాడు బ్రిటిష్‌వారి తోడ్పాటుతో పారిశ్రామికాభివృద్ధి జరగాలని నొక్కి చెప్పాడు హరిదేశ్‌ముఖ్ వెల్లడించిన అభిప్రాయాలను విష్ణుక్రిష్ణ చిప్లూంకర్ వ్యతిరేకించాడు. 1874-81 మధ్యకాలంలో వెలువడిన "నిబంధమాల" పత్రిక ద్వారా, బ్రిటిషు పాలనను వ్యతిరేకించి, పునరుద్ధరణ వాదాన్ని బలపరిచాడు

ఉత్తర భారతదేశంలో భరతేందు హరిశ్చంద్ర అనేక రచనలు జేశాడు. వాటిద్వారా స్వదేశీ వస్తువుల వాడకంయొక్క అవసరాన్ని గురించీ, న్యాయస్థానాలలో ఉర్దూకు మారుగా హిందీని ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకతను గురించీ ప్రచారం చేశాడు ఆ రోజుల్లో ఉర్దూ పత్రికల సర్క్యులేషన్ 16 వేలకు పైగా వుండగా, హిందీ పత్రికల సర్క్యులేషన్ 8 వేల వరకు మాత్రమే వుండేది అదే తారతమ్యం పుస్తకాల ప్రచురణలోకూడా వుండేది అయినా ఆర్యసమాజంవారితోపాటు, హిందూ మత పెద్దలనేకులు హిందీ భాష ఆధిక్యతను ప్రచారం చేశారు కనుక తమ భాషకు ముప్పు కలుగుతుందనే భయం ముస్లిములకు కలిగింది

దేవనాగరి లిపిలో హిందీని రాజభాషగా చేయాలని ఉత్తర భారతంలో ప్రారంభమైన ఉద్యమంవల్ల తమిళనాడులో ఆందోళన ప్రారంభమైంది మద్రాసు గవర్నర్ గ్రాంట్ డఫ్ అగ్నిలో ఆజ్యం పోసిన చందంగా కుయుక్తులు విసిరాడు కాగా మద్రాసు ప్రెసిడెన్సీలో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమానికి అంకురార్పణ జరిగింది.

"పాన్ ఇస్లామిజమ్"కు, నాంది వాచకం పలికిన జమాల్ అల్-దిన్-అల్-ఆఫ్ఘనీ, 1879-82 మధ్యకాలంలో భారతదేశంలో వుండి పలు రచనలు చేశాడు హైదరాబాద్, కలకత్తాలలో ఉపన్యాసాలిచ్చాడు ఇంగ్లీషు చదువులను, ఆంగ్లేయ పాలనను బలపరుస్తున్నందుకు సయ్యద్ అహమ్మద్ ఖానును విమర్శించాడు బ్రిటిష్ పాలనకు

వ్యతిరేకంగా హిందువులు-ముస్లిములు ఏకం కావాలన్నాడు కాని “పాన్ ఇస్లామిజమ్” యొక్క ఆవశ్యకతను గురించి బాగా ప్రచారం చేశాడు కనుక పాన్-ఇస్లామిజమే పలువురు ముస్లిమ్ పెద్దలలో నాటుకుపోయింది

అలా పలురకాల కోర్కెలతో, ఆశయాలతో వెలువడిన రచనలవల్ల కొంత మేలు జరిగినా, కొంత నష్టం కూడా కలిగింది కుల, మత భాషాభేదాలు, ప్రాంతీయ విభేదాలు తలెత్తాయి

## రైతుల తిరుగుబాట్లు

1860 ప్రాంతంలో పెరిగిన పత్తి ధర క్రమంగా తగ్గింది అమెరికానుండి బ్రిటనుకు తిరిగి పత్తి సరఫరా ప్రారంభం కావడంవల్ల, ఇండియానుండి బ్రిటనుకు జరిగే పత్తి ఎగుమతులు తగ్గాయి కనుక ధరలు పడిపోయాయి అందువల్ల పూనా, అహమ్మదాబాద్ ప్రాంతాలలో పత్తి పండించే రైతులు అప్పుల పాలయ్యారు అప్పు తీర్చలేని రైతుల భూములను జప్తు చేయించి మార్వాడీ వడ్డీ వ్యాపారులు స్వాధీనం చేసుకునేవారు కాగా షావుకారు (వడ్డీవ్యాపారి) వ్యతిరేకోద్యమం చెలరేగింది 1875 సెప్టెంబరులో ఆరు తాలూకాల రైతులు, గ్రామాధికార్ల నాయకత్వాన, వడ్డీ వ్యాపారుల ఇళ్లపైన దాడిచేసి అప్పు పత్రాలను గుంజుకున్నారు ఉద్యమ తీవ్రతను అర్థం చేసుకున్న బొంబే ప్రభుత్వం రైతుల రుణభారాన్ని తగ్గిస్తూ చట్టం చేసింది

దక్షిణ మలబారులో జన్మీల, వడ్డీ వ్యాపారుల దోపిడీకి గురియైన రైతులలో హిందువులు, ముస్లిములుకూడా వున్నారు 1862-80 మధ్యకాలంలో పేద రైతుల మీద జన్మీలు (నంబూద్రీలు, నాయర్లు) వేసిన దావాల సంఖ్య రెండున్నర రెట్లు పెరిగింది భూముల నుండి రైతులను తొలగించిన డిక్రీల సంఖ్య నాలుగున్నర రెట్లు పెరిగింది కనుక కొందరు మాప్లాలు (ముస్లిములు) చావుకు తెగించి జన్మీల ఇళ్లమీద దాడిచేసి దోచుకున్నారు వెంటనే పోలీసు బలగాలు రంగంలో దిగి మాప్లాలను చుట్టుముట్టాయి పోలీసు వలయంనుండి తప్పించుకునేందుకు మాప్లాలు చిన్నచిన్న దళాలుగా విడిపోయారు అనేకమంది తప్పించుకున్నారు కాని కొందరు ఆ వలయంలో చిక్కిపోయారు అలా చిక్కిపోయినవారంతా, వీరులుగా మరణిస్తే స్వర్గప్రాప్తి కలుగుతుందనే మూఢనమ్మకంతో, ఆత్మహత్యలు చేసుకున్నారు అందువల్ల మాప్లాలకు సామాన్య ప్రజల సానుభూతి లభించింది జన్మీల దోపిడీ కొంత తగ్గింది ఇలా ఎప్పుడూ ఏదో ఒక ప్రాంతంలో రైతులు, కౌలుదార్లు పోరాడుతూనే వుండేవారు అలాగే గిరిజనులుకూడా పోరాడేవారు

## ఆంగ్లేయుల వర్ణ దురహంకారం

ఎడతెగకుండా సాగుతున్న కష్టజీవుల పోరాటాలలో మధ్యతరగతి మేధావులు పాల్గొనకుండా చేసేందుకు కొందరు బ్రిటిష్ రాజకీయవేత్తలు ప్రయత్నించారు వైస్రాయ్ కౌన్సిల్లోను, గవర్నర్ల కౌన్సిల్సులోను మధ్యతరగతి మేధావులను సభ్యులుగా నియమించి, కొన్ని హక్కులివ్వడం అవసరమని వాదించారు ఆ వాదనను త్రోసివేస్తూ వైస్రాయ్ లిట్టన్ యిలా అన్నాడు.

“మెకాలే ఆశించిన విధంగా ఇంగ్లీషు చదివిన భారతీయులు రంగులో గోధుమ వర్ణంలో వున్నప్పటికీ, ఆలోచనల్లో తెల్లగా వుంటారనే ఉద్దేశ్యంతో మనం ఇండియన్లకు

ఇంగ్లీషు చదువులు చెప్పించాం కాని ఇంగ్లీషు చదివిన బాబులు ఇండియన్ పత్రికల్లో అభ్యంతరకరమైన వ్రాతలు వ్రాయడానికి మాత్రమే పనికొస్తున్నారు " అని ఈసడించాడు స్థానిక సంస్థలలో మెజారిటీ సభ్యులను ఎన్నుకునే పద్ధతిని ప్రవేశపెట్టాలని లార్డ్ మేయో చేసిన సూచన కూడా బుట్టదాఖలైంది

ఆ సమయంలో బ్రిటనులో లిబరల్ పార్టీ అధికారాన్ని చేపట్టగలిగింది లిట్టన్ స్థానంలో రిప్పన్ వైస్రాయిగా నియమింపబడ్డాడు అధికారాన్ని స్వీకరించిన వెంటనే రిప్పన్ పత్రికలమీద గల ఆంక్షలను తొలగించాడు కనుక భారతీయుల ఆశలు చిగురించాయి

భారతీయులను విరోధులుగా చూడకూడదని, అంతకంతకెక్కువగా భారతీయులతో కలిసి ఇండియాను పాలించడం అవసరమని రిప్పన్ ప్రకటించాడు స్థానిక సంస్థల్లో ఎక్కువమంది సభ్యులను- ఆస్తులుగలవారు, చదువుకున్నవారు-ఎన్నుకోవాలని, సభ్యులచే ఎన్నుకోబడిన వారే చైర్మన్లుగా వుండాలని 1882 మేలో శాసించాడు అయినా వివిధ రాష్ట్రాలలో గల ఐ సి ఎస్ ఆఫీసర్ల వ్యతిరేకతవల్ల ఆ శాసనం సరిగా అమలుజరగలేదు

భారతీయులకు వర్తించే చట్టాలన్నీ భారతదేశంలో నివసించే యూరోపియన్లకు కూడా వర్తింపచేయడానికి 1883లో రిప్పన్ పూనుకున్నాడు. ఆమేరకు బ్రిటిష్ పార్లమెంటులో ఇల్బర్టు బిల్లును కూడా ప్రవేశపెట్టారు కనుక ఇండియాలోనున్న యూరోపియన్లందరూ ఏకమై గగ్గోలు పెట్టారు బ్రిటిష్ పార్లమెంటులో పలువురు సభ్యులు బిల్లును వ్యతిరేకించారు ఆ వ్యతిరేకతను సాకుగా చూపించి లిబరల్ పార్టీ ప్రభుత్వం బిల్లును ఉపసంహరించింది కాగా రిప్పన్ రాజీనామా చేసి వెళ్లిపోయాడు

ఇల్బర్టు బిల్లు విషయంలోనేకాదు బ్రిటిష్ వారి వర్ణ దురహంకారం రైళ్లలో, స్టీమర్లలో, హోటళ్లలోకూడా కనిపించేది అలాగే ఉద్యోగాలలోను కనిపించేది 1878లో ముత్తుస్వామి అయ్యరును మద్రాసు హైకోర్టు జడ్జిగా నియమించినప్పుడు, తెల్లజడ్జీల జీతంతో సమానమైన జీతాన్ని ఆయన కివ్వకూడదని ఆంగ్లేయులు ఆందోళన లేవదీశారు బ్రిటిష్ పెట్టుబడిదారుల పత్రిక మద్రాసు మెయిల్ ఆ ఆందోళనను బలపర్చింది కనుక ప్రతీకారంగా కొందరు ప్రముఖులు కలిసి మద్రాసులో హిందూ పత్రికను ప్రారంభించారు

అన్నింటికంటే ఘోరం యూరోపియన్లు సాగించిన హింస తెల్లదొరలు తమ వద్ద పనిచేసే భారతీయులను చీటికి మాటికి కొట్టేవారు కొన్ని సందర్భాలలో కాల్చి చంపేవారు అయినా నేరస్తులను ఏదో ఒక సాకుతో కోర్టులు విడిచిపెట్టేవి లేదా, కొద్దిపాటి శిక్షలు విధించేవి

అలా సాగింది తెల్లదొరల వర్ణ దురహంకారం వారి సాముదాయక గుత్తాధిపత్యానికికూడా ఆ దురహంకారం తోడ్పడింది రైల్వేలు, గనులు, తోటలు, ఫ్యాక్టరీలు, బ్యాంకులు వగైరాల యజమానులతోపాటు, ప్రభుత్వ యంత్రాంగంలో వున్నవారితో సహా అందరూ సోదరభావంతో మెలగుతూ, ఒకరితో మరొకరు పోటీ పడకుండా భారతదేశాన్ని కొల్లగొట్టడానికి వర్ణదురహంకారం ఉపయోగపడింది

భారతదేశంలోగల అస్పృశ్యతను, కుల మత హెచ్చు తగ్గులను విమర్శించిన క్రైస్తవ మత గురువులు, యూరోపియన్ల వర్ణ దురహంకారాన్ని విమర్శించలేదు అలాగే యూరోపియన్ల వర్ణ దురహంకారాన్ని విమర్శించిన భారతీయులనేకులు తమ మధ్యగల అస్పృశ్యతను ఖండించలేదు. "నువు జేస్తే తప్పు. నేను జేస్తే ఒప్పు" అనే సంకుచిత

భావమే వర్ణ దురహంకారానికి, అస్పృశ్యతకుకూడా మూలమైంది

## వర్గ ప్రయోజనాలు

బెంగాల్ జమీందార్లలో కొందరు బ్రహ్మ సమాజాన్ని స్థాపించి, సాంఘిక దురాచారాలను రూపుమాపేందుకు కృషి చేశారు మరికొందరు జమీందార్లు సనాతన వాదాన్ని చేపట్టి సంస్కరణలను వ్యతిరేకించారు రాజారామమోహనరాయ్, రవీంద్రనాథ్ టాగూర్‌లాంటి వారు కొందరు తప్ప, తక్కిన వారంతా రైతులను పిండే విషయంలో ఏకమయ్యారు బెంగాల్ ప్రెసిడెన్సీలో ఎస్టేట్లు సంపాదించిన బ్రిటిష్‌వారితో చేతులు కలిపేందుకు కూడా వారు వెనుదీయలేదు అందుకు వర్గ ప్రయోజనమే కారణం కాని, అందువల్ల ఒక విషబీజం మొలకెత్తింది కౌలుదార్లలో అధిక సంఖ్యాకులు ముస్లిములు గావడం, జమీందార్లలో అధిక సంఖ్యాకులు హిందువులు గావడంవల్ల, మతకలహాలను రెచ్చగొట్టడం సులభమైంది

పార్సీ, గుజరాతీ పెట్టుబడిదారులు పరిశ్రమలు స్థాపించారు బ్రిటిష్ పరిశ్రమల పోటీనుండి తప్పుకుని, తమ పరిశ్రమలు నిలబడేందుకు రక్షణ కావాలని ప్రభుత్వాన్ని కోరారు భారతదేశపు సిరిసంపదలను బ్రిటిష్‌వారు ఊడ్చుకుపోతున్నారని విమర్శించారు అలా విమర్శించడం సరియైన పనే కాని వారు చేసిన పనేమిటి? తమ పరిశ్రమల పెంపుకొరకు కొన్ని చిన్న పరిశ్రమలను దివాళా తీయించారు ఆరేడు సంవత్సరాల వయసుగల పిల్లలతోకూడా రోజుకు 16 గంటలనుండి 18 గంటలవరకూ పని చేయించుకుని, అతి తక్కువ కూలి యిచ్చారు పెద్ద చేప చిన్న చేపలను మింగింది బ్రిటిష్ పరిశ్రమల పోటీని తట్టుకోలేక అనేక చిన్న పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు మూతపడ్డాయి నిరుద్యోగం పెరిగింది

## జాతీయ మహాసభల ప్రారంభం

కార్మికుల దుస్థితిని, రైతుల పేదరికాన్ని తొలగించేందుకు కొందరు మధ్యతరగతి మేధావులు పూనుకున్నారు పూనాలో సార్వజనిక సభ, కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్, మద్రాసులో మహాజన సభ, బాంబేలో ప్రెసిడెన్సీ అసోసియేషన్ స్థాపించ బడ్డాయి కార్మిక కర్షక హక్కుల కొరకు ఆందోళన సాగింది మిల్లు యజమానుల ప్రాబల్యంలోనున్న బాంబే అసోసియేషన్ కార్యకలాపాలను, బెంగాల్ జమీందార్ల నాయకత్వంలో నున్న బ్రిటిష్ ఇండియా అసోసియేషన్ కార్యకలాపాలను వారు వ్యతిరేకించారు అందరూ కలిసికట్టుగా తీర్మానాలు చేయడం, పోరాటాలు సాగించడం అవసరమనే తలంపుతో మహాసభలు జరిపేందుకు పూనుకున్నారు కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్ ఆధ్వర్యాన 1883లో ప్రధమ జాతీయ మహాసభ, 1885లో రెండవ జాతీయ మహాసభ జరిగాయి

అంతకుముందు రూపాయికి రెండు షిల్లింగులుగా వున్న మారకపు రేటు, 1885 నాటికి రూపాయికి ఒక షిల్లింగు రెండు పెన్నీలకు పడిపోయింది వెండి ధర తగ్గడంవల్ల రూపాయి విలువకూడా తగ్గింది కనుక బ్రిటనుకు ఇండియా చెల్లించవలసిన అప్పు తీరే పరిస్థితి కన్పించలేదు అప్పు మాట ఎలా వున్నా, అప్పుమీద వడ్డీ, బ్రిటిష్ పెట్టుబడులమీద లాభాలు, పెన్షనులు, ఆయుధాల కిమ్మత్తు, లండన్‌లో వుండే ఇండియా కార్యదర్శి సిబ్బంది

జీతభత్యాలు వగైరా తప్పకుండా చెల్లించవలసి వచ్చింది అదే సమయంలో బ్రిటిష్ వస్తువులమీద దిగుమతి సుంకాన్ని రద్దుజేయడంవల్ల ఇండియా ప్రభుత్వ ఆదాయం తగ్గింది పైగా ఆఫ్ఘనిస్తాన్, ఈజిప్టు, సూడాన్ దేశాలతో జరిగిన యుద్ధ ఖర్చులను ఇండియా నెత్తిన రుద్దడంవల్ల, బడ్జెట్‌లో సగం వరకూ సైనిక ఖర్చుల క్రింద హరించిపోయింది

కనుక ఇండియానుండి జరిగే ఎగుమతులను విపరీతంగా పెంచారు రైతులవద్ద తిండిగింజలుకూడా లేకుండా బలవంతంగా లాక్కున్నారు అలా పెంచిన ఎగుమతులవల్ల మిగులుదేలిన మొత్తాలను బ్రిటనుకు జమకట్టారు కాగా యితర పెట్టుబడిదారీ దేశాలతో జరిగిన లావాదేవీలనుండి బ్రిటన్ బయటబడగలిగింది కాని ఇండియాలో లక్షలాది నిరుపేదలు ఆకలి బాధతో మరణించారు

"1850-75 మధ్యకాలంలో 50 లక్షలమంది భారతీయులు కరువు వాతబడి మరణించగా, 1875-1900 మధ్యకాలంలో కోటి యాభై లక్షల మంది భారతీయులు కరువువల్ల మరణించారు" అని డబ్ల్యు ఎస్ లిల్లీ ప్రకటించాడు

ఆకలి బాధకు తాళలేక మహారాష్ట్రలో రామ్‌సీ తెగవారు, మలబారులో మాప్లాలు దోపిళ్ళకు పూనుకున్నారు

సరిహద్దు రాష్ట్రంలోని పఠానులు ప్రభుత్వ బలగాలమీద దాడులు సాగించారు దేశమందనేక చోట్ల రైతులు పన్నులు చెల్లించడం మానేశారు ఫ్యాక్టరీ వర్కర్ల సమ్మెలు పెరిగాయి గిరిజనులు తమ విల్లమ్ములను ఎక్కుపెట్టారు

## రామదండు ఉద్యమం

ధారబంధ చంద్రయ్య, తమ్మన దొరలాంటి వీరుల మరణానంతరం, విశాఖ ఏజెన్సీలోని గిరిజనులు మెదలకుండా వుండిపోయారు అదే అదునుగా భావించిన ప్రభుత్వం, అడవుల రక్షణ చట్టాన్ని ఖచ్చితంగా అమలు జరిపేందుకు పూనుకుంది అడవులను కాపాడడం మంచిపనే కాని పోడు వ్యవసాయం చేసుకునే ప్రాంతాన్ని కుదించింది పైగా గిరిజనులమీద కొన్ని ఆంక్షలను కూడా విధించింది మైదానాలలో గిరిజనులకుగల భూములను వడ్డీ వ్యాపారులు కబళించారు కంట్రాక్టర్ల దోపిడీ, అధికారుల జులుం తిరిగి ప్రారంభమయ్యాయి కనుక 1885లో గిరిజనుల తిరుగుబాటు ప్రారంభమైంది అనేకమంది గిరిజనులు రామదండులుగా ఏర్పడ్డారు వారికి రాజన అనంతయ్య నాయకత్వం వహించాడు రామదండుకు పోలీసు బలగానికి మధ్య పలు పోరాటాలు జరిగాయి అలా ఏడాది గడిచిన పిమ్మట 1886లో రాజన అనంతయ్య జయపూర్ మహారాజుకు యీ క్రింది ఉత్తరం వ్రాశాడు:

"మహారాజా! మన దేశంలో ఇంగ్లీషువారి పాలన సాగనివ్వడం మంచిపనా? వారిమీద యుద్ధానికి మనం పూనుకోవాలి గదా? రష్యనులుకూడా ఇంగ్లీషువారి కనేక చిక్కులు కల్పిస్తున్నారు తగినంత ధనాన్ని, జనాన్ని నాకు సమకూరిస్తే, శ్రీరామునిలా నేను విజృంభించగలను "

(డేవిడ్ ఆర్నాల్డ్. డెకాయిటీ అన్డ్ రూరల్ క్రైమ్ ఇన్ మద్రాసు)

అనంతయ్య ఆశించిన సహాయం అందలేదు కాగా మరొకసారి విశాఖ ఏజెన్సీలో గిరిజనోద్యమం విఫలమైంది అలా ఉద్యమాలు, తిరుగుబాట్లు విఫలమవుతున్నప్పటికీ, కరువు కాటకాలను భరించలేని కష్టజీవుల తిరుగుబాట్లు పెరిగాయి కాగా ఆనాటి పరిస్థితిని

సర్ విలియం వెడ్డర్ బర్న్ యిలా వర్ణించాడు

"దురదృష్టకరమైన అభివృద్ధి నిరోధక చర్యలు, ఘోరమైన పోలీసు దమనకాండ కలసి ఇండియాలో విప్లవ పరిస్థితులను సృష్టించాయి లార్డ్ లిట్టన్ వైస్రాయిగా వున్న సమయంలో విప్లవం బ్రద్దలవడం దాదాపుగా తథ్యమనిపించింది"

కనుక భారతీయ మేధావులను కూడగట్టుకుంటే, అనేక సమస్యలను సులువుగా పరిష్కరించవచ్చునని అలన్ హ్యూమ్ భావించాడు కాగా వైస్రాయిని కలిసి, సురేంద్రనాథ బెనర్జీ చేపట్టిన అతివాద పంథాను గురించీ, కలకత్తాలో జరిగిన జాతీయ మహాసభల తీర్మానాలను గురించీ వివరించాడు. కార్మిక, కర్షక, గిరిజన పోరాటాలనుకూడా సమీక్షించాడు "కష్టజీవుల పోరాటాలకు అతివాద మేధావులు నాయకత్వం వహిస్తే, స్థానిక పోరాటాలు జాతీయ తిరుగుబాటుగా పరిణమించవచ్చు"ననే అభిప్రాయాన్ని వెల్లడించి, మేధావులను ఆకర్షించవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాడు

ఆ సమయంలో వైస్రాయ్ యుద్ధ వాతావరణంలో మునిగితేలుతున్నాడు ఫ్రెంచి సైన్యాలు ఇండో చైనాను ఆక్రమించి, బర్మా సరిహద్దుల్లో తిష్టవేశాయి ఉత్తర బర్మా పాలకుడు ఫ్రెంచివారితో స్నేహంగా వుంటూ, ఇంగ్లీషు వర్తకులను శిక్షించాడు మరోవైపున జారిస్టు రష్యా సైన్యాలు ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దు కేంద్రాలను ఆక్రమించాయి బ్రిటిష్ పటాలాలకు వ్యతిరేకంగా పరానులు కత్తులు దూశారు అలా రెండు వైపులనుండి కనబడుతున్న ప్రమాదాలను ఎదుర్కొనేందుకు తగినట్లుగా సైనిక బలగాలను పెంచేందుకు వైస్రాయి చేసిన ప్రయత్నాన్ని "లిటిల్ ఇంగ్లండర్సు" వ్యతిరేకిస్తూ, ఆందోళన ప్రారంభించారు. ఆర్థిక శాస్త్రవేత్తలు బడ్జెట్‌లోటును ఎత్తి చూపించారు

అలాంటి విషమస్థితిలో, అలన్ హ్యూమ్ సూచించిన జాతీయ మహాసభ స్థాపనకు వైస్రాయ్ డఫెరిన్ అంగీకరించాడు కాని "జాతీయ మహాసభతో ఏ విధమైన సంబంధం పెట్టుకోవద్దు" అని బొంబే గవర్నరుకు లెటర్ వ్రాశాడు రెండేళ్ల తరువాత సెయింట్ ఆండ్రూస్ విందు సమావేశంలో మాట్లాడుతూ జాతీయ కాంగ్రెస్‌మీద విరుచుకుపడ్డాడు



# భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన

భారత జాతీయ యూనియన్‌ను స్థాపించేందుకు అలన్ హ్యూమ్ పూనుకోవడానికిగల కారణాలను ఒక్కొక్క రొకొక్క విధంగా వివరించారు

"ప్రజలలో పొంగి పొరలుతున్న విప్లవ తరంగములకొక అడ్డుకట్ట వేయవలెనని హ్యూమ్ తలచెను" అని పట్టాభిగారభిప్రాయపడ్డారు

"ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ నిర్మాణంలో హ్యూమ్ ప్రధాన పాత్ర వహించిన మాట నిజమే కాని అంతకుముందే సురేంద్రనాథ బెనర్జీ మున్నగువారు జాతీయ మహాసభలు జరిపిన మాట మరువకూడదు కాబట్టి హ్యూమ్ పూనుకున్నా, పూనుకోకపోయినా, ఒక జాతీయ సంస్థ తప్పకుండా ఏర్పడి వుండేది" అని కొందరభిప్రాయపడ్డారు

"హ్యూమ్ సీనియర్ అధికారిగా వున్నప్పుడు, పోలీసు రహస్య నివేదికలను చదివే అవకాశం ఆయనకు కలిగింది కాగా ప్రజలలో వ్యాపించిన అసంతృప్తిని ఆయన తెలుసుకోగలిగాడు మధ్యతరగతి మేధావులు కొందరు రహస్య సంఘాలను స్థాపించుటకు ప్రయత్నిస్తున్నారనే విషయాన్ని పసిగట్టగలిగాడు కనుకనే డబ్ల్యు సి బెనర్జీ, ఫిరోజ్ షా మెహతావంటి మితవాద మేధావులను, సురేంద్రనాథ బెనర్జీలాంటి అతివాద మేధావులను ఒకే వేదికపైన సమావేశపరచడం మంచిదని హ్యూమ్ భావించాడు" అని మరికొందరు అభిప్రాయపడ్డారు

ఎందువల్లనైనప్పటికీ హ్యూమ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ నిర్మాణం కొరకు చాలా కృషి చేశాడు ప్రభుత్వాధినేతలతో ఆయనకుగల సంబంధంవల్ల తమ కోర్కెలు నెరవేరుతాయనే భావం భారతీయ మేధావులకు కలిగింది

సమావేశాన్ని పూనాలో జరపాలనుకున్నారు కాని అక్కడ కలరా ప్రారంభమైనందున, 1885 డిసెంబరు 28న బాంబేలోని గోకుల్‌దాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాలలో సభ జరిపారు బ్రిటిష్ గవర్నర్ల అధ్యక్షతన క్రమబద్ధంగా సమావేశాలు జరపడం బాగుంటుందని హ్యూమ్ చేసిన సూచనను వైస్రాయ్ ఆమోదించనందున, వైస్రాయ్ కౌన్సిల్ మెంబరుగానున్న విలియం చంద్ర బెనర్జీని సభాధ్యక్షుడుగా ఎన్నుకున్నారు "ఇండియన్ నేషనల్ యూనియన్" అనే పేరును పలువురు వ్యతిరేకించినందున, సంస్థ పేరును ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌గా మార్చారు

అలా ప్రారంభమైన కాంగ్రెస్ ప్రథమ సమావేశంలో 72 మంది ప్రతినిధులు పాల్గొన్నారు మద్రాసునుండి మహాజన సభ అధ్యక్ష, కార్యదర్శులు పి రంగయ్య నాయుడు, పి ఆనందాచార్యులు, మచిలీపట్టణంనుండి ఎన్ వెంకట సుబ్బారాయుడు, హైదరాబాద్ నుండి డాక్టర్ అఘోరనాథ ఛటోపాధ్యాయ (సరోజనీదేవి తండ్రి), అడ్వకేట్ రామచంద్ర పిళ్లై, ముల్లా అబ్దుల్ ఖయూం ప్రతినిధులుగా వెళ్లారు బెంగాల్, బాంబేలకు చెందిన ప్రతినిధులెక్కువమంది పాల్గొన్నారు

కాంగ్రెస్ ప్రథమ సమావేశంలో పాల్గొన్న ఇద్దరు ముస్లిములలో ఒకరు హైదరాబాద్‌కు చెందిన ముల్లా అబ్దుల్ ఖయూం ఆయన ప్రతి కాంగ్రెస్ సమావేశంలోను తప్పకుండా పాల్గొనేవాడు మచిలీపట్టణంనుండి వెళ్లిన వెంకట సుబ్బారాయుడు తిరిగి రాగానే కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీని స్థాపించాడు ఇదే మద్రాసు ప్రెసిడెన్సీలో ముందుగా ఏర్పడిన కాంగ్రెస్ కమిటీ

# ఉపన్యాసాలు - తీర్మానాలు

"బ్రిటిష్ ప్రజలను పరిపాలిస్తున్నట్లుగానే, భారతీయులనుకూడా పరిపాలించవలెనని బ్రిటిష్ ప్రభుత్వాన్ని మేం కోరుతున్నాం మా ఈ కోర్కెకు, బ్రిటిష్ ప్రభుత్వంపట్ల మాకుగల సంపూర్ణ విధేయతకూ మధ్య వైరుధ్యమేదీ లేదు" అని డబ్ల్యు సి బెనర్జీ తన అధ్యక్షోపన్యాసంలో వివరించాడు

"నేను విక్టోరియా మహారాణిగారి దాసానుదాసుడను ఆ మహారాణి కాలిబూట్ల లేసులను విప్పడానికికూడా నేను అర్హుడనుకాను" అంటూ అలన్ హ్యూమ్ తన ఉపన్యాసాన్ని ముగించాడు

పరిపాలనలో భారతీయులకు తగిన స్థానం కల్పించాలని, ప్రజల న్యాయమైన కోర్కెలను తీర్చాలని అర్థిస్తూ తీర్మానాలు చేశారు అలన్ హ్యూమ్‌ను కార్యదర్శిగా ఎన్నుకున్నారు

ఆనాటి ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఒక పార్టీ కాదు, సైన్సు కాంగ్రెస్‌వలె అదొక వేదిక మాత్రమే కనుకనే క్రమబద్ధమైన ప్రతినిధుల ఎన్నిక, అధ్యక్ష ఎన్నికలాంటివేవీ వుండేవి కావు అయినా ప్రతి యేటా మూడురోజులపాటు సమావేశాలు జరిగేవి నాయకులు సూచించిన అభ్యర్థిని ఆహ్వాన సంఘంవారు వేదికపైకి ఆహ్వానించి జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు అధ్యక్షత వహించవలసినదిగా కోరేవారు సమావేశాలకు అధ్యక్షత వహించినవారే సంస్థ అధ్యక్షులుగా కొనసాగేవారు

అలన్ హ్యూమ్‌తోపాటు మరికొందరు బ్రిటిష్ ప్రముఖులుకూడా మహాసభ సమావేశాలలో పాల్గొనేవారు కాంగ్రెస్ మహాసభ ఆమోదించిన తీర్మానాలను దేశంలోని మేధావులు పరిశీలించేవారు కనుక కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యేవారి సంఖ్య పెరిగింది 1885లో కేవలం 72 మంది ప్రతినిధులు పాల్గొనగా, 1889లో దాదాపు రెండు వేలమంది ప్రతినిధులు పాల్గొన్నారు

మద్రాసు మహాజన సభ, ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ కలకత్తాలాంటి సంఘాలు కాంగ్రెస్ మహాసభలకు ప్రతినిధులను పంపేవి కనుక దేశమంతటా అనేక సంఘాలు ఏర్పడ్డాయి ప్రతినిధుల సంఖ్య బాగా పెరిగింది దాదాభాయ్ నౌరోజీ, ఫిరోజిషామెహతా, దిన్షా ఎడాల్జీవాచా, సురేంద్రనాథ బెనర్జీ, బద్రుద్దీన్ తయాబ్జీ లాంటివారు కాంగ్రెస్ నాయకులుగా గుర్తింపబడేవారు అయినా ప్రజలను సమీకరించి, పోరాటాలకు నాయకత్వం వహించి, హక్కులను సాధించాలనే అభిప్రాయం వారికుండేదిగాదు తీర్మానాలు చేస్తూ, ప్రభుత్వానికి మహజర్లు సమర్పిస్తూ, ఒక్కొక్క మెట్టుగా పైకి పోవాలనే అభిప్రాయమే వారికుండేది

"దేశంలో మతమౌఢ్యం, నిరక్షరాస్యత, దరిద్రం తాండవిస్తున్నాయి విజ్ఞాన సాంకేతికాభివృద్ధిపైన మక్కువలేదు. కాబట్టి బ్రిటిష్‌వారి సహాయ సహకారాలు మనకు అవసరం లేకపోతే బ్రిటిష్‌వారు సాధించిన పారిశ్రామికాభివృద్ధినిగాని, యితర రంగాలలో వారు సాధించిన ప్రగతినిగాని మనం సాధించలేము" అని నాయకులు చెప్పేవారు అందుకు అనుగుణంగానే కాంగ్రెస్ మహాసభ తీర్మానాలుండేవి వాటినిండా కోరికలుండేవి

"లెజిస్లేటివ్ కౌన్సిల్‌ను విస్తృతపరచి, వాటిలో భారతీయులకెక్కువ స్థానాలు కేటాయించాలి స్థానిక సంస్థలు, వాణిజ్య సంస్థలు, విద్యాలయాలు మున్నగువాటిద్వారా ఎన్నికైనవారిని ఆ స్థానాలలో నియమించాలి బడ్జెట్‌మీద అభిప్రాయం తెలియజేసే హక్కును

భారతీయులకివ్వాలి ప్రభుత్వోద్యోగాలలో అంతకంతకెక్కువగా భారతీయులను నియమించాలి సివిల్ సర్వీస్ పరీక్షలను ఇండియాలో కూడా జరిపించాలి సైన్యంలో అర్హతగల భారతీయులను పై పదవులలో నియమించాలి జ్యూరీద్వారా న్యాయనిర్ణయం చేసే పద్ధతిని విస్తృతపరచాలి భారతీయులతోకూడిన స్వచ్ఛంద సేవాదళాలను నిర్మించాలి కార్యనిర్వాహక శాఖకు న్యాయనిర్ణయాధికారం వుండకూడదు ”

“సైనిక వ్యయాన్ని హోమ్ ఛార్జెస్‌ను తగ్గించాలి భారతదేశంలో సాంకేతిక విద్యాభివృద్ధికి, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడాలి ఎగుమతి దిగుమతి సుంకాల విధింపులో చూపుతున్న పక్షపాతాన్ని విడనాడాలి ఎక్సైజ్ సుంకాన్ని రద్దుచేయాలి ”

“అంతకంతకు పెరుగుతున్న కరువు కాటకాలకుగల కారణాలను విచారించి, వాటి నివారణకు పూనుకోవాలి విచక్షణారహితంగా ఆహారధాన్యాలను, యితర వస్తువులను ఎగుమతి చేయడం మానుకోవాలి ఎప్పటికప్పుడు రైతులమీద పన్నులు పెంచే పద్ధతిని విరమించాలి బర్మా, మలయా, మారిషస్, దక్షిణాఫ్రికా మున్నగు దేశాలలో కూలి పనులు చేస్తున్న భారతీయుల యోగక్షేమాలను గురించి శ్రద్ధ వహించాలి అటవీ చట్టంవల్ల గిరిజనులకు కలుగుతున్న ఇబ్బందులను తొలగించాలి” అని తీర్మానాలు చేసేవారు

ఈ తీర్మానాలను వరుసగా 1888నుండి 1891 వరకూ ప్రతి యేటా చేశారు కాని వాటిని అమలు జరిపించుకునేందుకు కృషి చేయలేదు అలన్ హ్యూమ్ మాత్రం తన కార్యదర్శి బాధ్యతలను నిర్వహిస్తూ, ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుండేవాడు కనుక దిన్షా ఎడాల్జీవాచా, దాదాభాయ్ నౌరోజీకి యీ విధంగా లేఖ వ్రాశాడు

“బారిష్టర్ ఫిరోజిషా మెహతా తన వృత్తిలో తీరిక లేకుండా వున్నాడు మిష్టర్ తెలాంగ్ తన వ్యాపకాన్ని పెంచుకున్నాడు ఈ విధంగా అందరూ బంగారాన్ని కూడ బెట్టుకోవడంలోనే నిమగ్నమైతే, దేశాభివృద్ధి ఎలా జరుగుతుంది?”

ఎవరూ పనిచేయడంలేదని ఎడాల్జీ వాచా బాధపడుతోంటే, కాంగ్రెస్ తీర్మానాలను జూచి వైస్రాయ్ డఫెరిన్ మండిపోయేవాడు అలన్ హ్యూమ్ మాత్రం కాంగ్రెస్‌కు - ప్రభుత్వానికి మధ్య, హిందూ–ముస్లిం నాయకుల మధ్య సామరస్యం కొరకు కృషిజేసేవాడు రైతు సమస్యలను పట్టించుకోవలసిందిగా కాంగ్రెస్ నాయకులను కోరేవాడు రైతు సమస్యల మీద కరపత్రాలు వ్రాసి, వివిధ భాషలలో ముద్రించి పంచేవాడు

## కౌన్సిల్ చట్టం (1892)

ప్రముఖ నాయకులను కౌన్సిల్సులో చేర్చుకునేందుకు 1892లో కౌన్సిల్సు చట్టాన్ని చేశారు ఆ చట్టం ప్రకారం ఇంపీరియల్ కౌన్సిల్లో 16గురు సభ్యులుండేవారు వారిలో పదిమంది అనధికార సభ్యులు ఆ పదిమందిని ప్రభుత్వమే నియమించేది కాని స్థానిక సంస్థలను, వాణిజ్య సంఘాలను, యూనివర్శిటీలను, జమీందారీ అసోసియేషన్‌లను సంప్రదించి, వారు సూచించిన వారినే కౌన్సిల్ సభ్యులుగా నియమించేవారు అలా నియమించబడిన సభ్యులు బడ్జెట్ ప్రపోజల్సును చర్చించేవారు కాని ఓటు చేసే అధికారంగాని, అదనపు మొత్తాలను కోరే అధికారంగాని వారికుండేదిగాదు. ప్రావిన్షియల్ కౌన్సిలులోను అలాగే వుండేది

అయినా లాల్‌మోహన్‌ఘోష్, డబ్ల్యు సి బెనర్జీ, ఫిరోజిషా మెహతా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే ప్రభృతులు ప్రావిన్షియల్ కౌన్సిల్సులో సభ్యులుగా చేరారు కొద్దికాలంపాటు బాలగంగాధర్ తిలక్‌కూడా ప్రావిన్షియల్ కౌన్సిల్ సభ్యుడుగా వున్నాడు

అటు తరువాత ఫిరోజిషా మెహతా, గోపాలకృష్ణ గోఖలే ఇంపిరియల్ కౌన్సిల్ సభ్యులుగా నియమింపబడ్డారు అందువల్ల కాంగ్రెస్ తీర్మానాలు చాలా పేలవంగా వుండేవి

అయినా వినతిపత్రాలకు కొరత వుండేదికాదు పనిమాత్రం జరిగేదికాదు కనుకనే ఆ కాలాన్ని వినతిపత్రాల కాలంగా చరిత్రకారులు పేర్కొన్నారు ఆ దశలో కొందరు బ్రిటిష్ ప్రముఖులు కూడా కాంగ్రెస్ నాయకులుగా వుండేవారు 1888లో జార్జి యూల్, 1894లో ఆల్‌ఫ్రెడ్ వెబ్, 1904లో సర్ హెన్రీ కాటన్, 1910లో సర్ విలియం వెడ్డర్ బర్న్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు కాగా కొందరు కాంగ్రెస్ నాయకులు వారిని అనుకరించేవారు

కర్తవ్య నిర్వహణకు పూనుకోకుండా, ఆడంబరాలవైపుకు ఆకర్షింపబడుతున్న కాంగ్రెస్ నాయకులను జూచిన అలన్ హ్యూమ్‌కు విసుగెత్తింది "కాంగ్రెస్ చురుకుగా పని చేయకపోయినా, ప్రభుత్వం బాధ్యతాయుతంగా ప్రవర్తించకపోయినా రైతాంగ విప్లవం తప్పదు" అంటూ ఒక కరపత్రం వ్రాసి పంచిపెట్టి ఇంగ్లాండుకు వెళ్ళిపోయాడు అయినా ఆయనను కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నుకునేవారు కాని ఆయన సూచించిన విధంగా గ్రామీణ ప్రజలతో, ముఖ్యంగా రైతులతో సంబంధాలు పెట్టుకునేవారు కాదు ఏ విషయంలోనైనా సురేంద్రనాథ బెనర్జీ, డబ్ల్యు సి బెనర్జీ, ఆనందాచార్యులు, ఫిరోజిషా మెహతా కలసి చేసిన నిర్ణయాలే అమలుజరిగేవి వారికి రెనడేగారి సలహాలందుతుండేవి కనుక పూనా సార్వజనిక సభ, మద్రాసు మహాజన సభలాంటి సంఘాలు నిరుపయోగంగా తయారయ్యాయి

కాని, ఇంగ్లాండులో విలియం వెడ్డర్ బర్న్ అధ్యక్షతన ఏర్పడిన కాంగ్రెస్ కమిటీ చురుకుగా పనిచేసేది ఆ కమిటీ తరపున వెలువడే "ఇండియా" పత్రికను దాదాభాయ్ నౌరోజీ, అలన్ హ్యూమ్ కలిసి నడిపేవారు లిబరల్ దృక్పధంగల ఆంగ్లేయులు భారతీయుల కోర్కెలను బలపరిచేవారు కాగా కన్సర్వేటివులు కళ్లెర్రజేసి, బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికల్లో దాదాభాయ్ నౌరోజీని ఓడించారు ఐ సి ఎస్ పరీక్షలను ఇండియాలోకూడా నిర్వహించాలన్న తీర్మానాన్ని బుట్టదాఖలు చేశారు

ఆ పరిస్థితిని బ్రిటిష్ ప్రభుత్వం చక్కగా ఉపయోగించుకోగలిగింది ఆఫ్ఘనిస్థాన్‌ను లొంగదీసి, ఉత్తర బర్మా వరకూ తన సామ్రాజ్యాన్ని విస్తరించుకోగలిగింది కాగా విభజించి పాలించడమనే కుటిల నీతిని ప్రయోగించి హిందూ-ముస్లిం విభేదాలను పెంచడానికి పూనుకుంది

## అలీఘర్ - దేవ్‌బంద్ ఉద్యమాలు

ఇంగ్లీషువారిని, ఇంగ్లీషు చదువులను వ్యతిరేకించడంవల్ల ముస్లిములు వెనుకబడిపోతున్నారని సయ్యద్ అహమ్మద్‌ఖాన్ భావించాడు ముస్లిం ధనిక వర్గాలను ఆకర్షించేందుకు 1864లో ఒక సైంటిఫిక్ సొసైటీని స్థాపించాడు హిందువులు ముస్లిమ్‌లు కలిసి మెలిసి జీవిస్తూ ఆంగ్లేయుల అండదండలతో అభివృద్ధి చెందాలని ప్రచారం చేశాడు కనుక బెనారస్ మహారాజు మద్దతుకూడా ఆయనకు లభించింది అయినా ఆ సొసైటీ ఎంతోకాలం నిలవలేదు.

1870లో "తహ జీబ్ అల్ అఖ్ లఖ్" అనే పత్రికను ప్రారంభించాడు 1875లో అలీఘర్‌లో 'ఆంగ్లో-మహ్మడెన్ ఓరియంటల్ కాలేజీ స్థాపించాడు ఇంగ్లీషు చదివి ప్రభుత్వోద్యోగాలలో చేరకపోతే అణగారిపోతారని ముస్లిములను హెచ్చరించాడు

సయ్యద్ అహమ్మద్ ఖాన్ కార్యకలాపాలను ముస్లిమ్ మతగురువులు వ్యతిరేకించారు ఇస్లాం మతధర్మాలతోపాటు ఉర్దూ, అరబిక్, పర్షియన్ భాషలను బోధించేందుకు 1867 దేవ్‌బంద్‌లో, మహమ్మద్ ఖాసిం నానవ్ తావీ, రషీద్ అహమ్మద్ గంగోహీ కలిసి "దార్-ఉల్-ఉలుమ్" విద్యా కేంద్రాన్ని స్థాపించారు

ఆధునిక శాస్త్రీయ విజ్ఞానం వెల్లడించిన ప్రకృతి రహస్యాలకు, ఖురాన్‌లోని ప్రకృతి సూత్రాలకు సారూప్య మున్నదని సయ్యద్ అహమ్మద్ ఖాన్ వాదించేవాడు ఖురాన్ ధర్మసూత్రాలకు సరియైన అర్థం చెప్పే స్వేచ్ఛ ముస్లిములందరికి కలదనేవాడు

సయ్యద్ అహమ్మద్ ఖాన్‌కు ఇస్లాం మతమునందు విశ్వాసంలేదని మతగురువులు నిందించేవారు ఇంగ్లీషు చదవకూడదని, మొఘల్ సామ్రాజ్యాన్ని కబళించిన బ్రిటిష్ వారితో పొత్తు తగదని ఆదేశించేవారు ముస్లిం రాజ్యాల ఐక్యత, టర్కీ సుల్తాన్ నాయకత్వం అవసరమనేవారు

అలా ఒకదానికొకటి వ్యతిరేకంగా సాగిన ఉద్యమాలే. ఆలీఘర్, దేవ్‌బంద్ ఉద్యమాలు దేవ్‌బంద్ ఉద్యమం ఖిలాఫత్ ఉద్యమానికి ప్రోదిచేస్తే, ఆలీఘర్ ఉద్యమం దేశ విభజనకు దారితీసింది

ముస్లిమ్ మత గురువుల కార్యకలాపాలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగాను, పాన్ ఇస్లామిజమ్‌కు అనుకూలంగాను వున్నందున, సయ్యద్ అహమ్మద్‌ఖాన్ ప్రారంభించిన ఉద్యమాన్ని బలపరచడం అవసరమని 1871లో హంటర్ సూచించాడు ఆ సూచనను లార్డ్ మేయో అంగీకరించాడు లార్డ్ నార్త్‌బ్రూక్ సయ్యద్ అహమ్మద్ ఖానుకు పదివేల రూపాయల విరాళమిచ్చాడు అహమ్మద్‌ఖాన్ ఇంపీరియల్ కౌన్సిల్ సభ్యుడు కనుక ముస్లిం ధనిక వర్గాలతో ఆయనకు మంచి సంబంధమేర్పడింది ఉత్తరప్రదేశ్‌లోని ముస్లిం జమీందార్ల అండ ఆయనకు లభించింది ఆనాడు నైజాం దివానుగావున్న సాలార్‌జంగ్ బాగా ఆర్థిక సహాయం చేశాడు కాగా 1888లో సయ్యద్ అహమ్మద్‌ఖాన్ ఆలీఘర్ ముస్లిమ్ కళాశాలను స్థాపించగలిగాడు

అప్పటినుండి ఆయన ప్రచారం ద్విముఖంగా సాగింది ఒకవైపు ముస్లిమ్ మత గురువులను ఎదిరిస్తూ, మరోవైపున జాతీయ కాంగ్రెసును వ్యతిరేకించాడు ముస్లిమ్‌లకు ఎక్కువ ఉద్యోగాలు, కౌన్సిల్సులో ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థించాడు కాంగ్రెస్ కోరిన విధంగా వివిధ సంస్థలనుండి కౌన్సిల్ సభ్యులను ఎన్నుకోవడం జరిగితే, హిందువులకు ఖచ్చితంగా మెజారిటీ వుంటుంది గాబట్టి ఎన్నిక పనికి రాదన్నాడు పబ్లిక్ పరీక్షల్లో ఉత్తీర్ణులైనవారికే ఉద్యోగాలివ్వాలని కాంగ్రెస్ కోరిన కోర్కెను ఆమోదిస్తే, ఉద్యోగాలన్నీ హిందువులకే లభిస్తాయిగాబట్టి, కనీస అర్హత ప్రాతిపదికగా ముస్లిములకు తగినన్ని ఉద్యోగాలివ్వాలన్నాడు తాను జాతీయ కాంగ్రెసును విమర్శించడానికిగల కారణాన్ని ఇలా వివరించాడు

"భారతదేశంలో వివిధ మతాల వారున్నారు కాబట్టి భారతీయులందరూ ఒకే జాతివారనే సిద్ధాంతాన్ని నేను తిరస్కరిస్తున్నాను జాతీయ కాంగ్రెస్ ముస్లిములకెలా ప్రాతినిధ్యం వహిస్తుంది? వహించజాలదు కనుక దానికి జాతీయ కాంగ్రెస్ అని పేరు పెట్టడం తప్పు కనుకనే నేను జాతీయ కాంగ్రెస్‌ను వ్యతిరేకిస్తున్నాను వ్యతిరేకించకపోతే, ముస్లిములకేగాక హిందువులకుకూడా ముప్పు తప్పదు" అంటూ ద్విజాతి సిద్ధాంత బీజం నాటాడు దాన్ని పెంచి పోషించేందుకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తోడ్పడ్డారు

సయ్యద్ అహమ్మద్‌ఖాను ప్రభృతులను కూడగట్టేందుకు, 1887లో అలన్ హ్యూమ్ గట్టిగా ప్రయత్నించాడు బద్రుద్దీన్ త్యాబ్జీద్వారా ఒక హామీనికూడా వారికి అందచేశాడు ఏదైనా ఒక తీర్మానం కౌన్సిల్సులో ప్రవేశపెట్టబడినపుడు ఆ తీర్మానాన్ని ఎక్కువమంది హిందూ కౌన్సిలర్లు వ్యతిరేకించినా లేక ఎక్కువమంది ముస్లిం కౌన్సిలర్లు వ్యతిరేకించినా, తీర్మానాన్ని ఉపసంహరించే ఏర్పాటు చేసుకోవచ్చునని హామీ యిచ్చాడు అయినా ఆలీఘర్ ఉద్యమ నాయకులు వినలేదు

## సంస్కరణవాదం-పునరుద్ధరణవాదం-మతకలహాలు

ముస్లింలలో వున్నట్లే హిందువుల్లోకూడా పునరుద్ధరణవాదం బలంగా వుండేది వారు ఖురానును మించిన ధర్మగ్రంథం మరొకటి లేదంటే, వీరు వేదాలను మించిన ధర్మ గ్రంధాలెక్కడున్నాయని ప్రశ్నించేవారు ఉర్దూభాష రాజభాషగా వుండాలని ముస్లిం పెద్దలు కోరితే, సంస్కృతం రాజభాష కావాలని హిందూ పెద్దలు కోరేవారు బక్రీద్ పండగనాడు గోవును వధించి తీరాలని ముస్లిములు పట్టుబడితే, గోవధను నిషేధించాలని హిందువులు ఆందోళన చేసేవారు అందువల్ల హిందూ-ముస్లిమ్ విభేదాలు పెరిగాయి

మరోవైపున హిందూమత పునరుద్ధరణ వాదులకు, సంస్కరణ వాదులకు మధ్యకూడా విభేదాలు పొడసూపాయి బ్రహ్మ సమాజంలో చీలికలేర్పడ్డాయి ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ప్రారంభించిన ఉద్యమ ప్రభావం తగ్గింది "వంగవాసి" పత్రిక కాళీపూజలను ప్రోత్సహించింది జోగీంద్ర చంద్ర ఘోష్ పునరుద్ధరణ వాదాన్ని చేపట్టాడు మధ్యతరగతి మేధావులకు ఆదర్శంగా కృష్ణావతారాన్ని బంకించంద్ర ఛటర్జీ చిత్రిస్తే, చైతన్య ప్రభువును అమృత బజార్ పత్రిక చిత్రించింది రామకృష్ణ పరమహంస శిష్యుల్లోకూడా అభిప్రాయ భేదాలు పొడచూపాయి

1878లో వీరేశలింగం పంతులు ఆంధ్రలో ప్రారంభించిన సంస్కరణోద్యమాన్ని సనాతనులు వ్యతిరేకించారు వితంతు వివాహాలు చేయించినందుకాయనను కష్టాలపాలు చేశారు

మహారాష్ట్రలో మహాదేవ గోవింద రనడే, కె టి తెలాంగ్ (ప్రార్థనా సమాజ నాయకుడు) చేపట్టిన సంస్కరణ కార్యక్రమాలను ఆర్ జి భండార్కర్, ఎన్.సి చందావర్కార్ వ్యతిరేకించారు రాజకీయాలకు, సంస్కరణ కార్యక్రమాలకు ముడిబెట్టకూడదని బాల గంగాధర్ తిలక్ వాదించాడు 1895లో కాంగ్రెస్ మహాసభ పందిట్లో సాంఘిక సంస్కరణల సదస్సు జరపకూడదని రనడే ప్రభృతులను తిలక్ వారించాడు కాని, యుక్తవయస్సు రాకముందే ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయకూడదని, స్త్రీలకు విద్యగరపడం అవసరమని రనడేతో కలిసి ప్రచారం చేశాడు

ఆ రోజుల్లో సనాతన ధర్మపునరుద్ధరణవాదం చాలా బలంగా వుండేది ఆదిలో అనిబిసెంట్ కూడా ఆ వాదాన్ని బలపరిచింది, 1882లో మద్రాసులో దివ్యజ్ఞాన సమాజ స్థాపన జరిగిన పిమ్మట, హిందువుల సనాతన ధర్మం చాలా ఉత్తమమైనదని అనిబిసెంట్ ప్రకటించింది. కాని కొన్నాళ్ల తరువాత ఆ అభిప్రాయాన్ని మార్చుకుంది

సనాతన ధర్మవాదాన్ని విమర్శిస్తూ 1890లో కె ఎన్ నటరాజన్ మద్రాసులో "ఇండియన్ సోషల్ రిఫార్మర్" పత్రికను స్థాపించి, పెద్ద ఎత్తున ప్రచారం చేశాడు తత్ఫలితంగా 1892లో-సోషల్ రిఫార్మ్ అసోసియేషన్ స్థాపన జరిగింది

పంజాబ్‌లో దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజ్ ఆయన మరణానంతరం

చీలిపోయింది లాలాలజపతిరాయ్, హంసరాజులు కాంగ్రెస్ రాజకీయాలతో సంబంధం పెట్టుకొని వేద పాఠశాలలతోపాటు ఇంగ్లీషు పాఠశాలలనుకూడా నెలకొల్పుతోంటే లేఖ్‌రామ్, మున్షీరామ్‌లు వేద పాఠశాలలు, గురుకుల ఆశ్రమాలు నెలకొల్పారు లాలా లాల్‌చంద్ జాతీయ కాంగ్రెస్‌ను గట్టిగా విమర్శించి, హిందూసభల, పత్రికల అవసరాన్ని నొక్కిచెప్పాడు

కొందరు హిందూమత పెద్దలు హరిసభలు, సనాతన ధర్మసభలు, కుంభమేళాల సభలు ఏర్పాటు చేశారు ప్రపంచానికి జ్ఞాన భిక్షతోపాటు విజ్ఞాన భిక్షనుకూడా పెట్టింది వేదాలేనని ప్రచారం చేశారు అనేక రాష్ట్రాలలో గో సంరక్షణ సంఘాలను నిర్మించారు

## ఆంగ్లేయుల కుటిల నీతి

గోవధను నిషేధించాలనే ఉద్యమం ఉత్తర భారతదేశమంతటా విస్తరించడంవల్ల ముస్లిములలో కలవరం బయలుదేరింది అదే అదనుగా భావించిన ప్రభుత్వం ముస్లిములను కూడగట్టుకునేందుకు పూనుకున్నది "ముస్లిములు వెనుకబడిన జాతి" అని హంటర్ ప్రకటించాడు "ఐదుకోట్ల ప్రజలుగల జాతి" అని వైస్రాయి డఫ్రిన్ ప్రకటించాడు అటు తరువాత లార్డ్ క్రాస్ కొక ఉత్తరం వ్రాస్తూ ఇలా వివరించాడు

"ముస్లిముల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు ఒకేవిధంగా వున్నాయి ఢిల్లీనుండి ముస్లిములు పాలించిన రోజుల్లో హిమాలయాలనుండి కన్యాకుమారి వరకూ తమది పైచేయిగా వుండేదనే విషయం ముస్లిములందరికీ తెలుసు" (డఫ్రిన్ టు క్రాస్ 11-11-1888)

డఫ్రిన్ లేఖలో అతిశయోక్తులున్నాయి హిందువులను ముస్లిములను వేరుచేసే ప్రయత్నముంది "ముస్లిములు ప్రత్యేకజాతి" అని వాదించే సయ్యద్ అహమ్మద్ ఖాన్‌తో చేతులు కలిపిన సూచన వుంది

అలా అన్ని వైపులనుండీ పచ్చి స్వార్థం అతిశయ గర్వం సనాతన ఛాందసం పెల్లుబకడంవల్ల మతకలహాలు ప్రారంభమయ్యాయి గోవధకు సంబంధించిన కొట్లాటలు ముందుగా పంజాబులో జరిగాయి అవే కొట్లాటలు 1883-93 మధ్యకాలంలో పెద్ద ఎత్తున ఉత్తరప్రదేశ్‌లో జరిగాయి అక్కడనుండి అటు మహారాష్ట్రకు, ఇటు బీహార్‌కు వ్యాపించాయి బీహార్‌నుండి కలకత్తాకు పాకాయి 1896-97ల్లో బక్రీద్ పండగ సందర్భంలో టిటాఘర్, గార్డెన్ రీచ్, తల్లా ప్రాంతాలలో పెద్ద ఎత్తున మతకలహాలు చెలరేగాయి

వాయిద్యాలు వాయించుకుంటూ హిందువుల ఊరేగింపులు మసీదుల ముందుగా వెళ్లవచ్చునా? లేదా? అన్న సమస్యమీద బాంబేలో మతకలహం చెలరేగింది అదే సమస్యపై జునాఘడ్ సంస్థానంలోను, సుదూరంగావున్న రంగూన్‌లోను కొట్లాటలు జరిగాయి

బెంగాల్ జూట్‌మిల్లుల్లో పనిచేసే ముస్లిమ్ కార్మికులు ముహరమ్ పండగ రోజున సెలవు కావాలంటే, హిందూ కార్మికులు రథయాత్ర రోజున సెలవు కావాలని పట్టుబట్టి కొట్లాడుకున్నారు తరువాత వారిమధ్య మరికొన్ని కొట్లాటలుకూడా జరిగాయి అలా దేశమంతటా చెలరేగిన మతకలహాలను జూచి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు చాలా సంతోషించారు లండన్‌లోనున్న ఇండియా కార్యదర్శి కింబర్లే వైస్రాయ్ లాన్స్ డౌన్‌కి ఇలా వ్రాశాడు

"మత విశ్వాసాలతో నిమిత్తం లేకుండా ఇండియాలోని ప్రజలందరినీ ఐక్యపరచాలనే జాతీయ కాంగ్రెస్ ఆశయాల కూకటివేళ్లు తెగిపోతున్నందుకు నేను సంతోషిస్తున్నాను" (కింబర్‌లె టు లాన్స్ డౌన్ 25-8-1893)

1893 తరువాత మతకలహాలు మరీ పెరిగాయి కాగా శాంతి భద్రతల సమస్యను ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది కనుక 1897లో ఇండియా కార్యదర్శి హామిల్టన్ వైస్రాయ్ ఎల్జిన్‌కు ఇలా వ్రాశాడు

"పంజాబ్‌లోను, పశ్చిమోత్తర ప్రాంతాలలోనుగల హిందూ-ముస్లిమ్ ప్రజలమధ్య కలహాలు పెరుగుతున్నందుకు నేను విచారిస్తున్నాను ఈ సందర్భంలో మనం కోరదగినదేమిటో నాకు తెలియడంలేదు రాజకీయంగా ఆలోచిస్తే భారతీయుల మధ్య ఐక్యత మనకు చాలా ప్రమాదకరం వారిమధ్య అభిప్రాయ భేదాలు, ఘర్షణలు పరిపాలనను కష్టతరం చేస్తాయి అధికారులకు ఆందోళన కలుగుతుంది బాధ్యత పెరుగుతుంది అయినా మొదటిగానికంటే ఇదే తక్కువ అపాయకరం"

అంతకుముందు బ్రిటిష్‌వారి పాలసీ ముస్లిములకు అనుకూలంగా వుండేది కాదు మొఘల్ పాదుషాల రాజ్యాన్ని ఆక్రమించారనే కోపంతో తమపైన ముస్లిములు కుట్రలు పన్నుతారనే అనుమానం బ్రిటిష్‌వారికుండేది కాని అలిఘర్ ఉద్యమం ప్రారంభమైన పిమ్మట ఆ అనుమానం తగ్గింది జాతీయ కాంగ్రెసును వ్యతిరేకించే ముస్లిములను ప్రోత్సహించడం ప్రారంభమైంది

1893లో అలిఘర్ ముస్లిం కాలేజీ ప్రిన్సిపాల్‌గానున్న ప్రొఫెసర్ బేక్ ప్రోత్సాహంతో మహమ్మదీయ రక్షణ సమితి ఏర్పడింది కొందరు ఇస్లామ్ మత పెద్దలు "అన్జు మాన్-ఇ-హిమాయత్-ఇ-ఇస్లామ్" అనే మరొక మతసంస్థను ఏర్పాటు చేశారు

పూనాలో హిందూ ధర్మరక్షణ సమితి ఏర్పడింది తిలక్‌గారి ప్రోత్సాహంతో గణపతి ఉత్సవాలు, శివాజీ జయంతి ఉత్సవాలు ప్రారంభమయ్యాయి

బెంగాల్లో బంకించంద్ర ఛటర్జీ, హరిశ్చంద్ర ముఖర్జీ ప్రభృతులు కాళీ పూజలను ప్రోత్సహించారు ఆర్యసమాజ్ (పంజాబ్)లోని ఒక వర్గానికి లాలా లజపతిరాయ్‌గారు నాయకత్వం వహించగా, "భారత ధర్మ మహామండలి"కి మదన్ మోహన్ మాళవీయ నాయకత్వం వహించారు

ఇలా మత ప్రమేయంగల సంస్థలు ఏర్పడడం వల్ల, వాటి ప్రభావం భారత జాతీయ కాంగ్రెస్ మీద ప్రసరించింది జాతీయ కాంగ్రెస్‌లో ముస్లిమ్ ప్రతినిధుల సంఖ్య బాగా తగ్గింది 1889లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో 258 మంది ముస్లిమ్ ప్రతినిధులు పాల్గొనగా, 1905లో కేవలం 17 మంది ప్రతినిధులు మాత్రమే పాల్గొన్నారు

అయినా కోట్లాది సామాన్య ప్రజలు కలిసి మెలిసి జీవించారు హిందువుల పండగల్లో ముస్లిములు, ముస్లిముల పండగల్లో హిందువులు పాల్గొనేవారు తమ కష్ట నివారణకు చేతులు కలిపి పోరాడేవారు కాగా బొంబాయి గవర్నర్ రే ఆనాటి వైస్రాయ్ లాన్స్‌డౌన్‌కు ఒక రహస్య ఉత్తరం వ్రాశాడు

"మన అడవుల పాలసీ, అబ్కారీ పాలసీ, మనం విధించిన ఉప్పు పన్ను, అదే పనిగా పెంచిన భూమి పన్ను ప్రజలు తిరగబడేందుకు కారణమవుతున్నాయి విద్యావంతులైన ఇండియన్లు కోరుతున్నదేమిటో మనకు బాగా తెలుసు కాని నిరక్షరాస్యులైన ప్రజలు కోరుతున్నదేమిటో నాకు తెలియడంలేదు"

## పన్నుల నిరాకరణ ఉద్యమాలు

1893-94 సంవత్సరాలలో పెంచిన భూమిశిస్తుకు వ్యతిరేకంగా అస్సామ్‌లోని కామరూప్, దరాంగ్ జిల్లాల రైతులు పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించారు ఎవరైనా పన్నులు చెల్లిస్తే వారిని వెలివేశారు పథర్‌ఘాట్, రంగీయాలలో పోలీసు కాల్పులు జరిగినా వెనకకు తగ్గలేదు జోర్హట్‌లోని సార్వజనిక సభ రైతుల పన్నుల నిరాకరణోద్యమాన్ని పూర్తిగా బలపర్చింది ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో సభ్యుడుగానున్న రసవిహారీ ఘోష్ పన్నులు తగ్గించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు చివరకు ప్రభుత్వం దిగివచ్చి పన్నులు తగ్గించింది

1894లో ఏలూరులో జరిగిన కృష్ణాజిల్లా రైతు మహాసభలో నీటి తీరువా హెచ్చింపుకు వ్యతిరేకంగా తీర్మానించారు రైతుల కోర్కెను ప్రభుత్వం మన్నించనందుకు పంట భూములను సాగు చేయకుండా పాడుబెట్టారు అలా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రారంభమైన ఉద్యమం జమీందారీ వ్యతిరేకతనుకూడా సంతరించుకుంది ఏక్‌సాల్ పట్టాలు కాకుండా జమీందార్లు శాశ్వత పట్టాలివ్వాలని రైతులు డిమాండ్ చేశారు

ప్రభుత్వం దిగొచ్చింది జమీందార్లు శాశ్వత పట్టాలిచ్చారు చివరకు ఎస్టేట్ ల్యాండ్ సవరణ చట్టం (1908) అమలులోకి వచ్చింది (ఈ పోరాటంవల్ల కలిగిన విజయమే 1919-1920 నాటి పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమానికి, 1929-1930లో ప్రారంభమైన "రీసెటిల్‌మెంటు" వ్యతిరేకోద్యమానికి స్ఫూర్తినిచ్చింది.)

1896-97 సంవత్సరాలలో తీవ్రమైన కరువులవల్ల బాధపడిన మహారాష్ట్ర రైతులు శిస్తుల రద్దు కొరకు ఉద్యమం సాగించారు ఆ ఉద్యమాన్ని "పూనా సార్వజనిక సభ" పూర్తిగా బలపరిచింది లోకమాన్య తిలక్ అనేకమంది స్వచ్ఛంద సేవకులను గ్రామాలకు పంపించి, చట్టరీత్యా రైతులకుగల హక్కులను కాపాడేందుకు పూనుకున్నారు అనేక సభలు జరిపారు కరపత్రాలు ప్రకటించారు కాగా రాణా, కొలాబా, రత్నగిరి జిల్లాలలో రైతులు పన్నులు చెల్లించడం మానివేశారు. అందువల్ల ప్రభుత్వం రెమిషన్ యిచ్చింది

ఇలాంటి ఉద్యమాలు తమిళనాడు, బీహార్ మున్నగు ప్రాంతాలలోకూడా జరిగాయి వీటితోపాటు అనేక గిరిజన పోరాటాలుకూడా జరిగాయి

## బిర్సామోండా తిరుగుబాటు

ఝార్‌ఖండ్ ప్రాంతంలోని మోండా ప్రజల భూములను ఉత్తర మైదానాలనుండి వచ్చిన వర్తకులు, వడ్డీ వ్యాపారులు కాజేసేవారు గ్రామ సాముదాయక భూములను ప్రభుత్వం అడవి భూములుగా మార్చి రికార్డులు సృష్టించేది. అనేకమంది నిరుపేద గిరిజనులను కంట్రాక్టరులు తీసుకుపోయి అస్సాం తేయాకు తోటల్లో కూలీలుగా పని చేయించుకునేవారు కాగా మోండా గిరిజన పోరాటం ప్రారంభమైంది దానికి బిర్సామోండా నాయకత్వం వహించాడు ఆయనకు అండగా "గయామోండా" మొదలగువారు నిలబడ్డారు

తనకు అద్భుత శక్తులున్నాయని బిర్సామోండా నమ్మించాడు తనముందు బ్రిటిష్‌వారి తుపాకులు, ఫిరంగులు పనిచేయవన్నాడు మోండాతెగవారు నమ్మారు 1897వ సంవత్సరపు హోలీ పండుగ రోజున తిరుగుబాటు చేశారు ప్రభుత్వ సైన్యానికి,

మోండా వీరులకు మధ్య "చిల్కాడ్"వద్ద పోరాటం జరిగింది బ్రిటిష్ సైన్యానికి బాగా నష్టం కలిగించిన పిమ్మట, తన అనుచరులతోపాటు బిర్సా తప్పించుకుపోయాడు తరువాత తన అనుచరులకు గెరిల్లా యుద్ధ పద్ధతుల్లో శిక్షణ గరిపాడు

పిమ్మట 1899 లో అనేక పోరాటాలు జరిగాయి ప్రభుత్వ సైనికులనేకమంది మరణించారు అనేక పోలీసు స్టేషన్లను మోండా వీరులు ధ్వంసం చేశారు తాలూక్‌దార్లు, జాగీర్దార్లు, వడ్డీ వ్యాపారులు మున్నగువారిని తరిమేశారు కొందరిని చంపేశారు బ్రిటిష్ పతాకాలను తగులబెట్టారు

"తంజా" నదీ తీరంలో జరిగిన భీకర పోరాటంలోకూడా విజయం బిర్సాకే సిద్ధించింది ఫార్వాడా, మురూ, తోర్పా మొదలగు ప్రాంతాలతోపాటు రాంచీ పట్టణంకూడా మోండా వీరుల వశమైంది కాగా ప్రభుత్వం పెద్ద ఎత్తున సైనిక సమీకరణ చేయడంతోపాటు మోండా నాయకుల్లో విభేదాలు కల్పించింది అటు పిమ్మట అనేక డివిజన్ల సైన్యంతో విరుచుకుపడింది శత్రువుల వ్యూహాన్ని వివరంగా తెలుసుకున్న బిర్సామోండా, తన అనుచరులతో కలిసి తెగించి పోరాడాడు మూడు రోజులపాటు జరిగిన గెరిల్లా యుద్ధంలో ప్రభుత్వ సైన్యాలకు అపారనష్టం కలిగించిన పిమ్మట తప్పించుకుపోయాడు కాని గయామోండా నేలకొరిగాడు చివరికి 1900 సంవత్సరంలో వీర్‌సింగ్, కాందాసింగులు చేసిన ద్రోహంవల్ల బిర్సామోండా ప్రభుత్వ సైన్యానికి పట్టుబడిపోయాడు కాని కొద్దికాలంలోనే రాంచీ జైలులో జబ్బుచేసి మరణించి అమరవీరుడయ్యాడు

ఆ పోరాటంలో పట్టుబడిన 350 మంది మోండా వీరులకు ప్రభుత్వం రకరకాల శిక్షలు విధించింది ముగ్గురిని ఉరితీసింది 44 మందికి అండమాన్ దీవుల్లో జీవితఖైదు విధించింది అయినా అమరవీరుల కోర్కెలు ఫలించాయి చోటా నాగపూర్ ప్రాంతంలో ప్రభుత్వం సర్వే సెటిల్‌మెంటు రికార్డులు తయారుచేసింది 1908లో చోటా నాగపూర్ టెనెన్సియాక్టును అమలు జరిపింది మోండా ప్రజల భూములను బయటివారు స్వాధీనం చేసుకోకుండా కట్టుదిట్టం చేసింది కనుకనే ఆనాడు బిర్సా నాయకత్వాన జరిగిన పోరాటాన్ని తలుచుకుంటూ, ఈనాడు 'జార్‌ఖండ్ ఉద్యమ' నాయకులు ఉత్తేజితు లవుతున్నారు

## కొర్రమల్లయ్య పోరాటం

విజయనగరం జిల్లాలోని పాచిపెంట దగ్గరలోగల కొండలమధ్య "కొర్రవాని వలస" గ్రామముంది అక్కడ నివసించే గిరిజనుల్లోగల మూఢనమ్మకాలను కొర్ర మల్లయ్య బాగా ఉపయోగించుకున్నాడు. తానొక అవతారపురుషుడననే నమ్మకాన్ని ఆ ప్రాంతంలోగల గిరిజనులకు కలిగించాడు తన సహచరులైన ఐదుగురు వీరులకు పంచపాండవుల పేర్లు పెట్టాడు తన కొడుకు కృష్ణుని అవతారమన్నాడు

ఎక్కడనుండో వచ్చి యిక్కడగల అడవి సంపదను హరిస్తూ నిక్కుతున్న ప్రభుత్వానికి కప్పం కట్టకూడదని కట్టడి చేశాడు తెల్లదొరకు భయపడి బ్రతకడంకన్నా చావడం మేలన్నాడు తనకుగల అద్భుత శక్తుల నుపయోగించి వెదురు కర్రలను తుపాకులుగాను, మట్టి ముద్దలను బాంబులుగాను మార్చగలనని చాటిచెప్పాడు అందరూ నమ్మారు 1900 మేనెల 7వ తేదీన ప్రభుత్వ సైన్యాలు కొర్రవాని వలస ప్రాంతాన్ని చుట్టుముట్టాయి ఏడుగురు వీరులు పోరాటంలో నేలకొరిగారు పట్టుబడిన మల్లయ్యకు, మరో ఇద్దరికి ప్రభుత్వం మరణశిక్షలు విధించింది 57గురికి వివిధ రకాల శిక్షలు వేసింది అటు

తరువాత కొర్ర మల్లయ్య భార్య పార్వతికూడా పోరాటాన్ని సాగించింది చివరకు సీలేరువద్ద జరిగిన పోరాటంలో తన కొడుకుతోపాటు మరణించింది

## వీరపాండ్య కట్టబ్రహ్మన

తిరునల్వేలి ప్రాంతంలో రైతులను, చేతి వృత్తులవారిని సమీకరించి వీరపాండ్య కట్టబ్రహ్మన బ్రిటిష్ వాళ్ళమీద తిరుగుబాటు చేశాడు ప్రభుత్వ సైన్యాలకు పట్టుబడకుండా ఆరేళ్లపాటు పోరాడాడు చివరకు ఎట్టాయపురం యువరాజు చేసిన ద్రోహంవల్ల పట్టుబడిపోయాడు 1899 లో ప్రభుత్వం ఆ మహావీరుణ్ణి ఉరి తీసింది

ఇలాంటి పోరాటాలకు మధ్య తరగతి మేధావులు నాయకత్వం వహిస్తే, అనతికాలంలోనే స్థానిక పోరాటాలు జాతీయ తిరుగుబాటుగా పరిణమిస్తాయనే భయం బ్రిటిష్‌వారికుండేది కాని అ అవగాహన లోకమాన్య తిలక్‌వంటి కొద్దిమందికి మినహా తక్కిన కాంగ్రెస్ నాయకులకుండేదిగాదు కనుకనే గోఖలే మున్నగువారు తీర్మానాలతో సంతృప్తిపడుతోంటే లోకమాన్యుడు పోరాట మార్గాన్ని చేపట్టాడు

## చాపేకర్ సోదరుల ఆత్మార్పణం

1897 జూన్ 12వ తేదీన జరిగిన శివాజీ జయంతి ఉత్సవ సభలో లోకమాన్య తిలక్ ఇలా ఉపన్యసించాడు

"నిష్కామబుద్ధితో దుష్టులను సంహరించవలసిన అవసరాన్ని శ్రీకృష్ణుడు అర్జునుడికి నొక్కి చెప్పాడు కనకనే అఫ్జల్ ఖాన్‌ను శివాజీ సంహరించాడు భారతదేశాన్ని పాలించవలసిందిగా విదేశీయులకు భగవంతుడు పట్టా యివ్వలేదు. ఏమి చేయాలి? ఏది చేయకూడదు? అనే ధర్మ సూత్రాలను నేర్చుకోవలసింది ఇండియన్ పీనల్‌కోడ్‌నుండి కాదు. భగవద్గీతను పఠించండి శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లు చేయండి "

ఈ ఉపన్యాసం విన్న చాపేకర్ సోదరులు ఇంగ్లీషు వాళ్లను చంపడానికి పూనుకున్నారు జూన్ 22వ తేదీ రాత్రి దామోదర చాపేకర్, బాలకృష్ణ చాపేకర్, మరొక ద్రావిడ యువకుడు కలిసి ర్యాండ్‌దొరను, మరొక లెఫ్టినెంటును రివాల్వర్లతో కాల్చి చంపారు కాని పట్టుబడిపోయారు పోలీసుల చిత్రహింసలకు తట్టుకోలేక ద్రావిడ యువకుడు అప్రూవరుగా మారాడు.

కోర్టులో విచారణ ప్రారంభమైంది చాపేకరుల చిన్న తమ్ముడు తన తల్లి అనుమతి తీసుకొని, చల్లగా కోర్టులో ప్రవేశించి, అప్రూవరును కాల్చి చంపాడు కాగా చాపేకర్ సోదరులు ముగ్గురూ ఉరికంబాలెక్కవలసి వచ్చింది పెద్ద కొడుకులిద్దరూ ఉరికంబ మెక్కనున్న తరుణంలో చిన్న కొడుకునుకూడా దీవించి పంపిన వీరమాత చిరస్మరణీయురాలు గదా?

అంతటితో ప్రభుత్వం సంతృప్తి చెందలేదు చాపేకర్ వంశంలో మరో ఇద్దరితోపాటు లోకమాన్యునికూడా అరెస్టు చేసింది అందువల్ల మరికొన్ని ఘటనలు జరిగాయి ప్రభుత్వం మరో నలుగురు యువకులను ఉరిదీసింది. అనేకమందిని జైళ్ళలో బంధించింది శ్యాంజీ కృష్ణవర్మ మాత్రం పట్టుబడకుండా తప్పించుకుని లండన్ చేరుకోగలిగాడు తరువాత లండనులోనున్న భారతీయులను సమీకరించి, హోమ్‌రూల్ సొసైటీని స్థాపించాడు

దేశాన్ని దోచుకుంటున్న ఇంగ్లీషు వాళ్లను చంపడమే చాపేకర్ సోదరుల ధ్యేయం

తాము ఆత్మార్పణ జేస్తే, అనేకమంది వీరులు రంగంలో దిగుతారని, స్వాతంత్ర్యం సిద్ధించి హైందవ ధర్మం పునరుద్ధరించబడుతుందని వారు విశ్వసించారు అంతేగాని పర ప్రభుత్వాన్ని పడగొట్టాలంటే ప్రజలను సమీకరించి ఉద్యమాలు నిర్మించవలసిన అవసరాన్ని వారు గుర్తించలేదు

అలాగే వహాబీ, పరౌజీ ఉద్యమాలలో పాల్గొని ప్రాణత్యాగం చేసినవారు కూడా ఇస్లాం మత ధర్మాన్ని పునరుద్ధరించగలమని విశ్వసించేవారు పోరాటాలను బలోపేతం చేయడానికి అవసరమైన వ్యూహం, ఎత్తుగడలు వారికి తెలియవు, పైగా మతావేశంలో రెచ్చిపోయేవారు కనుకనే ఆ ఉద్యమాలను ప్రభుత్వం తేలికగా అణచివేయగలిగింది

## నాయకుల భేదాభిప్రాయాలు

ఆ స్థితిలో కాంగ్రెస్ నాయకుల మధ్యగల భేదాభిప్రాయాలు బాగా ప్రస్ఫుటమయ్యాయి "హిందువులు, ముస్లిములు కలిసిమెలిసి జీవించాలి మూఢనమ్మకాలను విడనాడి, శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకోవాలి పారిశ్రామికాభివృద్ధిని, శాస్త్రసాంకేతికాభివృద్ధిని సాధించుకోవాలి ఒక్కొక్క మెట్టుగా పైకి పోతూ స్వపరిపాలనను ఏర్పాటు చేసుకోవాలి" అని గోపాలకృష్ణ గోఖలే, ఫిరోజిషా మెహతా ప్రభృతులు వాదించేవారు

"బ్రిటిష్ వాళ్లను నమ్ముకుంటే మన గతి అధోగతికాక తప్పదు కాబట్టి వాళ్లను సాధ్యమైనంత త్వరగా వెళ్లగొట్టాలి వినాయక పూజలు తెలివితేటలను, దుర్గ పూజలు శక్తిని ప్రసాదిస్తాయి వీరాభిమన్యుల్లా యువకులు విజృంభిస్తారు దాస్య శృంఖలాలు తెగిపోతాయి స్వాతంత్ర్యం లభిస్తే సాంఘిక సమస్యలు, మత సమస్యలు మున్నగువాటిని పరిష్కరించడం సులభమవుతుంది" అని లోకమాన్య తిలక్, అరవింద ఘోష్ మొదలైనవారు వాదించేవారు

బెంగాల్లో మోతీలాల్ ఘోష్ నాయకత్వానగల అమృతబజార్ పత్రిక మితవాదానికి, సురేంద్రనాధ్ బెనర్జీ పత్రిక "బెంగాలీ" అతివాదానికి తోడ్పడేవి

ఇంగ్లండునుండి తిరిగి వచ్చి బరోడా సంస్థానంలో దివానుగానున్నప్పుడు అరవింద ఘోష్, మితవాద కార్యకలాపాలను నిరసిస్తూ వరుసగా కొన్ని వ్యాసాలు వ్రాశాడు వినతిపత్రాలతో లాభంలేదని, మధ్యతరగతి మేధావులు కష్టజీవులతో సంబంధాలు పెంచుకొని, వారి హక్కుల కొరకు పోరాడాలని విజ్ఞప్తి చేశాడు

బారిసాల్ ప్రాంతంలో స్వదేశీ ఉద్యమాన్ని నిర్మించిన అశ్వనీకుమార దత్తు 1897లో జరిగిన అమరావతి కాంగ్రెస్ మహాసభను, మూడురోజుల తమాషాగా వర్ణించాడు

వినతిపత్రాలను సమర్పిస్తూ బ్రిటిష్‌వారిని దేవురించే పద్ధతిని రవీంద్రుడు విమర్శించాడు స్వయంశక్తిమీద ఆధారపడుతూ, స్వదేశీ పరిశ్రమలు నెలకొల్పుతూ, గంగపూజ, కుంభమేళాలాంటి సందర్భాలలో సభలు జరపడంద్వారా ప్రజలతో సంబంధాలు పెంచుకుంటూ బలపడాలని నొక్కి చెప్పాడు

"ఏడాదికోసారి వచ్చే పెద్ద పండుగలా కాంగ్రెస్ మహాసభను జరిపినందువల్ల ప్రయోజనం లేదు సాంకేతిక విద్యకు, పారిశ్రామికాభివృద్ధికి పాటుబడడం అవసరం" అంటూ లాలాలజపతిరాయ్ "కాయస్త సమాచార్" పత్రికలో వ్యాసాలు వ్రాశాడు

గణపతి పూజలను, శివాజీ ఉత్సవాలను ప్రోత్సహిస్తూ, పన్నుల నిరాకరణ ఉద్యమాలను బలపరుస్తూ బాలగంగాధర తిలక్ సామాన్య ప్రజలతో సంబంధాలు

పెంచుకున్నాడు కేసరి, కాల్ పత్రికలద్వారా అతివాద భావాలను వ్యాప్తిజేశాడు

పందొమ్మిదో శతాబ్దాంతానికి ఇంగ్లీషు చదివే విద్యార్థుల సంఖ్య 5 లక్షలకు పెరిగింది ఇంగ్లీష్ పత్రికల సర్క్యులేషన్ రెండున్నర లక్షలకు చేరింది దేశీయ భాషా పత్రికల సర్క్యులేషన్ 8 లక్షలకు పెరిగింది కనుక అతివాద, మితవాద నాయకుల అభిప్రాయాలను లక్షలాది యువకులు తెలుసుకోగలిగారు సహజంగానే పలువురు యువకులు అతివాద కార్యక్రమాలను చేపట్టారు దాదాభాయ్ నౌరోజీ చెప్పిన మాటలు వారి చెవుల్లో గింగురుమనేవి

" పూర్వం విదేశీ దండయాత్రలు జరిగినప్పుడు కొల్లగొట్టినవాటితో వాళ్ళు సంతృప్తిపడ్డారు లేదా, దేశ పాలకులుగా యిక్కడనే స్థిరపడ్డారు అప్పుడు ఇండియాకు తీవ్ర గాయాలు తగిలినా అవి నయమయ్యాయి ఇండియా తిరిగి కోలుకున్నది దేశంలో జరిగిన ఉత్పత్తి దేశంలోనే వుండిపోయింది ఇంగ్లీషువాళ్ల విషయంలో ఇదంతా మారిపోయింది యుద్ధాలవల్ల గలిగిన పెద్ద గాయాలను మాన్పకుండా, వాటినింకా ఎక్కువజేశారు ఆ గాయాలు మరేవో కాదు- అవి ప్రజల రుణభారాలు నిరంతర ప్రవాహంగా జీవనరక్తం తరలించబడుతూనే వుంది గతంలో పాలకులు కసాయివాళ్లలా ఎక్కడో ఒకచోట కత్తితో పొడిచేవారు కాని ఇంగ్లీషువాళ్లు శాస్త్రీయ పద్ధతిలో, సర్జన్ కత్తితో గుండె కోత కోస్తున్నారు అయినా గాయం పైకి కనపడదు నాగరికత, అభివృద్ధి మొదలగు మాటలు 'ప్లాస్టర్' వలె గాయాన్ని కప్పిపెట్టి వుంచుతాయి " అని విమర్శించాడు నౌరోజి

నౌరోజీ చెప్పిన జీవనరక్త ప్రవాహాన్ని ఆపేందుకు అతివాదులు పూనుకున్నారు కాని స్వదేశీ ఉద్యమం, జాతీయ విద్యలతోపాటు సనాతన ధర్మ పునరుద్ధరణ కార్యక్రమాలను చేబట్టారు

కాంగ్రెస్ నాయకుల్లో వున్నట్లే ముస్లిమ్ పెద్దల్లోకూడా విభేదాలుండేవి ప్రభుత్వోద్యోగాలలో చేరి, ఇంగ్లీషువారి సహాయంతో అభివృద్ధి చెందాలని చెప్పిన ఆలీఘర్ ఉద్యమ నాయకులు మితవాదులుగా పరిగణింపబడేవారు ఇంగ్లీషువారిని వెళ్లగొట్టి ఇస్లామ్ ధర్మస్థాపనకు పూనుకోవాలని ప్రబోధించిన దేవ్‌బంద్ ఉద్యమ నాయకులు అతివాదులుగా పరిగణింపబడేవారు పైగా కొందరు ముస్లిమ్ పెద్దలు "ఇస్లామ్ ధర్మ రక్షణ సమితి"ని ఏర్పాటు చేశారు దానికి ప్రతిగా హిందూ పెద్దలు "హిందూ ధర్మ రక్షణ సమితి"ని స్థాపించారు

## వివేకానందుడు

అలాంటి స్థితిలో వివేకానందుడు, ప్రజాసేవ కొరకు రామకృష్ణ మిషన్ స్థాపించాడు రాజకీయ నాయకుల కార్యకలాపాలను విమర్శించాడు ప్రపంచ మతాల కన్నింటికీ అద్వైతం శిరోధార్యం కావాలన్నాడు

"వేదాంతం మెదడుగా, ఇస్లాం శరీరంగా, హిందూ ముస్లిమ్ ఐక్యత పెంపొందితే, అరాజకంనుండి, ఘర్షణలనుండి ఇండియా బైటపడి అద్భుతంగా విలసిల్లగలదు" అంటూ ఒక ముస్లిమ్ స్నేహితునకు 10 జూన్ 1898న జాబు వ్రాశాడు

క్రమంగా వివేకానందుడు అంతర్జాతీయ దృక్పథాన్ని అలవరచుకున్నాడు సంకుచితంగా ప్రవర్తించే దేశం లేదా జాతి పురోగమించజాలదని నొక్కి చెప్పాడు "సాంఘిక

సమస్యలనుగాని, రాజకీయ సమస్యలనుగాని పరిష్కరించడానికి అంతర్జాతీయ దృక్పథం అవసరం అంతర్జాతీయ సంస్థలు, అంతర్జాతీయ న్యాయ నిబంధనలు, అంతర్జాతీయ ఐక్యత కావాలి ఒంటెత్తు పోకడగల వ్యక్తిగాని, జాతిగాని క్రుంగిపోక తప్పదు ఇతర దేశాలతో సంబంధం లేకుండా గిరిగీసుకు కూర్చున్నందువల్లనే మన దేశం అధోగతి పాలైంది కాబట్టి ఇతర దేశాలతో సంబంధాలు పెంచుకోవాలి గమనమే జీవిత చిహ్నము" అంటూ అంతర్జాతీయతయొక్క అవసరాన్ని ఆ రోజుల్లోనే నొక్కి చెప్పాడు

అంతేగాక, సామాన్య ప్రజల అభివృద్ధీ, సమానత్వం అవసరమని వివరిస్తూ సామాన్య ప్రజలు మాత్రమే భారతదేశానికి ఆశాకిరణాలు కాగలరని, అగ్రవర్ణాలవారు నైతికంగా మృతి చెందారని వక్కాణించాడు పాశ్చాత్యుల భౌతిక శాస్త్ర పురోగతిని, భారతీయుల తాత్విక దృష్టిని సమన్వయం చేయాలన్నాడు

"నేను సామ్యవాదిని అయినా సామ్యవాదమొక్కటే పరిపూర్ణమైన పద్ధతి అనే భావం నాకు లేదు. అసలు లేనిదానికంటే సగం రొట్టె దొరికినా చాలు ఇతర పద్ధతులు కొన్ని పరీక్షించబడినాయి అయినా అవి సంతృప్తినివ్వలేకపోయాయి కాబట్టి సామ్యవాద పద్ధతిని చేపట్టి పరీక్షించడం అవసరం "

"ఈ ప్రపంచాన్ని భగవంతుడు సృష్టించలేదు పుట్టడం, పెరగడం, నశించడం సృష్టి ధర్మం వేదాంతం బోధించిన "అనంతస్థితి" లేదా "బ్రహ్మన్" మానవుల ఏకత్వానికి, మానవుడు దర్శించే విశ్వరూపానికి కారణం ప్రాణకోటులన్నింటిలోను మానవునిదే అగ్రస్థానం మానవునిలో దేవుని చూడడమే భగవద్దర్శనం "

"బలహీనత పాపం బలహీనతే మృత్యువు భయం పాపిష్టి బుద్ధులను ప్రేరేపిస్తుంది ఏడిపిస్తుంది కృశింపజేస్తుంది అని మన ఉపనిషత్తులు బోధించాయి కాబట్టి మన దేశానికిపుడు మెతకదనం పనికిరాదు ఇనుములాంటి కండలు, ఉక్కు తీగల్లాంటి నరాలు, బ్రహ్మాండమైన సంకల్పము అవసరం" అని చాటి చెప్పాడు (లెక్చరు్స ఫ్రమ్ కొలంబో టు ఆల్మోరా–స్వామి వివేకానంద )

వివేకానందుని తరువాత ఆయన శిష్యురాలు నివేదిత (మార్గరెట్ నోబుల్ అనే ఐరిష్ సిస్టర్) రాజకీయాలకు ప్రాముఖ్యతనిచ్చింది యూరోప్‌లో జరిగిన విప్లవాలను, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఐర్లండు ప్రజలు చేసిన పోరాటాన్ని దృష్టిలో పెట్టుకున్నందు వల్లనే ఆమె అలా చేయగలిగింది

వివేకానందుడు రామకృష్ణ మిషన్ స్థాపించగా, రవీంద్రుడు శాంతి నికేతన్ ఆశ్రమాన్ని స్థాపించాడు సతీష్ ముఖర్జీ "డాన్ సొసైటీ"ని స్థాపించి, నూతన పద్ధతుల్లో విద్యగరిపాడు రవీంద్రుడు, వివేకానందుడు, అరవిందుడు, లజపతిరాయ్, తిలక్ మున్నగువారి రచనలు, ఉపన్యాసాలు యువతరంలో ఆలోచనలను రేకెత్తించాయి పలువురు యువకులు తీవ్రవాదులయ్యారు

1899లో లార్డ్ కర్జన్ వైస్రాయిగా వచ్చాడు రైతుల పోరాటాలను, గిరిజనుల తిరుగుబాట్లను, యువకుల తీవ్రవాద భావాలను, మేధావుల చర్యలను, స్వదేశీ ఉద్యమ విస్తరణను, కాంగ్రెస్ నాయకుల కోర్కెలను సవివరంగా పరిశీలించాడు సంతృప్తిపరచే ధోరణి పనికిరాదని భావించి, నిర్బంధ చర్యలకు పూనుకున్నాడు

మధ్యతరగతి మేధావుల మెడలు వంచేందుకుగాను, ఏడాదికి ఐదువందల రూపాయల ఆదాయంగలవారి మీద ఆదాయం పన్ను విధించాడు పత్రికల స్వేచ్ఛను

బాగా కుదించాడు మున్సిపల్ కౌన్సిల్సుకు ఎన్నుకోబడే సభ్యుల సంఖ్యను తగ్గించాడు యూనివర్శిటీల యాజమాన్యాన్ని ప్రభుత్వాధికారులకు అప్పగించాడు విద్యార్థుల ట్యూషన్ ఫీజును పెంచాడు భారతీయుల పరిశ్రమలను పాడుజేసేందుకు సమకట్టాడు భారత జాతీయ కాంగ్రెస్ చల్లగా అంతరించిపోయేటట్లు చేయడమే తన ధ్యేయమని బాహాటంగా ప్రకటించాడు

కనుక దేశమంతటా క్రోధాగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లాయి అరవింద ఘోష్, బిపిన్ చంద్రపాల్ మున్నగువారు బెంగాల్లోను, లజపతిరాయ్, అజిత్‌సింగ్‌లు పంజాబ్‌లోను, లోకమాన్య తిలక్ ప్రభృతులు మహారాష్ట్రలోను అతివాదులకు నాయకత్వం వహించారు కాగా జాతీయోద్యమాన్ని, స్వదేశీ ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేసేందుకు ప్రభుత్వం పూనుకుంది అంతటితో ఆగకుండా బెంగాల్ రాష్ట్రాన్ని విభజించి, అగ్నిలో ఆజ్యం పోసింది

## బెంగాల్ విభజన

బీహార్, ఒరిస్సా ప్రాంతాలతో సహా పశ్చిమ బెంగాలును ఒక రాష్ట్రంగాను, అస్సామ్, ఈశాన్య ప్రాంతాలతోసహా తూర్పు బెంగాల్‌ను మరొక రాష్ట్రంగాను విభజించారు

పశ్చిమ బెంగాల్లో హిందువులు అధిక సంఖ్యలో నున్నప్పటికీ, బీహారీలు, ఒరియాలు, బెంగాలీలు కలిసి మెలిసి వుండరని, వారి మధ్య కలతలు సృష్టించవచ్చునని సామ్రాజ్యవాదులు భావించారు తూర్పు బెంగాల్లో ముస్లిము జనాభా ఎక్కువ అక్కడ జమీందార్లలో ఎక్కువమంది హిందువులు అనేకమంది వ్యాపారులు హిందువులు చేనేత పనివారు ముస్లిములు అప్పటికి 150 సంవత్సరాల క్రితమే హిందువులు ఇంగ్లీషు చదవడానికి పూనుకొని ప్రభుత్వోద్యోగాలలో ప్రవేశించనారంభించారు ఇంగ్లీషు చదవకూడదని, బ్రిటిష్ వారితో ఎలాంటి పొత్తు పనికిరాదని భీష్మించిన ముస్లిములు వెనుకబడిపోయారు కాగా తూర్పు బెంగాల్ రాష్ట్రంలో హిందూ-ముస్లిమ్ కలహాలను తేలికగా సృష్టించవచ్చునని కర్జన్ ప్రభృతులు విశ్వసించారు కాని, వారి ఆశలు నిరాశలయ్యాయి

బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా అసమ్మతి సభలు ప్రారంభమయ్యాయి 1905 అక్టోబర్ 16వ తేదీన కలకత్తాలో ఐదు లక్షలమంది ప్రజలు అసమ్మతి ప్రదర్శన జరిపారు వందేమాతరం గేయాన్ని పాడుకుంటూ గంగానదిలో స్నానంచేసి దీక్షా కంకణాలు ధరించారు ఆ రోజున కలకత్తాలో ప్రజలెవ్వరూ వంటజేసుకోలేదు దీపాలు వెలిగించలేదు హిందువులు, ముస్లిములు భాయీ భాయీ అంటూ, ఒకరికొకరు రాఖీలు (దీక్షా కంకణాలు) కట్టుకున్నారు లియాకత్ హుస్సేన్, గజ్నవీ అబ్దుల్ రసూల్ (బారిస్టర్) వంటి ముస్లిమ్ పెద్దలు ముందు నిలిచారు. పూర్తి హర్తాళ్ జరిగింది అపుడు జరిగిన సభలో రవీంద్రుడు రచించిన "భువన మనోమోహినీ" అనే గేయాన్ని పాడారు

అయినా బంకించంద్రుని "వందేమాతరం" గేయమే ఎక్కువ ప్రాచుర్యం పొందింది బెంగాలును మాతృదేవతగా స్తుతిస్తూ వందేమాతరం గేయం వ్రాయబడినప్పటికీ, అదొక జాతీయ గీతంగా పరిగణన పొందింది వందేమాతరం నినాదం బ్రిటిష్ వ్యతిరేకతకు, స్వదేశీ ఉద్యమానికికూడా చిహ్నమైంది



# స్వదేశీ ఉద్యమం

బ్రిటిష్ వస్తువులను బహిష్కరించాలని కృష్ణకుమార మిత్రా ప్రచారం చేశాడు సురేంద్రనాథ్ బెనర్జీ ప్రభృతులు ఆయనను బలపరిచారు హిందూ-ముస్లిమ్ సోదరభావాన్ని పెంపొందించేందుకు రక్షాబంధనం ధరించడం మంచిదని రవీంద్రనాథ్ టాగూర్ విజ్ఞప్తి చేశాడు పదివేలమంది హిందూ-ముస్లిమ్ విద్యార్థులు కలకత్తా నగర వీధులలో ఊరేగింపు జరిపి, బ్రిటిష్ వస్తువులు కొనకుండా పికెటింగ్ ప్రారంభించారు

ఆ పని సహించలేని ప్రభుత్వం అక్టోబర్ 22వ తేదీన ఒక ప్రకటన చేసింది విద్యార్థులను అదుపులో పెట్టలేని విద్యాసంస్థలకు స్కాలర్‌షిప్పులు, గ్రాంట్లు ఆపివేస్తామని, అఫిలియేషన్లను రద్దుచేస్తామని హెచ్చరించింది అయినా ఎవరూ లక్ష్యపెట్టకుండా జాతీయ విద్యాలయాల స్థాపనకు పూనుకున్నారు. నవంబర్ 9వ తేదీన సుబోధ మల్లిక్‌గారిచ్చిన లక్ష రూపాయల విరాళం జాతీయ విద్యాబోధనకు పునాది వేసింది ముఖ్యంగా తూర్పు బెంగాల్లో 24 జాతీయ విద్యాలయాలు నెలకొల్పబడినాయి

రవీంద్రుడు స్వయంశక్తిని ప్రబోధించాడు జాతీయ విద్యతోపాటు జాతీయ పరిశ్రమలు కావాలనే వాంఛ ప్రబలింది నిర్మాణయుతంగా గ్రామాలను అభివృద్ధి చేయాలనే భావమేర్పడింది సతీష్ చంద్ర ముఖర్జీ పత్రిక "డాన్" జాతీయ విద్యాభివృద్ధికి తోడ్పడుతుండగా, ప్రఫుల్లచంద్రరాయ్, నీలరత్న సర్కారులు జాతీయ పరిశ్రమల స్థాపనకు దోహదం చేశారు పల్లె ప్రజల మధ్య కలిగే తగాదాలను పరిష్కరించేందుకు 89 మధ్యవర్తి పంచాయతీలను, గ్రామాల అభివృద్ధిని, ఐక్యతను సాధించేందుకు వేయి గ్రామాలలో సమితులను ఏర్పాటుజేశారు కలకత్తా నగరంలో జిల్లా కేంద్రాలు పోటీ పడ్డాయి అశ్వనీకుమారదత్తా నాయకత్వాన బారిసాల్ జిల్లా ప్రజలు ముందడుగు వేశారు ప్రజాకవి ముకుందదాస్ వ్రాసిన గేయాలు పాడుకుంటూ ఉద్యమంలో పాల్గొన్నారు

కాగా ప్రభుత్వానికి గంగవెర్రులెత్తాయి బెంగాల్ గవర్నర్ ఫుల్లర్ ప్రజా నాయకులను పిలిపించి బెదిరించాడు ఉద్యమాన్ని విరమించకపోతే గూర్ఖా సైన్యాలను ఉపయోగించి అణచివేస్తానన్నాడు వందేమాతరం గేయాన్ని నిషేధించాడు అందువల్ల యువకులు మండిపోయారు

బిపిన్‌చంద్రపాల్‌గారి "న్యూ ఇండియా" పత్రిక, అరవిందఘోష్‌గారి "వందే మాతరం" పత్రిక, బ్రహ్మబాంధవ ఉపాధ్యాయగారి "సంధ్య" పత్రిక, వారీంద్ర కుమార ఘోష్ ప్రభృతులు ప్రారంభించిన "యుగాంతర్" పత్రిక అతివాద కార్యక్రమాలను ప్రచారం చేశాయి

పసుపు పచ్చని తలపాగాలు, ఎర్రచొక్కాలు ధరించిన స్వచ్ఛంద సేవకులు రంగంలో దిగారు విదేశీ వస్తువులను బహిష్కరించి స్వదేశీ వస్తువులను ప్రోత్సహించుటకు పూనుకున్నారు బ్రిటిష్ వస్తువులు అమ్మే దుకాణాలముందు పికెటింగ్ చేశారు విదేశీ గాజులను, గాజు సామాగ్రిని స్త్రీలు బహిష్కరించారు విదేశీ కాగితం వాడడానికి విద్యార్థులు నిరాకరించారు బారిసాల్‌వంటి పట్టణాలలో వర్తకులు స్వయంగా విదేశీ ఉప్పును, వస్త్రాలను బజార్లలో పారేశారు

1906 ఫిబ్రవరి 27వ తేదీన కలకత్తాలోని కాలేజీ స్క్వేర్‌లో విదేశీ వస్త్రదహనం జరిగింది భారతదేశంలో ముమ్ముందుగా లాంక్‌షైర్ మిల్లు వస్త్రాలను బొంబాయిలో

తగులబెట్టిన ధీరుడు వినాయక్ దామోదర సావర్కార్ ఆ జ్వాల బొంబాయి నుండి కలకత్తాకు వెళ్లింది తరువాత దేశం నలుమూలలకూ విస్తరించింది ఆ వేడికి సామ్రాజ్యవాదుల తల తిరిగింది

అబ్దుల్ రసూల్ నాయకత్వాన బారిసాల్ పట్టణంలో బెంగాల్ రాష్ట్ర మహాసభ జరుగుతుండగా పోలీసులు దాడిజేశారు నిషేధించిన వందేమాతరం గేయాన్ని ప్రతినిధులు పాడారనే నెపంతో విచ్చలవిడిగా లారీఛార్జీ చేశారు వందలాది ప్రతినిధుల తలలు పగిలాయి సురేంద్రనాథ్ బెనర్జీని అరెస్టుచేసి, కోర్టులో అవమానించి, జరిమానా విధించారు అలాగే కొన్నిచోట్ల లారీఛార్జీలు, మరికొన్నిచోట్ల కాల్పులు జరిగాయి అయినా ఉద్యమం పంజాబ్‌నుండి కన్యాకుమారి వరకూ విస్తరించింది 1906 జూన్‌లో లోకమాన్య తిలక్, పంజాబ్ కేసరి లజపతిరాయ్ కలకత్తా వచ్చారు శివాజీ ఉత్సవాలు జరిగాయి స్వదేశీమేలా (ఎగ్జిబిషన్)ను తిలక్ ప్రారంభించాడు

## ఆంధ్రలో వందేమాతరం

సురేంద్రనాథ్ బెనర్జీని అరెస్టు చేసినందుకు నిరసనగా గుత్తి, రాజమండ్రి, కాకినాడ, విజయనగరాలలో సభలు జరిగాయి ఆంధ్రలో ప్రప్రధమంగా శివాజీ ఉత్సవాలుకూడా జరిగాయి

మద్రాసు సముద్రపు ఒడ్డున సుబ్రహ్మణ్య అయ్యర్ అధ్యక్షతన జరిగిన సభలో బెంగాల్ ఉద్యమాన్ని బలపరుస్తూ తీర్మానం చేశారు కొమర్రాజు లక్ష్మణరావుతోపాటు, అయ్యదేవర కాళేశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, చక్రయ్య చెట్టి, తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి స్వదేశీ వ్రతం స్వీకరించారు స్వదేశీ పరిశ్రమలలో శిక్షణ పొందే విద్యార్థుల సహాయార్థం "దీపావళి భిక్ష"ను ప్రారంభించారు వల్లూరు మహారాణి ప్రోత్సాహంతో "భారతి సంఘం" అనే మహిళా సంఘం విశాఖపట్టణంలో స్థాపించబడింది

1906లో కాంగ్రెస్ ప్రతినిధిగా కలకత్తా వెళ్లిన పింగళి లక్ష్మీనారాయణ విజయవాడలో స్వదేశీ విక్రయశాలను నెలకొల్పి, 1909 వరకూ నడిపారు శ్రీరాంపూర్ ఫ్లయ్ షటిల్ అనే కొత్తరకం నేతమగ్గాల తయారీ కేంద్రాన్ని స్థాపించి, ఆంధ్ర ప్రాంతంలో సరఫరా చేశారు పడుగుపోసే యంత్రాన్నికూడా కనిపెట్టారు

కృష్ణాజిల్లాలో దాసు నారాయణరావు స్థాపించిన జాతీయ నాటక సమాజంవారు విజయనగర సామ్రాజ్య వైభవాన్ని, శివాజీ ధైర్య సాహసాలను తెలియజేసే ప్రదర్శనల ద్వారా ప్రజలను ఉత్తేజపర్చారు అత్తిలి సూర్యనారాయణ రచించిన "హిందూ దారిద్ర్యం", మంగిపూడి వెంకటశర్మ రచించిన "భారతమాత శతకం" స్వదేశీ ఉద్యమానికి దోహదం చేశాయి ఆనాడు హైస్కూలు విద్యార్థిగానున్న త్రిపురనేని రామస్వామి చౌదరి రచించిన "రాణా ప్రతాప్" నాటకాన్ని జూచి ప్రభుత్వం కళ్లెర్ర జేసింది

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం తీవ్రవాదుల నాయకత్వంలో కొనసాగడం గోపాలకృష్ణ గోఖలే (కాంగ్రెస్ అధ్యక్షుడు) వంటి మితవాద కాంగ్రెస్ నాయకులకు మొదటినుండీ ఇష్టంలేదు అందువల్ల 1905 నవంబర్ 16న విద్యార్థుల సమ్మెను విరమింపజేశారు లిబరల్ దృక్పథం గలవాడుగా పేరు గాంచిన "మోర్లే" ఇండియా సెక్రటరీగా నియమింపబడడంవల్ల మితవాదుల ఆశలు చిగురించాయి బెంగాల్ భాష మాట్లాడేవారి నందరినీ ఒకే రాష్ట్రంలో వుంచి, అటు అస్సామును, ఇటు బీహార్ ఒరిస్సాలను

ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పాటుచేస్తే బాగుంటుందని బ్రిటిష్ ప్రభుత్వానికి సూచించారు విదేశీ వస్తు బహిష్కరణను, కొన్ని అవాంఛనీయ కార్యక్రమాలను ఆపివేయడం మంచిదని అతివాదులకు సలహా చెప్పారు కాళికాపూజలు, శివాజీ ఉత్సవాలవంటివాటివల్ల హిందూ, ముస్లిం నాయకుల మధ్య భేదాభిప్రాయాలు జరుగుతాయని హెచ్చరించారు అయినా అతివాదులు వినలేదు

"ఇప్పుడు బెంగాల్ ప్రజలకు జరుగుతున్న అన్యాయాన్ని తొలగించేందుకు పదునైన ఆయుధంగా బ్రిటిష్ వస్తు బహిష్కరణ ఉపయోగపడుతుంది" అని సురేంద్రనాథ్ బెనర్జీ చాటి చెప్పాడు "వంగ విభజన రద్దు అయితే బహిష్కరణ నినాదం దానంతటదే అంతరించి పోతుంది" అని వివరించాడు "బ్రిటిష్ వారి జేబుల్లో బొర్రెపడి, డబ్బు తగ్గితేనేగాని, భారతీయుల కోర్కెలను గురించి ఆలోచించరు" అన్నాడు లాలా లజపతిరాయ్

లోకమాన్య తిలక్, బిపిన్ చంద్రపాల్, అరవింద ఘోష్‌ల దృష్టిలో బహిష్కరణ ఉద్యమం, సామ్రాజ్యవాద వ్యతిరేక రాజకీయ ఉద్యమమేగాని మరొకటి కాదు ఉద్యమం బ్రిటిష్‌వారిపై ఆర్థిక వత్తిడిని కలిగిస్తుందని వారు భావించారు ఆ ఉద్యమం వల్ల స్వరాజ్య సాధనకు, స్వయం సమృద్ధికి అవసరమైన శిక్షణ పొందవచ్చునని విశ్వసించారు

1906లో జాతీయ కాంగ్రెస్ మహాసభ కలకత్తాలో జరిగింది లోకమాన్య తిలక్ అధ్యక్షుడిగా ఎన్నిక కాగలడని అతివాదులు విశ్వసించారు కాని అతివాదుల ఆశలను వమ్ము చేసేందుకు మితవాదులొక ఎత్తుగడ వేశారు వృద్ధాప్యంవల్ల రాజకీయాలనుండి విరమించుకుంటున్న దాదాభాయ్ నౌరోజీని తిరిగి రాజకీయాలలోకి తీసుకొచ్చారు ఆయనపట్ల అతివాదులకుకూడా గౌరవభావముండేది కనుక నౌరోజీ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు అయినా "స్వరాజ్య" తీర్మానాన్ని అతివాదులు ప్రవేశపెట్టినపుడు మితవాదులు వ్యతిరేకించలేదు తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది అంతేగాక, అక్రమ పద్ధతిలో జరిగిన బెంగాల్ విభజనను, ప్రభుత్వ దమనకాండను మితవాదులుకూడా ఖండించారు విదేశీ వస్తు బహిష్కరణను బలపర్చారు కాని స్వరాజ్య మనగా సంపూర్ణ స్వరాజ్యమా? లేక అధినివేశ ప్రతిపత్తి మాత్రమేనా? అనే విషయంలో ఎవరికిష్టమైన అర్థం వారు చెప్పారు

ఆ సభకు వెళ్లిన ఆంధ్రప్రతినిధులు (1) విదేశీ వస్తు బహిష్కరణ, (2) స్వదేశీ వస్తు విక్రయం, (3) జాతీయ విద్య, (4) స్వరాజ్యం అనే నాలుగు అంశాల కార్యక్రమంతో తిరిగి వచ్చారు

## గాంధీజీ అభిప్రాయం

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం కొత్త మలుపులు తెచ్చిపెట్టిందని గాంధీజీ భావించాడు ఆ ఉద్యమం దాదాపు "హోంరూల్" (స్వపరిపాలన) ఉద్యమంతో సమానమైనదన్నాడు "ఇంతవరకూ మన కోర్కెలను బ్రిటిష్ వారికి విన్నవించుకోవడం, వాటిని వారు తీర్చకపోతే మెదలకుండా కూర్చోవడం జరిగేది ఇపుడు పరిస్థితి మారిపోయింది విజ్ఞాపన పత్రాలకు తోడుగా బలంకూడా ప్రదర్శించాలనీ, బాధలు పడడానికి సిద్ధపడాలనీ భావించడం జరుగుతోంది" అంటూ నూతన భావాన్ని గాంధీజీ ఇలా వివరించాడు

"పత్రికలు నిర్మొహమాటంగా రాయడంలో ఈ భావం వ్యక్తమవుతోంది భయ పడుతూ, గజగజలాడుతూ, గుసగుసలాడుకుంటూ చెప్పుకునే మాటలను బహిరంగంగా

చెప్పుకుంటున్నారు బాహాటంగా వ్రాస్తున్నారు ఇంగ్లీషు వాళ్ళ ముఖం చూడగానే పరుగెత్తే ప్రజలు-పిల్లలూ, పెద్దలూ, స్త్రీలూ, పురుషులూ ఇప్పుడు భయపడటంలేదు కేవలం విజ్ఞాపన పత్రాలు సమర్పించుకోవడానికీ దీనికి తేడా వుంది బెంగాల్లో ప్రభవించిన ఈ భావం ఉత్తరాన పంజాబ్‌నుండి, దక్షిణాన కన్యాకుమారి వరకూ వ్యాపించింది ”

## ఆంధ్రుల పురోగమనం

ఆంధ్ర ప్రముఖుల ఆహ్వానంపై కలకత్తానుండి వచ్చిన బిపిన్‌చంద్రపాల్ కాకినాడ, రాజమండ్రి, విశాఖ, బెజవాడ, మచిలీపట్టణం మొదలైన చోట్ల జరిగిన సభల్లో ఉపన్యసించారు ఆ రోజుల్లో “పాల్-లాల్-బాల్”గా ప్రసిద్ధి చెందిన ముగ్గురు నాయకుల్లో బిపిన్ చంద్రపాల్‌గారొకరు తక్కిన ఇద్దరు లాలాలజపతిరాయ్, బాలగంగాధరతిలక్‌గార్లు

పాల్‌గారి ఉపన్యాసాలు ఆంధ్రలో స్వదేశీ ఉద్యమానికి, జాతీయ విద్యాబోధనకు ఉపకరించాయి ఆ సందర్భంలో చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు ఆశువుగా ఈ క్రింది పద్యం పాడారు

“భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పితుకుతున్నారు మూతులు బిగియగట్టి ”

ఈ పద్యం ప్రజలను విశేషంగా ఆకర్షించింది వందేమాతరం నినాదం మారుమ్రోగింది కృష్ణాజిల్లాలో చల్లపల్లి జమీందారు స్వదేశీ ఉద్యమానికి తోడ్పడ్డారు

గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణ, కోటంరాజు రాజేశ్వరరావు, దేవగుప్త శేషచలపతిరావుగార్లు స్వదేశీ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించారు నెల్లూరులో మహంకాళి శ్రీనివాస శాస్త్రులు స్వదేశీ సొసైటీని స్థాపించగా, వెన్నెలకంటి నరసయ్య రాత్రి పాఠశాలలు ప్రారంభించాడు. కడపలో జలగం కోటిహరియప్ప, భద్రాచలం వెంకటేశ్వరరావు స్వదేశీ వస్త్రాలయాన్ని స్థాపించారు

మునగాల జమీందారు బెజవాడలో ఒక నూలు మిల్లును స్థాపించి, స్వదేశీ వస్తు విక్రయశాలకు సహాయం జేశాడు మునగాల ఎస్టేట్ దివానుగా వున్న కొమర్రాజు లక్ష్మణరావు, ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాల ప్రజల మధ్య సాంస్కృతిక సంబంధాలను పెంపొందించేందుకు పూనుకున్నాడు తాను హైదరాబాద్‌లో 1901లో స్థాపించిన “శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయము”కు తోడుగా 1906లో విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలిని, 1907లో “పునర్వికాస” ఉద్యమాన్ని ప్రారంభించాడు లక్ష్మణరావుగారి సోదరి భండారు అచ్చమాంబ “అబలా సచ్చరిత్ర రత్నమాల” అనే గ్రంథాన్ని రచించి, కరువు క్యాంపులలోనున్న అభాగ్యస్త్రీలకు సేవ చేసింది అస్పృశ్యతను ఖండించి, తల్లిదండ్రులులేని హరిజన బాలుణ్ణి పెంచి, చదువు చెప్పించింది.

రాజమహేంద్రవరం కేంద్రంగా కందుకూరి వీరేశలింగంగారు సాగించిన సాంఘిక సంస్కరణోద్యమం అనేకమందికి కనువిప్పు కలిగించింది బ్రహ్మసమాజం, దివ్యజ్ఞాన సమాజం మధ్యతరగతి మేధావులలో ఆలోచనను రేకెత్తించాయి రఘుపతి వెంకటరత్నం నాయుడు హరిజన బాలికలను పెంచాడు కాకినాడలో పిఠాపురం జమీందారు నెలకొల్పిన కాలేజీకి ప్రిన్సిపాల్‌గావుంటూ కుల, మత భేదాలను నిరసించాడు

కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, పట్టాభి సీతారామయ్య ప్రభృతులు

బందరులో జాతీయ కళాశాల స్థాపనకు పూనుకున్నారు అటుపిమ్మట స్వదేశీ పారిశ్రామిక ప్రావిడెంట్ ఫండ్ స్కీమునుకూడా ప్రారంభించారు

బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలతో ప్రభావితులైన విద్యార్థులు రాజమండ్రిలో వందేమాతరం బ్యాడ్జీలు ధరించి పరీక్షలకు హాజరయ్యారు ఆ పని సహించలేని కాలేజీ ప్రిన్సిపాల్ హంటర్, బ్యాడ్జీలు ధరించిన విద్యార్థులను సస్పెండ్‌చేసి, గాడిచర్ల హరి సర్వోత్తమరావును, [redacted] రామచంద్రరావును డిబార్ చేశాడు అటుపైన ప్రభుత్వం 138 మంది విద్యార్థులను శిక్షించింది ప్రభుత్వ చర్యలను నిరసిస్తూ దేశాభిమాని, కృష్ణాపత్రికలు సంపాదకీయాలు వ్రాశాయి తరువాత గాడిచర్ల హరిసర్వోత్తమరావు బెజవాడలో స్థిరపడి, బోడి నారాయణరావుతో కలసి స్వరాజ్య పత్రికను ప్రారంభించారు

"భావమే శక్తిగా రూపొందుతుంది" అన్నాడు ఏంగిల్స్ కనుకనే వందేమాతరం నినాదం మహత్తర శక్తిగా రూపొందింది ఆ నినాదం చెవిన పడితే చాలు – తెల్లదొరలు, నిప్పు తొక్కిన కోతుల్లా ప్రవర్తించేవారు

కాకినాడలో జిల్లా వైద్య శాఖాధికారి కెప్టెన్ కెంపు రోడ్డు వెంట వెళుతుండగా ముగ్గురు బాలురు "వందేమాతరం" అంటూ నినాదాలిచ్చారు కెప్టెన్ కెంపు ఒళ్లు మండింది దగ్గరలోవున్న కోపల్లె కృష్ణారావును పట్టుకుని చితకబాదాడు అందువల్ల రెచ్చిపోయిన ప్రజలు, కెప్టెన్ కెంపువున్న క్లబ్బు బిల్డింగుమీద రాత్రి తొమ్మిది గంటలవేళ దాడిజేశారు కెంపును కాపాడేందుకు పోలీసు బలగంతో వచ్చిన కలెక్టరుకు రాళ్లదెబ్బలు తగిలాయి

ఆ నేరారోపణతో ప్రభుత్వం యాభైమందిని అరెస్టు జేసింది వారిలో కొందరు కార్మికులుకూడా వున్నారు కనుక కాకినాడ కార్మికులు సమ్మె జేశారు ఓడరేవులో పని స్తంభించిపోయింది కాగా ప్రభుత్వం వెనక్కు తగ్గి, పదముగ్గురిని మాత్రం శిక్షించి తక్కినవారిని విడిచిపెట్టింది కాకినాడలో భీతావహాన్ని సృష్టించిన అదనపు పోలీసు బలగాలను ఉపసంహరించింది

శిక్ష పడిన వారి తరపున న్యాపతి సుబ్బారావు చేసిన అప్పీలులో అరిపిరాల సుబ్బారావును, మరొక ఇద్దరిని విడిచిపెట్టారు కెప్టెన్ కెంపు చేతిలో దెబ్బలుతిన్న కృష్ణారావుకు నూరు రూపాయల నష్టపరిహారం లభించింది ఆంధ్ర రాజకీయ రంగంలో మొట్టమొదట పెట్టబడిన క్రిమినల్ కేసు ఆ విధంగా ముగిసింది

ఆంధ్రలోవలెనే వందేమాతరం నినాదం దేశమంతటా ప్రతిధ్వనించింది ఆంధ్రుల ప్రత్యేక రాష్ట్రవాంఛకు ఆ నినాదం దోహదం చేసింది. అలాగే బీహారీలు, ఒరియాలు ప్రత్యేక రాష్ట్రాలు కావాలని కోరడానికి కారణమైంది

## స్వదేశీ ఉద్యమ ఫలితాలు

విదేశీ వస్తు బహిష్కరణవల్ల 1905 ఆగస్టునుండి 1906 సెప్టెంబరు మధ్యకాలం వరకు వస్త్రాలు, నూలు, సిగరెట్లు వగైరాల దిగుమతులు తగ్గాయి వస్త్రాల దిగుమతి 22 శాతం, మిల్లు నూలు దిగుమతి 44 శాతం, ఉప్పు దిగుమతి 11 శాతం, సిగరెట్ల దిగుమతి 55 శాతం, చెప్పులు, బూట్ల దిగుమతి 68 శాతం తగ్గాయి

దిగుమతులు తగ్గడంవల్ల దేశీయ పారిశ్రామికుల లాభాలు పెరిగాయి 1906లో బొంబే, అహ్మదాబాద్ బట్టల మిల్లుల యజమానులకు మూడుకోట్ల ఇరవై ఐదు లక్షల రూపాయలు లాభాలు వచ్చాయి అలాగే దేశీయ పరిశ్రమలన్నీ లాభాలు గడించాయి

లాంక్‌షైర్, మాంచెస్టర్ బట్టల మిల్లులతోపాటు, ఆంగ్లేయులు ఇండియాలో స్థాపించిన మిల్లులుకూడా నష్టాల పాలయ్యాయి

"1 కోటి 68 లక్షలు జీతాల క్రింద ఖర్చుపెట్టి, 3 కోట్ల 25 లక్షల లాభాలు దండడం అన్యాయం అక్రమం కాబట్టి కనీసం ధోవతులు వగైరా ముతక వస్త్రాల ఖరీదును తగ్గించండి" అని లోకమాన్య తిలక్, దిన్షా ఎడాల్జీ వాచా చేసిన విజ్ఞప్తిని పార్సీ గుజరాతీ మిల్లు యజమానులు తిరస్కరించారు

బ్రిటిష్ పారిశ్రామికులకు ఏజెంట్లుగా నున్న మార్వాడీలు ఏజెన్సీ షరతులను తమకు అనుకూలంగా మార్పించుకోగలిగారు అయినా బహిష్కరణ ఉద్యమం విదేశీ వస్తువులకే పరిమితమైంది అంతేగాని, స్వదేశీ వస్తువుల జోలికి పోలేదు దేశీయ పెట్టుబడిదారులు కార్మికులను హింసించినా, వస్తువుల ధరలు పెంచినా జాతీయ నాయకులు నోరు మెదపలేదు

అలా దేశీయ పెట్టుబడిదారులకు అనుకూలంగా పరిస్థితులు మారాయి కనుక జెమ్‌షెడ్‌పూర్‌లో నిర్మించతలపెట్టిన తాతా ఐరన్ అండ్ స్టీల్ ప్రాజెక్టుకు అవసరమైన రెండున్నర కోట్ల షేర్ల ధనం మూడు వారాలలో చాలావరకు బొంబాయిలోనే సమకూరింది

బాంబే ప్రెసిడెన్సీలో దేశీయ పెట్టుబడిదారులు బలపడుతున్న సమయంలో, బెంగాల్ ప్రెసిడెన్సీలో బ్రిటిష్ పెట్టుబడిదారులు కార్మిక సమ్మెల నెదుర్కొనవలసి వచ్చింది అశ్వనీ కుమార బెనర్జీ, ప్రభాత్ కుసుమరాయ్ చౌదరి, అథ్నేషియస్ అపూర్వ కుమార ఘోష్, ప్రేమతోష్ బోస్ అనే పేర్లుగల నలుగురు బారిస్టర్లు కార్మిక సంఘాల నిర్మాణానికి పూనుకున్నారు బర్న్ కంపెనీలో గుమాస్తాల సమ్మె, కలకత్తా ట్రామ్ కంపెనీలో కార్మికుల సమ్మె, జూట్ మిల్లుల కార్మికుల సమ్మె, రైల్వే వర్క్‌షాపుల్లో సమ్మె జరిగాయి తరువాత "ప్రింటర్స్ యూనియన్" ఏర్పడింది గవర్నమెంటు ప్రెస్సులో సమ్మె జరిగింది పిమ్మట "రైల్వే మెన్సు యూనియన్" స్థాపించబడింది జమాల్‌పూర్ వర్క్‌షాప్ సమ్మెను అణచేందుకు పోలీసులు తుపాకులు కాల్చారు నిర్బంధ చర్యలు పెరిగాయి అయినా బ్రిటిష్ పెట్టుబడిదారులకుగల 37 జూట్ మిల్లుల్లో 18 మిల్లులు దెబ్బతిన్నాయి అందువల్ల ప్రభుత్వ దమనకాండ మరీ పెరిగింది కార్మిక సంఘాలు నిర్వీర్యమయ్యాయి అయినా జాతీయ నాయకులు పట్టించుకోలేదు

గ్రామసీమల్లో స్థాపించబడిన ప్రజా సమితుల్లో అనేకం దుర్గ పూజలకు, గంగ జాతరలకు పూనుకున్నాయి వాటికొరకు ప్రజలవద్ద విరాళాలు వసూలు చేయడం, ఇవ్వని వారిని వెలివేయడం జరిగింది విదేశీ వస్తువులను అమ్మే షాపులను బలవంతంగా జమీందార్లు మూసివేయించారు నెత్తిమీద మూట పెట్టుకొని బజార్లలో తిరుగుతూ అమ్ముకునేవారినికూడా అడ్డగించారు అందువల్ల పేద, మధ్య తరగతులకు చెందిన ముస్లిమ్‌లు చాలామంది నష్టపోయారు దీనికితోడు జాతరలకు, పూజలకు చందాలు వసూలు చేయడంవల్ల స్వదేశీ ఉద్యమాన్ని ముస్లిమ్‌లు వ్యతిరేకించారు

ఆ స్థితిలో అరవిందఘోష్ జమీందార్లను సమర్థించాడు జమీందార్లుకూడా స్వదేశీ అభిమానులే కాబట్టి, పన్నుల నిరాకరణలాంటి చర్యలు ఆపివేయాలన్నాడు అందువల్ల హిందూ జమీందార్లకు లాభం కలుగగా, ముస్లిం రైతులకు నష్టం కలిగింది కాగా కొందరు ముస్లిమ్ నాయకులు పర ప్రభుత్వ అండకు చేరారు

# కుల, మత పార్టీల ఆవిర్భావం

1906లో ఢాకా నవాబ్ సాలిముల్లా ముస్లిమ్ లీగును స్థాపించాడు అదే సంవత్సరం ఉత్తరప్రదేశ్‌లోని ముస్లిమ్ జమీందార్లు, అలిఘర్ ఉద్యమ నాయకులు కలిసి, అగాఖాన్ నాయకత్వాన వైస్రాయ్ మింటోను కలుసుకున్నారు లెజిస్లేటివ్ కౌన్సిల్సులోను, మునిసిపల్ కౌన్సిల్సులోను ముస్లిములకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలని కోరారు ఆ కోర్కెను వైస్రాయి ఆమోదించాడు తూర్పు బెంగాల్లోని ముస్లిమ్‌లకు ఎక్కువ ఉద్యోగాలిస్తానన్నాడు అందువల్ల మురిసిపోయిన ముస్లిమ్ నాయకులు 1907 డిసెంబరులో ఢాకాలో సమావేశమై ముస్లిమ్ లీగుకు నాయకత్వం వహించారు

ఆనాటికింకా ఘజ్నవీ, రసూల్, అబ్దుల్ గఫూర్, లియాకత్ హుస్సేన్‌వంటి ప్రముఖ ముస్లిమ్ నాయకులు, బెంగాల్ విభజనను వ్యతిరేకిస్తూ, స్వదేశీ ఉద్యమాన్ని బలపరుస్తూనే వున్నారు అయినా తూర్పు బెంగాల్ ఉద్యోగాలలో ఎక్కువ భాగం ముస్లిములకిచ్చే ఏర్పాటు, కౌన్సిల్సులో ముస్లిమ్‌లకు ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటు జరగడంవల్ల ధనిక, మధ్య తరగతి ముస్లిములు ముస్లిమ్ లీగును బలపరిచారు

ముస్లిమ్ లీగ్‌ను ఎదిరించేందుకు కొందరు హిందూ మత పెద్దలు సమావేశమై హిందూ మహాసభను స్థాపించారు వీటికితోడు, ప్రత్యేక నియోజక వర్గాలు తమకుకూడా కావాలంటూ, వెనుకబడిన తరగతుల సంఘం ఆవిర్భవించింది అక్కడికీ సంతృప్తి చెందని సామ్రాజ్యవాదులు ద్రావిడ ఉద్యమానికి అంకురార్పణ చేశారు

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమంనుండి పాఠాలు నేర్చుకున్న ఒరియా, బీహారీ, అస్సామీ ప్రజలు తమకు ప్రత్యేక రాష్ట్రాలు కావాలని, బెంగాల్ ప్రెసిడెన్సీ నుండి తమ రాష్ట్రాలను విడదీయాలని డిమాండ్ చేశారు ఉత్తరప్రదేశ్‌లోని ప్రభుత్వ ఉద్యోగాలలో బెంగాలీలు ఎక్కువగా వున్నందున, ఆ రాష్ట్రంలోని మేధావులు బెంగాలీ బాబులను విమర్శించడం ఎక్కువైంది

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం బెంగాల్లో మాత్రమే కొనసాగాలని, దేశంలోని ఇతర ప్రాంతాలలో ఆ ఉద్యమాన్ని చేపట్టకూడదని 1905 డిసెంబరులో గోపాలకృష్ణ గోఖలే అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభ తీర్మానించినందున, ఆ ఉద్యమం ఇతర ప్రాంతాలకు విస్తరించలేదు, వందేమాతరం నినాదం, స్వదేశీ ఉద్యమం మాత్రమే దేశమంతటా విస్తరించాయి

అయినా బెంగాల్ రాష్ట్రంలో 'వందేమాతరం అసోసియేషన్' సభ్యులు పోరాటాన్ని ఉధృతం జేశారు సాయుధ పోరాటం కొరకు యువకులకు శిక్షణ గరపడం ప్రారంభమైంది యువకులు, విద్యార్థులు దళాలుగా ఏర్పడి బ్రిటిష్ వస్తువులను ధ్వంసం చేస్తుంటే పోలీసు బలగాలొచ్చి పడేవి యువకులు పోలీసుల నెదిరించేవారు ఘర్షణలు, కాల్పులు జరిగేవి అలాంటి సమయంలో ఒక పోలీసు దళం, అధికారుల ఆజ్ఞలను ధిక్కరించి యువకుల పక్షాన చేరిపోయింది

తూర్పు బెంగాల్లోని ముస్లిమ్ మేధావులు, ధనికులు ముస్లిం లీగ్‌ను బలపరచేందుకు పూనుకున్నప్పటికీ, వంగవిభజన వ్యతిరేక ఉద్యమాన్ని ఎదిరించలేదు

పైకారణాలకుతోడు, ఈస్టిండియా రైల్వేలో జరిగిన సమ్మెవల్ల బొగ్గు రవాణా ఆగిపోయినందున బెంగాల్లోని బ్రిటిష్ పారిశ్రామికులు కళ్లు తెరిచారు కాగా బెంగాల్ రాష్ట్ర విభజన విషయంలో సామ్రాజ్యవాదుల పునరాలోచన ప్రారంభమైంది ఆ విషయా

తెలుసుకున్న ప్రముఖులు కొందరు సురేంద్రనాథ్ బెనర్జీ నాయకత్వాన వైస్రాయిని కలుసుకొని బెంగాల్ విభజనను రద్దుచేసే విషయంలో ఒక అంగీకారానికి రాగలిగారు వెంటనే బెంగాల్ కాంగ్రెసులోనున్న జమీందార్లు అతివాదుల పోరాటాలను వ్యతిరేకిస్తూ ప్రకటనచేశారు ఇతర రాష్ట్రాలలోని మితవాద నాయకులుకూడా అలాంటి ప్రకటనలే చేశారు అయినా వాటిని లెక్కజేయకుండా లోకమాన్యతిలక్, అరవిందఘోష్ మున్నగు ప్రముఖ నాయకులు ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలకు పూనుకున్నారు అనేకమంది యువకులు సాయుధ పోరాటాలకు సిద్ధమయ్యారు

స్వరాజ్య పోరాటంలో పాల్గొనేందుకు యువకులను ప్రోత్సహించడానికి తిలక్ మహాశయుడు సాముగరిడీల కేంద్రాలు నెలకొల్పాడు కృష్ణపరమాత్మ చెప్పినట్లుగా దుష్ట శిక్షణ కొరకు నిష్కామకర్మ అవసరమని యువకులకు బోధించాడు గణేశ్ ఉత్సవాలు పూనానుండి మరట్వాడా మీదుగా హైదరాబాద్‌కు వ్యాపించాయి

దేశమాత బిడ్డలను నాశనం జేస్తున్న శ్వేతరక్కసులను సంహరించవలసిందిగా దుర్గ ఆదేశించిందని "మాత" అనుయాయులు భావించేవారు ఆ అభిప్రాయంతోనే అరవిందుడు తన భార్యకీ క్రింది లేఖను వ్రాశాడు

"పచ్చిక బయళ్ళు, అడవులు, కొండలు, నదులుగల భూమిగానే భారతదేశాన్ని ఇతరులు చూస్తారు కాని నేను మాత్రం "మాత"గా చూస్తాను తన తల్లి జీవితాన్ని నాశనం జేయడానికి ఎవరైనా ప్రయత్నిస్తున్నప్పుడు, ఆమె పుత్రుని కర్తవ్యం ఏమిటి? మెదలకుండా కూర్చోవాలా? లేక తల్లి రక్షణ కొరకు పరుగెత్తాలా?"

అందువల్ల బెంగాల్లో దుర్గపూజలు పెరిగాయి మాత అనుయాయుల ప్రచారంతో పాటు, వేదాంతవాదుల ప్రచారంకూడా సాగింది వీరు నిష్కామ కర్మను బోధించేవారు కాగా యువకులు హింసావాదంవైపు మొగ్గారు "వీరు శూన్యవాదులు కారు, అరాచక వాదులూ కారు- దేశభక్తులు, దేశభక్తిని మతస్థాయికి పెంచినవారు" అన్నాడు లాలా లజపతిరాయ్ ఈ విధంగా అతివాద జాతీయ నాయకులు పునరుద్ధరణ కార్యక్రమాలను ప్రోత్సహించడంవల్ల హిందూ-ముస్లిమ్ విభేదాలు పెరిగాయి మత పెద్దలకు బలం చేకూరింది

ప్రమాదాన్ని పసికట్టిన బ్రహ్మ సమాజంవారు మత రాజకీయాలను నిరసించారు "గత వైభవాన్ని ఆదర్శంగా చిత్రిస్తూ పురోభివృద్ధియొక్క అవసరాన్ని గుర్తించజాలని దేశభక్తి వొక జబ్బు" అని సంజీవని, ప్రభాసి పత్రికలు విమర్శించాయి కృష్ణకుమార మిత్రా ప్రభృతులు బెంగాల్లో శివాజీ ఉత్సవాలను బహిష్కరించారు మరికొన్నాళ్ళకు హేమచంద్ర కానుంగో లాంటి విప్లవ టెర్రరిస్టులు కూడా మతప్రమేయంగల రాజకీయాలను వ్యతిరేకించారు "మతానికి రాజకీయాలకు ముడిపెట్టడం తప్పు" అన్నాడు రవీంద్రుడు

ఎవరెలా విమర్శించినా అరవిందాదులు తమ అభిప్రాయాలను మార్చుకోలేదు ఆయుధధారణలో యువకులకు శిక్షణ నిప్పించేందుకొక వైపున ప్రయత్నిస్తూనే మరోవైపున స్వదేశీ కార్యక్రమాలకు పదునుబెట్టేందుకు అరవిందుడు పూనుకున్నాడు అందుకు తగినట్లుగా వందేమాతరం పత్రికలో వరుసగా కొన్ని వ్యాసాలు వ్రాశాడు

శాంతియుతంగా నడిచే ఆశ్రమాలు, స్వదేశీ ఉద్యమం, స్వయం సహాయం సరిపోవని అరవిందుడు భావించాడు. నిర్మాణయుతంగా ఎడతెగని రీతిలో బ్రిటిష్ వస్తువులను బహిష్కరించడం, జాతీయ పరిశ్రమలను, విద్యాలయాలను స్థాపించడం,

మధ్యవర్తి తీర్పులద్వారా తగాదాలను పరిష్కరించుకోవడం, దుష్టచట్టాలను ఉల్లంఘించడం, బ్రిటిష్ తాబేదారులను వెలివేయడం, ప్రభుత్వ దమనకాండ భరింపరానిదిగా పెరిగినప్పుడు సాయుధపోరాటం సాగించటంలాంటి కార్యక్రమాలను అరవిందుడు సూచించాడు

1906 నవంబర్ 21వ తేదీగల సంధ్య పత్రికలో బ్రహ్మాబాంధవ ఉపాధ్యాయ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రతిపాదిస్తూ ఇలా వ్రాశాడు

"చౌకీదారులు, మునసబులు, గుమాస్తాలు, ఉద్యోగులు, పోలీసులు, సిపాయీలు రాజీనామాలిస్తే, ఫరంగి (బ్రిటిష్) ప్రభుత్వం క్షణంలో పతనమవుతుంది "

ఉపాధ్యాయ సూచించినదానికీ, 1921లో గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణకూ భేదం లేకపోవడం గమనార్హం ఇరువురి కార్యక్రమాలలోను పన్నుల నిరాకరణకు తావు లేకపోవడంకూడా గమనించదగిన విషయమే కాకపోతే, తాను ప్రారంభించిన కార్యక్రమం అహింసాయుతంగా కొనసాగాలని గాంధీజీ నొక్కి చెప్పారు ఉపాధ్యాయ అలా చెప్పలేదు అదే తేడా

1907 మార్చి 3వ తేదీన యుగాంతర్ పత్రిక ఇలా వ్రాసింది "ఒక్కొక్క జిల్లాలో బ్రిటిష్ అధికారు లెంతమందున్నారు? మీరు గట్టిగా తలుచుకుంటే ఇంగ్లీషువారి పాలనను ఒక్కరోజులో అంతం చేయవచ్చు రక్తపాతం లేకుండా దేశం మేలుకుంటుందా? దేశభక్తులారా! చెప్పండి?" అంటూ తీవ్రవాద యువకులను హెచ్చరించింది

కాగా, అనేకమంది యువకులు వ్యక్తిగత విప్లవ కార్యక్రమాలకు పూనుకున్నారు అనుశీలన సమితి, స్వదేశ బాంధవ సమితి మున్నగువాటిద్వారా బహిరంగ ప్రచారం సాగిస్తూ, రహస్యంగా బాంబులు తయారుజేసేందుకు పూనుకున్నారు వారీంద్ర కుమారఘోష్, ఉల్లాసకరదత్తు కలిసి రహస్యంగా నిర్మించిన కర్మాగారంలో బాంబులు తయారయ్యేవి తయారుజేసే పద్ధతులను హేమచంద్ర కానుంగో తెలియజేసేవాడు

## లాలా లజపతిరాయ్, అజిత్‌సింగ్‌లకు ప్రవాస శిక్ష

ఆ సమయంలో పంజాబులో కాటక పరిస్థితులేర్పడ్డాయి గోరుచుట్టుమీద రోకటి పోటులా ప్రభుత్వం భూమి శిస్తును, నీటి తీరువాను పెంచింది కాగా రైతులు, పట్టణ ప్రజలు కలిసి సాగించిన పోరాటం తీవ్రమైంది బహిరంగ సభలకు వేలాది ప్రజలతోపాటు సిపాయీలుకూడా హాజరయ్యేవారు అదే అదనుగా భావించిన భారతమాత సమితి సభ్యులు, అజిత్‌సింగ్ (భగత్‌సింగ్‌యొక్క పినతండ్రి) మొదలగువారు 1907 మే నెల 10వ తేదీన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం (సిపాయిల తిరుగుబాటు) యొక్క అర్ధశత వార్షికోత్సవాన్ని జరపాలని నిర్ణయించారు ఆ నిర్ణయాన్ని ఆగాహైదర్, సయ్యద్‌హైదర్, రిజాలు బలపర్చారు

ఆ ఉత్సవాలొక విప్లవంగా పరిణమిస్తాయని భయపడిన సామ్రాజ్యవాదులు లజపతిరాయ్, అజిత్‌సింగ్‌లను బంధించి, విచారణ జరపకుండానే ప్రవాస శిక్ష విధించారు వెంటనే రావల్పిండిలో హిందువులు, ముస్లింలు కలసి తిరుగుబాటు చేశారు ఆ తిరుగుబాటును బ్రిటిష్ సైనికులు అణచివేయగలిగినప్పటికీ పంజాబ్ రైతులు వెనకడుగు వేయలేదు పన్నులు, శిస్తులు చెల్లించలేదు ఆ పోరాటానికి సంఘీభావంగా దేశంలోని పలు తావుల్లో సభలు జరిగాయి కనుక 1907 నవంబరులో లజపతిరాయ్, అజిత్ సింగ్‌లను ప్రభుత్వం విడుదల చేసింది.

## శ్యాంజీ కృష్ణవర్మ

పూనాలో జరిగిన రాండ్ హత్యతో సంబంధమున్నదని శ్యాంజీ కృష్ణవర్మను ప్రభుత్వం అనుమానించింది ఆ విషయం పసిగట్టిన కృష్ణవర్మ తప్పించుకొని లండన్ చేరాడు అక్కడ 1905లో భారత స్వపరిపాలన సమితిని స్థాపించాడు "ది ఇండియన్ సోషియాలజిస్ట్" అనే మాసపత్రికనుకూడా ప్రారంభించాడు బ్రిటన్‌లో చదువుతున్న భారతీయులకొరకు లండనులో ఇండియా హౌస్ (భారత భవనము)ను నెలకొల్పాడు ఆ భవనం విప్లవ కార్యకలాపాలకు కేంద్రంగా వుండేది

శ్యాంజీ కృష్ణవర్మ బారిస్టర్, సంస్కృత పండితుడుకూడా. ఉదయిపూర్, జునాఘడ్ సంస్థానాలలో దివానుగా పనిచేసినవాడు లాలా హరదయాల్, మదాం కామా మొదలగు వారితో కలసి భారతదేశ స్వాతంత్ర్యం కొరకు అహర్నిశలు కృషిజేసేవాడు

## మదాం కామా–జాతీయ జెండా

వీరవనిత మదాం కామా పూర్తి పేరు బికాయిజీ రుస్తుం కామా బొంబాయిలోని పార్సీ కుటుంబంలో జన్మించింది 1884లో వివాహమైన పిమ్మట సాంఘిక సేవా కార్యక్రమాలలో నిమగ్నమై, 17 ఏళ్ల పాటు విశేషకృషి చేసింది అందువల్ల జబ్బుపడి, వైద్యం కొరకు జర్మనీ, ఫ్రాన్స్ దేశాలలో మూడేళ్లపాటు నివసించి, 1905లో లండన్ చేరింది. అక్కడ దాదాభాయ్ నౌరోజికి అంతరంగిక కార్యదర్శిగా వుంటూ, బ్రిటిష్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించేది ఆమె ప్రచురించిన కరపత్రాలు, చేసిన ఉపన్యాసాలు ఉద్రేకపూరితంగా వుండేవి ఆమె ప్రచురించిన వందేమాతరం పత్రికకూడా అలాగే వుండేది

జర్మనీలోని స్టట్‌గార్ట్‌లో 1907 ఆగస్టులో జరిగిన ప్రపంచ సోషలిస్టు మహాసభలో ఆమె పాల్గొన్నది ఆ సభలో ఉపన్యసిస్తూ సామ్రాజ్యవాదుల దోపిడీని, భారత ప్రజల బాధలను వివరించి, చివరకు ఇలా అన్నది "భారతదేశం జాగృతమయ్యే రోజు వస్తుందని నేను నమ్ముతున్నాను. రష్యన్ కామ్రేడ్స్ అనుసరిస్తున్న మార్గాన్ని భారతీయులుకూడా అనుసరించగలరని ఆశిస్తున్నాను ప్రపంచానికి సరియైన మార్గాన్ని చూపుతున్నందుకు రష్యన్ కామ్రేడ్స్‌కు మా సౌహార్ద్ర పూర్వక అభినందనలు-"

తర్వాత ఆమె ఒక శిల్కు త్రివర్ణ పతాకను ఎగురవేసింది ప్రతినిధులంతా లేచి నిలబడి హర్షధ్వానాలు జేశారు. కామ్రేడ్ లెనిన్ స్వయంగా ఆమెను అభినందించాడు (ఆనాడలా మాదాం కామా జర్మనీలో ఎగురవేసిన జెండాపై రాట్నాన్ని ముద్రించి 1921లో బెజవాడలో జరిగిన ఎ ఐ సి సి సభలో గాంధీజీ ఎగురవేశాడు) మేడ్మాం కామా ఎగురవేసిన జెండా విషయం తెలియగానే బెంగాల్ యువకులు త్రివర్ణపతాకను ఎగురవేయసాగారు 1906లో కెనడా వెళ్ళిన తారకనాథదాస్ అక్కడకూడా త్రివర్ణ పతాకను ఎగురవేశాడు

## జాతీయ కాంగ్రెసులో చీలిక

అతివాద కార్యక్రమాలకు అడ్డుకట్ట వేయకపోతే, ప్రభుత్వం జాతీయ కాంగ్రెస్‌ను నిషేధిస్తుందనే భయం మితవాద నాయకులను ఆవహించింది. కాగా 1907 డిసెంబరు 27న సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో అధ్యక్ష పదవికి రసవిహారి ఘోష్ పేరును సూచించారు ఆ పదవి తన కక్కరలేదని లజపతిరాయ్ చెప్పినందున, అతివాదులు తిలక్‌పేరు సూచించారు

రసవిహారీ ఘోష్‌ను సమర్థిస్తూ సురేంద్రనాథ్ బెనర్జీ మాట్లాడిన పిమ్మట తిలక్ మాట్లాడాలనుకున్నారు కాని మితవాదులాయనను మాట్లాడనివ్వలేదు అయినా ఉపన్యసిస్తానని తిలక్ వేదికవైపు వెళ్లబోతున్నప్పుడొక మితవాది ఆయనపైకి చెప్పు విసిరాడు అది గురితప్పి సురేంద్రనాథ్ బెనర్జీని రాసుకుంటూ పోయి ఫిరోజ్‌షా మెహతాకు తగిలింది ఆ చెప్పును అతివాదులే విసిరారనే నెపం మోపిన మితవాదులు తిలక్‌ను కొట్టేందుకు సిద్ధపడగా, గోపాలకృష్ణ గోఖలే అడ్డుపడి ఆపాడు అయినా పరిస్థితి చక్కబడలేదు

తమకు అధ్యక్ష పదవి దక్కకుండా చేసేందుకు మితవాదులు రికార్డులను తారుమారుచేసి, తమ మద్దతుదారుల సంఖ్యను పెంచుకున్నారని, నాగపూర్‌లో జరుపవలసిన సభను సూరత్‌లో జరిపారని అతివాదులు ఆరోపించారు ఆ ఆరోపణలకు సరియైన సమాధానమివ్వకుండా మితవాదులు దాటవేశారు కాబట్టి గలాటా ప్రారంభమైంది ఇరుపక్షాలవారూ కుర్చీలు విసురుకున్నారు మితవాదులు పోలీసులను పిలిపించారు జాతీయ కాంగ్రెస్ రెండుగా చీలిపోయింది మితవాదుల భయం తీరిపోయింది (ఆనాడలా చీలిపోయిన కాంగ్రెస్ తిరిగి 1916లో ఏకమైంది)

## యువకులకు ఉరిశిక్షలు

కాంగ్రెస్ చీలికవల్ల ప్రభుత్వ దమనకాండకు హద్దూపద్దూలేకుండా పోయింది యుగంధర్, కేసరి, పంజాబీ, వందేమాతరం, సంధ్య మొదలగు పత్రికలను అణచి వేసేందుకు పూనుకున్న ప్రభుత్వం, పత్రికలపై నిషేధాలను విధిస్తూ 1908 చట్టం చేసింది రాజద్రోహ సభల నిషేధ చట్టాన్ని పొడిగించింది క్రిమినల్ లా అమెండ్‌మెంట్ ఆక్టును పాస్ చేసింది

కర్జన్ తరువాత వైస్రాయిగా నియమించబడిన లార్డ్ మింటో "మొదట లాఠీ, తరువాతనే సంప్రదింపులు" అనే సిద్ధాంతాన్ని అమలు జరిపాడు కలకత్తాలో "వందేమాతరం" అన్న 15 ఏళ్ల కుర్రవాడికి కింగ్స్‌ఫర్డ్ అనే మేజిస్ట్రేట్ 16 కొరడా దెబ్బల శిక్ష వేశాడంటే దమనకాండ ఎలా వుండేదో తెలుసుకోవచ్చు కాగా తీవ్రవాదుల గుండెలు మండాయి వారిలో ప్రతీకారవాంఛ రేకెత్తింది

కింగ్స్‌ఫర్డ్‌ను హతమార్చేందుకు అనుశీలన సమితివారు ప్రఫుల్లచాకి, ఖుదీరాం బోస్‌లను నియమించారు ఈలోగా కింగ్స్‌ఫర్డ్ ముజఫర్‌పూర్‌కు బదిలీ అయ్యాడు ప్రఫుల్లచాకి, ఖుదీరాం బోస్ ముజాఫర్‌పూర్ వెళ్లి మాటు వేశారు క్లబ్బునుండి బయటకు వస్తున్న కారును చూచారు అది కింగ్స్‌ఫర్డ్ కారేననుకొని బాంబు విసిరారు. కాని ఆయన అందులో లేడు కారులోవున్న శ్రీమతి కెన్నడీ, ఆమె కుమార్తె బాంబు దెబ్బలతో మరణించారు కింగ్స్‌ఫర్డ్ చావలేదని, నిరపరాధులైన స్త్రీలు బలైపోయారని తెలిసినప్పుడు ఖుదీరాంబోసు చాల బాధపడ్డాడు ఆ స్థితిలోనే పట్టుబడిపోయాడు ప్రఫుల్లచాకి పట్టుబడకుండా రివాల్వరుతో కాల్చుకుని చనిపోయాడు

ఖుదీరాం బోస్‌ను ఉరితీశారు అప్పటికాయన వయస్సు 15 సంవత్సరాలు మాత్రమే కన్నీటి ధారలతో వేలాది ప్రజలు ఆయన శవాన్ని ఊరేగించారు శవదహనం తరువాత చితాభస్మాన్ని తీసుకున్నారు తరువాత ఆయన రూపాన్ని ముద్రించిన వస్త్రాలను యువకులు ధరించారు

ప్రఫుల్ల చాకి, ఖుదీరాంబోస్‌లను కీర్తిస్తూ అనేక గేయాలు వెలువడినాయి వారి చర్యలను సమర్థిస్తూ, వారి త్యాగాలకు జోహార్లర్పిస్తూ కేసరి, మరాఠీ పత్రికల్లో లోకమాన్య

తిలక్, పరంజపాయ్ వ్యాసాలు వ్రాశారు

మరణభయంలేని అనుశీలన సమితి సభ్యులు, బెంగాల్ గవర్నర్ ప్రయాణం చేస్తున్న రైలుమీద బాంబు వేశారు అది గవర్నరుకు తగలలేదు కాని వారి తుపాకి గుండు తగిలిన ఢాకా జిల్లా మేజిస్ట్రేట్ అల్లేన్ హతమయ్యాడు కనుక ప్రభుత్వ గాలింపు చర్యలు పెరిగాయి

## అలిపూర్ కుట్రకేసు

1908 మేలో కలకత్తా శివారు మనిక్‌తలాలో బాంబులు తయారు చేస్తున్నట్టు తెలుసుకోగలిగారు జూన్ రెండవ తేదీన ఆ కేంద్రంమీద దాడిచేసి అక్కడివారిని అరెస్టు చేశారు వారితోపాటు అరవింద ఘోష్ మున్నగువారినికూడా బంధించి, మొత్తం 34 మందిమీద ప్రభుత్వం కేసు పెట్టింది అలిపూర్ కుట్రకేసుగా ప్రసిద్ధి చెందిన కేసు అదే

కుట్రకేసు ముద్దాయిలలోనున్న నరేంద్ర గోస్వామి అప్రువరుగా మారాడు కనుక అరవింద ఘోష్ వారించినా వినకుండా కన్హయ్‌లాల్ దత్తా నరేంద్రస్వామిని జైల్లోనే కాల్చి చంపాడు దత్తాకు సత్యేంద్రనాధదాసు తోడ్పడ్డాడు ప్రభుత్వం వారిద్దరిని ఉరితీసింది

వికసించిన వదనంతో చిరునవ్వులు చిందిస్తూ కన్హయలాల్ దత్తా ఉరికంబమెక్కాడు ఆయన శవాన్ని యాభైవేలమంది కలకత్తా ప్రజలు ఊరేగించారు మేడలమీదనున్న మహిళలు శవంమీద పూలవర్షం కురిపించారు ఉపవాసాలు చేశారు

కుట్రకేసు ముద్దాయిల తరపున సెషన్స్ కోర్టులో చిత్తరంజన్‌దాస్ వాదించారు కాబట్టి అరవిందఘోష్‌తోపాటు చాలామంది విడుదలయ్యారు కాని వారీంద్రఘోష్, ఉల్లాసకరదత్తులకు ఉరిశిక్షలు, ఉపేంద్రనాధ్ బెనర్జీ, వీరేంద్ర చంద్రసేన్, ఇంద్రనాధ్ నంది, శైలేంద్రనాధ్ బోస్‌లకు దేశాంతరవాస శిక్షలు, మరికొందరికి వివిధ రకాల శిక్షలు విధింపబడినాయి కాబట్టి ఖర్చులకొరకు తన గుర్రపుబండిని అమ్మివేసి, దేశబంధు చిత్తరంజన్‌దాస్ హైకోర్టుకు అప్పీలు చేశారు

అప్పీల్లో వారీంద్రకుమార్ ఘోష్, ఉల్లాసకరదత్తుల ఉరిశిక్షలు యావజ్జీవ, దేశాంతరవాస శిక్షలుగా మార్చబడినాయి ఉపేంద్రనాధ్ బెనర్జీతోపాటు మరొక ముగ్గురికి విధించబడిన యావజ్జీవ, దేశాంతరవాస శిక్షలను హైకోర్టువారు ఖాయం చేశారు కొందరి శిక్షలను తగ్గించి, మరికొందరిని విడిచిపెట్టారు

తరువాత అరవిందఘోష్ పాండిచేరికి వెళ్ళి ఆశ్రమాన్ని స్థాపించాడు చక్రవర్తి క్షమాదానంవల్ల 1919లో విడుదలైన వారీంద్రకుమార్ ఘోష్‌కూడా పాండిచేరికి వెళ్ళి తన అన్నగారి ఆశ్రమంలో వుండిపోయాడు ఉల్లాసకరదత్తు మతిచెడిపోయి, అండమాన్ దీవుల్లోనే మరణించాడు

## లోకమాన్యునికి ప్రవాస శిక్ష

ముజఫర్‌పూర్ బాంబు కేసుకు సంబంధించిన రెండు వ్యాసాలను కేసరి పత్రికలో ప్రకటించినందుకు లోకమాన్య తిలక్‌ను 1908 జూలై 13న ఆరేళ్ళు శిక్షవేసి, బర్మాలోని మాండలే జైలుకు పంపారు మరాఠీ పత్రిక సంపాదకుడైన పరంజపాయ్‌కికూడా శిక్ష విధించారు

లోకమాన్యునికి విధించిన శిక్షను నిరసిస్తూ బొంబే కార్మికులు ఆరు రోజులపాటు సమ్మె చేశారు ఇదే కార్మిక వర్గం చేసిన మొట్టమొదటి రాజకీయ సమ్మె ఈ సమ్మెను

విప్లవ ప్రాముఖ్యంగల సంఘటనగా లెనిన్ వర్ణించాడు

బెంగాల్లో తొమ్మిదిమంది నాయకులను విచారణ లేకుండానే ప్రభుత్వం నిర్బంధించింది యుగాంతర్ పత్రికా సంపాదకుడైన భూపేంద్రనాధ దత్తుకు దీర్ఘకాల శిక్ష విధించింది ఈయన స్వామి వివేకానందుని సోదరుడు కొడుకుకు విధించిన శిక్షను విని తల్లి బాధపడలేదు పైగా సంతోషించింది దేశమాత రుణం తీర్చిన కొడుకులను కన్నతల్లిగా గర్వపడుతున్నానన్నది కనుక అనేకమంది మహిళలు వెళ్లి ఆమెను అభినందించారు

సంధ్య పత్రిక సంపాదకుడైన బ్రహ్మదత్త ఉపాధ్యాయను అరెస్టుచేసి, విచారణ జరుపుతుండగానే ఆసుపత్రిలో ఆయన మరణించాడు యుగాంతర్, సంధ్య, వందేమాతరం పత్రికలు మూడూ నిషేధించబడినాయి

మద్రాస్ ప్రెసిడెన్సీలో వి కృష్ణస్వామి అయ్యర్ నాయకత్వానగల మితవాదులను ఆంధ్రలో ముట్నూరు కృష్ణారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రభృతులు వ్యతిరేకించారు తమిళనాడులో జి సుబ్రహ్మణ్య అయ్యర్, వి.ఓ చిదంబరం పిళ్ళై, సుబ్రహ్మణ్య శివ, సుబ్రహ్మణ్య భారతి వ్యతిరేకించారు అందువల్ల మద్రాస్ ప్రెసిడెన్సీలో అతివాద రాజకీయాలు పుంజుకున్నాయి హిందూ పత్రిక అతివాదులవైపు మొగ్గింది కృష్ణాపత్రిక అతివాదులను గట్టిగా సమర్ధించింది

ఆరు లక్షల మూలధనంతో 1906 లో స్థాపించబడిన స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ స్టీమర్లు కొలంబోకు వెళ్లకుండా ఆపేందుకు బ్రిటిష్ ఇండియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ కల్పించిన చిక్కులవల్ల ట్యూటికోరిన్‌లో బ్రిటిష్ వ్యతిరేకత తీవ్రమైంది అందువల్ల 1908 ఫిబ్రవరి మాసం పొడవునా ట్యూటికోరిన్‌లో సభలు జరిగాయి సుబ్రహ్మణ్య శివ ఉపన్యాసాలు కార్మికులనుకూడా ఆకట్టుకున్నాయి

"అధిక వేతనాల కొరకు కార్మికులు సమ్మె చేస్తే, ఇండియాలోవున్న బ్రిటిష్ ఫ్యాక్టరీలు మూతబడతాయి 1905లో జరిగిన రష్యన్ విప్లవంవల్ల అక్కడ ప్రజలకు మేలు జరిగింది ఓడినా, గెలిచినా విప్లవంవల్ల మేలు జరుగుతుందేగాని కీడు జరగదు" అంటూ సుబ్రహ్మణ్య శివ, చిదంబరం పిళ్ళే కలిసి కార్మికులకు బోధించారు కాగా బ్రిటిష్‌వారి కోరల్ కాటన్ మిల్లుల్లోని కార్మికులు సమ్మెచేసి, తమ జీతాలను యాభైశాతం వరకూ పెంచుకోగలిగారు అలా విజయం సాధించిన కార్మికులను, నాయకులను బెంగాల్ మున్నగు ప్రాంతాలలోగల తీవ్రవాదులు అభినందించారు కాని కార్మిక సంఘాలను నిర్మించవలసిన ఆవశ్యకతను గుర్తించలేకపోయారు

కార్మిక సమ్మెలను, స్వదేశీ కంపెనీలను సహించలేని సామ్రాజ్యవాదులు ట్యూటికోరిన్, తిరునల్వేలి ప్రజలమీద దాడి ప్రారంభించి, చిదంబరం పిళ్ళేకు యావజ్జీవ కారాగార శిక్ష విధించారు అందుకు మద్రాసులో నిరసన తెలుపుతున్న ప్రజలమీద ఒక ఆంగ్లేయుడు కాల్పులు జరిపి యిద్దరి ప్రాణాలను బలిగొన్నాడు తిరునల్వేలి, ట్యూటికోరిన్ పట్టణాల ప్రజలమీద పోలీసు కాల్పులు జరిగాయి (కాల్పులు జరిపించిన జిల్లా మేజిస్ట్రేట్‌పైన వాంఛీ అయ్యర్ పగబట్టి, 1911లో కాల్చి చంపాడు)

మద్రాసులో యిద్దరి ప్రాణాలను బలిగొన్న ఘటన ఆంధ్రలో కోపోద్రిక్తతకు కారణమైంది ఆ ఘటనను ఘాటుగా విమర్శిస్తూ స్వరాజ్య, నవయుగ, కృష్ణాపత్రికలు వ్యాసాలు వ్రాశాయి

"క్రూరాతిక్రూరమైన ఇంగ్లీషు పులి యిద్దరి భారతీయుల ప్రాణాలను హరించింది"అంటూ విమర్శించినందుకుగాను బెజవాడనుండి వెలువడే స్వరాజ్య పత్రిక సంపాదక, ముద్రాపకులైన గాడిచర్ల హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావులకు మూడేళ్ల చొప్పున కఠిన శిక్ష విధించారు ముట్నూరు కృష్ణారావుగారిపై అరెస్టు వారెంటు జారీ కాగానే ఆయన కృష్ణా పత్రిక సంపాదకత్వానికి రాజీనామా చేశారు చిల్లరిగె శ్రీనివాసరావుకు అరెస్టు వారెంటు జారీ అయిన పిమ్మట నవయుగ పత్రిక నిలిచిపోయింది

చిదంబరం పిళ్ళే, సుబ్రహ్మణ్య శివ బంధింపబడిన తరువాత తమిళనాడులోని అతివాదులు కొంత వెనుకకు తగ్గారు కాని సుబ్రహ్మణ్య భారతి వెనకడుగు వేయలేదు కుల, మత వైషమ్యాలను, భాషా విభేదాలను నిరసిస్తూ, దేశభక్తిని ప్రబోధిస్తూ, గేయాలు వ్రాయడం మాత్రమేగాక, తన అనుచరులతో కలిసి శక్తివంచన లేకుండా పోరాటం కొనసాగించాడు రహస్య జీవితం గడుపుతూ 1910లో పాండిచేరికి తప్పించుకుపోయాడు అలా పోరాడుతూనే 1921లో మరణించాడు చనిపోయేముందు రష్యాలో జరిగిన బోల్షివిక్ విప్లవాన్ని ప్రశంసిస్తూ కొన్ని గేయాలు వ్రాశాడు

## ఆంధ్రదేశంలో

ఆంధ్రలో వీరేశలింగం పంతులు ప్రారంభించిన సంస్కరణోద్యమాన్ని, గిడుగు రామమూర్తి ప్రారంభించిన వ్యవహార భాషా ఉద్యమాన్ని ప్రతిబింబించే ముత్యాల సరాలను గురజాడ అప్పారావు వ్రాశాడు అస్పృశ్యతను, బాల్య వివాహాలను వ్యతిరేకించాడు నేటివరకూ సాటిలేని 'కన్యాశుల్కం' నాటకాన్ని రచించాడు కాని ఆంగ్లేయులను వ్యతిరేకించడం మంచిపని కాదని 'దేశభక్తి గేయం' ద్వారా నొక్కి చెప్పాడు 'దేశమును ప్రేమించుమన్నా' అన్న గేయంలోని యీ క్రింది చరణాలను చూస్తే, ఆ విషయం స్పష్టంగా కనిపిస్తుంది

"నిన్న వొచ్చారింగిలీషులు-మొన్న వచ్చిరి ముసలమాను-లటు మొన్న వచ్చిన వాడవీవని-మరచి వేరులు పెట్టకోయ్" అన్నాడు గురజాడ అప్పారావు (ఈ విషయాన్ని బైటపెట్టడం యిష్టం లేనందున, పై చరణాలను విడిచిపెట్టి, తక్కిన గేయాన్ని ప్రచురించడం, పాడడం జరుగుతోంది )

బెంగాల్లో రవీంద్రుడు 'ఆత్మశక్తి'ని ప్రబోధించాడు హిందూ-ముస్లిమ్ ఐక్యత కొరకు ఎడతెగని కృషి జరగాలన్నాడు మాతృభాషలో శాస్త్ర సాంకేతిక విద్యను బోధించడం, కార్మిక, కర్షక వర్గాల కష్ట నివారణ కొరకు కృషి చేయడం అవసరమంటూ అనేక వ్యాసాలు వ్రాశాడు ఆశాపూరితమైన 'గోరా' అనే నవలను రచించాడు అయినా అతివాదులుగాని, విప్లవ టెర్రరిస్టులుగాని ఆయన మాట వినలేదు బాంబు దాడులవల్ల విప్లవోద్యమం నీళ్లుగారిపోయింది. అందువల్ల జనించిన నిరుత్సాహంతో 'ఘరే-బైరే' నవల వ్రాశాడు.

## విప్లవ సంస్థల నిషేధం

ఎవరేమి చెప్పినా విప్లవ టెర్రరిస్టులు వినిపించుకోలేదు దేశ స్వాతంత్ర్యం కొరకు పదిమంది యువకులు ఆత్మార్పణ చేస్తే, యువకులంతా తిరగబడతారని వారు విశ్వసించారు ఖుదీరాంబోస్, కన్హయలాల్ దత్తా మొదలగు దేశభక్తులను ఉరిదీసి,

లోకమాన్య తిలక్‌లాంటి వారికి దేశాంతరవాస శిక్షలు విధించి, పత్రికల నోళ్లు నొక్కిన బ్రిటిష్‌వాళ్లను హతమార్చేందుకు నడుములు బిగించారు సభ్యుల సంఖ్య బాగా పెరిగింది కాని, వారివి రహస్య కార్యకలాపాలు కావడంవల్ల ప్రజలతో సంబంధాలు లేకుండా పోయాయి

అందువల్ల ప్రభుత్వం అనుశీలన సమితి, వ్రత సమితి, సాధన సమితి మొదలగు వాటిని నిషేధించింది వాటిలో సభ్యులుగానున్నవారిని కఠినంగా శిక్షించింది కాగా, ఇండియా సెక్రటరీ మోర్లే వైస్రాయ్ మింటోకు యిలా వ్రాశాడు

“రాజకీయ ద్రోహానికి విధిస్తున్న భీతావహమైన శిక్షలను నేర్పుతోను, ఆందోళనతోను గమనిస్తున్నాను భద్రత (ఆర్డర్) వుండాల్సిందే కాని అందుకు మార్గం అత్యంత కఠినమైన నిర్బంధ చర్యలుకాదు కఠిన నిర్బంధం బాంబుల తయారీకి దారి తీస్తుంది ”

అలా ఇండియా సెక్రటరీ వైస్రాయికి వ్రాసిన ఏమ్మటకూడా దమనకాండ తగ్గలేదు ‘ముందు లాఠీ, తరువాతనే సంప్రదింపులు’ అంటూ వైస్రాయ్ ప్రగల్భాలు పలికాడు కనుక విప్లవ టెర్రరిస్టులు విజృంభించారు

పంజాబులో ఉద్యమం బాగా బలపడింది అజిత్‌సింగ్, ఆగాహైదర్, సయ్యద్ హైదర్, లాల్‌చంద్ హలన్, ధనపతిరాయ్‌లాంటివారు నాయకత్వం వహించారు పంజాబ్, బెంగాల్ ఉద్యమాలకు సంధానకర్తగా రసవిహారీబోస్ కృషి చేశాడు

‘భారతమాత’ పత్రికా సంపాదకుడు సూఫీ అంబా ప్రసాద్, హిందూ–ముస్లిమ్ ప్రజల ఐక్యతకు తీవ్రంగా కృషి చేశాడు కాగా పల్లె ప్రాంతాలలో రైతుల పోరాటాలు విస్తరించాయి

ఢిల్లీలో లాలా హరదయాళ్, లాలా హనుమంత్ సహాయ్, మాస్టర్ అమీర్‌చంద్‌వంటి నాయకులు విప్లవ టెర్రరిస్టు ఉద్యమాన్ని బలోపేతం చేశారు లాలా హరదయాల్ విదేశాలకు వెళ్లినప్పటికి ఉద్యమం అభివృద్ధి చెందింది

బెంగాల్లో విప్లవకారులు ఢిప్రా నవాబునుండి మూడు తుపాకులను లాక్కున్నారు కన్హయలాల్ దత్తాపై ఆరోపించబడిన హత్య కేసులో సాక్ష్యమిచ్చిన పోలీసు అధికారిని, ఆ కేసులో వాదించిన ప్రభుత్వ న్యాయవాదిని కాల్చి చంపారు

## కోటప్పకొండ పోలీసులపై ప్రజల దాడి

వందేమాతరం ప్రభావం పట్టణాలనుండి పల్లెలకు వ్యాపించడంవల్ల 1909 ఫిబ్రవరి 18న జరిగిన కోటప్పకొండ తిరునాలలో మూర్ఖులుగా ప్రవర్తించిన పోలీసులమీద ప్రజలు తిరగబడ్డారు

చిన్నప్పరెడ్డి కట్టుకువచ్చిన ప్రభచుట్టూ గుమిగూడిన పోలీసులను చూసి, ప్రభకు కట్టిన గిత్త బెదిరింది కట్లు తెంచుకొని తమపైకి కుమ్ముతూ ఎగబడిన గిత్తను పోలీసులు తుపాకీతో కాల్చి చంపి, చిన్నప్ప రెడ్డిని అరెస్టు చేశారు అందువల్ల రెచ్చిపోయిన ప్రజలు, వందేమాతరం అంటూ పోలీసు క్యాంపుమీద దాడిచేసి, దాన్ని తగులబెట్టి, చిన్నప్పరెడ్డిని విడిపించారు. పోలీసులు పారిపోయారు ప్రజలను శాంతపరిచేందుకు ప్రయత్నించిన డి వై ఎస్.పి సుబ్బారెడ్డికి రాళ్లదెబ్బలు తగిలాయి

గురవాయపాలెంలో మకాం వేసివున్న సబ్–కలెక్టర్ కేర్న్‌స్ వెంటనే కోటప్పకొండకు వచ్చి, సత్రములోపడివున్న డి వై ఎస్ పి గాయాలకు కట్టు కడుతుండగా, జనం సత్రాన్ని

చుట్టుముట్టారు దఫేదారును కొట్టారు డి వై ఎస్ పి కి, సబ్-కలెక్టర్‌కు రక్షణగా వున్న పోలీసులు జరిపిన తుపాకీ కాల్పులవల్ల యిద్దరు యువకులు మరణించారు అయినా లెక్కచేయకుండా ప్రజలు వందేమాతరం అని నినదిస్తూ సత్రానికి నిప్పుపెట్టారు సబ్-కలెక్టర్, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంట్ తప్పించుకు వెళ్ళిపోయారు ఒక కానిస్టేబుల్‌తోపాటు మరొక బంట్రోతు చనిపోయాడు

తరువాత ప్రభుత్వం 45గురిని అరెస్టుచేసి కేసు పెట్టింది వారిలో 21 మందికి శిక్షలు పడ్డాయి చిన్నప్పరెడ్డికి మరణశిక్ష, మరొక నలుగురికి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించారు పిరికివారుగా వ్యవహరించారనే నేరం మోపి సబ్-కలెక్టర్ కెర్షాన్స్‌ను, డి వై ఎస్ పి సుబ్బారెడ్డిని ప్రభుత్వం సస్పెండ్ చేసింది బ్రహ్మానందం నాయుడు అనే తహశీల్‌దారును, సుబ్బరాయుడు అనే సబ్-మేజిస్ట్రేట్‌ను డిస్మిస్ చేసింది 'సైరా చిన్నప్పరెడ్డి' అంటూ పాటలు వ్రాసి ప్రజలు పాడుకున్నారు

## తెనాలి బాంబు కేసు

ఆ సమయంలో మరో ఘటన జరిగింది తెనాలి సమీపంలోని కంచర్లపాలెంలో గొడ్లపాకలో దాచివుంచిన బాంబుపేలి చెన్నయ్య అనే హరిజనుడు మరణించాడు ఆ బాంబును చుక్కపల్లి రామయ్య, కాటంరాజు వెంకట్రాయుడు, లక్కరాజు బసవయ్య కలిసి తయారుచేశారనే నేరంమోపి 1909 ఏప్రిల్ 6న పోలీసులు ఆ ముగ్గురినీ అరెస్టుచేసి కేసు పెట్టారు బారిస్టర్ ప్రకాశం పంతులు ముద్దాయిల తరపున వాదించాడు అయినా, చుక్కపల్లి రామయ్యకు పది సంవత్సరాల దేశాంతర జైలుశిక్ష, లక్కరాజు బసవయ్యకు రెండేళ్లు జైలు శిక్ష వేశారు.

## చెంచుల పోరాటం

నల్లమల పర్వత ప్రాంతాలలో చెంచులకు అడవి సంపద దక్కకుండా చేసేందుకు క్రమక్రమంగా ప్రభుత్వం నిబంధనలు విధించింది 1898లో ప్రారంభమైన నిబంధనలు, హక్కుల కుదింపులు 1909 నాటికి భరింపరానివిగా తయారయ్యాయి అడవి సంపదపై ఆధారపడిన చెంచుల జీవితం దుర్భరమైంది కాగా చెంచులు ఫారెస్టు డిపార్ట్‌మెంట్ వారిమీద తిరగబడ్డారు డిపార్టుమెంటువారికి అండగా పోలీసు దళాలొచ్చి చెంచు పల్లెలమీద విరుచుకుపడ్డాయి కొన్ని చెంచు పల్లెలను తగులబెట్టాయి

'నాకు కానిది నాశనమగుగాక' అంటూ చెంచులు అడవులను తగులబెట్ట నారంభించారు ప్రభుత్వం కళ్లు తెరిచింది దమనకాండ కొనసాగితే అడవులు మొత్తం తగలబడిపోతాయని భావించిన ప్రభుత్వం నిర్బంధాలను సడలించింది

## లండన్‌లోని ఇండియా హౌస్‌పై దాడి

లండన్‌లోని శ్యాంజీ కృష్ణవర్మ నెలకొల్పిన ఇండియా హౌస్ (భారత భవనం) వినాయక దామోదర సావర్కార్‌వంటివారి కార్యకలాపాలకు కేంద్రంగా వుండేది ఇండియన్ హోంరూల్ సొసైటీ తరపున శ్యాంజీ కృష్ణవర్మ నడిపే 'ఇండియన్ సోషియాలజిస్టు' పత్రిక బ్రిటిష్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించేది కాగా ఇండియా హౌస్‌మీద బ్రిటిష్ ప్రభుత్వపు నిఘా ఎక్కువైంది ఏ సమయంలోనైనా దాడి జరగవచ్చుననే అనుమానంతో కృష్ణవర్మ పారిస్‌కు తప్పించుకుపోయాడు అందువల్ల బ్రిటిష్ ప్రభుత్వం సోషియాలజిస్టు

పత్రిక ముద్రాపకుని అరెస్టుచేసి శిక్ష విధించింది అటు పిమ్మట పత్రికను నడిపేందుకు పూనుకున్న మరొకరిని కూడా అరెస్టు చేసింది లండనులోని భారతీయ విద్యార్థులమీద నిఘా ఎక్కువ చేసేందుకు సర్ కర్జన్ వైలీ నియమింపబడ్డాడు కొద్దిమంది భారతీయ విద్యార్థులతో సంబంధాలు పెట్టుకోగలిగిన కర్జన్ వైలీ లండన్‌నుండి బొంబాయికి రహస్యంగా ఆయుధాలు చేరుతున్నాయని పసిగట్టగలిగాడు

వినాయక దామోదర సావర్కార్ లండన్‌నుండి ఇండియాకు రహస్యంగా ఆయుధాలు పంపుతుంటే, ఆయన తమ్ముడు గణేష్ దామోదర సావర్కార్ నాసిక్‌లో వుంటూ విప్లవ కార్యకలాపాలకు నాయకత్వం వహించేవాడు యువకులకు విప్లవ చైతన్యం కలిగించేందుకు అభినవ భారత సమితిని స్థాపించిన గణేశ్ సావర్కార్ 1907లో 'మాజినీ' ఆత్మకథను మరాఠీలోనికనువదించి ప్రచురించాడు 1909లో మరికొన్ని గేయాలు వ్రాశాడు అవి రాజద్రోహాన్ని పురికొల్పుతున్నాయనే నేరంమోపి ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసింది కఠినాతి కఠినమైన శిక్ష విధించవలసిందిగా కోరుతూ నాసిక్ జిల్లా మేజిస్ట్రేట్‌కు కర్జన్ వైలీ కబురు పంపాడు ఇకనేం! జిల్లా మేజిస్ట్రేట్ జాక్సన్ గణేశ్ దామోదర సావర్కార్‌కు యావజ్జీవ ప్రవాస శిక్ష విధించాడు

## కర్జన్ వైలీ హత్య

అలా కఠిన శిక్ష విధించడానికి కారకుడు కర్జన్ వైలీయేనని లండన్‌లోని భారతీయ విద్యార్థులకు తెలియగానే వారి కోపాగ్ని ప్రజ్వరిల్లింది భారత భవన్ విద్యార్థులలో చీలికలు కల్పించేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్న కర్జన్ వైలీ భారతదేశంలో విధించబడే శిక్షల విషయంలోకూడా జోక్యం చేసుకుంటున్నందున, ఆయనను అంతం చేసేందుకు మదన్‌లాల్ డింగ్రా పూనుకున్నాడు 1909 జూలై 1వ తేదీన లండన్‌లోని ఇంపీరియల్ ఇన్‌స్టిట్యూట్ హాల్లో ప్రవేశించి, కర్జన్ వైలీని పిస్టల్‌తో కాల్చి చంపాడు

"భారతీయ యువకులను ఉరి తీయడానికి, యావజ్జీవ దేశాంతరవాస శిక్షలకు గురి చేయడానికి నిరసనగా నేనీ హత్య చేశాను" అని మదన్‌లాల్ డింగ్రా ఒప్పుకున్నాడు అరెస్టు కాబడినప్పుడు ఆయన జేబులోవున్న కాగితంమీద యిలా వ్రాసి వుంది

"ఆయుధ బలంతో అణచిపెట్టబడిన దేశం ఎల్లప్పుడూ యుద్ధంలో వున్నట్లే లెక్క అందువల్ల నేను చేసిన పని శత్రు సంహారమేగాని హత్యకాదు మాకు తుపాకులుగాని, ఫిరంగులుగాని లేవు కాబట్టి చిన్న పిస్టల్‌తో హఠాత్తుగా నేనీ దాడి చేయవలసి వచ్చింది నేనెవరితోనూ కలిసి కుట్ర చేయలేదు ధనంలోను, సామర్థ్యంలోను పేదవాడినైన నేను భారతమాతకు నా రక్తంతప్ప మరేమివ్వగలను? నా తల్లి విముక్తి పొందేవరకూ తిరిగి తిరిగి నేను భారతదేశంలోనే జన్మించాలని, ఈ పవిత్ర ఆశయం కోసమే మరణించాలని కోరుకుంటున్నాను నా కోర్కెను మన్నించవలసిందిగా దేవుని ప్రార్థిస్తున్నాను వందేమాతరం!"

## జాక్సన్ హత్య

లండన్ నడిబొడ్డులో జరిగిన కర్జన్ వైలీ హత్య ఆంగ్లేయులకొక హెచ్చరికగా భావింపబడింది అంతకంటే ప్రాముఖ్యతగల ఘటనలు ఇండియాలోకూడా జరిగాయి

లండన్‌నుండి రహస్యంగా వినాయక దామోదర సావర్కార్ పంపిన ఇరవై ఆటోమాటిక్ పిస్టల్స్‌ను అందుకోకముందే గణేశ్ దామోదర సావర్కారును ప్రభుత్వం

అరెస్టు చేసినప్పటికీ, వాటిని అభినవ భారత సమితి సభ్యులు అందుకోగలిగారు గణేశ్ సావర్కారుకు శిక్ష విధించిన జాక్సన్‌ను ఆ పిస్టల్సుతోనే 1909 డిసెంబరు 21న కాల్చి చంపారు కనుక ఏడుగురు చిత్పవన బ్రాహ్మణ యువకులను ప్రభుత్వం అరెస్టుచేసి, వారిలో ముగ్గురికి మరణ శిక్ష విధించింది తక్కిన నలుగురికి కఠిన శిక్షలు వేసింది.

అప్పటికే వినాయక సావర్కార్ చిన్న తమ్ముడు నారాయణ సావర్కార్ జైల్లో వున్నాడు 1909 నవంబర్ 9న అహమ్మదాబాద్‌లో వైస్రాయి దంపతులమీద బాంబు విసిరాడనే నెపంమోపి నారాయణ సావర్కారును, మరో యిద్దరిని ప్రభుత్వం అరెస్టుచేసి కఠిన శిక్షలు విధించింది

'ఆనాడు అహమ్మదాబాద్‌లో బాంబు దెబ్బ తగలకుండా బ్రతికి బయటపడిన లార్డ్ మింటో అటుతరువాత అండమాన్ దీవుల అధికారిగా నియమింపబడ్డాడు అక్కడొక పఠాన్ ఖైదీ ఆయనను కత్తితో నరికి చంపాడు 'ముందు లాఠీ ఆ తరువాతనే సంభాషణలు' అంటూ ప్రగల్భాలు పలికిన లార్డ్ మింటో జీవితం అలా ముగిసింది).

జాక్సన్‌ను కాల్చి చంపినవాడు అనంతె లక్ష్మన్ అనే విద్యార్థి అయినా ఆయనతోపాటు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం మరో యిద్దరిని ఉరిదీసి, నలుగురికి కఠిన శిక్షలు విధించింది అక్కడికి సంతృప్తిలేక, నైజాం నవాబ్ మెడవంచి, ఔరంగాబాద్‌లోని అధికార్లను డిస్మిస్ చేయించింది

జాక్సన్ ప్రాణం తీసినవారితో సంబంధాలున్నాయనే నేరం మోపి మాధవరావు, నరహరి త్రయంబక్, ఘోత్‌పోలే, వినాయక గోవింద తెకె, ధరణ్ చోగ్లే, కోలే అనే ఆఫీసర్లను నైజాం నవాబ్ డిస్మిస్ చేశాడు

తరువాత డాక్టర్ అఘోరనాథ ఛటోపాధ్యాయ (సరోజినీదేవి తండ్రి) నాయకత్వాన సాగుతున్న స్వదేశీ ఉద్యమంమీదకూడా నైజాం నవాబ్ కత్తిగట్టాడు కనుక ఉద్యమ నాయకులైన దామోదర సత్వ్య లేకర్, తులిజా పూర్కర్ హైదరాబాద్‌నుండి వెళ్లిపోయారు



# మింటో-మోర్లే సంస్కరణలు

ఇంగ్లండులో టోరీల ప్రభుత్వం పతనమవుతున్న సమయంలో వైస్రాయిగా నియమింపబడినవాడు లార్డ్ మింటో 1906లో అధికారాన్ని చేపట్టిన లిబరల్ పార్టీ ప్రభుత్వంలో ఇండియా కార్యదర్శిగా అధికారంలోకి వచ్చినవాడు జాన్ మోర్లే కాగా యిద్దరి మధ్యా కొన్ని అభిప్రాయభేదాలుండేవి

ఏ సమస్యనైనా లిబరల్ దృక్పథంతో పరిశీలిస్తాడనే పేరు జాన్ మోర్లేకి వుండేది కనుక ఆయన ఇండియాకు ఏదో ఒరగబెడతాడనే ఆశను మితవాద కాంగ్రెస్ నాయకులు పెంచుకున్నారు గోపాలకృష్ణ గోఖలే లండన్ వెళ్లి మోర్లేతో అనేకసార్లు సంభాషణలు కూడా జరిపాడు ఆ దశలోనే మితవాద కాంగ్రెస్ నాయకులు, అతివాదులను కాంగ్రెస్‌కు దూరంగా వుంచారు క్రిమినల్ లా సవరణ చట్టం, పత్రికలమీద నిర్బంధం, ప్రవాస శిక్షలు, రాజకీయ సమావేశాలమీద నిషేధంవంటి దమన చర్యలు అమలు జరుగుతున్నా వ్యతిరేకించలేదు అయినా ఫలితం పూజ్యమైంది

1906-1909 సంవత్సరాల మధ్యకాలంలో మింటో-మోర్లేలమధ్య అనేక ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి "అతివాదులను అణచివేయడం, కొద్దిపాటి సంస్కరణలద్వారా మితవాదులను కూడగట్టుకోవడం, విభజించి పాలించడం" అనే మూడు విషయాలలోను ఇరువురూ ఒక అంగీకారానికి రాగలిగారు "స్వతంత్ర సంస్థానాధీశుల పాలనలో బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం జోక్యం చేసుకోవడం మానివేయాలి" అని మింటో చేసిన ప్రతిపాదనను మోర్లే అంగీకరించాడు కాగా, వారు సూచించిన సంస్కరణలకు అనుగుణంగా 1909లో "ఇండియా కౌన్సిల్సు చట్టం" చేయబడింది

## కౌన్సిల్సు చట్టంలోని అంశాలు

వైస్రాయి కార్యనిర్వాహకవర్గంలో ఒక భారతీయుని నియమించాలి గవర్నర్ల కార్యనిర్వాహక వర్గాలలో కూడా ఒక్కొక్క భారతీయుని నియమించాలి

ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో 60 మంది సభ్యులుండాలి వారిలో 27గురు సభ్యులు మాత్రమే భారతీయులచే ఎన్నుకోబడాలి ప్రొవిన్షియల్ కౌన్సిల్సులో మెజార్టీ సభ్యులను భారతీయులు ఎన్నుకోవచ్చు కానీ కౌన్సిల్స్‌లో వుండే అధికార సభ్యులకు తోడుగా మరికొందరిని గవర్నర్లు నామినేట్ చేయవచ్చు

ముస్లిమ్‌లకు, జమీందార్లకు, యూరోపియన్ పెట్టుబడిదారులకు, భారతీయ పెట్టుబడిదారులకు రిజర్వుడు సీట్లు వుంటాయి అయినా వారు జనరల్ సీట్లకుకూడా పోటీ చేయవచ్చు

స్త్రీలకు ఓటుహక్కు వుండదు ఒక పరిమితికంటే తక్కువ ఆదాయంగల పురుషులకూకూడా ఓటు హక్కు వుండదు హిందువుల ఆదాయ పరిమితికంటే ముస్లింల ఆదాయ పరిమితి (ముస్లిములు పేదవారు గాబట్టి) తక్కువగా వుండాలి బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం అవాంఛనీయ వ్యక్తిగా భావించినవారిని ఎన్నిక కాకుండా నిషేధించవచ్చు

స్వతంత్ర సంస్థానాలను గురించి చర్చించే హక్కు కౌన్సిల్స్‌కు వుండదు బడ్జెట్ ప్రతిపాదనలను గురించి సభ్యులు చర్చించవచ్చు అలాగే శాంతి భద్రతలు, దిగుమతులను గురించికూడా చర్చించవచ్చు కానీ ఓటుచేసే హక్కుండదు

కాబట్టి యివి బూటకపు సంస్కరణలని అతివాదులు వ్యతిరేకించారు ఆశించి నంతగా లేకపోయినా, ఆలోచించదగిన సంస్కరణలేనని మితవాదులు భావించారు కాని మితవాదులలో మితవాదిగా పేరొందిన మదన్‌మోహన్ మాళవీయా ముస్లిములకు అధికేతర ప్రాముఖ్యతనిచ్చినందుకు ప్రభుత్వాన్ని ఘాటుగా విమర్శించాడు అందువల్ల మితవాదుల అభిప్రాయాలు మారాయి "మత ప్రాతిపదికపై ముస్లిములకు సీట్లను రిజర్వు చేయడం, భారతదేశంలో పెట్టుబడులు పెట్టిన యూరోపియన్ల ఆదిక్యతను పెంచేందుకు, వారికికూడా సీట్లను రిజర్వు చేయడం, దుష్ట బుద్ధితో కూడిన చర్యలు" అని జాతీయ కాంగ్రెస్ విమర్శించింది

అయినా యిచ్చినంతవరకు పుచ్చుకొని పైకి పోవాలని, తమ కోర్కెలకు అనుగుణంగా కౌన్సిల్స్‌ను ఉపయోగించుకోవాలని భావించిన మితవాద కాంగ్రెస్ నాయకులు కౌన్సిల్స్‌లో ప్రవేశించారు

"ప్రజలందరికి ప్రాధమిక విద్య నేర్పాలి నిర్బంధ దమనకాండను ఆపాలి కట్టు బానిసల వంటి కూలీల జీవన పరిస్థితులను మెరుగుపరచాలి దక్షిణాఫ్రికాలోను, యితరత్రానుగల భారతీయుల స్థితిగతులను గురించి పట్టించుకోవాలి" అంటూ ఇంపీరియల్ కౌన్సిల్ సమావేశంలో గోపాలకృష్ణ గోఖలే ఉపన్యసించాడు కాని ఫలితం పూజ్యమైంది

మరొకవైపున ఇంపీరియల్ కౌన్సిల్‌కు ఎన్నుకోబడే 27 సీట్లలోను తమకు రిజర్వు చేయబడిన 8 సీట్లకు తోడుగా మరొక మూడు జనరల్ సీట్లనుకూడా ముస్లిమ్ నాయకులు గెల్చుకున్నారు కాగా జాతీయ కాంగ్రెస్ కార్యకలాపాలు బాగా మందగించాయి విప్లవ టెర్రరిస్టుల కార్యకలాపాలు హెచ్చాయి

## కుట్రకేసుల పరంపర

1910 ప్రారంభంలో పోలీసులు యాభైమంది యువకులను అరెస్టుచేసి వారిమీద "హౌరా కుట్రకేసు"ను బనాయించారు వారిలో 5గురికి శిక్షలు పడ్డాయి

జులైలో 40 మందిని అరెస్టుచేసి వారిమీద "ఢాకా కుట్రకేసు"ను మోపారు అనుశీలన సమితి నిర్మాతలలో ప్రముఖుడైన పులిన విహారీ దాసుతోపాటు 15 మందికి రెండేళ్ళనుండి ఏడేళ్ళవరకూ జైలుశిక్షలు వేశారు

జైసూరు జిల్లాలోని 'సంగలా'వద్ద అనేకమంది యువకులను అరెస్టుచేసి, వారిమీద రాజద్రోహ నేరం మోపారు వారిలో ఆరుగురికి ఏడేళ్ళు, ముగ్గురికి ఐదేళ్ళు, ఇద్దరికి మూడేళ్ళ చొప్పున శిక్షలు విధించి అండమాన్ దీవులకు పంపారు.

సెప్టెంబర్ 5న మున్షీగంజ్‌లో ఒక యువకుని వద్దనున్న బాంబులను పట్టుకొని, అతనికి యావజ్జీవ దేశాంతరవాస శిక్ష విధించారు

## అక్రమంగా సావర్కార్ నిర్బంధం

వినాయక దామోదర సావర్కార్ బారిష్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడైనప్పటికి డిగ్రీ పత్రం యివ్వకుండా బ్రిటిష్ ప్రభుత్వం తొక్కిపట్టింది అయినా 'ఖడ్గం' అనే పత్రికను ప్రచురిస్తూ ఆయన లండన్‌లోనే వుండిపోయాడు ఆయన ఆరోగ్యంకూడా క్షీణించింది అలాంటి పరిస్థితిలో భారతదేశంలో జరుగుతున్న టెర్రరిస్టు కార్యకలాపాలతో ఆయనకు

సంబంధమున్నదనే వార్తలు బ్రిటిష్ పత్రికల్లో వెలువడ్డాయి కాగా మిత్రులు వత్తిడి చేసినందున సావర్కార్ లండన్‌నుండి పారిస్‌కు వెళ్ళాడు అక్కడ వందేమాతరం పత్రికను నడుపుతున్న మదాం కామా చూపిన శ్రద్ధవల్ల ఆయన ఆరోగ్యం కుదుటపడింది

తరువాత తనమీద కేసు లేదనే నమ్మకంతో సావర్కార్ లండన్‌కు వెళ్ళేందుకు సిద్ధపడ్డాడు మదాం కామా, లాలా హరదయాళ్‌కూడా ఆయనను నివారించారు అయినా ఆయన వినకుండా 1910 మార్చి 13న విక్టోరియా స్టేషన్‌లో దిగాడు వెంటనే బ్రిటిష్ సైనికులు ఆయనను అరెస్టుచేసి, ఇండియాకు పంపేందుకు ఓడ నెక్కించారు

ఓడ మార్సెయిల్స్ దగ్గరకొచ్చి హార్బర్‌లోకి వెళ్ళకుండా కొంతదూరంలో ఆగింది సావర్కార్ లెట్రిన్‌లోకి వెళ్ళి, ఒక చిన్న కిటికీగుండా దూరి సముద్రంలోకి దూకాడు ఓడపైనున్న సోల్జర్లు ఆయనమీద తుపాకులు కాల్చారు అయినా గుళ్ళు తగలకుండా మునుగుతూ, తేలుతూ, ఈదుతూ సావర్కార్ ఒడ్డుకు చేరుకున్నాడు అక్కడ అడ్డంగా వున్న గోడపైకి ఎలాగో ఎగబ్రాకి వెనుతిరిగి చూచాడు బ్రిటిష్ సైనికులు వెంటబడడం గమనించి పరుగు లంకించుకున్నాడు ఒక ట్రామ్‌లో ఎక్కి పారిపోదామనుకున్నాడు కాని ఆయన చేతిలో చిల్లిగవ్వకూడా లేదు కాబట్టి ఒక ఫ్రెంచి పోలీసువాని వద్దకు పోయి తన స్థితిని వివరించాడు ఈలోగా అక్కడికొచ్చిన బ్రిటిష్ సోల్జర్లు ఫ్రెంచి పోలీసుకు లంచమిచ్చి వీర సావర్కార్‌ను తిరిగి తమ ఓడలోకి తీసుకుపోయారు లంచం పుచ్చుకొని సావర్కార్‌ను అప్పగించిన పోలీసును ఫ్రెంచి ప్రభుత్వం శిక్షించింది కాని ఏమి లాభం? వీరసావర్కార్‌ను జాన్సన్ హత్యకేసులో ఇరికించగలిగింది బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం

అక్రమంగా సావర్కార్‌ను బంధించడంతోపాటు, అభినవ భారత సమితి సభ్యులనే నెపంమోపి 38 మంది యువకులను అరెస్టుచేసి, వారిమీద "నాసిక్ కుట్రకేసు"ను బనాయించారు వారిలో 27గురు వివిధ రకాల శిక్షలకు గురయ్యారు అయినా బ్రిటిష్ ఇండియా ప్రభుత్వపు కక్ష తీరలేదు కాగా మరొక 41 మంది యువకులను బంధించి, వారిమీద గ్వాలియర్ కుట్ర కేసును బనాయించి, శిక్షలు విధించారు సతారా కుట్ర కేసులో మరో ముగ్గురికి శిక్షలు పడ్డాయి. అలా శిక్షింపబడినవారందరూ చిత్పవన బ్రాహ్మణ యువకులే

ఈలోగా కోపెన్‌హాగన్‌లో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టు కాంగ్రెస్ మహాసభలో-సావర్కార్ అరెస్టును ఖండిస్తూ, మదాం కామా తీర్మానాన్ని ప్రవేశపెట్టి ఆమోదింపజేసింది సావర్కార్ అరెస్టుకు వ్యతిరేకంగా ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాలలో ఆందోళన జరిగింది. తమ భూభాగంపై అరెస్టు చేసిన సావర్కార్‌ను తమ కప్పగించవలసిందిగా ఫ్రెంచి ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరింది. అయినా బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించలేదు కాబట్టి ఉభయ ప్రభుత్వాలు కలిసి హేగ్ ట్రిబ్యునల్‌కు వెళ్లాయి హేగ్ ట్రిబ్యునల్ బ్రిటిష్ ప్రభుత్వానికి అనుకూలంగా తీర్పు చెప్పింది.

ఇకనేం? 1911 మార్చి 22న బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం వీర సావర్కార్‌కు యాభైఏళ్ల ప్రవాస శిక్ష విధించింది "అంతవరకూ మీ ప్రభుత్వం వుంటే గదా, నేను యాభై ఏళ్ల శిక్ష అనుభవించడానికి" అని వీర సావర్కార్ గర్జించాడు

(అండమాన్ జైల్లో 13 ఏళ్లు వుంచిన పిమ్మట సావర్కార్ సోదరులను రత్నగిరి జైలుకు తీసుకొచ్చారు మరొక 13 ఏళ్ల తరువాత - రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాలు ఏర్పడినపుడు విడుదల చేశారు)

## ఢిల్లీలో రాజదర్బార్

ఆ సమయంలో ప్రథమ ప్రపంచ యుద్ధ వాతావరణం నెలకొని వుంది యుద్ధం సంభవిస్తే, భారతదేశ సహాయ సహకారాలు అవసరమని భావించిన బ్రిటిష్ ప్రభుత్వం లార్డ్ మింటో స్థానంలో వైస్రాయిగా హార్డింజ్ ప్రభువును నియమించింది వంగ విభజన వల్ల చెలరేగిన ఆందోళనను తొలగించడం అవసరమని గుర్తించింది కాని బెంగాల్లోని హిందూ మేధావుల ఆధిక్యతను తగ్గించడానికి మాత్రమేకాక ఉత్తర ప్రదేశ్‌లోని ముస్లిమ్ నాయకుల మెప్పు పొందడానికికూడా తోడ్పడుతుందనే భావంతో పాలనా కేంద్రాన్ని కలకత్తానుండి ఢిల్లీకి మార్చడానికి నిర్ణయించింది

1911 డిసెంబరు 11న ఢిల్లీలో పంచమ జార్జి చక్రవర్తి, మేరీ రాణిల దర్బారు ఉత్సవాలు చాలా ఆడంబరంగా జరిగాయి వంగ విభజనను రద్దుచేసింది ఆ దర్బారులోనే కాని బెంగాల్ రాష్ట్రంనుండి బీహార్, ఒరిస్సాలను విడదీసి ఒక రాష్ట్రంగాను, అస్సామును వేరుచేసి మరొక రాష్ట్రంగాను ఏర్పాటు చేశారు అయినా హిందూ-ముస్లిమ్ భేదం లేకుండా బెంగాలీ భాష మాట్లాడేవారంతా ఏకం కాగలిగినందుకు బెంగాలీలు సంతోషించారు కాని, కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలను కలకత్తానుండి ఢిల్లీకి మార్చడంవల్ల వారి ప్రాముఖ్యత కొంత తగ్గింది

## ఢిల్లీ కుట్రకేసు

జార్జి చక్రవర్తి దర్బారుగాని, మింటో-మోర్లే సంస్కరణలుగాని అతివాదులను ఆకర్షించలేకపోయాయి పైగా ఏడాది పొడుగునా జరుగుతున్న దర్బారు ఉత్సవాలను చూచి విప్లవ టెర్రరిస్టులు మండిపడ్డారు

దర్బారు ఉత్సవాల ముగింపు సందర్భంగా 1912 డిసెంబరు 22న వైస్రాయ్ హార్డింజ్ ఏనుగుపై నెక్కి ఢిల్లీలో దర్జాగా ఊరేగుతుండగా, అతనిమీద రసవిహారీ బోస్ బాంబు విసిరాడు అందువల్ల వైస్రాయి గాయపడగా, ఆయన అంగరక్షకుడు చనిపోయాడు ఊరేగింపు చెదిరింది అంతా గందరగోళమైంది ఆ సమయంలో పారిపోతున్న ప్రజలతో కలిసి రసవిహారీ బోస్ తప్పించుపోయాడు

ఢిల్లీ బాంబు సంఘటనతో సంబంధం కలదనే నేరం మోపి, ప్రభుత్వం 13 మందిని అరెస్టుచేసి, ఢిల్లీ కుట్రకేసును బనాయించింది అమీర్‌చంద్, అవధ విహారీ, వసంత్‌కుమార్, బాల ముకుందులను ఉరితీశారు లాలా హనుమంత సహాయ్ బలరాజులకు ఏడేళ్ళ శిక్ష విధించారు అప్రూవరుగా మారిన సుల్తాన్‌చంద్‌తోపాటు మరొక ఆరుగురిని విడిచిపెట్టారు

అమీర్‌చంద్ అన్న కొడుకు సుల్తాన్‌చంద్ కాబట్టి సుల్తాన్ చందును కన్న కొడుకుకంటే మిన్నగా చూసుకొంటూ అమీర్‌చంద్ పెంచేవాడు అయితేనేం? పెంచిన ప్రేమ ఫలితం ఉరికంబమెక్కించింది

సుల్తాన్‌చందును కుట్రకేసులో ఇరికించినప్పటికీ అతనిమీద సాక్ష్యంలేదు కాబట్టి అతని నెలాగూ విడిచిపెట్టేవారే. కాని సుల్తాన్‌చంద్ ద్రోహిగా మారాడు ఆ విషయం తెలియగానే అమీర్‌చంద్ "హా! హతవిధీ!" అంటూ ఒక నిట్టూర్పు విడిచాడు అంతకంటే ఆ సమయంలో ఆయన ఏం చేయగలడు?

సుల్తాన్‌చంద్‌వంటి ద్రోహి పుట్టిన చోటనే, ఒక మహాపతివ్రత పుట్టింది ఆ

పతివ్రత బాల ముకుందుని భార్య ఆమెకు బాల్యమందే వివాహమైంది ప్రభుత్వం బాల ముకుందుని బంధించేటప్పటికింకా ఆమె యౌవనవతి కాలేదు భర్తతో సంసారం చేయలేదు అయినా తనభర్త జైలుజీవితాన్ని తలచుకుంటూ, కటిక నేలమీద శయనిస్తూ, గంజి తాగుతూ ఆ మహాపతివ్రత కాలం గడిపింది బాల ముకుందుని ఉరిదీశారన్న వార్త చెవిన పడగానే గుండె ఆగి మరణించి కీర్తిశేషురాలైంది

అవధ విహారీని ఉరిదీసే సమయంలో జైలు అధికారి "నీ తుది కోరిక ఏమిటి?" అని ప్రశ్నించినపుడు "ఆంగ్ల రాజ్యమంతరించడం" అని అవధవిహారి జవాబిచ్చాడు అప్పుడు ఆంగ్లేయుడు "మాటలతో ప్రయోజనమేమిటి? ఈ సమయంలోనైనా, కాస్త ప్రశాంతంగా వుండటం మంచిది" అని హెచ్చరించాడట వెంటనే అవధ విహారీ ఉగ్రుడై "శాంతమా! అదెవరికిక్కావాలి? భయంకర విప్లవాగ్ని ప్రజ్వరిల్లి నీవు, నేను మీ బ్రిటిష్ ప్రభుత్వం, మా బానిసత్వము భస్మీపటలం కావాలి మా భారతదేశం మేలిమివలె ప్రకాశించాలి అని కోరుకుంటున్న నాబోటి వానికి శాంతమా?" అని పళ్లు కొరుకుతూ ఉరికంబమెక్కాడు

వంగ విభజన రద్దు చేయబడినప్పటికీ బెంగాల్లో విప్లవ టెర్రరిజం తగ్గలేదు ఢాకా కేంద్రంగా గల అనుశీలన సమితి, నిర్మాణ రీత్యా బాగా బలపడడమేగాక రాష్ట్ర మంతటా తన శాఖలను విస్తరించుకోగలిగింది రాష్ట్రం వెలుపలకూడా టెర్రరిస్టు కేంద్రాలను స్థాపించడం, దోపిడీలు చేయడం, బ్రిటిష్ అధికారులను, ద్రోహులను హతమార్చడం ధ్యేయంగా పెట్టుకొని పనిచేయసాగింది

జితేంద్రనాథ్ ముఖర్జీ నాయకత్వానగల యుగాంతర్ పార్టీ కొన్ని టెర్రరిస్టు మురాలను కలుపుకొని బలపడుతూ, విదేశాలలో గల విప్లవకారులతో సంబంధాలు పెంచుకుంటూ సాయుధ తిరుగుబాటుకు సన్నాహం చేయసాగింది రసవిహారీ బోస్, సచీంద్రనాధ్ సన్యాల్ కలిసి నిర్మించిన రహస్య సంఘం ఢిల్లీ, పంజాబ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో కొన్ని రహస్య కేంద్రాలను స్థాపించగలిగింది వీటికితోడు మహారాష్ట్రలోను, మరికొన్ని ప్రాంతాలలోను రహస్య విప్లవ సంఘాలు పునర్నిర్మాణమయ్యాయి కాగా విప్లవ టెర్రరిస్టులకు అవసరమైన ఆయుధాలు సమకూర్చేందుకు కొందరు నాయకులు ఫ్రాన్స్, జర్మనీ మొదలగు దేశాలకు వెళ్ళారు

కర్జన్ వైలీ హత్య, సావర్కార్ నిర్బంధం తరువాత లండన్‌లో వుండటం మంచిపనికాదని గ్రహించిన మదాం కామా, శ్యాంజీ కృష్ణవర్మవంటివారుకూడా ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో నివసించేవారు మదాం కామా పారిస్‌లో వుంటూ వందేమాతరం పత్రికను నడుపుతూ, జీన్ లాంగ్వెట్ మొదలగు ఫ్రెంచి సోషలిస్టుల సహాయాన్ని పొందగలిగింది వీరేంద్రనాధ్ చటోపాధ్యాయ బెర్లిన్‌నుండి 'తల్వార్' పత్రికను ప్రచురించేవాడు. తారక్‌నాథ్ దాస్ శాన్‌ఫ్రాన్సిస్కోనుండి "ఫ్రీ హిందుస్థాన్" పత్రికను ప్రచురించేవాడు బ్రిటిష్ మార్క్సిస్టు సోషల్ డెమోక్రటిక్ ఫెడరేషన్ నాయకుడైన హిన్డ్మన్ ఇంగ్లండులోని భారతీయ విద్యార్థులకు రాజకీయాలు బోధించేవాడు కృష్ణవర్మ, ఎన్ ఆర్ రాణా, వి.వి ఎన్ అయ్యర్ పశ్చిమ యూరప్ దేశాలలో సంచరిస్తూ సోషలిస్టు ఇంటర్నేషనల్ నాయకులతో సంబంధాలు పెంచుకున్నారు

## గదర్ పార్టీ

అమెరికా, కెనడాలకు వలసపోయిన భారతీయులలో "ఫ్రీ హిందుస్థాన్" పత్రిక, వాంకోవర్‌లో గురుదత్త కుమార్ ప్రారంభించిన "స్వదేశీ సేవక్" పత్రిక కొంత సంచలనాన్ని

కలిగించాయి ఆ స్థితిలో లాలా హరదయాళ్ అమెరికా వెళ్ళాడు తారకనాధ దాస్ వేసిన పునాదిని బాగా విస్తృతం చేశాడు అమెరికన్లతోపాటు పనిచేస్తున్న భారతీయులకు సమాన హక్కులు సాధించేందుకు భాయీ పరమానంద్‌తో కలిసి "ఐక్య భారత సమితి" అనే సంఘాన్ని స్థాపించాడు కెనడాలోనున్న భారతీయుల హక్కుల కొరకు కూడా ఈ సంఘం కృషి చేసింది అటు తరువాత ఐక్యభారత సమితి స్థానంలో 'గదర్' (తిరుగుబాటు) పార్టీ స్థాపించబడింది దీని అధ్యక్షుడు బాబా సోహన్‌సింగ్ భాక్నా, తరువాత ఈ పార్టీ వారొక పత్రికా ప్రకటన చేశారు ఆ ప్రకటనలో యిలా వుంది

"భారతదేశంలో గదర్ (తిరుగుబాటు) చేయడానికి సాహసంగల సైనికులు కావాలి జీతం-మృత్యువు, విలువ-ఆత్మబలిదానం, పెన్షన్-స్వాతంత్ర్యం, యుద్ధరంగం - భారతదేశం "

1913 నవంబర్ 1వ తేదీన గదర్ పత్రికను కూడా ప్రారంభించారు దాని మొదటి సంచికలో యిలా ప్రకటించారు ఆ ప్రకటన ప్రశ్నోత్తరాల రూపంలో యిలా వుంది

"మన పార్టీ పేరేమిటి? గదర్ (తిరుగుబాటు) మన కృషి దేనికొరకు? తిరుగుబాటు జరిపేందుకు తిరుగుబాటు ఎక్కడ ప్రారంభమవుతుంది? ఇండియాలో ఎప్పుడు ప్రారంభమవుతుంది? రెండు మూడేళ్ళలోనే "

అప్పటికే కెనడాలో ఆరువేలమందికిపైగా భారతీయులున్నారు అమెరికాలో శాన్‌ఫ్రాన్సిస్కోవద్ద పదిహేనువేలమంది భారతీయులున్నారు వీరిలో అత్యధికులు శిక్కులు బ్రిటిష్ కొలంబియా, హొండూరాస్ మొదలగుచోట్లకూడా భారతీయులుండేవారు వర్ణ వివక్షతతోపాటు వీరనేక కష్ట నష్టాలకు గురికావలసి వచ్చేది కనుక భారతదేశం సర్వస్వతంత్రమయితే తప్ప, తమ కష్టాలు తొలగవని వారు భావించారు కనుక అమెరికా, కెనడాలలోని వేర్వేరు ప్రాంతాలతోపాటు జపాన్, ఫిలిప్పైన్స్, ఇండోనేషియా, వెస్టిండీస్, మలయా, చైనాలలోకూడా గదర్ పార్టీ శాఖలేర్పడ్డాయి వివిధ భాషలలో వెలువడుతున్న గదర్ పత్రికను, కరపత్రాలను ఆయా దేశాలలోని పార్టీ శాఖలతోపాటు, ఇండియాకుకూడా పంపేవారు

అందువల్ల భాయీ భగవాన్‌సింగ్ అనే శిక్కు మత గురువును కెనడా ప్రభుత్వం అరెస్టుచేసి, 'మారుపేరుతో కెనడాలో ప్రవేశించాడు' అనే నేరం మోపింది కాళ్ళు, చేతులూ కట్టివేసి, నోట్లో గుడ్డలు కుక్కి ఒక జపాన్ నౌకలో బంధించి తీసుకుపోయి జపాన్‌లో విడిచిపెట్టింది

భాయీ భగవాన్‌సింగ్ గొప్పకవి. కాబట్టి 'గదర్ దీ గూంజ్' (విప్లవ ప్రతిధ్వని) అనే గేయాలు రచించాడు మత సామరస్యాన్ని బోధించి, స్వాతంత్ర్య పిపాసను రేకెత్తించాడు. ఆ గేయాలలో ఒకటి

'పండితులూ ముల్లాలూ మనకొద్దు
ప్రార్థనలూ సంకీర్తనలూ వద్దు
నడి సముద్రంలో అవి నావను ముంచేస్తాయ్
అధోగతికి దారులు తెరిచేస్తాయ్
హిందూ, ముస్లిం, సిక్కుల భేదం దేనికి?
భారతమాత బిడ్డలలో కలహం దేనికి?

కులమతాల మూలంగా విభేదాలు పొడసూపాయ్
పర ప్రభుత్వ పాలనకవి రాచబాట వేసేశాయ్
హిందువులంతా గోవును పూజిస్తుంటే
శిక్కులు ప్రాణప్రదంగా భావిస్తోంటే
ముస్లిములంతా పందిని ద్వేషిస్తోంటే
ఆ రెంటిని ఆంగ్లేయుడు తింటున్నాడు గదా?
ఎన్నాళ్లీ గతి మిన్నకుండడం
పరుల పాలనలో బ్రతుకుతుండడం
తిరగబడండోయ్ ధీరులు వీరులు
కత్తులు బాంబులు కరార్లు బట్టుకు'

అని పిలిచింది

## 'కామగాటమారు' నౌక ఉదంతం

గదర్ పార్టీ కార్యక్రమాలను గురించి అమెరికా ప్రభుత్వం పెద్దగా పట్టించుకోలేదు కాని కెనడా ప్రభుత్వం, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం ఆందోళన చెందాయి ఎలాగైనా కెనడాలోనున్న భారతీయులను బయటకు పంపాలని తీవ్రంగా ప్రయత్నించాయి బ్రిటిష్ కొలంబియాలోనున్న భారతీయులను హొండూరాస్‌కు తీసుకుపోయేందుకు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైన పిమ్మట గవర్నర్ జనరల్ స్పేర్ యిలా అన్నాడు

'శిక్కులు బ్రిటిష్ కొలంబియాను విడిచిపెట్టడానికి ఇష్టపడడంలేదు బలవంతంగా వారిని ఇండియాకు పంపితే, ఇండియాలోని యాభైవేలమంది శిక్కు సైనికులు అదుపు తప్పిపోతారు తిరిగి వారిని అదుపులో పెట్టడానికి రెండు లక్షల బ్రిటిష్ సైనికులను పంపవలసి వస్తుంది '

కనుక కెనడాలోవున్న భారతీయులమీద నిర్బంధాలు విధించడంతోపాటు వలస చట్టాన్నికూడా కెనడా ప్రభుత్వం కఠినతరం చేసింది ఆ విషయం తెలియక కెనడాకు వలస పోదలచిన అనేకమంది శిక్కులు, కొందరు ముస్లిములు మార్గమధ్యంలోని హాంకాంగ్‌లో చిక్కుపడిపోయారు నౌకా కంపెనీలవాళ్లెవరూ వారికి టిక్కెట్లు ఇవ్వలేదు కాబట్టి, అప్పటికే కెనడాలో వుంటున్న సర్దార్ గురుదత్‌సింగ్ అనే ధనవంతుడు 'కామగాటమారు' అనే నౌకను జపాన్‌వారినుండి అద్దెకు తీసుకొని, హాంకాంగ్‌లో చిక్కుపడిపోయినవారినందరినీ అందులో ఎక్కించి 1914 మే 22వ తేదీ రాత్రి సమయంలో కెనడాలోని వాంకోవర్‌కు చేర్చాడు కాని, రేవులోకి ఓడను రానివ్వకుండా కెనడా ప్రభుత్వం కట్టుదిట్టం చేసింది కెనడాలోని భారతీయులు ప్రభుత్వానికెన్ని వినతిపత్రాలు సమర్పించినా లాభం లేకపోయింది నౌకలో వున్నవాళ్లకు ఆహారం, మంచినీళ్ళుకూడా కరువయ్యాయి కెనడా ప్రభుత్వానికి టెలిగ్రాములు పంపినా ఫలితం శూన్యమైంది

జూలై 19వ తేదీన 'సీ లయన్' (సముద్ర సింహం) అనే నౌకమీద వచ్చిన కెనడా పోలీసులను, కామగాటమారు నౌకలోని భారతీయులు ఎదిరించారు తుపాకి కాల్పులకు గురి కాకుండా తప్పించుకుంటూ, ఇనుప కడ్డీలు పుచ్చుకుని తిరగబడ్డారు 'చావడానికైనా చంపడానికైనా సిద్ధంగా వున్నా'మని నినాదాలిచ్చారు కాగా భారతీయులను 'రెయిన్‌బో' యుద్ధ నౌకలో నిర్బంధించడానికి కెనడా ప్రభుత్వం చేసిన ప్రయత్నం విఫలమైంది.

కాబట్టి కామగాటమారు నౌకలోని వారికి ఆహారపదార్థాలు అందజేసింది చివరకు జూలై 23న కామగాటమారు నౌక తిరుగుప్రయాణం ప్రారంభించింది గదర్ పార్టీ అధ్యక్షుడైన సోహాన్‌సింగ్ భాక్నా రహస్యంగా వంద పిస్తోళ్లను, మరికొంత ఆయుధ సామాగ్రిని నౌకలోకి చేర్చగలిగాడు నౌక యోకహోమాకు చేరగానే, హాంగ్‌కాంగ్ రేవుకుగాని, సింగపూర్ రేవుకుగాని వెళ్లడానికి అనుమతి లభించదని సర్దార్ గురుదత్‌సింగ్‌కు తెలిసిపోయింది కాబట్టి నౌకను 'కోబే' రేవుకు చేర్చాడు అక్కడ వారికి ఘనస్వాగతం లభించింది

సెప్టెంబరు 16న నౌక కలకత్తా రేవులో ప్రవేశించింది తమవద్దవున్న ఆయుధాలను సముద్రంలో పారేయవలసిందిగా సర్దార్ గురుదత్‌సింగ్ సలహా యిచ్చాడు కొందరు పారేశారు మరికొందరు తమ ఆయుధాలకు గ్లిసరిన్ పేపర్స్ చుట్టి నీళ్లటాంకుల్లో దాచిపెట్టారు రెండు రోజులపాటు సోదాలు జరిగిన తరువాత బడ్జ్‌బడ్జ్‌లో దిగారు ఆ సాయంత్రం వారంతా ప్రార్థన చేస్తున్న సమయంలో ఒక బ్రిటిష్ ఆఫీసర్ గురుదత్‌సింగ్‌ను అవమానించాడు వెంటనే ఒక పిస్తోలు ప్రేలింది బ్రిటిష్ ఆఫీసర్ నేలకొరిగాడు కాగా ప్రభుత్వ సైనికులు 177 రౌండ్లు కాల్చారు 22 మంది వీరులు మరణించారు 31 మంది బంధింపబడ్డారు తక్కినవారు తప్పించుకుపోయారు

## గదర్ వీరుల త్యాగాలు

'అనార్కిజం' నేరంమోపి, కాలిఫోర్నియా రాష్ట్ర ప్రభుత్వం అమలు జరిపిన నిర్బంధంనుండి స్విట్జర్లాండ్‌కు తప్పించుకుపోయిన లాలా హారదయాళ్ 'నూతన ఆదర్శాలు, నూతన శకం' అనే కరపత్రాన్ని ప్రచురించాడు గోపాలకృష్ణ గోఖలే, ఫిరోజిషా మెహతాలాంటి కాంగ్రెసు నాయకులు, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వ పాలనలో భాగస్వాములయ్యారని, పదవుల కొరకు, బిరుదుల కొరకు, కాంగ్రెసు నాయకులు తాపత్రయ పడుతున్నారని విమర్శించాడు అసమానతలపై నిర్మింపబడిన సామాజిక వ్యవస్థను మార్చనంతవరకూ లాభం లేదని భారతీయులను హెచ్చరిస్తూ గదర్ పార్టీ కరపత్రంలో ఇలా వ్రాశాడు·

'ఆర్యులు–దస్యులు, ద్విజులు–శూద్రులు, రాజు–ప్రజలు, భూస్వామి–కౌలుదార్లు అనే హెచ్చు తగ్గులకు, తరతరాలుగా హైందవులు అలవాటు పడిపోయారు. ఈ హెచ్చు తగ్గులు హిందూ సాహిత్యంలో సుపరిచితమయ్యాయి. వంశపారంపర్య సూత్రం, సామాజిక గతిని నిర్దేశించినంతకాలం ఆధునిక నాగరికతను హర్షించలేము ఇస్లామ్, సిక్కు మతస్థులలో కూడా ఈ హెచ్చు తగ్గులున్నాయి మతం ఒకటైనంత మాత్రాన, యజమానికీ–సేవకులకూ మధ్య సమానత్వం వుండదు ఆర్థిక స్వాతంత్ర్యం లేనిచో, సమానత్వం ఒక కలగానే మిగిలిపోతుంది '

అంతకుముందే కారల్‌మార్క్సును గురించి హారదయాళ్ వ్రాసిన వ్యాసం కలకత్తాలోని 'మోడరన్ రివ్యూ' పత్రికలో ప్రచురించబడింది తరువాత మార్క్సు జీవిత చరిత్రను రామకృష్ణ పిళ్లై మలయాళ భాషలో వ్రాసి ప్రచురించాడు.

గదర్ పత్రిక భారతీయ సైనికులను ఇలా హెచ్చరించింది· "మీరెందుకు బ్రిటిష్ వాళ్ళకోసం పోరాడుతున్నారు? దేనికి మీ ప్రాణాలను సహితం బలిపెడుతున్నారు? యుద్ధ భూమిలోని కందకాలలో వుండి మీరు పోరాడాలని బ్రిటిష్ సేనానులు శాసించడమా? వారూ, వారి తెల్లసోల్జర్లూ వెనుక భాగంలోని రక్షణస్థావరాలలో వుండడమా? మీకు

తక్కువ జీతభత్యాలా? వారికెక్కువ జీతభత్యాలా? హక్కుల విషయంలో కూడా ఇంతేగదా? ఆలోచించండి" అనే ధోరణిలో గదర్ పత్రిక వ్యాసాలు వెలువడ్డాయి

యుద్ధం ప్రారంభమైన పిమ్మట, ఇండియాలోని బ్రిటిష్ సోల్జర్ల సంఖ్య పదిహేను వేలకు తగ్గింది గనుక, తిరుగుబాటు సఫలమవుతుందని గదర్ వీరులు భావించారు "కామగాటమారూ" నౌక ఉదంతం వారి కోపాగ్నిని ప్రజ్వలింపజేసింది కాగా అమెరికా, కెనడాలనుండి, మరికొన్ని ఇతర ప్రాంతాలనుండి ఎనిమిదివేల మంది పంజాబీలు, కొద్దిమంది బెంగాలీలు బర్మా, సయాం, సింగపూరుల మీదుగా ఇండియాకు ప్రయాణమయ్యారు

1915 ఫిబ్రవరి 21వ తేదీన రావల్పిండి, లాహోర్, ఫిరోజ్‌పూర్లలో సైనిక తిరుగుబాటు జరపడానికి సన్నాహాలు పూర్తి అయ్యాయి అంతకుముందే గదర్‌వీరులు పంజాబ్‌లో ప్రవేశించాలనుకున్నారు కాని, ఆ పథకం యావత్తూ బ్రిటిష్ ఇండియా ప్రభుత్వానికి తెలిసిపోయింది కాగా శచీంద్ర సన్యాల్‌ను అరెస్టుచేసి ఆజన్మ ద్వీపాంతరవాస శిక్ష విధించారు రసవిహారీ బోస్ తప్పించుకుని జపాన్‌కు వెళ్లిపోయాడు తిరుగుబాటు జరగకుండా ఆపగలిగింది ప్రభుత్వం

అయినా గదర్‌వీరులు తమ ప్రయత్నాలను మానలేదు భారత సిపాయిలకు, రైతులకు విప్లవభావాలను కలిగిస్తూ వీలైన ప్రతిచోటా తిరుగుబాటుకు పూనుకున్నారు 1915 ఫిబ్రవరి 15వ తేదీన సింగపూర్‌లో పంజాబీ ముస్లిముల 5వ లైట్ ఇన్‌ఫాన్‌ట్రీ దళం, 36వ సిక్కు బెటాలియన్ కలసి తిరుగుబాటు చేశాయి ఆ తిరుగుబాటుకు జమేదార్ క్రిస్టీఖాన్, జమేదార్ అబ్దుల్‌ఘనీ, సుబేదార్ దావూద్‌ఖాన్ నాయకత్వం వహించారు బ్రిటిష్ ప్రభుత్వం ఆ తిరుగుబాటును అణచివేసి 37 మందిని తుపాకులతో కాల్చి చంపింది 41 మందికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షలు విధించింది

అటుపైన అమెరికా మున్నగు దేశాలనుండి వస్తున్న గదర్ వీరులలో చాలామందిని ప్రభుత్వం కలకత్తా మొదలగుచోట్ల అరెస్టు చేయగలిగింది వారిలో నాలుగువందల మందిని జైళ్లలో బంధించి, రెండువేల మందిని గృహ నిర్బంధంలో వుంచింది ఈ సంఖ్య మరొక ఏడాదిలో ఇంకా పెరిగింది ఐదువేలమంది వరకూ గదర్ వీరులు స్వేచ్ఛగా దేశంలో ప్రవేశించగలిగారు బెంగాల్‌నుండి పంజాబ్‌వరకూగల విప్లవ టెర్రరిస్టులతో వీరికి సంబంధాలేర్పడ్డాయి

పంజాబ్ సిపాయిలను తిరుగుబాటుకు ప్రోత్సహించారనే నెపంతో కర్తార్‌సింగ్ శరభా అనే 19 ఏళ్ళ యువకునితోపాటు, అబ్దుల్లా అనే ముస్లిమ్ సిపాయినికూడా ప్రభుత్వం అంబాలాలో ఉరి తీసింది.

"నేను తిరిగి పుట్టవలసి వస్తే, ఇక్కడనే పుట్టి నా దేశమాత దాస్య విమోచనంకొరకు మళ్ళీ ప్రాణత్యాగం చేసి తీరుతాను" అంటూ కర్తార్‌సింగ్ శరభా ఉరికంబమెక్కాడు

"హిందువులతో చేతులు కలపవద్దని నన్ను హెచ్చరించిన వారికొక విషయం చెప్పదలిచాను హిందువులతో చేతులు కలిపినందువల్లనే నాకు స్వర్గద్వారములు తెరువబడినాయి" అంటూ అబ్దుల్లా అసువులు వీడాడు

## లాహోర్ కుట్రకేసులు

జర్మనీనుండి ఆయుధ సహాయం, జర్మన్ సేనానులనుండి సైనిక శిక్షణ

పొందేందుకు గదర్‌వీరులు ప్రయత్నిస్తున్నారనే విషయం గూఢచారులద్వారా బ్రిటిష్ ప్రభుత్వానికి తెలిసిపోయింది విప్లవకారులు భారత సిపాయీలతో సంబంధాలు పెట్టుకొని, తిరుగుబాటుకు పురికొల్పుతున్నారనే సంగతినికూడా ప్రభుత్వం పసికట్టగలిగింది కాగా 1915 మార్చిలో "భారత రక్షణ చట్టాన్ని" అమలుజరిపింది విదేశాలలోనున్న భారతీయుల నుండిగాని, జర్మనీనుండిగాని విప్లవకారులకు ఆయుధాలు, ధనం అందకుండా కట్టుదిట్టం చేసింది

విప్లవ పార్టీకి వుండవలసిన నిర్మాణ బలం గదర్ పార్టీకి లేదు కనుక ప్రభుత్వ గూఢచారులు పార్టీలో జొరబడగలిగారు పంజాబ్ ప్రాంతంలోనున్న గదర్ వీరులను, బెంగాల్ ప్రాంతంలోని విప్లవ టెర్రరిస్టులను కలిపి కుట్ర కేసులు పెట్టారు అవే లాహోర్ కుట్ర కేసులు వాటికి అనుబంధంగా మరికొన్ని కుట్ర కేసులు కూడా బనాయించబడినాయి దాదాపుగా మూడువందలమంది దేశభక్తులను కుట్ర కేసుల్లో ఇరికించారు వారిలో 42 మందికి మరణశిక్ష, 114 మందికి యావజ్జీవ, దేశాంతరవాస శిక్ష, తక్కినవారికి వివిధ రకాల శిక్షలు విధించారు 23వ అశ్విక దళానికి చెందిన సైనికులను లాహోర్ ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి బదిలీ చేశారు ఆ సైనికుల సామగ్రిని రైలులో వేసేటప్పుడు సామాన్లలో దాచిపెట్టబడిన బాంబులు పేలాయి కాగా 18 మంది సైనికులను కోర్టు మార్షల్‌చేసి 12 మందిని ఉరిదీశారు. తక్కినవారిని అండమాన్ దీవులకు పంపారు

భాయీ పరమానంద్, జగత్‌సింగ్, కర్తార్‌సింగ్, హర్నామ్‌సింగ్, పింగళే మొదలగు వారంతా కలసి, బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కుట్రపన్నారనే నేరం మోపి, వారిలో 24 మందికి మరణశిక్ష విధించారు కొందరికి యావజ్జీవ శిక్ష వేశారు కోర్టు తీర్పు 1915 సెప్టెంబర్ 13న వెలువడింది వెంటనే దేశ, విదేశాలలోని న్యాయశాస్త్ర నిపుణులు ఆ తీర్పును ఖండించారు. కాగా భాయిపరమానంద్‌కు, మరొక 16గురికి విధించిన ఉరిశిక్షలను యావజ్జీవ దేశాంతరవాస శిక్షలుగా వైస్రాయి మార్చాడు 1915 నవంబర్ 16న పింగళేను ఉరితీశారు

కోర్టులో విచారణ జరుగుతున్న సమయంలో పింగళే, కర్తార్‌సింగులు తామే కుట్రలకు బాధ్యులమని, ఇతరులకు ప్రమేయంలేదని వాఙ్మూలమిచ్చారు. గదర్ ఉద్యమాన్ని గురించి కర్తార్‌సింగ్ ఉత్తేజపూర్వకంగా వర్ణించాడు ఆ సమయంలో నివ్వెరపోయిన జడ్జి నోట్సు తీసుకోవడంకూడా మరచిపోయి "పర్యవసానాన్ని గురించి ఆలోచించి మరీ వాఙ్మూలమివ్వు" అని కర్తార్‌సింగును హెచ్చరించాడు అందుకు కర్తార్‌సింగ్ యిచ్చిన జవాబు చరిత్ర పుటలో నిలిచిపోయింది·

"ఏమిటా పర్యవసానం? మీరు నాకు మరణశిక్ష వేస్తారు అంతేగదా? నేనందుకు భయపడడం లేదు నా మాతృదేశ విముక్తికొరకు పోరాడుతున్న నేను భయపడడమా? ఒక వ్యక్తికిగాని, జాతికిగాని, మతానికిగాని వ్యతిరేకంగా, ద్వేషపూరితంగా నేనేమీ చేయలేదు స్వప్రయోజనాన్ని కాంక్షించికూడా చేయలేదు నేనేమి చేసినా స్వాతంత్ర్యం కొరకే చేశాను అదే నా ఏకైక స్వప్నం" అంటూ కర్తార్‌సింగ్ గర్జించాడు

కోర్టు తీర్పులు విన్న తరువాత అందరూ కలసి దేశభక్తి గేయాలు పాడారు భాయి పరమానంద్ హాయిగా నిద్రపోయి, మరునాడు 8 గంటలకు లేచాడు కాగా, వారి నిష్కళంక దేశభక్తికి యువకులు ఉర్రూతలూగారు పెద్దలు తమ మన్ననల నందజేశారు. బ్రిటిష్ జడ్జీలు సహితం ముగ్ధులయ్యారు

## ఆయుధ సేకరణ పథకాల విఫలం

కలకత్తాలోని రోడ్డా కంపెనీకి అందజేయబడుతున్న 50 పిస్తోళ్లను, 46 వేల తూటాలను 1914 ఆగస్టు నెలలో విప్లవ టెర్రరిస్టులు స్వాధీనం చేసుకోగలిగారు తిరిగి అదే కంపెనీకి 1915లో మసూర్ పిస్టల్సు సరఫరా చేయబడుతున్నాయని తెలుసుకొని వాటిని స్వాధీనం చేసుకునేందుకు జతీన్ ముఖర్జీ నాయకత్వాన ఐదుగురొక దళంగా ఏర్పడి బాలసోర్‌కు బయలుదేరారు కాని చురిబాలం, బాలసోరులవద్ద మాటువేసిన పోలీసు దళాలతో జరిగిన పోరాటంలో మరణించారు ఆ పోరాటంలో జతీన్ ముఖర్జీ చూపిన ధైర్య సాహసాలకు "టైగర్ జతీన్" అని పేరు పొందాడు

చికాగో, శాన్‌ఫ్రాన్సిస్కోలోని గదర్‌పార్టీ రూపొందించిన "సయాం-బర్మా పథకం"కూడా విఫలమైంది అమెరికానుండి, మెక్సికోనుండి ఆయుధాలను సయాం (థాయ్‌లాండ్)లోని చంద్రాయ్ అడవుల్లోకి చేర్చాలని, అక్కడ రైలుమార్గాలు నిర్మిస్తున్న జర్మనులవద్ద భారతీయ విప్లవకారులు సాయుధ శిక్షణ పొంది, ముందుగా బర్మాను విముక్తి చేయాలని, తరువాత భారతదేశంలో ప్రవేశించాలని పథకం వేశారు ఆ పథకం ప్రకారం అనేకమంది విప్లవ టెర్రరిస్టులు, గదర్‌వీరులు సయాంలో ప్రవేశించారు కాని ఆయుధాలను చేరవేస్తున్న ఓడను మనిలావద్ద అమెరికన్ ఇమిగ్రేషన్ అధికారులు పట్టుకొని ఆపివేశారు అంతటితో ఆ పథకం చెడిపోయింది

బెర్లిన్‌లో వీరేంద్రనాథ చటోపాధ్యాయ, హరదయాళ్ మున్నగు నాయకులతో ఏర్పడిన "భారత స్వాతంత్ర్య కమిటీ" వారు జర్మన్ విదేశాంగ శాఖ అధికారులతో సంబంధాలు పెట్టుకొని "బిమ్మర్ మన్" ప్లానును రూపొందించారు ఇండో-జర్మన్-టర్కిష్ మిషన్‌వారు ఇండియా-ఇరాన్ సరిహద్దులలోగల గిరిజన తెగలతో తిరుగుబాటు చేయించేందుకు ప్రయత్నించారు ఆ ప్రయత్నమూ విఫలమైంది 1915 డిసెంబరులో రాణా మహేంద్రప్రతాప్, బర్కతుల్లా ఖాన్, ఒబేదుల్లా కలిసి కాబూల్లో స్వతంత్ర భారత్ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ఆ ప్రభుత్వాన్ని ఆఫ్ఘన్ యువరాజు అమానుల్లా బలపరిచాడు అయినా టర్కీనుండి, రష్యానుండి ఆశించిన సహాయం వారికి అందలేదు

జర్మన్ రాయబారులద్వారా అందిన డబ్బును, ఆయుధాలను జపాన్‌నుండి ఇండియాకు పంపేందుకు రసవిహారీ బోస్, అవనిముఖర్జీలు చేసిన ప్రయత్నాలన్నీకూడా విఫలమయ్యాయి

## గదర్‌వీరుడు దర్శి చెంచయ్య

నెల్లూరుజిల్లా కావలిలో జన్మించిన దర్శి చెంచయ్య ఉన్నత విద్యకొరకు అమెరికా వెళ్ళి, 1912 డిసెంబరులో కాలిఫోర్నియా యూనివర్సిటీలో చేరాడు లాలా హరదయాళ్ ఉపన్యాసాలు ఆయనను ఆకర్షించాయి కాగా జితేంద్రనాథ్ లహరీ సాంగత్యంతో గదర్‌పార్టీ నిర్మాణానికి పూనుకున్నాడు ఆయనతోపాటు భాగవతుల సోమయాజిశర్మ (గుంటూరు), పి జె వెంకయ్య (హైదరాబాద్) కూడా గదర్‌పార్టీ సమావేశాలలో పాల్గొనేవారు కాని విప్లవ కార్యక్రమాలలో పాల్గొనలేక విరమించుకున్నారు

చెంచయ్య పట్టభద్రుడైనాక బర్మాలో విప్లవం లేవదీసేందుకు నియమింపబడ్డాడు కాబట్టి జోధ్‌సింగ్, ఛటర్జీలతో కలసి జపాన్‌కు చేరుకున్నాడు తరువాత చైనా జాతీయ

నాయకుడైన సన్-యట్-సేన్‌ను కలుసుకున్నాడు "భారతదేశంలో బ్రిటిష్‌వాళ్ళ అధికారాన్ని అంతం చేసేంతవరకూ బలహీన దేశాలకు ఆశారేఖ కనుపించదు" అని సన్‌యట్ సేన్ యిచ్చిన సందేశాన్ని అందుకున్నాడు అటు పిమ్మట బాంకాక్ చేరుకున్నాడు అక్కడనున్న విప్లవకారులతో కలసి బర్మాలో ప్రవేశించేందుకు సిద్ధమయ్యాడు కాని, సయాం ప్రభుత్వం అందజేసిన సమాచారం ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారులు వలపన్ని జోధ్‌సింగును అరెస్టుచేశారు పిరికివాడైన జోధ్‌సింగ్ చెప్పినవారినందరినీ అరెస్టు చేశారు

ఆ విషయం తెలియగానే చెంచయ్య తప్పించుకుపోయేందుకు ఎంతగానో ప్రయత్నించాడు కాని దొరికిపోయాడు కొన్నాళ్ల తరువాత సింగపూర్‌కు తీసుకువెళ్ళి కోటలో బంధించి చిత్రహింసలకు గురిజేశారు రహస్యాలు చెప్పకపోతే కాల్చి చంపుతామని కళ్లకు గంతలుకట్టి ఒక గుంజకు బంధించారు చావడానికి సిద్ధం అన్నాడు చెంచయ్య ఇక లాభం లేదనుకున్న బ్రిటిష్ అధికారులు, ఆరునెలల తరువాత ఆయనను ఆలీపూర్ జైలుకు మార్చి కేసు పెట్టారు నేరమంతా తనమీదనే వేసుకొని బల్వంత్‌సింగ్ ఉరికంబమెక్కడంవల్ల చెంచయ్యమీద నేరం రుజువుకాలేదు అయినా ఆయనను డిటెన్యూగా బంధించి, వివిధ జైళ్ళలో వుంచి, యుద్ధం ముగిసిన పిమ్మట 1919లో విడుదల చేశారు

## గిరిజన పోరాటాలు

ఒకవైపున గదర్‌వీరుల తిరుగుబాటులు, విప్లవ టెర్రరిస్టుల కార్యకలాపాలు విఫలమవుతున్న సమయంలో దేశంలోని పలు ప్రాంతాలలోగల గిరిజనులు తమ హక్కుల కొరకు పోరాడారు

1914లో ఒరిస్సాలోని 'దాస్‌పల్లా' ఎస్టేటులో ఖోండులు తిరుగుబాటు చేశారు బ్రిటిష్‌వాళ్లు యుద్ధంలో చిక్కుకుని ఓడిపోతున్నారు. గాబట్టి, స్వేచ్ఛగా బ్రతకడం కొరకు తిరుగుబాటు చేయండని కలహండినుండి బస్తరువరకూగల ఖోండుల కందరికి వర్తమానాలు పంపారు ప్రమాదాన్ని గుర్తించిన ప్రభుత్వం పోలీసు బలగాలతో ఖోండుల మీద విరుచుకుపడి, వారి పల్లెలను తగులబెట్టింది అనేక చిత్రహింసలకు గురిజేసి చీలికలు కల్పించిన పిమ్మట, ఖోండుల తిరుగుబాటును ప్రభుత్వం అణచివేయగలిగింది.

ఛోటానాగపూర్ ప్రాంతంలో జాత్రాభగత్ నాయకత్వాన చెలరేగిన ఓరాన్ తెగబారి తిరుగుబాటునుకూడా ప్రభుత్వం అణచివేసింది యుద్ధ రంగానికి అవసరమైన కూలీలను రిక్రూట్ చేసేందుకు బ్రిటిష్ అధికారులు ప్రయత్నించడంవల్ల, మయూర్‌భంజ్ ప్రాంతంలోని సంతాలులు తిరుగుబాటు చేశారు అలాగే మణిపూర్ ప్రాంతాలలో 'ధదేల్ కుకీలు'కూడా తిరగబడ్డారు రెండు సంవత్సరాల కాలం గెరిల్లా యుద్ధం కొనసాగింది రాజస్తాన్‌లోని భిల్లులు గోవింద గురు నాయకత్వాన తిరుగుబాటు చేశారు భిల్లుల రాజ్యస్థాపన కొరకుకూడా ప్రయత్నించారు ఆ ప్రయత్నంలో 12 మంది మరణించారు 9 వందల మంది బందీలయ్యారు

## రైతుల పోరాటం

మేవార్‌లో సాధు శీతారామదాసు నాయకత్వాన రైతులంతా కలిసి పన్నుల తగ్గింపుకొరకు, పొలాలు సాగుచేయకుండా పాడుబెట్టారు. ఆ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన విజయసింగ్ పథిక్‌ను మేవార్ రాణా సంస్థానం నుండి వెళ్లగొట్టాడు.

కాగా పధిక్ రైతులకు ప్రేమపాత్రుడయ్యాడు తరువాత మణిక్‌లాల్ వర్మ అనే అధికారితో చేతులు కలిపిన పధిక్ ఉదయ్‌పూర్ మహారాణాకు వ్యతిరేకంగా పన్నుల నిరాకరణోద్యమాన్ని ప్రారంభించాడు యుద్ధానికి చందాలు ఇవ్వకుండా చేశాడు చివరకు ఉద్యమం జయప్రదమైంది పెంచిన పన్నులను రాణాలు తగ్గించారు ఆ ఉద్యమమే "బిజోల్" ఉద్యమంగా పేరుగాంచింది అటుతరువాత పధిక్‌తోపాటు మణిక్‌లాల్ వర్మకూడా ప్రముఖ కాంగ్రెస్ నాయకుడుగా రాజస్తాన్‌లో సత్యాగ్రహ పోరాటాలు సాగించాడు



# మొదటి ప్రపంచ యుద్ధం-సామ్రాజ్యవాదుల వాగ్దానాలు

1914 ఆగస్టులో మొదటి ప్రపంచ యుద్ధంలో ప్రవేశించిన బ్రిటన్, జర్మనీ సైనికశక్తిని ధ్వంసం చేసేందుకు ఫ్రాన్సు, రష్యాలతో చేతులు కలిపింది కాని, తన యుద్ధ పాటవం అనుకున్నంత బలంగా లేదన్న విషయం బ్రిటిష్ ప్రభుత్వానికి త్వరలోనే తెలిసిపోయింది

ఆనాడు బ్రిటిష్ సైన్యం చాలావరకు ఇండియా మలయా వెస్టిండీస్ వగైరా దేశాలలో తిష్టవేసి వుంది. ఆ సైనిక బలగాలను యూరప్‌లోని యుద్ధ రంగానికి తరలిస్తే ముందుగా ఇండియాలోను, క్రమంగా ఇతర ఆక్రమిత దేశాలలోను తిరుగుబాట్లు తప్పవనే భయం, తరలించకపోతే ఓటమి తప్పదనే భయం బ్రిటిష్ ప్రభుత్వానికి కలిగింది

పైగా బ్రిటిష్ వారి పారిశ్రామిక శక్తికూడా అవసరానికి తగినట్లుగాలేదు ఆక్రమిత దేశాలనుండి ముడిసరుకులను బ్రిటన్‌కు తీసుకుపోతూ, అక్కడ తయారైన పారిశ్రామిక వస్తువులను తిరిగి ఆక్రమిత దేశాలలో అమ్ముకుంటూ ధనరాసులు పోగు చేసుకుంటున్న బ్రిటిష్‌వారికి ఆయుధోత్పత్తి సమస్య ఎదురైంది బ్రిటిష్ పెట్టుబడులను పారిశ్రామికాభివృద్ధికొరకు గాకుండా, వడ్డీ వ్యాపారంకొరకు మళ్ళించడంవల్ల సమస్య మరింత జటిలమైంది

17వ శతాబ్దంలో వ్యాపారాభివృద్ధి కొరకు పెట్టుబడి పెట్టిన ఆంగ్లేయులు 18వ శతాబ్దంలో పారిశ్రామికాభివృద్ధికొరకు పెట్టుబడి పెట్టారు కాని, 1860 ప్రాంతంనుండి అంతకంతకు ఎక్కువగా వడ్డీలు లాభాలు పొందేందుకు తమ పెట్టుబడులను ఉపయోగించారు ఉదాహరణకు ఇండియా ప్రభుత్వ హామీపై రైల్వేలు, ట్రాములు వగైరాల కొరకు పెట్టిన పెట్టుబడి (ఫైనాన్సు కాపిటల్) అంతకంతకూ పెరిగింది అందువల్ల వారి లాభాలు పెరిగాయి ఇండియా ప్రభుత్వంద్వారా బ్రిటన్ సాగించిన దోపిడీ పెరిగింది కాని ఇండియాలోను, ఇతర దేశాల మార్కెట్లలోను బ్రిటిష్ వస్తువుల అమ్మకం తగ్గిపోయింది కాగా బ్రిటిష్ పారిశ్రామికాభివృద్ధి మందగించింది

అలాంటి స్థితిలో యుద్ధం ప్రారంభమైంది. అనేక భారత సైనిక దళాలను (15వేల మంది మినహా) తక్కిన బ్రిటిష్ సోల్జర్సును యుద్ధరంగాలకు తరలించారు కాని పర్షియన్ గల్ఫ్ ప్రాంతంలోని సైనిక దళాలకు యుద్ధ సామగ్రిని సరఫరా జేయడమొక పెద్ద సమస్యగా తయారైంది ఇండియాలో పారిశ్రామికాభివృద్ధి జరుగకుండా అడ్డుకున్నదానిఫలితం ఆంగ్లేయులకు అప్పుడు కనిపించింది దానికితోడు ఇండియాలో విప్లవ టెర్రరిస్టులు, గదర్‌పార్టీ వీరులు తిరుగుబాట్లు కొనసాగించారు కాగా బ్రిటిష్ ప్రభుత్వ వాగ్దాన పరంపర ప్రారంభమైంది. ఎక్సైజ్ డ్యూటీలలో మార్పులు చేసి దేశీయ పెట్టుబడిదారులను సంతృప్తి పరిచారు భారతీయులను కూలీలుగా విదేశాలకు తీసుకుపోకుండా ఆపారు బాధ్యతాయుత పాలనను ప్రవేశపెడతామని ప్రకటనలు చేశారు

# జాతీయ నాయకుల తోడ్పాటు

యుద్ధం ప్రారంభమైనప్పుడు మహమ్మదాలీ జిన్నా, లాలా లజపతిరాయ్, సిన్హా మొదలగువారు లండనులో వున్నారు "బ్రిటిష్ సామ్రాజ్యం త్వరగా విజయం సాధించేందుకు భారతదేశంలోని ప్రజలూ, సంస్థానాధీశులూ తోడ్పడతారు" అని బ్రిటిష్ ప్రభుత్వానికి లేఖ వ్రాశారు

యుద్ధం ప్రారంభమైన కొద్ది రోజుల్లోనే మహాత్మా గాంధీ లండన్ చేరారు అక్కడ నివసిస్తున్న భారతీయులనుద్దేశించి "మీరు సామ్రాజ్యంలోని పౌరులవలె ఆలోచించండి" అని సలహా చెప్పారు భారతీయులతో కూడిన అంబులెన్సు వలంటీరు దళాన్ని ఏర్పాటు చేశారు కాగా జాతీయ కాంగ్రెసు నాయకులపట్ల సామరస్యంగా వ్యవహరిస్తున్నట్లుగా సామ్రాజ్యవాదులు నటించసాగారు

1914లో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభకు మద్రాసు గవర్నర్ లార్డ్ పెంట్‌లాండ్ హాజరయ్యాడు 1915లో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు బాంబే గవర్నర్ లార్డ్ వెల్లింగ్‌టన్ హాజరయ్యాడు 1916లో ఉత్తరప్రదేశ్ గవర్నర్ హాజరయ్యాడు

మద్రాసు కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించిన భూపేంద్రనాధ వసు "గౌరవం, స్వాతంత్ర్యం, న్యాయం కొరకు బ్రిటన్, భారతదేశాలు కలసి పోరాడుతున్నాయి" అని ప్రకటించాడు మహాసభలో ఈ క్రింది తీర్మానం ఆమోదింపబడింది

"ప్రస్తుత సందిగ్ధ తరుణంలో భారతదేశ ప్రజలు ప్రకటించిన రాజభక్తిని ప్రభుత్వం గమనించాలి చక్రవర్తిగారి పౌరులైన భారతీయుల మధ్యను, తదితర జాతుల మధ్యను చూపబడుతున్న అసహ్యాకరమైన భేదభావములను తొలగించాలి రాష్ట్రీయ స్వాతంత్ర్య వాగ్దానములను నెరవేర్చి, సంయుక్త సామ్రాజ్యములో భారతదేశమును భాగస్వామిగా నొనర్చుటద్వారా, భారతీయుల రాజభక్తి శాశ్వతంగా వర్ధిల్లునట్లు చేయవలెను" (పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెస్ చరిత్రనుండి)

యుద్ధ సమయంలో బ్రిటిష్ వారికి సాయంచేస్తే స్వరాజ్య సాధన సులభమౌతుందనే అభిప్రాయం జాతీయ నాయకులకుండేది కనుకనే వారు యుద్ధానికి తోడ్పాటును ప్రకటించారు

1915 జనవరిలో భారతదేశానికి తిరిగి వచ్చిన గాంధీజీ భారతీయులను సైన్యంలో చేర్చేందుకు పూనుకున్నాడు. స్వపరిపాలనకు ఆ పని తోడ్పడుతుందని విశ్వసించాడు

ఆ సమయంలో ఇంగ్లండులో వున్న అనీబిసెంట్ లండన్‌లో "హోంరూల్ లీగు"ను స్థాపించింది "యుద్ధకాలంలో భారతీయులు చూపిస్తున్న విధేయతకు ప్రతిఫలం భారతదేశ స్వాతంత్ర్యమే"నని ప్రకటించింది తరువాత 1916 సెప్టెంబర్ 15న మద్రాసులో హోంరూల్ లీగును స్థాపించి, భారతదేశ స్వాతంత్ర్యం కొరకు తీవ్రంగా కృషి చేసింది

తనకు విధించిన ఆరేళ్ల ప్రవాస శిక్షను బర్మాలోని మాండలే జైల్లో అనుభవించి ఇండియాకు తిరిగి వచ్చిన లోకమాన్య తిలక్ సైన్యంలో చేరవలసిందిగా ప్రజలను ప్రోత్సహించాడు జాతీయ కాంగ్రెస్‌ను పటిష్టం చేసేందుకు పూనుకున్నాడు 1907లో వచ్చిన అతివాద-మితవాద చీలికవల్ల కాంగ్రెస్ నిస్తబ్దుగా వుండిపోయిందని గ్రహించిన తిలక్ మితవాదులు విధించిన షరతులను ఆమోదించి కాంగ్రెసులో చేరాడు.

ఆయనతోపాటు ఆయనపక్షంవారంతా చేరారు కాగా 1915లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో ఈ క్రింది తీర్మానం ఆమోదింపబడింది

"బ్రిటిష్ సామ్రాజ్యానికి లోబడి, సక్రమమైన మార్గంలో స్వపరిపాలన సాధించడమే కాంగ్రెస్‌యొక్క ఉద్దేశ్యం."

ఈ నిర్ణయాన్ని తిలక్ ఆమోదించాడు కాని అయనకు సంతృప్తి కలుగలేదు కాబట్టి ఏ విధంగానూ విమర్శించడానికి వీలులేని పద్ధతిలో తన ప్రచారాన్ని సాగించాడు

"చక్రవర్తి స్వయంగా ఇండియాను పాలించడంలేదు వైస్రాయ్, గవర్నర్లు మొదలగువారిద్వారా పరిపాలన సాగుతోంది అలాంటప్పుడు గవర్నర్ పదవి కావాలని మేం కోరితే అది రాజద్రోహమా? బ్రిటిష్ ప్రభుత్వాన్ని తరిమివేయడానికి మేము పూనుకోవడం లేదే? మేము పరిపాలన సాగించినా చక్రవర్తి అలాగే వుంటాడు గదా?"

"స్వపరిపాలనకు మేం అర్హులంకాదూ? ఎందుకని? మాకు కళ్లు, చెవులు లేవా? మెదడు లేదా? తెలివితేటలు తక్కువా? 21 ఏళ్ల వయస్సుగల ఇంగ్లీషువాణ్ణి కలెక్టరుగా నియమిస్తే, 25 ఏళ్ల సర్వీసుగల మా మామ్లత్‌దారుకన్నా చక్కగా పాలించగలడా?"

"మొత్తం సామ్రాజ్య వ్యవహారాలను చూసే బ్రిటిష్ ప్రధాన మంత్రికి ఐదువేల రూపాయల ప్రతిఫలం కాగా ఇండియాలోనున్న వైస్రాయికి ఇరవైవేల రూపాయల ప్రతిఫలమా? ఏమిటిది? ఇదిగో భారతదేశం, మెక్కండి అని చెప్పడమేగదా?"

ఇలా సాగింది లోకమాన్యుని ప్రచారం అయినా కాంగ్రెస్ నాయకులు సరిగా స్పందించలేదు కాబట్టి తిలక్ 1916 ఏప్రిల్ 23న పూనాలో హోమ్‌రూల్ లీగ్‌ను స్థాపించాడు

## హోమ్‌రూల్ ఉద్యమం

అనీబిసెంట్ మద్రాసులో స్థాపించిన హోమ్‌రూల్ లీగ్ పేరును ఆలిండియా హోమ్‌రూల్ లీగ్‌గా మార్చింది తిలక్ స్థాపించిన హోమ్‌రూల్ లీగ్ కార్యకలాపాలు మహారాష్ట్రకు, మధ్యరాష్ట్రానికి పరిమితంకాగా, అనీబిసెంట్ స్థాపించిన ఆలిండియా హోమ్‌రూల్ లీగ్ కార్యకలాపాలు దేశమంతటికీ విస్తరించాయి కాగా, ఆ రెండు సంఘాలు పరస్పర సహకారంతో పనిచేశాయి కాంగ్రెస్‌లోనున్న అతివాద జాతీయ నాయకులకు హోమ్‌రూల్ ఉద్యమమొక నిర్మాణ వేదికగా ఉపయోగపడింది అంతకుముందే కాంగ్రెసులో చేరిన అనీబిసెంట్, అతివాద-మితవాద కాంగ్రెసు నాయకుల మధ్య ఐక్యతకు కృషి జేయడంతోపాటు వలంటీరు దళాలను కూడా నిర్మించింది. జాతీయ విద్యా పథకాన్ని ప్రకటించింది స్కౌట్ ఉద్యమాన్ని ప్రారంభించింది మదనపల్లెలో జాతీయ కళాశాలను నెలకొల్పింది

మహమ్మదాలీ జిన్నా హోమ్‌రూల్ లీగ్‌లో చేరాడు లాలాలజపతిరాయ్ అమెరికా వెళ్లి అక్కడ లీగ్ ప్రచారాన్ని ప్రారంభించాడు

ఆలిండియా హోమ్‌రూల్ లీగ్ ప్రారంభంకాగానే, ఆంధ్రలో 52 శాఖలు ఏర్పడ్డాయి అప్పటికే దివ్యజ్ఞాన సమాజం వారి కేంద్రాలు ఆంధ్రలో వున్నాయి పైగా ఆంధ్ర ప్రాంతంలో అనీబిసెంట్ విస్తృతంగా పర్యటించింది కాగా అనేకమంది మహిళలు కూడా హోమ్‌రూల్ లీగ్‌లో చేరారు హోమ్‌రూల్ లీగ్ ఆంధ్ర శాఖకు హరిసర్వోత్తమరావు కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

హరిసర్వోత్తమరావు సంపాదకత్వానగల ఇంగ్లీషు వారపత్రిక "నేషనలిస్టు"లో ప్రచురించిన వ్యాసాలు తీవ్ర స్వభావంగలవనే నెపంతో ఆ పత్రికయొక్క ధరావతు సొమ్మును ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికలతోబాటు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి "దేశమాత" పత్రిక, ఏలూరునుండి వెలువడిన "హితకారిణి" పత్రికలు హోమ్‌రూల్ ఉద్యమానికి మంచి బలాన్ని చేకూర్చాయి

హోమ్‌రూల్ ఉద్యమం ప్రజల ఉద్యమంగా మారుతున్నందుకు ఆందోళన చెందిన ప్రభుత్వం అనీబిసెంట్ నడిపిన "కామన్‌వీల్", "న్యూ ఇండియా" పత్రికలు కట్టిన ఇరవైవేల రూపాయల ధరావతు సొమ్మును స్వాధీనం చేసుకున్నది అటుపిమ్మట 1917 జూన్ 16న మద్రాసు ప్రభుత్వం అనీబిసెంటుతోపాటు జార్జి అరండేల్, బి పి వాడియాలనుకూడా నిర్బంధించింది రాజకీయ కార్యకలాపాలలో విద్యార్థులు పాల్గొనకూడదని ఆజ్ఞలు జారీ చేసింది

అనీబిసెంటు నిర్బంధానికి నిరసనగా దేశమంతటా బహిరంగసభలు జరిగాయి ఊరేగింపులు జరగకుండా పోలీసులు అడ్డుపడినప్పుడు మహిళలు ముందుకు వచ్చి ఊరేగింపులను జయప్రదం జేశారు కాగా, ప్రభుత్వం అనీబిసెంటును ఆమె అనుచరులను విడుదల చేసింది భారత స్వాతంత్ర్యం కొరకు ఆమె చేసిన కృషికి గుర్తింపుగా ఆమెను కలకత్తా కాంగ్రెసు మహాసభకు అధ్యక్షురాలుగా ఎన్నుకున్నారు అటు తరువాత 1918లో ప్రపంచ యుద్ధం ముగియగానే హోమ్‌రూల్ ఉద్యమం యొక్క ప్రత్యేకత తరిగిపోయింది 1920లో హోమ్‌రూల్ లీగ్‌కు గాంధీజీ అధ్యక్షుడుగా ఎన్నికైన పిమ్మట, హోమ్‌రూల్ ఉద్యమం స్థానంలో సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించాడు

## ఆంధ్రరాష్ట్ర ఉద్యమం

వందేమాతరం ఉద్యమాలవల్ల ఆంధ్రులలో వెల్లివిరిసిన చైతన్యం, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర వాంఛకు దారితీసింది 1910లో కొమర్రాజు లక్ష్మణరావు స్థాపించిన విజ్ఞాన చంద్రికా గ్రంధమండలి ప్రచురించిన "ఆంధ్రుల చరిత్రము" ప్రత్యేక రాష్ట్ర వాంఛను ప్రబలంజేసింది ఆంధ్రపత్రిక, దేశాభిమాని, కృష్ణాపత్రికలు ఆంధ్రరాష్ట్ర వాంఛకు అనుకూలంగా వున్నవాటితోపాటు, వ్యతిరేకంగా వున్న వ్యాసాలనుకూడా ప్రచురించాయి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం జరిగి తీరాలంటూ, హిందూ పత్రికలో 1913 ఫిబ్రవరిలో డాక్టర్ పట్టాభిగారొక లేఖను ప్రచురించాడు కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ ప్రభృతులు ఆంధ్ర మహాసభను ఏర్పాటు చేసేందుకు గట్టిగా కృషిచేశారు అయినా రాయలసీమ, ఉత్తరాంధ్ర జిల్లాలలోని ప్రముఖులు కలిసిరాలేదు కాని, కొండా వెంకటప్పయ్య, డాక్టర్ పట్టాభి, మట్నూరి కృష్ణారావులాంటి పెద్దలు రాయలసీమ, విజయనగరం, శ్రీకాకుళం ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించి ప్రచారంజేసిన పిమ్మట, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కోరికకు బలం చేకూరింది. అందువల్ల 1914 ఏప్రిల్ 11న బెజవాడలో జరిగిన మహాసభలో ప్రత్యేక రాష్ట్ర తీర్మానం అత్యధిక ఓట్ల మెజారిటీతో ఆమోదింపబడింది

అయినా 1916లో కాకినాడలో జరిగిన ఆంధ్ర మహాసభలోను, 1917లో నెల్లూరులో జరిగిన ఆంధ్ర మహాసభలోను, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర తీర్మానాన్ని రాయలసీమ, నెల్లూరు జిల్లాల ప్రతినిధులు వ్యతిరేకించారు కాగా, ఆంధ్ర మహాసభ చీలిపోతుందనే భయమేర్పడింది అందువల్ల ఆంధ్ర రాష్ట్ర సాధనకు ముందు ఆంధ్ర కాంగ్రెసు సర్కిల్‌ను

సాధించడం అవసరమని ఆంధ్ర నాయకులు భావించారు 1917లో కలకత్తా కాంగ్రెసుకు అధ్యక్షత వహించిన అనీబిసెంట్ ప్రోత్సాహంవల్లనూ, బాలగంగాధర్ తిలక్ ప్రదర్శించిన పట్టుదలవల్లను, "ఆంధ్ర కాంగ్రెస్ సంఘం" ఏర్పాటుకు మార్గం సుగమమైంది

కాని ప్రత్యేక రాష్ట్రం ఏర్పడలేదు భాషా ప్రయుక్త రాష్ట్రాల నేర్పరచాలని ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో బి ఎన్ శర్మ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సురేంద్రనాధ్ బెనర్జీ, జిన్నా, శ్రీనివాసశాస్త్రి ప్రభృతులు వ్యతిరేకించినందున అది వీగిపోయింది

## చీలికలకు ప్రభుత్వ ప్రోత్సాహం

ఆ దశలో బ్రిటిష్ ప్రభుత్వంలో ఇండియా కార్యదర్శిగానున్న మాంటేగ్ భారతదేశాన్ని సందర్శించాడు కాగా ఆయన వద్దకు రాయబారం పంపాలని ఆంధ్ర మహాసభ తీర్మానించింది ఆ కోర్కెను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం బలపరిచింది కాని మద్రాసు ప్రభుత్వం వ్యతిరేకించింది అందువల్ల కొంత ఆందోళన జరిగిన పిమ్మట మద్రాసు ప్రభుత్వం దిగివచ్చి, ఆంధ్ర మహాసభ తరపున ఒక రాయబార వర్గం మాంటేగ్‌ను కలుసుకునేందుకు ఏర్పాటు చేసింది కాని, ఆ ఇంటర్వ్యూతోపాటు ఆర్యవైశ్య రాయబార వర్గానికి, నాయుడు సంఘ రాయబార వర్గానికికూడా ఇంటర్వ్యూలు ఏర్పాటుచేసి, కుల విభేదాలను ప్రోత్సహించింది బ్రాహ్మణ సంఘం, నాయర్ సంఘం, నాడార్ సంఘం, నాయుడు సంఘం, కమ్మ మహాజన సభ, రెడ్డి హాస్టల్స్‌లాంటి వేర్పడ్డాయి

అక్కడికి సంతృప్తిలేని మద్రాసు ప్రభుత్వం, కాంగ్రెసు ఉద్యమాన్ని బ్రాహ్మణుల ఉద్యమంగా చిత్రిస్తూ ప్రచారం చేసింది. అలాంటి కుటిల రాజనీతి ఫలితంగా బ్రిటిష్ వారికి అనుకూలంగా వుండే జస్టిస్ పార్టీ ఆవిర్భవించింది ఆ పార్టీకి భూస్వాములు, జమీందారులు మూలకందమయ్యారు

బ్రిటిష్‌వారి "చీలించి-పాలించే" నీతిని వమ్ముజేసేందుకు బెజవాడలో అయ్యదేవర కాళేశ్వరరావు అస్పృశ్యతా నివారణ సభను జరిపారు తరువాత ప్రత్యేక ఆంధ్ర మహాసభనుకూడా జరిపారు పన్నెండు వందల మంది ప్రతినిధులు హాజరైన ఆ మహాసభలో త్రిపురనేని రామస్వామి చౌదరి, పట్టాభి రామిరెడ్డి, కేశవపిళ్లై మొదలగు ప్రముఖులు ఉపన్యసించారు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో బ్రాహ్మణేతరులకు హెచ్చు ప్రాతినిధ్యం కావాలని కోరడంతోపాటు, భారతీయులకు స్వపరిపాలన కావాలని డిమాండ్ జేశారు వారి తీర్మానాన్ని బలపర్చుతూ, పదివేల మంది సంతకాలు జేసిన మహజరును ప్రభుత్వానికి పంపించారు హరిజనులతో సహపంక్తి భోజనాలను ఏర్పాటు చేయడంతో పాటు కాళేశ్వరరావు కొన్ని రచనలుకూడా చేశాడు. వానిలో ముఖ్యమైనది ఉపనిషత్సారం

## తాత్కాలిక భారత ప్రభుత్వం

రిజర్వేషన్లకొరకు మత, కుల, విభేదాలు పెరిగిపోయిన సమయంలో, హిందూ - ముస్లిమ్ ఐక్యతకు దోహదం చేసే ఘటనలు, మత కలహాలకు దారితీసే ఘటనలుకూడా జరిగాయి

టర్కీ ప్రభుత్వ సహాయంతో, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో తిరుగుబాటు జరిపేందుకు కొందరు విప్లవకారులు పూనుకున్నారు. అందుకు అనుగుణంగా ఆఫ్ఘనిస్తాన్‌లో "తాత్కాలిక భారత ప్రభుత్వము"ను ఏర్పాటు చేశారు దానికి అధ్యక్షుడిగా రాణా

మహేంద్రప్రతాప్, ప్రధాన మంత్రిగా బరకతుల్లా, యుద్ధ మంత్రిగా మౌలానా ఒబేదుల్లా నియమితులయ్యారు

వహీబీ ప్రముఖుడు సయ్యద్ అహమ్మద్ షా నిర్మించిన కాలనీ ఒకటి అప్పటికే సరిహద్దు రాష్ట్రంలో వుండేది యుద్ధ కాలంలో ఢాకా, రంగపూర్, లాహెూర్ వగైరా చోట్లనుండి అనేకమంది ముస్లిం యువకులు, విద్యార్థులు ఆ కాలనీకి వెళ్ళారు నిరంకుశ ప్రభుత్వ పాలనలో వుండలేక ఇళ్లు విడిచిపోయినందున వారికి "ముజాహిదీలు" అనే పేరు కలిగింది దేవ్‌బంద్ స్కూలుకు చెందిన మౌల్వీ ఒబీదుల్లా ముజాహిద్‌లతో సంబంధం పెట్టుకొని ఆఫ్ఘనిస్థాన్ వెళ్ళాడు అక్కడ ఏర్పడిన తాత్కాలిక భారత ప్రభుత్వంలో మంత్రిగా చేరాడు తరువాత ఘాలిబ్‌పాషా (టర్కిష్ గవర్నర్)తో సంబంధం పెట్టుకున్నాడు మియా అన్సారీ, షేక్ అబ్దుల్ రహ్మాన్‌లతో కలిసి పశ్చిమాసియాలోని భారత సైనికుల మధ్య బ్రిటిష్ వ్యతిరేక ప్రచారం చేశాడు అప్పుడు హెజాజ్‌లోవున్న మహమ్మద్ హసన్‌కూ, ఒబీదుల్లాకు మధ్య రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి ఆ ఉత్తరాలను సంకేతంగా పసుపు పచ్చని సిల్కు గుడ్డలమీద వ్రాసేవారు వాటి పర్యవసానంగా టర్కిష్ గవర్నర్ జారీ చేసిన పవిత్రయుద్ధ ప్రకటనను ఆఫ్ఘనిస్తాన్‌లోను, ఇండియాలోను పంచిపెట్టారు తిరుగుబాటు వ్యూహం యావత్తూ బ్రిటిష్‌వారికి తెలిసిపోయింది కనుక బస్రాలో రెండువందల మంది ముస్లిమ్ సైనికులను బ్రిటిష్ అధికార్లు కాల్చి చంపారు మహమ్మద్ హసన్‌ను మాల్టా కోటలో బంధించారు దేవ్‌బంద్ స్కూలు విద్యార్థులతోపాటు ప్రిన్సిపాల్‌నుకూడా అరెస్టు చేసి శిక్షించారు అనేకమంది ముస్లిమ్ సోల్జర్సుకు దీర్ఘకాల శిక్షలు విధించారు అందువల్ల తాత్కాలిక భారత ప్రభుత్వం విఫలమైంది కాని, ఆ ప్రయత్నం సిల్కు ఉత్తరాల కుట్రగా చరిత్రకెక్కింది

ఇలా ఒకదాని వెంట మరొకటిగా విప్లవ పథకాలు విఫలమైనందున వేలాది హిందూ, ముస్లిమ్, సిక్కు వీరులు మరణించారు. అదే సమయంలో మత కలహాలవల్ల మరికొన్నివేలమంది చనిపోయారు

"గోమాతను రక్షించండి" అనే నినాదంతోపాటు ఆంగ్లేయరాజ్యం అంతరించాలి, జర్మనీకి జై అంటూ షహబాద్ జిల్లాలో 50 వేల మంది హిందువులు ఏకమై, ముస్లిమ్‌ల మీద దాడి చేశారు ఆ దాడిలో 124 ముస్లిమ్ పల్లెలు ధ్వంసమయ్యాయి సనాతన ధర్మసభవారు, ఆర్య సమాజంవారు సాగించిన "గోసంరక్షణ" ప్రచారం హిందువుల దాడికి కారణమైంది (సుమిత్ సర్కార్, మోడరన్ ఇండియా)

బుర్రాబజార్ (కలకత్తా)లోని మార్వాడీలమీద పేద ముస్లిమ్‌లు దాడి చేశారు పాన్-ఇస్లామ్‌వాదులు, ఉలేమాలు చేసిన ప్రచారం ఆ దాడికి దారితీసింది "అలా ఒకవైపున పాన్-ఇస్లామ్ ఇజమ్, మరోవైపున హిందూ పునరుద్ధరణవాదం పేద ప్రజల అసంతృప్తిని బహిర్గతం చేస్తూ, మత మౌఢ్యానికి, సామ్రాజ్యవాద వ్యతిరేకతకూ మధ్య ఊగిసలాడాయి" (ఇబిడ్)

మైమన్‌సింగ్ జిల్లాలో చౌధరీఖాన్ మహమ్మద్ సర్కార్ నిర్మించిన "ప్రజాసభ" సమావేశాలలో ఫజ్లుల్‌హక్, అక్రమ్‌ఖాన్, అబుల్ ఖాసిమ్‌లాంటి రాజకీయ నాయకులు పాల్గొనేవారు. జమీందార్లకు నజరానాలు చెల్లించకుండా చెట్లు పెంచుకునే హక్కు, చెరువులు తవ్వుకునే హక్కు కావాలని, శిస్తులు తగ్గించాలని, హిందూ జమీందార్లు ముస్లిమ్ రైతులను అవమానించకూడదని ఆందోళన చేసేవారు అలా ప్రారంభమైన ఆందోళన బలమైన

ఉద్యమంగా రూపొందింది

"బెంగాల్ కాంగ్రెస్‌లోనున్న అధిక సంఖ్యాక హిందువులు చేసిన పొరపాట్లవల్ల, మైమన్‌సింగ్ జిల్లాలో ముస్లిమ్ రైతుల ఉద్యమం ప్రారంభమై, బలపడింది 1920-30 దశాబ్దాలలో బెంగాల్ రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించిన రైతు ఉద్యమాలకది నాందీవాచకం పలికింది ఆ విధంగా ప్రబలమైన ముస్లిమ్ రైతు ఉద్యమాలు దేశ విభజనకు దారితీశాయి' (ఇబిడ్)

అలా కలహాలు, పోరాటాలు జరుగుతున్న సమయంలోనే హిందూ-ముస్లిమ్ నాయకుల మధ్య సామరస్యం ప్రారంభమైంది బ్రిటిష్ వ్యతిరేక భావాలుగల "యంగ్ పార్టీ" వారు ముస్లిమ్‌లీగ్‌ను స్వాధీనం చేసుకున్నారు షౌకత్‌అలీ, మహమ్మదాలి, హజరత్ మొహానీ, జఫర్ అలీఖాన్, ఫజ్లుల్‌హక్ ప్రభృతులు కాంగ్రెస్ నాయకులతో సంబంధాలు పెట్టుకున్నారు కాంగ్రెసు నాయకులతో చేతులు కలిపి బ్రిటిష్‌వారి నెదిరించాలని, టర్కీ పాలకుడైన ఖలీఫాకు జరుగుతున్న అన్యాయాలను అరికట్టాలని వారు భావించారు కనుక ముస్లిమ్ లీగ్ నాయకత్వం పాన్-ఇస్లామిజమ్‌కు మద్దతునిస్తూ, జాతీయ ఐక్యతకు తన సుముఖతను వ్యక్తం చేసింది దేవ్‌బంద్ కేంద్రంలోని మౌల్వీలు, అలీఘర్ కేంద్రంలోని ముస్లిమ్ విద్యార్థులుకూడా బ్రిటిష్ వ్యతిరేక పోరాటానికి సిద్ధమయ్యారు 1917 జులై 28న కాంగ్రెస్ లీగ్ సమష్టి సమావేశం జరిగింది అనీబిసెంటు మున్నగువారిని నిర్బంధించినందుకు ప్రభుత్వాన్ని ఆ సమావేశం గట్టిగా విమర్శించింది

కాంగ్రెసులోని మితవాదులు, అతివాదులు ఏకం కావడం, కాంగ్రెస్-ముస్లింలీగ్ ఏకమయ్యే సూచన కనిపించడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వం ఆందోళన చెందింది. "ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికి మేం యుద్ధం చేస్తున్నాం" అని చెప్పినంత మాత్రాన సరిపోదని గ్రహించింది కాగా ఇండియా కార్యదర్శి మాంటేగ్ 1917 ఆగస్టు 20న ఒక ప్రకటన చేశాడు

"బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగా ఇండియా క్రమేపీ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచే లక్ష్యంతో స్వపరిపాలనా సంస్థలను క్రమక్రమంగా పెంపొందించడం బ్రిటిష్ ప్రభుత్వ ధ్యేయం" అని ప్రకటించాడు హోమ్‌రూల్ ఉద్యమంలో అరెస్టు చేసినవారిని విడిచిపెట్టారు సైన్యంలో కమిషన్ పదవికి భారతీయులు పనికిరారనే నిషేధాన్ని తొలగించారు కాగా త్వరలోనే అధినివేశ ప్రతిపత్తి లభిస్తుందని పలువురు జాతీయ నాయకులు ఆశించారు "ఎన్ని విపత్తులు వచ్చినా, ఎన్ని కష్టాలు కలిగినా బ్రిటిష్ సామ్రాజ్యానికి అండగా నిలవాలి" అని కాంగ్రెస్ తీర్మానించింది

1918 జూలైలో మాంటేగ్-చెమ్స్‌ఫర్డు నివేదిక వెలువడింది. ఆ నివేదిక ప్రకారం రాష్ట్రాలలో ద్వంద్వ ప్రభుత్వాలను ఏర్పరుస్తారు తక్కువ ప్రాముఖ్యం, ఎక్కువ వ్యయంగల విద్య, ఆరోగ్యంలాంటి శాఖలను రాష్ట్ర శాసనసభలు ఎన్నుకున్న మంత్రులకు అప్పగిస్తారు మంత్రుల సలహాలను గవర్నర్లు అంగీకరించనూవచ్చు లేదా తిరస్కరించనూవచ్చు. ముస్లిమ్‌లకిచ్చిన ప్రత్యేక ప్రాతినిధ్యం కొనసాగుతుంది. మద్రాస్ రాష్ట్రంలో బ్రాహ్మణేతరులకు రిజర్వేషన్లుంటాయి

"ముఖ్యమైన ఆర్థిక, సైనిక, సాధారణ పరిపాలన వగైరా శాఖలు, వైస్రాయి కార్యనిర్వాహక వర్గం చేతుల్లో వుంటాయి. కార్యనిర్వాహక వర్గ సభ్యులు కేంద్ర ప్రభుత్వానికి, బ్రిటిష్ పార్లమెంటుకు బాధ్యులుగా వుంటారు కనుక అతివాద జాతీయ నాయకుల

ఆశలు నిరాశలయ్యాయి హసన్ ఇమామ్ అధ్యక్షతన బొంబాయిలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశం సంస్కరణలను విమర్శించింది సంస్కరణలు అసమగ్రమైనవి, అసంతృప్తికరమైనవి, ఆశాభంగం కలిగిస్తున్నవి" అని వివరించింది

ఈ తీర్మానం మితవాదులకు ఇష్టంలేదు కనుక జయకర్, తేజబహదూర్ సప్రూ, చింతామణివంటివారు విడిపోయి, సురేంద్రనాథ బెనర్జీ అధ్యక్షతన "నేషనల్ లిబరల్ అసోసియేషన్" స్థాపించారు

తిలక్, జిన్నా, చిత్తరంజన్‌దాస్ మున్నగువారు సంస్కరణలను వ్యతిరేకించారు అయినా బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించాలనే ధోరణిని గాంధీజీ విడిచిపెట్టలేదు "అయితే వాటిని అంగీకరించి, లోపలినుండి భగ్నం చేద్దాం" అని తిలక్ వాదించాడు

"అంగీకరిస్తే పూర్తిగా అంగీకరించాలి లేదా పూర్తిగా వ్యతిరేకించాలి" అని గాంధీజీ పట్టుబట్టాడు కాని అతివాద, మితవాదులందరికీ ఆమోదయోగ్యమయ్యేటట్లుగా రాజీ తీర్మానాన్ని ప్రతిపాదించాడు

"ప్రతినిధులలో ఎక్కువమంది గాంధీ ప్రతిపాదించిన తీర్మానాన్ని బలపరిచేందుకు సిద్ధమయ్యారు అయినా తిలక్‌ను ఓడించడం గాంధీజీకి ఇష్టంలేదు కాబట్టి తిలక్‌పట్ల గౌరవ సూచకంగా తన ఖద్దరు టోపీని నేలమీద పడవేసి, రాజీ తీర్మానానికి అనుకూలంగా ఓటు చేయవలసిందిగా కోరాడు కనుక తిలక్ లొంగక తప్పలేదు'' (తుమ్మల వెంకట్రామయ్య- స్వాతంత్ర్య పోరాటం)

సంస్కరణలు ప్రవేశపెట్టిన మాంటేగ్‌కు కృతజ్ఞతలు తెలపాలని, వాటి అమలులో ప్రభుత్వంతో సహకరిస్తూ, పూర్తి పార్లమెంటరీ ప్రభుత్వం కొరకు కృషి చేయాలని రాజీ తీర్మానం వివరించింది కాని, యుద్ధంలో గెలవగానే బ్రిటిష్ ప్రభుత్వ వైఖరి మారింది "అన్ని దేశాలకు స్వయం నిర్ణయాధికారం యిస్తాం" అని బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు చేసిన వాగ్దానాలు, అమెరికా అధ్యక్షులు విల్సన్ ప్రకటించిన 14 సూత్రాలు బుట్టదాఖలయ్యాయి

తనకు వ్యతిరేకంగా అభూత కల్పనలు సృష్టించిన చిరాక్‌పైన పరువునష్టం దావా వేసేందుకు తిలక్ 1918 సెప్టెంబరులో లండన్ వెళ్లాడు ఆ అవకాశాన్ని వినియోగించుకుని బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం చేశాడు భారతీయుల రక్తాన్ని సామ్రాజ్యవాదులెలా పీలుస్తున్నారో బ్రిటిష్ ప్రజలకు వివరించాడు

## రౌలట్ యాక్టు

1918 నవంబరులో యుద్ధం ముగిసింది 1919 ఫిబ్రవరి 6న కేంద్ర లెజిస్లేటివ్ కౌన్సిల్లో రౌలట్ బిల్లును ప్రవేశపెట్టారు ఎన్నికైన భారతీయులతోపాటు, నామినేట్ చేయబడిన భారతీయులుకూడా బిల్లును వ్యతిరేకించారు అయినా బిల్లు ప్యాసయింది మార్చి 18న రౌలట్ చట్టం అమల్లోకొచ్చింది పౌర హక్కులను కాలరాయడానికి, విచారణలేకుండానే వ్యక్తులను డిటెయిన్ చేయడానికి, ఇంటర్న్ చేయడానికి మేజిస్ట్రేట్స్‌కు, జడ్జిలకు విశేషాధికారాలు సంక్రమించాయి కాగా ఆ చట్టాన్ని గాంధీజీ వ్యతిరేకించాడు జిన్నా వ్యతిరేకించాడు. జాతీయ నాయకులందరూ వ్యతిరేకించారు "బ్రిటిష్ సామ్రాజ్యం నేడు సైతాన్ తత్వాన్ని ప్రదర్శిస్తోంది దేవుని ప్రేమించేవాడెవడూ సైతానును ప్రేమించలేడు" అన్నాడు గాంధీజీ. ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మున్నగు పత్రికలు రౌలట్ చట్టాన్ని నిశితంగా

విమర్శించాయి (కాని, అదే చట్టాన్ని స్వాతంత్ర్యానికిముందు, తరువాతకూడా కాంగ్రెస్ ప్రభుత్వాలు అమలు జరపడం గమనించదగిన విషయం)

సోవియట్ యూనియన్లో అక్టోబరు విప్లవం సాధించిన విజయం భారత యువకులను ఆకర్షించింది నరేన్‌భట్టాచార్య (ఎం ఎన్ రాయ్) వీరేంద్రనాథ ఛటోపాధ్యాయ, అవని ముఖర్జీ మొదలగువారితోపాటు కొందరు గదర్ వీరులు కూడా మార్క్సిజాన్ని అధ్యయనం చేస్తూ కమ్యూనిస్టులయ్యారు "గాంధీ ఒక బోల్షివిక్కు ప్రమాదకారి" అంటూ బాంబే గవర్నర్ వైస్రాయ్‌కొక లేఖ వ్రాశాడు

దేశంలో అశాంతి ప్రబలింది 1,20,000 మంది కార్మికులు సమ్మె చేశారు దేశమంతటా ప్రదర్శనలు జరిగాయి ప్రభుత్వ దమనకాండకు ప్రతిఘటన ప్రారంభమైంది హిందువులను, ముస్లిమ్‌లను ఏకం జేసేందుకు గాంధీజీ పూనుకున్నాడు "గొంతు లెండిపోయి ఛస్తున్నా ముస్లిమ్‌ల చేతి నీళ్ళు తాగకూడదని సనాతనులు చెపుతారు కాని విదేశాలలో తయారైన వస్త్రాలు ధరిస్తారు బిస్కత్తులు వగైరా తింటారు అదొక బుద్ధిమాలిన పని" అంటూ సనాతనుల నెదిరించాడు కాగా హిందూ-ముస్లిమ్ ప్రజల ఐక్యత పెరిగింది ముస్లిమ్‌ల మంచి నీళ్ళను హిందువులు, హిందువుల మంచినీళ్లు ముస్లింలు తాగారు ఢిల్లీలోని జామా మసీదునుండి స్వామి శ్రద్ధానంద ప్రజలకు సందేశమిచ్చారు

1919 మార్చి 30న ఢిల్లీలో రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు జరిగాయి ప్రదర్శకుల మీద సైనికులు తుపాకులు కాల్చారు అందువల్ల ఐదుగురు మరణించారు అనేకులు గాయపడ్డారు అప్పుడు ప్రదర్శనకు నాయకత్వం వహించిన స్వామి శ్రద్ధానంద బ్రిటిష్ సైనికుల ముందుకు వెళ్ళి "కాల్చండిరా" అంటూ తన ఎదురొమ్ము చూపించాడు బ్రిటిష్ సైనికులు నిర్ఘాంతపడి ప్రదర్శనకు అనుమతించారు

1919 ఏప్రిల్ 6న గాంధీజీ పిలుపు మేరకు ఆంధ్రతోసహా దేశమంతటా ప్రదర్శనలు, హర్తాళ్‌లు జరిగాయి "రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా దేశమంతటా జరిగిన ప్రదర్శనలు అద్భుతం" అన్నాడు గాంధీజీ

డాక్టర్ సత్యపాల్, డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూలను ఏప్రిల్ 9న పంజాబ్ ప్రభుత్వం అరెస్టు చేసింది వారిని విడిచిపెట్టాలని కోరేందుకు అమృతసర్ ప్రజలు ఊరేగింపుగా పోలీస్ కమీషనర్ వద్దకు వెలుతుండగా, సైనికులు తుపాకులు కాల్చారు కొందరు మరణించారు అందువల్ల రెచ్చిపోయిన ప్రజలు నేషనల్ బ్యాంకు మేనేజర్ స్టువార్టును, అసిస్టెంట్ మేనేజర్ స్కాట్‌ను కొట్టి చంపారు. తరువాత మరో ముగ్గురు ఆంగ్లేయులను చంపారు కొన్ని ప్రభుత్వ భవనాలను, ఒక బ్యాంకును, రైల్వే గూడ్సు షెడ్డును పాడుజేశారు

నిషేధాన్ని ధిక్కరించి అమృతసర్‌కు వెళ్లదలచిన గాంధీజీని ఢిల్లీ పోలీసులు అరెస్టుజేసి బాంబేలో విడిచిపెట్టారు. ఈలోగా గాంధీజీ అరెస్టు వార్త విని రెచ్చిపోయిన ప్రజలు అహమ్మదాబాద్‌లో కొందరు ఇంగ్లీషు వాళ్లను చంపారు. కసూర్‌లో టెలిగ్రాఫ్ తీగలు తెంచారు. పోస్టాఫీసును, మునసబు కోర్టును తగులబెట్టారు. ఢిల్లీలోను, బాంబేలోను మరికొన్ని ఘటనలు జరిగాయి వాటిని విని బాధపడుతూ గాంధీజీ బొంబాయిలో ఇలా అన్నాడు

"మనం రాళ్లు విసురుతున్నాం ట్రామ్ కార్లను ఆపుతున్నాం, కొందరు ఇంగ్లీషు పెద్దలమీద దాడి చేస్తున్నాం అది సత్యాగ్రహానికి పెద్దమచ్చ నా దృష్టిలో ఇంగ్లీషు వారుకూడా మన సోదరులే."

తరువాత ఏప్రిల్ 14న గాంధీజీ అహమ్మదాబాద్ వెళ్లి అక్కడ ఉపన్యసించాడు "ఇక్కడ మనం భవనాలను తగులబెట్టాం ఆయుధాలను వశపర్చుకున్నాం డబ్బు గుంజుకున్నాం రైళ్ళను ఆపాం అమాయకులను చంపాం దుకాణాలను, ఇళ్లను దోచుకున్నాం ఇందుకు నేను సిగ్గుతో తలవంచుకుంటున్నాను కత్తితో నన్ను పొడిచినా నాకింత బాధ కలిగేదికాదు సత్యాగ్రహాన్ని గురించి నేను వేసుకున్న అంచనా హిమాలయ పర్వతమంత తప్పుగా కనిపిస్తోంది" అంటూ గాంధీజీ నిరసనోద్యమాన్ని ఆపివేశాడు కాని అప్పటికే అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్ (తోట)లో మానవ మారణ హెూమం జరిగిపోయింది

## జలియన్‌వాలాబాగ్ దురంతాలు

1919 ఏప్రిల్ 13న సిక్కులు సంవత్సరాది పండుగ జరుపుకున్నారు ఆరోజు సాయంత్రం ప్రభుత్వ దమన చర్యలకు వ్యతిరేకంగా అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్ (తోట)లో బహిరంగ సభ జరిగింది 20వేల మంది ప్రజలు సభలో పాల్గొన్నారు సభ ప్రశాంతంగా జరుగుతుండగా జనరల్ డయ్యర్ తన సైనికదళంతోపాటు అక్కడకొచ్చాడు

జలియన్‌వాలాబాగ్‌లోకి వెళ్లడానికి ఒకే ఒక దారి వుంది డయ్యర్ ఆ దారిని ఆక్రమించాడు దారికి దగ్గరలో వున్న మెరకమీద ఓ ఫిరంగిని, కొందరు సైనికులను నిలిపాడు వెంటనే ఎలాంటి హెచ్చరిక లేకుండానే కాల్పులు ప్రారంభించాడు తోటకు మూడువైపులా గోడలున్నాయి నాలుగోవైపున ఇళ్లున్నాయి వాటి మధ్యగా తోటలోకి సన్నని దారి వుంది ఆ దారిలో డయ్యర్ సైనికులు నిలబడి కాల్పులు జరపడంవల్ల, ప్రజలు ఎటువైపుకూ పరిగెత్తలేకపోయారు అందువల్ల అనేకమంది తోట మధ్యలోవున్న బావిలో దూకారు అలా దూకినవారిలో ఎక్కువమంది మరణించారు

సైనికులు 1650 రౌండ్లు కాల్చారు 1516 మంది ప్రజలు చనిపోయారు అనేకమంది గాయపడ్డారు అప్పటికి తూటాలు అయిపోయాయి కాబట్టి కాల్పులు ఆగిపోయాయి "లేకపోతే జనమంతా చచ్చేదాకా కాల్పించేవాడిని భారతీయులకు బుద్ధి చెప్పాలంటే అలా కాల్చి చంపడం అవసరం" అంటూ జనరల్ డయ్యరు మీసాలు మెలివేశాడు

డయ్యర్ దురాగతాలు అంతటితో ఆగలేదు అమృతసర్‌లో నీటి సరఫరాను, విద్యుత్ సరఫరాను ఆపివేశాడు అమాయక ప్రజలను కొరడాలతో కొట్టించాడు మండుటెండలో, కాలుతున్న ఇసుకలో పొట్టమీద పడుకొని పాకవలసిందిగా ప్రజలను నిర్బంధించాడు

గుజరన్‌వాలాలో కల్నల్ ఓబ్రియాన్ చేసిన ఘోరకృత్యాలు డయ్యర్ చర్యలను తలదన్నాయి లాహెూర్‌లో కల్నల్ జాన్సన్, కసూరులో కెప్టెన్ డవుటన్, షేక్‌పురాలో బాస్వర్త్ స్మిత్‌కూడా అనేక ఘోరాలు చేశారు అయినా ఆ కిరాతకులకెలాంటి శిక్ష విధింపబడలేదు కాని అమృతసర్‌లో జరిగిన ఆంగ్లేయుల హత్యలను సాకుగా తీసుకొని, 51 మందికి మరణశిక్ష; 46గురికి యావజ్జీవ ద్వీపాంతర వాసశిక్ష, 79 మందికి ఏడేళ్ల చొప్పున జైలుశిక్ష, మరొక 36గురికి వివిధ రకాల శిక్షలు విధించారు ఇవిగాక మార్షల్‌లా క్రింద 155 మందికి శిక్షలు వేశారు. లాహెూర్, కసూర్, షేక్‌పురాలలోకూడా అనేక మందికి మరణశిక్ష, ద్వీపాంతరవాస శిక్షలు విధించారు

"పంజాబులో నలుగురు ఆంగ్లేయులను హత్యజేస్తే, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం కనీసం 16 వందల మందిని చంపి, మూడువేల ఆరువందల మందిని గాయపరిచింది అనేకులకు ఉరిశిక్షలు, దీపాంతర వాస శిక్షలు విధించింది" అని కాంగ్రెస్ కమిటీ తన రిపోర్టులో వివరించింది

(ఆ ఘోరకృత్యాలను పంజాబ్ గవర్నర్ సర్ మైఖేల్ ఓ డయ్యర్ సమర్థించాడు కాబట్టి పగబట్టిన బాలుడు ఉద్దామసింగ్ పెద్దవాడైన పిమ్మట ఇంగ్లండు వెళ్లి, 1940 మార్చి 13న మైఖేల్ ఓ డయ్యరును రివాల్వరుతో కాల్చిచంపి ప్రాణత్యాగం జేశాడు).

పంజాబ్‌లో ప్రభుత్వం సాగించిన ఘోరదురంతాలకు రవీంద్రుడు చలించి పోయాడు పంజాబులో ప్రవేశించరాదనే నిషేధాజ్ఞను, గాంధీజీతో కలసి ధిక్కరించడానికి సిద్ధపడ్డాడు కాని గాంధీజీ ఒప్పుకోలేదు కలకత్తాలో నిరసన సభను ఏర్పాటుచేస్తే, తాను అధ్యక్షత వహిస్తానని చిత్తరంజన్‌దాసుకు తెలియజేశాడు అందుకు చిత్తరంజన్ దాస్ సిద్ధపడలేదు. కాగా తన 'సర్' బిరుదును వదులుకుంటూ రవీంద్రుడొక ఘాటైన ఉత్తరాన్ని వైస్రాయికి వ్రాశాడు అయినా ఆ వుత్తరాన్ని గురించి కాంగ్రెస్ పట్టించుకోలేదు వైస్రాయి కౌన్సిల్‌నుంచి రాజీనామా చేసిన శంకరన్ నాయరును అభినందించిన కాంగ్రెస్, సర్ బిరుదును విసర్జించిన రవీంద్రుని విస్మరించింది

## గాంధీజీ నాయకత్వం

యుద్ధ కాలంలో భారతదేశ ఆర్థిక పరిస్థితి మరింత దిగజారిపోయింది దేశీయ పెట్టుబడిదారుల లాభాలు గడించినప్పటికీ పరిశ్రమలు పెరగలేదు. ధరలు పెరిగాయి పన్నులు పెరిగాయి యుద్ధనిధి కొరకు ప్రజలను పీల్చిపిప్పిజేశారు 1917లో వచ్చిన ఇన్‌ఫ్లుయంజా జ్వరంవల్ల 60 లక్షలమంది మరణించారు. కొన్ని రాష్ట్రాలలో ప్లేగువ్యాధి ప్రబలమైంది ప్రజల జీవితం అన్ని విధాలా దుర్భరమైపోయింది అలాంటి స్థితిలో గాంధీజీ ప్రజల నాకర్షించాడు

భగవద్గీత, రామాయణం, బైబిల్, ఖురాన్ పఠించిన గాంధీజీ, రఘుపతి రాఘవరాజారాం-ఈశ్వర అల్లాతేరేనాం అంటూ ప్రార్థించాడు "రామ్-రహీమ్ ఏక్‌హై" అని చాటి చెప్పాడు ఎమర్సన్, థోరే, టాల్‌స్టాయిలను ఆదర్శంగా తీసుకొని, అహింసాయుతమైన సత్యాగ్రహ పద్ధతిని రూపొందించాడు దక్షిణాఫ్రికాలో మూడుసార్లు సత్యాగ్రహ పోరాటాలు నడిపి విజయాన్ని సాధించాడు

19వ శతాబ్దం మధ్యలో ఇంగ్లండులో జరిగిన పారిశ్రామికాభివృద్ధిని, కార్‌లైల్, రస్కిన్‌లాంటివారు విమర్శించినట్లే, 20వ శతాబ్దారంభంలో ఇండియాలో విస్తరిస్తున్న రైల్వేలు, మిల్లులు మున్నగువాటిని గాంధీజీ విమర్శించాడు. రస్కిన్ వ్రాసిన "అన్ టు ది లాస్ట్" అన్న గ్రంథం గాంధీజీని ఆకర్షించింది. కాగా 1909లో "హింద్ స్వరాజ్" అనే చిన్న పుస్తకాన్ని ప్రకటించాడు అందులో రైల్వేలను, డాక్టర్లను, లాయర్లను విమర్శించాడు

"భారతదేశం అధోగతిపాలు కావడానికి రైల్వేలు, డాక్టర్లు, లాయర్లు కారణం. రైల్వేలు ప్లేగు వ్యాధిని విస్తరింపజేస్తున్నాయి. ఆహార ధాన్యాలను ఊడ్చి తీసుకుపోయి ఎగుమతి జేస్తున్నాయి కనుక కరువులు పెరిగాయి మరణాలు పెరిగాయి కక్షిదారులను కొట్టుకు తినేందుకు లాయర్లు తగాదాలను పెంచుతున్నారు బ్రిటిష్ న్యాయస్థానాలలో జడ్జీలుగా, మేజిస్ట్రేటులుగా వుంటూ, బ్రిటిష్ పాలనను పదిలంజేస్తున్నారు. అమిత

వ్యయంతో కూడిన పాశ్చాత్య వైద్య పద్ధతులను నేర్చిన డాక్టర్లు ఖరీదైన మందులను వాడుతున్నారు ప్రకృతిసిద్ధమైన దేశీయవైద్య పద్ధతులను నాశనం జేస్తున్నారు కాబట్టి రైల్వేలు, బ్రిటిష్ న్యాయస్థానాలు, హాస్పిటల్సు వుండకూడదు ధనికులు చైతన్యవంతులై, మత ధర్మబద్ధులై, సామాన్య రైతులవలె నిరాడంబరంగా జీవించాలి" అని గాంధీజీ ప్రకటించాడు

టాల్‌స్టాయ్ తన సౌఖ్యాన్ని విసర్జించి పలుగూ పారా పుచ్చుకొని మట్టిపని చేస్తున్నాడని తెలియగానే గాంధీజీ తన సర్వస్వాన్నీ విసర్జించాడు దక్షిణాఫ్రికాలో ఫోనిక్సు ఆశ్రమాన్ని, టాల్‌స్టాయ్ క్షేత్రాన్ని నెలకొల్పి ఆశ్రమజీవితాన్ని అలవరుచుకున్నాడు.

1915లో ఇండియాకు రాగానే సబర్మతీ ఆశ్రమాన్ని స్థాపించాడు. "ధనిక, బీద తారతమ్యముండకూడదు ధనికులు బీదలకు ధర్మకర్తలుగా వుండాలి అందరికీ ఆహారం, వస్త్రం, గృహవసతి కలిగించాలి ఆకాశహర్మ్యాలు, విలాసాలు అవసరం లేదు" అని ప్రకటించాడు అందుకు అంగీకరించినవారినే ఆశ్రమంలో చేర్చుకున్నాడు వారిలో హరిజన దంపతులుకూడా వున్నారు కనుక సనాతనులు గాంధీజీని విమర్శించారు ఆ విమర్శకు జవాబుగా "హరిజనులు దేవుని బిడ్డలు, అస్పృశ్యత సమాజానికొక శాపంవంటిది దానిని రూపుమాపకపోతే, హైందవ సమాజం పురోగమించదు" అని హెచ్చరించాడు ఒక కుష్ఠురోగిని ఆశ్రమంలో చేర్చుకుని, ఆయనకు స్వయంగా సపర్యజేశాడు

ఆశ్రమ జీవితం గడుపుతున్నప్పటికీ గాంధీజీ ప్రజల కష్టనివారణ కొరకు, స్వాతంత్ర్య సాధనకొరకు నిర్విరామ కృషి జేశాడు 1915లో రాజకోట సంస్థానంలో విధించిన కస్టమ్స్ సుంకాలను రద్దు చేయించగలిగాడు

1916లో బెనారస్ హిందూ యూనివర్శిటికి వైస్రాయ్ శంకుస్థాపన జేస్తున్న సమయంలో సభకు విచ్చేసిన సంస్థానాధీశులను జూచి గాంధీజీ ఇలా విమర్శించాడు

"జిగేల్ జిగేల్‌మంటూ కనులకు మిరుమిట్లు గొలిపే మీ ఆభరణాలను ఊడదీసి,పేదల సంక్షేమంకొరకొక నిధిని ఏర్పాటు చేయండి ఇలా ఆభరణాలతో అలంకరించుకొనివస్తేగాని మీ రాజభక్తి వెల్లడికాదా?"

## నీలిమందు రైతుల పోరాటం

బీహార్‌లోని చంపారణ్య జిల్లాలోగల నీలిమందు తోటల యజమానులు యూరోపియనులు ఆ తోటలను సాగు జేసే రైతులను వారు పీక్కుతినేవారు చిన్నకారు పన్నునుండి పెళ్లి పన్ను వరకూ యాభైరకాల పన్నులను రైతులు చెల్లించవలసి వచ్చేది ప్రతి రైతూ, తన స్వాధీనంలోగల భూమిలో, నాలుగింట మూడు వంతుల భూమిని నీలిమందు పంటకు ఉపయోగించి తీరాలనే షరతు వుండేది కనుకనే ఆ పద్ధతికి "తీన్ కరియా" అనే పేరు కలిగింది

రసాయనిక ప్రక్రియద్వారా కృత్రిమ నీలిమందును తయారుజేయడంవల్ల నీలిమందు ధర తగ్గింది పంట పండించిన రైతులు నష్టాల పాలయ్యారు అయినా తోటలు వేయడం, పన్నులు చెల్లించడం తప్పలేదు కాగా నీలిమందు రైతులకు సాయం జేసేందుకు గాంధీజీ 1917 ఏప్రియల్లో మోతిహారీకి వెళ్లాడు అధికారులు జారీ చేసిన నిషేధాజ్ఞలను ధిక్కరించి అరెస్టుగావడమేగాక 'తాను నేరం చేసిన మాట నిజమే'నంటూ కోర్టులో సుదీర్ఘమైన వాఙ్మూలమిచ్చాడు ప్రభుత్వం కేసును ఉపసంహరించుకున్నది

తరువాత గాంధీజీ మజఫర్ ఉల్‌హక్, బ్రజకిశోర్ ప్రసాద్, బాబూ రాజేంద్రప్రసాద్, ఆచార్య కృపలానీ, మహదేవ దేశాయ్ మున్నగు ప్రముఖుల సహాయంతో 20 వేల మంది రైతులనుండి వాఙ్మూలాలు సేకరించి ప్రభుత్వానికి అందజేశాడు కనుక ప్రభుత్వమొక విచారణ కమిటీని నియమించింది ఆ కమిటీ చేసిన సూచనలు చట్టరూపం దాల్చాయి కాగా కౌలురేట్లు తగ్గాయి అదివరకు అక్రమంగా వసూలుచేసిన పన్నులను యూరోపియన్ ఎస్టేటుదారులు తిరిగి రైతులకు యిచ్చివేశారు నిర్బంధంగా నీలిమందు పండించవలసిన పద్ధతి రద్దయింది "నా కృషి తక్కువే ఐక్యంగా నిలబడి సత్యాగ్రహం సాగించిన రైతులవల్ల విజయం సిద్ధించింది" అన్నాడు గాంధీజీ

## ఖేడా జిల్లాలో సత్యాగ్రహం

తరువాత గాంధీజీ ఖేడా జిల్లాలో సత్యాగ్రహం ప్రారంభించాడు "పంటలు పండకపోయినా శిస్తులు గుంజడం అన్యాయం కాబట్టి పన్నుల నిరాకరణకు రైతులు పూనుకోక తప్పదు" అని ప్రభుత్వానికి తెలియజేశాడు ఎన్ని కష్టాలొచ్చినా, శాంతియుతంగా నిలబడేందుకు రైతులు సిద్ధమయ్యారు పేద రైతుల శిస్తులను రద్దుజేస్తే, తాము చెల్లించవలసిన శిస్తులను చెల్లిస్తామని ధనిక రైతుల ముందుకొచ్చారు అయినా ప్రభుత్వం వినిపించుకోకుండా, ఒక రైతు పొలాన్ని జప్తుచేసింది

ఆ పొలంలోనున్న ఉల్లి మడిని పీకి వేయవలసిందిగా గాంధీజీ సలహా యిచ్చాడు కనుక లాల్ పాండ్యా నాయకత్వాన కొందరు రైతులు ఉల్లి మడిని పీకివేసి అరెస్టయ్యారు అహమ్మదాబాద్‌లో బారిస్టరుగానున్న వల్లభభాయ్‌పటేల్, ఇందులాల్ యాజ్ఞిక్ కలసి రైతులకు అండగా నిలబడ్డారు ఏదిఏమైనాసరే లొంగబోమని రైతులంతా శపథం జేశారు. ప్రభుత్వం వెనకడుగువేసి, పేదరైతుల శిస్తులను మాఫీజేసింది "ఖేడా రైతుల సత్యాగ్రహంవల్ల గుజరాత్‌లో సత్యాగ్రహ ఉద్యమం విస్తరించడానికి తగిన వాతావరణ మేర్పడింది" అని గాంధీజీ సంతోషించాడు

## అహమ్మదాబాద్ కార్మికుల సమ్మె

బోనస్ విషయంలో ఏర్పడిన వివాదంవల్ల 1918 మార్చిలో అహమ్మదాబాద్ జౌళి మిల్లుల కార్మికులు సమ్మెకు సిద్ధమయ్యారు అందువల్ల అనసూయాబెన్ సారాబాయ్ గాంధీజీ సలహాను కోరింది గాంధీజీ మధ్యవర్తి పరిష్కారాన్ని సూచించాడు ఈలోగా కార్మికులు సమ్మెజేశారు మిల్లు యజమానులు లాకౌట్ ప్రకటించి మిల్లులు మూసివేశారు కాని 16 రోజుల తరువాత వాటిని తెరిచారు అయినా కార్మికులు పనిలోకి వెళ్లలేదు 50 శాతం వరకూ బోనస్ పెంచాలని పట్టుబట్టారు కాని గాంధీజీ సలహాననుసరించి 30 శాతం పెంపుకు ఒప్పుకున్నారు 20 శాతంకంటే పెంచేది లేదని మిల్లు యజమానులు భీష్మించారు కాబట్టి కార్మికులకు సమ్మె తప్ప మరో మార్గం లేకపోయింది సమ్మెకు నాయకత్వం వహించేందుకు గాంధీజీ క్రింది షరతులు విధించాడు

"ఎట్టి పరిస్థితు లేర్పడినా హింసకు పూనుకోకూడదు బిచ్చమెత్తకూడదు గౌరవ ప్రదమైన పనులు చేసుకుంటూ ఆహారాన్ని సంపాదించుకోవాలి. సమ్మె ఎంతకాలం సాగినా దృఢంగా నిలబడాలి "

ఈ షరతులకు కార్మికులంగీకరించారు. 15 రోజుల వరకూ సమ్మె సక్రమంగా

సాగింది తరువాత వస్తులకు తట్టుకోలేని కార్మికులు కొందరు పనిలోకి వెళ్లేందుకు సిద్ధమయ్యారు దొంగ కార్మికులను చితకబాదేందుకు కొందరు పూనుకున్నారు కాగా హింస ప్రజ్వరిల్లుతుందని గాంధీజీ భయపడ్డాడు "గాంధీ మిల్లు యజమానుల భోజనం తింటూ, వారి కార్లలో తిరుగుతున్నాడు" అనే గుసగుసలు అయనకు వినిపించాయి కనుక "కార్మికుల కోర్కె నెరవేరేంతవరకూ భోజనం చేయను ఏ విధమైన వాహనాన్ని ఉపయోగించను" అని గాంధీజీ ప్రకటించాడు అంటే, ఆమరణ నిరాహారదీక్ష వహించాడన్నమాట

"భారతదేశం కొరకు సర్దుకుపోయి గాంధీ ప్రాణాలు కాపాడండి" అని అనీబిసెంట్ మిల్లు యజమానులకు తంతి వార్త పంపింది ఆ స్థితిలో ఒడంబడికకు రాకపోతే కార్మికులు రెచ్చిపోతారని యజమానులు భయపడ్డారు మధ్యవర్తి తీర్పు ప్రకారం బోనసును 35 శాతం పెంచేందుకు అంగీకరించారు

"కార్మికులు అహింసాయుతంగావున్న మాట నిజమే వారలావుండడం నిజంగా మెచ్చదగినదే అయినా యజమానుల హృదయాలను తమవైపుకు ఆకర్షించలేకపోయారు" అంటూ గాంధీజీ తన అసంతృప్తిని వెల్లడించాడు

అయితే, అది కార్మికుల లోపమా? ఎన్ని సత్యాగ్రహ పోరాటాలు సాగించినా, మరెన్ని దీక్షలు వహించినా సామ్రాజ్య వాదులకు హృదయపరివర్తన కలిగిందా? ప్రపంచ యుద్ధంలో గాంధీజీ చేసిన సహాయానికి ప్రతిఫలం రౌలట్ చట్టమేగదా?

రౌలట్ బిల్లును ఉపసంహరించవలసిందిగా గాంధీజీ చేసిన విజ్ఞప్తిని ప్రభుత్వం త్రోసిపుచ్చింది ఇంపీరియల్ కౌన్సిల్లోని అనధికార సభ్యులందరూ వ్యతిరేకించినా లెక్క చేయకుండా చట్టం చేసింది అటుపైన హృదయ విదారక ఘటనలు జరిగాయి కనుక సహాయ నిరాకరణోద్యమానికి ప్రజల మద్ధతును పొందేందుకు గాంధీజీ దేశవ్యాపితంగా పర్యటించాడు సికింద్రాబాద్, బెజవాడ, మద్రాసు వగైరా చోట్ల ఉపన్యసించాడు

## ఖిలాఫత్ ఉద్యమం

మొదటి ప్రపంచయుద్ధంలో టర్కీ జర్మనీతో కలిసి ఇంగ్లండు ఫ్రాన్సుల మీద తలపడింది ప్రపంచ ముస్లిమ్‌లందరూ గౌరవించే ఖలీఫా (మతపెద్ద)యే టర్కీ పాలకుడు. కనుక ఇండియాలోని ముస్లిములు, ముఖ్యంగా ముస్లిమ్ సిపాయీలు, టర్కీకి అనుకూలంగా తమమీద తిరగబడతారేమోనన్న భయంతో బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని వాగ్దానాలు చేసింది ముస్లిముల పవిత్ర ప్రాంతాలపైన ఖలీఫాకుగల అధికారాన్ని యథాతథంగా వుంచుతామని, యుద్ధ సమయంలో మక్కా, మదీనా మున్నగు ప్రాంతాలపైన దాడి చేయబోమని బ్రిటిష్ ప్రధాని లాయడ్ జార్జి ప్రకటించాడు

కాని, యుద్ధం ముగిసిన పిమ్మట వాగ్దానాల నన్నింటినీ ఉల్లంఘించారు. సిరియా, పాలస్తీనా, మెసపొటేమియాలతో కూడిన 'జజీరత్ ఉల్ అరబ్'ను విభజించి, యుద్ధవిజేతల పెత్తనాన్ని నెలకొల్పుకున్నారు ఖలీఫా హక్కుల నన్నింటినీ రద్దుజేశారు. కనుక ముస్లిములు ఖిలాఫత్ ఉద్యమాన్ని ప్రారంభించారు ఖిలాఫ్ అనే మాటకు అర్థం వ్యతిరేకం కాబట్టి ఖిలాఫత్ ఉద్యమం బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమమనే భావం సామాన్య ప్రజలలో కలిగింది

హిందూ-ముస్లిమ్ ఐక్యత లేనిచో సహాయ నిరాకరణ ఉద్యమం ఫలించదని భావించిన గాంధీజీ 1919 నవంబరులో ఢిల్లీలో జరిగిన ఖిలాఫత్ సమావేశంలో

పాల్గొన్నాడు మౌలానా అబుల్ కలాం ఆజాద్, హకీం అజ్మల్‌ఖాన్, హజరత్ మొహానీల నాయకత్వాన ఖిలాఫత్ కమిటీ ఏర్పడింది ఆ కమిటీవారు హిందూ ముస్లిమ్ నాయకుల సంయుక్త మహాసభను ఏర్పాటు జేశారు ఆ సభకు గాంధీజీ అధ్యక్షత వహించాడు

హైదరాబాద్ స్టేట్‌లో హిందూ-ముస్లిమ్ ఐక్యతను సాధించేందుకు మాడపాటి హనుమంతరావు, డాక్టర్ జయసూర్య, మీర్ మహమ్మద్ హుస్సేన్, అక్బర్ అలీఖాన్ ప్రభృతులు కృషిచేశారు 1920 మే 5న హైదరాబాద్‌లో హర్తాళ్ జరిగింది మే 17న 15వేల మంది హాజరైన బహిరంగ సభలో హిందూ-ముస్లిమ్ నాయకులుపన్యసించారు

1920 జూన్‌లో అలహాబాద్‌లో మరొక ఖిలాఫత్ సభ జరిగింది ఆ సభకు గాంధీజీతోపాటు తేజ్ బహదూర్ సప్రూ, మోతీలాల్ నెహ్రూ, అనీబిసెంటుకూడా హాజరయ్యారు ఖిలాఫత్ కోర్కెలను సమర్థిస్తూ గాంధీజీ ఉపన్యసించాడు కార్యవర్గ సభ్యుడుగా గాంధీని ఎన్నుకున్నారు సహాయ నిరాకరణ ఉద్యమం నాలుగు దశలలో పెంపొందాలని కార్యవర్గం నిర్ణయించింది "మొదటి దశలో బిరుదులను, గౌరవ పదవులను త్యజించాలి రెండవ దశలో సివిల్ సర్వీసు ఉద్యోగులు రాజీనామా లివ్వాలి మూడో దశలో పోలీసులు, సైనికులు రాజీనామా చేయాలి నాలుగోదశలో పన్నుల నిరాకరణను ప్రారంభించాలి" అని తీర్మానించారు

గాంధీజీ తన కైజర్ హింద్ బంగారు పతకాన్ని త్యజించాడు హకీమ్ అజ్మల్‌ఖాన్ తన పతకాలను విసర్జించాడు ముస్లిమ్ పోలీసులు కొందరు రాజీనామా చేశారు ఆలీ సోదరులు, శారదా పీఠాధిపతివంటి ప్రముఖులు అరెస్టయ్యారు. ఆగస్టు 1వ తేదీన సహాయ నిరాకరణోద్యమం ప్రారంభిస్తామని జులై 1వ తేదీన గాంధీజీ వైస్రాయికి తెలియజేశాడు అందుకు జవాబుగా వైస్రాయ్ "బుద్ధిమాలిన పనులన్నింటిలోను మిక్కిలి బుద్ధిమాలిన పని సహాయ నిరాకరణోద్యమం" అని హేళన చేశాడు

1920 ఆగస్టు 1వ తేదీన లోకమాన్య తిలక్ దివంగతుడు కావడం వలన ఉద్యమం వాయిదా పడింది 1920 సెప్టెంబరులో లజపతిరాయ్ అధ్యక్షతన కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశంలో "ఖలీఫాకు జరిగిన అన్యాయాలను సరిదిద్దేవరకూ, పంజాబ్ దురంతాలను విచారించి న్యాయం చేకూర్చేవరకూ, స్వరాజ్యం సిద్ధించేవరకూ అహింసాయుత సహాయ నిరాకరణ ఉద్యమాన్ని క్రమానుగతంగా కొనసాగించాలి" అని తీర్మానించారు తీర్మానానికి అనుకూలంగా 1885 గురు, వ్యతిరేకంగా 883 మంది ఓటు చేశారు కాగా ఖిలాఫత్ సమావేశంలో నిర్ణయించబడిన సహాయ నిరాకరణోద్యమాన్ని కాంగ్రెస్ ఆమోదిస్తుందో లేదోనని గాంధీజీకి కలిగిన అనుమానం తీరిపోయింది

కాని, శాసనసభల బహిష్కరణకు చిత్తరంజన్‌దాస్ వ్యతిరేకి, స్కూళ్ల బహిష్కరణకు లజపతిరాయ్ వ్యతిరేకి జాగ్రత్తగా అడుగు వేయాలనే వాదన బిపిన్‌చంద్రపాల్‌ది కనుక కోర్టులు వగైరాల బహిష్కరణను క్రమక్రమంగా అమలు జరపాలని నిర్ణయించారు అయినా శాసనసభలకు ఎవరూ నిలబడరాదని, ఓట్లు వేయరాదని, నామినేటెడ్ సభ్యులు రాజీనామా యివ్వాలని, ప్రభుత్వ బిరుదులను, గౌరవ పదవులను త్యజించాలని, దర్బార్లకు, సన్మానాలకు హాజరు కాకూడదని నిర్ణయించారు ఈ నిర్ణయాన్ని 9 వందల మంది ముస్లిమ్ మత పెద్దలు బలపరిచారు

# నాగపూర్ కాంగ్రెస్ మహాసభ

1920 డిసెంబర్ 26న నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభకు 14,582 మంది ప్రతినిధులు హాజరయ్యారు వారిలో 1050 మంది ముస్లిములు 169 మంది మహిళలు అందరూ కలిసి కాంగ్రెస్ యొక్క మౌలిక లక్ష్యాన్ని మార్చివేశారు

"సామ్రాజ్యాంతర్గతమైన వలస దేశ స్వపరిపాలన" అనే లక్ష్యానికి మారుగా శాంతియుతంగా, న్యాయసమ్మతమైన సాధనాలద్వారా స్వరాజ్యమును స్థాపించుకోవడమే కాంగ్రెస్ లక్ష్యము" అని తీర్మానించారు కాంగ్రెస్ నియమావళిని మార్చి, గ్రామస్థాయి వరకూ కాంగ్రెస్ కమిటీలను ఏర్పరచేందుకు, భాష ప్రాతిపదికగా రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలను విభజించేందుకు నిర్ణయించారు కాగా జాతీయ కాంగ్రెస్ గ్రామీణులకు చేరువైంది

అప్పటికే గాంధీజీ హెూమ్‌రూల్ లీగ్ అధ్యక్షుడుగా వున్నాడు కనుక కాంగ్రెస్‌లో హెూమ్‌రూల్ లీగ్, ఖిలాఫత్ కమిటీలు చేతులు కలిపాయి "శాంతియుతంగా సహాయ నిరాకరణ సాగిస్తే 1921 డిసెంబరు 31 నాటికి స్వరాజ్యం సిద్ధిస్తుంది" అని గాంధీజీ చెప్పాడు కాబట్టి అహింసలో నమ్మకంలేని విప్లవకారులు సహితం ఉద్యమంలో చేరారు అనేకమంది లాయర్లు కోర్టులను బహిష్కరించారు మూడింట రెండు వంతుల మంది ఓటర్లు ఎన్నికలను బహిష్కరించారు కాగా ఎన్నికల్లో పరప్రభుత్వ విధేయులు నెగ్గగలిగారు



# బెజవాడలో ఎ.ఐ.సి.సి సమావేశం

1921 మార్చి 31, ఏప్రియల్ 1న బెజవాడలో అఖిల భారత కాంగ్రెస్ సంఘ సమావేశం జరిగింది

అప్పటికే గాంధీజీ జాతీయోద్యమానికి ఏకైక నాయకుడయ్యాడు ఆయన జీవనసరళి గ్రామీణ ప్రజల మెప్పు పొందింది ఆయన మాట్లాడిన భాష వారికి సులభంగా అర్థమైంది కాబట్టి, గాంధీ పాటలు పాడుకుంటూ ఎడ్లబండ్లమీద, కాలి నడకన తండోపతండాలుగా సామాన్య ప్రజలు బెజవాడ చేరారు

నేటి గాంధీనగర్ ప్రాంతమంతా ఆనాడు మైదానంగా వుండేది అక్కడ లక్షమంది ప్రజలు జయజయధ్వానాలు చేస్తుండగా గాంధీజీ జాతీయ కాంగ్రెస్ పతాకను ఎగురవేశాడు "హిందువుల ఎడ ఎర్రనై, మహమ్మదీయుల ఎడ పచ్చనై, వివిధ మతములయందు ధవళమై వెలుగునొందెడి జెండా" అంటూ స్వచ్ఛంద సేవకులం పతాకవందనం చేశారు కొందరు "జెండా ఊంఛా రహే హమారా" అంటూ వందనం చేశారు

అంతవరకూ జాతీయ కాంగ్రెస్ సమావేశాలలోకూడా బ్రిటిష్ వారి యూనియన్ జాక్‌నే ఎగురవేసేవారు కాని 1920 డిసెంబర్‌లో జరిగిన నాగపూర్ కాంగ్రెస్ సమావేశంలో "బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత స్వపరిపాలన" అనే కోర్కెను వెలిబుచ్చిన పిమ్మట, భారత జాతీయ పతాక అవసరమైంది కనుక 1907లో జర్మనీలోని స్టుటగార్ట్‌లో మాదాంకామా ఎగురవేసిన పతాకకు మారుగా పింగళి వెంకయ్య రూపొందించిన పతాకను గాంధీజీ అంగీకరించారు

1) లోకమాన్య తిలక్ పేరిట జూన్ 30 నాటికి కోటి రూపాయల స్వరాజ్య నిధిని వసూలు చేయడం 2) కోటి మంది కాంగ్రెస్ సభ్యులను చేర్పించడం 3) ఖద్దరు ఉత్పత్తి కొరకు ఇరవై లక్షల రాట్నాలను ఉపయోగించడం 4) మద్యపాన వ్యతిరేక ప్రచారం 5) హిందీ భాషాభ్యాసం 6) జాతీయ విద్యా సంస్థలను నెలకొల్పడం 7) ప్రజల పంచాయతీ కోర్టులను స్థాపించడం 8) అస్పృశ్యతను నిర్మూలించడం 9) హిందూ - ముస్లిమ్ ఐక్యతకు పాటుబడడం అవసరమన్న తీర్మానాలు అఖిల భారత కాంగ్రెస్ సమావేశంలో అంగీకరించబడినాయి కాని "ఉద్యమ నిర్మాణం, క్రమశిక్షణ తగినంతగా పెంపొందలేదు" అని భావించి, పన్నుల నిరాకరణ సమస్యను వాయిదా వేశారు

## పెల్లుబికిన దేశభక్తి

ఎ ఐ సి సి సమావేశం బ్రహ్మాండంగా విజయవంతంగావడం వల్ల గాంధీజీ ఆంధ్రలో పర్యటించారు మాగంటి బాపినీడుగారి సతీమణి అన్నపూర్ణమ్మ తన నగలను గాంధీజీకి సమర్పించింది యామినీ పూర్ణతిలకం తన నగలను స్వరాజ్య నిధికి యిచ్చివేసి, స్వచ్ఛంద సేవకురాలుగా జాతీయోద్యమంలో ప్రవేశించింది.

ఇలాగే దేశమంతటినుండి వివిధ వర్గాలకు, మతాలకు చెందిన స్త్రీలు-పురుషులు తిలక్ స్వరాజ్య నిధికి విరాళాలు అందజేశారు ఒక్క బొంబాయి నగరంలోనే రూ. 37½ లక్షలు లభించాయి కాబట్టి జూన్ 30 నాటికి కోటి రూపాయలకు మించి వసూలయ్యాయి ఇరవై లక్షల రాట్నాల లక్ష్యంకూడా అధిగమించబడింది

1920 డిసెంబరులో నాగపూర్ కాంగ్రెసులో ఆమోదింపబడిన తీర్మానాలను అనుసరించి చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ ప్రభృతులు అనేకులు తమ న్యాయవాద వృత్తిని విసర్జించారు తమిళనాడులో 36గురు న్యాయవాద వృత్తిని విడిచిపెడితే ఆంధ్రలో 103 మంది విడిచిపెట్టారు అలాగే ఆంధ్రలో ఉపాధ్యాయ వృత్తిని విడిచిపెట్టినవారి సంఖ్య 1921 జూన్ 30 నాటికి 47కు చేరింది ప్రభుత్వ ఉద్యోగాలను విసర్జించిన వారి సంఖ్య 244 వరకూ పెరిగింది గుంటూరు న్యాయవాదులు ఏడాదిపాటు కోర్టులను బహిష్కరించారు

అయ్యదేవర కాళేశ్వరరావు, కానూరు వెంకట చలపతయ్య, కోటగిరి వెంకట కృష్ణారావు, అర్ ఓబులురెడ్డి ప్రభృతులు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఎన్నికల పోటీనుండి ఉపసంహరించుకోగా, కొండా వెంకటప్పయ్య, బి వెంకటపతిరాజు, సి నరసింహరాజు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యత్వాలకు రాజీనామాలిచ్చారు

మద్రాసుకు చెందిన మౌల్వీ జహీర్ హుస్సేన్ సాహెబ్, జమాల్ మొహిద్దీన్ సాహెబ్‌లిద్దరూ తమ బిరుదులను త్యజించగా, ఆంధ్రలో మౌల్వీ మహమ్మద్ రజాసాహెబ్, గులాం మొహిద్దీన్ సాహెబ్, సత్యదేవర రామచంద్రరావు పంతులు, ఏలూరు హనుమంతరావులు తమ గౌరవ మేజిస్ట్రేట్ పదవులకు రాజీనామాలిచ్చారు ఇలాగే దేశమంతటా అనేక వందలమంది తమ పదవులకు రాజీనామా లిచ్చారు అనేకమంది తమ బిరుదులను త్యజించారు

## ఖద్దరు ఉద్యమ ఫలితం

తూర్పుగోదావరి జిల్లాలోని సీతానగరంలో బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారొక ఆశ్రమాన్ని స్థాపించి, ఖద్దరు ప్రచారాన్ని ముమ్మరంగా సాగించారు నెల్లూరు జిల్లా పల్లెపాడులో ఓరుగంటి వెంకట సుబ్బయ్య, తిక్కవరపు రామిరెడ్డి మున్నగువారు మరొక ఆశ్రమాన్ని నెలకొల్పి, దానిని గాంధేయ పద్ధతులలో నిర్వహించారు కొడాలి ఆంజనేయులు "విప్లవ పరివర్తనం" అనే నాటకాన్ని రచించారు దాన్ని ప్రభుత్వం నిషేధించింది అయినా ఖద్దరు ప్రచారం ముమ్మరంగా సాగింది బెజవాడలోని 70 మంది వర్తకులు విదేశీ వస్త్రాలతోపాటు, దేశీయ మిల్లు వస్త్రాల వ్యాపారాన్ని కూడా విడిచిపెట్టగలమని ప్రతిజ్ఞ చేశారు ఇలాగే దేశమందనేక ప్రాంతాలలో ఖద్దరుధారణ వ్యాప్తి చెందింది కాబట్టి తమకుకూడా దెబ్బ తగులుతుందనే భయం బొంబాయి జౌళిమిల్లు యజమానుల్లో మొలకెత్తింది. ఆ భయాన్ని తొలగించేందుకు గాంధీజీ "మిల్లు వస్త్రాలకు తోడుగా ఖాదీ వస్త్రాలను ఉత్పత్తి చేయడమే నా ఉద్దేశ్యం కాబట్టి దేశీయ మిల్లు యజమానులు భయపడవలసిన పనిలేదు" అని యంగ్ ఇండియా పత్రికలో ప్రకటించాడు అందువల్ల దేశీయ మిల్లు యజమానుల భయం తీరింది తగలవలసిన దెబ్బ లాంక్‌షైర్, మాంఛెస్టర్ మిల్లు యజమానులకు తగిలింది వారి అమ్మకాలు సగానికి సగం పడిపోయాయి

## మద్యపాన విసర్జన

1921 నాటికే మద్రాసు రాష్ట్రంలో అనేకులు తాము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలకు చెందిన వారమని చెప్పుకునేందుకు తగిన విధంగా, తమ కులాల పేర్లను మార్చుకుని మాంసాహారాన్ని, మద్యపానాన్ని విసర్జించసాగారు అలాంటి స్థితిలో మద్యపాన వ్యతిరేకోద్యమం ప్రారంభమైంది

ఆంధ్రలో కల్లూరి సుబ్బారావు, బి చంద్రశేఖరరెడ్డి, తిక్కవరపు రామిరెడ్డి, వెన్నెలకంటి రాఘవయ్య, పొణకా కనకమ్మ, గౌస్ బేగ్, సర్వేశ్వర శాస్త్రి, కొండా వెంకటప్పయ్య మొదలగువారి కృషివల్ల అనేకచోట్ల కల్లుపాటలు ఆగిపోయాయి రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం బాగా తగ్గిపోయింది (మద్రాసు ప్రభుత్వ ఆదాయంలో నూటికి ఇరవై వంతుల వరకూ కల్లు, సారా పాటలవల్ల లభించేది)

మద్యపాన వ్యతిరేక కార్యక్రమాలలో ఖిలాఫత్ ఉద్యమ నాయకులు చురుకుగా పాల్గొనడంవల్ల ఇతర రాష్ట్రాలలో కూడా ఎక్సైజ్ ఆదాయం తగ్గింది విదేశీమద్యం అమ్మకాలు తగ్గిపోయాయి కాబట్టి ప్రభుత్వం కళ్ళెర్రజేస్తూ సహాయం కొరకు ఎదురు చూడసాగింది

## విద్యాలయాల బహిష్కరణ

"చదువు కొన్నాళ్లు ఆగుతుంది కాని స్వరాజ్యం ఆగకూడదు" అంటూ అనేకమంది విద్యార్థులు ప్రభుత్వ స్కూళ్లను, కాలేజీలను బహిష్కరించారు ఆంధ్రలో కళా వెంకటరావు, మానికొండ సత్యనారాయణ, బొమ్మా శేషురెడ్డి, కామినేని వెంకటప్పయ్య, వెన్నెలకంటి రాఘవయ్య, పాతూరి సుబ్బరామయ్య మున్నగు 116గురు విద్యార్థులు ఇంగ్లీష్ చదువులకు స్వస్తి చెప్పారు

ఇంగ్లీషు విద్యా సంస్థలను జాతీయ విద్యా సంస్థలుగా మార్చాలని కోరుతూ విజయనగరంలో మహారాజా కాలేజీ విద్యార్థులు కూడా సమ్మె చేశారు

ఈ ఉద్యమ ఫలితంగా 1921 జులై నాటికి ఆంధ్రలో 44 జాతీయ విద్యా సంస్థలు అవతరించాయి బీహార్, ఒరిస్సాలలో 442, బెంగాల్లో 190, బొంబాయి రాష్ట్రంలో 189, ఉత్తరప్రదేశ్‌లో 137 జాతీయ విద్యాలయాలు స్థాపించబడగా, ఇతర రాష్ట్రాలలోకూడా మరికొన్ని స్థాపించబడినాయి ఢిల్లీలో "జమియామిల్లియా ఇస్లామియా", బెనారస్‌లో "కాశీవిద్యాపీఠ్", గుజరాత్‌లో మరొక విద్యాపీఠ్ నెలకొల్పబడినాయి

"మద్యపానం మానండి అస్పృశ్యతను రూపుమాపండి, పంచశీలను పాటించండి. పురుషులతోపాటు స్త్రీలకుకూడా సమాన హక్కులుండాలి" అంటూ గాంధీజీ చేసిన ప్రచారం, హిందూ-ముస్లిమ్ ఐక్యత కొరకు ఆయన తీసుకున్న చొరవ, అశేష ప్రజానీకాన్ని ఆకర్షించాయి హిందీని జాతీయభాషగా గుర్తించడం, తులసీ రామాయణంలోనుండి ఉదాహరణలివ్వడంవల్ల, ఉత్తర భారతంలోని సనాతన హిందువులు సహితం ఆయనకు చేరువయ్యారు అందరూ ఆయనను మహాత్ముడన్నారు "బాపూజీ" అంటూ కొనియాడారు కాగా 1921 జూన్ 30 నాటికి సహాయ నిరాకరణోద్యమం బాగా బలపడింది కాని ఆయన వర్గ సామరస్యానికి అనుకూలుడు, వర్గ పోరాటాలకు వ్యతిరేకి కావడంవల్ల కొన్ని సమస్యలు పుట్టుకొచ్చాయి

1921 జూన్ 30 నాటికి రకరకాల పోరాటాలు చెలరేగాయి ఖలీఫాకు ద్రోహం జేసిన బ్రిటిష్‌వారి పాలనలో బ్రతకడం పాపహేతువనే నమ్మకంతో బెంగాల్, సింధు, సరిహద్దు రాష్ట్రాలకు చెందిన ఇరవైవేలమంది ముస్లిం యువకులు ఆఫ్ఘనిస్తాన్‌కు వెళ్లిపోయారు అక్కడనుండి అమీర్ అమానుల్లాద్వారా సోవియట్ రష్యాతో సంబంధాలు పెట్టుకునేందుకు పూనుకున్నారు

ఇస్లామును కాపాడేందుకు "మహదీ" అవతరించే సమయం ఆసన్నమైందని జఫర్

అలీఖాన్ ప్రచారం ప్రారంభించాడు కాగా ఆయన ఐదు సంవత్సరాల ప్రవాస శిక్ష అనుభవించవలసి వచ్చింది ఖిలాఫ్ అనగా "వ్యతిరేకం" అని అర్థం కాబట్టి తమ మత పెద్దలందరూ తిరుగుబాటును ప్రారంభించారనే నమ్మకంతో ఉత్తరప్రదేశ్‌లోని ముస్లిమ్ రైతులు ప్రభుత్వానికి శిస్తులు చెల్లించడం మానివేశారు మలబార్‌లోని ముస్లిమ్ రైతులు జమీందార్ల (జన్మీల) మీద తిరగబడ్డారు

రాజస్థాన్‌లోని "బిజోలియా" ప్రాంతంలో విజయ్‌సింగ్ పధక్, మణిక్‌లాల్ వర్మల నాయకత్వాన రైతులు జాగీర్దార్లమీద తిరుగుబాటు చేశారు ఉదయ్‌పూర్ మహారాణాకు ఎదురుతిరిగిన రైతులను గణేష్ శంకర్ విద్యార్థి (యు పి కాంగ్రెస్ నాయకుడు) సమర్థించాడు మార్వార్‌లో జయ నారాయణ్ వ్యాస్ నాయకత్వాన పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభమైంది మోతీలాల్ తేజావత్, గిరిజన దుస్తులు ధరించి గాంధీ అనుచరుడనని చెప్పుకుంటూ మేవార్‌లో భిల్లులను సమీకరించాడు

బీహార్‌లోని దర్భాంగా ఎస్టేటులో స్వామి విద్యానంద్ అనుచరులైన ఐదుగురు రైతులు స్టేట్ కౌన్సిలుకు ఎన్నికయ్యారు జమీందారు నిలబెట్టినవాళ్లు ఓడిపోయారు

కొంతకాలంపాటు ఫిజీదీవుల్లో కూలీగా పనిజేసిన బాబా రామచంద్ర ఉత్తరప్రదేశ్‌కు తిరిగి వచ్చిన పిమ్మట సన్యాసిగా మారాడు తులసీ రామాయణం పఠిస్తూ, ప్రతాప్‌గర్ జిల్లాలో కిసాన్ సభను స్థాపించాడు తరువాత "కూర్మి-క్షత్రియ సభ"ను కూడా ప్రారంభించాడు దుర్మార్గులైన జమీందార్లను సంఘ బహిష్కరణకు గురిచేశాడు జవహర్‌లాల్ నెహ్రూతో సంబంధాలు పెట్టుకున్నాడు నెహ్రూతోను, గౌరీశంకర్ మిశ్రాతోను కలసి ప్రతాపగర్, రాయ్‌బరేలీ, సుల్తాన్‌పూర్, ఫైజాబాద్ జిల్లాలలో బలమైన రైతు సంఘాలను నిర్మించాడు

ఇలాంటి రైతు ఉద్యమ పోరాటాలు యితర రాష్ట్రాలలోకూడా ప్రారంభమయ్యాయి బొంబే, కలకత్తా, మద్రాసులాంటి పారిశ్రామిక కేంద్రాలలో కార్మిక సమ్మెలు జరిగాయి

## ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఆవిర్భావం

యుద్ధకాలంలోను, అటు తరువాతను పెరిగిన అవసర వస్తువుల ధరలకు తగినట్లుగా జీతాలు పెరగనందున వేలాది కార్మికుల జీవితం దుర్భరమైంది అందువల్ల 1920లో అనేక సమ్మెలు జరిగాయి జమాల్‌పూరులో 16వేల మంది రైల్వే వర్కర్లు మాసం రోజులపాటు సమ్మె చేశారు కలకత్తాలో 35 వేల మంది జూట్ మిల్లు కార్మికులు పదిరోజులు సమ్మెచేశారు బొంబేలో రెండు లక్షలమంది కార్మికులు నెల రోజులపాటు సమ్మెచేశారు షోలాపూర్‌లో 16వేల మంది, టాటా ఐరన్ అండ్ స్టీల్ వర్సులో 40వేల మంది, మద్రాసులో 17 వేలమంది, అహమ్మదాబాద్‌లో 25 వేల మంది కార్మికులు సమ్మెచేశారు అలాగే మరికొన్ని సమ్మెలుకూడా జరిగాయి వాటికి ఎన్ ఎం జోషి, బాప్టిస్టా, వాడియా, హల్దార్, హేమంతకుమార్ సర్కార్, మృణాల్ కాంతిబసు, స్వామి దర్శనానంద్, స్వామి విశ్వానంద్‌వంటివారు నాయకత్వం వహించారు. అనేక కార్మిక యూనియన్లు అసోసియేషన్లు పనిచేయనారంభించాయి

1920 అక్టోబరు 31వ తేదీన లాలాలజపతిరాయ్ అధ్యక్షతన ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఆవిర్భవించింది ఆ కాంగ్రెస్‌కు మోతీలాల్ నెహ్రూ, విఠల్‌భాయ్ పటేల్, అనీబిసెంట్, జిన్నా ప్రభృతులు హాజరయ్యారు గాంధీజీ హాజరుకాలేదు సరికదా

సందేశంకూడా పంపలేదు దివాన్ చమన్‌లాల్, బాప్టిస్టా మొదలైన నాయకుల ప్రసంగాలలో "కార్మికులు-యజమానులు భాగస్వాములు అంతేగాని, శ్రమశక్తిని అమ్ముకునేవారు-కొనుక్కునేవారు కాదు" అనే ధోరణి ప్రస్ఫుటంగా వ్యక్తమయింది ఆ ధోరణి ఎస్ ఎ డాంగే, సింగార వేలు చెట్టియార్ వంటి కార్మిక నాయకులకు రుచించలేదు కార్మికులు రాజకీయ సమ్మెలకుకూడా పూనుకోవాలని వారు వాదించారు అవసరం కొద్దీ కార్మికులు సమ్మెలమీద సమ్మెలు ప్రారంభించారు కాగా గాంధీజీ యంగ్ ఇండియా పత్రికలో ఇలా వ్రాశాడు

"ఇండియాలో రాజకీయ సమ్మెలను మనం కోరకూడదు విచ్చలవిడిగా సంచరిస్తూ, అల్లరులు సృష్టించే శక్తులపైన మనం పూర్తి కంట్రోల్‌ను సాధించాలి శ్రమశక్తికి, పెట్టుబడికి మధ్యగల సంబంధాన్ని క్రమబద్ధం చేయడమే మన కోరిక అంతేగాని పెట్టుబడినిగాని, పెట్టుబడిదారులనుగాని నాశనం చేయడం కాదు పెట్టుబడిని మనవైపుకు రాబట్టుకోవాలని మనం కోరుకుంటున్నాం కాబట్టి, సానుభూతి సమ్మెలను ప్రోత్సహించడం అవివేకమవుతుంది." (యంగ్ ఇండియా- 15 జూన్, 1921)

అందువల్ల డాంగే, నింబకర్, నాదకర్ణి మొదలగు యువకులు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొంటూనే, మార్క్సిజాన్ని అధ్యయనం చేశారు అహింస నౌక ఎత్తుగడగా ఉపయోగించినప్పటికీ, పన్నుల నిరాకరణకు, రాజకీయ సమ్మెలకు పూనుకోవాలన్నారు "మనం గెలిస్తే కార్మిక, కర్షక పోరాటాలవల్లనే గెలుస్తాం కాబట్టి పరిశ్రమలను జాతీయం చేసి, జమీందార్ల భూములను పంచగల స్వరాజ్యాన్ని మనం కోరుకోవాలి" అని డాంగే ప్రకటించాడు

## విదేశీ వస్త్ర దహనం

1921 జులై 28-30 తేదీలలో బొంబేలో జరిగిన ఎ ఐ సి సి సమావేశంలో విదేశీ వస్త్ర బహిష్కరణతోపాటు ప్రిన్సు అఫ్ వేల్సు పర్యటననుకూడా బహిష్కరించుటకు తీర్మానించారు కాని పన్నుల నిరాకరణను మరొకమారు వాయిదా వేశారు

స్వచ్ఛందంగా జైళ్ళకు వెళ్ళే దళాల నిర్మాణం ప్రారంభమైంది "వధ్యశాలలకు వెళ్ళే మేకలవలె జైళ్లకు వెళ్లే వేలాది స్వచ్ఛంద సేవకులపైన మన విజయం ఆధారపడి వుంది" అని గాంధీజీ ప్రబోధించాడు

వేలాది స్వచ్ఛంద సేవకులు దళాలుగా ఏర్పడ్డారు ఖద్దరు యూనిఫారాలు ధరించి డ్రిల్లు చేశారు శాంతియుతంగా విదేశీ వస్త్ర బహిష్కరణకు పూనుకున్నారు కొన్నిచోట్ల వాటిని తగలబెట్టారు కాగా ప్రభుత్వం వలంటీరు దళాలను నిషేధించి, మూక ఉమ్మడిగా వారిని జైళ్లకు నెట్టింది అరెస్టు అయినవారి స్థానంలో విద్యార్థులు, కార్మికులు నిలబడ్డారు. వారూ అరెస్టయ్యారు అలా 1921 సంవత్సరం ముగిసేలోగా కనీసం 30వేల మంది జైలు శిక్షలను అనుభవించారు

జులై 31న బొంబాయిలో విదేశీ వస్త్ర దహనం పెద్ద ఎత్తున జరిగింది 1920 మేనెల వరకూ బ్రిటిష్ వస్తువులను బహిష్కరించడానికి నిరాకరించిన గాంధీజీ స్వయంగా లాంక్‌షైర్ మిల్లు బట్టలకు నిప్పంటించాడు దేశమంతటా విదేశీ వస్త్రదహనం ప్రారంభమైంది కాగా వస్త్ర దహన కార్యక్రమాన్ని వ్యతిరేకిస్తూ రవీంద్రుడిలా ప్రకటించాడు

"ఒక ప్రక్క భారతదేశం నగ్నంగా వణుకుతూ సిగ్గుపడుతుంటే వస్త్రాలను తగలబెట్టడాన్ని గురించి ఆలోచించండి. ఆర్థిక విషయాలను బయటకు నెట్టి, కృత్రిమ

నైతిక అజ్ఞలను ప్రవేశపెట్టారు భ్రమలు, మాయలతోకూడిన బానిస మనస్తత్వాన్ని మనం ఆసరాగా తీసుకోకూడదు" అని టాగోర్ నిరసించారు "నేను మాజిక్‌ను నమ్మను లాజిక్ (తర్కము)నే నమ్ముతాను" అని బిపిన్ చంద్రపాల్ ప్రకటించాడు

అందుకు జవాబుగా "నా విదేశీ వస్త్రాలను తగల బెట్టడంద్వారా, నా అవమానాన్ని దగ్ధం చేస్తున్నాను" అన్నాడు గాంధీజీ

## ప్రిన్స్ ఆఫ్ వేల్సు బహిష్కరణ

వేల్సు యువరాజు బహిష్కరణను ఆపివేస్తే, వలంటీరు దళాలపై నిషేధం తొలగిస్తామని, రాజకీయ ఖైదీలను విడుదల చేస్తామని ప్రభుత్వం తెలిపింది. ఇతర సమస్యలను, రౌండు టేబిల్ సమావేశంలో చర్చించవచ్చుననికూడా తెలియజేసింది అందుకు అంగీకరించవలసిందిగా మౌలానా అజాద్, చిత్తరంజన్‌దాసులు గాంధీజీని కోరారు అయినా "రౌండ్ టేబుల్ సమావేశం జరిగి ఫలితం కనిపిస్తే తప్ప ఉద్యమాన్ని ఆపేది లేదని" గాంధీ స్పష్టం చేశారు

1921 నవంబర్ 17న వేల్సు యువరాజు బొంబాయిలో కాలు పెట్టగానే దేశమంతటా హర్తాళ్ జరిగింది

"కలకత్తా వీధులు కాంగ్రెస్ వలంటీర్ల స్వాధీనమయ్యాయి ప్రభుత్వం పదవీత్యాగం చేసినట్లు కనబడుతోంది" అని స్టేట్సుమన్ పత్రిక గోలబెట్టింది

బాంబే భవనాలపై నల్లజెండాలు ఎగిరాయి ఫ్యాక్టరీలను విడిచిపెట్టి కార్మికులు రోడ్లమీది కొచ్చారు రాజభక్తులకు-వ్యతిరేకులకు మధ్య కొన్ని చోట్ల కొట్లాటలు జరిగాయి రెచ్చిపోయిన ప్రజలు రైళ్లను, ట్రాములను ఆపివేశారు కొన్ని ట్రాములను, కార్లను, మరికొన్ని సారా దుకాణాలను తగలబెట్టారు విదేశీ టోపీలను తీసివేసి, గాంధీ టోపీలు పెట్టుకోవలసిందిగా అంగ్లో ఇండియన్లను బలవంతపెట్టారు తిరస్కరించినవారిని కొట్టారు. ఆ స్థితిలో కొందరు పార్శీ స్త్రీలకు సహితం దెబ్బలు తగిలాయి మొత్తంమీద 53గురు చనిపోయారు. నాలుగు వందలమంది గాయపడ్డారు ఇలాగే మద్రాసులోకూడా కొన్ని ఘటనలు జరిగాయి

ఆ ఘటనలు గాంధీజీని కలచి వేశాయి "నా హృదయం వ్రయ్యలవుతోంది స్వరాజ్య నినాదం కంపుకొడుతోంది" అంటూ గాంధీజీ నిరాహార వ్రతం పూని, వివిధ మతాల వారి మధ్య సామరస్యాన్ని సాధించాడు

## వైస్రాయికి హెచ్చరిక

1921 నవంబర్ 14న ఢిల్లీలో సమావేశమైన ఆలిండియా కాంగ్రెస్ కమిటీ చేసిన పన్నుల నిరాకరణ తీర్మానాన్ని, శాసనోల్లంఘన తీర్మానాన్ని పురస్కరించుకుని గాంధీజీ ఇలా ప్రకటించాడు·

"ప్రజల అభీష్టానికి ప్రభుత్వం తల ఒగ్గాలని మేం కోరుతున్నాం సహాయ నిరాకరణ వాదులు ప్రభుత్వంతో యుద్ధం చేస్తున్నారన్న విషయాన్ని వైస్రాయి గ్రహించాలి "

ఈ ప్రకటనను వలంటీర్లు ప్రజలకు పంచిపెట్టారు అనేకచోట్ల పన్నుల నిరాకరణ, శాసనోల్లంఘనం ప్రారంభమయ్యాయి కాని 1921 డిసెంబరు ఆఖరున అహమ్మదాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ పన్నుల నిరాకరణ ఉద్యమానికి తూట్లు పొడిచింది

మహాసభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన చిత్తరంజన్‌దాస్ జైల్లో వున్నందున, హకీమ్ అజ్మల్‌ఖాన్ అధ్యక్షతన మహాసభ జరిగింది "18 ఏళ్లకు పైబడిన వారంతా వలంటీరు దళాలలో చేరి శాసనోల్లంఘనం చేయాలి స్వరాజ్యం సిద్ధించే వరకూ అహింసాయుత సహాయ నిరాకరణ ఉద్యమం సాగించాలి ఉద్యమానికి గాంధీజీ నాయకత్వం వహించి నడపాలి" అని తీర్మానించారు హజరత్ మొహాని ప్రతిపాదించిన "సంపూర్ణ స్వాతంత్ర్య" సవరణను త్రోసిపుచ్చారు అహింసాయుత మార్గాన్ని విడిచిపెట్టాలని ఖిలాఫత్ ఉద్యమంలోని అతివాదులు చేసిన సూచనను కూడా కాంగ్రెస్ మహాసభ వారు తిరస్కరించారు పన్నుల నిరాకరణ విషయం గాంధీకి వదిలేశారు

"శాసనోల్లంఘనకు సిద్ధంగా వున్నచోట్ల, పన్నుల నిరాకరణ ప్రారంభించవచ్చు" అని 1921 నవంబరు 4న ఎ ఐ సి సి చేసిన తీర్మానానికి బ్రేకులు పడ్డాయి కాబట్టి గాంధీజీ అనుమతి లేకపోతే పన్నుల నిరాకరణ ప్రారంభించకూడదు

అయినా 1921 నవంబర్, 1922 ఫిబ్రవరి మధ్య కాలంలో దేశమంతటా పోరాటాలు చెలరేగాయి సైన్యంలోనున్న ముస్లిములు రాజీనామాలివ్వాలని ఖిలాఫత్ కాన్ఫరెన్సు కోరింది గురుద్వారాలను స్వాధీనం చేసుకునేందుకు సిక్కులు ప్రారంభించిన పోరాటం ఉధృతమైంది సామూహిక నిర్బంధాలు, నిషేధాలు అమలు జరుపుతూ ప్రభుత్వం సాగించిన దమనకాండవల్ల మితవాదులుకూడా ప్రభుత్వాన్ని విమర్శించసాగారు కాగా హిందువులు, ముస్లింలు, సిక్కులు ఏకమై తిరగబడే సమయం ఆసన్నమైందని వైస్రాయి రీడింగ్ భయపడ్డాడు. మాంటేగ్-చేమ్సుఫర్డు సంస్కరణలను గురించి చర్చించేందుకు రౌండ్ టేబుల్ సమావేశాన్ని ఏర్పాటు చేయడం అవసరమని ఇంగ్లాండుకు టెలిగ్రాము లిచ్చాడు "రౌండ్ టేబుల్ సభ జరుపవచ్చు, కాని ఫలితం కనుపించేంతవరకూ మా ఉద్యమాన్ని ఆపేందుకు వీలులేదు" అని గాంధీజీ భీష్మించడంవల్ల రాజీ ప్రయత్నాలు మరొకమారు ఆగిపోయాయి

## సిక్కుల విజయం

స్వార్థపరులైన బ్రిటిష్‌వాళ్లతో చేతులు కలిపిన గురువులను తొలగించి, సిక్కు గురుద్వారాలపైన అజమాయిషీని సంపాదించేందుకు అకాలీలు ప్రారంభించిన ఉద్యమం 1921 ఫిబ్రవరిలో ప్రబలమైంది ఫిబ్రవరి 20వ తేదీన, నాన్‌కానా గురుద్వారాలో మహంతి నూరుమంది అకాలీలను దారుణంగా హత్య చేయించాడు ఈ హత్యల వెనుక లాహెూర్ జిల్లా కమిషనర్ హస్తమున్నదని తెలుసుకున్న సిక్కులు ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని ఉధృతం చేశారు. 1921 డిసెంబరు నాటికి 16వేల మంది అరెస్టయ్యారు శిరోమణి గురుద్వారా ప్రబంధక కమిటీ ఖచ్చితంగా అహింసాయుత పోరాట పద్ధతులను అవలంబించింది అయినా, మౌనంగా ప్రదర్శనలు జరిపే సిక్కులను స్పృహ తప్పిపోయేటట్లు బ్రిటిష్ పోలీసులు కొట్టేవారు యుద్ధ రంగంనుండి వచ్చిన సిక్కు వీరులుకూడా ప్రదర్శనల్లో పాల్గొని లాఠీ దెబ్బలకు గురయ్యేవారు అయినా ఎవరూ తిరగబడేవారు కాదు ప్రతిఘటనా రహితంగా, నిశ్చలంగా నిలబడి దెబ్బలు తినేవారు కనుక "జీసస్ క్రీస్తు శిలువనెక్కడం జ్ఞాపకం వచ్చింది" అన్నాడు సి ఎఫ్.అండ్రూస్ కాంగ్రెస్, ఖిలాఫత్, సిక్కు ఉద్యమాల ఐక్యతను చూచి వైస్రాయి భయపడ్డాడు కాగా 1922 జనవరిలో ప్రభుత్వం దిగొచ్చింది గోల్డెన్ టెంపుల్ తాళాలను ఎస్ జి పి సి కి యిచ్చివేసింది. అరెస్టు చేసినవారినందరినీ విడుదల చేసింది

# మాప్లా తిరుగుబాటు

ఖిలాఫత్ ఉద్యమ ప్రభావం మలబారులోని మాప్లాలపై బాగా ప్రసరించింది 1919-1920 ప్రాంతంలో నారాయణ మీనన్ నాయకత్వాన నడిచిన రైతు ఉద్యమంగాని, శంకరన్ నాయర్ నడిపిన రైతు ఉద్యమంగాని, కౌలుదార్లుగానున్న మాప్లాల పరిస్థితిని మెరుగుపర్చలేదు 1920లో మంజేరి అనేచోట జరిగిన ఖిలాఫత్ మహాసభ మాప్లాలను తిరుగుబాటుకు పురికొల్పింది మాప్లాలు ముస్లిములు, ఖలీఫ్ అంటే తిరుగుబాటు కాబట్టి ప్రభుత్వంమీద జమీందార్లమీద తిరగబడ్డారు 1921 ఫిబ్రవరిలో మాధవన్ నాయర్, గోపాల మీనన్, యాకూబ్ హసన్, మొయిదీన్ కోయా మున్నగు కాంగ్రెస్ ఖిలాఫత్ నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసిన పిమ్మట, కున్హమ్మద్ హాజీ, సీతికోయా తంగల్, ఇమ్బిచ్చి కోయా తంగళ్‌వంటి వారికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి వీరు తమకు తామే రాజులుగా, మత గురువులుగా, గవర్నర్లుగా ప్రకటించుకొని, నాలుగైదు మాసాలపాటు తమ ఇష్టం వచ్చినట్లు చలాయించారు జన్మీల ఇళ్లను, పోలీసు ఇళ్లను, పోలీసుస్టేషన్లను, ప్రభుత్వ ఆఫీసులను తగలబెట్టారు.

1921 నవంబర్ నెలాఖరు నాటికి మాప్లా తిరుగుబాటు అణచివేయబడింది ప్రభుత్వ సైనికులతో జరిగిన గెరిల్లా పోరాటాలలో 2337 మంది తిరుగుబాటుదారులు మరణించారు ప్రభుత్వం రెండు వందల మందిని ఉరితీసింది 45,404 గురిని జైళ్ళలో కుక్కింది మలబారు వెళ్లదలచిన గాంధీజీని, ఆలీ సోదరులను నిర్బంధించింది

తిరూర్‌నుండి బళ్లారి జైలుకు పంపేందుకు 127 మంది మాప్లా ఖైదీలను 12 అడుగుల పొడవు, 9 అడుగుల వెడల్పుగల గూడ్సు వాగనులో ఎక్కించారు నీరులేక, తిండిలేక, చివరకు గాలి సహితం లేనందున ఊపిరాడక 56గురు చనిపోయారు

సైనికులు మాప్లా స్త్రీలను అవమానించారు ఇళ్లను దోచుకుని తగలబెట్టారు తిరుగుబాటుదార్లను చెట్లకొమ్మలకు కట్టి ఉరిదీసి, కొన్నాళ్లపాటు శవాలను అలాగే వుంచారు అయినా "పంజాబ్‌లో హిందువులు, ముస్లిములు, సిక్కులు ఏకమైనట్లుగా మలబారులో ముస్లిములు, హిందువులు ఏకం కాలేదని" ప్రభుత్వం మురిసిపోయింది

కొందరు మాప్లాలుకూడా అత్యాచారాలకు ఒడిగట్టారు "ఆరువందలమంది హిందువులను చంపారని, 2500 మందిని బలవంతంగా మతం మార్పించి ఇస్లామ్‌లో చేర్చా"రని ఆర్యసమాజంవారు ప్రకటించారు మాప్లా తిరుగుబాటును ఆపనందుకు గాంధీజీని "గాంధీ-అరాచకం" అనే పుస్తకంలో శంకరన్ నాయర్ నిశితంగా విమర్శించారు

కాని రైతు నాయకుడుగా, కాంగ్రెస్ నాయకుడుగా ప్రజల మన్ననపొంది యావజ్జీవ శిక్షననుభవించిన నారాయణ మీనన్ ఆర్యసమాజం వారి ఆరోపణలను ఖండించాడు మతపరమైన ఉద్దేశాలతో మాప్లాలు హిందువులమీద దాడి చేయలేదన్నాడు "అలాంటి సంఘటన జరిగితే దానికి బాధ్యులైన వారిని మాప్లా నాయకులు శిక్షించారని హిందువుల ఆస్తులు దోచుకున్నవారి చేతులను ఖండించారని" కొందరు పత్రికా విలేకరులు వ్రాశారు

"తిరుగుబాటుదారుల చేతుల్లో ధనికులు, భూస్వాములు మాత్రమే బాధపడు తున్నారు బీద రైతులు బాధపడడంలేదు" అని మలబారు బ్రాహ్మణుల పత్రిక 'యోగక్షేమ' వ్రాసింది

"తిరుగుబాటుదార్లను అప్రతిష్టపాలు చేయడానికి ప్రభుత్వమే హిందువుల ఇళ్లపైన,

దేవాలయాలపైన దాడులు జరిపింది" అంటూ హిందూ పత్రికలో ఒక లేఖ వెలువడింది

"మాప్లా ఖైదీల మొదటి జట్టులో ముగ్గురు నాయర్లు, మరొక నంబూద్రి బ్రాహ్మణుడు వున్నారు" అని కోయంబత్తూరు జిల్లా జడ్జి రికార్డు చేశారు

కాబట్టి, కొన్ని అత్యాచారాలు జరిపినందుకు మాప్లాలను విమర్శించిన జాతీయ కాంగ్రెస్ ప్రభుత్వ దమనకాండను ఘాతుక చర్యలను ఖండించింది

తిరుగుబాటు గురించి, ఇ ఎం ఎస్ నంబూద్రిపాద్ ఇలా వ్రాశాడు

"రైతు వర్గం ఉద్యమంలోకి వచ్చిన పిమ్మట తన నిర్మాణ పోరాట రూపాలను తానే నిర్ణయించుకుంటుంది మలబారు తిరుగుబాటులో ఇది చాలా స్పష్టంగా కనిపించింది భూస్వాముల రికార్డులు తగులబెట్టడం, రిజిస్ట్రారు ఆఫీసులను తగలబెట్టడం, ప్రభుత్వ కార్యాలయాలమీద దాడి చేయడం, పోలీసుల తుపాకులు లాక్కోవడం, ప్రజా కోర్టులు ప్రారంభించడం, ప్రభుత్వ ఖజానాల్లోని ధనాన్ని, భుస్వాముల గాదెల్లోని ధాన్యాన్ని పంచుకోవడంలాంటి చర్యలు మలబారులో జరిగాయి అవన్నీ రైతాంగం తిరుగుబాటు చేసినప్పుడు కనిపించే పోరాట రూపాలే" (నంబూద్రిపాద్ మహాత్ముడు-ఆయన సిద్ధాంతాలు) ఇ యం ఎస్ నంబూద్రిపాద్ మొదట నంబూద్రి వెల్‌ఫేర్ అసోసియేషన్ సభ్యుడుగా వుండేవాడు కాని కష్టజీవుల బాధానివారణకొరకు, దేశ స్వాతంత్ర్యం కొరకు కృషి చేయడంద్వారా ప్రముఖ మార్క్సిస్టు నాయకుడుగా పరిణతి చెందాడు

## అస్సాం తేయాకు తోటల్లో తిరుగుబాటు

1921 మే నెలలో అస్సాంలోని సుర్మావాలీ తేయాకు తోటల్లోని కార్మికులు తమ వేతనాలను పెంచవలసిందిగా కోరారు అందుకు యజమానులు అంగీకరించలేదు కాబట్టి 8 వేల మంది కార్మికులు 'గాంధీ మహారాజ్‌కీ జై' అంటూ టీ తోటలు విడిచిపెట్టి, తమ జన్మస్థలాలైన గోరఖ్‌పూర్, బస్తీ జిల్లాలకు బయలుదేరారు తరువాత డిసెంబరులో దరాంగ్, శివసాగర్ జిల్లాల టీ తోటల్లోకూడా సమ్మెలు ప్రారంభమయ్యాయి ఆ ప్రాంతంలోని రైతులు పన్నుల నిరాకరణకు పూనుకున్నారు అంబికా గిరిరాయ్ చౌదురి రచించిన గేయాలతోపాటు అనేక జానపద గేయాలుకూడా ప్రజలకు కంఠస్థమైనాయి

ఆ దశలో టీ తోటలు విడిచిపెట్టి వెళ్ళిపోతున్న కూలీలపైన గూర్ఖా సిపాయిల దాడి జరిగింది అయినా కూలీలు నడుచుకుంటూ చాంద్‌పూర్ చేరి స్టీమర్లు ఎక్కబోయారు ఆ సమయంలో కొందరు కూలీలను, వారి స్త్రీలను సహితం పోలీసులు నదిలోకి తోసివేశారు ఆ ఘాతుకాన్ని జూచి క్రోధావేశులైన స్టీమర్ కార్మికులు సమ్మె చేశారు. అస్సాం-బెంగాల్ రైల్వేలోని భారతీయులంతా సమ్మె చేశారు అనతికాలంలోనే బ్రిటిష్ వ్యతిరేక క్రోధం తూర్పుబెంగాల్ ప్రాంతమంతటికి వ్యాపించింది వాలంటీర్ దళాలు నిర్మాణమయ్యాయి మధ్యవర్తి కోర్టులు స్థాపించబడ్డాయి

## బెంగాల్లో పోరాటాలు

1921 నవంబరులో వేల్స్ యువరాజు కలకత్తా వచ్చినప్పుడు జరిగిన హర్తాళ్ జయప్రదమైంది 7 జిల్లాలలో పోలీసుల అసంతృప్తి పైకి ఉబికింది చిత్తరంజన్‌దాస్ సతీమణి వాసంతీదేవి నాయకత్వాన అనేకమంది మహిళలు రంగంలో దిగి అరెస్టయ్యారు మహమ్మద్ ఉస్మాన్ నాయకత్వానగల ట్రేడ్ యూనియన్లలోని ముస్లిము కార్మికులనేకమంది

అరెస్టయ్యారు ముజఫర్ అహమ్మద్ నాయకత్వాన కమ్యూనిస్టు సెల్ ఏర్పడింది.

చిత్తరంజన్‌దాస్ ప్రోత్సాహంతో సోమేశ్వర్‌ప్రసాద్ చౌధురి పాబ్లా–ముర్షిదాబాద్, రాజషాహి–నాడియా సరిహద్దులలోని నీలిమందు రైతుల ఉద్యమానికి నాయకత్వం వహించి జయప్రదం చేశాడు

మిద్నపూర్ జిల్లాలో యూనియన్ బోర్డు స్థాపనకు వ్యతిరేకంగా "మహిష్య" కౌలుదార్లను సమీకరించగలిగిన వీరేంద్రనాథ్ సన్మల్, పన్నుల నిరాకరణోద్యమాన్ని ప్రారంభించి, యూనియన్ బోర్డు స్థాపనను రద్దు చేయించాడు బీర్ భూమిలో రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా జితేంద్రనాథ్ బెనర్జీ నాయకత్వాన రైతు ఉద్యమం ప్రారంభమైంది

గాంధీ రాజ్యం వచ్చింది అని నినదిస్తూ 669 మంది క్రిమినల్ ఖైదీలు రాజషాహి జైలునుండి బయటకు వెళ్ళిపోయారు నిల్ ఫామరీ ప్రాంతంలో ముస్లిమ్ రైతులు "గాంధీ దరోగా"ను ఏర్పాటు చేసుకొని, పన్నుల నిరాకరణకు పూనుకున్నారు చిట్టగాంగ్ జిల్లాలోగల రిజర్వు అడవులను స్వాధీనం చేసుకున్న ప్రజలు, అడవి సంపదను ఇష్టం వచ్చినట్లు కొల్లగొట్ట నారంభించారు తిప్పెరాలో కొందరు పోలీసులు పనులకు వెళ్ళడం మానేశారు ఆనాటి పరిస్థితిని గురించి బెంగాల్ ప్రభుత్వ రికార్డుల్లో ఈ విధంగా వివరింపబడింది "ప్రజలు పన్నులు చెల్లించడంలేదు ప్రభుత్వంగాని, జమీందార్లుగాని వ్యవసాయ పన్నులు వసూలు చేయలేదు ఆందోళనోద్యమం సాగిస్తున్నది ముస్లిములే కాని మత దృక్పథంతో ఉద్యమం సాగడంలేదు కేవలం తమ బలాన్ని నిరూపించుకోవడం కొరకు మాత్రమే వారు పూనుకొన్నారు "

## బీహార్, ఉత్తరప్రదేశ్ ఘటనలు

ఆ దశలో సత్యాగ్రహ సిద్ధాంతాన్ని మనసా, వాచా, కర్మణా ఆచరణలో పెడుతున్న రాజేంద్రప్రసాద్ మున్నగు బీహార్ కాంగ్రెస్ నాయకులను గాంధీజీ మెచ్చుకున్నారు అయినా బీహార్‌లోకూడా కొన్ని ఘటనలు జరిగాయి "గాంధీ శిష్యులం" అని పేరు పెట్టుకున్న కొందరు వ్యక్తులు దళాలుగా ఏర్పడి, ధరల పెరుగుదలకు వ్యతిరేకంగా ఆందోళన చేస్తూ, కొన్ని చోట్ల లూటీలకు పాల్పడ్డారు

ఈ దశలో ఉత్తరప్రదేశ్ ప్రాముఖ్యతను సంతరించుకున్నది అనేక స్వదేశీ విద్యా సంస్థలు వెలిశాయి తన ఉపాధ్యాయ పదవికి రాజీనామా చేసిన సుప్రసిద్ధ రచయిత ప్రేమ్‌చంద్ కాశీ విద్యాపీఠ్‌లో చేరారు

రాయ్‌బరేలీలోని పురసత్‌గంజ్ బజారుపైన పదివేలమంది ప్రజలు దాడిచేశారు "వర్తకులందరూ గజం నాలుగణాల చొప్పున వస్త్రాలను, రూపాయికి 8 సేర్ల చొప్పున ఆహార ధాన్యాలను అమ్మాలి" అని డిమాండ్ చేశారు

గాంధీజీ అనుచరుడనని చెప్పుకుంటూ రామచంద్ర అనే వ్యక్తి ఫైజాబాద్‌లో పన్నుల నిరాకరణ, బంజరు భూముల ఆక్రమణ ఉద్యమాలను ప్రారంభించాడు షానయీామ్ అటా అనే వ్యక్తి "సెలాన్ రాజు"గా ప్రకటించుకున్నాడు అలాంటి చర్యలను గాంధీజీతోపాటు జవహర్‌లాల్ నెహ్రూ కూడా వ్యతిరేకించాడు.

కుమాన్ డివిజనులో గిరిజనులు వేలాది ఎకరాల అడవిని తగులబెట్టారు ఇలాంటి ఘటనలు కొద్దిగానో గొప్పగానో దేశమందన్నిప్రాంతాలలోనూ జరిగాయి. కాని,

మహారాష్ట్రలో తిలక్ అనుచరులు నడిపిన ఉద్యమాలు, తమిళనాడులో రాజగోపాలాచారి, సత్యమూర్తి ప్రభృతులు నడిపిన ఉద్యమాలు చాలావరకు గాంధీజీ ఆశించిన విధంగానే జరిగాయి గుజరాత్‌లో వల్లభాయ్ పటేల్ మున్నగువారు శాంతియుతంగానే ఉద్యమాలు నడిపారు

## ఆంధ్రలో ఉద్యమాలు: చీరాల-పేరాల పోరాటం

సహాయ నిరాకరణ కాలంలో ఆంధ్రలో ప్రఖ్యాతి చెందిన ఉద్యమాలు మూడు ప్రజ్వరిల్లాయి

1920 జనవరి 12వ తేదీన చీరాల-పేరాల మున్సిపాలిటీని ఏర్పాటు చేశారు పన్నులను 4 వేలనుండి 30 వేలకు పెంచారు పెంచిన పన్నును చెల్లించడం తమకు సాధ్యం కాదని చేనేత కార్మికులు ఎన్ని విన్నపాలు చేసినా ప్రభుత్వం వినిపించుకోలేదు పైగా చీరాలకు రైల్వేస్టేషన్, పోస్టాఫీసు, హాస్పిటల్‌వంటి సౌకర్యాలు లేకుండా చేస్తానని మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ మంత్రి పానుగంటి రామారాయణిం బెదిరించాడు ప్రజలు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన పన్నులు చెల్లించడం మానివేశారు అధికారులు ప్రజల చరాస్తులను జప్తుచేసి, స్థానికంగా ఎవరూ వేలంపాట పాడనందున దూర ప్రాంతాలకు తీసుకుపోయి అక్కడ వేలం వేశారు 12 మందిని అరెస్టు చేశారు అరెస్టయిన వారిలో ఒక వృద్ధ మహిళకూడా వుంది

చీరాల-పేరాల ప్రజలు తమ ఇళ్లను ఖాళీచేసి, పొలిమేర ప్రక్కన పాకలు వేసుకుని, వాటిలో ప్రవేశించారు పదకొండు నెలలపాటు చీరాల-పేరాల నిర్మానుష్యమయ్యాయి అందరి అవసరాలను తీర్చేందుకు గోపాలకృష్ణయ్య రామదండును ఏర్పాటు చేశాడు అన్ని కులాలకు ప్రాతినిధ్యంగల పాలనా వ్యవస్థనుకూడా ఏర్పాటు చేశాడు

ప్రభుత్వ దమనకాండ మిన్నుముట్టింది ప్రకృతికూడా వక్రించింది 1921 సెప్టెంబర్‌లో గోపాలకృష్ణయ్యను అరెస్టుచేసి ఏడాది కఠినశిక్ష విధించారు "పదవే భద్రాద్రికి పాపిష్టి ఘటమా" అంటూ అయన కటకటాలలోకి వెళ్ళాడు తరువాత ఉద్యమం నీరుగారిపోయింది ఆ దశలో బెజవాడ, రేపల్లె మున్సిపాలిటీలలోకూడా చాలామంది ప్రజలు పన్నులు చెల్లించలేదు అయినా ప్రభుత్వం పెద్దగా పట్టించుకోలేదు

## అడవి పుల్లరి సత్యాగ్రహం

ఫారెస్టు నిబంధనలు, ఉద్యోగుల లంచాలు భరించలేక సతమతమవుతున్న పలనాడు, రాయచోటి మున్నగు ప్రాంతాల ప్రజలు సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించారు

మాచర్ల ప్రజలు ప్రభుత్వోద్యోగులను సాంఘిక బహిష్కరణకు గురిచేశారు ఉద్యోగుల పిల్లలకు పాలుకూడా కరువయ్యాయి మాచర్లలో మకాం వేసిన కలెక్టరు, యస్ పికూడా బహిష్కరణకు గురికావలసి వచ్చింది

పరిస్థితిని పరిశీలించడానికి మాచర్ల వెళ్ళిన ఉన్నవ లక్ష్మీనారాయణ, వేదాంతం నరసింహాచారిగార్లను కలెక్టరు అరెస్టు చేయించి, ఏడాది కఠినశిక్ష విధించాడు వారి అరెస్టుకు నిరసనగా గుంటూరులో హర్తాళ్ జరిగింది కొండా వెంకటప్పయ్యతోపాటు మరో ముగ్గురినికూడా అరెస్టు చేశారు అందువల్ల పరిస్థితి విషమించింది. కాగా

వెంకటప్పయ్య ప్రభృతులను విడుదల చేశారు

1921 అగస్టులో పల్నాడు రాజకీయ మహాసభ జరిగింది పన్నుల నిరాకరణ కాంగ్రెస్ ఆమోదించలేదని కొండా వెంకటప్పయ్య స్పష్టం చేశారు అయినా ప్రజలు వినలేదు కన్నెగంటి హనుమంతు నాయకత్వాన పన్నుల నిరాకరణకు పూనుకున్నారు కాగా ప్రజలకు, పోలీసులకు మధ్య ఘర్షణలు చెలరేగాయి 1922 ఫిబ్రవరి 22న జరిగిన పోలీసు కాల్పులలో కన్నెగంటి హనుమంతు మరణించాడు మరొక నలుగురు కూడా నేలకొరిగారు 28 మంది పురుషులను, 9 మంది స్త్రీలను ప్రభుత్వం అరెస్టు చేసింది అందువల్ల పలనాడు పుల్లరి సత్యాగ్రహం బలహీనపడింది ఇదేవిధంగా కడపజిల్లా రాయచోటిలోను, బెజవాడ తాలూకా కొండూరు ప్రాంతంలోనూ జరిగిన పుల్లరి సత్యాగ్రహాలుకూడా నీరసించిపోయాయి

## పెదనందిపాడు పన్నుల నిరాకరణ

పన్నుల నిరాకరణ ఉద్యమం గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు ప్రాంతంలో తీవ్రరూపం ధరించింది ఆ ప్రాంతంలోని గ్రామోద్యోగులందరూ రాజీనామా చేశారు నాలుగువేల మంది వాలంటీర్లతో శాంతిసేన ఏర్పాటయింది ఉద్యమానికి పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వం వహించాడు అయనను అందరూ “ఆంధ్ర శివాజీ” అని పిలిచేవారు

పన్నులు చెల్లించని వారి ఆస్తులను జప్తుచేయడానికి వచ్చిన అధికార్లు ఏ ఇంటికి వెళ్ళినా, అక్కడ ఏమీ కనిపించేది కాదు మనుషులెవరూ వుండేవారు కాదు పరిస్థితిని పరిశీలించడానికి వచ్చిన రెవిన్యూ బోర్డు సభ్యుడు హారిస్, తన నివేదికలో “ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి తలపెట్టిన విప్లవం తప్ప మరొకటికాదు” అని స్పష్టం చేశాడు

ఉద్యమంలో చీలికలు తేవడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలుకూడా విఫలమయ్యాయి అందువల్ల సైన్యాన్ని రంగంలో దింపింది గ్రామాలలో సైనిక కవాతులు జరిపింది అయినా ప్రజలు భయపడలేదు కాబట్టి పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం బ్రిటిష్ పార్లమెంటు సభ్యుల దృష్టినికూడా ఆకర్షించింది

అలాంటి స్థితిలో గాంధీజీ కొండా వెంకటప్పయ్యకొక ఆదేశాన్ని అందచేశాడు తాను బార్డోలీలో ప్రారంభించే పన్నుల నిరాకరణ ఉద్యమ ఫలితాలను బేరీజువేసేవరకు ఉద్యమాన్ని సస్పెండు చేయవలసినదిగా కోరాడు

కాని గాంధీజీ బార్డోలిలో పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించకముందే, చౌరీ–చౌరా ఘటనలు జరిగాయి. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గాంధీ విరమించాడు ఉద్యమంలో పాల్గొన్న ప్రజలు అనేక బాధలకు గురయ్యారు నాయకులు జైళ్లలో మ్రగ్గారు

## చౌరీ–చౌరా ఉదంతం

చౌరీ–చౌరా గ్రామం గోరఖ్‌పూర్ జిల్లాలో వుంది అక్కడ విదేశీ వస్త్రాల అమ్మకం ఆగిపోయింది సారా దుకాణాలు మూతపడ్డాయి అందువల్ల నష్టపోయిన స్థానిక భూస్వామి పోలీసులను రంగంలోకి తెచ్చాడు శాంతియుతంగా పికెటింగ్ చేస్తున్న వలంటీర్లమీద పోలీసులు విరుచుకుపడి లాఠీలతో బాదారు

ఆ విషయం తెలియగానే చుట్టుప్రక్కల గ్రామాలలోని వలంటీర్లు చౌరీ–చౌరాకు

చేరుకున్నారు ఫిబ్రవరి 4వ తేదీన పోలీసు స్టేషనుకు వెళ్ళి "శాంతియుతంగా పికెటింగ్ చేస్తున్న వలంటీర్లను ఎందుకు చితకబాదావో చెప్పు" అని సబ్‌ఇన్‌స్పెక్టరును నిగ్గదీశారు కాని పెద్దమనుషుల మాటవిని శాంతించి వెనుదిరిగారు

వెనుదిరిగిపోతున్న వలంటీర్ల మీద వెనుకనుండి పోలీసులు తుపాకులు కాల్చారు ఇద్దరు వలంటీర్లు మరణించగా, మరికొందరికి గాయాలయ్యాయి అందువల్ల కోపోద్రిక్తులైన ప్రజలు పోలీస్‌స్టేషన్‌పైన రాళ్ళవర్షం కురిపిస్తోంటే, పోలీసులు తుపాకులు పేల్చారు చివరకు తూటాలు అయిపోయినందున స్టేషన్‌లోకి వెళ్ళి తలుపులు బిడాయించుకున్నారు. ప్రజలు పోలీస్‌స్టేషనుకు నిప్పుపెట్టారు మంటలనుండి తప్పించుకొని బయటపడిన పోలీసులను కొట్టి చంపి మంటల్లోకి తోసివేశారు

ఈ విషయం తెలియగానే కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అత్యవసర సమావేశం జరిగింది చౌరీచౌరాలో జరిగిన హింసాకాండను ఖండించారు అంతకుముందు బొంబాయి, మద్రాసువంటిచోట్ల జరిగిన హింసాయుత చర్యలనుకూడా నిరసించారు శాసనోల్లంఘన ఉద్యమాన్ని నిలిపివేయాలని తీర్మానించారు నూలు వడకడం, మద్యపాన నిషేధం, సాంఘిక సంస్కరణలు, జాతీయ విద్యకు సంబంధించిన కార్యక్రమాన్ని రూపొందించారు ఫిబ్రవరి 12వ తేదీనుండి ఐదు రోజులపాటు గాంధీ నిరశన దీక్ష పూనాడు

అందువల్ల ప్రముఖ కాంగ్రెస్ నాయకులలో సైతం తీవ్రమైన అసంతృప్తి కలిగింది ఆ సమయంలో చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ, లజపతిరాయ్‌లాంటి వారంతా జైళ్ళలో వున్నారు ఉద్యమాన్ని విరమించినందుకు బాధపడ్డారు

"ఉద్యమం విరమించకపోతే అదుపుతప్పి పోయేది ప్రభుత్వం గెలిచేది అయినా ఆ నిర్ణయం నిస్పృహ కలిగించింది అంత గొప్ప ఉద్యమాన్ని హఠాత్తుగా నిలిపివేయడం దేశంలో విషాద పరిణామాలకు దారితీసింది" అని జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మకథలో వ్రాశాడు.

"బార్డోలీలో ఉద్యమాన్ని విరమించిన క్షణం నుంచి కాంగ్రెస్ బలం క్షీణించసాగింది ఉత్సాహం సన్నగిల్లింది పార్టీ అనుయాయులలో భ్రమలు తొలగడం, నిరుత్సాహం ప్రబలడం ఆరంభమైంది" అని వైస్రాయి రీడింగ్ బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియజేశాడు గాంధీజీని అరెస్టుచేసినా అల్లర్లు జరగవన్నాడు

1922 మార్చి 10న గాంధీజీని అరెస్టుచేసి 18న విచారణ జరిపించారు అహమ్మదాబాద్‌లో సి యన్ బ్రూమ్‌ఫీల్డ్ అనే ఆంగ్ల న్యాయాధిపతి ఎదుట విచారణ జరిగింది. ప్రభుత్వం ఆరోపించిన నేరాలనన్నింటిని గాంధీ అంగీకరించాడు సాధ్యమైనంత ఎక్కువ శిక్ష విధించవలసిందిగా కోరాడు తన వాఙ్మూలాన్ని వ్రాతపూర్వకంగా కోర్టుకు సమర్పించాడు

## అసాధారణ విచారణ

నేరాలను స్వయంగా గాంధీ అంగీకరించినప్పుడు విచారణ దేనికి? శిక్ష విధించేముందు గాంధీపట్ల గౌరవ సూచకంగా న్యాయమూర్తి బ్రూమ్‌ఫీల్డ్ శిరస్సు వంచాడు తరువాత ఇలా అన్నాడు

"న్యాయం వ్యక్తులను గౌరవించదు ఐనా లోగడ నేను విచారించిన, ఇక ముందు

విచారించబోతున్న వ్యక్తులకూ మీకూ తేడా వుంది మీ దేశంలోని లక్షలాది ప్రజల దృష్టిలో మీరు గొప్ప దేశభక్తులు గొప్ప నాయకులు, ఈ విషయాన్ని విస్మరించడం అసాధ్యమైన పని రాజకీయాలలో మీతో భేదించేవారు సహితం మిమ్మల్ని ఉన్నతాదర్శవ్యక్తిగా, మహత్తర సాధుపుంగవుడుగా పరిగణిస్తారు" అంటూ గాంధీజీకి ఆరేళ్ల శిక్ష విధించాడు "ఈ శిక్షను ప్రభుత్వం తగ్గిస్తే, నాకంటే సంతోషించేవాడు మరొకడుండడు" అనికూడా బ్రూమ్‌ఫీల్డ్ అన్నాడు కాగా ఈ విచారణ "గొప్ప విచారణ"గా పేరొందింది

కోర్టుకు సమర్పించిన వాఙ్మూలంలో దక్షిణాఫ్రికా సత్యాగ్రహంనుండి ఆనాటి వరకూ జరిగిన తన రాజకీయ జీవితాన్ని గాంధీ వివరించాడు బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించిన తాను ఎందుకు సహాయ నిరాకరణవాదిగా మారాడో, బ్రిటిష్ పాలనను దేనికి వ్యతిరేకిస్తున్నాడో వివరిస్తూ గాంధీజీ ఇలా అన్నాడు

"బ్రిటిష్ పాలనలో భారతదేశం రాజకీయంగాను, ఆర్థికంగాను నిస్సహాయ స్థితికి దిగజారింది నిరాయుధ భారతదేశం విదేశీదాడుల నెదిరించగల శక్తిని కోల్పోయింది కరువు కాటకాలను తట్టుకోగల శక్తిని పోగొట్టుకొన్నది

"అర్థాకలితో అలమటిస్తున్న ప్రజలు క్రమక్రమంగా జీవనశక్తిని కోల్పోతున్నారనే విషయం పట్టణవాసులకు తెలియదు తాము పొందుతున్న దౌర్భాగ్యపు సౌకర్యం విదేశీ దోపిడీగాళ్లకు దళారులుగా పనిచేయడంవల్లనే లభిస్తున్నదని, జనసామాన్యాన్ని పీల్చి పిప్పిచేయడంద్వారానే ఈ లాభాలూ, ఈ దళారీ వాటాలూ లభిస్తున్నాయని పట్టణ వాసులకు తెలియదు తెలివితేటలతో పెదదారులను పట్టించే ప్రయత్నంగాని, అంకెల గారడీగాని కంటికి స్పష్టంగా గ్రామాలలో కన్పించే కంకాళాలను గురించిన సత్యాన్ని వివరించజాలవు బుద్ధిపూర్వకంగానో లేక మరొక అభిప్రాయంతోనో, దోపిడీ చేసేవాని లాభంకోసం న్యాయపాలన నైతికంగా దిగజారింది దేశపాలన సాగిస్తున్న ఇంగ్లీషువారుగాని, వారి భాగస్వాములైన భారతీయులుగాని– నేను వివరించిన నేరాలను చేస్తున్నట్లు తెలుసుకోకపోవడం గొప్ప దురదృష్టం పైనే గనుక భగవంతుడుంటే, బహుశా చరిత్రలోనే అసమానమైన, మానవజాతికి వ్యతిరేకమైన నేరాలు చేస్తున్నందుకు ఇంగ్లండూ, భారతదేశంలోని పట్టణవాసులూ జవాబివ్వవలసి వుంటుందనడంలో నాకెలాంటి సందేహం లేదు–"

అంటూ వ్రాతపూర్వక వాఙ్మూలంలో వివరించిన గాంధీజీ, తనకు విధించిన శిక్షను సంతోషంగా స్వీకరించాడు సహాయ నిరాకరణ ఉద్యమంలో జైళ్ళకు పోయే కార్యక్రమంకూడా వుంది గదా? "జైలు గేట్లను విశాలం చేయాలి జైళ్ళ లోపల, అవసరమైతే ఉరికంబాలపైన నిలబడి స్వాతంత్ర్యాన్ని ఆహ్వానించాలి అంతేగాని కౌన్సిల్ సభలలోను, కోర్టులలోను, విద్యాలయాలలోను కూర్చొనికాదు" అని దేశభక్తులకు సలహా చెప్పిన గాంధీజీ స్వయంగా స్వాతంత్ర్యాన్ని ఆహ్వానించేందుకు జైలుకు వెళ్ళాడు. అటు తరువాత జైలునుండి బయటకు వచ్చిన చిత్తరంజన్‌దాస్ గాంధీజీని జీసస్‌క్రీస్తుతో పోల్చాడు. కాని 1921 డిసెంబరులో రాజీ ప్రతిపాదనను తీవ్రంగా ఎదిరించిన గాంధీ, 1922 ఫిబ్రవరిలో పూర్తిగా తిరోగమించడం, నిలకడలేనితనాన్ని సూచిస్తోంది అని విమర్శించాడు

"ఇది నాయకత్వం బలహీనతేగాని, ప్రజల బలహీనతకాదు" అన్నాడు యం.యన్ రాయ్

సహాయ నిరాకరణోద్యమం విరమింపబడడంవల్ల వైస్రాయితోపాటు సంతోషంగా

చంకలెగరేసిన బొంబాయి గవర్నర్ లార్డ్ లాయడ్ అమెరికా విలేకరికి యిచ్చిన ఇంటర్వ్యూలో ఇలా అన్నాడు:

"గాంధీ మమ్మల్ని గాభరా పెట్టేశాడు ఆయన కార్యక్రమంవల్ల మా జైళ్ళు నిండిపోయాయి 32 కోట్లమంది ప్రజలను అరెస్టు చేయలేముగదా? ఆయనే గనుక పన్నులు చెల్లించ నిరాకరించితే మేము ఎక్కడ వుండేవాళ్లమో దేవుడికి తెలియాలి "

కాని జరిగిందేమిటి? గాంధీ సలహా ప్రకారం ఉద్యమాన్ని విరమించిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ– "రైతులు వెంటనే జమీందార్లకు, ప్రభుత్వానికి పన్నులు చెల్లించాలి" అని నొక్కి చెప్పింది భూస్వాములకుగల చట్టబద్ధ హక్కులను గుర్తించింది అయినా ఆ తిరోగమనాన్ని గురించి పలువురు పెద్దలు పట్టించుకోలేదు

"గాంధీజీ కాంగ్రెస్ సంస్థకు దేశ వ్యాపిత పునాదిని ఏర్పరచాడు కాంగ్రెస్‌నొక విప్లవ సంస్థగా మార్చాడు ఇంగ్లీషుకు బదులు హిందీ దేశభాష కాగలుగుతోంది ఖాదీ వస్త్రాలు కాంగ్రెసువారి అధికార దుస్తులయ్యాయి" అన్నాడు సుభాష్‌చంద్రబోస్

"మేము అనుకున్నదేదో ఇండ్ల కప్పుల మీదకెక్కి మరీ అరిచాం జైలు అంటే భయం పోయింది జైలు మాకు స్వర్గమైంది తీర్థయాత్రికుల పవిత్ర స్థలమైంది" అన్నాడు జవహర్‌లాల్ నెహ్రూ

ఈలోగా ప్రభుత్వం చౌరీచౌరాలో అరెస్టు చేసిన 225 మందిలోను 172 మందికి మరణశిక్షలు విధించింది. అయినా జాతీయ నాయకులెవరూ నోరు మెదపలేదు ఆ శిక్షలను యం యన్ రాయ్ పత్రిక "వాన్‌గార్డు" ఖండించింది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహక వర్గం నిర్ద్వంద్వంగా ఖండించింది కాగా చివరకు 19 మందిని ఉరిదీసి, తక్కినవారికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షలు విధించింది ప్రభుత్వం

అయినా తప్పంతా చౌరీచౌరా ప్రజలదేననే భావమేర్పడింది ఉద్యమాన్ని విరమిస్తూ గాంధీజీ "మద్రాస్ (మలబార్) హెచ్చరిక చేసింది కాని నేను ఖాతరు చేయలేదు భగవంతుడు చౌరీచౌరాద్వారా స్పష్టంగా చెప్పాడు కాబట్టి ఉద్యమాన్ని కొనసాగించడమంటే ప్రతిజ్ఞను భగ్నం చేయడమూ, భగవంతుని యెడ అపరాధం చేయడమూ అవుతుంది" అని ప్రకటించడంవల్ల ఉద్యమ విరమణకు కారణం "చౌరీచౌరా దురంతాలే" నన్న అభిప్రాయం పాతుకుపోయింది కాబట్టి చౌరీచౌరా రైతులు ఉరికంబాలెక్కినా, ద్వీపాంతరవాస శిక్షలకు గురైనా, జాతీయ నాయకులు పట్టించుకోలేదు ఉద్యమ జయాపజయాలను గురించీ, ఉద్యమాన్ని విరమించడంవల్ల కలుగగల ఫలితాలను గురించి అంచనాలు వేయసాగారు

"ముస్లిములు ఈ దెబ్బతో కుంగిపోయారు. హిందూ-ముస్లిముల మధ్య ఈ కొద్దికాలంలో ఏర్పడిన సఖ్యత, విశ్వాసం తిరిగి నెలకొల్పడం సాధ్యంగానిపని" అన్నాడు పోలక్

"గాంధీ భారతదేశానికి ఆత్మ గౌరవాన్ని నేర్పాడు తనదేశం కొరకు బాధలను భరించడానికి సిద్ధపడేందుకు తన దేశీయులను ఉత్తేజపరిచాడు" అన్నాడు గ్రిఫిత్స్

1922లో జరిగిన గయ కాంగ్రెస్ మహాసభలో చిత్తరంజన్‌దాస్ ఇలా అన్నాడు " . ప్రతి నిజమైన ఉద్యమం ఒక ఆదర్శంకోసం ప్రారంభమవుతుంది కాని ఆదర్శం ఎప్పుడూ ఉద్యమంకంటే పైనే వుంటుంది సహాయ నిరాకరణ ఉద్యమం విజయ వంతమైంది. స్వరాజ్యకాంక్ష దేశం నలుమూలలా చైతన్యాన్ని కలిగించింది. అదే గొప్ప విజయం "

కారణాలేవైనాగానీ, ఉద్యమంలో పాల్గొని అసువులు వీడడంతోసహా, పలు బాధలకు గురియైన దేశభక్తుల త్యాగం నాయకుల ఊగిసలాటవల్ల నిష్ఫలమైందన్న బాధ ప్రజలకు కలిగింది కనుకనే దుగ్గిరాల గోపాలకృష్ణయ్య హాస్యాన్ని జోడించి, ఆశువుగా చెప్పిన ఈ పద్యం ఆంధ్రుల మనసులకు హత్తుకుపోయింది

"కొండెంకటప్పన్న గుండుసున్న గదన్న! గోపాలకిట్టాయి కొక్కిరాయి!
టంగుటూరి ప్రకాశమింగిలీసు పిశాచి! నాగేశ్వరుడు వట్టి నాగజెముడు!
పట్టాభి సీతన్న తుట్టపురుగు గదన్న! ఉన్నవ లక్ష్మన్న దున్నపోతు!
గొల్లపూడీసీతన్న కళ్లులేని కబోది! బులుసు సాంబడు వట్టి పుట్టుకుంక!
అయ్యదేవరవాడు పెయ్యనాకుడుగాడు! అయ్యంకిరమణయ్య దయ్యమయ్య!
డాక్టర్ సుబ్రమణ్య మాక్టింగ్ ఫుల్‌స్టాప్! దువ్వూరి సుబ్బమ్మ దిష్టిబొమ్మ!
అనుచు పల్కుచు నుందురీ ఆంధ్రజనులు

రామనగర నరేంద్ర శ్రీరామచంద్ర! - అంటూ ఇతర నాయకులతోపాటు తననుకూడా విమర్శించుకున్నాడు అయినా ఆ మాటలు తనవికాదని, ప్రజలు అలా అనుకుంటున్నారని చెప్పి తప్పించుకున్నాడు

## స్వరాజ్యపార్టీ ఆవిర్భావం

సహాయ నిరాకరణోద్యమాన్ని విరమించడంవల్ల వచ్చిన విమర్శలకు జవాబుగా గాంధీజీ "సత్యాహింసలకు ఖచ్చితంగా కట్టుబడి వుండాలని దేశభక్తి కోరుతోంది వాటిలో విశ్వాసం లేనివారు కాంగ్రెసునుండి వైదొలగాలి" అన్నాడు

ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసి ఆరేళ్ల శిక్ష విధించినా ప్రజలు ఆగ్రహించలేదు 1920లో గాంధీజీని అరెస్టు చేశారన్న వదంతిని వినగానే తిరగబడిన ప్రజలు ఈసారి మెదలకుండా వుండిపోయారు హఠాత్తుగా జరిగిన పరిణామం వారిని నిశ్చేష్టులను చేసింది

ఈ పరిస్థితిని అధిగమించేందుకు 1922 జూన్‌లో లక్నోలో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశం జరిగింది శాసనోల్లంఘనకు దేశం సిద్ధంగా వున్నదో లేదో అన్న విషయాన్ని తెలుసుకునేందుకొక విచారణ కమిటీని నియమించారు కమిటీ సభ్యులు అన్ని రాష్ట్రాలలోను పర్యటించిన పిమ్మట "ప్రస్తుత పరిస్థితిలో శాసనోల్లంఘన సాధ్యంకాదు" అని నిర్ణయించారు కాని కమిటీ సభ్యులైన హకీం అజ్మల్ ఖాన్, విఠల్‌భాయ్ పటేల్, మోతీలాల్ నెహ్రూలు ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని సూచించారు శాసనసభలలో ప్రవేశించి, శాసనసభా సంస్కరణలను ధ్వంసం చేయాలన్నారు ఇదికూడా శాసనోల్లంఘనను పోలిన ఉద్యమమే కాగలదన్నారు ఈ ప్రతిపాదనను కమిటీ సభ్యులలో ముగ్గురు - సి రాజగోపాలాచారి, డా॥ అన్సారీ, కస్తూరి రంగ అయ్యంగార్ - వ్యతిరేకించారు

ఈ సమస్యపైన 1922 డిసెంబరులో గయలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో తర్జన భర్జనలు జరిగాయి కాంగ్రెస్ అధ్యక్షుడు చిత్తరంజన్‌దాస్ శాసనసభా ప్రవేశాన్ని గట్టిగా సమర్థించాడు. అయినా శాసనసభా ప్రవేశానికి వ్యతిరేకంగా 1740 ఓట్లురాగా, అనుకూలంగా 890 ఓట్లు మాత్రమే వచ్చాయి శాసనోల్లంఘన కొరకు యాభైవేలమంది వలంటీర్లను సిద్ధంగా వుంచాలనే తీర్మానం నెగ్గింది అయినా మోతీలాల్ ప్రభృతులు వెనకడుగు వేయలేదు

1923 జనవరి 1వ తేదీన చిత్తరంజన్‌దాస్ తన అధ్యక్ష పదవికి రాజీనామా సమర్పించాడు ఆ మార్చిలో కాంగ్రెస్‌లోనే మరొక పార్టీ ఏర్పడింది దానికి "కాంగ్రెస్ ఖిలాఫత్ స్వరాజ్య పార్టీ" అని నామకరణం చేశారు అదే స్వరాజ్య పార్టీ దానికి అధ్యక్షుడుగా చిత్తరంజన్‌దాస్, ప్రధాన కార్యదర్శిగా మోతీలాల్ నెహ్రూ ఎన్నికయ్యారు ఈ కొత్త పార్టీలో చేరినవారందరూ ఛేంజర్సు (మార్పును కోరినవారు), తక్కిన వారందరూ నో ఛేంజర్సు (యధాతధ వాదులు) అని పిలువబడ్డారు ఆంధ్రలో పట్టాభి, కొండా వెంకటప్పయ్య ప్రభృతులు నో ఛేంజర్సు, ప్రకాశం, కాళేశ్వరరావు మొదలైనవారు ఛేంజర్సు

## శాసనసభలలో ప్రవేశం

"స్వరాజ్యం సామాన్య ప్రజల కొరకు, అంతేగాని పైతరగతులవారి కొరకు మాత్రమే కాదు" అని చిత్తరంజన్‌దాస్ ప్రకటించారు స్వరాజ్య పార్టీ ప్రకటించిన ఎన్నికల ప్రణాళికపైన వందమందికిపైగా ప్రముఖులు సంతకాలు చేశారు కాబట్టి 1923 సెప్టెంబరులో ఢిల్లీలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశంలో ఛేంజర్సుకు, నో ఛేంజర్సుకు మధ్య రాజీ కుదిరింది కాంగ్రెస్ వారు ఎన్నికలకు నిలబడవచ్చునని నో ఛేంజర్సు ఒప్పుకున్నారు నిర్మాణ కార్యక్రమంమీద తమ విశ్వాసాన్ని ఛేంజర్సు ప్రకటించారు

1923 నవంబరులో ఎన్నికలు జరిగాయి స్వరాజ్య పార్టీకి మధ్యప్రదేశ్‌లో పూర్తి మెజారిటీ వచ్చింది బెంగాల్, యు పి , అస్సాం రాష్ట్రాలలోకూడా మంచి ఫలితాలొచ్చాయి కేంద్ర శాసనసభలోగల 101 స్థానాలలోను, 42 స్థానాలు స్వరాజ్య పార్టీకి దక్కాయి వీటితోపాటు దేశంలో అనేక స్థానిక సంస్థలు, మున్సిపాలిటీలు స్వరాజ్యపార్టీ వారి వశమయ్యాయి

1924 ఫిబ్రవరిలో గాంధీజీ జైలునుండి విడుదలయ్యాడు జూన్‌లో ఎ ఐ సి సి సమావేశం అహమ్మదాబాద్‌లో జరిగింది "సంవత్సరానికి రెండువేల గజాల నూలువడికిన వారిని మాత్రమే కాంగ్రెస్ సభ్యులుగా చేర్చుకోవాలి శాసనసభలకు, స్థానిక సంస్థలకు ఎన్నికైనవారు జాతీయ కాంగ్రెసుకు సంబంధించిన పదవులలో వుండకూడదు బెంగాల్లో హింసకు పాల్పడిన గోపీనాథ్ సాహా చర్యను ఖండించాలి" అని గాంధీజీ పట్టుబట్టాడు అందుకు తగిన తీర్మానాలకుకూడా ప్రతిపాదించాడు కాని, మొదటి రెండు తీర్మానాలూ వీగిపోయాయి గోపీనాథ్ సాహాచర్యను ఖండించాలనే తీర్మానం మాత్రం ఎనిమిది ఓట్ల తేడాతో నెగ్గింది కాగా "నేను ఓడిపోయాను, వినమ్రుడనయ్యాను" అని గాంధీజీ ప్రకటించాడు

తరువాత నవంబర్ 1924లో గాంధీజీకి, స్వరాజ్య పార్టీ నాయకులైన చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూలకు మధ్య రాజీ కుదిరింది స్వరాజ్య పార్టీవారిని కాంగ్రెస్‌వారుగా గాంధీజీ గుర్తించాడు శాసనసభాప్రవేశానికి అనుమతించాడు రెండువేల గజాల నూలును స్వయంగా వడికిగాని లేదా ఎవరితోనైనా వడికించిగాని ఇచ్చినవారిని మాత్రమే కాంగ్రెస్ సభ్యులుగా చేర్చుకోవాలనే షరతును స్వరాజ్య పార్టీ నాయకులు అంగీకరించారు

అప్పటినుండి ఛేంజర్సు (స్వరాజ్య పార్టీవారు) శాసనసభలలోను, స్థానిక సంస్థలలోను చేరి పనిచేస్తోంటే, నో ఛేంజర్సు ఖద్దరు ఉత్పత్తి, మద్యపాన నిషేధం, జాతీయ విద్య మొదలైన కార్యక్రమాలను నిర్వహించేవారు

కేంద్ర అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడిన మోతీలాల్ నెహ్రూ, విఠల్‌భాయ్ పటేల్ ప్రభృతులు నేషనల్ పార్టీ సభ్యులనేగాక మరికొందరినికూడా తమవైపుకు ఆకర్షించి కొన్ని విజయాలను సాధించగలిగారు

"భారతదేశంలో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచాలి" అన్న తీర్మానం కేంద్ర అసెంబ్లీలో నెగ్గింది "భారతదేశ రాజ్యాంగాన్ని రూపొందించేందుకు రౌండ్ టేబుల సమావేశాన్ని వెంటనే ఏర్పాటు చేయాలి. రాజకీయ ఖైదీలను వెంటనే విడుదల చేయాలి" అనే రెండు తీర్మానాలు కూడా నెగ్గాయి 1924-25 బడ్జెటులోని కొన్ని పద్దులు తిరస్కరింపబడినాయి కొన్ని చట్టాలు ఉపసంహరింపబడ్డాయి

టాటా స్టీల్ ఇండస్ట్రీసుకు రక్షణ, పౌనుకు - రూపాయికి మధ్య మారకపు రేటు నిర్ణయం వగైరా విషయాలలో స్వరాజ్య పార్టీ కృషిని జాతీయ పెట్టుబడిదారులు ప్రశంసించారు

రాష్ట్ర శాసనసభలలోను, స్థానిక సంస్థలలోను ప్రవేశించినవారుకూడా ప్రజలకు కొన్ని సదుపాయాలను కలిగించగలిగారు కాగా ప్రజల్లోను, కాంగ్రెస్ కార్యకర్తలలోను నిరుత్సాహం తగ్గి, ఉత్సాహం పెరిగింది

పరిస్థితిని గమనించిన గాంధీజీ కాంగ్రెస్ ఆర్గనైజేషన్‌ను స్వరాజ్య పార్టీ వారికి అప్పగించాలని, తన భావాలను అమలుపరచేందుకు అఖిల భారత స్పిన్నర్సు అసోసియేషన్‌ను స్థాపించాలని నిశ్చయించాడు

## నో ఛేంజర్సు కృషి

కాంగ్రెస్ జెండాపై విధించిన నిషేధానికి వ్యతిరేకంగా నాగపూర్‌లో సత్యాగ్రహాన్ని ప్రారంభించారు "జెండా సత్యాగ్రహం"గా పిలువబడిన సత్యాగ్రహమిది దానికి జమన్‌లాల్ బజాజ్ నాయకత్వం వహించాడు అందులో పాల్గొనేందుకు ఆంధ్ర జిల్లాలనుండి 40 మంది సత్యాగ్రహులు నాగపూర్ వెళ్లారు అలాగే ఇతర రాష్ట్రాలనుండికూడా వచ్చారు. అందరికంటే ఎక్కువమంది సత్యాగ్రహులు గుజరాత్‌నుండి వచ్చారు అందువల్ల ప్రభుత్వం వెనక్కు తగ్గి, కాంగ్రెసుతో రాజీపడింది

అఖిల భారత చరఖా సంఘం ఆంధ్ర శాఖ బాగా కృషి చేసింది హైద్రాబాద్ స్టేట్‌లో బద్రుల్ హసన్, జాఫర్ హసన్, బారిస్టర్ కృష్ణన్, పద్మజానాయుడు మున్నగువారు ఖద్దరు వ్యాప్తికి తోడ్పడ్డారు సతీష్‌దాస్ గుప్తా, సురేష్ బెనర్జీ, హితేష్ న్యాస్యల్, ప్రఫుల్లసేన్‌వంటి వారు బెంగాల్లోను, పటేల్ నాయకత్వానగల గ్రామ సేవకులు గుజరాత్‌లోను ఖద్దరు ధారణను వ్యాపింపజేశారు లజపత్‌రాయ్ నాయకత్వానగల "లోక్‌సేవక్ మండలి" కార్యకర్తలు యు పి , పంజాబ్ ప్రాంతాలలో ఖద్దరు ఉత్పత్తిని పెంచారు ఇలాగే దేశమంతటా ఖద్దరు ఉత్పత్తి పెరిగింది.

అయినా ఖద్దరు బట్టల ఖరీదు మిల్లు బట్టల ఖరీదుకంటె ఎక్కువగా వుండేది కనుకనే గాంధీజీ మోతీలాల్ నెహ్రూతో "ఖద్దరు ఉత్పత్తి కష్టసాధ్యమైన పనిగా కనిపిస్తోంది" అన్నాడు

## చీలికలు

శాసనసభల్లో అనుసరించవలసిన ఎత్తుగడల విషయంలో మోతీలాల్ నెహ్రూకు, లాలా లజపతిరాయ్‌కు మధ్య విభేదాలు పొడసూపాయి అందువల్ల కేంద్ర శాసనసభ

సభ్యత్వానికి లజపతిరాయ్ రాజీనామా చేశాడు మదనమోహన్ మాళవీయా మోతీలాల్‌కు బద్ధ వ్యతిరేకిగా తయారయ్యాడు "బాధ్యతాయుత సహకార పార్టీ" ఆవిర్భవించింది శాసనసభ సభ్యత్వాల నాశించి స్వరాజ్య పార్టీలో చేరినవారిలో కొందరు, ప్రభుత్వం చూపిన ప్రలోభాలకు లోనయ్యారు బొంబే అసెంబ్లీలో స్వరాజ్య పార్టీ నాయకుడుగానున్న శ్రీపాద బల్వంత తాంబే, గవర్నర్ కార్యనిర్వాహకవర్గ సభ్యుడుగా చేరి, స్వరాజ్య పార్టీకి రాజీనామా సమర్పించాడు ఆయన చర్యను మోతీలాల్ నెహ్రూ ఘాటుగా విమర్శించి నందుకు నిరసనగా కేల్కార్, జయకర్ రాజీనామా చేశారు 1925 జూన్‌లో చిత్తరంజన్‌దాస్ మరణించిన పిమ్మట, శాసనసభలలో స్వరాజ్య పార్టీ వారి పలుకుబడి తగ్గింది వారి మాటను బ్రిటిష్ ప్రభుత్వం పెడచెవిన పెట్టింది

1925 మార్చిలో స్వరాజ్య పార్టీవారు శాసనసభలనుండి బయటకు వెళ్ళిపోయారు కాని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారి అనుమతితో తిరిగి శాసనసభల్లో ప్రవేశించారు కాబట్టి "స్వరాజ్య పార్టీవారు సంచార దేశభక్తులు" అని కొందరు ప్రత్యర్థులు హేళన చేయగా, "వారిది ఒకచోటనుండి మరొకచోటికి కదలిపోయే దేశభక్తి" అని మరికొందరు హేళన చేశారు

లజపతిరాయ్‌తో కలసి మదనమోహన మాళవీయా స్వతంత్ర కాంగ్రెస్ పార్టీని స్థాపించాడు. చిత్తరంజన్‌దాస్ మరణానంతరం బెంగాల్ కాంగ్రెస్ నాయకత్వం కొరకు వీరేంద్రనాథ్ సస్మలుకు, సేన్‌గుప్తాకు మధ్య తగాదాలు ప్రారంభమయ్యాయి తరువాత సేన్‌గుప్తాకు, సుభాష్‌చంద్రబోసుకు మధ్య ప్రారంభమయ్యాయి

కాగా 1926 నవంబరులో జరిగిన ఎన్నికల్లో ఒక్క మద్రాసు రాష్ట్రంలో తప్ప తక్కినచోట్ల స్వరాజ్య పార్టీ దెబ్బతిన్నది మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్లో మెజారిటీ లభించినప్పటికీ, మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడానికి కాంగ్రెస్ వొప్పుకోలేదు కాబట్టి మద్రాసులో సుబ్బరాయన్ నాయకత్వాన ఇండిపెండెంట్ మంత్రివర్గ మేర్పడింది

## మతకలహాలు

ఖిలాఫత్ నాయకులను సంప్రదించకుండా గాంధీ, సహాయ నిరాకరణోద్యమాన్ని విరమించిననాటినుండీ ఖిలాఫత్ ఉద్యమ నాయకులలో అసంతృప్తి పెరగసాగింది 1924లో కమాల్ అటాటుర్క్, ఆటోమన్ ఖలీఫేట్‌ను రద్దుచేసిన పిమ్మట ఖిలాఫత్ ఉద్యమానికి అర్థం లేకుండా పోయింది అందువల్ల కొద్దిమంది ఖిలాఫత్ నాయకులు కాంగ్రెస్‌లో వుండిపోగా, తక్కినవారు కాంగ్రెసుకు దూరంగా వెళ్ళిపోయారు.

బ్రిటిష్ వ్యతిరేక పోరాటం నిలిచిపోవడం, పలువురు నాయకులను శాసనసభలు, స్థానిక సంస్థలు ఆకర్షించడంవల్ల ఎన్నికలకు ప్రాముఖ్యత కలిగింది ఏదోవిధంగా ఎన్నికల్లో గెలిచి తీరాలనుకున్న స్వార్థపరులు కుల మత ప్రాంతీయ విభేదాలను రెచ్చగొట్టారు

1918 నుండి కాంగ్రెసులో కలసి పనిచేసిన ముస్లిమ్‌లీగ్ 1924లో జిన్నా అధ్యక్షతన లాహోర్‌లో ప్రత్యేకంగా సమావేశమైంది హిందువుల ఆధిక్యతనుండి ముస్లిములకు రక్షణ కలిగించేందుకుగాను, రాష్ట్రాలకు సంపూర్ణ స్వయం నిర్ణయాధికారం వుండాలని, కేంద్రంలో ఫెడరల్ ప్రభుత్వమేర్పడాలని ముస్లింలీగ్ తీర్మానించింది

ముస్లిమ్ మత గురువులు తాబ్లీఖ్ (ప్రచారం), తాంజీమ్ (నిర్మాణం) కార్యక్రమాలను ప్రారంభించారు ఆర్యసమాజంవారు శుద్ధి, సంఘటన కార్యక్రమాలకు పూనుకున్నారు

సహాయ నిరాకరణోద్యమ కాలంలో నిస్సారంగా వుండిపోయిన హిందూ మహాసభ మాళవీయ అధ్యక్షతన బెనారస్‌లో సమావేశమై "శుద్ధి" కార్యక్రమాన్ని ఆమోదించటమేగా, హిందువుల ఆత్మ రక్షణ దళాల నిర్మాణానికికూడా పూనుకున్నది కాగా హిందూ మహా ... ఆర్య సమాజం, సనాతన ధర్మ సభలతో కూడిన సంఘటన రూపొందింది

ప్రార్థన సమయాలలో మసీదుల ముందు మేళతాళాలు వాయించకూడ ముస్లిములు పట్టుబడితే, గోవును వధించకూడదని హిందువులు పట్టుబట్టారు

కోహట్, కలకత్తా, ఢాకా, పాట్నా, రావల్‌పిండి, ఢిల్లీ మున్నగుచోట్ల మతకలహాలు చెలరేగాయి వీటిని ఆపేందుకు గాంధీజీ ఢిల్లీలో మహమ్మదాలీ ఇంట్లో 21 రోజుల నిరాహార వ్రతం ప్రారంభించారు అందువల్ల వివిధ మతాలకు, రాజకీయ పార్టీలకు చెందిన నాయకులు సమావేశమై, మతకలహాలను ఖండించారు ఆ సమయంలో గాంధీజీ "గోవును రక్షించేందుకు మానవులను వధించడం అనాగరిక చర్య" అని ప్రకటించాడు (యంగ్ ఇండియా- 29 మే, 1924) అందువల్ల మత కలహాలు కొంతకాలంపాటు ఆగిపోయాయి కాని ఖిలాఫత్ ఉద్యమ నాయకుల నిరాశా నిస్పృహలు తొలగలేదు కాగా 1923లో జరిగిన కాకినాడ కాంగ్రెసుకు అధ్యక్షత వహించిన మహమ్మదాలీ 1925లో కాంగ్రెసునుండి తప్పుకున్నాడు

## పెట్టుబడిదారుల మధ్య పోటీ

మొదటి ప్రపంచయుద్ధ కాలంలో దేశీయ పెట్టుబడిదారులు బలపడ్డారు అటు తరువాత రెండు మూడు సంవత్సరాల వరకు కూడా బాగా లాభాలు సంపాదించారు

ఇరవై లక్షల రూపాయల పెట్టుబడిగల వాడియా ఎంటర్‌ప్రైజస్ 1918లో ఇరవై రెండున్నర లక్షల లాభం సంపాదించింది అయినా కార్మికుల వేతనాలను ఇరవై శాతం వరకు మాత్రమే పెంచారు ఆ దశలో కార్మికుల జీవన వ్యయం నూటికి నూరు శాతం పెరిగింది కాబట్టి వేతనాలు చాలక కార్మికులు సమ్మెలకు పూనుకున్నారు

కార్మిక సమ్మెలను అణచేందుకు జాతీయ బూర్జువా వర్గం బ్రిటిష్ ఇండియా ప్రభుత్వంతో చేతులు కలిపింది పురుషోత్తమదాస్, టాకూర్‌దాస్ నాయకత్వాన బడా పెట్టుబడిదారులు సహాయ నిరాకరణోద్యమాన్ని వ్యతిరేకించారు కాని, పెటీ బూర్జువావర్గం ఉద్యమానికి తోడ్పడింది.

సహాయ నిరాకరణోద్యమం విరమింపబడడం, స్వరాజ్య పార్టీ వారి బలం సన్నగిల్లడం జరిగిన పిమ్మట జాతీయ పెట్టుబడిదారీవర్గం మీద బ్రిటిష్‌వారి దాడి ప్రారంభమైంది రూపాయి విలువను పెంచి, పౌను విలువను తగ్గించారు అందువల్ల ఇండియాకు దిగుమతి చేయబడే బ్రిటిష్ వస్తువుల ధర తగ్గింది ఇండియానుండి ఎగుమతి చేయబడే వస్తువుల ధర పెరిగింది

కాబట్టి దిగుమతులు పెరిగాయి ఎగుమతులు తగ్గాయి లాంకషైర్‌నుండి దిగుమతి చేయబడే బట్టల ధర తగ్గడంవల్ల, ఇండియాలోని మిల్లుల్లో తయారయ్యే బట్టల అమ్మకాలు తగ్గాయి ముడిపత్తి, జనుము మున్నగు వ్యవసాయకోత్పత్తుల అమ్మకాలు కూడా తగ్గిపోయాయి

అదే సమయంలో బిర్లా జూట్ మిల్లులను నష్టపరిచేందుకు కలకత్తాలోని బ్రిటిష్ జూట్ మిల్లుల యజమానులు పూనుకున్నారు. లాల్‌చంద్ హీరాచంద్, లాల్‌జీ నారాయణ్‌జీ కలిసి ప్రారంభించిన సింధియా స్టీమ్ నావిగేషన్ కంపెనీని దివాళా తీయించేందుకు

లార్డ్ ఇంచికేప్ నాయకత్వాన బ్రిటిష్ షిప్పింగ్ కంపెనీలవారు విశ్వప్రయత్నం చేశారు తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ కూడా నష్టాలకు గురి కావలసి వచ్చింది

అందువల్ల బ్రిటిష్ పెట్టుబడిదారుల "అసోసియేటెడ్ ఛాంబర్సు"కు వ్యతిరేకంగా, 1927లో బిర్లా, టాకూర్‌దాస్ కలిసి "ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛాంబర్సు ఆఫ్ కామర్సు అండ్ ఇండస్ట్రీ" అనే సంస్థను స్థాపించారు. అప్పటినుండి ఈ సంస్థ జాతీయ పెట్టుబడిదారుల ప్రయోజనాలకొరకు ఎడతెగని కృషి చేసింది

## కార్మిక సమ్మెలు – విజయాలు

ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రథమ మహాసభ 1920 అక్టోబరు 31న లాలాలజపతిరాయ్ అధ్యక్షతన బొంబాయిలో జరుగగా, రెండవ మహాసభ జె బాప్టిస్టా అధ్యక్షతన ఝరియాలో 1921 నవంబరు 30న జరిగింది మూడవ మహాసభ లాహెూర్‌లో సి ఆర్ దాస్ అధ్యక్షతన, 1923 మార్చి 24నుండి 26 వరకూ జరిగింది 1924 మార్చి నెలాఖరున కలకత్తాలో జరిగిన నాలుగవ మహాసభకూడా చిత్తరంజన్‌దాస్ అధ్యక్షతన జరిగింది

ఆ దశలో తాతా ఉక్కు కర్మాగారానికి రక్షణ కల్పించే విషయంలో కేంద్ర కౌన్సిల్లో చర్చ జరుగుతోంది కాబట్టి జెమ్‌షెడ్‌పూర్ ఉక్కు కర్మాగార మానేజ్‌మెంట్‌కు, కార్మికులకు మధ్య సామరస్యాన్ని నెలకొల్పేందుకు చిత్తరంజన్‌దాస్ చేసిన సూచనలను మానేజ్‌మెంట్ వారు అంగీకరించారు ఆ లేబర్ యూనియన్‌కు అధ్యక్షుడుగా సి ఎఫ్.అండ్రూస్ ఎన్నికయ్యాడు లేబర్ యూనియన్‌ను మానేజ్‌మెంటువారు గుర్తించి, కొన్ని సౌకర్యాలు కల్పించారు ఈ సదవగాహన యితర పరిశ్రమలలో కొరవడింది

పెట్టుబడిదారులను జోకొట్టేందుకు ప్రభుత్వం 1924లో లాభాలకు, బోనస్ చెల్లింపులకు ముడిపెట్టింది లాభాలు రావడంలేదనే నెపంతో బొంబాయిలోని జౌళి మిల్లుల యజమానులు కార్మికులకిచ్చే బోనసును అపివేశారు అటుపైన 1925లో కార్మికుల జీతాలలో పదకొండున్నర శాతం వరకూ తగ్గించారు ప్రభుత్వం వసూలు చేస్తున్న మూడున్నర శాతం ఎక్సైజ్ డ్యూటీని రద్దు చేయకపోతే, జీతాలు పెంచడం సాధ్యపడదని వాదించారు కాగా 1925 సెప్టెంబరులో జౌళి మిల్లుల కార్మికులందరూ సమ్మె చేశారు డిసెంబరులో ప్రభుత్వం దిగివచ్చి ఎక్సైజ్ డ్యూటీని రద్దు చేసింది. కార్మికుల జీతాలను మిల్లు యజమానులు పెంచారు

(లాంక్‌షైర్ మిల్లులకు తోడ్పడేందుకు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం, దేశీయ మిల్లులపైన 1894లో విధించిన ఎక్సైజ్ డ్యూటీని, ముప్పై ఏళ్ల తరువాత కార్మికులు రద్దు చేయించగలిగారు )

దేశంలో మొట్టమొదటగా 1923లో సింగారవేలు చెట్టియార్ నాయకత్వాన మద్రాసులో మేడే ఊరేగింపు జరగడం, 1925 జూన్‌లో పశ్చిమోత్తర రైల్వే వర్కర్లు తమ స్వంత రక్తపు మరకలతోనున్న జెండాలు పుచ్చుకొని లాహెూర్ నగర వీధులలో ఊరేగింపు జరపడం, లెనిన్ మృతికి ఎ ఐ టి యు సి సంతాపాన్ని తెలుపడం కార్మికవర్గ అంతర్జాతీయ దృక్పథానికి నిదర్శనమయ్యాయి

## సీతారామరాజు తిరుగుబాటు

గోదావరి, విశాఖపట్నం ఏజెన్సీలలోను, మన్యంలోను నివసించే ప్రజల కష్టాలను

జూచి బాధపడిన అల్లూరి సీతారామరాజు 1922లో బ్రిటిష్ ఇండియా ప్రభుత్వంమీద సాయుధ తిరుగుబాటును ప్రారంభించాడు సహాయ నిరాకరణోద్యమాన్ని గాంధీజీ విరమిస్తున్న సమయంలోనే సాయుధ తిరుగుబాటును సీతారామరాజు ప్రారంభించడమొక విశేషం

గాంధీజీని భక్తి శ్రద్ధలతో కీర్తించినప్పటికీ సీతారామరాజుకు సాయుధ పోరాటం మీదనే విశ్వాసముండేది ఆదిలో గాంధీజీ సీతారామరాజు చర్యలను ఖండించాడు కాని వివరాలు తెలుసుకున్న పిమ్మట రాజు ప్రదర్శించిన త్యాగనిరతిని, దేశభక్తిని ప్రశంసించాడు

1922 ఆగస్టు 22న చింతపల్లి పోలీసుస్టేషన్‌మీద దాడి చేయడంతో మన్యం తిరుగుబాటు ప్రారంభమైంది పోలీసు స్టేషన్లపై దాడిచేసి ఆయుధాలను స్వాధీనం చేసుకోవడం, శత్రువుల మీద గెరిల్లా యుద్ధం సాగించడంవల్ల సీతారామరాజు కొన్ని విజయాలను సాధించగలిగాడు ముందుగానే హెచ్చరించి పోలీసు స్టేషన్లపై దాడి చేయడంవల్లను, తన ఆయుధాలను తెల్లవారిమీదనే ఎక్కుపెట్టడంవల్లను ఆయన కీర్తి ప్రతిష్ఠలు ఇనుమడించాయి ఆయన సాహసగాథలు కట్టుకథలతో కలిసి వ్యాప్తి చెందాయి

గంటందొర, మల్లుదొర, అగ్గిరాజు (పేరిచర్ల సూర్యనారాయణరాజు), బాలయ్య దొర, వీరయ్యదొర, పడాల్‌వంటి వారి నాయకత్వాన గెరిల్లా దళాలు పోరాడాయి కాకినాడనుంచి వెళ్ళిన రిజర్వు పోలీసు దళం, జయపురం రాజాగారి ఏనుగుల దళం తిరోగమించాయి వాటికి నాయకత్వం వహించిన జాన్, హేర్ పారిపోయారు। వారి స్థానంలో వచ్చిన స్కాట్, హైటర్‌లు యుద్ధరంగానికి బలి అయ్యారు

1923 సెప్టెంబరులో మల్లు దొరను అరెస్టు చేశారు ప్రభుత్వం ఆయనకు ద్వీపాంతరవాస శిక్ష విధించింది (1952లో జరిగిన ఎన్నికల్లో మల్లుదొర కాంగ్రెసు అభ్యర్థిగా పాల్గొని పార్లమెంటుకు ఎన్నికయ్యాడు ) ఆ సమయంలో మరి కొందరు గెరిల్లా వీరులుకూడా మరణించారు విప్లవాన్ని జయపూర్, పర్లాకిమిడి అరణ్య ప్రాంతాలకు విస్తరింపజేసేందుకు సీతారామరాజు పర్లాకిమిడి అడవుల్లోకి వెళ్లాడు కాగా కొద్దికాలంపాటు పోరాటంలో స్తబ్దత ఏర్పడింది ఆ సమయంలోనే కాకినాడలో కాంగ్రెసు మహాసభ జరిగింది

1924 జనవరి నెలాఖరులోగా అస్సాం రైఫిల్సు దళం, ఘూర్ఖా దళం నర్సీపట్నం చేరాయి మన్యం ప్రాంతానికి అధికారిగా రూథర్‌ఫర్డును నియమించారు. ఆయన వచ్చీ రావడంతోనే 50 మంది నిరపరాధులను అరెస్టుచేసి ప్రవాస శిక్షలు విధించాడు సాముదాయక జరిమానాలు విధించి, 183 మందికి అరెస్టు వారెంట్లు జారీ చేశాడు వీటికితోడు సైనికులు కొన్ని గ్రామాలను తగలబెట్టారు కాగా మన్యం ప్రజలలో గుండె నిబ్బరం సడలిపోయింది విప్లవవీరులకు ప్రజల తోడ్పాటు తగ్గింది

1924 మే 6న మద్దేరు నదివద్ద జరిగిన పోరాటంలో అగ్గిరాజు పట్టుపడిపోయాడు ఆ మరుసటి రోజున జరిగిన పోరాటంలో సీతారామరాజును జమేదార్ కంచుమీనన్ బంధించగలిగాడు మే 26న జరిగిన పోరాటంలో పడాల్ మరణించగా, జూన్ 7న జరిగిన పోరాటంలో గంటం దొర నేలకొరిగాడు

పట్టుబడిన సీతారామరాజును మేజర్ గుడాల్ ఆజ్ఞ ప్రకారం చెట్టుకు కట్టివేసి తుపాకులతో కాల్చి చంపారు కాని ఇన్‌స్పెక్టర్ ఆళ్వార్‌నాయుడు గుడాల్ చెప్పినట్లుగా రిపోర్టు వ్రాసి యిచ్చాడు అందులో యిలా వుంది

"రాజును కొవ్వూరు తీసుకువచ్చిన తరువాత కాలకృత్యాలు తీర్చుకోవాలని

అడిగినందున కట్లు విప్పి పంపాం రాజు పరుగెత్తాడు కాబట్టి కాల్చవలసిందిగా నేను నా సిపాయీలను ఆజ్ఞాపించాను కాల్చినందున రాజు చనిపోయాడు ”

ఇలా దొంగ రిపోర్టు వ్రాయడానికిగల కారణాన్ని కొన్నాళ్ల తర్వాత ఆళ్వార్ యిలా బయటపెట్టాడు

“యుద్ధరంగంలో పెద్ద ఆఫీసర్ చెప్పిన మాట చిన్నవాడు వినకపోతే, అతనిని చంపి, శత్రుదాడిలో చనిపోయాడని వ్రాస్తారు దానికి సాక్ష్యముండదు దేవుడే సాక్షి ”

అయినా నిజం తెలుసుకోకుండా ‘తప్పించుకోడానికి ప్రయత్నించగా రాజును కాల్చి చంపారు’ అని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన ‘ఆంధ్రలో స్వాతంత్ర్య సమరం’ గ్రంథకర్తలు వ్రాశారు ఆ విధంగా ముగిసింది అల్లూరి సీతారామరాజు వీరగాథ

## రైతు సంఘాల నిర్మాణం

జమీందారీ పద్ధతిని రద్దు చేయాలని 1922లో స్వామి విద్యానంద కోరాడు రష్యాలోతప్ప తక్కిన ప్రపంచమంతటా రైతులు బానిసలుగానే బ్రతుకుతున్నారంటూ బాబా రామచంద్ర యు పి లో జమీందారీ వ్యతిరేక పోరాటాలు నడిపాడు అయినా, భూస్వామ్య వర్గాలతోగల సంబంధాలవల్ల కాంగ్రెసు నాయకులు రైతుల సమస్యలను పట్టించుకోలేదు కౌలుదార్లుగానున్న నామశూద్రులు, ముస్లిములు తమ హక్కుల కొరకు బెంగాల్ రాష్ట్రంలో 1925లో ప్రారంభించిన ఉద్యమాలను బెంగాల్ కాంగ్రెస్ నాయకులు (సుభాష్‌చంద్రబోస్‌తో సహా) వ్యతిరేకించారు కౌలు హక్కుల చట్టం చేయకూడదని వాదించారు అందువల్ల 1923లో చిత్తరంజన్‌దాస్ సాధించిన హిందూ–ముస్లిమ్ ఐక్యత భగ్నమైంది కాగా 1926లో జరిగిన ఎన్నికల్లో స్వరాజ్య పార్టీకి ఎదురుదెబ్బ తగిలింది

ఆళ్వార్ సంస్థానంలో యాభై శాతం వరకూ పెంచిన పన్నులు తగ్గించాలని కోరుతూ సంస్థాన రైతులు పెద్ద ఉద్యమాన్ని లేవదీశారు ఆ పని సహించలేని సంస్థాన ప్రభుత్వం 1925 మేలో విచ్చలవిడిగా పోలీసు కాల్పులు సాగించింది కాగా 156గురు రైతులు మరణించారు అరువందలమంది గాయపడ్డారు

మేవార్ సంస్థానంలో పెంచిన శిస్తులకు వ్యతిరేకంగా రైతులు ఉపాధ్యాయ్, వర్మ, పథిక్ మున్నగువారి నాయకత్వాన సత్యాగ్రహ పోరాటాలు సాగించారు అయినా స్వతంత్ర సంస్థానాలలో జరిగే పోరాటాలను బలపరిచేందుకు కాంగ్రెస్ తిరస్కరించింది

1923 నుండి ప్రతి ఏటా సమావేశాలు జరుపుతున్న ‘స్టేట్ పీపుల్సు కాన్ఫరెన్సు’ వారుకూడా స్వతంత్ర సంస్థానాలలో జరుగుతున్న ప్రజాపోరాటాలను బలపరిచేందుకు పూనుకోలేదు కాని బరోడాలోను, కథియవార్‌లోను జాతీయ భావాలుగలవారు స్థాపించిన ప్రజాపరిషత్తులు కొంత కృషి చేశాయి

రైత్వారీ ప్రాంతాలలో జరిగిన పోరాటాలను కాంగ్రెసు పూర్తిగా బలపర్చింది 1923–24లో తంజావూర్ జిల్లాలో పెంచిన రెవిన్యూకు వ్యతిరేకంగా మిరాసీదార్లు ప్రారంభించిన ఉద్యమాన్ని కాంగ్రెసు బలపర్చింది 1928లో కృష్ణా–గోదావరి డెల్టాలలో దండు నారాయణరాజు, వడ్డే శోభనాద్రి, వెన్నేటి సత్యనారాయణ, ఎన్.జి.రంగా మొదలైనవారి నాయకత్వాన ప్రారంభమై, దీర్ఘకాలం సాగిన రీ–సెటిల్‌మెంట్ వ్యతిరేక ఉద్యమాన్నికూడా కాంగ్రెసు గట్టిగా బలపర్చింది వల్లభభాయ్ పటేల్ బార్డోలీలో సాధించిన విజయం, యితరచోట్ల సాగిన రీ–సెటిల్‌మెంటు వ్యతిరేక ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చింది

ఆ సమయంలోనే 1928 ఆగస్టు ఒకటిన ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘస్థాపన జరిగింది

## కుల ఉద్యమాలు

బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాన్ని తోడు జేసుకొని మద్రాసు రాష్ట్రంలో జస్టిస్ పార్టీ బలపడింది పంజాబ్‌లో ఫజల్-ఇ-హుస్సేన్ ముస్లిమ్ భూస్వాములను, జాట్ భూస్వాములను ఏకంచేసి, కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా 'యూనియనిస్టు పార్టీ'ని స్థాపించాడు మహారాష్ట్రలో భాస్కరరావు జాదవ్ ప్రారంభించిన 'నాన్-బ్రామిన్' ఉద్యమం ఒకవైపున బ్రాహ్మణేతరులకు రిజర్వేషన్లు కోరుతూ, మరోవైపున బ్రాహ్మణులను అనుకరించింది సత్యశోధక ఉద్యమ కార్యకర్తలు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగాను, కాంగ్రెసులో బ్రాహ్మణాధిక్యతకు వ్యతిరేకంగాను ప్రచారం సాగిస్తూ, సతారా జిల్లాలో జమీందారీ వ్యతిరేక పోరాటాలుకూడా నడిపారు డాక్టర్ అంబేద్కర్ నాయకత్వాన మహార్లు శాసనసభల్లోను, స్థానిక సంస్థలలోను ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని డిమాండ్ చేశారు మనుస్మృతిని తగలబెట్టారు

బీహార్‌లో యాదవులు యజ్ఞోపవీతాలు ధరించి, అగ్రవర్ణంవారమని చెప్పుకుంటూ జమీందార్లకు చేసే సేవలను మానివేశారు స్వామి సహజానంద సరస్వతి 'భూమిహార్ బ్రాహ్మణ సభ'ను స్థాపించాడు కాని క్రమంగా కష్టజీవులవైపు మొగ్గి, 1936లో అఖిల భారత కిసాన్ సభకు అధ్యక్షుడయ్యాడు

సహాయ నిరాకరణోద్యమంలో చురుకుగా పాల్గొన్న ఇ వి రామస్వామి నాయకర్ కాంగ్రెసుతో తెగతెంపులు చేసుకొని, తమిళనాడులో 'కుడిఅరసు' పత్రికను 1924లోను, 'ఆత్మగౌరవం' ఉద్యమాన్ని 1925లోను ప్రారంభించాడు బ్రాహ్మణ పౌరోహిత్యం అక్కరలేదన్నాడు మనుస్మృతులను తగలబెట్టించాడు దేవుడు లేడన్నాడు వర్ణాశ్రమ ధర్మాన్ని గాంధీజీ సమర్థించినందుకు ఆక్షేపణ తెలిపాడు

కేరళలో శ్రీ నారాయణగురు నాయకత్వాన 'ఎర్ఝువ' కులంవారు ప్రారంభించిన ఆలయ ప్రవేశ ఉద్యమం కొంతవరకే జయప్రదమైంది కుల విభజనకు వ్యతిరేకంగా నారాయణగురు వెల్లడించిన అభిప్రాయాలు గాంధీజీకి నచ్చలేదు అయినా, 'ఆలయ ప్రవేశమొక చిన్న సమస్య మాత్రమే దేవుడూ లేదు దయ్యమూ లేదు' అంటూ కె అయ్యప్పన్, సి కేశవన్‌లాంటివారు వర్గ పోరాటానికి బాటలు వేశారు

ఆ దశలో నిరాశా నిస్పృహలకు లోనైన మోతీలాల్ నెహ్రూ జవహర్‌లాల్ నెహ్రూకు ఒక లేఖ వ్రాశాడు అందులో యిలా వుంది

"భారతదేశంలో పరిస్థితులు యింత అధ్వాన్నంగా ఎన్నడూ లేవు సహాయ నిరాకరణోద్యమ వైఫల్యం జాతీయ కార్యక్రమాలను నీళ్ళుగార్చింది ఇప్పుడు ప్రజలు నేర్చుకుంటున్న విద్య కుల, మత ద్వేషం మాత్రమే నాయకులు పదవుల కొరకు పోటీ పడుతున్నారు."

## అక్టోబరు విపవం

1919లో యుగాంతర్ పార్టీ నాయకుడు ఎం ఎన్ రాయ్ మెక్సికోలో బోల్షివిక్ పార్టీ నాయకుడైన మైఖేల్ బోరోడిన్‌తో సంబంధం పెట్టుకున్నాడు 1920లో రష్యాకు వెళ్లాడు తరువాత అవని ముఖర్జీ, మహ్మద్ షఫీఖ్ మున్నగు వారితో కలిసి తాష్కెంట్‌లో "కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా"ను స్థాపించాడు ఆఫ్ఘనిస్థాన్‌గుండా ఇండియాలో

ప్రవేశించి పోరాటాన్ని ప్రారంభించుటకు ముజాహిదీన్లు చేసిన ప్రయత్నం భగ్నమైనందున 1922లో బెర్లిన్ వెళ్లి "వాన్‌గార్డ్ ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్స్"ను స్థాపించిన భూపేంద్రనాథ్ దత్, వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ, బర్కతుల్లా మొదలగువారితో విభేదించాడు.

1921 నాటి ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో భోగరాజు పట్టాభి సీతారామయ్య "సోవియట్టులు" అనే శీర్షికతో సుదీర్ఘ వ్యాసం వ్రాశాడు "సోవియట్ సోషలిస్టు వ్యవస్థలో ధనికుడు లేడు, పేదవాడు లేడు, సోమరిలేడు, దోచుకుతినే తిండిపోతు లేడు, వాడిని రక్షించే భటుడు లేడు--- ఆర్యయుగ ధర్మముల నెరిగిన మనకీ నూతన విధానం కృతయుగ లక్షణ సమన్వితమై కన్పట్టుచున్నదనుటకు సందియము లేదు" అని వివరించాడు

1921లో, మద్రాసునుండి వెలువడుతున్న స్వరాజ్య పత్రిక ఉపసంపాదకుడు గోవిందరాజుల వెంకట కృష్ణారావు "నికోలాయ్ లెనిన్" అనే పుస్తకం వ్రాశాడు సోషలిజం యొక్క అంతిమ విజయాన్ని గురించి తనకుగల విశ్వాసాన్ని యిలా వెల్లడించాడు

"1917లో జరిగిన రష్యన్ విప్లవం, సర్వమానవ పురోగమన పథంలో ఒక మైలురాయి లాంటిది శైశవదశలో నున్న సోవియట్ రిపబ్లిక్‌యొక్క మార్గం అనేక విపత్కర పరిస్థితులతో కూడుకున్నదనే విషయాన్ని ఎవరూ కాదనరు నిర్ణీత లక్ష్యాన్ని చేరుకునేందుకు సోవియట్ రష్యా యింకా ఎంతో స్వేదం-రక్తం ధారపోయవలసి రావచ్చు అయినప్పటికీ అది సాధించిన విజయం, ఆధునిక సార్వత్రిక ఆలోచనా ధోరణిని మార్చివేసింది మహోత్కృష్టమైన విప్లవ ఆదర్శాలుగల, తరుణ శక్తి సంపన్నులైన రష్యన్ ప్రజలనుండి ప్రపంచంలోని ఇతర ప్రాంతాలకు నవజీవన స్రవంతులు పొంగి ప్రవహిస్తాయి ఇప్పటికే సాధించబడిన విజయచిహ్నంగా వెలుగొందుతున్న కమ్యూనిస్టు పతాక క్రింద, సకల దేశ శ్రామిక స్త్రీ-పురుషులు సమీకృతులై, సమైక్యమవడానికి అరుణపతాక తోడ్పడుతుంది "

## గాంధీ - లెనిన్

ఆ రోజుల్లో గాంధీజీ స్వరాజ్య సాధనకు అహింసామార్గాన్ని చేపట్టాడు లక్షలాది ప్రజలను జాతీయ విముక్తి పోరాటంలో సమీకరించడానికది తోడ్పడింది అటువంటి అహింసా మార్గాన్ని చేపట్టక రక్తాన్ని చిందించడమెందుకు? అన్న ప్రశ్నకు జవాబుగా కృష్ణారావు ఇలా వ్రాశాడు

"గాంధీజీ ఆదర్శవాది, లెనిన్ భౌతికవాది వర్గసామరస్యాన్ని గాంధీ విశ్వసించాడు దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా వర్గ పోరాటాన్ని లెనిన్ విశ్వసించాడు ఉపనిషత్తులలోగల మహోన్నత ఆధ్యాత్మిక చింతననుండి గాంధీ పుట్టాడు పశ్చిమదేశాల భౌతికవాద భావననుండి లెనిన్ పుట్టాడు అయినా ఉభయుల ఆశయం ఒకటే ఆ ఆశయ సాధనకు విభిన్న కార్యరంగాల కేటాయింపు మాత్రం జరిగింది అనతికాలంలోనే ఉభయులూ, నేటి అరాచక పరిస్థితులనుండి ఒక ఉన్నత అంబరపథాన్ని - ప్రజలందరూ అందరి క్షేమం కొరకు తమంత తాముగా కృషి చేసే పథాన్ని - రూపొందించుటలో కృతకృత్యులవుతారు "

## "పెషావర్ కుట్ర" కేసులు

పర ప్రభుత్వ పాలనను సహించలేని ముస్లిములు ఎదురు తిరిగి యుద్ధం చేస్తే అది "జెహాద్" అనగా పవిత్ర యుద్ధం ఎదురు తిరగలేక తగిన సమయం కొరకు

నిరీక్షిస్తూ దేశంనుండి వెళ్లిపోవటం "హిజ్రత్ " అలా వెళ్లిపోయినవారు "ముజాహిదీన్లు"గా పిలువబడతారు

బ్రిటిష్ ప్రభుత్వ నిరంకుశత్వాన్ని భరించలేక 1920లో దాదాపు 18 వేల మంది ముస్లిములు ఆఫ్ఘనిస్తాన్‌కు వెళ్లారు ఆఫ్ఘన్ ప్రభుత్వ మద్దతుతో పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో తిరుగుబాటును లేవదీయగలమని ఆశించారు కాని, ఆఫ్ఘన్ ప్రభుత్వం సహాయ పడనందున అనేక బాధలకు లోనయ్యారు అందువల్ల వారిలో కొందరు అముదర్యా నదిని దాటి రష్యాలో ప్రవేశించారు అక్కడ షౌకత్ ఉస్మానీ నాయకత్వాన రెడ్ ఆర్మీకి అండగా నిలబడి విద్రోహులతో పోరాడారు కొందరు మరణించారు తక్కినవారు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వంమీద కత్తిగట్టేందుకు భారతదేశానికి రాసాగారు అలా వస్తున్న వారిలో కొందరిని 1922 మార్చిలో ప్రభుత్వం అరెస్టుచేసి, పెషావర్ కుట్ర కేసును బనాయించింది తరువాత 1922-24 మధ్యకాలంలో మరో మూడు పెషావర్- బోల్షివిక్ కుట్ర కేసులను బనాయించింది

మొదటి కేసులో రషీద్ అహ్మద్, అక్బర్‌ఖాన్‌లతోపాటు మరో నలుగురికి దీర్ఘకాల శిక్షలు విధించారు రెండవ కేసులో అక్బర్‌ఖాన్‌కు ఏడేళ్ల కఠిన శిక్ష, మూడు నెలల ఒంటరి ఖైదు వేశారు గులాం మహబూబ్‌కు, మహమ్మద్ హుస్సేనుకు మూడేళ్ళ కఠిన శిక్ష, మూడు నెలల ఒంటరి ఖైదు విధించారు షౌకత్ ఉస్మానీపై అదనంగా మరో కేసును బనాయించి రెండేళ్ళ కఠిన శిక్ష వేశారు అబ్దుల్ మజీద్, హబీబ్ అహ్మద్, రఫీక్ అహమద్, ఫిరోజుద్దీన్ మన్సూర్, సుల్తాన్ అహమ్మద్‌లకు ఏడాది కఠిన శిక్ష, గోహార్ రహ్మాన్‌ఖాన్, మియా అక్బర్ షా కటక్‌లకు మూడేళ్ళ కఠిన శిక్ష వేశారు ఇలా శిక్షింపబడిన వారందరూ దేశాన్ని విడిచిపెట్టి వెళ్ళినపిమ్మట కమ్యూనిస్టులుగా మారి తిరిగివచ్చినవారే

## కాన్పూర్ కుట్రకేసు

కాన్పూర్ కుట్ర కేసును ప్రభుత్వం బనాయించేనాటికి, దేశంలో కొన్ని కమ్యూనిస్టు గ్రూపులు ఏర్పడ్డాయి సహాయ నిరాకరణోద్యమం, ఖిలాఫత్ ఉద్యమం, హిజ్రత్ వీరుల ప్రయత్నం, గదర్‌వీరుల తిరుగుబాటు, టెర్రరిస్టుల విప్లవ ప్రయత్నాలు విఫలమైనందున ఆ ఉద్యమాలలో పాల్గొన్నవారిలో కొందరు అక్టోబరు విప్లవాన్ని గురించి అధ్యయనం చేయసాగారు అలాంటివారికి బెర్లిన్, లండన్ మున్నగు తావులనుండి కమ్యూనిస్టు కరపత్రాలు వగైరా అందుతుండేవి కాని వాటిలో కొన్ని ప్రభుత్వం చేతుల్లో పడేవి అయినా అప్పటికే ఇండియాలో కూడా సోషలిస్టు పత్రికలు వెలిశాయి

1922 ఆగస్టులో డాంగే "సోషలిస్టు" వారపత్రికను బొంబేనుండి ప్రచురించ నారంభించాడు ఆత్మశక్తి, ధూమకేతు అనే పేరుగల వామపక్ష పత్రికలు కలకత్తానుండి వెలువడసాగాయి వాటిలో లెనిన్‌ను గురించీ, రష్యాను గురించీ, భారతదేశంలో సాంఘిక ఆర్థిక వ్యవస్థలను గురించీ వ్యాసాలు వెలువడేవి కాగా కమ్యూనిస్టు ఉద్యమాన్ని మొగ్గలోనే త్రుంచివేసేందుకు ప్రభుత్వం 1924 ఫిబ్రవరి 21న కాన్పూర్ కుట్ర కేసును బనాయించింది ఆ కేసులో యం యన్ రాయ్, ముజఫర్ అహ్మద్, షౌకత్ ఉస్మానీ, యస్.ఏ డాంగే, గులాం హుస్సేన్, నళినీగుప్తా, సింగారవేలు చెట్టియార్, ఆర్ సి యల్ శర్మ నిందితులుగా పేర్కొనబడ్డారు. వీరిలో యం యన్ రాయ్ జర్మనీలో వున్నాడు శర్మ పుదుచ్చేరిలో వున్నాడు గులాం హుస్సేన్ క్షమాపణ చెప్పుకున్నాడు సింగారవేలు చెట్టియార్‌ను గృహ నిర్బంధంలో

వుంచారు కాగా ముజఫర్ అహ్మద్, షౌకత్ ఉస్మానీ, ఎస్ ఎ డాంగే, నళినీ గుప్తాలకు నాలుగేళ్ళ చొప్పున కఠిన శిక్ష విధించారు

## జాతీయోద్యమంలో కమ్యూనిస్టుల పాత్ర

బూర్జువా వర్గ నాయకత్వంలో జరుగుతున్న జాతీయ విముక్తి పోరాటాలలో కమ్యూనిస్టులు పాల్గొనవలసిన అవసరాన్ని లెనిన్ నొక్కి చెప్పాడు అదే విషయాన్ని 1920లో యం యన్.రాయ్‌కి చెప్పాడు అయినా రాయ్ వినలేదు

"గాంధీజీలాంటి జాతీయ బూర్జువా నాయకులమీద ప్రజలకుగల భ్రమలు తొలగిపోయాయి అందువల్ల ప్రజలు బూర్జువా రాజకీయాలతో నిమిత్తం లేకుండా ఇండియాలో విప్లవాన్ని ప్రారంభించేందుకు సన్నద్ధులవుతున్నారు" అని యం యన్ రాయ్ వాదించాడు రాయ్ వాదనను భారత కమ్యూనిస్టులు త్రోసిపుచ్చారు జాతీయ ఉద్యమంలో పాల్గొంటూ ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళారు ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను బలోపేతం చేశారు రైతుల హక్కులను బలపరుస్తూ తీర్మానాలు చేశారు జాతీయ దృక్పథంతోపాటు అంతర్జాతీయ దృక్పథాన్ని అలవరుచుకొని స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు

1922 డిసెంబరులో గయలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో కమ్యూనిస్టుల తరపున మాట్లాడిన సింగారవేలు చెట్టియార్, "సహాయ నిరాకరణ ఉద్యమాన్ని విరమించడంవల్ల, గొప్ప విపత్తు దాపురించిందని" ఘాటుగా విమర్శించాడు సహాయ నిరాకరణ ఉద్యమాన్ని కొనసాగించడంతోపాటు కార్మిక సమ్మెలను, రైతు పోరాటాలను బలపర్చవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాడు కమ్యూనిస్టు మానిఫెస్టోతోపాటు మరికొన్ని కరపత్రాలనుకూడా కమ్యూనిస్టులు ఆ మహాసభలో పంచిపెట్టారు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని, కష్టజీవులకు ఆర్థిక సాంఘిక సమానత్వం చేకూర్చాలని వివరించారు

భారత జాతీయ కాంగ్రెసుకు అనుబంధంగా "సోషలిస్టు లేబర్ పార్టీ"ని స్థాపించడం మంచిదనే అభిప్రాయాన్ని డాంగే వెలిబుచ్చగా, "లేబర్ కిసాన్ పార్టీ"ని స్థాపించడం అవసరమనే అభిప్రాయాన్ని సింగార వేలు చెట్టియార్ వెల్లడించాడు అలా ఒకవైపున వర్గ సంఘాల కొరకు ప్రయత్నిస్తూనే మరోవైపున కమ్యూనిస్టులు కాంగ్రెస్‌లో వుంటూ సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు కృషి చేశారు

## కమ్యూనిస్టు పార్టీ సమావేశం - వర్గసంఘాల స్థాపన

1925 డిసెంబర్ ఆఖరువారంలో భారత జాతీయ కాంగ్రెస్ సమావేశం కాన్పూర్‌లో జరుగుతున్న సమయంలో డిసెంబర్ 26వ తేదీన భారత కమ్యూనిస్టు పార్టీ ప్రారంభ సమావేశంకూడా కాన్పూరులోనే జరిగింది సింగారవేలు చెట్టియార్ అధ్యక్షత వహించాడు హజరత్ మొహానీ ఆహ్వాన సంఘాధ్యక్షుడు

1925-26లో "పెజెంట్సు అన్డ్ వర్కర్సు పార్టీ"ని బెంగాల్లో ముజఫర్ అహ్మద్, నజ్రుల్ ఇస్లామ్ (ప్రసిద్ధకవి), కుతుబుద్దీన్ అహమ్మద్, హేమంత్‌కుమార్ సర్కార్ (చిత్తరంజన్‌దాస్ కార్యదర్శి) మున్నగువారు స్థాపించారు 1927లో గోపేన్ చక్రవర్తి, ధరణి గోస్వామి నాయకత్వానగల అనుశీలన సమితి సభ్యులు కొందరు ఆ పార్టీలో చేరారు "లాంగాల్", "గణవాణి" పత్రికలు ప్రచురించబడినాయి

పంజాబ్‌లో గదర్‌పార్టీ నాయకుడు సంతోక్‌సింగ్ "కీర్తి" పత్రికను ప్రారంభించాడు 1926లో కొందరు గదర్‌వీరులు సంతోక్‌సింగ్‌తో చేతులు కలిపారు తరువాత "బబ్బర్ అకాలీ ఉద్యమం"లో పాల్గొన్న తీవ్రవాదులతో కలిసి "కీర్తికిసాన్ పార్టీ"ని సోహన్‌సింగ్ జోష్ అధ్యక్షతన స్థాపించారు

1927 జనవరిలో బొంబేలో మిరాజకర్, జోగ్లేకర్, ఘాటేల నాయకత్వాన "వర్కర్సు అన్డ్ పెజెంట్సు పార్టీ" స్థాపించబడింది "క్రాంతి" అనే మరాఠీ పత్రికను కూడా వారు ప్రారంభించారు జౌళిమిల్లుల కార్మికుల సమస్యలను చేపట్టారు

ఈ విధంగా కమ్యూనిస్టులు కార్మికవర్గంతో మంచి సంబంధాలను పెంచుకో గలిగారు 1927 ఫిబ్రవరిలోను, సెప్టెంబరులోను ఖరగ్‌పూర్ రైల్వే వర్కుషాపులో జరిగిన కార్మిక సమ్మెల్లో పాల్గొన్న కమ్యూనిస్టులు, సి యఫ్ ఆండ్రూస్ మున్నగు మితవాద నాయకుల పద్ధతులను వ్యతిరేకించారు ఖరగ్‌పూర్ సమ్మెకు మద్దతుగా ఇతరచోట్లకూడా సమ్మెలు ప్రారంభించవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు అయినా ఆండ్రూస్ అంగీకరించలేదు. కనుక డాంగే ఆండ్రూస్ మీద విరుచుకుపడ్డాడు "జాతీయ కాంగ్రెస్‌ను పక్కదారి పట్టించిన హ్యూమ్‌లా, ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని పక్కదారికి మళ్ళించజూడడం వ్యర్థం, కార్మికులు తమ భవిష్యత్తును తామే తీర్చిదిద్దుకోగలరు" అని స్పష్టీకరించాడు

1927లో బ్రిటిష్ పార్లమెంటుకు ఎన్నికైన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు సక్లత్‌వాలా, భారతదేశంలో ఏర్పాటు చేయబడిన అనేక సభలలో ఉపన్యసించాడు ఆ సందర్భంలో కాంగ్రెస్ వారి ఆధిపత్యంలోనున్న మునిసిపాలిటీలు ఆయనకు సన్మానపత్రాలు సమర్పించాయి గాంధీజీకూడా ఆయనతో చర్చలు సాగించాడు తరువాత గాంధీజీ ఇలా అన్నాడు

"కామ్రేడ్ సక్లత్‌వాలా నిజాయితీ మెచ్చదగినది ప్రస్తుతం ఆయన, నేను రెండు విభిన్న మార్గాలలో పయనిస్తున్నాం అయినా ఏదో ఒకరోజున ఇద్దరం కలిసి పయనించగలమని ఆశిస్తున్నా"

1921లో జరిగిన అహమ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశంనాటినుండి సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదింపజేసేందుకు కమ్యూనిస్టులు చేసిన ప్రయత్నం చివరకు 1927లో ఫలించింది

1927లో మద్రాసులో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభ "సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశ లక్ష్యం" అనే తీర్మానాన్ని ఆమోదించింది షాంఘేలో విప్లవాన్ని అణచడానికి భారత సైన్యాలను పంపినందుకు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించింది పీడిత ప్రజల అంతర్జాతీయ సంస్థను ఏర్పరచేందుకు సమ్మతించి, జవహర్‌లాల్ నెహ్రూను బ్రస్సెల్సులో జరిగిన సభకు ప్రతినిధిగా పంపింది ఆ సభకు గౌరవాధ్యక్షుడుగా నెహ్రూ ఎన్నికయ్యాడు

ఆ సందర్భంలోనే జవహర్‌లాల్ నెహ్రూతోపాటు మోతీలాల్ నెహ్రూకూడా సోవియట్ యూనియన్‌ను సందర్శించాడు సోవియట్ ఆశయాల గురించి, విజయాలను గురించి జవహర్‌లాల్ నెహ్రూ అనేక వ్యాసాలు వ్రాసి హిందూ పత్రికలో ప్రకటించాడు

సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలనే తీర్మానాన్నికూడా మద్రాస్ సమావేశంలోనే కాంగ్రెస్ ఆమోదించింది కాగా 1928లో కమ్యూనిస్టులు, ఇతర వామపక్షాలవారు, టెర్రరిస్టు విప్లవకారులు జాతీయవాదులతో కలిసి బహిష్కార ఉద్యమంలో పాల్గొన్నారు అలాగే కార్మికవర్గంకూడా విశేష సంఖ్యలో పాల్గొన్నది కాబట్టి నూతన రాజకీయ చైతన్యాన్ని సంతరించుకోగలిగింది

# కాకోరీ కుట్రకేసు

బెంగాల్లోను, ఉత్తరప్రదేశ్‌లోను వేర్వేరుగా పనిచేస్తున్న విప్లవ సంఘాలు 1923లో కలిసి పనిచేయసాగాయి హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్ ఏర్పడింది 1924లో హౌరావద్ద యోగీశచంద్ర ఛటర్జీ పోలీసులకు దొరికిపోయాడు అతని వద్దనున్న పత్రాలనుబట్టి, ఉత్తరప్రదేశ్‌లోని 23 జిల్లాలలో విప్లవపార్టీ శాఖలున్నాయని పోలీసులు తెలుసుకోగలిగారు కాగా ప్రభుత్వ నిర్బంధ చర్యలు తీవ్రమయ్యాయి

పార్టీ నిర్వహణ, ఆయుధాల కొనుగోలు వగైరాలకు డబ్బు అవసరం కాబట్టి విప్లవకారులు తమవద్దనున్నదంతా ఖర్చుపెట్టారు తరువాత శచీంద్రబక్షి నాయకత్వాన దోపిడీలకు పాల్పడ్డారు చివరకు రామ్‌ప్రసాద్ బిస్మిల్ సలహా ప్రకారం రైళ్లలో తీసుకుపోయే ఖజానాను కొల్లగొట్టేందుకు నిర్ణయించారు

1925 ఆగస్టు 9న సహరన్‌పూర్‌నుండి లక్నో వెళుతున్న రైలులో పదిమంది విప్లవకారులు ఎక్కారు కాకోరీ రైల్వేస్టేషన్ దాటిన తరువాత గొలుసు లాగి రైలును ఆపుజేశారు వెంటనే బండినుండి దిగిన విప్లవకారులు గాలిలోకి తుపాకులు కాల్చినందున ప్రయాణీకులతోపాటు, ఖజానా పెట్టెవద్ద కాపలావున్న రిజర్వు పోలీసులుకూడా భయపడి చేతులెత్తారు అసఫకుల్లాఖాన్ సుత్తిపుచ్చుకొని ఇనుప పెట్టెను బద్దలుకొట్టి ఖజానా సంచులను బయటకు తీశాడు వాటిని తీసుకుని విప్లవకారులు లక్నోకు వెళ్లిపోయారు

తరువాత ప్రభుత్వం 40 మందిని అరెస్టుచేసి, 1925 సెప్టెంబర్ 26న కేసుపెట్టింది అదే కాకోరీ కుట్రకేసు ఆ కేసు విచారణ 18 నెలలపాటు జరిగింది 1927 ఏప్రిల్ 7న యిచ్చిన కోర్టు తీర్పులో రామ్‌ప్రసాద్ బిస్మిల్, రాజేంద్రనాథ్ లహరీ, అసఫకుల్లాఖాన్, రోషన్‌సింగ్‌లకు ఉరిశిక్ష, శచీంద్రబక్షి, శచీంద్రనాథ్ సన్యాల్, మన్మధనాథ్‌గుప్త మున్నగువారికి యావజ్జీవ దేశాంతరవాస శిక్ష, మరికొందరికి పదేళ్ళ కఠినశిక్ష విధింపబడినాయి చంద్రశేఖర్ అజాద్ అసలు పట్టుబడనేలేదు

అసఫకుల్లాఖానును అరెస్టు చేసినప్పుడు ఖాన్ బహద్దూర్ హుస్సేన్ (డి యస్ పి), సయ్యద్ ఐనుద్దీన్ (మేజిస్ట్రేట్) ఆయనతో ఇలా వాదించారు

"నీవు ముస్లిమ్ మేము ముస్లిములమే రామప్రసాద్ బిస్మిల్ హిందువు. బ్రిటిష్ వారిని పారద్రోలి హిందూరాజ్యం స్థాపించేందుకు అతను కృషి చేస్తున్నాడు. నీ మతానికి, నీ మతం వారి ప్రయోజనాలకు వ్యతిరేకంగా అతనితో చేతులు కలపడం దేనికి?" అంటూ ఖాన్‌ను లొంగదీసుకునేందుకు ప్రయత్నించారు అప్పుడు అసఫకుల్లాఖాన్ ఇలా జవాబిచ్చాడు

"నా దృష్టిలో రామ్‌ప్రసాద్ బిస్మిల్ హిందువుకాడు అతడు హిందూస్థానీయుడు అతని ఆశయం హిందూ స్వాతంత్ర్యం కాదు- హిందూస్థానీ స్వాతంత్ర్యం ఒకవేళ అతను హిందూ రాజ్యం కొరకు ప్రయత్నించినా, నేను అతనితో చేతులు కలిపేవాడినే ఎందువల్లనంటే బ్రిటిష్‌వారికంటే హిందువులు నయంగదా? హిందువులు మనదేశస్థులే గదా?"

1927 ఏప్రిల్ 3న ఫైజాబాద్ జైలులో ఉరికంబమెక్కేముందు అసఫకుల్లాఖాన్ దేశప్రజలకు ఈ క్రింది సందేశమిచ్చాడు

"మన దేశ రాజకీయ రంగంలో మా పాత్రను మేము నిర్వహించాం. నా చర్యలను

కొందరు మెచ్చుకుంటారని, మరి కొందరు విమర్శిస్తారని నాకు తెలుసు కాని నిజమైన విప్లవకారునిగా నేను వాటిని లెక్కచేయను నేను మరణించేముందు ఒక విషయాన్ని స్పష్టం చేయదలచుకున్నాను మన దేశంలోని అన్ని మతాలవారికీ బ్రిటిష్‌వాళ్లు శత్రువులే కాబట్టి వాళ్ల నిరంకుశత్వాన్ని పూడ్చిపెట్టడం ప్రతి భారతీయుని నైతిక విధి భారత స్వాతంత్ర్య బలిపీఠంపైన ప్రాణాలర్పిస్తున్న భారతీయ ముస్లిమ్‌ను అవుతున్నందుకు గర్వపడుతున్నాను ”

అసఫకుల్లాఖాన్ ఉర్దూ కవి మరికొన్ని నిముషాలకు ఉరితీస్తారనగా కవిత్వం చెప్పాడు దాని భావమిది

“నిరంకుశత్వాన్ని, అన్యాయాన్ని సహించలేక ఫైజాబాద్ జైలునుండి మృత్యుభూమికి పయనిస్తున్నాను ”

అలా కవిత చెప్పిన వెంటనే ఆయన ఖురాన్ చేతపట్టుకొని ఉరికంబమెక్కాడు అన్నదమ్ముల్లా తనతో కలిసి ఒకే కంచంలో భుజించిన రాంప్రసాద్‌ను విడిచి వెళ్లిపోయాడు

“బ్రిటిష్ సామ్రాజ్యవాదం నశించాలి వందేమాతరం! భారతమాతకు జై” అంటూ గోరఖ్‌పూర్ జిల్లా జైలులో 1927 డిసెంబరు 19న ఉరికంబమెక్కిన రాంప్రసాద్ బిస్మిల్ జాతీయ ఉద్యమంలో పాల్గొన్నాడు విప్లవవాదులు సాగించిన పోరాటాలలోను పాల్గొన్నాడు మణిపూర్ కుట్ర కేసులో పట్టుబడకుండా తప్పించుకొని, నేపాల్లో ప్రవాస జీవితం గడిపాడు విప్లవగేయాలు రచించేవాడు ఉద్రేకపూరితంగా ఉపన్యసించేవాడు ఆపదలో చిక్కుకున్నప్పుడు సహితం సడలని మనోనిబ్బరంగలవాడు ఒకసారి అతనిపెట్టె రైల్వేకూలీ చేతినుండి జారి ప్లాట్‌ఫారంమీద పడింది పెట్టె మూత విడిపోయి, రివాల్వరు, తూటాలు చిందరవందరయ్యాయి సూటూ, బూటూ, హాట్‌తోవున్న బిస్మిల్ తొణకకుండా రైల్వేకూలీని గద్దించాడు దగ్గరలోవున్న రైల్వే పోలీసు ఇన్‌స్పెక్టర్ అతనెవరో పెద్ద అధికారి అనుకొని, రివాల్వరును, తూటాలను పెట్టెలో సర్దిపెట్టి రైలు ఎక్కించాడు

ఆ స్వాతంత్ర్య సమరయోధుడు ఉరితీయబడిన వార్త విని, ఆయన తల్లి ఇలా అన్నదట

“రాంప్రసాద్ బిస్మిల్ త్యాగి మాతృదేవి పాదాలవద్ద ప్రాణములర్పించిన నా కుమారుని త్యాగదీక్షకు నేను గర్వపడుతున్నాను నా కుమారునివంటివారిపైన దేశమాతకే ఎక్కువ అధికారం వుంటుంది. కనుక నేను విచారపడడంలేదు ”

కాకోరీ కుట్ర కేసు దేశంలో పెద్ద సంచలనాన్ని గలిగించింది. కేసులో ఇరికించబడిన వారిని గురించి కథలు, గేయాలు, వ్యాసాలు ప్రచురింపబడేవి

## సైమన్ గోబాక్

ఈ నినాదం 1928లో దేశమంతటా ప్రతిధ్వనించింది భారత రాజ్యాంగం సమీక్ష కొరకు బ్రిటిష్ పార్లమెంటుచే నియమించబడిన సైమన్ కమిషన్‌లో భారతీయులెవరూ లేరు గనుక, ఆ కమిషన్‌ను బహిష్కరించాలనే భావం సర్వత్రా వ్యాపించింది కనీసం ఆనాడు బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడుగానున్న లార్డ్ సిన్హాను కమిషన్ సభ్యుడుగా నియమించినా భారతీయులకు కొంత ఉపశమనం కలిగేది కాని ఆ పని జరగలేదు సర్ జాన్ సైమన్ నాయకత్వాన మరో అరుగురు ఆంగ్లేయులతో కూడిన కమిషన్ నియామకం జరిగింది కనీసం అధినివేశ ప్రతిపత్తికికూడా భారతీయులు అర్హులు కారనే

ధోరణిలో ఇండియా సెక్రటరీ బర్కెన్‌హెడ్ మాట్లాడాడు కనుక కాంగ్రెస్‌తోపాటు ముస్లింలీగ్, హిందూ మహాసభ, లిబరల్‌పార్టీకూడా సైమన్ కమిషన్‌ను బహిష్కరించాయి

అయినా 1928 ఫిబ్రవరి 3న సైమన్ కమిషన్ సభ్యులు బొంబాయిలో అడుగు పెట్టారు సైమన్ గోబాక్ అని నినాదాలిస్తూ, నల్లజెండాలు ఊపుతూ యాభైవేలమంది వలంటీర్లు ఊరేగింపు జరిపారు తరువాత ఢిల్లీ, కలకత్తా, లాహోర్, మద్రాసు మొదలైన చోట్లకూడా వేలాది ప్రజలు నల్లజెండాలు చూపుతూ ప్రదర్శనలు జరిపారు

కలకత్తాలో పోలీసులకు విద్యార్థులకు మధ్య ఘర్షణలు జరిగాయి లక్నోలో ప్రజలను చెదరగొట్టేందుకు అశ్విక దళాల నుపయోగించారు పట్టణాన్ని సాయుధ శిబిరంగా మార్చారు అయినా ఎక్కడ చూచినా 'సైమన్ గోబాక్', "భారతదేశం భారతీయులదే" అనే నినాదాలు వ్రాసిన గాలిపటాలు కనిపించేవి

పాట్నాలో సైమన్ కమిషన్‌కు స్వాగతం చెప్పేందుకు ప్రభుత్వోద్యోగులు లారీలలో ప్రజలను తీసుకొచ్చారు. కాని వారుకూడా నల్లజెండాల ఊరేగింపులో చేరిపోయారు

కమిషన్‌కు వ్యతిరేకంగా లాహోర్‌లో పెద్ద ఊరేగింపు జరిగింది ఒక పోలీసు అధికారి లాఠీతో లాలా లజపతిరాయ్‌ని తీవ్రంగా కొట్టాడు ఆ సమయంలో రెచ్చిపోయిన ప్రజలను లజపత్‌రాయ్ వారించాడు ఆ సాయంత్రం జరిగిన సభలో "మామీద పడిన ప్రతి దెబ్బ బ్రిటిష్ సామ్రాజ్య శవపేటికకు ఒక్కొక్క మేకు అవుతుంది" అని లజపతిరాయ్ గర్జించాడు కాని ఆ దెబ్బలతోనే 1928 నవంబర్ 17న కీర్తిశేషుడయ్యాడు

సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా మద్రాసులో ఊరేగింపులు, ప్రదర్శనలు జరిగాయి హైకోర్టు ప్రాంతంలో ఆంధ్రులు జరుపుతున్న నిరసన ప్రదర్శకుల మీద పోలీసులు కాల్పులు జరిపారు అక్కడికక్కడే ఒకరు మరణించగా, తరువాత గాయాలతో మరో ఇద్దరు మరణించారు ఆ సమయంలో వేరొక ఊరేగింపుకు నాయకత్వం వహిస్తున్న ప్రకాశంగారక్కడకువచ్చి, చనిపోయిన వ్యక్తిని చూడాలని పట్టుబట్టాడు పోలీసులు వీలు లేదన్నారు ముందుకు అడుగువేస్తే కాలుస్తామన్నారు "కాల్చుకోండిరా" అంటూ ప్రకాశం తన చొక్కావిప్పి, ఎదురొమ్ము చూపుతూ ముందుకు వెళ్ళాడు దిగ్భ్రాంతి చెందిన పోలీసులు మెదలకుండా వుండిపోయారు చనిపోయిన వ్యక్తినీ, గాయపడినవారిని చూచినపిమ్మట ప్రకాశం పంతులు వెనుదిరిగాడు

ఆ రోజుల్లో బందరు తాలూకా బోర్డు ప్రెసిడెంట్‌గావున్న గొట్టిపాటి బ్రహ్మయ్య ఆఫీసు భవనం మీద నల్లజెండాను ఎగరేసి, పాఠశాలలకు సెలవు ప్రకటించాడు తిరుపతి, కర్నూలు, బెజవాడ, శ్రీకాకుళం, విజయనగరం, ఏలూరు, గుంటూరు మున్సిపాలిటీలు సైమన్ కమిషన్ బహిష్కరణకు అనుకూలంగా తీర్మానాలు చేశాయి భీమవరం బార్ అసోసియేషన్ బహిష్కరణకు తీర్మానం చేసింది తెనాలి, గుంటూరు పట్టణాలలో వలంటీర్లు "సైమన్ గోబాక్" అనే నినాదాలతో సైమన్ కమిషన్‌కు ఎదురుగా వెళ్ళారు బెజవాడలో మునిసిపల్ ఛైర్మన్ కాళేశ్వరరావు తన బంట్రోతుద్వారా సైమన్‌కు ఒక కవరు పంపాడు అందులో "సైమన్ గోబాక్" అని వ్రాసి వుంది కమిషన్‌కు నల్లజెండాలు చూపుతూ నిరసన ప్రదర్శనలు జరిపినందుకు కొండా వెంకటప్పయ్య, పట్టాభి, కళా వెంకట్రావు ప్రభృతులనేకులు అరెస్టు అయ్యారు బులుసు సాంబమూర్తిని బెజవాడలో అరెస్టుచేసి ఏడాది జైలు శిక్ష వేశారు ఆంధ్రరాష్ట్ర సంఘం సైమన్ కమిషన్‌ను బహిష్కరిస్తూ తీర్మానించింది

ఇలా ఆంధ్రలో పెల్లుబికిన వ్యతిరేకతవల్ల ఆంధ్రరాష్ట్ర ఏర్పాటును సైమన్ కమిషన్ త్రోసిపుచ్చింది సింధు, ఒరిస్సా రాష్ట్రాల ఏర్పాటుకు సిఫార్సుచేసి, కొన్ని ఆంధ్ర ప్రాంతాలను ఒరిస్సాలో జేర్చి తన కడుపుమంట తీర్చుకున్నది

## వివిధ సంఘాల పుట్టుక

1927లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభలో "సంపూర్ణ స్వాతంత్ర్యం" తీర్మానాన్ని జవహర్‌లాల్ ప్రతిపాదించగా, సుభాష్‌చంద్రబోస్ బలపరిచాడు తీర్మానం నెగ్గింది

కాని, భారతదేశంలోని అన్ని పార్టీలకు, వర్గాలకు ఆమోదయోగ్యమైన రాజ్యాంగాన్ని రూపొందించుటకొరకు అవసరమైన అఖిలపక్ష సమావేశాన్ని ఏర్పరచేందుకు కాంగ్రెస్ పూనుకోవడంవల్ల, 1930 వరకూ అధినివేశ ప్రతిపత్తిని గురించి మాత్రమే చర్చలు జరిగాయి

అందువల్ల సంపూర్ణ స్వరాజ్యం కోరికను బలపరిచేందుకు 1928 డిసెంబరు 19న బులుసు సాంబమూర్తి అధ్యక్షులుగాను, డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం కార్యదర్శిగాను, తెన్నేటి విశ్వనాథం కోశాధికారిగానూగల "ఆంధ్రరాష్ట్ర ఇండిపెండెన్సు లీగ్" ఏర్పడింది

జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్‌చంద్ర బోస్, బులుసు సాంబమూర్తి ప్రభృతులు కలిసి "ఆలిండియా ఇండిపెండెన్సు లీగ్"ను స్థాపించారు స్వాతంత్ర్య సాధనతోపాటు స్వదేశ సంస్థానాలను, జమీందారీలను రద్దుచేయవలసిన అవసరాన్ని వివరిస్తూ ప్రచారం చేశారు

సైమన్ కమిషన్ బహిష్కరణలో పాల్గొన్న లక్షలాది యువకులు, విద్యార్థులుకూడా సంఘటితం కాసాగారు దేశం నలుమూలలా యువజన, విద్యార్థి సంఘాలు ఏర్పడ్డాయి 1928 మే నెలలో గుంటూరులో యువజన సంఘం ఏర్పడింది 1928 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం స్థాపించబడింది 1926లోనే విద్యార్థి ఫెడరేషన్ రూపొందింది

## అఖిలపక్ష సమావేశం

"భారతీయులందరికి ఆమోదయోగ్యమైన రాజ్యాంగాన్ని రూపొందించండి, చూద్దాం" అని బర్కెన్ హెడ్ (ఇండియా కార్యదర్శి) విసిరిన సవాలును కాంగ్రెస్ స్వీకరించింది 1928 ఫిబ్రవరి, మార్చి, మే నెలల్లో అఖిలపక్ష సమావేశాలు ఏర్పాటు చేసింది అయినా ఫలితం కలుగలేదు కాబట్టి మోతీలాల్ నెహ్రూ ఆధ్వర్యాన ఒక కమిటీని నియమించింది ఆ కమిటీ ఒక నివేదికను తయారుచేసింది ఆ నివేదిక అధినివేశ ప్రతిపత్తికే పరిమితమైంది

ఆ నివేదికను పరిశీలించిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం 'సంపూర్ణ స్వాతంత్ర్య సాధన కాంగ్రెస్ లక్ష్యంగా వుండాలి"అని తీర్మానించింది

1928 డిసెంబరు ఆఖరు వారంలో కలకత్తాలో కాంగ్రెస్ మహాసభ జరిగింది దానికి అధ్యక్షుడుగా మోతీలాల్ నెహ్రూ ఎన్నికయ్యాడు

కాంగ్రెస్ మహాసభ జరగడానికి ముందే నెహ్రూ కమిటీ నివేదికను చర్చించడానికి కలకత్తాలో అఖిలపక్ష సమావేశం జరిగింది అప్పుడు మహమ్మదాలీ జిన్నా నాలుగు

సవరణలు ప్రతిపాదించాడు అవి (1) కేంద్ర శాసనసభలో 1/3 సీట్లను ముస్లిములకు కేటాయించాలి (2) బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలోని ముస్లిములకు జనాభా ప్రాతిపదికపైన స్థానాలను కేటాయించాలి (3) పరిశిష్ట అధికారాలు (రెసిద్యూయరీ పవర్సు) రాష్ట్రాలకే వుండాలి (4) సింధు ప్రాంతాన్ని బొంబే ప్రెసిడెన్సీ నుండి విడదీసి ప్రత్యేక రాష్ట్రంగా రూపొందించాలి

పై కోర్కెలను జిన్నా కోరితే, సిక్కులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని సిక్కు నాయకులు కోరారు ఇతర మత సంస్థలవారుకూడా తమ తమ కోర్కెలను వెలిబుచ్చారు అందువల్ల జిన్నా కోర్కెలను యధాతధంగా ఆమోదించేందుకు కాంగ్రెస్ నాయకులు నిరాకరించారు

1928 డిసెంబరు 23న అధినివేశ ప్రతిపత్తిపై చర్చ ప్రారంభమైంది సంపూర్ణ స్వరాజ్యంకొరకుగాకుండా అధినివేశ ప్రతిపత్తికొరకు ప్రాకులాడడం పిరికిపందల పనిగా వర్ణించాడు మహమ్మదాలీ అందుమీదట మాటా మాటా పెరిగింది కొందరాయనను వ్యతిరేకించారు కాంగ్రెస్ నాయకులు మౌనం వహించారు కాగా హిందూ మనస్తత్వం గలవారి నుద్దేశించి మహమ్మదాలీ "మీరు యూదులు, వర్తకులు" అని నిందించాడు జనాభాలో నాలుగోవంతుగా నున్న ముస్లిములకు, కేంద్ర అసెంబ్లీలో మూడోవంతు సీట్లు యిస్తే తప్పేమిటన్నాడు తరువాత నెహ్రూ నివేదికను గురించి ఇలా అన్నాడు

"ఈస్టిండియా కంపెనీ రోజుల్లో 'సృష్టి భగవంతుడిది దేశం రాజుది పరిపాలన జాన్ కంపెనీ బహదూర్‌ది' అని దండోరా వేసేవారు కాని నెహ్రూ నివేదికకు అర్థం సృష్టి భగవంతుడిది, దేశం వైస్రాయిది పార్లమెంటూ పరిపాలనా హిందూ మహాసభది" అని విమర్శించాడు తరువాత షౌకత్‌అలీ, మహమ్మదాలీలిద్దరూ కాంగ్రెసునుండి తప్పుకున్నారు

ఒకప్పుడు హిందూ-ముస్లిమ్ ఐక్యతకు నిర్విరామంగా పాటుబడినవారు, భారతీయుల ప్రేమను పొందగలిగిన అలీ సోదరులు కాంగ్రెసును విడిచిపెట్టడంవల్ల హిందూ-ముస్లిమ్ ఐక్యతకు విఘాతం కలిగింది

కలకత్తాలో కొంతవరకూ జిన్నా ప్రదర్శించిన సామరస్య ధోరణిని అవకాశంగా తీసుకుని హిందూ-ముస్లిమ్ సమస్యకొక పరిష్కారాన్ని కాంగ్రెస్ సాధించివుంటే బాగుండేదని చారిత్రక విమర్శకులు అభిప్రాయపడ్డారు అందుకు 1931లో జిన్నా వెలిబుచ్చిన అభిప్రాయాలను ఉటంకించేవారు ఆనాడొక ప్రసంగంలో జిన్నా ఇలా అన్నాడు

"వ్యక్తిగతంగా నేను సంయుక్త నియోజకవర్గాలకు అనుకూలుణ్ణి అయినా ప్రత్యేక నియోజకవర్గాల ప్రాతిపదికపైన ఒక అంగీకారానికి రాగలిగితే హిందూ-ముస్లిమ్ సఖ్యత ఏర్పడుతుంది స్వాతంత్ర్యానంతరం అపనమ్మకం, అనుమానం, భయం తొలగిపోతాయి అప్పుడు బహుశా ప్రత్యేక నియోజకవర్గాల సమస్య సమసిపోవచ్చు

ప్రత్యేక నియోజక వర్గాలు, రిజర్వేషన్ల విషయంలో మోతీలాల్ నెహ్రూ కమిటీ నివేదికను మితవాదులు వ్యతిరేకిస్తే అధినివేశ ప్రతిపత్తిని కోరినందుకు అతివాదులు వ్యతిరేకించారు.

## అధినివేశ ప్రతిపత్తికి వ్యతిరేకత

మోతీలాల్ నెహ్రూ కమిటీ నివేదికలో ముఖ్యమైన అంశాలు ఇవి

(1) బాధ్యతాయుత ప్రభుత్వంలో కార్యనిర్వాహకవర్గంపైన శాసనసభదే అధికారం

(2) కెనడా, ఆస్ట్రేలియాలలోగల అధినివేశ (డొమినియన్ స్టేటస్) వంటి ప్రతిపత్తిని భారతదేశం కలిగివుంటుంది (3) పార్లమెంటులో ప్రతినిధుల సభ, సెనెట్ అనే రెండు సభలుంటాయి (4) రాష్ట్ర కౌన్సిల్సు దామాషా ప్రాతినిధ్య పద్ధతిపై 200 మంది సభ్యులను సెనెటుకు ఎన్నుకుంటాయి (5) వయోజన ఓటింగ్ ప్రాతిపదికగా ప్రతినిధుల సభకు 500 మంది సభ్యులు ఎన్నుకోబడతారు (6) బెంగాల్‌లోని ముస్లిములకు, వాయవ్య రాష్ట్రంలోని ముస్లిమేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యముంటుంది (7) రాష్ట్ర కౌన్సిల్సులో జనాభా ప్రాతిపదికపై మైనారిటీలకు స్థానాలు ప్రత్యేకించి రిజర్వు చేయబడతాయి (8) ఈ ప్రత్యేక రిజర్వేషన్స్ పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలకు వర్తించవు

ఇలా అందరినీ సంతృప్తిపరచాలనే ధోరణితో రూపొందించిన నివేదిక ఎవరినీ సంతృప్తిపరచలేకపోయింది అలాంటి స్థితిలో 1928 డిసెంబరు 26న కలకత్తాలో కాంగ్రెస్ మహాసభ జరిగింది అంతవరకూ కాంగ్రెస్ కార్యకలాపాలతో అంటీఅంటనట్లుగా వుంటున్న గాంధీజీ ఆ సభలో పాల్గొన్నాడు

అధినివేశ ప్రతిపత్తిని అంగీకరించాలనే తీర్మానాన్ని జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్‌లతోపాటు అనేకమంది అతివాదులు వ్యతిరేకించారు

"వర్కింగ్ కమిటీచే రూపొందించబడి, గాంధీజీ ప్రతిపాదించిన తీర్మానాన్ని వ్యతిరేకించడం సాహసమే అవుతుంది అయినా తప్పదు బ్రిటన్‌తో పూర్తిగా తెగతెంపులు చేసుకోకపోతే నిజమైన స్వాతంత్ర్యం సిద్ధించదు" అన్నాడు జవహర్‌లాల్ కాబట్టి గాంధీజీ ఒక రాజీ తీర్మానాన్ని ప్రతిపాదించాడు 1930 ఆఖరులోగా అధినివేశ ప్రతిపత్తిని యివ్వాలన్న గడువును 1929కి తగ్గించారు "1929 ఆఖరులోగా యివ్వకపోతే సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరవచ్చు"నని తీర్మానంలో పొందుపరిచారు

విషయ నిర్ణయ సభలో ఈ తీర్మానానికి అనుకూలంగా 118 ఓట్లు, వ్యతిరేకంగా 4 ఓట్లు వచ్చాయి బోస్, నెహ్రూలిద్దరూ తీర్మానానికి అనుకూలంగా ఓటు చేశారు కాని ప్రతినిధుల సభలో తీర్మానానికి ఒక సవరణను బోస్ ప్రతిపాదించాడు జవహర్‌లాల్ బలపరిచాడు కాగా ఓటింగ్ జరిగింది సవరణకు అనుకూలంగా 973 ఓట్లు, ప్రతికూలంగా 1350 ఓట్లు వచ్చినందున సవరణ వీగిపోయింది గాంధీజీ ప్రతిపాదించిన తీర్మానం నెగ్గింది

ఆ సమయంలో యాభైవేల మంది సుశిక్షితులైన కార్మికులు కాంగ్రెస్ పెండాలును ఆక్రమించారు ఆ ఘటనను జి డి టెండూల్కర్ ఇలా వర్ణించాడు

"స్వాతంత్ర్యం గురించిన తీర్మానం విషయంలో పారిశ్రామిక కార్మికులు విప్లవ మనస్తత్వంతో వున్నారు. ఒక సంవత్సరంపాటు ఆలస్యంపట్ల అసహనం వహించిన యాభైవేల మంది సభాస్థలికి చేరుకున్నారు జాతీయ పతాకకు నమస్కరించారు తర్వాత కాంగ్రెస్ సభావేదికను ఆక్రమించుకున్నారు తక్షణం స్వాతంత్ర్యం కావాలనే తీర్మానాన్ని ఆమోదించారు

"బోస్, జవహర్‌వంటివారెంత చెప్పినా కార్మికులు బయటకు వెళ్లలేదు చివరకు గాంధీజీ, మోతీలాల్ నెహ్రూ నచ్చజెప్పినపిమ్మట పెండాల్‌ను వదిలి వెళ్లిపోయారు."

## హిం.సో.రి అసోసియేషన్

1928 సెప్టెంబరు 8న ఢిల్లీలో సమావేశమైన విప్లవ సంఘాల ప్రతినిధులు

హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్‌ను స్థాపించారు ఆ పార్టీ ఆశయం ఇండియాలో సోషలిజాన్ని స్థాపించడం ఆ ఆశయసిద్ధికి తోడ్పడేందుకు హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీనికూడా నిర్మించారు దీని సేనాధిపతి చంద్రశేఖర్ అజాద్

వీరి దృష్టిలో కమ్యూనిస్టులు విప్లవకారులుకాదు అయినా కమ్యూనిస్టుల సామ్రాజ్యవాద వ్యతిరేకత, చట్టబద్ధమైన ఉద్యమానికి విముఖత, ప్రత్యక్ష కార్యాచరణకు సుముఖత, సోషలిజం కొరకు నిరంతర కృషి వీరిని ఆకర్షించాయి కాని టెర్రరిస్టు కార్యకలాపాలు కొనసాగించకపోతే పప్పు ఉడకదని వీరు భావించారు కాగా ఒక కార్యక్రమాన్ని రూపొందించారు

ప్రజాకంటకులైన బ్రిటిష్ ఉద్యోగులను హతమార్చడం, ప్రజల పోరాటాలను బలపర్చడం, ప్రజల ఉద్యమాలకు అండగా సాయుధ దళాలు పోరాడడం వగైరా చర్యలద్వారా సోషలిజం దిశగా పయనించవచ్చునని హిం సో రి అసోసియేషన్‌వారు భావించారు

కాగా, లాలా లజపతిరాయ్ తలపైన, ఛాతీపైన లాఠీతో విపరీతంగా కొట్టిన పోలీస్ ఆఫీసర్ సాండర్సును 1928 డిసెంబరు 17న రాజగురు, భగత్‌సింగ్‌లు రివాల్వరుతో కాల్చిచంపారు "నిరంకుశ ఉద్యోగులారా, జాగ్రత్త!" అంటూ లాహెూర్ నగర గోడలమీద నోటీసులు అంటించారు "లజపతిరాయ్ హత్యకు ప్రతీకారమే సాండర్సు హత్య" అని విశదం చేస్తూ ఇలా వివరించారు

"జాతీయ నాయకులుగా చెప్పుకుంటున్నవారు మా చర్యలను ఖండించవచ్చు మమ్ములను నలిపివేసేందుకు ప్రభుత్వం పూనుకోవచ్చు నిర్బంధ దమనకాండ మమ్ములను చుట్టుముట్టవచ్చు అయినా విప్లవ నినాదం మారుమ్రోగి తీరుతుంది. మా కంఠం చుట్టూ ఉరిత్రాడు బిగించినా 'విప్లవం వర్థిల్లాలి' అని నినదిస్తాం, హర్షధ్వానాలు చేస్తాం

"మానవ రక్తం చిందించాల్సివచ్చినందుకు మేము విచారపడుతున్నాం ఒక మానవుణ్ణి మరొక మానవుడు దోపిడీ చేయడాన్ని అంతంచేసే విప్లవ బలిపీఠంపై రక్తం చిందించడం తప్పనిసరి అని విశ్వసిస్తున్నాం

విప్లవం వర్థిల్లాలి,
బలరాజ్, కమాండర్
పంజాబ్ హెచ్ ఎస్ ఆర్మీ 18-12-1928"

సోషలిజం కొరకు పోరాడడంలో హిం సో రి అసోసియేషన్ వారు ప్రజాసమీకరణ కన్నా ఆయుధ సమీకరణకు, సాయుధ పోరాటానికి ప్రాముఖ్యతనిచ్చారు కార్మిక, కర్షక వర్గాలను సమీకరించి విప్లవాన్ని సాధించేందుకు కృషి చేస్తున్న కమ్యూనిస్టు నాయకులను 1929 ఏప్రిల్‌లో ప్రభుత్వం నిర్బంధించి, మీరట్ కుట్రకేసును బనాయించింది

పై రెండు పార్టీల వారిని తుడిచిపెట్టేందుకు అవసరమైన అధికారాలను పొందేందుకు ప్రభుత్వం "ప్రజారక్షణ" బిల్లును కేంద్ర అసెంబ్లీలో ప్రవేశపెట్టింది అనుమానమున్నవారికి ప్రవాసశిక్ష విధించేందుకు, వారి ఆస్తిని స్వాధీనం చేసుకునేందుకు ప్రభుత్వానికి అధికారమిచ్చే బిల్లు ఇది పైగా ఈ బిల్లు గతించినకాలానికికూడా వర్తిస్తుంది కాబట్టి ఇది "భారత దేశపు బానిస బిల్లు" అని మోతీలాల్ నెహ్రూ నిరసించాడు 1929 ఏప్రియల్ 8 అర్ధరాత్రి వరకూ ఈ బిల్లుపై కేంద్ర అసెంబ్లీలో చర్చ జరుగుతూవుంది ఈ బిల్లు గతకాలానికి వర్తింపజేయబడదనే హామీని యివ్వడానికి ప్రభుత్వం నిరాకరించింది.

కాగా, అసెంబ్లీ అధ్యక్షుడైన విఠల్‌బాయ్ పటేల్ తన రూలింగ్ యివ్వడానికి లేచి నిలబడ్డాడు ఇంతలో భగత్‌సింగ్, భటుకేశ్వర దత్తులు విసిరిన బాంబులతో కేంద్ర అసెంబ్లీ హాలు దద్దరిల్లింది

భగత్‌సింగ్, దత్తులు భద్రతా సిబ్బంది ముందుకు వచ్చి నిలబడి అరెస్టయ్యారు ఏప్రియల్ 15న లాహోర్‌లోని ఒక ఇంటికి సోదాచేసి అనేక బాంబులను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు 23వ తేదీన సహరాన్‌పూర్‌లో మరికొన్ని బాంబులను స్వాధీనం చేసుకున్నారు ఆ రెండుచోట్లా కొందరిని అరెస్టు చేశారు

## లాహోర్ కుట్ర కేసు

జూన్ 7వ తేదీన బీహార్ రాష్ట్రంలో ఫణీంద్రనాథ ఘోష్‌ను అరెస్టు చేయగానే అతను అప్రూవరుగా మారాడు అదివరకే జయగోపాల్, హంసరాజ్ అప్రూవరులయ్యారు. కాగా వివిధ ప్రాంతాలకు చెందిన 32 మంది యువకులపై ప్రభుత్వం "లాహోర్ కుట్ర కేసు"ను మోపింది వారిలో తొమ్మిదిమంది పట్టుబడలేదు 7గురు అప్రూవరులుగా మారారు అందువల్ల ఈ క్రింది 16గురు కుట్రకేసులో ముద్దాయిలుగా విచారింపబడ్డారు

(1) భగత్‌సింగ్ (2) సుఖదేవ్ (3) శివశర్మ (4) జయదేవ్ కపూర్ (5) గయాప్రసాద్ (6) మహావీరసింగ్ (7) కిశోరీలాల్ (8) బటుకేశ్వరదత్తు (9) జితేంద్రనాథ సన్యాల్ (10) కమలనాథ తివారి (11) ప్రేమదత్తు (12) జితేంద్రనాథ్‌దాస్ (13) అజయ్‌కుమార్ ఘోష్ (14) అజయరాం (15) సురేంద్రపాండే (16) దేశిరాజు

కొన్నాళ్ల తరువాత విజయకుమార సిన్హా, రాజగురు, కుందనలాల్ పట్టుబడ్డారు అప్పటికే సాండర్సును కాల్చి చంపినవారు రాజగురు, భగత్‌సింగులేనన్న విషయం ప్రభుత్వానికి తెలిసిపోయింది

## లాహోర్ వీరుల వాంగ్మూలం

కుట్ర కేసు విచారణ జరుగుతున్నప్పుడు ముద్దాయిలందరూ కలిసి లిఖితపూర్వక వాంగ్మూలాన్ని కోర్టుకు సమర్పించారు అందులో ఇలా వివరించారు.

" దోపిడీ విధానపు అంత్యదశయే సామ్రాజ్యవాదం తమ దోపిడీని కాపాడు కొనుటకు సామ్రాజ్యవాదులు రాజకీయ హత్యలకు పాల్పడతారు యుద్ధములు ప్రారంభించి సామాన్య ప్రజలను సర్వనాశనం చేస్తారు వాటిని ఎదిరించినవారిని హత్యచేసి, శాంతి భద్రతల సంరక్షకులమని బాకాలూదుకుంటారు.

"స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు, తన కష్టార్జితాన్ని అనుభవించే హక్కు ప్రతి వ్యక్తికీ వున్నది ఒక దేశంలోని ఉత్పత్తి సాధనాలు ఆ దేశ ప్రజల యాజమాన్యంలోనే వుండాలి ఆ సాధనాలద్వారా జరిగే ఉత్పత్తి ఆ దేశ ప్రజలకే దక్కాలి ఈ ప్రాథమిక హక్కులను కాలరాస్తున్న బ్రిటిష్ ఇండియా ప్రభుత్వాన్ని అంతం చేయడం ధర్మ సమ్మతమేనని మా దృఢవిశ్వాసం

"నేటి సాంఘిక ఆర్థిక విధానములు పూర్తిగా మార్చబడి, సామ్యవాద సమాజము స్థాపించబడువరకూ, ప్రపంచం వినాశకర పరిస్థితుల నెదుర్కొనక తప్పదని విశ్వసిస్తున్నాం

"మా విప్లవాదర్శ సిద్ధికొరకు మేము చేపట్టిన చర్యలు శాంతియుతమైనవా, కాదా? అను విషయంలో తీర్పు చెప్పగల అర్హత సామ్రాజ్యవాదులకు లేదు. మేము మా

ప్రజలందరికీ శాంతి సౌఖ్యాలను కోరుతున్నాం కాబట్టి మేము నిజమైన శాంతి ఉపాసకులమేనని చెప్పదలచుకున్నాం"

## భగత్‌సింగ్ వాంగ్మూలం

కేంద్ర అసెంబ్లీలో బాంబులు విసిరినందుకు భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తులను విచారిస్తున్న కోర్టులో భగత్‌సింగ్ సుదీర్ఘ వాంగ్మూలమిచ్చాడు దాని సారాంశమిది

"సభలో ఏ వ్యక్తిపైనా మాకు ఎలాంటి ద్వేషమూ లేదు పైగా మానవ జీవితం పవిత్రమైనదని మా భావన మాది కిరాయి సేనల మనస్తత్వం కాదు మా ప్రధాన ఆశయం అసంఖ్యాక ప్రజలను హెచ్చరించడం, చెవిటివాళ్లకు వినపడేలాగా చేయడం అందుకే విధ్వంసకరంకాని బాంబులు విసిరాం అయినా మేం అహింసావాదులం కాదు అహింస ఆదర్శవాదుల కల, దాని వైఫల్యాన్ని యువతరం గుర్తించింది కాగా నూతనతత్వం ప్రారంభమైంది అది గురుగోవిందసింగ్, శివాజీ, రజాఖాన్, వాషింగ్టన్, గారిబాల్డీ, లెనిన్ మున్నగువారి ఆదర్శాలనుండి ప్రేరణ పొందింది పర ప్రభుత్వమూ, భారత నాయకులూ కళ్లూ, చెవులు మూసుకొని ఉండడంవల్ల వారి దృష్టిని ఆకర్షించడానికి ఈ హెచ్చరికను ఇంత ధ్వనితో చేయవలసి వచ్చింది మేము స్వయంగా లొంగిపోవడానికి కారణం పిరికితనం కాదు మా అభిప్రాయాలను సర్వులకూ తెలియజేయడానికి అలా చేశాం స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు ఆ హక్కును సాధించేందుకు ఎంత త్యాగం చేయవలసివచ్చినా ఎన్ని బాధలు అనుభవించవలసివచ్చినా సిద్ధంగా వున్నాం ఇంక్విలాబ్ జిందాబాద్ "

## నిరాహారదీక్షలు

రాజకీయ ఖైదీలను క్రిమినల్సుగా చూడకూడదని, రాజకీయ ఖైదీలకు జైళ్లలో ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలని కోరుతూ నిరాహారదీక్ష పూనాలని భగత్‌సింగ్ ప్రభృతులు నిర్ణయించుకున్నారు కాగా భగత్‌సింగ్, భటుకేశ్వరదత్తులు 1929 జూన్ 15న నిరాహారదీక్ష ప్రారంభించారు జులై 15 నాటికి లాహెూర్ కుట్ర కేసులో అరెస్టు చేయబడిన వారందరూ నిరాహారదీక్ష పూనారు అయినా మొదటి పది రోజులూ ప్రభుత్వం కదలలేదు తరువాత బలవంతంగా ఖైదీలను పరుండబెట్టి ముక్కులో రబ్బరు గొట్టం దూర్చి, దానిద్వారా పాలు పోసేందుకు పూనుకున్నారు అలా పోసే పాలు జీర్ణకోశానికి చేరకుండా చేసేందుకు జితేంద్రనాధ్ ప్రభృతులు వివిధ పద్ధతులు అవలంబించేవారు కిశోర్‌లాల్ ఉడుకు నీళ్లతో కారం మింగేవాడు అందువల్ల ఆయన గొంతు వాచిపోయేది బలవంతంగా పాలు ఎక్కిస్తే విపరీతంగా దగ్గు వచ్చేది అందువల్ల చనిపోతాడేమోనని పాలు ఎక్కించడం మానివేసేవారు అజయ్‌కుమార ఘోష్ ఈగలను మింగి పాలు కక్కేవారు ఇలా తలా ఒక పద్ధతి అవలంబించేవారు ఇక లాభం లేదనుకున్న అధికారులు కుండల్లోని మంచినీళ్లు పారబోసి వాటిలో పాలుపోసి మూతలు పెట్టారు అజయకుమార్ ఘోష్ వాటిని పగులగొట్టాడు

జూన్ 30న దేశమంతటా "భగత్‌సింగ్ సంఘీభావ దినం" జరిగింది విప్లవ టెర్రరిస్టుల బహిరంగ వేదికగా పనిజేస్తున్న "నవజవాన్ భారత్ సభ" వారు జులై 14వ తేదీన అసమ్మతి సభలు ప్రారంభించారు జాతీయ కాంగ్రెస్ కూడా అసమ్మతి సభలు

జరిపింది బ్రిటిష్ లేబర్ ప్రభుత్వానికి విజ్ఞప్తులతోపాటు హెచ్చరికలుకూడా చేయబడ్డాయి మితవాద పత్రికలు సహితం నిరాహారవ్రతుల కోర్కెలను సమర్థించాయి

## జితేంద్రనాధ్‌దాస్ ఆత్మార్పణం

కృత్రిమంగా కడుపులోకి అహారాన్ని పంపే పద్ధతిని జితేంద్రనాధదాస్ నిరోధిస్తున్నాడని, అతని పరిస్థితి ప్రమాదకరంగా వున్నదని జులై 27న జైళ్ల ఇన్‌స్పెక్టర్ జనరల్ ప్రభుత్వానికొక నివేదిక పంపాడు జితేన్‌కు న్యుమోనియా వచ్చిందని, 103 డిగ్రీల జ్వరంతో బాధపడుతున్నాడని విచారణ కోర్టువద్ద అజయఘోష్ పత్రికా విలేకరులకు తెలియజేశాడు అల్హాబాద్‌లో జరిగిన ఎ ఐ సి సి సమావేశంలో డాక్టర్ అన్సారీ, డాక్టర్ బి సి రాయ్ ప్రభుత్వ చర్యలను ఖండించారు ఖైదీల కడుపులోకి బలవంతంగా ఆహారం పంపించే పద్ధతిని దేశంలోని డాక్టర్లందరూ ఖండించాలని కోరారు

1925లో ఢాకాలో కొన్నాళ్లపాటు నిరాహారదీక్ష సాగించిన అనుభవం జతీన్‌కు వున్నది పైగా ఆయన మంచి క్రీడాకారుడు, బలశాలి కనుక జైలు అధికారులాయనకు బలవంతంగా, కృతిమంగా పాలు పోయలేకపోయారు అందువల్ల ఆయన పరిస్థితి బాగా క్షీణించింది.

జితేంద్రనాధదాస్ ఆరోగ్యాన్ని గురించి భగత్‌సింగ్ ఆందోళన చెందాడు ముందుగా నిరాహార వ్రతం పూనిన తానే మున్ముందుగా ఆత్మార్పణం చేయాలని భావించాడు కనుక డా॥ గోపీచంద్ భార్గవ, పురోషోత్తమదాస్ టాండన్లతో కలిసి మెల్లగా జతీన్‌దాస్ గదిలోకి వెళ్లాడు గతంలో తన మాట విన్నట్లే ఇప్పుడుకూడా తన మాట విని పాలు తీసుకోమని జతీన్‌దాసును కోరాడు

“అప్పుడు నీ మాట విన్నాను ఇప్పుడు వినను నీవు నా హృదయాన్ని బ్రద్దలు చేశావు నీవు వచ్చి వుండవలసిందికాదు” అన్నాడు జతీన్

ఆగస్టు 16న ప్రభుత్వం జైలు పరిస్థితులను విచారించేందుకొక కమిటీని నియమించింది కమిటీ మెంబర్లు లాహెూర్ జైలుకు వచ్చి, భగత్‌సింగ్ మున్నగువారి కోర్కెలు సానుభూతితో పరిష్కరిస్తామని హామీ యిచ్చారు కాగా జితేంద్రనాధ దాస్ మినహా తక్కిన వారందరూ నిరశన దీక్ష విరమించారు

వ్రాతపూర్వకమైన హామీ లేనిచో వాగ్దానాలు నమ్మకూడదని జితేన్ భావించాడు ఆయనను జామీనుపై విడుదల చేస్తామన్నారు కాని ఆయన అంగీకరించలేదు జితేంద్ర నాధదాసును బేషరతుగా విడుదల చేస్తామన్న కమిటీ వాగ్దానం వ్రాగ్దానంగానే మిగిలిపోయింది భగత్‌సింగ్ మొదలగువారుమాత్రం మోసపోయారు.

సెప్టెంబరు 9న జితేన్ నెత్తురు కక్కాడు 10వ తేదీన జితేన్‌దాస్ మాటా చూపు పడిపోయాయి 13వ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటకు జితేంద్రనాధదాస్ కీర్తి శేషుడయ్యాడు జైలు అధికార్లు కన్నీళ్లు కార్చారు. లాహెూర్ పోలీసు సూపరెంటెంట్ హామిల్టన్ హార్డింజ్ శవంముందు నిలబడి గౌరవభావంతో టోపీ తీసి తలవంచాడు

ఎర్రగులాబీలతో కప్పబడిన ఆయన శవాన్ని లాహెూర్‌లో ఊరేగించుతూ, రైల్వే స్టేషనుకు తీసుకువెళ్లారు జైలుగేటువద్ద చేరిన 25వేల ప్రజలు “ఇంక్విలాబ్ జిందాబాద్, జితేన్‌దాస్ జిందాబాద్” అని నినాదాలిచ్చారు. ఊరేగింపులో 50వేల మంది పాల్గొన్నారు కొందరు తమ రొమ్ములు బాదుకుంటూ ఏడ్చారు డాక్టర్ ఆలం, గోపీచంద్ భార్గవ తమ

కేంద్ర శాసనసభ సభ్యత్వాలకు రాజీనామా లిచ్చారు. ఆనాటి సాయంత్రం లేడి షుష్టర్ ఏర్పాటు చేసిన తేనీటివిందును కేంద్ర శాసనసభలోని భారతీయులందరూ బహిష్కరించారు శవపేటికగల రైలు కలకత్తాకు బయలుదేరింది శవపేటిక ప్రక్కన జితేన్ సోదరుడు కిరణ్‌దాస్ కూర్చున్నాడు. అంతవరకూ లాహెూర్ కుట్రకేసులో పట్టుబడకుండా తప్పించుకు తిరుగుతున్న చంద్రశేఖర్ అజాద్, భగవతీ చరణ్‌కూడా మారువేషాలతో అదే రైలులో ప్రయాణం చేశారు. కలకత్తాలో లక్షన్నరమంది ప్రజలు శవాన్ని ఊరేగించారు అంత్యక్రియలకు ముందు సుభాష్‌చంద్రబోస్ ఆ అమర వీరునకు పాదాభివందనం చేశాడు కేంద్ర అసెంబ్లీలో ఎం.ఆర్ జయకర్ ఆయనకు నివాళులర్పించాడు జితేన్ త్యాగాన్ని వర్ణిస్తూ రవీంద్రుడొక పాట వ్రాశాడు "ఒక సిద్ధాంతం కొరకు ప్రాణాలర్పించిన జితేంద్రనాధ దాస్ త్యాగం మరువలేనిది" అని సరోజినిదేవి ప్రకటించింది

"జితేన్‌దాసు అహింసలో నమ్మకం కలవాడు గనుకనే ఆమరణ నిరశన వ్రతం పూనగలిగాడు" అన్నాడు గాంధీజీ

ఆయన చనిపోయిన పిమ్మటకూడా ప్రభుత్వం దిగిరాలేదు కనుక భగత్‌సింగ్ మున్నగు లాహెూర్ కుట్రకేసు ఖైదీలందరూ తిరిగి నిరాహారదీక్ష పూనారు అప్పటికే అండమాన్ దీవుల్లోను, భారతదేశంలోని జైళ్లలోను 14 ఏళ్ల జైలు జీవితం గడిపిన గదర్ పార్టీ సంస్థాపకుడు బాబా సోహన్‌సింగ్ భాక్నా ఆరోగ్యం బాగాలేదు. అయినా ఆయనకూడా నిరాహారదీక్ష పూనాడు. బ్రైలీ జైల్లో వున్న కాకోరీ కుట్ర కేసు ఖైదీలు నిరశన వ్రతం ప్రారంభించారు క్రమంగా దేశంలోని రాజకీయ ఖైదీలందరూ నిరశనదీక్ష పూనారు చివరకు 1930 ఫిబ్రవరి 19న ప్రభుత్వం లొంగింది రాజకీయ ఖైదీలను ఎ, బి, సి తరగతులుగా విభజించి, ముఖ్యమైన కోర్కెలను ఆమోదించింది అప్పటినుంచి కాంగ్రెసు వారుగాని, మరొకరుగాని ఎ క్లాస్, బి క్లాస్.. హక్కులను పొందగలిగారు.

## భగత్‌సింగ్ ప్రభృతులకు శిక్షలు

లాహెూర్ కుట్రకేసు విచారణలో తొమ్మిదినెలలు గడిచాక ప్రభుత్వమొక ఆర్డినెన్సు జారీచేసింది కేసు విచారణను స్పెషల్ ట్రిబ్యునల్‌కు అప్పగించింది ముద్దాయిలను విధిగా కోర్టుకు తీసుకురావలసిన అవసరం లేదన్నది ట్రిబ్యునల్ విధించిన శిక్షలకు వ్యతిరేకంగా అప్పీలు చేసుకునే హక్కును తొలగించింది. కేసు నిలువదన్న భయంవల్లనే ప్రభుత్వమలా చేసింది

తరువాత ఐదు నెలలపాటు విచారణ తంతు నడిచింది చివరకు 1930 అక్టోబర్ 7న భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవులకు మరణశిక్ష, శివశర్మ, విజయకుమారసిన్హా, కిశోరిలాల్, జయదేవ్‌కపూర్, మహావీర్‌సింగ్, డాక్టర్ గయాప్రసాద్ నిగం, కమలనాథ్ తివారీలకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధించారు కుందన్‌లాల్‌కు ఏడేళ్ళు, ప్రేమదత్తుకు ఐదేళ్లు శిక్ష వేశారు. వీటిమీద అప్పీలు చేసుకునే హక్కులేదు అయినా ఏదో ఒక కారణం చూపించి అప్పీలు చేయవలసిందిగా మోతీలాల్ సలహా యిచ్చాడు. కాని ఆ సలహాను భగత్‌సింగ్ తిరస్కరించాడు. తనను జైలునుంచి తప్పించే ప్రయత్నాన్ని కూడా వారించాడు మార్క్సిజాన్ని అధ్యయనం చేస్తూ ఉరికంబమెక్కాడు.

## పృధ్వీసింగ్

మొదటి లాహెూర్ కుట్రకేసులో పృధ్వీసింగ్‌కు మరణశిక్ష విధించారు తరువాత

యావజ్జీవ శిక్షగా మార్చి అండమాన్ దీవులకు పంపారు అక్కడ ఖైదీల దుర్భర జీవితాన్ని సహించలేక పృధ్వీసింగ్ 5 నెలలపాటు నిరాహారదీక్ష సాగించాడు చివరకు భారత ప్రజల ఆందోళన ఫలితంగా పృధ్వీసింగ్‌ను 1921లో మద్రాసుకు తీసుకువచ్చారు ఆయనను నాగపూర్ జైల్లో వుంచడం మంచిదని భావించిన పోలీసు ఆఫీసర్లు ఆయనకు సంకెళ్లువేసి, గట్టి పోలీసు కాపలాతో రైలు ఎక్కించారు రైలు ఒంగోలు సమీపానికి రాగానే ఆయన రైలుపెట్టె కిటికీద్వారా కిందికి దూకాడు అది అర్ధరాత్రి సమయం కారు చీకటి కాళ్లకు, చేతులకు సంకెళ్లు. అయినా ఎలాగో కొంతదూరం నడిచాడు ముక్తినూతలపాడు గ్రామం వెలుపలగల ఒక హరిజనుని ఇంటికి వెళ్లాడు దేశ్‌భక్త్, స్వరాజ్ అన్నమాటలు ఉచ్చరించాడు ఆ మాటలను అర్థం చేసుకున్న హరిజనుడు పృధ్వీసింగ్ సంకెళ్లను బద్దలుగొట్టాడు కానీ, అంతకంటే ఏమీ చేయలేకపోయాడు. కాగా సహాయం కొరకు అటూ ఇటూ తిరుగుతున్న పృధ్వీసింగును పోలీసులు అరెస్టుజేసి రాజమండ్రి జైల్లోపెట్టారు

తిరిగి 1922 నవంబర్ 29న పృధ్వీసింగును నాగపూర్ జైలుకు తీసుకు పోయేందుకు రైలు ఎక్కించారు కాని రైలు నాగపూర్ చేరకముందే ట్రెయిన్‌లోనుండి దూకి తప్పించుకున్నాడు. తరువాత అనేకచోట్ల వ్యాయామశాలలు నడిపాడు 1931లో కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు మారువేషంలో వెళ్లి, టెర్రరిస్టు విప్లవకారులతో సంబంధాలు పెట్టుకున్నాడు వారి సలహాననుసరించి, ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్ సహాయంతో ఆఫ్ఘనిస్తాన్ వెళ్లాడు అక్కడ ఆఫ్ఘన్ ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసి తరువాత విడిచిపెట్టింది ఎలాగైతేనేం చివరకు మాస్కో చేరాడు బోల్షివిక్ పార్టీలో చేరి రాజకీయాలను అధ్యయనం చేశాడు తిరిగి భారతదేశానికి వస్తుండగా మళ్లీ ఆఫ్ఘన్ ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసింది ఏడాదిన్నర తరువాత సోవియట్ రాయబార కార్యాలయంవారాయనను విడిపించి మాస్కోకు తీసుకువెళ్లారు తరువాత ఇటలీకి చెందిన ఒక ఓడలో ఒడెస్సానుండి బయలుదేరి పాండిచ్చేరికి చేరుకున్నాడు

అలా 16 ఏళ్ల రహస్య జీవితం గడిపిన పిమ్మట ఆయన 1938లో గాంధీజీని కలుసుకొని, గాంధీజీ సలహా ప్రకారం ప్రభుత్వానికి పట్టుబడ్డాడు కాని త్వరలోనే విడుదలై కొన్నాళ్లపాటు వార్ధా ఆశ్రమంలో వున్నాడు 1942లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో మరొకసారి ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసింది

ఆయన 90వ జన్మదినం సందర్భంగా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం ఆయనకు 90వేల చెక్కును బహూకరించగా, పంజాబ్ ముఖ్యమంత్రి దర్బారాసింగు మరొక 51వేల చెక్కును బహూకరించాడు ఆ రెండు చెక్కులను పృధ్వీసింగ్ సమరయోధుల స్మారక చిహ్నం నెలకొల్పడానికి యిచ్చివేశాడు

## కమ్యూనిస్టుల పాత్ర

లాహోర్ కుట్రకేసు శిక్షలవల్ల హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీ దెబ్బతిన్నది కాని వర్గ సంఘాలలోను, జాతీయోద్యమంలోను చేరి కృషి చేసిన కమ్యూనిస్టు పార్టీ పునాది విస్తరించింది.

కమ్యూనిస్టుల నాయకత్వానగల గిర్నీ కాంగార్ యూనియన్‌కు చెందిన టెక్స్‌టైల్ కార్మికులు బొంబాయిలో 1928 ఏప్రియల్‌నుండి అక్టోబర్ వరకూ సుదీర్ఘ సమ్మె చేశారు.

జోగ్లేకర్, మిరాజకర్, డాంగే ప్రభృతులు సమ్మెకు సారధ్యం వహించారు సాధారణ కార్మికుల స్థాయినుండి నాయకత్వ స్థాయికి ఎదిగిన ఎ ఆన్వే, జి ఆర్ కాస్లే మున్నగువారు సమ్మె జయప్రదం కావడానికి అవిరళ కృషి చేశారు

మిల్లు యజమానులకు అండగా ప్రభుత్వం నిలబడింది అయినా సమ్మె భగ్నం కాలేదు 1928 ఆగస్టు 16న ఇండియా కార్యదర్శికి వ్రాసిన రహస్య లేఖలో బాంబే గవర్నర్ ఇలా వివరించాడు

"ఇంతకాలం కార్మికులు ఎలా సమ్మె చేయగలుగుతున్నారో ఆశ్చర్యంగా వుంది యజమానులు అప్పుడప్పుడు మిల్లులు తెరుస్తున్నారు తగినంత పోలీసు బందోబస్తు సమకూర్చబడుతోంది. అయినా కార్మికులెవరూ పనిలోకి రావడం లేదు "

వేలాది కార్మికులు సమ్మె చేస్తున్నారని, సమ్మె సంపూర్ణంగాను, శాంతియుతంగాను జరుగుతోందని పత్రికలు వ్రాశాయి అలా ఆరుమాసాలు గడిచిన పిమ్మట యజమానులు దిగొచ్చారు సమ్మె జయప్రదమైంది అందువల్ల కమ్యూనిస్టు నాయకత్వానగల గిర్నీ కాంగార్ యూనియన్ సభ్యత్వం ఆరవై వేలకు పెరిగింది. యన్ యం జోషిలాంటి మితవాదుల నాయకత్వానగల యూనియన్ సభ్యుల సంఖ్య 9800కు తగ్గింది గాంధేయ పద్ధతులపై నిర్మించబడిన అహ్మదాబాద్ టెక్స్టైల్ లేబర్ అసోసియేషన్ సభ్యత్వం 27వేలకు పరిమితమైంది

1928 డిసెంబర్ నాటికి కమ్యూనిస్టుల పలుకుబడి బాంబే కార్మికవర్గంలో- ముఖ్యంగా జి.ఐ పి రైల్వే వర్కర్లలోను, ఆయిల్ డిపో వర్కర్లలోను పెరిగింది

బెంగాల్లో గోపేన్ చక్రవర్తి, ధరణి గోస్వామి మొదలైన కమ్యూనిస్టుల నాయకత్వాన లిల్లూహ్ రైల్వే వర్క్‌షాపు కార్మికుల సమ్మె 1928 జనవరినుండి జూలైవరకు జరిగింది సమ్మెను జయప్రదం చేసేందుకు అతివాద నాయకులు కిరణ్ మిత్రా, శివనాథ్ బెనర్జీలు రంగంలో దిగారు మార్చి 28న పోలీసు కాల్పులు జరిగాయి కనుక రైల్వే కార్మికులకు మద్దతుగా కలకత్తా కార్మికులు బ్రహ్మాండమైన ఊరేగింపులు జరిపారు

కమ్యూనిస్టుల సారధ్యంలోగల వర్కర్లు అండ్ పెజెంట్సు పార్టీ నాయకత్వాన కలకత్తా నగర పారిశుధ్య కార్మికులు సమ్మె చేశారు చెంగైల్ జౌరియా జూట్‌మిల్లుల కార్మికులుకూడా సమ్మె చేశారు ఇండిపెండెంట్ లేబర్ లీడర్ ప్రభావతీదాస్ గుప్తా సమ్మెను బలపరిచింది సమ్మెను బలపరిచిన కాంగ్రెసు నాయకులు బంకిం ముఖర్జీ, రాధారమణ మిత్రాలు కమ్యూనిస్టు పార్టీవైపుకు ఆకర్షింపబడ్డారు.

1928 జూలైలో సౌత్ ఇండియన్ రైల్వేలో సమ్మె చాలా పకడ్బందీగా జరిగింది సింగారవేలు చెట్టియార్, ముకుందలాల్ సర్కార్లకు జైలుశిక్షలు విధించి, పెరుమాళ్‌ను అండమాన్ దీవులకు పంపిన పిమ్మట మాత్రమే ప్రభుత్వం సమ్మెను భగ్నం చేయగలిగింది అయినా కమ్యూనిస్టుల పలుకుబడి పెరిగింది.

ఇలా కమ్యూనిస్టులు ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లోను, వర్కర్సు అండ్ పెంజెంట్సు పార్టీలోను చేరి అవిరళ కృషి చేయడంవల్ల కార్మికవర్గ రాజకీయ చైతన్యం పెరిగింది కార్మిక, కర్షక వర్గాల ఐక్యతకుగల ప్రాధాన్యత గుర్తించబడింది

ఆ దశలో పలువురు కమ్యూనిస్టులు ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా వుండేవారు "అధినివేశ ప్రతిపత్తి అక్కర్లేదు సంపూర్ణ స్వరాజ్యం కావాలి" అని ప్రచారం చేస్తూ, జాతీయ కాంగ్రెసులో తీర్మానాలు ప్రవేశపెట్టారు కనుకనే జవహర్‌లాల్ నెహ్రూ,

సుభాష్‌చంద్రబోసులాంటి అతివాద జాతీయ నాయకుల మద్దతును పొందగలిగారు

1928 డిసెంబరు 18న ఝరియాలో ప్రారంభమైన ఎ ఐ టి యు సి మహాసభ జవహర్‌లాల్ నెహ్రూను అధ్యక్షుడుగా ఎన్నుకున్నది సామ్రాజ్య వ్యతిరేక లీగ్ ప్రతినిధిగా జాన్‌స్టన్, పాన్ పసిఫిక్ ట్రేడ్ యూనియన్ ప్రతినిధిగా జె ర్యాన్ ఆ మహాసభలో పాల్గొన్నారు కార్మిక వర్గానికి సంబంధించిన తీర్మానాలతోపాటు "జమీందారీ భూస్వామ్య పద్ధతిని రద్దుచేయాలి" అనే తీర్మానాన్నికూడా మహాసభ ఆమోదించింది ఆ నెలాఖరున కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభ పెండాలును 50 వేలమంది కార్మికులు ఆక్రమించి "సంపూర్ణ స్వరాజ్య" తీర్మానాన్ని ఆమోదించారు అందువల్ల కార్మికవర్గ అగ్రగామి చైతన్యం వెల్లడైంది

## మీరట్ కుట్ర కేసు

అలా పెరిగిన కార్మికవర్గ ఐక్యతను, కమ్యూనిస్టు పలుకుబడిని విచ్ఛిన్నం చేసేందుకు పెట్టుబడిదారులు, ప్రభుత్వం చేతులు కలిపారు బొంబే కార్మికుల ఐక్యతను భగ్నం చేసేందుకు టెక్స్‌టైల్ మిల్లుల్లో పఠాన్లను చేర్చుకున్నారు "కమ్యూనిస్టు నాయకులు బ్రాహ్మణుల, బ్రాహ్మణాధిక్యత కొరకు వారు ప్రాకులాడుతున్నారు" అని ప్రచారం చేశారు అక్కడికీ సంతృప్తి చెందక మత కలహాలను రెచ్చగొట్టారు అందువల్ల 1929 ఫిబ్రవరిలో బొంబేలో మతకలహాలు చెలరేగాయి

అయినా కమ్యూనిస్టుల బలం తగ్గలేదు సరికదా, బొంబేలో 1929 మార్చిలో సార్వత్రిక సమ్మె జరిగింది కాగా బొంబే గవర్నర్ ఆందోళన చెందాడు ఆయనతోపాటు బెంగాల్ గవర్నర్‌కూడా ఆందోళన చెందాడు కఠినచర్యలు చేపట్టకపోతే పరిస్థితి విషమిస్తుందని వివరిస్తూ, ఆ ఇద్దరు గవర్నర్లు వైస్రాయి ఇర్విన్‌కు రిపోర్టు పంపారు.

అందువల్ల ప్రభుత్వం కేంద్ర అసెంబ్లీలో "పబ్లిక్ సేఫ్టీ బిల్లు"ను ప్రవేశపెట్టింది బొంబే, బెంగాల్ రాష్ట్రాల్లో ట్రేడ్ యూనియన్లను నిర్మిస్తున్న కమ్యూనిస్టులకు సహాయ పడేందుకు వచ్చిన ఫిలిప్ స్ప్రాట్, బెన్‌బ్రాడ్లేలను ఇండియానుండి వెడలగొట్టేందుకు పూనుకున్నది. కాని బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ నాయకులను వెడలగొట్టినంతమాత్రాన లాభం లేదనుకున్న ప్రభుత్వం 1929 మార్చి 20న 32 మంది కమ్యూనిస్టులను, కార్మిక, కర్షక నాయకులను అరెస్టుచేసి వారిమీద మీరట్ కుట్ర కేసు బనాయించింది "భారతదేశంపై చక్రవర్తికిగల అధికారాన్ని తొలగించేందుకు కుట్ర పన్నారు" అని ఆరోపించారు

అరెస్టయిన వారిలో స్ప్రాట్, హచిన్‌సన్, బ్రాడ్లేలు ఆంగ్లేయులు, ముజఫర్ అహమ్మద్, ధరణి గోస్వామి, గోపాల్ చక్రవర్తి, గోపాల్ బసక్, రాధారమణ మిత్రా, శివనాధ బెనర్జీ, శంశల్‌హుద, కిశోరీలాల్ ఘోష్ బెంగాలుకు చెందినవారు. ఘాటే, మిరాజకర్, డాంగే, జోగ్లేకర్, నింబకర్, ఎ ఎ.ఆల్వే, జి ఆర్ కాస్లే, డి.థంగ్డీ, ఎం జి దేశాయ్, జి అధికారి, ఎస్ హెచ్ ఝాబ్‌వాలా మహారాష్ట్రకు చెందినవారు పి సి జోషి, అయోధ్య ప్రసాద్, గౌరీశంకర్, విశ్వనాథ ముఖర్జీ, ధర్మవీర్‌సింగ్, ఎల్ కదమ్, షౌకత్ ఉస్మానీ ఉత్తరప్రదేశ్‌కు చెందినవారు. సోహన్‌సింగ్ జోష్, అబ్దుల్ మజీద్, కేదారనాథ సెహగల్ పంజాబురాష్ట్రంవారు

వీరి అరెస్టులకు ముందే పబ్లిక్ సేఫ్టీ బిల్లును ప్రవేశపెట్టిన ప్రభుత్వం 1929

ఏప్రియల్‌లో ట్రేడ్ డిస్‌ప్యూట్సు బిల్లును రూపొందించింది ఈ రెండు బిల్లులను జాతీయ కాంగ్రెస్ వ్యతిరేకించింది కాని, పబ్లిక్ సేఫ్టీ బిల్లుపైన కేంద్ర అసెంబ్లీలో చర్చ జరుగుతున్నప్పుడు "పలువురు కాంగ్రెస్ మెంబర్లు హాజరుకాలేదు" అని ఇండియన్ క్వార్టర్లీ రిజిష్టర్ నమోదు చేసింది అయినా కేంద్ర అసెంబ్లీ అధ్యక్షుడు విఠల్‌భాయ్ పటేల్ బిల్లును వ్యతిరేకించాడు "పబ్లిక్ సేఫ్టీ బిల్లును చర్చించినట్లయితే, మీరట్ కేసును గురించి ప్రస్తావించవలసి వుంటుంది అది కోర్టు ధిక్కారమవుతుంది కాబట్టి ఆ కేసు పూర్తయ్యేవరకు ఈ బిల్లును వాయిదా వేయండి లేదా ఆ మీరట్ కేసును ఉపసంహరించు కోండి" అని ప్రభుత్వానికి సూచించాడు కాని ప్రభుత్వం అంగీకరించలేదు. ఆ స్థితిలో బిల్లుపైన చర్చకు అనుమతించడం సభా నిబంధనావళిని దుర్వినియోగపరచడమవు తుందని విఠల్‌భాయ్ పటేల్ ప్రకటించాడు ఇక గత్యంతరంలేక ఆర్డినెన్సును ప్రకటించారు

మీరట్ కేసులోని ముద్దాయిలను చూడడానికి నెహ్రూ, అన్సారీ మున్నగు వారితోపాటు గాంధీజీ కూడా వెళ్లాడు జైలులోనున్నవారితో మాట్లాడుతూ గాంధీజీ ఇలా కోరాడు.

"త్వరలో లాహెూర్ కాంగ్రెస్ జరుగబోతోంది జాతీయ కాంగ్రెస్ లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యమని తీర్మానించబడుతుంది అందుచేత లాహెూర్ కాంగ్రెస్ తర్వాత నేను నిర్వహించే పోరాటంలో కమ్యూనిస్టులు చేరండి"

"చౌరీ చౌరా ఘటనలాంటిది జరిగితే మళ్లీ ఉద్యమాన్ని ఆపివేస్తారా?" అని కమ్యూనిస్టు నాయకులు అడిగినప్పుడు గాంధీజీ కొంచెంసేపు ఆలోచించి "లేదు, ఆపి వేయను" అని సమాధానమిచ్చాడు

## కోమింటర్న్ తీర్మాన ప్రభావం

అంతవరకూ జాతీయోద్యమంలోను, వర్గ సంఘాలలోను చేరి ఎన్నదగిన కృషిచేస్తూ బలపడిన కమ్యూనిస్టు పార్టీపైన ఆరవ కోమింటర్న్ (కమ్యూనిస్టు ఇంటర్నేషనల్) కాంగ్రెస్ 1928 డిసెంబరులో చేసిన తీర్మాన ప్రభావం పడింది. సెక్టేరియన్ పోకడలు ప్రారంభమయ్యాయి.

ఫాసెట్ కమిటీ రిపోర్టుకు వ్యతిరేకంగా రణదివె, దేవపాండేల నాయకత్వాన గిర్నీ కాంగార్ యూనియన్ కార్మికులు 1929 ఏప్రిల్‌నుండి ఆగస్టు వరకు సమ్మెచేశారు చివరకు సమ్మె విఫలమైంది కాని బెంగాల్ జూట్‌మిల్లుల్లో 1929 ఆగస్టులో జరిగిన ప్రథమ సార్వత్రిక సమ్మె జయప్రదమైంది

1929 నవంబర్ 28న జవహర్‌లాల్ అధ్యక్షతన నాగపూర్‌లో ప్రారంభమైన 10వ ఎ.ఐ.టి యు సి మహాసభలో చీలిక కలిగింది. కమ్యూనిస్టుల సెక్టేరియన్ పోకడవల్ల వి.వి గిరి, ఎస్.ఎం.జోషి, దివాన్ చమన్‌లాల్, మృణాళకాంతి బోస్ మొదలగువారు చీలిపోయి, "ఇండియన్ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్"ను స్థాపించారు మిగిలిన ఎ ఐ టి.యు సి ప్రతినిధులు సుభాష్‌చంద్రబోస్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు

స్టాలిన్ చేపట్టిన నూతన పాలసీవల్ల 1929లో సామ్రాజ్యవాద వ్యతిరేక అంతర్జాతీయ లీగ్‌నుండి జవహర్‌లాల్ నెహ్రూను తొలగించారు. 1931 జులై 7న సుభాష్‌చంద్రబోస్ అధ్యక్షతన కలకత్తాలో ప్రారంభమైన 11వ ఎ.ఐ.టి.యు సి మహాసభనుండి కమ్యూనిస్టులు బయటకుపోయి, "రెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్"ను

స్థాపించారు పై రెండు ఘటనలూ కోమింటర్న్ సూచించిన సెక్టేరియన్ పాలసీకి నిదర్శనాలు

ఇలా ట్రేడ్ యూనియన్లు చీలిపోవడం, అమెరికాలో ప్రారంభమైన ఆర్థిక మాంద్యం ప్రపంచవ్యాప్తంగావడం కార్మికవర్గ పోరాట పటిమ తగ్గడానికి కారణమయ్యాయి ఆర్థికమాంద్యంతోపాటు శిస్తుల పెరుగుదలవల్ల రైతాంగం పని మునగానాం తేలానాంగా తయారైంది ఆ స్థితిలో కమ్యూనిస్టులు కొన్ని విషమపరిస్థితుల నెదుర్కొనవలసివచ్చింది

## హైదర్‌ఖాన్ ప్రతిభ

పశ్చిమ పంజాబ్‌లోని సాధారణ రైతు కుటుంబంలో జన్మించిన హైదర్‌ఖాన్ ఓడ కార్మికునిగా పనిచేస్తూ, మొదట ఇంగ్లండులో స్థిరపడ్డాడు తరువాత అమెరికా వెళ్లాడు అక్కడగల ఒక పెద్ద మోటారు పరిశ్రమలో చేరి, ఆటోమొబైల్ ఇంజనీరయ్యాడు అటుపైన ప్రథమశ్రేణి విమాన పైలెట్ కాగలిగాడు. అమెరికన్ వర్కర్సు పార్టీలో చేరి, కార్మికోద్యమ నాయకుడుగా ప్రఖ్యాతిగాంచాడు

తరువాత రష్యాకు వెళ్ళి మార్క్సిజం అభ్యసించి, భారతదేశానికి తిరిగి వచ్చి కార్మికోద్యమ నిర్మాణానికి పూనుకున్నాడు ప్రభుత్వం ఆయనను మీరట్ కుట్రకేసులో ఇరికించినప్పుడు తప్పించుకొని మాస్కోకు వెళ్లిపోయాడు కాని, కొన్నాళ్లకు తిరిగివచ్చి, గోవా బ్రాహ్మణుని వేషంలో మద్రాసులో వుంటూ యంగ్ వర్కర్సు లీగును స్థాపించి కార్మికోద్యమాన్ని బలోపేతం చేశాడు కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య వగైరాలను కమ్యూనిస్టు పార్టీలో చేర్చాడు అప్పుడాయనను ప్రభుత్వం అరెస్టుచేసి జైలుశిక్ష విధించింది

అవిభక్త భారతదేశంలో ఆయన పదేళ్లపాటు జైలు జీవితం, అజ్ఞాతవాస జీవితం గడిపాడు దేశవిభజన తరువాత పాకిస్తానులో మరో పదేళ్లపాటు కారాగార నిర్బంధ జీవితం గడిపిన స్వాతంత్ర్య సమరయోధుడు హైదర్‌ఖాన్.

## పోరాట సన్నద్ధత .

1929 డిసెంబరు ఆఖరులోగా అధినివేశ ప్రతిపత్తి లభిస్తుందనే నమ్మకంలేదు కనుక సంపూర్ణ స్వాతంత్ర్యంకొరకు లాహోర్ కాంగ్రెస్ పట్టుబడుతుందనే విశ్వాసం ప్రబలింది అందుకు అనుగుణంగా దేశపరిస్థితులుకూడా రూపొందాయి.

అటు బార్డోలీలోను, ఇటు కృష్ణా, గోదావరి మండలాలలోను ప్రారంభమైన రీసెటిల్‌మెంటు వ్యతిరేక ఉద్యమంవల్ల ప్రభుత్వం వెనకడుగు వేసింది. కాగా కర్షక యువకులు ఉత్సాహంగా రంగంలో దిగేందుకు సిద్ధమయ్యారు.

1929 మార్చిలో ప్రభుత్వం అనేకమంది కార్మిక నాయకులను మీరట్ కుట్రకేసులో ఇరికించి బంధించడంవల్ల ఏర్పడిన పరిస్థితిలో, కొందరు కాంగ్రెస్ నాయకులు ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ప్రవేశించారు. బులాభాయ్ దేశాయ్ బాంబేలోను, సుభాష్ చంద్రబోస్ బెంగాల్లోనుగల రెడ్ ట్రేడ్ యూనియన్లను తమ ఆధీనంలోకి తెచ్చుకునేందుకు ప్రయత్నించారు అది గమనించిన ప్రభుత్వం, కార్మికుల పోరాటాలకు కాంగ్రెసు పెద్దలు నాయకత్వం వహిస్తారేమోనని భయపడసాగింది కాని కాంగ్రెసు నాయకుల చర్యలను కమ్యూనిస్టులు భగ్నం చేయగలరనే ధైర్యంతో పరిస్థితులను గమనిస్తూ ఉండిపోయింది.

(గూఢచారి సంస్థ డైరెక్టర్ పెట్రీ 1929 అక్టోబర్ 9న వ్రాసిన నోట్‌నుండి )

కమ్యూనిస్టులను, ట్రేడ్ యూనియన్ల పోరాటాలను ఎదుర్కొనేందుకు యజమానుల సంఘాన్ని స్థాపించడం అవసరమని తాతా వెల్లడించిన అభిప్రాయంతో బిర్లా ఏకీభవించలేదు జాతీయోద్యమ నాయకత్వాన్ని బలపరచడంద్వారా కమ్యూనిస్టులను ఎదిరించవచ్చునని బిర్లా భావించాడు

జితేంద్రనాథదాస్, భగత్‌సింగ్ ప్రభృతుల ఆమరణ నిరాహారదీక్షలు, వాజ్యాలాలు దేశంలోని యువకులను ఉత్తేజపరిచాయి యువజనోద్యమం బలపడింది కలకత్తాలో జరిగిన సోషలిస్టు యువజన కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత వహించిన జవహర్‌లాల్ నెహ్రూ "కమ్యూనిస్టు సమసమాజాన్ని స్థాపించేందుకు ప్రాతిపదికగా సంపూర్ణ స్వాతంత్ర్యం అవసరం" అని ఎలుగెత్తి చాటాడు కలకత్తాలో జరిగిన మరొక యువజన కాంగ్రెస్ సభకు అధ్యక్షత వహించిన సుభాష్‌చంద్రబోస్ చైనా, రష్యా, జర్మనీ, ఇటలీలలోని యువజనోద్యమాలను ఒకే గాట కట్టి, వాటిని ప్రశంసించాడు ఈ విధమైన విభేదాలున్నప్పటికీ బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక పోరాటానికి యువకులు సిద్ధమయ్యారు

నిర్మాణ కార్యక్రమాలకు తోడుగా గాంధీజీ విదేశీ వస్త్ర దహనాన్ని 1929లో కలకత్తాలో ప్రారంభించి అరెస్టు అయ్యాడు.

అలాంటి పరిస్థితులలో జరుగనున్న లాహెూర్ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షుడెవరు? అని ప్రజలు ఎదురుచూడసాగారు పది రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలు గాంధీజీని అధ్యక్ష పదవికి ఎన్నికచేశాయి ఐదు రాష్ట్రాలు సర్దార్ పటేలును, మూడు రాష్ట్రాలు జవహర్‌లాల్‌ను ఎన్నుకున్నాయి.

## జవహర్‌లాల్‌కు అధ్యక్ష పదవి

అధ్యక్షుడుగా వుండేందుకు జవహర్‌లాల్‌కూడా తటపటాయించాడు అయినా లాహెూర్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి జవహర్‌లాల్ పేరును గాంధీజీ ప్రతిపాదించాడు ఇక దానికి తిరుగేముంది? అయినప్పటికీ కొన్ని ప్రశ్నలు తలెత్తాయి.

అంతకుముందు గాంధీజీ, జవహర్‌లాల్ నెహ్రూను తీవ్రంగా మందలించిన విషయం, "శరవేగంతో ఎక్కడికో పరుగిడుతున్నా"వని హెచ్చరించిన విషయం కాంగ్రెసు నాయకులకు తెలుసు కాగా గాంధీజీ చేసిన నిర్ణయం వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది

నిజమే, గాంధీజీ నెహ్రూను హెచ్చరించిన మాట నిజమే అందుకు జవాబుగా జవహర్‌లాల్ నెహ్రూ గాంధీజీకి యిలా విన్నవించాడు

"బహుశా, ఏ గమ్యమూ లేకుండా అడ్డదిడ్డంగా దేశ సంచారంచేసే సోమరి పోతునైనప్పటికీ, రాజకీయంగా నేను మీ పుత్రుడనేకదా?" (నెహ్రూ టు గాంధీ–23 జనవరి, 1928–గోపాల్ పేజీ.112).

అంతేగాక, తాను ఆర్గనైజ్ చేసిన "ఇండియా ఇండిపెండెన్సు లీగ్" వైఫల్యాన్ని గురించికూడా జవహర్‌లాల్ నెహ్రూ 1929 జూలైలో గాంధీజీకి ఇలా వ్రాశాడు:

"లీగ్ పూర్తిగా విఫలమైంది రాజకీయ పార్టీలను, గ్రూపులను నిర్మించగల రాజకీయవేత్తకు వుండవలసిన దక్షత నాకు లేదు" (సెలక్టెడ్ వర్క్సు–IV–156)

జవహర్‌లాల్‌ను గురించి సరియైన అంచనా వేయడానికి ఇలాంటి జవాబులు గాంధీజీకి తోడ్పడ్డాయి

ఉత్తరప్రదేశ్‌లోని కిసాన్ ఉద్యమాలతో జవహర్‌లాల్‌కు కొంత సంబంధముంది సోషలిస్టు యూత్ కాంగ్రెస్‌తో సంబంధముంది ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు

1929లో ఆయన అధ్యక్షుడు సామ్రాజ్యవాద వ్యతిరేక అంతర్జాతీయ లీగ్‌కు ఆయన గౌరవాధ్యక్షుడు మోతీలాల్ నెహ్రూ తయారుచేసిన అధినివేశ ప్రతిపత్తి రాజ్యాంగాన్ని వ్యతిరేకించినవాడు జవహర్‌లాల్ కనుక 1929లో జరుగబోయే లాహోర్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా జవహర్‌లాల్‌ను గాంధీజీ ఎంపికచేశాడు జవహర్‌లాల్ అధ్యక్షుడైతే కాంగ్రెస్ బలపడుతుందని, అంతవరకూ తన అడుగుజాడల్లో నడవని కార్మికులు, అతివాదులు, కమ్యూనిస్టులు, టెర్రరిస్టులు సహితం సంపూర్ణ స్వరాజ్యంకొరకు తాను ప్రారంభించబోయే ఉద్యమంలో పాల్గొంటారని గాంధీజీ విశ్వసించాడు కనుకనే జవహర్‌ను సమర్థిస్తూ గాంధీజీ ఇలా అన్నాడు

"జవహర్ నిజంగానే తీవ్రవాది పరిస్థితులతో సంబంధంలేకుండా ఆయన ఆలోచనలు ముందుకు పరుగెడుతుంటాయి అయినా ఆయన వినమ్రుడు తెగేంతవరకూ లాగే మనస్తత్వం గలవాడుకాదు ఆవిరిని బంధిస్తే, అది బంధించినదానినే బద్దలు గొడుతుంది అదుపులోవుంచి క్రమబద్ధంగా ఉపయోగిస్తే, అనేక పనులకు ఉపయోగ పడుతుంది జవహర్‌ను మాత్రమేకాదు- దేశంలోని అతివాద యువకుల శక్తినికూడా అదుపులో వుంచి, అవసరమైన మోతాదులో క్రమబద్ధంగా ఉపయోగించవలసి వుంది " (యంగ్ ఇండియా, సెప్టెంబర్ 1929)

అలా రానున్న పోరాటానికి సన్నద్ధమవుతున్నందువల్ల 1929మేలో యాభై ఆరువేలుగావున్న కాంగ్రెస్ సభ్యత్వం నవంబరునాటికి ఐదులక్షలకు పెరిగింది.

పరిస్థితులను జాగ్రత్తగా గమనించిన వైస్రాయి ఇర్విన్ ఒక ప్రకటన చేశాడు "రాజ్యాంగబద్ధమైన అభివృద్ధిక్రమంలో సహజసిద్ధమైన కోరిక అధినివేశ ప్రతిపత్తి కాబట్టి ఆ ప్రతిపత్తిని కలిగించేందుకు, సైమన్ కమిషన్ రిపోర్టు వెలువడగానే రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సును ఏర్పాటు చేస్తాం" అని వివరించాడు వైస్రాయి ప్రకటనకు 1929 జూన్‌లో లేబర్ పార్టీ ప్రభుత్వం తన అంగీకారాన్ని తెలిపింది. కాని కామన్సు సభలో జరిగిన చర్చల సందర్భంలో టోరీలు, లిబరల్సుకూడా వైస్రాయి ప్రకటనను వ్యతిరేకించారు కాగా ఆ ప్రకటన విలువ తగ్గింది

అయినా నవంబర్ 2వ తేదీన వైస్రాయి ఆఫర్‌ను ఆమోదిస్తూ గాంధీ, మోతీలాల్, మాలవీయా ప్రభృతులు ఢిల్లీలో ఒక ప్రకటన చేశారు దానిమీద జవహర్‌లాల్ సంతకం చేశాడు కాని సుభాస్‌చంద్రబోస్ చేయలేదు. గాంధీజీ, మాలవీయా మున్నగు నాయకులు విధించిన షరతులను వైస్రాయి తిరస్కరించాడు అందువల్ల డిసెంబరు 23న గాంధీ-ఇర్విన్‌ల మధ్య జరిగిన సమావేశం విఫలమైంది

## లాహోర్ కాంగ్రెస్ మహాసభ

1929 డిసెంబరు నెలాఖరున రావీ నదీ తీరాన లాహోర్ జాతీయ కాంగ్రెస్ మహాసభ జరిగింది 30వేల మంది ప్రతినిధులు, ప్రేక్షకులు హాజరయ్యారు ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్ (సరిహద్దు గాంధీ) నాయకత్వాన పలువురు ప్రతినిధులు రావడమొక విశేషం అధ్యక్ష పదవి మోతీలాల్ నెహ్రూనుండి జవహర్‌లాల్ నెహ్రూకు సంక్రమించింది తన అధ్యక్షోపన్యాసంలో జవహర్‌లాల్ సామ్రాజ్యవాదాన్నీ, స్వతంత్ర సంస్థానాల ఉనికినీ ఖండించాడు సంపూర్ణ స్వాతంత్ర్యమే జాతీయ కాంగ్రెస్ లక్ష్యంగా వుండాలన్నాడు "స్వతంత్ర భారతదేశం ప్రపంచ సహకారాన్ని వాంఛిస్తుంది. కామన్ వెల్తులోగాని మరొక సమ్మేళనంలోగాని స్వతంత్ర భారత్ మాత్రమే భాగస్వామిగా వుండగలుగుతుంది" అన్నాడు

హింస-అహింసల సమస్యను ప్రస్తావించి, ఆ విషయాన్ని తాను నైతిక దృష్టితో చూడటంలేదని, ఎత్తుగడల దృష్టితో చూస్తున్నానని వివరించాడు సరియైన వ్యూహం, నిర్మాణ బలంగల విప్లవాలలో తప్ప తక్కిన ఉద్యమాలలో ప్రజలు శాంతంగా వుండాలని కోరాడు "ధైర్యంగా కార్యాచరణకు పూనుకున్నవారికే విజయం సిద్ధిస్తుంది ముందేమి జరుగుతుందో అనే అనుమానంతో మీనమేషాలు లెక్కబెట్టేవారికి లభించదు" అని హెచ్చరించాడు

సభలో "సంపూర్ణ స్వరాజ్యం" తీర్మానాన్ని గాంధీజీ ప్రవేశపెట్టాడు. ఆనందోత్సాహాలతో ప్రతినిధులు చప్పట్లు కొట్టారు స్వరాజ్య సమస్య పరిష్కారానికి, వైస్రాయి చేసిన ప్రయత్నాలను శ్లాఘించే విషయంలో తర్జన భర్జనలు జరిగాయి అయినా కొద్ది ఓట్ల తేడాతో నాయకత్వం ప్రవేశపెట్టిన తీర్మానం నెగ్గింది

ప్రధాన తీర్మానానికి 14 సవరణలొచ్చాయి వాటిలో కొన్నింటిని ఆమోదించి, మరికొన్నిటిని మహాసభ తిరస్కరించింది "దేశంలో పోటీ ప్రభుత్వాన్ని నెలకొల్పడం కాంగ్రెస్ లక్ష్యంగా వుండాలి అందుకొరకు కార్మికులను, రైతులను, యువకులను సంఘటితపరచే కర్తవ్యాన్ని జాతీయ కాంగ్రెస్ చేపట్టాలి" అంటూ సుభాష్‌చంద్రబోస్ ప్రవేశపెట్టిన ప్రత్యామ్నాయ తీర్మానంకూడా ఓడిపోయింది.

1929వ సంవత్సరం ముగిసి, 1930వ సంవత్సరం ప్రారంభమైన అర్ధరాత్రి సమయంలో స్వాతంత్ర్య పతాకాన్ని జవహర్‌లాల్ ఎగురవేశారు విప్లవం వర్ధిల్లాలి అన్న నినాదాలు మిన్నుముట్టాయి సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది అయినా ఉద్యమాన్ని ప్రారంభించేందుకు తేదీనిగాని, కార్యక్రమాన్నిగాని లాహోర్ మహాసభ నిర్ణయించలేదు 1930 జనవరి 2వ తేదీన కార్యవర్గ సమావేశం జరిగింది జనవరి 26వ తేదీ స్వాతంత్ర్య దినంగా పరిగణించి బహిరంగ సభలు జరపాలని, ఆ సభలలో ప్రమాణపత్రాలు చదివి ఆమోదించాలని కాంగ్రెస్ సభ్యులను కార్యవర్గం కోరింది 1930 జనవరి 26 ఆదివారంనాడు దేశమంతటా స్వతంత్ర్య దినోత్సవాలు జరిగాయి

## గాంధీజీ నాయకత్వం

1930 ఫిబ్రవరి 14 నుండి 16 వరకూ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం సబర్మతీ ఆశ్రమంలో జరిగింది గాంధీజీ ఎన్నుకున్న సమయంలో, ఎన్నుకున్న పద్ధతిలో శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించడానికి ఆయనకు అధికారమివ్వబడింది

గాంధీజీ 11 కోర్కెలను ప్రకటించారు వాటిని ఆమోదిస్తే శాసనోల్లంఘనోద్యమాన్ని విరమిస్తానన్నాడు ఆ కోర్కెలివి ·

1 సంపూర్ణ మద్యపాన నిషేధం
2 రూపాయి మారకపు రేటు 16 పెన్నీలకు తగ్గించాలి
3 భూమి శిస్తును విధించే అధికారం శాసనసభకు వుండాలి. ప్రస్తుతమున్న భూమి శిస్తులో యాభైశాతం తగ్గించాలి.
4 ఉప్పు పన్ను రద్దు చేయాలి
5 సైనిక వ్యయాన్ని కనీసం సగానికి తగ్గించాలి
6 తగ్గించబడిన భూమి శిస్తులకు అనుగుణంగా ప్రభుత్వాధికారుల జీతాలను కూడా సగానికిగాని, అంతకంటే తక్కువస్థాయికిగాని తగ్గించాలి
7 విదేశీ పోటీలనుండి స్వదేశీ మిల్లులకు రక్షణ కల్పించాలి.

8 కోస్తా నావికాయానం భారతీయులకు రిజర్వ్ చేయాలి
9 హత్య చేసినవారు, హత్యను ప్రోత్సహించినవారు మినహా తక్కిన రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేయాలి కేసులను ఉపసంహరించుకోవాలి 124-ఎ సెక్షన్‌ను రద్దు చేయాలి ప్రవాసంలోనున్న భారతీయులను తిరిగి దేశంలోకి రానీయాలి
10 సి ఐ డి శాఖను రద్దుచేయాలి
11. ఆత్మరక్షణకు తుపాకుల లైసెన్సులివ్వాలి

ఈ కోర్కెల ప్రకటనలో సంపూర్ణ స్వరాజ్య ప్రస్తావనలేదు కాగా జవహర్‌లాల్ సహితం ఆశ్చర్యపోయాడు

ఫిబ్రవరి 27న ఉద్యమ పథకాన్ని గాంధీజీ వెల్లడించాడు తన ఆశ్రమవాసులు 78 మంది ముందుగా ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించుతారని ప్రకటించాడు తరువాత మార్చి 2న దేశ ప్రజల దుస్థితిని వివరిస్తూ వైస్రాయికొక లేఖ వ్రాశాడు. ఆ దుస్థితిని తొలగించేందుకు తాను కోరిన కోర్కెలను ఆమోదించవలసిందిగా వైస్రాయిని అర్థించాడు ఆమోదించకపోతే శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించక తప్పదని తెలియచేశాడు

వైస్రాయికి వ్రాసిన లేఖలో గాంధీజీ మరికొన్ని ముఖ్య విషయాలనుకూడా పొందుపరిచాడు

"వైస్రాయి జీతం నెలకు 21 వేల రూపాయలు బ్రిటిష్ ప్రధాని జీతం 5,400 రూపాయలకు సమానం భారతీయుల సగటు తలసరి ఆదాయం రోజుకు రెండణాలలోపు బ్రిటిష్‌వారి సగటు తలసరి ఆదాయం రోజుకు రెండు రూపాయలు

"ఇంగ్లండుకు ఇండియాకుగల ప్రయోజనాలు పరస్పర విరుద్ధమైనవి తన ప్రయోజనాల రక్షణకు ఇంగ్లండు న్యాయమైనా, అన్యాయమైనా తన యావచ్ఛక్తినీ వినియోగించుతుంది కాబట్టి, ఆ మృత్యుముఖంనుండి తప్పించుకోడానికి తగిన శక్తి సామర్థ్యాలను భారతదేశం సంతరించుకోవాలి

"బ్రిటిషు ప్రభుత్వానిది సంఘటిత దౌర్జన్యం టెర్రరిస్టుల దౌర్జన్యం అసంఘటితం ఈ రెంటినీ ఎదిరించడానికి నా అహింసా సిద్ధాంతాన్ని ప్రయోగించక తప్పదు నేను ఉపేక్షిస్తే, దేశాన్ని రెండురకాల దౌర్జన్యాలకు అప్పగించినట్లవుతుంది "

టెర్రరిస్టుల ఆదర్శం తన ఆదర్శంలాంటిదేనని గాంధీజీ అంగీకరించాడు కాని వారి చర్యలవల్ల ప్రజలకు తగిన ప్రతిఫలం లభించదనే విశ్వాసం తనకు కలదని ఆ లేఖలో గాంధీజీ వివరించాడు

గాంధీజీ వ్రాసిన లేఖకు జవాబుగా వైస్రాయి లేఖ వ్రాశాడు "మీ చర్య ప్రజాశాంతికి భంగకరం న్యాయశాస్త్ర విరుద్ధం అలాంటి ఉద్యమాన్ని మీరు తలపెట్టినందుకు నేను నా విచారాన్ని వ్యక్తం చేస్తున్నాను" అని తన లేఖలో వివరించాడు

గాంధీజీ ఆశాభంగం చెందాడు రొట్టె అడిగితే రాయి లభించిందన్నాడు "భారతదేశం పెద్ద కారాగారం వైస్రాయి కోరుతున్న శాంతి విసుగుపుట్టించేదిగా వుంది పైగా దుఃఖకరమైనది అలాంటి నిర్బంధశాంతిమూలాన భారతజాతికి ఊపిరాడడంలేదు కాబట్టి బ్రిటిష్ శాసనాన్ని ధిక్కరిస్తా" అని ప్రకటించాడు



# ఉప్పు సత్యాగ్రహం

శాసనోల్లంఘన సమయంలో పోటీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలన్న బోసును ప్రభుత్వం జనవరి 26కు ముందే అరెస్టు చేసింది శాసన ధిక్కారానికి గాంధీజీ ఉప్పు పన్ను చట్టాన్ని ఎంచుకున్నాడు అనేకమంది నాయకులు ఆశ్చర్యపోయారు సామ్రాజ్య వాదులు హేళన చేశారు. "ఉప్పు సత్యాగ్రహమా? అది మరో స్టంట్ చేయనీయండి చూద్దాం" అన్నాడొక బ్రిటిష్ అధికారి "దండిలోని చిత్తడి నేలకు వెళ్లి ఓ గుప్పెడు ఉప్పు చేస్తే ఈ ముసలాడికి వొరిగేదేమిటి?" అన్నాడు మరొక అధికారి

సముద్ర తీరపు చిత్తడి నేలల్లో స్వతఃసిద్ధంగానే ఉప్పు పేరుకుంటుందని అందరికీ తెలుసు గాలిని, నీటిని అనుభవించినట్లే, తీర ప్రాంత ప్రజలు ఉప్పునుకూడా అనుభవించవచ్చు స్వతఃసిద్ధమైన ఈ హక్కును 1836లో ఈస్టు ఇండియా కంపెనీ ప్రభుత్వం హరించింది

ఇది మానవుని ప్రాథమిక హక్కు ఇందుకు సంబంధించిన సమస్య ధనిక-బీద తారతమ్యం లేని సమస్య చట్టాన్ని ధిక్కరించి ఉప్పును తయారుచేయడమంటే పన్నుల నిరాకరణకు నాంది ప్రస్తావన జరిగినట్లే కనుకనే గాంధీజీ సమష్టి శాసనోల్లంఘనోద్యమంలో తొలిచర్యగా సాల్టు సత్యాగ్రహం ప్రారంభించాడు క్రమేణా తాను ఎంచుకున్న ప్రాంతాలలో పన్నుల నిరాకరణకు పిలుపునివ్వాలని నిశ్చయించుకున్నాడు

గాంధీజీ వ్యూహం వల్లభభాయ్ పటేల్‌కు తెలుసు కాగా ఆయన బార్డోలీ ప్రజలను, సత్యాగ్రహ సమరానికి ఆయత్తం జేశాడు "ప్రభుత్వంతో పోరాడేటప్పుడు ప్రజలు భోగలాలసులుగా వుండకూడదు వివాహమహోత్సవాలు జరుపకూడదు ఉదయం ఇళ్లకు తాళాలు వేసి పొలాలకు పొండి, సాయంత్రం తిరిగిరండి మన తాలూకాను గాంధీజీ సమష్టి శాసనోల్లంఘనానికి ఎన్నుకున్నారు ఆ గౌరవాన్ని నిలబెట్టండి మీ పశువులను ప్రభుత్వం జప్తు చేసినా, మీ పొలాలను స్వాధీనం చేసుకున్నా భయపడవద్దు పొలాలను ఇంగ్లండ్‌కు తీసుకుపోలేరుగదా? ఏది ఏమైనా గుజరాత్ యావత్తూ మీకు అండగా నిలబడుతుంది" అని హెచ్చరించాడు అప్పుడర్థమైంది ప్రభుత్వానికి అసలు విషయం వెంటనే మార్చి మొదటివారంలోనే సర్దార్ పటేల్‌ను ప్రభుత్వం అరెస్టు చేసింది

## "దండి" యాత్ర

స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఏప్రియల్ 6 కొక ప్రాముఖ్యత వుంది 1919 ఏప్రియల్ 6న రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా దేశ వ్యాపిత హర్తాళ్ జరిగింది ఏప్రియల్ 13న జలియన్‌వాలాబాగ్ దురంతాలు జరిగాయి కనుక ఏప్రియల్ 6 నుండి 13 వరకూ జాతీయ వారంగా పరిగణించి, అమరవీరులను స్మరించేవారు కాగా, 1930 ఏప్రియల్ 6న అరేబియా సముద్ర తీరంలోని దండి గ్రామంలో ఉప్పును తయారుచేసేందుకు గాంధీజీ నిశ్చయించుకున్నాడు.

ఆయన నాయకత్వాన 78 మంది సత్యాగ్రహులు (సబర్మతీ ఆశ్రమవాసులు) మార్చి 12న దండికి బయలుదేరారు. వారిలో యెర్నేని సుబ్రహ్మణ్యంగారొకరు చేతి కర్ర ఊతంతో గాంధీజీ రోజుకు 8 మైళ్లు చొప్పున నడిచి, ఏప్రియల్ 5న దండికి

చేరుకున్నాడు విదేశాలనుండి విలేకర్లొచ్చారు వార్తాచిత్రాలు తయారుజేశారు

దారిలో వేలాది ప్రజలు గాంధీజీని దర్శించేవారు సకల సౌకర్యాలు కల్పించజూచే వారు కాని గాంధీజీ అంగీకరించేవాడుకాదు "నా జీవిత విధానం ప్రజల సగటు ఆదాయంతో ముడిపడి వుంటేనే నేను వైస్రాయి తీసుకుంటున్న అత్యధిక జీతాన్ని నిరోధించగలను అన్న, వస్త్రాలులేనివారి పక్షాన, నిరుద్యోగుల పక్షాన మనం నిలబడి వున్నామని చెప్పుకుంటున్నాం కాగా మాటలకు, చేతలకు పొంతన వుండాలి సగటు ప్రజల శక్తిని మించి మనం జీవించడమంటే దొంగతనంగా సమకూర్చుకున్న ఆహారాన్ని భుజించి జీవించడమన్నమాట అలా జీవించడంవల్ల మన యుద్ధం నెగ్గదు" అని గాంధీజీ హెచ్చరించాడు

"జంబుసారు" అనే గ్రామంలో ప్రజలు పోలీసులకు, ఉద్యోగులకు అన్నం పెట్టడానికి తిరస్కరించినపుడు "ప్రభుత్వోద్యోగులను లంకణాలు చేయించడం మన మతంగాదు" అని గాంధీజీ వారికి అన్నం పెట్టించాడు

"వనసారీ" గ్రామంలో మాట్లాడుతూ "ఉప్పు పన్ను, సారా వ్యాపారం నిర్మూలింప బడితే అహింసకు జయము గలిగినట్లే నా కోరిక సఫలం కావాలి లేదా నా శవం పశ్చిమ సముద్రంలో తేలాలి" అని శపథం చేశాడు

ఏప్రియల్ 6న గాంధీజీతోపాటు సత్యాగ్రహులందరూ సముద్ర తీరంలోని ఉప్పును పోగుజేశారు 6వ తేదీనుండి 13వ తేదీ వరకూ ప్రజలందరూ ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించాలని గాంధీజీ విజ్ఞప్తి చేశాడు "ప్రభుత్వోద్యోగులు రాజీనామా చేయాలి విద్యార్థులు స్కూళ్లను, కాలేజీలను వదిలివేయాలి సారా దుకాణాలను, విదేశీ వస్త్ర దుకాణాలను పికెటింగ్ చేయాలి విదేశీ వస్త్రాలు తగులబెట్టాలి నూలు వడకాలి అస్పృశ్యతను తొలగించాలి హిందూ-ముస్లిమ్ ఐక్యతకు కృషి చేయాలి" అని విజ్ఞప్తి చేశాడు

వెంటనే దేశమంతటా బహిరంగసభలు జరిగాయి వందలాది ప్రభుత్వోద్యోగులు రాజీనామా చేశారు కాంగ్రెస్ శాసనసభ్యులు రాజీనామాలిచ్చారు అనేకచోట్ల ఉప్పు చట్టాన్ని ప్రజలు ఉల్లంఘించారు సారా దుకాణాలవద్ద పికెటింగ్‌లు ప్రారంభమయ్యాయి అనేకచోట్ల రైతులు పన్నులు కట్టేందుకు నిరాకరించారు ప్రజాప్రదర్శనలు, కార్మిక సమ్మెలు జరిగాయి కరాచీ, షిరోడా, రత్నగిరి, పాట్నా, పెషావర్, కలకత్తా, మద్రాస్, షోలాపూర్‌లలో తీవ్ర ఘటనలు జరిగాయి.

## ఆంధ్రలో ఉప్పు సత్యాగ్రహం

ఏప్రియల్ 6న కాలేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, పట్టాభి కలసి సముద్ర తీరంనుండి మూడు గుప్పిళ్ల ఉప్పు తెచ్చి మచిలీపట్నంలో పంచిపెట్టారు. 9వ తేదీన తెచ్చిన ఉప్పును డాక్టర్ పట్టాభి వేలం వేయగా, పురాణం సూరిశాస్త్రి నవరసు బంగారమిచ్చి ఒక ఉప్పు పొట్లం తీసుకున్నాడు అదేరోజున వేలూరి యజ్ఞనారాయణ నాయకత్వాన 5గురు వలంటీర్లు ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించారు

ఏప్రియల్ 10న టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య చిన్నాపురంనుండి ఉప్పు తెస్తూ వుండగా పోలీసులు అడ్డగించి ఆ ఉప్పును లాక్కున్నారు ప్రభుత్వ నిర్బంధకాండకు అది నాంది అయింది

బందరు సముద్రం సత్యాగ్రహ నిలయమైంది 22మంది పురుషులు, ముగ్గురు స్త్రీలు ఉప్పు సత్యాగ్రహం చేస్తుండగా చూచిన వేయిమంది ప్రజలు ఆ సత్యాగ్రహంలో పాల్గొన్నారు వారంతా సముద్రస్నానానికి వచ్చినవారేగాని, సత్యాగ్రహులను చూడడానికి వచ్చినవారు కాదు

కాళేశ్వరరావు నాయకత్వంలో 86గురు సత్యాగ్రహులు బెజవాడనుండి రైల్లో బందరు చేరారు గంపలగూడెం జమీందారు నాయకత్వంలో 60 మంది సత్యాగ్రహులు బెజవాడనుండి కాలినడకన బందరు వెళ్లారు దారిలో 150 మంది సత్యాగ్రహులు ప్రధాన దళంతో కలిశారు తరువాత డాక్టర్ వెలిదండ్ల హనుమంతరావు నాయకత్వాన మరో 36 మంది సత్యాగ్రహులు కూడా బెజవాడనుండి బందరు వెళ్లారు డాక్టర్ ఘంటశాల సీతారామశర్మ నాయకత్వాన మరో దళం బెజవాడనుండి ప్రచారం చేసుకుంటూ బుద్ధవరం మీదుగా నూజివీడు వెళ్లాం క్రమంగా అందరినీ అరెస్టుచేసి జైళ్లకు నెట్టింది ప్రభుత్వం

ఏప్రియల్ 9న కొండా వెంకటప్పయ్య, శరణు రామస్వామి చౌదరి, ఎన్ వి ఎల్ నరసింహారావుల నాయకత్వాన 16గురు మహిళలతో సహా వందమంది సత్యాగ్రహులు గుంటూరు జిల్లాలోని వాడ్రేవువద్ద సముద్ర జలాలనుండి ఉప్పు తయారుచేశారు ఎ కామేశ్వరరావు, కాశీ విశ్వనాథం కలసి ఏప్రియల్ 16న తెనాలి బహిరంగ సభలో ఉప్పును విక్రయించారు. 26న 41 మంది సత్యాగ్రహులు కనపర్తి ఉప్పు కొటారులనుండి ఉప్పు తీసుకొచ్చారు దేవరంపాడు శిబిరంనుండి బయలుదేరిన వందమంది సత్యాగ్రహులు సముద్ర జలాలతో ఉప్పు తయారుచేశారు మేనెల 3న 40 మంది సత్యాగ్రహులు, నాలుగువందలమంది ప్రజలు కలిసి నిజాంపట్నం ఉప్పు కొటారులపై దాడిచేసి ఉప్పు తీసుకుపోయారు

పశ్చిమ గోదావరి జిల్లాలో దండు నారాయణరాజు, ఎ గోవిందాచారి, తల్లాప్రగడ నరసింహశర్మల నాయకత్వంలో సత్యాగ్రహులు ఉప్పు చట్టాన్ని ధిక్కరించారు ఏప్రియల్ 15నుండి మే 13 వరకు సత్యాగ్రహ శిబిరాలు నిర్వహించబడినాయి ఏలూరులోని నేషనల్ స్కూల్ విద్యార్థులుకూడా ఉప్పు తయారుచేశారు దెందులూరు, నడింపల్లి, కొవ్వలి, చింతలపూడి వగైరా గ్రామాలలో ప్రజలు ఉప్పు చట్టాన్ని ధిక్కరించారు. గణపవరంలో ఆరువేలమంది ప్రజల ఎదుట నూరుగురు స్త్రీలు ఉప్పు తయారుచేసే కార్యక్రమంలో పాల్గొన్నారు

తూర్పుగోదావరి జిల్లాలో బులుసు సాంబమూర్తి, వెన్నేటి సత్యనారాయణ, క్రొవ్విడి లింగరాజు మున్నగువారి నాయకత్వాన సత్యాగ్రహం కొనసాగింది. కాకినాడనుండి బయలుదేరిన సత్యాగ్రహులు చొల్లంగి వెళ్ళి ఉప్పు తయారుచేసి ప్రజలకు పంచిపెట్టారు కొత్తపల్లి శిబిరంనుండి బయలుదేరిన సత్యాగ్రహులు సముద్ర తీరంలో ఉప్పు తయారుచేశారు. చొల్లంగి శిబిరాన్ని పోలీసులు ధ్వంసం చేయడంవల్ల బెండమూడి లంకనుండి ఉప్పునీరు తెచ్చి ఉప్పాడ, అమలాపురం, కొత్తపల్లివంటిచోట్ల ఉప్పును తయారుచేసి పంచిపెట్టారు. విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోకూడా ఉప్పు చట్టం ధిక్కరించబడింది

బెజవాడ గోపాలరెడ్డి, ఎల్ ఫకీర్, వి.బలరామిరెడ్డి, ఓరుగంటి వెంకట సుబ్బయ్య, ఖాసా సుబ్బారావు ప్రభృతుల నాయకత్వాన నెల్లూరు జిల్లాలో ఉప్పు సత్యాగ్రహం కొనసాగింది. మే 11న మైపాడు బీచ్‌లో ఉప్పు తయారుచేసి, 120 రూపాయలకు

అమ్మారు ఓరుగంటి మహాలక్ష్మమ్మ, ఆమె కొడుకు, కూతురుకూడా అరెస్టయ్యారు పాతూరి బాలసరస్వతమ్మ, పొణకా కనకమ్మ, బొమ్మా శేషురెడ్డి లాంటివారందరూ జైళ్ల పాలయ్యారు మైనరు అయినప్పటికీ పుచ్చలపల్లి సుందరయ్యను పోలీసులు అరెస్టుచేసి బోర్‌స్టల్ స్కూలుకు పంపారు

రాయలసీమ జిల్లాలు సముద్ర తీరానికి దూరంగా వున్నందున అక్కడ ఎక్కువగా మద్యపాన వ్యతిరేక ప్రచారం, విదేశీ వస్తు బహిష్కరణ కార్యక్రమాలు ముమ్మరంగా కొనసాగాయి కల్లూరి సుబ్బారావువంటివారు ఉద్యమ విజయానికి విశేషంగా కృషి చేశారు

మద్రాసు నగరంలో ఉప్పు సత్యాగ్రహాన్ని జయప్రదంచేసే బాధ్యతను టంగుటూరి ప్రకాశం, కాశీనాధుని నాగేశ్వరరావు చేపట్టారు దుర్గాబాయమ్మ, రుక్మిణీలక్ష్మీపతికూడా ప్రముఖ పాత్ర వహించారు ఏప్రియల్ 21న నాయకులను అరెస్టు చేశారు కాగా 22న నగరంలో పూర్తి హర్తాళ్ జరిగింది. కార్మికులు నిరసన ఊరేగింపు జరిపారు పోలీసులు లారీఛార్జి చేశారు ఏప్రియల్ 26న హైకోర్టు బీచ్‌లో జరిగిన సభపైన, ట్రిప్లికేన్ బీచ్‌లో జరిగిన సభపైన పోలీసు కాల్పులు జరిగాయి ముగ్గురు మరణించారు

## ప్రభుత్వ దమనకాండ

ఉద్యమం తీవ్రమైన కొలదీ ప్రభుత్వ దమనకాండ పెరిగింది ఏప్రియల్ 23న బెంగాల్ ఆర్డినెన్స్ పునరుద్ధరింపబడింది. 1910-11 నాటి ముద్రణాశాసనం ఆధారంగా ఆర్డినెన్సు ప్రకటించబడింది

"సైనిక శాసనపు ప్రచ్ఛన్న రూపంలో మనం జీవిస్తున్నాం ఈ కొత్త ఆర్డినెన్స్‌కు భయపడరాదు మన శరీరాలనేగాక మన ఆస్తులనుకూడా వారి స్వాధీనం చేయడానికి జంకరాదు" అని గాంధీజీ విజ్ఞప్తి చేశాడు

అదే సమయంలో ఆవరించిన ఆర్థిక మాంద్యంవల్ల రైతుల రుణభారం 9 వందల కోట్లకు పెరిగింది. కాగా, రైతులు దిక్కుతోచని పరిస్థితిలో పడిపోయారు అయినా బ్రిటిష్ ప్రభుత్వం పట్టించుకోలేదు సరిగదా, ఆర్థిక మాంద్యంనుండి తాను బయటపడేందుకు తగిన విధంగా ఎగుమతి, దిగుమతి పన్నుల విధానాన్ని చేపట్టింది. భారతదేశపు ఎగుమతులు తగ్గాయి దిగుమతులు పెరిగాయి భారతీయులు- ముఖ్యంగా రైతులు తమవద్దగల వెండి బంగారాలను అమ్మివేసుకోవలసి వచ్చింది కాగా 3 వందలకోట్ల విలువ గల వెండి బంగారాలు బ్రిటన్‌కు చేరాయి బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించిన మారకపు రేటువల్ల భారతదేశ రుణం పదకొండు శాతం పెరిగింది వ్యవసాయక ఉత్పత్తుల ఎగుమతి బాగా తగ్గిపోయింది వాటి ధరలు పూర్తిగా పడిపోయాయి. చిన్న పెట్టుబడి దారులు దివాళా తీశారు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకూ, భారత పారిశ్రామికవేత్తలకు మధ్య కూడా ఘర్షణ పెరిగింది అందువల్ల ప్రతివారికీ బ్రిటిష్ ప్రభుత్వం మీద ఏదో ఒకవిధమైన అసంతృప్తి, క్రోధం పెరిగాయి కాగా గాంధీజీ ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహం అన్ని వర్గాల ప్రజలను కార్యరంగంలోకి దింపింది.

"వెడలే స్వరాజ్య దివ్యరథము", "వీరగంధము దెచ్చినారము" మున్నగు పాటలను కవులు రచించారు ఢిల్లీలో 1600 మంది స్త్రీలు సత్యాగ్రహంచేసి అరెస్టయ్యారు. బొంబాయిలో మధ్యతరగతి మహిళలు అనేకులు అరెస్టయ్యారు స్త్రీలతోపాటు

ముదుసలులు, బాలబాలికలుకూడా పోలీసుల లారీదెబ్బలకు గురయ్యారు

ప్రభుత్వం ఏప్రియల్ 16న జవహర్‌లాల్ నెహ్రూను అరెస్టు చేసింది వెంటనే వేలాది సత్యాగ్రహులను జైళ్లకు నెట్టింది వారికి అన్నం, నీరు సరిగా ఇవ్వకుండా మాడ్చారు వందలాది సత్యాగ్రహులను తుపాకిగుళ్లకు ఎరజేశారు పోలీసు కాల్పులవల్ల కరాచీలో దత్తాత్రేయ అనే యువకునితో సహా ఏడుగురు మరణించారు జయరామ్‌దాస్ దౌలత్‌రామ్ తొడలో ఒక తుపాకి గుండు దూసుకుపోయింది .

ఏప్రియల్ 20న పెషావరులో కొంతమంది సత్యాగ్రహులను ప్రభుత్వం అరెస్టు చేసింది వారిని విడిపించేందుకు వేలాది ప్రజలు ప్రయత్నించారు పోలీసులు కాల్పులు సాగించారు పఠాన్లు ఎదురు కాల్పులు సాగించారు ప్రజల తిరుగుబాటు ప్రారంభమైంది నగరంలో ప్రజలు బారికేడ్లు నిర్మించి ప్రభుత్వ సాయుధ శకటాలను అడ్డగించారు ప్రజలపైన కాల్పులు జరిపేందుకు రాయల్ గార్వాల్ రైఫిల్స్‌కు చెందిన సోల్జర్లు నిరాకరించారు వారి నాయకుడైన ఠాకూర్ చంద్రసింగ్, "ముస్లిమ్‌లు మా సోదరులు. వారిమీద మేము కాల్పులు సాగించం విభజించి పాలించే నీతి మా దగ్గర పనిచేయదు" అని ప్రకటించాడు అధికారులు సైనిక కంటోన్‌మెంటులో తలదాచుకున్నారు పదిరోజులపాటు పెషావర్ పట్టణం ప్రజల అధీనంలో వుండిపోయింది

తరువాత గార్వాలీ సైనికులను బ్రిటిష్ సోల్జర్సు చుట్టుముట్టారు గార్వాలీ సైనికులకు అండగా ఆఫ్రిడీ మహ్మద్ తెగవారు పెషావర్ చేరుకున్నారు పంజాబ్ నుండి అకాలీ నాయకులుకూడా ఒక దళాన్ని పెషావర్‌లోని ప్రజలకు అండగా పంపారు అయినా బ్రిటిష్ సైనికులు పైచేయి సంపాదించి, గార్వాలీ సైనికులను, అనేకమంది ప్రజలను అరెస్టు చేశారు గార్వాలీ సైనిక నాయకులలో కొంతమందిని ఉరిదీశారు తక్కిన వారినందరినీ జైళ్లలో కుక్కారు

## పఠాన్ల త్యాగం

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వాన ఖుదైఖిద్మత్‌గార్ ఉద్యమం విస్తరించింది ఖుదైఖిద్మత్‌గార్ అనగా దేవుని సేవకుడు అని అర్థం బాద్‌షాఖాన్ అనీ, సరిహద్దు గాంధీ అనీ ఆప్యాయంగా పిలువబడిన ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ 1929 నవంబరులో ఒక స్వచ్ఛంద సేవకుల దళాన్ని ఏర్పరచాడు అదే ఖుదైఖిద్మత్‌గార్ల దళం వారిని ప్రజలు ఎర్రచొక్కాలవారు (రెడ్‌షర్ట్ వాలంటీర్లు) అని పిలిచేవారు.

1929 డిసెంబరులో లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభకు విచ్చేసిన గఫార్‌ఖాన్, తన అనుచరులతో సహా కాంగ్రెస్ ఉద్యమంలో చేరాడు సత్యాగ్రహోద్యమంలో ఖుదైఖిద్మత్‌గార్స్ చేసిన త్యాగాలవల్ల ఉద్యమం బలపడడమేగాక వారి సంఖ్యకూడా విపరీతంగా పెరిగింది. 1930 మార్చిలో రెండువేలకుపైగా వున్న ఖుదైఖిద్మత్‌గార్ దళ సభ్యుల సంఖ్య సెప్టెంబరునాటికి 80 వేలకు పెరిగింది మరొక ఆరు నెలల్లో మూడు లక్షలకు పెరిగింది

ఫక్తూన్ ప్రజలలో విద్యను ప్రోత్సహించడం, సాంఘిక సంస్కరణలు ప్రవేశపెట్టడం, జీవకారుణ్య సంబంధమైన పనులకు వారు పూనుకునేటట్లు చేయడం ధ్యేయంగా పెట్టుకొన్న గఫార్‌ఖాన్ 1928లో "ఫక్తూన్" అనే పత్రికను ప్రారంభించాడు ఆ పత్రిక ముఖపత్రం

పైన "ఘని" వ్రాసిన పద్యాన్ని ముద్రించేవారు దాని భావ మిది

"నేను నా రక్తాన్ని చిందించకుండా, అమరవీరుడుగా ఆత్మార్పణం చేయకుండా చనిపోతే, తళతళ మెరిసే రాతిఫలకం అమర్చిన గోరీలో నన్నొక బానిసగా పూడ్చిపెడితే, దానిమీద ఉమ్మివేయ్ బ్రిటిష్ ఫిరంగి కాల్పులకు నేను ముక్కలు ముక్కలుగాకపోతే, ఈ నా బీడు భూమిని ఈడెన్ గార్డెన్‌కు మారుస్తా"

ఇలా ముఖపత్రం మీద ముద్రించినట్లే, మొదటి పేజీలో "ఖాదిమ్" వ్రాసిన పద్యాన్ని ముద్రించేవారు "బానిసగా నూరేళ్లు బ్రతకడంకంటే మృత్యువు కోరల్లో చిక్కి చావనున్న చివరిక్షణాల్లోనైనా స్వాతంత్ర్యం అనుభవించి చావడం మేలు" అని ఆ పద్యం హెచ్చరించేది

అలాంటి ఉన్నతాశయాలతో గఫార్‌ఖాన్ ప్రారంభించిన ఉద్యమం అహింసా యుతంగా కొనసాగింది అయినా ఉప్పు సత్యాగ్రహకాలంలో ఖుదైఖిద్మత్‌గార్లతోపాటు సరిహద్దు రాష్ట్ర ప్రజలు నరకబాధలనుభవించారు అయినా వారు వెనకడుగు వేయలేదు ఎర్రటి యూనిఫారాలు ధరించిన ఖుదైఖిద్మత్‌గార్లు పాట పాడుకుంటూ, కవాత్‌చేస్తూ ప్రదర్శనల్లో పాల్గొనేవారు

ఏప్రియల్ 23న శాసనోల్లంఘన చేసేందుకు గఫార్‌ఖాన్ నిర్ణయించాడు దానితోపాటు సారా దుకాణాలవద్ద పికెటింగ్ చేయాలని కాంగ్రెస్ కమిటీ నిర్ణయించింది

ఏప్రియల్ 22న "ఉత్మన్‌జాయ్" గ్రామంలో బహిరంగసభ జరిపేందుకు గఫార్‌ఖాన్ పూనుకున్నాడు అక్కడ హింస ప్రజ్వరిల్లడానికి అవకాశమున్నదని ఆయనకు తెలుసు. కనుక ప్రజలవద్దగల ఆయుధాలను తీసివేసుకున్నాడు తరువాత సభ ప్రారంభమైంది అంతలోనే సైనికదళ మొకటి అక్కడకు చేరింది ప్రజలు చెదిరిపోవాలని, లేకపోతే కాల్పులు జరుగుతాయని కమాండర్ బెదిరించాడు అయినా ప్రజలు కదల్లేదు

సభ ముగిసిన పిమ్మట గఫార్‌ఖాన్‌తోపాటు అబ్దుల్ అక్బర్‌ఖాన్, మియా అహ్మద్ షా, సర్‌ఫరాజ్‌ఖాన్, షానవాజ్ ఖాన్‌లను అరెస్టు చేశారు ప్రజలు శాంతంగా వుండాలని రెచ్చిపోవద్దని గఫార్‌ఖాన్ విజ్ఞప్తి చేశాడు ఆ విజ్ఞప్తిని ఉత్మన్‌జాయ్ గ్రామ ప్రజలు మన్నించారు. కాని, నాయకులను మార్డాన్ జైలుకు తీసుకుపోతున్న పోలీసువ్యాన్‌లను "చార్‌సదా" గ్రామ ప్రజలు అడ్డగించి, అవి కదలకుండా రోడ్డుమీద అడ్డంగా పడుకున్నారు అలా అవరోధం కలిగించకూడదని గఫార్‌ఖాన్ చేసిన విజ్ఞప్తిని మన్నించి పోలీసువ్యానులకు దారిచ్చారు

వ్యానులు వెళ్లిపోయాయి మార్డాన్ మేజిస్ట్రేటు సరిహద్దు గాంధీకి (ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖానుకు), ఇతర నాయకులకు మూడేళ్ల కఠిన శిక్ష విధించాడు అక్కడికీ మిలిటరీ ఆఫీసర్ల కక్ష తీరక, చార్‌సదా గ్రామ ప్రజలమీద విరుచుకుపడ్డారు ఆ వార్త తెలియగానే చుట్టుప్రక్కల గల గ్రామాల నుండి వేలాది ప్రజలు చార్‌సదాకు వచ్చి, జైలును చుట్టుముట్టారు కాల్పులు జరిగాయి అనేకులు చనిపోయారు

23వ తేదీ ఉదయానికల్లా పెషావర్‌లోని ప్రముఖ కాంగ్రెస్ నాయకులను, అనేకమంది రెడ్ షర్ట్ వలంటీర్లను పోలీసులు అరెస్టు చేశారు ఆ వార్త తెలియగానే ప్రజలు తండోపతండాలుగా చేరి వీడ్కోలు చెప్పారు నాయకులను తీసుకుపోతున్న పోలీసువ్యాను టైరు పగిలిపోయింది కాగా కాంగ్రెస్ నాయకులు తమంతట తామే కాలినడకన కాబూల్ గేటు పోలీసుస్టేషనుకు వెళుతుండగా వేలాది ప్రజలు వారి వెంట నడవసాగారు అంతలో మూడు సైనిక శకటాలు వెనుకవైపునుండి వచ్చి ప్రజల మధ్యగా

దూసుకుపోయాయి ఆ శకటాల క్రింద పడి అనేకమంది చనిపోయారు చాలామందికి గాయాలు తగిలాయి అలా ప్రజలను చొప్పకట్టల్లా తొక్కుకుంటూపోతున్న సాయుధ శకటాలలో ఒకదానికి నిప్పు అంటుకున్నది మోటార్‌సైకిల్‌పైనున్న ఒక ఇంగ్లీష్ అధికారి క్రింద పడిపోగా, మరొక సైనిక శకటం అతనిమీదుగా వెళ్ళిపోయింది

గాయపడినవారిని, చనిపోయినవారి శవాలను తీసుకుపోయేందుకు ప్రజలు ప్రయత్నించినపుడు పోలీసు కాల్పులు ప్రారంభమయ్యాయి అప్పుడు మరికొందరు మరణించారు అయినా ప్రజలు వెనుకడుగు వేయలేదు మొత్తంమీద మూడుసార్లు కాల్పులు జరిగాయి మూడు వందలమంది మరణించారు చివరకు గాయపడినవారిని ప్రజలు తీసుకుపోయి డాక్టర్ ఖాన్ సాహెబ్ హాస్పిటల్లో చేర్చగలిగారు అరవై శవాలను ఖిలాఫత్ ఆఫీసుకు, తక్కిన శవాలను ఇతర తావులకు చేర్చగలిగారు

తర్వాత బ్రిటిష్ సైనికులు పెషావరును నరకంగా మార్చారు పెషావర్ మిలిటరీ డైరీలో పనిచేస్తున్న గంగాసింగ్ తన భార్యను, పిల్లలను వెంటబెట్టుకొని కాబూల్ గేటుగుండా పోతున్నప్పుడొక బ్రిటిష్ సైనికుడు నిర్హేతుకంగా వారిమీద తుపాకి పేల్చాడు పసిబిడ్డలిద్దరు చనిపోయారు ఆయన భార్యకు తీవ్రమైన గాయాలు తగిలాయి ఆ ఘోరకృత్యాన్ని విన్న ప్రజలనేకులక్కడకు చేరుకున్నారు డిప్యూటీ పోలీసు కమిషనర్ అనుమతి తీసుకొని పసిబిడ్డల శవాలను మోసుకుంటూ శ్మశానానికి బయలుదేరారు అలా వెళుతున్నవారిమీద బ్రిటిష్ సైనికులు తిరిగి తుపాకులు కాల్చారు గుండ్ల దెబ్బలు తగిలి శవ వాహకులు పడిపోతే, వెంటనే మరొక జట్టువారాశవాలను మోసేవారు అలా 17 జట్లు తుపాకి దెబ్బలు తగిలి నేలకొరిగాయి అయినా ప్రజలు ఊరేగింపుగా ముందుకు సాగారు శ్మశానానికి వెళ్ళి పసిబిడ్డల శవాలను ఖననం చేశారు కొంత హెచ్చు తగ్గులతో ఇలాంటి దారుణ కృత్యాలు మర్దాన్, దేరా ఇస్మాయిల్ ఖాన్, బన్నూ జిల్లాలలో చాలా జరిగాయి

## వేలిముద్రల ప్రహసనం

బ్రిటిష్ సైనికులు "ఉత్మన్‌జాయ్" గ్రామస్థుల నందరినీ బలవంతంగా ఊరి బయటకు తీసుకువచ్చి "మేము ఖుదైఖిద్మత్ గార్లమే"నని బొటనవేలి ముద్రలు వేయమన్నారు ప్రజలు నిరాకరించారు చివరకు ఒక వ్యక్తి భయపడి వేలిముద్ర వేశాడు నిజానికి అతను ఖుదైఖిద్మత్‌గార్‌కాదు అయినా భయంవల్ల ఆ పని చేశాడు కాని ఇంటికి వెళ్ళగానే ఆయన భార్య రోకలిబండ పుచ్చుకుని వెంటబడింది "వెధవ పని చేశావు" అని తిట్టిపోసింది

రెడ్‌షర్టును తీసివేసేందుకు నిరాకరించిన ఫైజ్ మహమ్మద్‌ను స్పృహ తప్పిపోయేవరకూ కొట్టి, బ్రిటిష్ సోల్జర్సు బూట్లకాళ్లతో తన్నారు అలాగే ప్రతి రెడ్‌షర్టు వలంటీరును చితకబాదారు కొందరిని బాయ్‌నెట్లతో పొడిచారు కొందరిని ఒక డాబామీదికి తీసుకుపోయి కంకరరోడ్డుమీదికి పడద్రోశారు మహమ్మద్ నక్విబ్‌ఖాన్‌ను చితకబాది, ఆయన షర్టును చించివేసి, లాగునుకూడా చించుతున్న సమయంలో ఆయన తప్పించుకొని యింటికి పారిపోయాడు ఇంట్లోవున్న రివాల్వర్‌ను తీసుకొని బ్రిటిష్ సోల్జర్లపైన కాల్చడానికి వస్తుండగా, రెడ్‌షర్టు దళ కాప్టెన్ అడ్డుపడి, "చచ్చేవరకూ అహింసను పాటిస్తానని ప్రతిజ్ఞ చేశావు కదా, యింతలోనే నీ ఓర్పు నశించిందా?" అని హెచ్చరించడం వల్ల రివాల్వరును పారేసి నక్విబ్‌ఖాన్ అరెస్టయ్యాడు

ఇంకెవరైనా ఎర్ర చొక్కాలవాళ్ళున్నారా? అని డిప్యూటీ పోలీస్ కమిషనర్ హూంకరించాడు అది విన్న మహమ్మద్ అబ్బాస్‌ఖాన్ తన ఇంటికి పరుగెత్తుకుపోయి ఎర్రరంగు కలిపిన నీళ్లలో నాలుగు చొక్కాలు ముంచి ఒకటి తను తగిలించుకున్నాడు తక్కిన మూడు చొక్కాలను తన నౌకర్లకిచ్చాడు నీళ్లు కారుతున్న ఎర్ర చొక్కాతో కమిషనర్ దగ్గరకొచ్చి "వున్నాం, ఎర్ర చొక్కాలవాళ్లమున్నాం" అంటూ నినాదాలు చేశాడు అసలు అతను రెడ్‌షర్టు వలంటీరు కాదు అయినా ఆ సమయంలో అతని దేశభక్తి పెల్లుబికింది ఇదీ ఆనాడు పరాన్ ప్రాంతంలోనున్న రాజకీయ వాతావరణం

అయినా గాంధీజీ 1930 మే 1న ఒక ప్రకటన చేస్తూ, పెషావర్ ప్రజలు అసహనంతో వున్నారని, సాయుధ శకటాలను తగులబెట్టడం, అధికారులను చంపడం పనికిరాని పనులని, బాధలు సహించడంలోనే ప్రజల మార్గం కలదని హెచ్చరించాడు కాని ప్రభుత్వ ప్రకటనలు పచ్చి అబద్ధమని విఠల్‌భాయ్ పటేల్ నిరూపించాడు అహింసా సిద్ధాంతాన్ని ప్రజలు ఖచ్చితంగా పాటించారని వివరించాడు

ప్రభుత్వం నియమించిన సులేమాన్ కమిటీవారు సరిహద్దు రాష్ట్రంలో జరిగిన ఘటనలపైన 350 పేజీలుగల పెద్ద నివేదికను తయారుచేశారు అందులో బ్రిటిష్ సోల్జర్లు, ఆఫీసర్లు చేసిన దారుణ కృత్యాలకు సంబంధించిన చేదునిజాలు చాలా వున్నాయి కనుక ఆ నివేదికను ప్రభుత్వం పూడ్చిపెట్టింది అయినా "1930-31లో భారతదేశం" అనే అధికార ప్రచురణలో ఈ క్రింది విషయాలను అంగీకరించింది·

"1930 ఆగస్టులో విధించబడిన మార్షల్‌లా 1931 జనవరి వరకూ అమల్లో వుం౦ మేనుండి సెప్టెంబరు వరకూ రాయల్ విమానదళాల సహాయంతో సరిహద్దు జిల్లాలలో ప్రశాంతత నెలకొల్పబడింది ఉద్యమంలో వున్న ఊళ్ళను, పట్టణాలను చీకటిపడిన పిమ్మట సైనికులు, పోలీసులు చుట్టుముట్టేవారు సైనికులను విరివిగా ఉపయోగించడం జరిగింది

"సరిహద్దు తెగలవారు ప్రభుత్వానికిచ్చిన అల్టిమేటంలో 'బాద్‌షాఖాన్ (అబ్దుల్ గఫార్ ఖాన్)ను వదిలిపెట్టండి, మలాంగ్‌బాబాను (దిగంబర ఫకీరును అనగా గాంధీని) వదిలి పెట్టండి ఖుదైఖిద్మత్‌గార్లను విడిచిపెట్టండి ఫక్తూన్లపైన దౌర్జన్యచర్యలను, నిర్బంధకాండను విరమించండి, లేకపోతే మీపైన మేము యుద్ధం చేస్తాం, అని బెదిరించడం జరిగింది

"ఫక్తూన్ ప్రజలు 'ఇంక్విలాబ్ జిందాబాద్, మహాత్మాగాంధీకి జై' అని నినాదాలు చేస్తారు కాగా ఇంక్విలాబ్‌కూడా ఒక వ్యక్తేననుకొని, ఆయననుకూడా విడుదల చేయాలని కొందరు కోరారు

"1931 జనవరిలో వాయవ్య రాష్ట్రంలో సాయుధ పోరాటం ప్రారంభమైంది సరిహద్దు జాతులవారైన మోమందులు, అఫ్రిదీలుకూడా గెరిల్లా యుద్ధాలు సాగించారు" అని అధికార ప్రకటనలో ప్రభుత్వం వివరించింది కాబట్టి సరిహద్దు రాష్ట్రంలో ప్రభుత్వమెంత దారుణ మారణకాండకు పాల్పడిందో ఊహించుకోవచ్చు

గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగిన పిమ్మట రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేశారు కాని సోదర ప్రజలమీద తుపాకులు పేల్చేందుకు నిరాకరించిన గార్వాల్ సైనికులను విడుదల చేయలేదు అసలు వారి ప్రస్తావనే ఒడంబడికలో లేదు అలా ఎందుకు జరిగిందని ఒక ఫ్రెంచి పత్రిక విలేకరి 1932 ఫిబ్రవరి 20న ప్రశ్నించినపుడు

గాంధీజీ ఇలా సమాధానమిచ్చాడు

"కాల్పులు జరపవలసిందిగా అధికారులు జారీచేసిన ఉత్తరువును ఒక సైనికుడు ఉల్లంఘించడమంటే తాను చేసిన ప్రమాణాన్ని అతను త్రోసిపుచ్చినట్లే, అందువల్ల అతను ప్రభుత్వ ధిక్కార నేరానికి పాల్పడిన వాడవుతాడు "

## షోలాపూర్‌లో వీధిపోరాటాలు

1930 మేనెల 5న గాంధీజీని ప్రభుత్వం అరెస్టు చేసింది అయన అరెస్టుకు నిరసనగా దేశమంతటా హర్తాళులు, సమ్మెలు జరిగాయి బాంబేలో బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది 50వేల మంది కార్మికులు మిల్లుల నుండి బయటకు వచ్చారు దాదాపు 80 మిల్లులు మూసివేయబడ్డాయి రైల్వే కార్మికులుకూడా హర్తాళ్‌లో పాల్గొన్నారు పూనాలో కూడా హర్తాళ్ జయప్రదమైంది

ఆ రోజున షోలాపూర్ ప్రజలను పోలీసులు రెచ్చగొట్టారు విచక్షణారహితంగా లాఠీచార్జీ చేశారు అందువల్ల ప్రజలు రోడ్లకడ్డంగా బారికేడ్లు నిర్మించి, పోలీసు బలగాలను ఎదిరించారు అదొక పెద్ద తిరుగుబాటుగా పరిణమించింది 50వేల మంది కార్మికులు వీధుల్లో కొచ్చి, సారా దుకాణాలను ధ్వంసం చేశారు పోలీస్‌స్టేషన్లమీద, కోర్టులమీద దాడిచేశారు

స్థానిక కాంగ్రెస్ కమిటీ యుద్ధసమితిని నెలకొల్పింది బ్రిటిష్‌వాళ్లు తలదాచుకున్న భవనాలను తిరుగుబాటుదార్లు తగులబెట్టారు తరువాత రైల్వేస్టేషనును ముట్టడించారు వీధుల్లో సాయుధ పోరాటాలు జరిగాయి వారం రోజులపాటు పట్టణం ప్రజల స్వాధీనంలో వుంది

తిరుగుబాటును అణచడానికి మే 16న రెండువేలమంది బ్రిటిష్ సైనికులు షోలాపూర్‌లో ప్రవేశించారు ఎదురుతిరిగిన నాయకులలో కొందరిని ఉరిదీశారు మరికొందరిని జైళ్లలో కుక్కారు

కరాచీలో ఓడరేవు కార్మికులు, మద్రాసు, కలకత్తాలలో మిల్లు కార్మికులుకూడా గాంధీజీ అరెస్టుకు నిరసనగా సమ్మె చేశారు ఉప్పు సత్యాగ్రహంలో కమ్యూనిస్టులు పాల్గొనకపోయినా, కార్మిక సమ్మెలు ప్రభుత్వాన్నొక కుదుపు కుదిపాయి

## ఉప్పు కొటారుపై దండయాత్ర

గాంధీజీని అరెస్టు చేసిన పిమ్మట అబ్బాస్ తయాబ్జీ ఉద్యమానికి నాయకత్వం వహించాడు ప్రభుత్వం ఆయననుకూడా అరెస్టు చేసింది కనుక సరోజినీదేవి నాయకత్వాన మే నెల 21వ తేదీన దర్శన ఉప్పు కొటారుపైన సత్యాగ్రహులు దాడిచేశారు నిస్సహాయులు, నిరాయుధులు, అహింసావ్రత దీక్షాపరులునైన ఆ సత్యాగ్రహులమీద పోలీసులు సాగించిన కిరాతక కృత్యాలను "వెబ్‌మిల్లర్" అనే అమెరికన్ పత్రికా రచయిత ఇలా వివరించాడు

"నెమ్మదిగా, మౌనంగా అరమైలు పొడవున సత్యాగ్రహుల దండియాత్ర సాగింది ఉప్పు గుంటలవద్ద 400మంది సూరత్ పోలీసులు కాపలా వున్నారు ఉక్కు కడియం బిగించిన ఐదు అడుగుల పొడవుగల లాఠీలు వారి చేతుల్లో వున్నాయి వారిమీద 6గురు బ్రిటిష్ అధికారులు తమ అధికారాన్ని చలాయిస్తున్నారు ముళ్లకంచె ఆవరణలో 25గురు సైనికులు రైఫిల్సుతో సిద్దంగా వున్నారు.

"వారిని చూసి భయపడకుండా ముందుకు వస్తున్న సత్యాగ్రహులమీద పోలీసులు విరుచుకుపడ్డారు లారీలతో సత్యాగ్రహుల తలలను పగలగొట్టారు జుగుప్సాకరమైన ఆ లారీ దెబ్బల మోతలను నేను విన్నాను అయినా సత్యాగ్రహులు తమ తలలకు చేతులను అడ్డం పెట్టుకోలేదు మొదటి దళం వారందరూ నేలకొరిగిన తర్వాత రెండవ దళంవారు పోలీసుల ముందుకొచ్చారు మొదటి దళంలో గాయాలు తగిలిన 18 మందిని మోసుకుపోవడం నేను చూచాను మరొక 42 మంది నెత్తురు కారుతుండగా నేలమీదపడి వుండడం కూడా చూశాను ఆ ప్రాంతమంతా పడిపోయిన వలంటీర్ల దేహాలతో నిండిపోయింది 320 మంది తీవ్రంగా గాయపడ్డారు ఇద్దరు చనిపోయారు నాలో వర్ణించలేని నిస్సహాయత, ఆగ్రహం, ఏహ్యాభావం పెరిగిపోయింది.

"అక్కడ గుమిగూడిన ప్రజలు పోలీసుల మీద పడడానికి సిద్ధమయ్యారు కాని నాయకులు వారిని వారించి శాంతింపజేశారు" అని వెబ్‌మిల్లర్ ప్రకటించాడు. ప్రభుత్వ ఘోరకృత్యాలు దర్సనలోనేగాక, పడాలా ఉప్పు కేంద్రంవద్దకూడా జరిగాయి పడాలాలో 4వేల మంది సత్యాగ్రహులు అరెస్టయ్యారు 240 మంది గాయపడ్డారు

బెంగాల్లో లారీఛార్జీలు నిత్యకృత్యాలయ్యాయి కలకత్తాలో ఒక ఊరేగింపును చెదరగొడుతున్న పోలీసులను అవహేళన జేస్తూ విశ్వవిద్యాలయ విద్యార్థులు కేకలు వేశారు అది సహించలేని ఇంగ్లీషు అధికారి, పోలీసు బలగంతో యూనివర్శిటీలో ప్రవేశించి విద్యార్థులనందరినీ రక్తం కారేటట్లు కొట్టించాడు

కాంటాయి అనేచోట సమావేశమైన ప్రజలలో ఐదుగురిని పోలీసులు అరెస్టుచేసి, దగ్గరలోనున్న చెరువులోకి తోసివేశారు

మిద్నపూర్ జిల్లాలో నిర్బంధ విధానం విలయతాండవం జేసింది. వలంటీర్లకు అన్నం పెట్టిన వాళ్లను, మంచినీళ్లిచ్చిన వాళ్లనుకూడా అరెస్టుచేశారు గూర్ఖా సైనికులు, ప్యూనిటివ్ పోలీసులు అక్కడ నానా బీభత్సం చేశారు స్త్రీల మానమర్యాదలను మంటగలిపారు

కేర్సాయిలో ప్రజలమీద తుపాకీ కాల్పులు జరిగాయి 12 మంది మరణించారు చేచనవద్ద జరిగిన పోలీసు కాల్పులవల్ల ఆరుగురు మరణించారు కలకత్తాలో జూన్ 22న దేశబంధు చిత్తరంజనదాస్ జయంతి ఉత్సవాన్ని జరుపుకొంటున్న ప్రజలమీద ఆశ్వికదళ సిపాయీలు విరుచుకుపడ్డారు క్షతగ్రాతులు గుర్రపు డెక్కల క్రిందబడి నలిగిపోకుండా స్త్రీలు ముందుకు వురికి రక్షించారు

బారిసాల్ పట్టణంలో జరిగిన లారీ ఛార్జీలో ఐదువందలమంది గాయపడ్డారు మరొకచోట సత్యాగ్రహుల ఇళ్లను, సానుభూతిపరుల ఇళ్లను పోలీసులు తగులబెట్టారు

గోపీనాధపురంలో పోలీసులు ఒక మహమ్మదీయ బాలుని కొట్టగా, కోపోద్రిక్తులైన ప్రజలు పోలీసులను పట్టుకొని ఒక పాఠశాలలో నిర్బంధించి, దానికి నిప్పుపెట్టారు వెంటనే కాంగ్రెస్ వలంటీర్లు పాఠశాల తాళం బద్దలుకొట్టి పోలీసులను రక్షించారు

తనకు విధించిన ఏడాది శిక్షను అనుభవించిన సుభాన్‌చంద్రబోస్ 1930 డిసెంబరులో విడుదలయ్యాడు డిసెంబర్ 31న సంపూర్ణ స్వాతంత్ర్య వార్షికోత్సవంలో పాల్గొన్నాడు అందుకాయనను పోలీసులు తీవ్రంగా కొట్టారు. అన్ని రాష్ట్రాలలోకంటే బెంగాల్‌లోనే ఎక్కువమంది శిక్షలనుభవించారు

## రైతుల పోరాటాలు

ఆంధ్రలో రీ సెటిల్‌మెంటు వ్యతిరేక ఉద్యమం కొనసాగింది పెంచిన శిస్తులను చెల్లించేందుకు రైతులు నిరాకరించారు రెవిన్యూ అధికార్లు జప్తుచేసినవాటిని వేలంలో కొనేందుకెవరూ సిద్ధపడలేదు కాబట్టి అధికార్లు వెనక్కు తగ్గారు

కర్ణాటకలో పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభింపబడింది ఒక్క కెనరాజిల్లాలోనే నూరుగురు స్త్రీలు, 700 మంది పురుషులు అరెస్టయ్యారు అయినా పేదరైతుల భూములను రెవిన్యూ అధికార్లు వేలం వేసినప్పుడు, వాటిని ధనికులు కొన్నందువల్ల ఉద్యమం నీళ్లుగారిపోయింది

సూరత్ పోలీసుల దురాగతాలను వివరిస్తూ 1931 జనవరి 12న మాంచెస్టర్ గార్డియన్ పత్రికలో, బ్రెయిల్స్‌ఫర్డ్ ఒక సుదీర్ఘవ్యాసం రాశాడు "అనేక గ్రామాలలో ప్రజలను పోలీసులు విచక్షణారహితంగా కొట్టారు గాంధీటోపీ పెట్టుకున్నవాళ్లను, ఆ టోపీ తీసివేసేదాకా కొట్టారు దొంగజాతులవాళ్లను రైతులపైకి ఉసికొల్పారు బోర్సాద్‌లో 30 చదరపు అడుగుల బోనులో 18 మంది రాజకీయ ఖైదీలను కుక్కారు అఫ్వా అనే గ్రామంలో పొలాలలో నిద్రిస్తున్న రైతులను పట్టుకుకొట్టారు 1931 జనవరిలో చెల్లించవలసిన శిస్తులను 1930 అక్టోబరులోనే వసూలు చేసేందుకు అధికారులు పూనుకున్నందున రైతుల పరిస్థితి అధ్వాన్నమైంది" అని బ్రెయిల్స్‌ఫర్డ్ వివరించాడు

తూర్పుబెంగాల్లోని కిషోర్‌గంజ్ ప్రాంతంలోని రైతులు మక్తాలు చెల్లించడం మానివేశారు జనపనార ధరలు పడిపోవడంవల్ల వారాపనిచేశారు వారికి అండగా జూట్ కార్మికులు నిలబడ్డారు కనుక భూస్వాములు ప్రభుత్వానికి మొరబెట్టుకున్నారు కాగా సైన్యాలు వెళ్లి కిషోర్‌గంజ్ ప్రాంతంలో తిష్టవేసి భూస్వాములకు మద్దతునిచ్చాయి

బేరార్‌లో పత్తిపండించే రైతులు, రైతు సంఘాన్ని నిర్మించుకొని పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించారు వ్యవసాయ కార్మికులుకూడా రైతు సంఘంలో చేరారు హిందువులు, ముస్లిములు ఏకమయ్యారు పన్నులు వసూలుచేసే ఉద్యోగులను రైతు సంఘం వలంటీర్లు జయప్రదంగా ప్రతిఘటించారు డప్పులు వాయించుకుంటూ ప్రతి గ్రామానికి వెళ్లి ఉద్యమాన్ని బలోపేతం చేశారు కాని విజయగర్వంతో ఉద్యమకారులు భూస్వాముల పంటలను, వడ్డీ వ్యాపారుల ఆస్తులను స్వాధీనం చేసుకొని, వారి ఇళ్లను తగులబెట్టి, ప్రభుత్వ సైనికచర్యలకు గురియై దెబ్బతిన్నారు

కేరళలో కల్లు పాటలు 75 శాతం వరకూ తగ్గిపోయాయి కల్లు పాటలను నిరోధించినందుకు తమిళనాడులో పోలీసు కాల్పులు జరిగాయి కల్లు అంగళ్లవద్ద పికెటింగ్ చేసినందుకు ఆంధ్రలో అనేకమందిని పోలీసులు కొట్టి అరెస్టు చేశారు

బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో బ్రిటిష్ వస్త్ర బహిష్కరణోద్యమం విజయాన్ని సాధించింది మధ్యప్రదేశ్‌లో అటవీ సత్యాగ్రహం కొనసాగింది మొత్తంమీద గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగేనాటికి 60 వేల మందికి జైలుశిక్షలు విధించినట్లు ప్రభుత్వ లెక్కలు తెలుపుతున్నాయి 90 వేల మందికి జైలు శిక్షలు పడినట్లుగా కాంగ్రెస్ చరిత్రలో పట్టాభిగారు వ్రాశారు

## చిటగాంగ్ వీరుల తిరుగుబాటు

1930 ఏప్రియల్ 18న చిటగాంగ్ వీరుల తిరుగుబాటు ప్రారంభమైంది ఆ

తిరుగుబాటును కొందరు చరిత్రకారులు "దాడి"గా వర్ణిస్తే, మరికొందరు టెర్రరిస్టుల దౌర్జన్య చర్యగా వర్ణించారు కాంగ్రెస్ చరిత్రలో పట్టాభిగారిలా వ్రాశారు

"సత్యాగ్రహ ఉద్యమ ప్రారంభదశలో చిటగాంగ్ సైనిక శిబిరముపైన నొక దండయాత్ర జరిగెను కొంతమంది భారతీయ యువకులు సైనిక దుస్తులలోపోయి, సైనికులలో కొందరిని కాల్చివేసిరి ఇందుకు భయంకరములైన ప్రతిక్రియలు చేయబడెను "

కాని, సర్ శామ్యూల్ హెూర్ దానిని "చిటగాంగ్ తిరుగుబాటు"గా పేర్కొన్న విషయం గమనార్హం హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీకి చెందిన చిటగాంగ్ బ్రిగేడ్ వీరులు ఆ తిరుగుబాటును ప్రారంభించారు

ఏప్రియల్ 18న సరిగ్గా రాత్రి 10 గంటల సమయంలో కొందరు విప్లవకారులు సైనికోద్యోగుల వేషంలో చిటగాంగ్ కొండపైనున్న ఆయుధాగారం వద్దకు వెళ్లారు వారెవరో పెద్ద ఆఫీసర్లనుకొని అక్కడనున్న సెంట్రీ సలాం పెట్టాడు అయినా అతన్ని కాల్చివేశారు తరువాత తూటాలులేని తుపాకులు పేల్చారు ఆ మోతలువిని, శిబిరంలోనున్న 500 మంది పోలీసులు కాళ్ళకు బుద్ధి చెప్పారు

వెంటనే మరికొందరు విప్లవకారులు అక్కడ కొచ్చారు ఆయుధాగారం తలుపులు బద్దలుకొట్టి 500 రైఫిల్స్, డజన్లకొలదీ రివాల్వర్లు తీసుకున్నారు మరొక దళం ఆగ్జిలరీ ఫోర్సు ఆయుధాగారం మీద దాడి చేసింది ఆ దాడిలో సార్జెంట్ మేజర్ ఫారెల్ చనిపోయాడు 303 రైఫిల్స్‌తోపాటు కొన్ని లూయీగన్లూ అనేక రివాల్వర్లూ విప్లవ వీరుల వశమయ్యాయి అందరూ కలసి పోలీసు ఆయుధాగారం వద్దకు చేరారు. టెలిఫోను ఆఫీసును తగలబెట్టి నాశనం చేసిన దళం కూడా వీరితో చేరింది.

కొందరు విప్లవకారులు చిటగాంగ్‌కు 60 మైళ్ళ దూరంలోవున్న ఫెనీ రైల్వేస్టేషన్‌వద్దను, 80 మైళ్ల దూరంలో వున్న ధూమ్ రైల్వేస్టేషన్‌వద్దనూ రైల్వే లైన్లను విచ్ఛిన్నం చేశారు

తిరుగుబాటు వార్త తెలియగానే జిల్లా మేజిస్ట్రేట్ తప్పించుకొని యూరోపి యన్లందరినీ బంగాళాఖాతంలోని నౌకలలోకి చేర్చాడు. నౌకల్లోనున్న వైర్లెస్‌ద్వారా కలకత్తాలోని అధికార్లతో సంబంధం పెట్టుకొని సైనిక సహాయమర్థించాడు

ఈలోగా రైల్వేలైన్లను విచ్ఛిన్నం చేసిన దళాలు మినహా తక్కిన దళాలు పోలీసు ఆయుధాగారం వద్దకు చేరాయి మాస్టర్ సూర్యసేన్ (స్కూలు టీచరు)కూడా అక్కడకొచ్చాడు వివిధ దళాల సభ్యులు సూర్యసేన్‌కు సైనిక వందనం చేశారు తమ నాయకత్వాన తాత్కాలిక స్వతంత్ర ప్రభుత్వమేర్పడిందని సలార్యసేన్ ప్రకటించాడు రానున్న బ్రిటిష్‌దాడి నెదుర్కొనేందుకు తమకు అండగా నిలబడవలసిందిగా ప్రజలకు ఆయన విజ్ఞప్తి చేశాడు

చిటగాంగ్ రేవులోనున్న మెషిన్‌గన్స్ పుచ్చుకొని కొందరు బ్రిటిష్ ఆఫీసర్లు మున్సిపల్ వాటర్ టాంకుపైకి ఎక్కి విప్లవవీరులమీద కాల్పులు ప్రారంభించారు వెంటనే ఎదురు కాల్పులు సాగాయి మెషిన్ గన్స్ మూగపోయాయి

ఆయుధాగారంనుండి సాధ్యమైనన్ని ఆయుధాలను, మందుగుండును తీసుకొని విప్లవదళాలు పట్టణ శివార్లలోని కొండ ప్రాంతాలకు వెళ్లాయి ఏప్రియల్ 22న వేలాది ప్రభుత్వ సైన్యాలు అక్కడికి చేరాయి విప్లవవీరులు జలాలాబాద్ కొండలపైన మాటువేశారు కొండలపైకి ఎక్కేందుకు ప్రయత్నించిన ప్రభుత్వ సైన్యాలు విప్లవవీరుల ప్రతిఘటనవల్ల తీవ్ర నష్టాలతో మూడుసార్లు వెనక్కు తగ్గాయి ఆ పోరాటంలో 83 మంది ప్రభుత్వ

సైనికులు, 12 మంది విప్లవకారులు మరణించారు

తమవద్దనున్న ఆయుధాలతో, అధునాతన ఆయుధాలు గల ప్రభుత్వ సైనికుల నెదిరించి పోరాడడం ఆత్మహత్యా సదృశమని గ్రహించిన విప్లవ యోధులు గెరిల్లా పద్ధతుల నవలంబించేందుకు నిశ్చయించారు చిన్న చిన్న దళాలుగా విడిపోయి, తమకు అనుకూలంగా వుండే పల్లె ప్రాంతాలలో వుంటూ, సమయం దొరికినప్పుడల్లా పోలీసు స్టేషన్లమీద, ఆఫీసులమీద దాడి చేయాలని నిర్ణయించారు

ఒక దళంవారు చల్లగా కలకత్తా వెళ్లే రైలులో ఎక్కారు కాని సి ఐ డిలు వారిని గుర్తించారు సాయుధ పోలీసులు చుట్టుముట్టారు అయినా విప్లవ యోధులు భయపడలేదు పోలీసులపైకి లంఘించి, వారి వలయాన్ని ఛేదించుకొని చీకటిలోకి పారిపోయారు

ఈ యోధులకు ఆశ్రయమిచ్చే గ్రామాలు 25 కంటే ఎక్కువ లేవు ఆ గ్రామాలలో స్త్రీలు, ముఖ్యంగా ముస్లిమ్ స్త్రీలు వారిని కంటికి రెప్పలా కాపాడారు కాగా నలుగురైదుగురు కలిసి మారువేషాలతో చిటగాంగ్ పట్టణంలో ప్రవేశించి బ్రిటిష్ ఆఫీసర్లపైన, సైనికులపైన ఆకస్మాత్తుగా దాడి చేసేవారు అలాంటి సందర్భాలలో కొందరు పట్టుబడిపోయేవారు ఎదురుకాల్పులలో కొందరు మరణించేవారు కొందరు తప్పించుకుపోయేవారు

## విద్యార్థుల ఆత్మాహుతి

చిటగాంగ్ పట్టణంలో పరిస్థితులెలా వున్నదీ తెలుసుకురావడానికి అమరేంద్ర నంది అనే 16 ఏళ్ళ కుర్రవాడిని సూర్యసేన్ పంపించాడు అమరేంద్ర చల్లగా సదర్‌ఘాట్ ప్రాంతంలో ప్రవేశించాడు కాని పోలీసుల కంటబడ్డాడు పట్టుబడడం ఇష్టంలేక రివాల్వరుతో కాల్చుకుని చనిపోయాడు

స్థానిక కాలేజీలో మొదటి సంవత్సరం కోర్సు చదువుతున్న ఆరుగురు విద్యార్థులు యూరోపియన్ల నివాస ప్రాంతంమీద దాడికి పూనుకున్నారు వారిలో నలుగురు ఎదురుకాల్పుల్లో మరణించగా, ఇద్దరు పట్టుబడిపోయారు

బెంగాల్ పోలీస్ ఉన్నతాధికారి 'క్రెయిగ్'ను ఇద్దరు కాలేజీ విద్యార్థులు వెంటాడారు చాంద్‌పూర్ స్టేషనులో అతనిమీద రివాల్వరు పేల్చారు క్రెయిగ్ తప్పించుకున్నాడు కాని పోలీస్ ఇన్‌స్పెక్టర్ నేలకొరిగాడు రివాల్వర్ పేల్చిన రామకృష్ణ విశ్వాస్‌ను బంధించి ఉరితీశారు

అసనుల్లాఖాన్ అనే పోలీసు ఆఫీసర్ మహాక్రూరుడు. ఆగస్టు 31న పుట్‌బాల్ గ్రౌండ్‌లో లక్షమంది ప్రేక్షకుల ఎదుట అతడిని 13 ఏళ్ళ బాలుడు కాల్చి చంపాడు ఆ బాలునకు యావజ్జీవ శిక్ష విధించారు

వినయ్‌బోస్ అనే విద్యార్థి మెడికల్ కాలేజీలో "లోమన్" అనే యూరోపియన్‌ను చంపి తప్పించుకుపోయాడు తిరిగి డిసెంబర్ 8న బాదల్, దినేష్ అనేవారితో కలిసి కలకత్తాలోని రైటర్సు బిల్డింగు(ప్రభుత్వ కార్యాలయము)కు వెళ్లాడు ముగ్గురూ యూరోపియన్ దుస్తుల్లో వున్నారు ముందుగా జైళ్ల ఇన్‌స్పెక్టర్ జనరల్ గదికి వెళ్లి "దేవుని ప్రార్థించుకో జనరల్! నీ అంతిమ ఘడియ వచ్చింది" అని హెచ్చరించారు అతడిని చంపాక హోమ్ సెక్రటరీమీది కురికారు. తిరిగి వరండాలో కొచ్చేటప్పుడు పోలీసులు, సైనికులు ఎదురయ్యారు ఇరుపక్షాల మధ్య కాల్పులు జరిగాయి. రివాల్వర్లలో తూటాలు అయిపోతున్నపుడు బాదల్ పొటాసియం సైనేడ్ మింగి మరణించాడు ఆఖరు తూటాలతో

తమకు తామే కాల్చుకుని వినయ్‌బోస్, దినేష్‌లు నేలకొరిగారు

## వీరబాలికలు శాంతి-సునీతి

కొమిల్లా జిల్లా మేజిస్ట్రేట్ కలియుగ నరకాసురుడుగా పేరు పొందాడు కాగా ఆయనమీద పగ తీర్చుకునేందుకు 15 ఏళ్ళ ప్రాయంగల కుమారి శాంతి, కుమారి సునీతి కలిసి వ్యూహం పన్నారు 1931 డిసెంబర్‌లో అప్లికేషన్‌లు అందజేయాలనే సాకుతో జిల్లా మేజిస్ట్రేట్ బంగాళాలో ప్రవేశించారు వారి వోణీలలో భద్రంగా దాచిన పిస్టల్స్ వున్నాయి స్టీవెన్సు హాలులోకి రాగానే పిస్టల్సు పేలాయి ప్రజాకంటకుడు నేలకొరిగాడు వెంటనే పోలీసులు వారిని బంధించి చిత్రహింసల పాల్జేశారు న్యాయస్థానం వారికి జీవితఖైదు విధించింది.

సునీతి తండ్రి పిల్లలు గలవాడు. ఆయనకిచ్చే పెన్షనును ఆపివేశారు సాయం చేయబోయిన చుట్టాలను, స్నేహితులనుకూడా తెల్లదొరలు హింసించారు సునీతి సోదరుడు కూలిపనిచేసేందుకుకూడా సిద్ధపడ్డాడు కాని ఆయనతో పని చేయించుకునేందుకెవరూ యిష్టపడలేదు అందువల్ల ఆ యువకుడు కుమిలి కుమిలి, క్షయవ్యాధి బారిపడి మరణించాడు కుటుంబం సర్వనాశనమై పోయింది

తన 15వ ఏటనే కుమారి ఉజ్వలా మజుందార్ గెరిల్లా దళంలో చేరింది 1930 నుండి 35 వరకు అనేక పోరాటాలలో పాల్గొన్నది చివరకు 1935లో డార్జిలింగ్ రేస్‌కోర్సు మైదానంలో బెంగాల్ గవర్నర్‌పైన కాల్పులు జరిపినప్పుడు పట్టుబడిపోయింది. అనేక చిత్రహింసల పాల్జేసిన పిమ్మట ఆమెకు ద్వీపాంతరవాస శిక్ష విధించారు

## వీరనారి ప్రీతిలత

ప్రీతిలత ఒక గరల్స్ స్కూల్ హెడ్‌మిస్ట్రెస్ సూర్యసేన్, నిర్మలసేన్‌లతో మాట్లాడేందుకు ఆమె ధాల్‌ఘాట్ గ్రామం చేరింది 1932 జూన్ 13వ తేదీ సాయంత్రం హఠాత్తుగా సైనికులు ఆ గ్రామాన్ని చుట్టుముట్టి, సూర్యసేన్ వగైరాలున్న ఇంట్లోకి చొరబడేందుకు ప్రయత్నించారు విప్లవవీరులు ఎదురుకాల్పులు సాగించారు సైనికోద్యోగి నేలకొరిగాడు కాని నిర్మల్‌సేన్, అపూర్వసేన్ మరణించారు సూర్యసేన్, ప్రీతిలత తప్పించుకుపోయారు.

'పహార్‌తలి' అనేచోట బ్రిటిష్ సోల్జర్ల క్లబ్ వుండేది అక్కడినుండి ఆ సోల్జర్లు చుట్టుప్రక్కల గల గ్రామాల మీద దాడిచేసి స్త్రీలను, పిల్లలను సహితం హింసించేవాళ్ళు ఒక్కోసారి ఇళ్లనుకూడా తగలబెట్టేవాళ్లు అందుకు ప్రతీకారం చేసేందుకు ప్రీతిలత నాయకత్వాన 8 మంది యువకులు సాయుధులై, 1932 సెప్టెంబర్ 24 రాత్రి 9గంటలకు ఆ క్లబ్‌మీద మెరుపుదాడి చేశారు కాపలా సైనికులు తోక ముడిచారు క్లబ్‌లోనున్నవాళ్లలో కొందరు మరణించారు మరికొందరు సోల్జర్సు తేరుకుని ఎదురు కాల్పులు ప్రారంభించారు కాగా ప్రీతిలతతోపాటు ఆమె సహచరులుకూడా తిరుగుముఖం పట్టారు. కాని బ్రిటిష్ సోల్జర్లు విప్లవకారులను వెన్నంటి తరిమారు అలా చాలా దూరం వెళ్లిన పిమ్మట ప్రీతిలతకొక తుపాకి దెబ్బ తగిలింది వెంటనే ఆమె పొటాషియం సైనేడ్ మింగి ఆత్మార్పణం చేసింది ఆమె దుస్తులలోవున్న విజ్ఞప్తి పత్రమొకటి బ్రిటిష్ సోల్జర్సుకు దొరికింది అందులో యిలా వుంది·

"మాతృదేశ విముక్తికై భారత మహిళలు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా సాయుధ పోరాటం సాగించాలి ఎన్నాళ్లు బ్రతికినా మరణం తప్పదు బానిసలుగా నూరేండ్లు బ్రతకడంకంటే, స్వాతంత్ర్యం కొరకు వీరమరణం పొందడం మేలు "

## కుమారి వీణాదాస్ సాహసం

కుమారి వీణాదాస్ కలకత్తాలోని క్రిస్టియన్ కాలేజీలో చదివి, బి ఎ పరీక్షలో ఉత్తీర్ణురాలైంది 1932లో కలకత్తా యూనివర్శిటీలో జరిగిన కాన్వొకేషన్‌కు రాష్ట్ర గవర్నర్ స్టాన్లీ జాక్సన్ అధ్యక్షత వహించాడు తన డిగ్రీ తీసుకునేందుకు ముందుకు వచ్చిన వీణాదాస్ ఆయన మీద రివాల్వర్ పేల్చింది కాని తూటా గవర్నర్‌కు తగలకుండా ఆయన కూర్చున్న కుర్చీకి తగిలింది గవర్నర్ కిందపడ్డాడు ఆయనమీద కుర్చీ పడింది రివాల్వరునుండి పేలిన మరో రెండు తూటాలు కుర్చీకి, బల్లకు తగిలాయి గవర్నర్ బతికి బయటపడ్డాడు

వీణాదాస్ పట్టుబడిపోయింది అనేక చిత్రహింసలకు ఆమెను గురిచేశారు గెరిల్లాలకు సంబంధించిన సమాచారాన్ని ఆమెనుండి రాబట్టాలని శతథా ప్రయత్నించారు కాని విఫలులయ్యారు చివరకు ఆమెపైన హత్యానేరం మోపి కోర్టులో హాజరుపరిచారు విచారణ సమయంలో ఆమె ఇలా చెప్పింది

"చిరకాలం బానిసత్వంలో పడి కృశించి నశించడంకంటే మాతృదేశ విముక్తికొరకు పోరాడటం మంచిదని భావించాను కనుకనే గవర్నర్‌పైన కాల్చాను బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నికృష్టపాలనపై మాకుగల వ్యతిరేక భావాన్ని ఆ విధంగా ఎలుగెత్తి చాటాలనుకున్నాను అందుకొరకు నా ప్రాణాన్ని బలిపెట్టడానికి సైతం సిద్ధపడ్డాను

"ఒక బ్రిటిష్ గవర్నర్, మరొక భారతీయ బాలిక మరణించినంత మాత్రాన మిన్ను విరిగి మీదపడిపోదు ఎందువల్ల బెంగాల్ గవర్నర్ కాల్పులకు గురయ్యాడో ఇంగ్లండులోని ప్రజలు ఆలోచించగలరు ఎంత బలమైన స్వాతంత్ర్య కాంక్షతో పరప్రభుత్వ ప్రతినిధిపైన నేను కాల్పులు సాగించానో ప్రాణాలను సహితం బలిపెట్టడానికి సిద్ధపడ్డానో నా సోదర భారతీయులందరూ అర్థం చేసుకోగలరు పరప్రభుత్వాన్ని పతనంచేసి, స్వాతంత్ర్యాన్ని సాధించగలరు కాగా అటు ఆంగ్లేయులను, ఇటు నా సోదర భారతీయులను కూడా మేల్కొలిపేందుకే నేను గవర్నర్‌పై కాల్చాను "

ఏ కోర్కెతో భగత్‌సింగ్, భటుకేశ్వరదత్తులు కేంద్ర అసెంబ్లీ హాలులో బాంబులు వేశారో అలాంటి కోర్కెతోనే కుమారి వీణాదాస్ బెంగాల్ గవర్నర్‌పైన రివాల్వర్ పేల్చడం గమనించదగిన విషయం

## శ్రీమతి దుర్గాభాబీ

హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీలో శ్రీమతి దుర్గా ఓహ్రా, శ్రీమతి సుశీలా మోహన్ సభ్యులు ఆ ఆర్మీలో సభ్యులందరూ వీరిని దుర్గాభాబీ, సుశీలా దీదీ అని పిలిచేవారు

లాహెూర్‌లో సాండర్సును హత్య చేసిన పిమ్మట భగత్‌సింగ్ తప్పించుకుపోవడం అసాధ్యమైపోయింది ఆ సమయంలో దుర్గాభాబీ ఒక చక్కని ప్లాన్ చేసింది. ఓ పెద్ద ఆఫీసర్‌గారి భార్యలా డ్రెస్ చేసుకుంది భగత్‌సింగ్‌కూడా ఓ పెద్ద ఆఫీసరులా డ్రెస్

వేసుకున్నాడు ఇద్దరూ కలసి భార్యాభర్తలవలె నటిస్తూ స్టేషన్‌కు వెళ్లి రైలెక్కి తప్పించుకు పోయారు

భగత్‌సింగ్‌ను అరెస్టు చేసిన పిమ్మట ఆయననెలాగైనా తప్పించాలని దుర్గాభాబీ భర్త భగవతీచరణ్ ఓ్ౖహ్రా పట్టుబట్టాడు అందుకొరకు కొన్ని బాంబులు తయారుచేశాడు ఒకనాటి అర్ధరాత్రి సమయంలో రావీ నది ఒడ్డున వాటిని పరీక్షిస్తుండగా ఒక బాంబు ప్రేలి భగవతీచరణ్ మరణించాడు భర్త మరణంవల్ల దుర్గాభాబి బాగా నీరసించింది భగత్‌సింగ్‌ను జైలునుండి విడిపించలేకపోయింది కాని బాంబేలో అనేక అత్యాచారాలు చేసిన ఒక పెద్ద పోలీసు ఆఫీసరును తరుముకుంటూపోయి ఆయనమీద గుండ్లవర్షం కురిపించింది

## సూర్యసేన్ ప్రభృతుల అరెస్ట్

డబ్బుకు కక్కుర్తిపడిన తుచ్ఛుడు నేత్రాసేన్ సూర్యసేన్ ఆచూకీని సైనికాధికారులకు తెలిపాడు (కొన్నాళ్ల తరువాత నేత్రాసేన్‌ను విప్లవకారులు హతమార్చారు )

1932 ఫిబ్రవరి 16న గొయిరాలా గ్రామంలో సూర్యసేన్ మున్నగు విప్లవ కారులున్న ఇంటిని సైనికులు చుట్టుముట్టారు కుమారి కల్పనాదత్, తారకేశ్వర దస్తిదార్ మున్నగువారు తమవద్దగల చేతిబాంబులను జాగ్రత్తగా విసురుతూ తప్పించుకుపోయారు కాని సూర్యసేన్ పట్టుబడిపోయాడు.

తరువాత ఉద్యమానికి దస్తిదార్ నాయకత్వం వహించాడు గొహిరా అనే గ్రామంలో వుంటూ ఉద్యమాన్ని పర్యవేక్షించాడు కాని, మేనెల 18న ఆ గ్రామాన్ని సైనికులు చుట్టుముట్టి, దస్తిదార్‌వున్న ఇంటిమీద కాల్పులు ప్రారంభించారు వెంటనే దస్తిదార్, మనోరంజన్‌దాస్, కుమారి కల్పనాదత్ ఎదురుకాల్పులు సాగించారు ఆ కాల్పుల్లో మనోరంజన్‌దాస్, పూర్ణతాలూక్‌దార్ (ఇంటి యజమాని) చనిపోయారు దస్తిదార్‌తోపాటు కుమారి కల్పన పట్టుబడిపోయింది

తరువాత కొన్నాళ్లపాటు కోర్టుల్లో విచారణ తంతు నడిచింది చివరకు సూర్యసేన్, తారకేశ్వర దస్తిదార్లకు ఉరిశిక్ష విధించి, కల్పనాదత్తుకు యావజ్జీవ దేశాంతరవాస శిక్ష విధించారు 1934 జనవరి 12న చిట్టగాంగ్ జైల్లో అర్ధరాత్రి సమయంలో సూర్యసేన్, దస్తిదార్‌లను ఉరితీశారు కాని అలా ఉరితీసింది వారి శవాలనే ఉరితీసేముందే వారిద్దరినీ కొట్టి చంపారు వారి శవాలను బంధువులకు అప్పగించలేదు కనీసం ఏదో ఒకచోట వారి శవాలను పూడ్చిపెట్టలేదు "దిరినౌక" అనే క్రూయిజర్ నౌకమీద వారి శవాలను తీసుకుపోయి బంగాళాఖాతంలో పారేశారు

## కల్పనాదత్

కల్పనాదత్‌ను బర్మాలోని మాండలే జైల్లో నిర్బంధించారు ఆడపిల్లలను ఉరితీస్తే రాగల పరిణామాలు బ్రిటిష్‌వాళ్లకు తెలుసు కనుక ఆమెకు యావజ్జీవ దేశాంతరవాస శిక్ష వేశారు "భారతీయ ఆత్మ మాండలే జైల్లో నిర్బంధించబడి వుంది" అని జవహర్‌లాల్ బాధపడ్డాడు

ఎట్టకేలకు ప్రజల ఆందోళన ఫలితంగా ఆమెను విడుదల చేశారు ఆ సందర్భంలో రవీంద్రనాథ టాగూర్ ఆమెకు శుభాకాంక్షలందజేస్తూ ఇలా వ్రాశాడు·

"దీర్ఘకాలం తరువాత తిరిగి స్వేచ్ఛను పొందగలుగుతున్నావు కష్టాలు పడడం ద్వారా, బాధలను భరించడంద్వారా ఎంతో అనుభవాన్ని సంపాదించి వుంటావు నీ అనుభవమే నీకు పరిపూర్ణమైన జీవితాన్ని ప్రసాదించుగాక! నీకివే నా శుభాశీస్సులు "

విడుదలైన పిమ్మట కుమారి కల్పన వ్యక్తిగత హింసావాదాన్ని విసర్జించింది మార్క్సిజాన్ని అధ్యయనం చేసింది. 1944లో కామ్రేడ్ పి సి జోషిని పరిణయమాడింది ఈనాడు ఆమె ఢిల్లీలో వుంది

## భగత్‌సింగ్ ఆశయాలు

మరొక రెండు రోజులకు భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవులను ఉరి తీస్తారనగా, అదే జైల్లో వున్న మరొక విప్లవ యోధుడు జహంగరీలాల్ భగత్‌సింగ్‌కొక చీటీ పంపించాడు అందులో ఇలా వుంది

"మిమ్మల్ని కాపాడమంటారా? ఆఖరిక్షణమైనా సరే మిమ్మల్ని తప్పించడానికి ప్రయత్నించడం సాధ్యమే "

ఆ సూచనకు భగత్‌సింగ్ ఇలా జవాబిచ్చాడు

"భారత విప్లవానికి చిహ్నంగా నా పేరు మారింది విప్లవ పార్టీ ఆశయాలు, త్యాగాలు నన్ను చాలా ఎత్తుకు పెంచాయి ఇవాళ నా బలహీనతలు ఇతరులకు తెలియవు నేను మరణశిక్షనుండి తప్పించబడితే, నా బలహీతలన్నీ వెలుగులోకి వస్తాయి విప్లవ జ్యోతి వెలవెలా బోతుంది అది ఆరిపోయినా పోవచ్చు నేను నవ్వుతూ ఉరికంబమెక్కానంటే మన లక్ష్యం దగ్గరకొస్తుంది అమరవీరుల సంఖ్య పెరుగుతుంది సామ్రాజ్యవాద పైశాచిక బలానికి విప్లవాన్ని ఆపగల శక్తి కొరవడుతుంది అయినా ఒక ఆలోచన మాత్రం నా గుండెను పిండి చేస్తున్నది దేశం కొరకు, మానవాళి కొరకు నేను చేయదలచుకొన్న పనులలో వెయ్యోవంతు కూడా చేయలేకపోయాను కనీసం చంద్రశేఖర్ అజాద్ బ్రతికివున్నా, నా కర్తవ్యాన్ని పూర్తిచేసే అవకాశం బహుశా నాకు కలిగేది ఇప్పుడు ఆ అవకాశంకూడా లేకుండా పోయింది నా ఓర్పు నశించింది తుదిక్షణం త్వరగా రావాలని గాఢంగా కోరుకుంటున్నాను "

ఇదే ధోరణిలో భగత్‌సింగ్, తన తమ్ముడైన కర్తార్‌సింగ్‌కొక ఉత్తరం వ్రాశాడు "గుప్పెడు మట్టిలాంటి ఈ దేహం నశించిపోతే వచ్చే నష్టమేముంది? మన విశ్వాసం మాత్రమే మెరుపులా కాంతిని విరజిమ్ముతుంది" అంటూ తాత్త్విక చింతనను రేకెత్తించాడు

ఆదిలో భగత్‌సింగ్ టెర్రరిస్టుగా వున్నప్పటికీ క్రమక్రమంగా మార్క్సిస్టుగా పరిణతి చెందాడు కనుకనే లెఫ్ట్‌వింగ్ కమ్యూనిజం, హిస్టారికల్ మెటీరియలిజం, లాండ్ రివల్యూషన్ ఇన్ రష్యా మొదలగు గ్రంధాలు తనకు అందజేయవలసిందిగా లాహెూర్ జైలునుండి 1930 జూలై 24న జయదేవ గుప్తాకొక ఉత్తరం రాశాడు సెషన్సు కోర్టులో వాఙ్మూలమిస్తూ ఇలా వివరించాడు

"విప్లవ సిద్ధాంతం బాంబుల పిస్తోళ్ల సిద్ధాంతంకాదు విప్లవమంటే తప్పనిసరిగా రక్తదాహంతో కూడిన పోరాటం కానక్కర్లేదు. వ్యక్తిగత ప్రతీకారానికి తావులేదు దోపిడీకి, యుద్ధాలకు, మారణకాండకు గురికాని సామాజిక వ్యవస్థను స్థాపించడమే విప్లవం అలాంటి సామాజిక వ్యవస్థలో శ్రామికవర్గ ఆధిపత్యముంటుంది. తత్ఫలితంగా ప్రపంచ సమాఖ్య ఏర్పడి మానవాళిని కాపాడుతుంది "

దేశభక్తుల కుటుంబంలో భగత్‌సింగ్ జన్మించాడు ఆయన తండ్రి కిషన్‌సింగ్ మొక్కవోని దేశభక్తుడు కాగా కొంతకాలం నేపాల్‌లో ప్రవాస జీవితం గడపవలసి వచ్చింది భగత్‌సింగ్ పెదతండ్రి అజిత్‌సింగ్ ప్రసిద్ధి వడసిన విప్లవ యోధుడు పినతండ్రి స్వరణ్‌సింగ్ కొంతకాలం డిటెన్షనులో వుండి క్షయవ్యాధిబారిపడి మరణించాడు అలాంటి కుటుంబంలో పుట్టి, అశేష భారత ప్రజల మన్ననలందుకొన్న భగత్‌సింగ్‌ను, రాజగురు సుఖదేవులతోపాటు 1931 మార్చి 23వ తేదీన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఉరితీశారు

ఆ అమరవీరుల మృతదేహాలను బంధువులకుగాని, స్నేహితులకుగాని అప్పగించే దమ్ములు ప్రభుత్వానికి లేకపోయాయి ఆ దేహాలను బ్రిటిష్ సైనికులు తీసుకుపోయి, సట్లెజ్ నదీతీరాన ముక్కలుగా నరికి, వాటిమీద కిరోసిన్ పోసి, మంటబెట్టి, "రండిరా రాక్షసులారా! తుపాకులు పేల్చండిరా!" అంటూ నృత్యం చేశారు

ఆ వార్త తెలిసిన వెంటనే కొందరు ప్రజలక్కడకు వెళ్ళి, కాలీకాలకుండా వున్న అవశేషాలను తెచ్చి లాహెూర్‌లో గౌరవపూర్వకంగా అంత్యక్రియలు జరిపారు

భగత్‌సింగ్ ఉరివార్త వినగానే దేశమంతటా పెద్ద ఎత్తున ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు జరిగాయి మరొక ఆరు రోజుల్లో జరిగిన కరాచీ కాంగ్రెస్‌లోకూడా విషాదఛాయలు అలుముకున్నాయి ఆ యువకిశోరాల ప్రాణాలను గాంధీ కాపాడ లేకపోయాడనే ఆగ్రవేశాలుకూడా వ్యక్తమయ్యాయి "ఇర్విన్‌తో గాంధీ చేసుకున్న ఒడంబడిక భగత్‌సింగ్ ప్రభృతులను ఉరికంబాలపాలు చేసింది" అని కొందరు నినాదాలు చేశారు "ఆ యువకులను రక్షించేందుకు గాంధీ ఏమి చేశాడు?" అని మరి కొందరు నిగ్గదీశారు

పట్టాభిగారు తన కాంగ్రెస్ చరిత్రలో ఇలా వ్రాశారు "ఆ రోజుల్లో భగత్‌సింగ్ పేరు గాంధీజీ పేరువలె నలుమూలలా విఖ్యాతమైపోయినదనడం అతిశయోక్తి కాదు గాంధీజీ ఎంత ప్రయత్నించినా వారి ఉరిశిక్షలను మార్పించలేకపోయాడు."

జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మకథలో ఇలా వ్రాశాడు "భగత్‌సింగ్ మరణశిక్షను మార్చవలసినదని గాంధీజీకోరిన కోర్కెను, చేసిన వాదననుకూడా ప్రభుత్వమంగీక రింపలేదు కాని భారతదేశమంతటా గగ్గోలుగా నుండుటచే గాంధీజీ ప్రత్యేకంగా ఈ కోర్కె కోరాడు అయినా ఆయన కోర్కె వ్యర్థమైంది "

అందువల్ల భగత్‌సింగ్ రాజగురు సుఖదేవులు ఉరికంబాలెక్కారు వారి ఉరికి నిరసనగా దేశంలో జరిగిన ప్రదర్శనల్లో పాల్గొన్నవారిలో 141 మంది పోలీసుల కాల్పుల వల్ల మరణించారు 500 మందికి పైగా గాయపడ్డారు వేలాదిగా అరెస్టయ్యారు

## చంద్రశేఖర ఆజాద్ శౌర్యం

కాశీవిద్యాపీఠ్‌లో విద్యనభ్యసించే చంద్రశేఖర ఆజాద్ తన 14వ ఏట సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు అందువల్ల 1921లో ఆయనను అరెస్టు చేసి 15 కొరడా దెబ్బలు కొట్టారు అయినా తన పేరు 'ఆజాద్' అని, తన తండ్రిపేరు 'స్వాధీన్' అని, తన అడ్రస్ 'జైలు' అనీ నొక్కి మేజిస్ట్రేటుకు చెప్పాడు ఆనాడలా కొట్టిన కొరడాదెబ్బలే ఆయనను బ్రిటిష్ ప్రభుత్వానికి బద్ధశత్రువుగా, సింహస్వప్నంగా మార్చివేశాయి మన్మథనాథగుప్త ప్రోత్సాహంతో టెర్రరిస్టు విప్లవవాదుల్లో చేరాడు అటు తరువాత హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీకి అధిపతి అయ్యాడు

కాకోరి, లాహెూర్, న్యూఢిల్లీ మున్నగుచోట్ల జరిగిన ఘటనల్లో చంద్రశేఖర ఆజాద్

పాల్గొన్నాడు కాని పట్టుబడకుండా తప్పించుకుపోగలిగాడు అయనను అప్పజెప్పినవారికి 30వేల రూపాయల బహుమతిని ప్రభుత్వం ప్రకటించింది అయినా ఆయన పట్టుబడలేదు

చివరకు 1931 ఫిబ్రవరి 26న అలహాబాద్ వచ్చి విప్లవాదుల మీటింగులో పాల్గొన్నాడు జవహర్‌లాల్ నెహ్రూతో రాజకీయాలు చర్చించాడు ఆ మరునాడు మరో విప్లవకారుని కలవడానికి ఆల్‌ఫ్రెడ్ పార్కుకు వెళ్లాడు అక్కడ వీరభద్రతివారి అనే ద్రోహి ఆయన ఉనికిని పోలీసులకు చెప్పాడు పోలీసులు పార్కును చుట్టుముట్టి కాల్పులు ప్రారంభించారు

వెంటనే ఆజాద్ ఒక కీలకస్థానంలో చేరి రెండు చేతులతోను పిస్తోళ్ళు కాల్చాడు ఆ దెబ్బలకొక పోలీస్ ఇన్‌స్పెక్టర్ నేలకొరిగాడు బ్రిటిష్ పోలీసు అధికారికి, మరికొందరు పోలీసులకు గుళ్ల దెబ్బలు తగిలాయి కొందరు మరణించారు ఈలోగా ఆజాద్ శరీరమంతా రక్తసిక్తమైంది ఆ సమయంలో ఆయనకు తన శపథం జ్ఞాపకమొచ్చింది "శత్రువుల తుపాకీ గుళ్లకు జవాబు చెపుతాను స్వతంత్రుడుగా జీవిస్తాను స్వతంత్రుడుగానే మరణిస్తాను" అని పట్టిన శపథాన్ని నెరవేర్చుకున్నాడు తనవద్దగల ఆఖరు తూటాతో తన కణతపైన కాల్చుకొని వీరమరణం చెందాడు

ఆజాద్‌ను గురించి తన ఆత్మకథలో జవహర్‌లాల్‌నెహ్రూ ఇలా వ్రాశాడు "ఆజాద్ నన్ను చూడడానికి వచ్చాడు టెర్రరిస్టు పద్ధతులవల్ల లాభంలేదని, వాటివల్ల ఎలాంటి మంచి ఫలితం చేకూరదని, తాము గ్రహించామని ఆయన నాకు చెప్పాడు టెర్రరిజంలో నమ్మకం నశించుతున్నదని ఆజాద్‌ద్వారా విని నేను చాలా సంతోషించాను తరువాత ఆ విషయంలో నాకు మరింత నమ్మకం కలిగింది నేను చంద్రశేఖర ఆజాద్‌కు నా రాజకీయ తత్వం బోధించి, ఆయనను నా దృక్పథంవైపు తిప్పుకునేందుకు ప్రయత్నించాను కాని 'నేను ఇప్పుడేం చేయాలి?' అని ఆయన అడిగిన ప్రధాన ప్రశ్నకు నేను జవాబు చెప్పలేకపోయాను" అంటూ తన నిస్సహాయతను వెల్లడించాడు జవహర్‌లాల్‌నెహ్రూ

## మీరట్ కుట్ర కేసు

మీరట్ కుట్ర కేసు బనాయించటంలో సామ్రాజ్యవాదులు ఆశించిన ఫలితం తలక్రిందులైంది ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు కమ్యూనిస్టులు కుట్ర పన్నారనే అభియోగం హాస్యాస్పదంగానే వీగిపోయింది మూడున్నర సంవత్సరాల విచారణ తరువాత తేలిన సారాంశమది.

ఇండియాలో కార్మిక, కర్షక ఉద్యమాలను అణచివేయడానికి ఉద్దేశించబడిన మీరట్ కుట్ర కేసు విచారణ జరుగుతున్నప్పుడు బ్రిటన్‌లో లేబర్ పార్టీ అధికారంలో వుంది అప్పటికి నూరేళ్ల క్రితం ఇంగ్లండులో 'డార్ ఛెస్టర్' కార్మిక ఉద్యమాన్ని అణచి వేసేందుకు ఆనాటి టోరీల ప్రభుత్వమెంత ప్రయత్నించిందో లేబర్ పార్టీ వారికి తెలుసు అయినా "మేం పూర్తి బాధ్యతను వహిస్తున్నాం" అని, వైస్రాయికి వ్రాసిన లేఖలో ఇండియా కార్యదర్శి హామీ యిచ్చాడు

"మేము పూర్తి బాధ్యతను వహిస్తున్నాం భారత ప్రభుత్వ చర్యను ఇండియా కార్యదర్శి గట్టిగా సమర్థిస్తున్నాడు" అని లేబర్ పార్టీ సమావేశంలో డా॥ డ్రుమాండ్ షీల్స్ ప్రకటించాడు "న్యాయ వ్యవస్థ తన విధిని నిర్వహించాలి" అని డైలీ హెరాల్డ్ పత్రిక వ్రాసింది

కార్మికోద్యమాన్ని అణచివేసేందుకే మీరట్ కుట్రకేసును బనాయించారన్న విషయాన్ని వివరిస్తూ ఇండియన్ ట్రేడ్ యూనియన్ నాయకులు బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ నాయకులకు వ్రాసిన లేఖకు జవాబుగా 1929 అక్టోబర్ 1న సర్ వాల్టర్ సిట్రిన్ ఇలా వ్రాశాడు

"ముద్దాయిల మీద చేసిన నేరారోపణ రాజకీయమైనది రాజకీయ నేరారోపణతో చేసిన అరెస్టులవల్ల ఇండియన్ ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి ప్రత్యక్షంగా జరిగే నష్టమేమీ వుండబోదని లేబర్‌పార్టీ జనరల్ కౌన్సిల్ అభిప్రాయపడుతోంది విచారణ సాధ్యమైనంత త్వరగా పూర్తి కావాలని కోరుకుంటోంది "

తరువాత మూడున్నర సంవత్సరాలు విచారణ ముగిసింది. అప్పటికి లేబర్ పార్టీ అధికారాన్ని కోల్పోయింది కాగా జ్ఞానోదయమైంది కాబోలు, బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, బ్రిటిష్ లేబర్ పార్టీ కలిసి ఒక కరపత్రాన్ని ప్రచురించాయి అందులో ఇలా వుంది

"ఆదినుండి తుదివరకూ నడిచిన మీరట్ కుట్రకేసు వ్యవహారమంతా ఏవిధంగానూ సమర్థించుకోడానికి వీలులేనట్టిది న్యాయసంబంధమైన అపఖ్యాతిని మాత్రమే అది సంతరించుకోగలిగింది "

అలా వారు ప్రకటించడానికి బలమైన కారణాలున్నాయి ముద్దాయిల తరపున వాదించటానికి మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూ, సర్ తేజ్‌బహదూర్ సప్రూవంటి వారితోపాటు జాతీయవాదులైన పలువురు న్యాయవాదులుకూడా పూనుకున్నారు కాగా కమ్యూనిస్టులను ఏకాకులుగా చేయాలనే సామ్రాజ్యవాదుల దుష్టసంకల్పం విఫలమైంది

ప్రభుత్వ చర్యను నిర్ద్వంద్వంగా ఖండిస్తూ గాంధీజీ "కార్మిక నాయకుల, కమ్యూనిస్టుల అరెస్టులను చూస్తే, ప్రభుత్వం ఎంత గాభరాపడుతోందో తెలిసిపోతోంది నిర్బంధ దమనకాండవల్ల చలించిపోతున్న భారతదేశంలో, న్యాయ చట్టాలను పూర్తిగా రద్దుచేసి, తన కబంధ హస్తాలను ప్రదర్శించడం అవసరమని ప్రభుత్వం భావిస్తున్నట్లు కనపడుతోంది. విచారణ తతంగం (ఫార్సు) కొనసాగే మాట నిజమే నిందితులు గనుక తెలివిగలవారైతే ఆ వలలో పడకూడదు ఆ ఫార్సుకు తోడ్పడకూడదు ధైర్యంగా జైలు శిక్షలకు సిద్ధపడాలి న్యాయ చట్టం పేరుతో న్యాయాన్ని మట్టుపెట్టే పాలనను అంతం చేయాలంటే, వేలాది ప్రజలు జైలుశిక్షలకు సిద్ధపడడమే చాలదు - ఆ శిక్షలను ఆహ్వానించడమే నేటి కర్తవ్యంగా భావించాలి" అని హెచ్చరించాడు

ఏడు నెలల తరువాత కేసు సెషన్స్ కోర్టుకు వెళ్లింది చట్టాలలోని లోపాలను, సాక్ష్యాలలోని అవకతవకలను ఉపయోగించుకొని బయటపడే ఉద్దేశ్యం నిందితులకు లేదు కనుక సామ్రాజ్యవాదుల నిజస్వరూపాన్ని బట్టబయలుచేసేందుకొక వేదికగా సెషన్సు కోర్టును ఉపయోగించుకోవాలని నిర్ణయించుకున్నారు కాగా 1406 పేజీల పత్రాలను కోర్టులో దాఖలు చేసి, రెండు నెలలపాటు తమ వాదనలను వినిపించారు

అందువల్ల బ్రిటిష్ ఇండియా ప్రభుత్వపు దమనకాండ, దోపిడీ, న్యాయచట్టాల బండారం నగ్నంగా ప్రపంచానికి వెల్లడయ్యాయి సరియైన తిండికి, బట్టకు నోచుకోని కోట్లాది దీనుల పక్షాన నిలబడి, వారి దుస్థితికి కారణమైన సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని, పెట్టుబడిదారుల్ని ఎదిరించడం ధర్మసమ్మతమనే వాదన బలపడింది నిందితుల వాఙ్మూలాలు చరిత్రాత్మకమయ్యాయి అయినా నిందితులకు ద్వీపాంతరవాస శిక్షలు,

జీవిత ఖైదులు తప్పలేదు నాయకులనలా బంధించడానికే కదా కుట్ర కేసును బనాయించింది?

"అయితే కార్మిక సమ్మెలు, సోషలిస్టు కార్యకలాపాలు ఇంగ్లండులో న్యాయ సమ్మతమా? ఇండియాలో శిక్షార్హమా? స్ప్రాట్, బ్రాడ్లే, హచిన్‌సన్‌లు ఇండియాలో కార్మికోద్యమ నిర్మాణానికి తోడ్పడటం నేరమా?" అని ప్రజాస్వామ్యవాదులనేకులు బ్రిటిష్ ప్రభుత్వాన్ని విమర్శించారు ఇంగ్లండులోకూడా అసమ్మతి పెరిగింది కామన్స్ సభలో ప్రశ్నల వర్షం కురిసింది ప్రొఫెసర్ హెరాల్డ్ లాస్కీ ఇలా వ్రాశాడు.

"బ్రిటిష్ ఇండియా చరిత్రలో మీరట్ కేసు హృదయ విదారక సంఘటన బ్రిటన్‌లో రాజకీయాందోళన దైనందిన జీవనసరళి అదే ఆందోళన ఇండియాలో నేరమా? ప్రాసిక్యూషన్ వారు చేసిన అరోపణలు నీచమైన నిందలతో నిండివున్నాయి వాటినింకా పట్టుకు వ్రేలాడటం అవమానకరం ప్రభుత్వం భయంతో ప్రవర్తిస్తోంది హింసాయుతంగా పనిచేస్తూ, తనపైన తానే నేరం మోపుకుంటోంది తనను తాను సమర్థించుకోవాలంటే ప్రభుత్వానికి ఉదారబుద్ధి అవసరం కాని ఈ ప్రభుత్వానికా శక్తిలేదు" రోమారోలా, ఐన్‌స్టయిన్, ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్‌బరీ మొదలగు ప్రముఖులు బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు

నిందితులు సహజంగానే హైకోర్టుకు అప్పీలు చేశారు అక్కడ మళ్లీ డిఫెన్సు వాదనలు వినపడతాయి వాటిని దేశ విదేశాల పత్రికలు ప్రచురిస్తాయి ప్రభుత్వంమీద విమర్శల వర్షం కురిసి తీరుతుంది కాబట్టి వాటినుండి తప్పించుకునే మార్గాలను ప్రభుత్వాధినేతలు వెతకసాగారు అ స్థితిలో ఇండియా సెక్రటరీ వైస్రాయికి క్రింది లేఖ వ్రాశాడు

" మీరట్ కేసులో విధించిన తీవ్రమైన శిక్షలు పలు విమర్శలకు కారణమయ్యాయి నాతో సహా అనేకమందికి విభ్రాంతిని కలిగించాయి రోజులు గడిచిన కొలదీ కొత్త చిక్కులు ఎదురవుతున్నాయి కేసు హైకోర్టు అప్పీలులో వున్నది గనుక, మనమిపుడు ఏది చేయాలన్నా కష్టమేనని నాకు తెలుసు విచారణ వెంటనే పూర్తిగాక, మరొక ఆరు నెలలకుపైగా సాగితేగాని, ఇక్కడగల ఇబ్బందులు తగ్గవు ఈ విషయంలో నీ అభిప్రాయాన్ని తెలుసుకోగోరుతున్నాను."

ఇండియా కార్యదర్శికి వైస్రాయి ఏమి వ్రాశాడో తెలియదు కాని అలహాబాద్ హైకోర్టు జడ్జి మాత్రం బ్రిటిష్ ప్రభుత్వ పరువును కొంతవరకూ కాపాడాడు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వాన్ని కూలదోసేందుకు నిందితులు కుట్ర పన్నారనే ప్రాసిక్యూషన్ వాదనను జడ్జి త్రోసిపుచ్చాడు "కుట్ర పన్నారు అని చెప్పినంతమాత్రాన సరిపోదు ప్రభుత్వాన్ని పడగొట్టేందుకు నిందితులు చేసినదేమిటో రుజువు చేయాలి ముద్దాయిలు తమ సోషలిస్టు సిద్ధాంతాలను బహిరంగంగానే వెల్లడించారు బహిరంగంగానే కార్మిక సంఘాలను నియమించి, వాటికి నాయకత్వం వహించారు అది కుట్ర కాదుగదా?" అని నిగ్గదీశాడు

అందువల్ల పీనల్‌కోడ్‌లోని సెక్షన్ 121-ఎ ఎగిరిపోయింది శిక్షలు బాగా తగ్గిపోయాయి కాని నాలుగేళ్లపాటు నాయకులు జైళ్లలో వుండటంవల్ల కార్మికోద్యమం బలహీనపడింది

## వివిధ వర్గాల పాత్ర

గాంధీజీ కోరిన 11 కోర్కెలలో ప్రత్యక్షంగా కార్మికులకు తోడ్పడే కోరిక లేకపోవడం,

సత్యాగ్రహంలో పాల్గొనకుండా కమ్యూనిస్టులు దూరంగా ఉండటం, ఆర్థిక మాంద్యంవల్ల కార్మికులకు బేరమాడే శక్తి తగ్గిపోవడంవల్ల సత్యాగ్రహ సమరంలో మిల్లు కార్మికులు ఎక్కువగా పాల్గొనలేదు జవహర్‌లాల్‌ను, గాంధీజీని అరెస్టు చేసినపుడుమాత్రం షోలాపూర్, కరాచీ, మద్రాస్, కలకత్తా, బడ్జ్‌బడ్జ్ మున్నగుచోట్ల కార్మికులు సమ్మెలు చేశారు పోలీసుల నెదిరించారు కాని, తరువాత మానివేశారు

1921-22లో జరిగినట్లుగా కోర్టుల బహిష్కరణ, పాఠశాలల బహిష్కరణ కార్యక్రమాలు 1930-31లో లేవు చిటగాంగ్ విద్యార్థులు, బాలబాలికలు ఆత్మార్పణం చేస్తున్నప్పటికీ ఇతర చోట్ల విద్యార్థులు కదలలేదు "విద్యార్థులు, న్యాయవాదులు సత్యాగ్రహ పోరాటానికి సుముఖంగా లేరు" అని బీహార్ కాంగ్రెస్ కమిటీ వెల్లడించింది

సాయుధ పోరాటం సాగించిన భగత్‌సింగ్, సూర్యసేన్ మొదలగు వీరాగ్రేసరులు ఉరికంబాలెక్కుతోంటే, కల్పన, శాంతిమున్నగు వీర బాలికలు ద్వీపాంతరవాస శిక్షలనుభవిస్తోంటే, అహింసాయుత సత్యాగ్రహంలో పాల్గొన్న దేశభక్తులు జైళ్ళు నింపారు.

బెంగాల్లో 15,000, బీహార్‌లో 14,251, యు పి లో 12,651, పంజాబ్‌లో 12,000, సరిహద్దు రాష్ట్రంలో 5,000, బొంబాయి నగరంలో 4,700, ఢిల్లీలో 4,500 గుజరాత్‌లో 3,549, ఆంధ్రలో 2,878, మధ్యప్రదేశ్‌లో 2,255 మంది సత్యాగ్రహులు అరెస్టుకాగా, దేశం మొత్తం మీద 92,124 మంది జైళ్ల పాలయ్యారు

సరిహద్దు రాష్ట్రం, పంజాబ్, ఢిల్లీ ప్రాంతాలలో తప్ప తక్కిన ప్రాంతాలలోని ముస్లిములు సత్యాగ్రహ పోరాటంలో ఎక్కువగా పాల్గొనలేదు అయినా పేద, మధ్యతరగతి రైతులు, ఢిల్లీ, బాంబేలాంటి పట్టణాలలో నివసించే మధ్యతరగతి కుటుంబాలలోని స్త్రీలు ఎక్కువగా సత్యాగ్రహ సమరంలో పాల్గొనడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వానికి గంగవెర్రులెత్తాయి ఉత్తరప్రదేశ్ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఇలా రిపోర్టు వ్రాశాడు

"భారతనారి తన కుటుంబంలో గౌరవంగా జీవించేందుకుమాత్రమేగాక, తన దేశ స్వాతంత్ర్యం కొరకుకూడా కృషిని ప్రారంభించింది అందువల్ల ప్రభుత్వానికి విధేయులైన అధికార్లు- ముఖ్యంగా పోలీస్ ఆఫీసర్లు, తమ కుటుంబాలలోని స్త్రీలనుండి వచ్చిన విమర్శలకు, నిందలకు గురికావలసి వచ్చింది." (హోమ్ పొలిటికల్ 249/1930 )

1930లో రైతులు ప్రారంభించిన పన్నుల నిరాకరణోద్యమం ప్రభుత్వాధినేతలను భయకంపితులను చేసింది. ఆంధ్ర, గుజరాత్ ప్రాంతాలలో రీసెటిల్‌మెంట్ వ్యతిరేక ఉద్యమం, బీహార్‌లో "చౌకీదారీ" పన్నుల నిరాకరణ, గిరిజన ప్రాంతాలలో అటవీ చట్టాల ఉల్లంఘన, ఎక్సైజ్ ఆదాయం తగ్గుదల ప్రభుత్వానికి గంగవెర్రులెత్తించాయి

అక్కడక్కడ హింసాయుత ఘటనలు జరిగినా గాంధీజీ ఉద్యమాన్ని విరమించలేదు కాగా ప్రభుత్వ దమనకాండ మరీ పెరిగింది 1930 నవంబరు నాటికి 17 ఏళ్ల లోపు వయసుగల బాలబాలికలు 1,050 మందిని, 350 మంది స్త్రీలను జైళ్లలో బంధించారు పది, పన్నెండేళ్ల బాలబాలికలను, స్త్రీలనుకూడా లారీలతో కొట్టడాన్ని, మిల్లు యజమానుల నాయకుడైన రాకూర్‌దాస్ తీవ్రంగా ఖండించాడు

## జాతీయ పెట్టుబడిదారుల పాత్ర

ఉద్యమానికి జి డి బిర్లా ఐదు లక్షల రూపాయల వరకూ విరాళమిచ్చినట్లుగా గూఢచారి శాఖవారు వైస్రాయికి తెలియజేశారు కలకత్తాలోని మార్వాడీ వర్తకులు లాంక్‌షైర్

మిల్లు బట్టలను దిగుమతి చేసుకోకుండా బిర్లా ఆపగలిగాడు జమ్నాలాల్ బజాజ్ గాంధీజీ అనుచరుడుగా, కాంగ్రెస్ నాయకుడుగా మారి, జైలుకు వెళ్లాడు

"గోడమీది పిల్లివాటంగా కూర్చొనే విధానాన్ని భారతీయ వాణిజ్యవేత్తలు విడనాడాలి మన కోర్కెలను ప్రభుత్వం నిరాకరిస్తే, స్వరాజ్యం కొరకు పోరాడుతున్నవారిని మనం గట్టిగా బలపర్చితీరాలి" అంటూ వాల్చంద్ హీరాచంద్ 1930 ఏప్రియల్ 28న ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛేంబర్స్ ఆఫ్ కామర్స్ అన్డ్ ఇండస్ట్రీకి లేఖ వ్రాశాడు

"అధినివేశ ప్రతిపత్తిని గురించి వైస్రాయి స్పష్టమైన హామీ యిచ్చేంతవరకూ, గాంధీజీ పాల్గొనకుండా వున్నంతవరకూ, రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సును బహిష్కరించాలి" అని 1930 మేలో ఎఫ్ ఐ సి సి ఐ తీర్మానించింది

మిల్లు బట్టల ఖరీదు మున్నగువాటి విషయంలో కాంగ్రెస్ నాయకులకు, మిల్లు యజమానులకు మధ్య తలెత్తిన విభేదాలను పరిష్కరించేందుకు సారాభాయ్, కస్తూరిభాయ్, లాల్‌భాయ్ గట్టిగా కృషి చేశారు

పారిశ్రామికవేత్తలకంటే ఎక్కువగా వ్యాపార వర్గాలవారు జాతీయోద్యమాన్ని బలపరిచారు బాంబే, ఢిల్లీ, అమృత్‌సర్, కలకత్తా మొదలగుచోట్లగల మార్వారీ వర్తకులు, విదేశీ బట్టల దిగుమతిని పూర్తిగా నిలిపివేశారు అందువల్ల సత్యాగ్రహులు పికెటింగ్ చేసినప్పటికంటే ఎక్కువ నష్టం లాంక్‌షైర్ మిల్లులకు కలిగింది

"బాంబే వ్యాపారస్తులు చాలాకాలంగా ప్రభుత్వం విధిస్తున్న పన్నులు, చేపట్టిన ఆర్థిక విధానంపైన తీవ్రమైన అసంతృప్తితో వున్నారు కనుక తమ కోర్కెలను నెరవేర్చు కునేందుకు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడుతున్నారు" అని 1930 జూన్ 13న, హెచ్ జి హెయిగ్ వైస్రాయికొక రిపోర్టు పంపించాడు

"తాము సర్వనాశనమైనాసరే, ఉద్యమానికి అండగా నిలబడాలని ఆలోచనాపరులు, సరళ స్వభావం కలవారు అయిన సాధారణ వర్తకులు చేసిన నిర్ణయం గట్టిగా ఆలోచించదగినదిగా వుంది" అని పెట్రీ 1930 ఆగస్టు 20న రిపోర్టు వ్రాశాడు

అందువల్ల బ్రిటన్ వస్త్రాల దిగుమతి బాగా తగ్గిపోయింది ఇంపీరియల్ టుబాకో, డన్‌లప్ మొదలగు పరిశ్రమల గతికూడా అలాగే మారింది కాగా 1930 నాటి ఆర్థిక మాంద్యాన్ని తట్టుకొని స్వదేశీ పరిశ్రమలు నిలబడగలగడానికి సత్యాగ్రహ ఉద్యమం తోడ్పడింది

"అతి క్లిష్టమైన తరుణంలో, స్వాతంత్ర్యోద్యమం దేశీయ పరిశ్రమలకు తోడ్పడింది కాగా మన భవిష్యత్తు ఆశాజనకంగా వుండగలదనుటలో సందేహం లేదు" అంటూ 1931 మార్చిలో హెూమీ మోడీ, బాంబే పారిశ్రామికవేత్తల సభకు అధ్యక్షత వహించిన సందర్భంలో వివరించాడు

కాని, సత్యాగ్రహోద్యమం క్రిందివర్గాల ప్రజలలో విస్తరించి, పదునెక్కిన పిమ్మట, దేశీయ పెట్టుబడిదారుల వైఖరి మారింది. ప్రభుత్వంతో రాజీకి వారు ప్రయత్నించారు.

## మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు

1930 వేసవిలో ఉప్పు సత్యాగ్రహం ఉవ్వెత్తున సాగుతున్న స్థితిలో - సైమన్ కమిషన్ నివేదిక వెలువడింది అందులో అధినివేశ ప్రతిపత్తిని గురించి ప్రస్తావనలేదు రాష్ట్రాలలో ద్వంద్వ పాలనను తొలగించాలని, కేంద్ర ప్రభుత్వ పాలన యథావిధిగా

సాగాలని సైమన్ కమిషన్ సూచించింది సింధు, ఒరిస్సా రాష్ట్రాలను ఏర్పరచే విషయాన్ని పరిశీలించవలసిందిగా సిఫార్సు చేసింది భారతదేశంనుండి బర్మాను విడదీయాలని కోరింది సంస్థానాధీశులకు కేంద్ర అసెంబ్లీలోగల ప్రాతినిధ్యాన్ని పెంచడానికి ప్రయత్నించింది

సైమన్ కమిషన్ నివేదిక వెలువడిన పిమ్మట రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సును ఏర్పాటు చేయవలసినదిగా బ్రిటన్‌లోని లేబర్ పార్టీ ప్రభుత్వాన్ని వైస్రాయి కోరాడు అందుకు వారంగీకరించారు కాగా రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో కాంగ్రెస్ నాయకులు పాల్గొనేటట్లు చేయడానికి వైస్రాయి పూనుకున్నాడు కాని వైస్రాయికి గాంధీ నెహ్రూలకు మధ్య జరిగిన సంభాషణలు భగ్నమయ్యాయి

అయినా బ్రిటిష్ ప్రభుత్వం రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సును ఏర్పాటు చేసింది 1930 నవంబర్ 12న చక్రవర్తి కాన్ఫరెన్సును ప్రారంభించాడు అలా ప్రారంభమైన కాన్ఫరెన్సు 1931 జనవరి 19 వరకూ కొనసాగింది సర్ తేజబహదూర్ సప్రూ, మహమ్మదాలీ. అంబేద్కర్, జనాబ్ జిన్నా, సర్ మీర్జా ఇస్మాయిల్, సర్ అక్బర్ హైదరీ, బికనీర్ మహారాజు మున్నగువారు సమావేశాలలో పాల్గొన్నారు కొన్ని ప్రధాన సూత్రాలు అంగీకరించ బడినాయి “రాష్ట్ర వ్యవహారాలలో సంపూర్ణాధికారం రాష్ట్ర ప్రభుత్వాలకుంటుంది కేంద్ర ప్రభుత్వం ఫెడరల్ ప్రభుత్వంగా వుంటుంది దానిక్రింద రాష్ట్రాలు, స్వతంత్ర సంస్థానాలు వుంటాయి ఫెడరల్ ప్రభుత్వం కేంద్ర శాసనసభకు బాధ్యత వహిస్తుంది కాని రిజర్వేషన్లు, రక్షణ వ్యవహారాలలో ఫెడరల్ ప్రభుత్వం మీద కేంద్ర శాసనసభకు ఎలాంటి అధికారమూ వుండదు” అని సూత్రీకరించడం జరిగింది

కాని, సంపూర్ణ స్వాతంత్ర్యం లేకపోయినా, కనీసం అధినివేశ ప్రతిపత్తి విషయమైనా ప్రస్తావించబడలేదు కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పడగలదనే సూచన మాత్రమే చేయబడింది

ఆ రౌండ్ టేబుల్ మహాసభలో పాల్గొన్న మహమ్మదాలీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఇలా అర్థించాడు

“భారతదేశానికి స్వాతంత్ర్యం లభిస్తుందనే విశ్వాసంతో నేను నా దేశానికి తిరిగి వెళ్లాలనుకుంటున్నాను ఒకవేళ మీరు మా దేశానికి స్వాతంత్ర్యం లభించకుండా చేయాలనుకుంటే, మీ దేశంలో నా సమాధి కొరకు కాస్త చోటివ్వండి ”

అలా అర్థించిన తర్వాత కొద్దిరోజుల్లోనే మహమ్మదాలీ లండన్‌లో మరణించాడు ఆయన శవాన్ని జెరూసలెం తీసుకువెళ్ళి అక్కడ సమాధి జేశారు అలా ముగిసింది ప్రథమ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు

## గాంధీ-ఇర్విన్ ఒడంబడిక

ప్రధానమైన జాతీయ కాంగ్రెస్ పాల్గొనకుండా, భారత రాజ్యాంగ తుది స్వరూపాన్ని నిర్ణయించడం మంచిపనికాదనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం కాంగ్రెస్‌తో రాయబారాలు ప్రారంభించింది అందుకు అనుగుణంగా 1931 జనవరి 26న గాంధీజీని, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులను విడుదల చేసింది రౌండ్ టేబుల్ సమావేశం నుండి తిరిగి వచ్చిన సప్రూ గాంధీజీని కలుసుకొని ఇర్విన్‌తో రాయబారాలు సాగించవలసిందిగా అర్థించాడు

అప్పటికే సత్యాగ్రహ ఉద్యమం యొక్క ఉధృతం బాగా తగ్గింది 1930 ఏప్రియల్‌నుండి సెప్టెంబరు వరకూ దిగ్విజయంగా సాగిన సత్యాగ్రహ ఉద్యమం, దాదాపుగా లక్షమంది కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తలు అరెస్టుకావడంవల్ల, నాధుడులేని కయ్యంగా మారిపోయింది తమకు తోచిన విధంగా, చేతనైన రీతిలో రైతులు, గిరిజనులు పోరాడసాగారు

పన్నుల నిరాకరణ తప్ప ఆంధ్ర, బీహార్, గుజరాత్ మున్నగు ప్రాంతాల రైతులకు మరొక మార్గం లేకపోయింది 1930లో అలుముకున్న ఆర్థికమాంద్యం వారినాస్థితికి నెట్టింది ధాన్యం బస్తా రూ 2 40 పైసలకు అమ్ముతున్న దశలో ప్రభుత్వం భూమిశిస్తును, నీటి తీరువాను, సెస్సులను కలిపి రూ 11 25 పైసలనుండి రూ 18 50 పైసలకు పెంచింది ఆ స్థితిలో పెంచిన పన్నులను రైతులెలా చెల్లించగలరు?

మరొకవైపున ఋణభారం రైతుల కొంపలను కూల్చింది రైతులవద్దగల వెండి బంగారాలు షరాబులద్వారా ఇంగ్లండుకు చేరాయి అయినా ఋణభారం తొలగలేదు కాబట్టి కొన్ని ప్రాంతాలలో రైతులు తెగించారు

1931 ప్రారంభంలో కర్నాటకలోకూడా పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభమైంది అలాగే మహారాష్ట్రలోను ప్రారంభమైంది బుందేల్‌ఖండ్‌లోని ఛత్తర్‌పూర్ సంస్థానంలో మంగళ్‌సింగ్ అనే పేరుమోసిన దోపిడీ దొంగ నాయకత్వాన పన్నుల వ్యతిరేక ఉద్యమం ప్రబలమైంది పదివేలమంది సాయుధులై ఛత్తర్‌పూర్‌ను స్వాధీనం చేసుకునేందుకు ప్రయత్నించారు కాని బ్రిటిష్ సైనికులు అడ్డుపడి, వారి ప్రయత్నాన్ని భగ్నం చేశారు బెంగాల్లో ముస్లిం రైతులు, కౌలుదార్లు తిరగబడి హిందూ జమీందార్ల ఇళ్లమీద దాడి చేశారు అప్పుపత్రాలను చించి తగలబెట్టారు

అహమ్మద్‌నగర్, నాసిక్, చాందా, అమరావతి, సతారా, రాయపూర్, సిరిసి, సిద్దాపూర్ మొదలగు చోట్ల గిరిజనులు పోలీసులమీద, ఫారెస్టు గార్డులమీద తిరగబడ్డారు గంజన్ కొర్కు నాయకత్వాన కొందరు ప్రభుత్వ కార్యాలయాలమీద దాడులు ప్రారంభించారు

ఈ పోరాటాలు ప్రభుత్వాన్ని కలవరపెట్టాయి అందువల్ల గాంధీజీతో రాజీపడి, కాంగ్రెస్ నాయకులను విడిచిపెడితే పరిస్థితి అదుపులోకి వస్తుందని ప్రభుత్వ నేతలు భావించారు

గాంధీజీకూడా పరిస్థితులను సమీక్షించారు ఉద్యమం అదుపుతప్పి పోయిందని గ్రహించాడు అయినా ప్రభుత్వం నుండి తగిన హామీలు లేకుండా ఉద్యమాన్ని విరమించకూడదని నిర్ణయించాడు అయితే ఆ హామీలనెలా సాధించడం? 1930 సెప్టెంబరు వరకూ వున్న పరిస్థితి 1931 జనవరిలో లేదు కాని "బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరుస్తాం" అని బ్రిటిష్ ప్రభుత్వం చెప్పినమాట జాతీయ పెట్టుబడి దారులకొక వరప్రసాదంలా కనిపించింది అందువల్ల వైస్రాయితో రాజీపడవలసిందిగా గాంధీజీని వత్తిడి చేశారు లేకపోతే గ్రామసీమలలో అరాచకం ప్రబలుతుందని భయపడ్డారు

అందుకు మరొక కారణంకూడా వుంది ఆర్థిక మాంద్యంవల్ల అనేకమంది వ్యాపారులు, పారిశ్రామికులు దెబ్బతిన్నారు కొందరు దివాళా తీశారు అలాంటి స్థితిలో తమవద్ద నిలవవున్న విదేశీ సరుకులను విడుదల చేసుకోకుండా కాంగ్రెస్ వలంటీర్స్

అడ్డుపడటం, చీటికి మాటికి హర్తాళ్ళు, బంద్‌లు నిర్వహించడం, జాతీయ పెట్టుబడిదారులకు బాధ కలిగించింది బిర్లా గాంధీజీని సమర్థించినప్పటికీ, టాకూర్ దాస్, లాలాశ్రీరామ్ మున్నగువారు బ్రిటిష్ పెట్టుబడిదారులతో రాజీకి ప్రయత్నించారు

ఏమైతేనేం, గాంధీ–ఇర్విన్ మధ్య రాయబారాలు, సంభాషణలు 1931 ఫిబ్రవరి 17నుండి మార్చి 5 వరకూ సాగాయి మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు నిర్ణయాలను ప్రాతిపదికగా తీసుకొని గాంధీజీ వైస్రాయితో చర్చించాడు

## ఒడంబడిక వివరాలు

ఒడంబడిక ప్రకారం శాసనోల్లంఘన ఉద్యమాన్ని కాంగ్రెస్ అపివేస్తుంది హింసాయుత ఘటనల్లో పాల్గొన్నవారిని మినహా తక్కిన రాజకీయ ఖైదీలను ప్రభుత్వం విడుదల చేస్తుంది స్వంత ఉపయోగానికి ఉప్పు మడుగుల్లోనుండి ఉప్పును తెచ్చుకోడానికి ప్రభుత్వం అనుమతిస్తుంది విదేశీ వస్త్ర దుకాణాలవద్దను, కల్లు సారా దుకాణాల వద్దను శాంతియుతంగా పికెటింగ్ చేస్తే, ప్రభుత్వం పట్టించుకోదు

ఈ ఒడంబడికలో సంపూర్ణ స్వాతంత్ర్య ప్రస్తావనలేదు ఉద్యమానికి ముందు గాంధీజీ సూచించిన 11 సూత్రాల ప్రస్తావనకూడా లేదు ఉప్పు పన్నును రద్దు చేయలేదు హింసా సంఘటనలను అణచడానికంటూ జారీ చేసిన ప్రత్యేక ఆర్డినెన్సులను ఉపసంహరించవలసినదిగా గాంధీజీ కోరినప్పటికీ వైస్రాయి ఒప్పుకోలేదు పన్నులు చెల్లించలేదనే నెపంతో జప్తు చేసిన భూములను తిరిగి ఆయా రైతులకు ఇవ్వాలని గాంధీజీ కోరిన కోర్కెను వైస్రాయి తిరస్కరించాడు కాని కొంతవరకూ భూమి శిస్తును తగ్గించటానికి మాత్రం అంగీకరించాడు రాజీనామా లిచ్చిన గ్రామాధికార్లను, ఇతర ఉద్యోగులను తిరిగి చేర్చుకునే విషయంలో వైస్రాయి ఎలాంటి వాగ్దానం చేయలేదు

1931 మార్చి 5న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం జరిగింది గాంధీ–ఇర్విన్ ఒడంబడిక కాంగ్రెస్‌కు విజయమని కొందరు భావించగా, కొందరు తమ అసంతృప్తిని వెల్లడించారు జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మకథలో ఇలా వ్రాశాడు

“ , ఇక మన లక్ష్యానికి చెందిన ప్రధాన సమస్య స్వాతంత్ర్య సమస్య అది అలాగే మిగిలిపోయింది పైగా ఒడంబడికలోని రెండవ షరతువల్ల ఆ కోర్కె భగ్నం చేయబడిందని నేను భావించాను ఇందుకొరకేనా మన ప్రజలొక ఏడాదిపాటు, అంత ధైర్యస్థైర్యాలతో పోరాడింది? మన ధైర్య వచనాలు, కార్యకలాపాలు ఇంతటితో సమాప్తం కావలసిందేనా? ఈ ఆలోచనతో ఆ రాత్రంతా గడిచింది ఏదో అమూల్య వస్తువు పోయినట్లు, అది తిరిగి లభించబోదు అన్నట్లుగా, నా హృదయంలో శూన్యత ఏర్పడింది ”

నెహ్రూను ఒప్పించడానికి గాంధీజీ చాలా ప్రయత్నించాడు ఒడంబడికలోని రెండవ షరతులో పొందుపరచబడిన “భారతదేశ ప్రయోజనాలకొరకు” అన్న వాక్యమును చూపించి, దాని అర్థాన్ని గాంధీజీ వివరించాడు. “ఆ అర్థం నాకు బలవంతపు బ్రాహ్మణార్థంగా తోచింది అది నాకు నచ్చలేదు” అన్నాడు నెహ్రూ కాని ఒడంబడికకు అంగీకరించాడు

“నేను మానసిక వ్యధతోను, శారీరక బాధతోను ఒడంబడికకు సమ్మతించాను హృదయపూర్వకంగా దాన్ని అమలుజరిపేందుకు అంగీకరించాను” అన్నాడు నెహ్రూ

చివరకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, ఒడంబడికకు తన అంగీకారాన్ని తెలిపింది.

వెంటనే ఒడంబడికపై సంతకాలు జరిగాయి అదొక గొప్ప విజయంగా ప్రజలు భావించారు

చర్చిల్‌లాంటి కరుడుగట్టిన సామ్రాజ్యవాదులకు భారతదేశంలోని నిరంకుశాధికారులకు ఆ ఒడంబడిక కంటకమైంది కాగా చర్చిల్ ఇలా విషం కక్కాడు

"ప్రాచ్య దేశాలలో సుపరిచితమైన ఫకీరు వేషంలో అర్ధ దిగంబరుడుగా కనిపించే రాజద్రోహి, అనామక లాయర్ అయిన గాంధీ, ఒకప్రక్క శాసనోల్లంఘనోద్యమాన్ని సంఘటితం చేస్తూ, మరోప్రక్క చక్రవర్తి ప్రతినిధులతో సమాన హెూదాలో మాట్లాడటానికి వైస్రాయి భవనపు మెట్లు ఎక్కుతున్నాడు ఈ పరిస్థితి చాలా ఆందోళనకరంగానూ, ఏవగింపు కలిగించేదిగానూ వుంది "

## కరాచీ కాంగ్రెస్

1931 మార్చి 29న కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో గాంధీ-ఇర్విన్ ఒడంబడికను ఏకగ్రీవంగా ఆమోదించారు తీర్మానాన్ని జవహర్‌లాల్ స్వయంగా ప్రతిపాదించాడు సుభాష్‌చంద్రబోస్‌కూడా తీర్మానాన్ని బలపరిచాడు "గాంధీజీ కాక మరెవరైనా ఇలాంటి ఒడంబడికను చేసుకుని వుంటే, ఆయనను సముద్రంలోకి త్రోసే వాళ్లం" అంటూ ఒక ప్రతినిధి తన ఆగ్రహాన్ని వెలిబుచ్చాడు "పొరపాటున గాంధీజీ భారతదేశాన్ని అమ్మివేశాడు" అని మరొక ప్రతినిధి విమర్శించాడు భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవుల ఉరిశిక్షలను రద్దు చేయించలేదని కొందరు యువకులు గాంధీజీకి నల్లజెండాలు చూపారు దేశవ్యాప్తంగా అనేకమంది యువకులు ఆగ్రహావేశపరవశులయ్యారు అతివాదులు అసంతృప్తితో కొట్టుమిట్టాడారు

కాగా అతివాదులను సంతృప్తిపరచడానికి ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని కరాచీ కాంగ్రెస్ ఆమోదించింది

## ప్రాథమిక హక్కులు-విధులు

1) భారతదేశంలో ప్రతి పౌరుడూ తన ఇష్టం వచ్చిన సంఘంలో చేరవచ్చు స్వేచ్ఛగా తన అభిప్రాయాన్ని ప్రకటించుకోవచ్చు న్యాయానికి, నీతికి విరుద్ధంగాని పనులకొరకు, నిరాయుధ సమావేశాలు జరుపుకోవచ్చు
2) మతస్వేచ్ఛ వుంటుంది ప్రజలు శాంతికి, నీతికి భంగం లేకుండా ప్రవర్తించాలి
3) మైనారిటీ సంఘాల, ఆయా రాష్ట్ర ప్రజల విజ్ఞానం, భాష, లిపులు రక్షించబడతాయి
4) న్యాయశాస్త్రం ముందు అంతా సమానులే. వర్ణ మత లింగ భేదముండదు
5) ఉద్యోగం, అధికారం, వ్యాపారం, వృత్తులను పొందే అర్హత, కుల మత లింగభేదములపై ఆధారపడి వుండదు
6) ప్రభుత్వానికి చెందిన చెరువులు, రోడ్లు, పాఠశాలలు, బావులు మున్నగువాటిపైన ప్రజలందరికీ హక్కులూ, బాధ్యతలూ వుంటాయి
7) ప్రతి పౌరునికీ శాసనసమ్మతంగా ఆయుధం ధరించే హక్కు వుంటుంది
8) మైనారిటీ తీరినవారందరికీ ఓటింగ్ హక్కుంటుంది
9) ప్రభుత్వం అన్ని మతాలపట్ల తటస్థంగా వుంటుంది
10) దేశమంతటా ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం ప్రవేశపెట్టబడుతుంది

11) ప్రభుత్వం ఎవరికీ బిరుదులు ఇవ్వకూడదు
12) మరణశిక్ష వుండకూడదు
13) న్యాయసమ్మతం లేకుండా ఏ పౌరుని స్వాతంత్ర్యాన్ని హరించకూడదు అతని ఆస్తిని హరించకూడదు
14) ప్రతి పౌరుడు దేశంలో తన ఇష్టం వచ్చిన చోటికి వెళ్లవచ్చు నివసించవచ్చు ఆస్తిని సంపాదించుకోవచ్చు ఇష్టం వచ్చిన వృత్తిని అవలంబించవచ్చు
15) సైన్యం ఖర్చు సగానికి సగం తగ్గించాలి సివిల్ ఉద్యోగుల జీతాలు చాలావరకు తగ్గించాలి పౌరులందరికీ సైనికశిక్షణనివ్వాలి
16) భూమి కౌలు పద్ధతిని శిస్తు పద్ధతిని, సంస్కరించాలి పేద రైతుల కౌలును, శిస్తును తగ్గించాలి రైతుల రుణాలను తీర్చాలి అనుచిత వడ్డీ పద్ధతిని అరికట్టాలి
17) ప్రధాన పరిశ్రమలను, ప్రయాణ సౌకర్యాలను ప్రభుత్వం వశం చేసుకోవాలి
18) ప్రత్యేక శాసనాలద్వారా, తదితర పద్ధతులద్వారా కార్మికులకు తగిన జీవనభృతి కలిగించ-లి కట్టుబానిసత్వాన్ని రూపుమాపాలి. స్త్రీ కార్మికులకు ప్రసూతి సెలవు లివ్వాలి పాఠశాలలకుపోయే వయసుగల పిల్లలను ఫ్యాక్టరీలలో చేర్చుకోకూడదు 8 గంటల పని జీతంతో సెలవులివ్వాలి
19) తమ హక్కుల కొరకు రైతులు, కార్మికులు సంఘాలను ఏర్పరచుకోవచ్చును
20) భారతదేశంలో తయారయ్యే ఉప్పుమీద పన్ను వేయకూడదు

## తిరిగి ప్రారంభమైన దమనకాండ

1931 ఏప్రిల్ 18న ఇర్విన్ స్థానే వైస్రాయ్‌గా లార్డ్ వెల్లింగ్టన్ పదవీ స్వీకారం చేశాడు వెంటనే ప్రభుత్వం గాంధీ-ఇర్విన్ ఒడంబడికను ఉల్లంఘించనారంభించింది

బొంబేలో అనేకమంది సత్యాగ్రహులను విడుదల చేయకుండా నిర్బంధంలోనే వుంచారు బెంగాల్లో విచారణ లేకుండానే జైళ్లకు నెట్టడం ప్రారంభించారు మద్రాసు, ఢిల్లీ మొదలగు ప్రాంతాలలో విద్యార్థులను స్కూళ్లనుండి వెళ్లగొట్టారు

డాక్టర్ అన్సారీని కాంగ్రెస్ ప్రతినిధిగా రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు పంపాలని కాంగ్రెస్ చేసిన సూచనను వైస్రాయి తిరస్కరించాడు ఇతర ముస్లిమ్ ప్రతినిధులు అన్సారీని వ్యతిరేకిస్తున్నారు కాబట్టి, ఆయనను లండన్ పంపడానికి వీలులేదన్నాడు

కాగా గాంధీజీ రౌండ్ టేబుల్ సమావేశానికి వెళ్లనని పట్టుబట్టాడు అందుమీదట గాంధీజీకి-వైస్రాయికి మధ్య సెప్టెంబరులో ఒక సమావేశం జరిగింది గాంధీజీ వెంట పటేల్, నెహ్రూ మున్నగువారు కూడా వున్నారు చివరకు రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో పాల్గొనేందుకు గాంధీజీ అంగీకరించి బొంబాయి వెళ్లాడు అక్కడ ఆయన ఎదుట కార్మికులు నిరసన ప్రదర్శనలు జరిపారు "పదేళ్ల క్రితం అలాంటి ప్రదర్శనలు జరపడం అనూహ్యమైన విషయం" అని టైమ్స్ పత్రిక వ్రాసింది

## రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు

ఈ కాన్ఫరెన్స్ 1931 సెప్టెంబరు నుండి డిసెంబరు వరకూ జరిగింది అందులో కాంగ్రెస్ తరఫున గాంధీజీ ఒక్కడే పాల్గొన్నాడు సరోజినీదేవి, పండిట్ మాలవీయకూడా పాల్గొన్నారు కాని వారు కాంగ్రెస్ ప్రతినిధులుగాగాక ఇతర హెూదాలో పాల్గొన్నారు ఆ

సమావేశంలో ఎక్కువమంది కాంగ్రెస్ ప్రతినిధులు, జాతీయ ముస్లిములు పాల్గొంటే బాగుంటుందని అనేకులు అభిప్రాయపడ్డారు కాని అలా జరగలేదు జాతీయ ముస్లిముల ప్రాతినిధ్యాన్ని జిన్నా, ఆగాఖాన్, జఫ్రుల్లాఖాన్ మున్నగువారు వ్యతిరేకించారు "కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడమే ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వ ధ్యేయం" అని బ్రిటిష్ ప్రధాని రామ్సే మాగ్డోనాల్డు చేసిన ప్రకటనను విశ్వసించిన గాంధీజీ, తానొక్కడే పాల్గొనటానికి అంగీకరించాడు

రామ్సే మాక్డోనాల్డ్ ఏర్పాటుచేయతలపెట్టిన బాధ్యతాయుత ప్రభుత్వానికి దేశరక్షణ, విదేశాంగ విధానం, ఆర్థిక విషయాలపైన అధికారముండదు ఆ అధికారం వైస్రాయిద్వారా బ్రిటిష్ ప్రభుత్వం చేతుల్లోనే వుంటుంది

కేంద్రంలో అలాంటి బలహీన ప్రభుత్వముండడం సంస్థానాధీశులకు అవసరం పైగా ఆ ప్రభుత్వం ఫెడరల్ ప్రభుత్వంగా వుంటుంది గాబట్టి, అందులో సంస్థానాధీశుల ప్రతినిధులుకూడా వుంటారు కనుక సంస్థానాధీశులు బ్రిటిష్ ప్రధాని ప్రకటనను బలపర్చారు లేకపోతే కాంగ్రెస్ ఉద్యమం, కార్మిక కర్షక ఉద్యమాలు బ్రిటిష్ ప్రభుత్వాన్ని లొంగదీస్తాయని, సంపూర్ణ స్వరాజ్యం కాకపోయినా, అధినివేశ ప్రతిపత్తినైనా సాధిస్తాయని, ఆ స్థితిలో కాంగ్రెస్ పాలన తప్పదని భయపడ్డారు

అలాంటి స్థితిలో ప్రారంభమైన రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో గాంధీజీ పాల్గొన్నాడు కాని ఫలితం శూన్యమైంది వివిధ మతాల ప్రతినిధులు వెలిబుచ్చిన గొంతెమ్మ కోరికలు, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వరప్రసాదమయ్యాయి

హిందూ-ముస్లిమ్ ఐక్యత కొరకు సప్రూ చేసిన సూచనను జిన్నా, ఆగాఖాన్ అంగీకరించారు కాని, మూంజీ, జయకరులు అంగీకరించలేదు పంజాబ్‌లో 11 శాతం వరకూ వున్న సిక్కులు 30 శాతం సీట్లు కావాలని డిమాండ్ చేశారు జనాభా ప్రాతిపదికపై అస్పృశ్యులకు రిజర్వేషన్‌లు, ప్రత్యేక నియోజకవర్గాలు కావాలని అంబేద్కర్ పట్టుబట్టాడు ఆంగ్లో ఇండియన్‌లు, ఇండియన్ క్రిస్టియన్‌లు, యూరోపియన్‌లు కూడా ప్రత్యేక నియోజకవర్గాలను డిమాండ్ చేశారు 1931 నవంబర్ 13న, వీరి మధ్య మైనారిటీల ఒప్పందం కూడా జరిగింది.

బ్రిటిష్ పెట్టుబడిదారుల ప్రతినిధి బెంగాల్, ఇండియాలో తాము పెట్టిన పెట్టుబడులకు హామీ కావాలని, తమ వ్యాపార హక్కులకు రక్షణ కావాలని పట్టుబట్టాడు బెంగాల్లో తమకు ఎలాంటి చిక్కులూ కలుగకుండా చూడగలమని ముస్లిమ్ నాయకులనుండి హామీ పొంది, ముస్లిమ్‌ల డిమాండ్లను బలపరిచాడు

మతపరమైన సమస్యలను పరిష్కరించి, ప్రతినిధులనందరినీ ఐక్యపరచి స్వాతంత్ర్య సాధనను సుగమం చేయడానికి గాంధీజీ శతథా ప్రయత్నించాడు.

"మన విభేదాలు విదేశీ పెత్తనంవల్ల మరింత బిగుసుకుపోయాయి కాగా వీటి పరిష్కారం స్వతంత్ర రాజ్యాంగానికి కిరీటమే అవుతుంది స్వాతంత్ర్య భానోదయంతో మత విభేదాలు మంచుగడ్డల్లా కరిగిపోతాయి" అని గాంధీజీ ఎంత వాదించినా ఫలితం శూన్యమైంది జిన్నా, అంబేద్కర్, ఆగాఖాన్ మున్నగువారంతా ఎవరి కోర్కెలను వారు ఏకరువు పెట్టారు

అలా విభజించి పాలించగలుగుతున్నందుకు సామ్రాజ్యవాదులు సంతోషించారు. "రక్షణ, విదేశ వ్యవహారాలు భారతీయులకిస్తే, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గురించి

పట్టుబట్టను" అని గాంధీజీ చేసిన సూచనను సహితం బ్రిటిష్ ప్రభుత్వం తిరస్కరించింది పైగా జిన్నా, అంబేద్కర్, సప్రూలాంటివారి కోరికననుసరించి, కేంద్ర ప్రభుత్వ రూపకల్పనపై జరగవలసిన చర్చలను నిరవధికంగా వాయిదా వేసింది.

చివరకు 1931 డిసెంబరు 1న కాన్ఫరెన్స్ సమావేశాలను ముగించుతూ బ్రిటిష్ ప్రధాని రామ్సే మాగ్డోనాల్డ్ యిలా ప్రకటించాడు

"ముస్లిమ్‌ల మెజారిటీగల సింధు, పశ్చిమోత్తర ప్రాంతాలను ప్రత్యేక రాష్ట్రాలుగా విభజిస్తాం, ఆర్థిక సమస్యలు, రాష్ట్రాల సమస్యలు, ఓటింగ్ హక్కులను పరిశీలించి, తగిన నిర్ణయాలు చేసేందుకు నిపుణుల కమిటీలను ఏర్పాటు చేస్తాం, భారతీయులతో కూడిన ప్రభుత్వ సలహా సంఘాన్ని ఏర్పాటు చేస్తాం వివిధ మతస్థుల మధ్య అంగీకారం కుదరకపోతే, కమ్యూనల్ అవార్డును మేమే ప్రకటిస్తాం "

ఈలోగా ఉద్యమాలను క్రూరంగా అణచివేసేందుకు ప్రభుత్వం సన్నాహాలు ప్రారంభించింది ప్రభుత్వం ప్రారంభించనున్న దమనకాండ స్వరూపం గాంధీజీకి ఇంగ్లండులోనే ప్రత్యక్షమైంది కాన్ఫరెన్స్ ప్రతినిధులను బకింగ్‌హాం రాజభవనంలో విందుకు చక్రవర్తి ఆహ్వానించాడు ఆ సమయంలో గాంధీజీతో చక్రవర్తి యిలా అన్నాడు

"1918 వరకూ మీరు మంచివారే కాని తరువాత ఏదో పొరబాటువల్ల మీరు మారిపోయారు" అన్నాడు గాంధీజీ మాట్లాడలేదు

"నా కుమారుడు వేల్సు యువరాజును మీరెందుకు బహిష్కరించారు?" అని చక్రవర్తి ప్రశ్నించినపుడు "బహిష్కరించింది మీ కుమారుణ్ణికాదు మహాశయా! బ్రిటిష్ సింహాసనపు అధికార ప్రతినిధిని" అని గాంధీజీ సమాధానమిచ్చాడు

భారతదేశంలో తిరుగుబాటును తాను సహించనని చక్రవర్తి హెచ్చరించినపుడు గాంధీజీ మర్యాదగా "ఈ అంశంపై తమతో వాదించుతానని తమరు ఆశించకండి" అని జవాబిచ్చాడు

అటుతరువాత బ్రిటిష్ ప్రభుత్వం చేపట్టనున్న దమననీతికి చక్రవర్తి హెచ్చరిక ఒక సూచనగా భావింపబడింది రిక్తహస్తాలతో గాంధీజీ 1931 డిసెంబర్ 28న భారతదేశానికి తిరిగి వచ్చాడు అయినా తిరిగి పోరాటానికి గాంధీజీ సన్నద్ధుడు కాలేదు తన శక్తినంతా వినియోగించి శాంతి కొరకు కృషి జేస్తానని భారత్ కార్యాలయానికొక తంతివార్తను పంపించాడు

## ఆర్డినెన్సులమీద ఆర్డినెన్సులు

గాంధీజీ భారతదేశానికి మరొక ఐదు రోజుల్లో వస్తాడనగా, జవహర్‌లాల్ నెహ్రూ, పురుషోత్తమదాస్ టాండన్, ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్, డాక్టర్ ఖాన్ సాహెబ్ మున్నగు నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఉత్తరప్రదేశ్, బెంగాల్, వాయవ్య రాష్ట్రాలలో అత్యవసర ఆర్డినెన్సులను జారీచేసి, వాయవ్య రాష్ట్రంలో సైనిక పాలన ప్రవేశపెట్టింది

బెంగాల్లోనున్న యూరోపియన్లు గూండాలను సమీకరించుకొని చిట్టగాంగ్ పట్టణంమీదపడి, జాతీయవాదుల ఇళ్లను లూటీ చేశారు బార్డోలీ రైతులమీద పోలీసుల అత్యాచారాలు మితిమీరాయి ఖరగ్‌పూర్ సమీపంలోని హిజిలీ జైల్లోనున్న డిటెన్యూలమీద పోలీసులు లాఠీఛార్జీచేసి, తుపాకులు కాల్చారు కాగా, ఇద్దరు డిటెన్యూలు చనిపోయారు 20 మంది గాయపడ్డారు ఆంధ్రలో రైతులు పన్నులు చెల్లించకపోతే ఆర్డినెన్సును జారీ

చేస్తానని మద్రాసు గవర్నర్ బెదిరించాడు

ఈ స్థితిలో గాంధీజీ వైస్రాయితో ఇంటర్వ్యూ కోరాడు "తన సహచరుల చర్యలను గాంధీ ఖండిస్తే, బెంగాల్, యు పి, వాయవ్య రాష్ట్రాల పరిస్థితిని గూర్చి అడగకుండా వుంటే, ఇంటర్వ్యూకు సమ్మతిస్తాను" అని వైస్రాయ్ జవాబిచ్చాడు అందుకు గాంధీజీ అంగీకరించలేదు

కాగా, 1932 జనవరి ప్రారంభంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమై, తిరిగి శాసనోల్లంఘనం ప్రారంభించుటకు నిర్ణయించింది ఆ తీర్మానాన్ని వైస్రాయికి వివరించేందుకు గాంధీజీ ప్రయత్నించాడు కాని గాంధీజీని కలుసుకునేందుకు వైస్రాయి ఇష్టపడలేదు

జనవరి మూడవతేదీ అర్ధరాత్రి సమయంలో గాంధీజీతోపాటు ప్రముఖ కాంగ్రెస్ నాయకులందరినీ ప్రభుత్వం అరెస్టు చేసింది కాంగ్రెసునూ, దాని అనుబంధ సంస్థలనూ నిషేధించింది కాంగ్రెస్ నిధులను, ఆఫీసులను స్వాధీనం చేసుకున్నది అటుపైన 13 ఆర్డినెన్సులను జారీచేసింది

జనవరి 10 నాటికి కాంగ్రెస్ నాయకులందరూ అరెస్టయ్యారు యువజన సంఘాలు, విద్యార్థి సంఘాలు, జాతీయ పాఠశాలలు, సంస్థలు, కాంగ్రెస్‌వాదుల ఆసుపత్రులు, స్వదేశీ సంస్థలు, పుస్తక భాండాగారాలుకూడా నిషేధించబడినాయి పిల్లలు నేరం చేస్తే, వారి తల్లిదండ్రులను శిక్షించడానికొక ఆర్డినెన్స్‌ను ప్రకటించారు కాంగ్రెస్ వారికి భోజనం పెట్టినా, మంచినీరిచ్చినా శిక్షించారు గాంధీటోపీ పెట్టుకుంటే చాలు-జైలుకు నెట్టారు

"ఈ ఆర్డినెన్సులు చాలా కఠినమైనవీ, తీవ్రమైనవీ" అని సర్ సామ్యూల్ హెూర్ కామన్స్ సభలో అంగీకరించాడు కానీ "ఇది జరిగీచిన పోరాటం కాదు" అన్నాడు

"కృత్రిమ నిబంధనలతో మేం ఆటలాడడం లేదు ఈ ఆర్డినెన్సులకు కాలపరిమితి లేదు" అన్నాడు భారత ప్రభుత్వ హెూం శాఖ సభ్యుడు "రబ్బరు తొడుగులతో (గ్లోవ్స్‌తో) ఎవరూ యుద్ధం చేయరు" అన్నాడు బాంబే ప్రతినిధి

సిపాయీల తిరుగుబాటు నాటికన్నా ఈ ఆర్డినెన్సులు కఠినంగా వున్నాయని చర్చిల్ సహితం అంగీకరించాడు "నేనూ ఒకరకంగా భారతదేశంలో ముస్సోలినీని అవుతున్నాను" అని వైస్రాయ్ వెల్లింగ్‌డన్ సిగ్గులేకుండా చెప్పుకున్నాడు

భారతదేశంలోని పరిస్థితులను తెలుసుకోవడానికి, ఇంగ్లండులోవున్న ఇండియాలీగ్ వారొక కమిటీని పంపారు అందులో బ్రిటిష్ లేబర్ పార్టీకి చెందిన కామన్స్ సభ సభ్యుడు ఎల్లెన్ విల్కిన్‌సన్, లియోనార్డ్ మేటర్స్, వి కె కృష్ణమీనన్ సభ్యులు వారు భారతదేశంలో పర్యటించి ఒక నివేదిను తయారుచేశారు అది 1933లో లండన్‌లో ప్రకటించబడింది అందులో, సామ్రాజ్యవాదుల దురంతాలను యిలా వివరించారు

"బ్రిటిష్ ప్రజలు నమ్ముతున్నట్టుగా భారతదేశంలో స్వేచ్ఛగాని, రక్షణగాని లేవు మార్షల్‌లా పరిస్థితులు నెలకొని వున్నాయి పోలీసుల స్థానంలో సైనికులను ఉపయోగిస్తున్నారు రైత్వారీ గ్రామాలలో సైనిక క్యాంపులు పెట్టారు సైనికులు పహరా తిరుగుతూ, తమ ఆజ్ఞలకు జవాబివ్వని రైతులను కాల్చిచంపిన ఘటనలున్నాయి క్రూరంగా లాఠీఛార్జి చేసి సభలను చెదరగొట్టడం; జైళ్లలోని సత్యాగ్రహులను నానావిధమైన బాధలకు గురిచేయడం, సత్యాగ్రహుల గోళ్లలో సూదులు గుచ్చడం; వారి బంధువులను,

ఇరుగుపొరుగువారినికూడా బాధించడం, గ్రామాలలో సాముహిక జరిమానాలు విధించడం, కొన్ని సందర్భాలలో స్త్రీలను వివస్త్రలను చేసి మానభంగం చేయడంవంటి ఘోరకృత్యాలు జరుగుతున్నాయి

"జెండా ప్రతిష్టాపన ఒక నేరం ఖద్దరు వస్త్రధారణ అపరాధం హర్తాళ్ల సమయంలో దుకాణాలు మూసివేయడం శిక్షార్హం పత్రికలపైన సెన్సార్ షిప్పు విధించబడింది ఉత్తరాలు సెన్సారు చేయడం, నిలిపివేయడం పరిపాటి అయింది స్వస్థలాలనుండి ప్రజలను వెళ్లగొట్టడం, ఫలానా చోటనే వుండాలని నిర్బంధించడం, ప్రజల ఆస్తులను స్వాధీనం చేసుకోవడం, కొన్నిచోట్ల ప్రజల ఆస్తులను కొల్లగొట్టడం, అసలు విచారణ లేకుండానే జైళ్లకు నెట్టడం సర్వసాధారణమైపోయాయి క్రిమినల్ ఖైదీలకన్నా హీనంగా రాజకీయ ఖైదీలను చూడాలంటూ ప్రభుత్వమొక రహస్య సర్క్యులర్‌ను జారీచేసింది జైళ్లలోని రాజకీయ ఖైదీలను కొరడాలతో కొడుతున్నారు "

అలా ప్రభుత్వమెన్ని ఘోరకృత్యాలకు పాల్పడినా దేశభక్తులు లొంగలేదు ప్రభుత్వ చట్టాలను ఎన్ని విధాలుగా ఉల్లంఘించడానికి వీలైతే అన్ని విధాలుగానూ ఉల్లంఘించారు గాంధీటోపీలు ధరించి కొందరు, ఖద్దరు గుడ్డలు కట్టుకొని కొందరు అరెస్టయ్యారు కొందరు సారా దుకాణాలవద్ద పికెటింగ్‌చేసి అరెస్టయితే, మరికొందరు జాతీయ పతాకాలను ఎగరవేసి అరెస్టయ్యారు. కొందరు రహస్యంగా కరపత్రాలు అచ్చువేసి పంచిపెట్టి అరెస్టయ్యారు కాగా జైళ్లు నిండిపోయాయి తాత్కాలికంగా ఏర్పాటుచేసిన జైళ్లుకూడా చాలలేదు కాబట్టి పోలీసులు సత్యాగ్రహులను లారీలతో బాది, తీసుకుపోయి దూరప్రాంతాలలో విడిచిపెట్టేవారు వారికి అన్నం పెట్టినవారిని శిక్షించేవారు

## ఢిల్లీ కాంగ్రెస్ మహాసభ

ప్రభుత్వమెన్ని నిర్బంధాలు విధించినా, మరెన్ని కట్టుదిట్టాలు చేసినా, 1932 ఏప్రిల్ 24న ఢిల్లీలో కాంగ్రెస్ మహాసభ జరిగింది ఆ సభకు అధ్యక్షత వహించవలసిన మదనమోహన్ మాళవీయాను పోలీసులు అరెస్టు చేసినప్పటికీ, 500 మంది కాంగ్రెస్ ప్రతినిధులు కలసి, ఢిల్లీలోని క్లాక్‌టవర్ కింద సభ జరిపారు ఆ సభకు సేఠ్ రణచోడ్‌దాస్ అమృతలాల్ అధక్షత వహించాడు

సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్షను మహాసభ పునరుద్ఘాటించింది శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఆమోదించింది గాంధీజీ నాయకత్వంలోను, అహింసా సిద్ధాంతంలోను విశ్వాసాన్ని ప్రకటించింది

సభ జరిగేచోటికి పోలీసులు వచ్చేటప్పటికే పై తీర్మానాలు ఆమోదింపబడినాయి వెంటనే ప్రతినిధులందరూ ఎవరి మార్గాన వారు వెళ్లిపోయారు కాని తిరుగుప్రయాణంలో కొందరిని పోలీసులు అరెస్టుచేసి, మేనెల 1న విడుదల చేశారు ఇలాగే రాష్ట్ర, జిల్లా సభలుకూడా అనేకచోట్ల జరిగాయి

అందువల్ల ప్రభుత్వ నిర్బంధాలు మరీ పెరిగిపోయాయి. 1932 జనవరినుండి 1933 మార్చి లోపల 1,20,000 మంది సత్యాగ్రహులను ప్రభుత్వం అరెస్టు చేసింది ఒక్క పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలోనే ఆరువేలకుపైగా అరెస్టయ్యారు దేశం మొత్తంమీద అరెస్టయినవారిలో 3,630 మంది మహిళలుండడం గమనార్హం

దమనకాండ ఎంత తీవ్రంగా వున్నా అనేకచోట్ల రైతుకూలీ గిరిజన ప్రజలు

లొంగలేదు 1931లో జరిగిన గాంధీ-ఇర్విన్ ఒడంబడికవల్ల ఖేడా, బార్డోలీ మున్నగుచోట్ల పన్నుల నిరాకరణోద్యమ ఉధృతి తగ్గినప్పటికీ, పూర్తిగా ఆగిపోలేదు 1932 ఫిబ్రవరి నాటికికూడా అనేక గ్రామాల రైతులు పన్నులు చెల్లించలేదు 1933లో సహితం "రాస్" అనే గ్రామ రైతులు పన్నులు చెల్లించనందున, ఆ గ్రామంలోని పట్టాదార్లకు చెందిన రెండువేల ఎకరాల భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది కొందరు పట్టాదార్లను పోలీసులు అరెస్టుచేసి, వారి గుడ్డలు ఊడదీసి, చింత బరికెలతో వీపులు చిట్లగొట్టినా వారు లొంగలేదు ఎలక్ట్రిక్ షాక్‌లకు గురిచేసినా లొంగలేదు

కర్ణాటకలోని అంకోలా, సిద్దపూర్ తాలూకాలలో రెండు వందల గ్రామాల రైతులు పన్నులు చెల్లించలేదు అంకోలా తాలూకాలో నాలుగువేలమంది ప్రజలు కలిసి ఫారెస్టుగార్డులను ధిక్కరించి అడవిలో కట్టెలు కొట్టి అమ్ముకున్నారు మధ్యప్రదేశ్‌లోను, కేరళలోను అటవీ సత్యాగ్రహం కొనసాగింది. బీహార్‌లో పోలీస్ స్టేషన్లమీద వేలాది ప్రజలు గుమిగూడి దాడులు సాగించారు

ఆంధ్రా కోస్తా జిల్లాలలో రీ సెటిల్‌మెంట్ వ్యతిరేక ఉద్యమం కొనసాగింది

బెంగాల్లోని అనేక జిల్లాలలో చౌకీదారు పన్నుతోపాటు భూమిశిస్తు, కవులు మక్తాల నిరాకరణోద్యమం ప్రబలమైంది అయినా కాంగ్రెస్ నాయకులా ఉద్యమానికి నాయకత్వం వహించలేకపోయారు కాగా ముస్లిమ్ ప్రజా ఉద్యమం బలపడింది 1932 డిసెంబర్‌లో మౌలానా భషాని ఒక పెద్ద ప్రజాసమ్మేళనాన్ని సిరాజ్‌గంజ్‌లో ఏర్పాటు చేశాదు ఆ సమ్మేళనం జమీందారీ పద్ధతిని రద్దు చేయాలని, పన్నులు శిస్తులు తగ్గించాలని, ఋణాలు రద్దు చేయాలని డిమాండ్ చేసింది

అదే సమయంలో బెంగాల్లో 104 టెర్రరిస్టు దాడులు జరిగాయి ఇద్దరు జిల్లా కలెక్టర్లు టెర్రరిస్టుల తుపాకి గుండ్లకు గురై మరణించారు గవర్నర్ జాక్సన్‌మీద కాల్పులు జరిగాయి కాగా ప్రభుత్వం మూదువేలమందిని అరెస్టుచేసి బుక్సా, హజరి, దియోలి క్యాంప్‌జైళ్ళలో నిర్బంధించింది చిటగాంగ్ వీరులలో కొందరిని ఉరితీసి, తక్కినవారిని అండమాన్ దీవులకు నెట్టింది

1932 అక్టోబర్‌లో కాశ్మీర్‌లో ముస్లిమ్ కాన్ఫరెన్స్‌ను స్థాపించారు (మరొక ఆరేళ్ల తరువాత ముస్లిమ్ కాన్ఫరెన్స్ పేరును నేషనల్ కాన్ఫరెన్స్‌గా మార్చారు ) జమ్మూ ప్రాంతంలో పి ఎన్ బజాజ్ నాయకత్వానగల హిందూ ప్రజాస్వామ్యవాదులతో షేక్ అబ్దుల్లా చేతులు కలిపాదు కాగా కాశ్మీర్ మహారాజు పాలనకు వ్యతిరేకంగా బలమైన ప్రజా ఉద్యమం ప్రారంభమైంది

1933 ప్రారంభంలో రాజస్థాన్‌లోని అల్వార్ సంస్థానంలో మేవోతెగ ప్రజలు గెరిల్లా పోరాటం ప్రారంభించారు అడవి పుల్లరిని, పన్నులను తగ్గించేందుకు నిరాకరించిన మహారాజాకు వ్యతిరేకంగా ప్రారంభమైన గెరిల్లా పోరాటం క్రమంగా ఉధృతమైంది "అల్వార్ సంస్థాన పరిస్థితి అధ్వాన్నంగా తయారైంది" అని వైస్రాయి వెల్లింగ్డన్ లండన్‌కు రిపోర్టు పంపాదు "మేవో ప్రజల గెరిల్లా పోరాటంలో 90వేల మంది పాల్గొంటున్నారు" అని ఇండియన్ మాన్యుయల్ రిజిష్టర్ నమోదు చేసింది మార్క్సిస్టు చరిత్రకారుడైన కె ఎం అష్రాఫ్, సయ్యద్ ముతలాబి ఫరిదాబాదివంటివారి నాయకత్వాన గెరిల్లా పోరాటం విజయమందే దశకు చేరుకున్నది కాగా, మహారాజును బ్రిటన్‌కు పంపి, అల్వార్ సంస్థాన పాలనను ప్రభుత్వం చేపట్టింది ఒకవైపున ఆర్థికమాంద్యం, మరోవైపున పన్నుల

పెంపుదలవల్ల సామాన్య ప్రజల జీవితం దుర్భరమైంది కనుకనే అనేకచోట్ల వారు తెగించి పోరాడవలసి వచ్చింది కాగా ప్రజల పోరాటాలు గాంధీజీ విధించిన పరిధులను దాటాయి "గాంధీజీ నిర్దేశించిన సత్యాగ్రహపు రోజులు మారాయి" అన్నాడు హార్డిమన్

## కమ్యూనల్ అవార్డు

1932 ప్రారంభంలో బ్రిటిష్ ప్రధాని రామ్సే మాక్డోనాల్డ్ కమ్యూనల్ అవార్డును ప్రకటించాడు భారతదేశంలోని వివిధ మతస్తులకు రాజ్యాంగంలో కల్పించబోయే ప్రాతినిధ్యాన్ని వివరించాడు. పంజాబ్‌లో 49 శాతం సీట్లను, బెంగాల్లో 48 6 శాతం సీట్లను ముస్లిమ్‌లకు రిజర్వు చేశాడు ముస్లిమ్‌లతోపాటు క్రైస్తవులకు, ఆంగ్లో ఇండియన్లకు, యూరోపియన్లకు, సిక్కులకు, హరిజనులకుకూడా ప్రత్యేక ప్రాతినిధ్యముంటుందని ప్రకటించాడు

ఆ సమయంలో గాంధీజీ జైల్లో వున్నాడు అయినా హిందువులైన హరిజనులను వేరు చేయాలనే బ్రిటిష్ కుతంత్రాన్ని ఎదిరిస్తూ 1932 సెప్టెంబరులో ఆమరణ నిరాహారదీక్ష పూనాడు గాంధీజీకి-హరిజన నాయకులకు మధ్య అంగీకారం కుదిరితే అవార్డును సవరిస్తానని మాక్డోనాల్డ్ ప్రకటించాడు కాగా మాళవీయా చొరవతో హరిజన నాయకులకు, అగ్రవర్ణాల నాయకులకు మధ్య సమావేశం జరిగింది డాక్టర్ అంబేద్కర్ రాజీకి అంగీకరించాడు అప్పుడు జరిగిన ఒడంబడిక పూనా ఒడంబడికగా ప్రసిద్ధి చెందింది హరిజనులకు బ్రిటిష్ ప్రధాని రిజర్వు చేసిన స్థానాలకంటే ఎక్కువ స్థానాలు ఆ ఒడంబడికద్వారా లభించాయి కాని ప్రత్యేక నియోజకవర్గాలకు బదులు సంయుక్త నియోజక వర్గాలేర్పడ్డాయి ఆ రిజర్వేషన్లు నేటికీ అమలుజరుగుతున్నాయి

## కలకత్తా కాంగ్రెస్ మహాసభ

ప్రభుత్వ నిషేధమున్నప్పటికీ ఢిల్లీలో మాదిరిగానే కలకత్తాలోకూడా 1933 మార్చి 31న కాంగ్రెస్ మహాసభ జరిగింది వివిధ రాష్ట్రాలనుండి 2,200 మంది ప్రతినిధులు ఆ సభకు ఎన్నికయ్యారు సభకు అధ్యక్షత వహించవలసిన మాళవీయాను అసన్‌సోల్ రైల్వేస్టేషన్‌లో పోలీసులు అరెస్టు చేశారు అలాగే ప్రతినిధులలో వేయిమందిని దారిలోనే అరెస్టుచేశారు అయినా ఆణే అధ్యక్షతన సభ జరిగింది బ్రిటిష్ ప్రభుత్వం శ్వేతపత్రంద్వారా తెలియజేసిన రాజ్యాంగ ప్రణాళిక భారతీయులకు అంగీకారం కాదని మహాసభ స్పష్టం చేసింది మరికొన్ని తీర్మానాలతోపాటు, కరాచీ కాంగ్రెస్ ఆమోదించిన ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని ప్రజలకు వివరించాలనే తీర్మానాన్నికూడా ఆమోదించింది ఆ సమయంలో దాడి చేసిన పోలీసులు డాక్టర్ సయ్యద్ మహమ్మద్, ఆణే మున్నగువారితోపాటు మోతీలాల్ నెహ్రూ భార్య స్వరూపరాణినికూడా అరెస్టు చేశారు.

ఒకవైపున రైతులు, గిరిజనులు సాగించే పోరాటాలకు, సత్యాగ్రహ సిద్ధాంతానికి సంబంధం లేకుండా పోతోంటే, మరోవైపు పట్టణాలలోని ధనికవర్గాల ఊగిసలాట ప్రారంభమైంది

1932 పొడవునా గుజరాతీ వర్తకులు సత్యాగ్రహ పోరాటాన్ని బలపరిచినందున బొంబేలో ఉద్యమం గణనీయంగా కొనసాగింది బ్రిటిష్ పెట్టుబడిదారులతో చేతులు కలిపేందుకు ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛేంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీవారు

నిరాకరించారు కాని అనేక వ్యాపార సంస్థలు తెచ్చిన వత్తిడివల్ల ఎఫ్ ఐ సి సి ఐ మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌ను బహిష్కరించిందని, బ్రిటిష్ పెట్టుబడిదారులతో సహకరించే విషయంలో తలుపులు పూర్తిగా మూసివేయలేదని జి డి బిర్లా ఇండియా కార్యదర్శికి విన్నవించాడు (ఇన్ ది షాడో ఆఫ్ మహాత్మా )

బిర్లా చెప్పినట్లే జరిగింది సత్యాగ్రహోద్యమం తగ్గిపోతున్న దశలో కొందరు భారతీయ వ్యాపారులు బ్రిటిష్ వ్యాపారులతో చేతులు కలిపేందుకు సిద్ధమయ్యారు అటుపిమ్మట లీస్-మోడీ ఒడంబడిక జరిగింది బ్రిటిష్ స్టీల్ కంపెనీతో టాటా మరొక ఒడంబడిక చేసుకున్నాడు రాజకీయ రంగంలోకూడా ఏదో ఒక అవగాహనకు రావడం మంచిదని టాకూర్ దాస్ ప్రచారం ప్రారంభించాడు ప్రభుత్వానికీ గాంధీజీకి మధ్య జి డి బిర్లా రాయబారాలు సాగించాడు

అయినా భారతీయ పెట్టుబడిదారులకు-బ్రిటిష్ పెట్టుబడి దారులకు మధ్య పూర్తి సహకారమేర్పడలేదు పౌనుకు రూపాయికి మధ్యగల మారకపురేటు 1 షిల్లింగ్ 6 పెన్నీలనుండి, 1 షిల్లింగ్ 4 పెన్నీలకు తగ్గించేందుకు బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించడం భారతీయ పెట్టుబడిదారులకు కోపకారణమైంది

1931లో బ్రిటిష్ ప్రభుత్వం బంగారానికి స్టెర్లింగ్‌కుగల సంబంధాన్ని తొలగించిన పిమ్మట ఇండియాలో బంగారం ధర బాగా తగ్గిపోయింది అయినా అప్పుల పాలైన రైతులు తమవద్దగల బంగారమంతా అమ్ముకోవలసి వచ్చింది అలా అమ్ముకున్న బంగారం బ్రిటనుకు చేరడంవల్ల, ఆర్థికమాంద్యంనుండి బ్రిటన్ బయటపడగలిగింది ఈ దుర్మార్గాన్ని అందరూ ఖండించారు బాంబేనుండి బ్రిటనుకు బంగారం ఎగుమతి చేయబడకుండా నిలిపేందుకు కాంగ్రెస్ వలంటీర్లు విశ్వప్రయత్నం చేశారు అయినా ఫలితం శూన్యమైంది "ఈ అవినీతికర రహస్య వ్యాపారంద్వారా టాకూర్‌దాస్, బిర్లాలు లక్షలు గడించారు" (బాంబే కాంగ్రెస్ బులెటిన్, 1932 అక్టోబరు 17).

ఇలా తమ లాభాలకొరకు భారతీయ పెట్టుబడిదారులు ఒక్కొక్కప్పుడు బ్రిటిష్ పెట్టుబడిదారులతో చేతులు కలపడం, మరొకప్పుడు వ్యతిరేకించడం జగమెరిగిన సత్యం జాతీయోద్యమాన్ని బలపరచడంలో కూడా వారి స్వార్థం ఇమిడివుంది కనుకనే లాల్‌జీ నరాన్‌జీ, ఎం ఆర్ జయకర్‌తో యిలా అన్నాడు

"వ్యాపార దృక్పథంగల నాకు గాంధీజీ అనుసరిస్తున్న పద్ధతులమీద నమ్మకం కుదిరింది. ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం మమ్మల్ని కాంగ్రెస్‌లాంటి సోషలిస్టు ఆర్గనైజేషన్‌వైపుకు నెట్టింది అయినా మేము తాత్కాలికంగానే, కొంతవరకుమాత్రమే కాంగ్రెసును బలపరుస్తున్నాం కాని బంగారం ఎగుమతిని ప్రభుత్వం నిలిపివేస్తే, బ్యాంకులు, ఇన్సూరెన్స్ కంపెనీలు, నౌకాయాన సంస్థల విషయంలో బ్రిటిష్ పెట్టుబడిదారులకుగల గుత్తాధికారాన్ని సడలిస్తే, కరెన్సీ ఎక్స్ఛేంజ్ పాలజీని సవరిస్తే, జౌళి మిల్లులకు రక్షణ కల్పిస్తే సత్యాగ్రహ ఉద్యమాన్ని కాంగ్రెస్ విరమిస్తుందని నేను భావిస్తున్నాను ఎందువల్లనంటే, ఉద్యమంమీద కాంగ్రెస్ నాయకులకంత మక్కువలేదు కనుక మా కోరికలకు ప్రభుత్వం అంగీకరిస్తే, కాంగ్రెస్ నాయకులు- ముఖ్యంగా మహాత్మాజీ ఉద్యమాన్ని విరమించడం ఖాయం" (ఎం ఆర్ జయకర్ పత్రాలు, ఎఫ్ ఎన్ 456)

జాతీయ పెట్టుబడిదారుల ప్రయత్నాలు ఎలా వున్నప్పటికీ, వారికి, బ్రిటిష్ పెట్టుబడిదారులకు మధ్య సహకారం సాధ్యం కాలేదు. విన్‌స్టన్ చర్చిల్ నాయకత్వాన

బ్రిటిష్ వ్యాపారవర్గాలవారు ప్రభుత్వంమీద గట్టి వత్తిడి తెచ్చారు దేశీయ పెట్టుబడిదారుల హక్కులకు భంగకరమైన చర్యలను ప్రభుత్వం చేపట్టింది కాగా టాకూర్‌దాసుకు బిర్లా ఈ విధంగా వ్రాశాడు

"లాంక్‌షైర్ పెట్టుబడిదారులు మానవ రక్తాన్ని చవిచూచారు కాబట్టి వారు మోడీ-లీస్ ఒడంబడికతోనైనా సంతృప్తి చెందడంలేదు" (టాకూర్‌దాస్ పత్రాలు).

బ్రిటిష్ పెట్టుబడిదారులకు అనుకూలంగా ప్రభుత్వం చేపట్టిన చర్యలవల్ల, ప్రభుత్వ కనుసన్నలలో మెలిగే భారతీయ పెట్టుబడిదారులు కళ్లు తెరిచారు సత్యాగ్రహోద్యమం అణచివేయబడడంవల్ల, ఉద్యమాన్ని బలపరిచిన పెట్టుబడిదారులు పునరాలోచనలో పడ్డారు కాగా ఇరువర్గాల పెట్టుబడిదారుల మధ్య పునరైక్యత సాధ్యమైంది దేశీయ పెట్టుబడిదారులతో కలిసి జాయింట్ కంపెనీలను స్థాపించడంద్వారా, తమ ఉనికిని భద్రపరుచుకోదలచి సామ్రాజ్యవాదుల కుట్రలు భగ్నమయ్యాయి

## హరిజనోద్ధరణ

హరిజనుల సంక్షేమంకొరకు, ఆత్మపరిశుద్ధతకొరకు గాంధీజీ 1933 మే 8 నుండి మూడు వారాలపాటు ఉపవాసం చేశాడు ప్రభుత్వం గాంధీజీని విడుదల చేసింది

గాంధీజీ సలహాపైన, కాంగ్రెస్ తాత్కాలిక అధ్యక్షుడు అణే ఆరువారాలపాటు ఉద్యమాన్ని ఆపివేశాడు దేశంలో శాంతి కావాలనుకొంటే సత్యాగ్రహులను విడుదల చేయవలసిందిగా గాంధీజీ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు ఆ విజ్ఞప్తిని ప్రభుత్వం తిరస్కరించింది ఆరువారాల తరువాత గాంధీజీ వైస్రాయితో ఇంటర్వ్యూ కోరాడు "ప్రభుత్వాన్ని ప్రతిఘటిస్తున్న వారితో సంప్రదింపులు సాగించదలచుకోలేదు" అని వైస్రాయి జవాబిచ్చాడు

అణేతోను, అందుబాటులోవున్న కాంగ్రెస్ నాయకులతోను సంప్రదించిన పిమ్మట గాంధీజీ సామూహిక సత్యాగ్రహాన్ని రద్దుచేసి, వ్యక్తి సత్యాగ్రహాన్ని ప్రారంభించుటకు నిర్ణయించాడు "శాసనోల్లంఘనం చేసేవారు తమ స్వంత బాధ్యతమీదనే చేయాలి ఉద్యమం బహిరంగంగా వుండాలి పన్నుల నిరాకరణ ఉద్యమాలను విరమించాలి" అని శాసించాడు

1933 ఆగస్టు 1న వ్యక్తిగత సత్యాగ్రహ ఉద్యమాన్ని ప్రారంభించాలని గాంధీజీ నిర్ణయించాడు కాని అంతకుముందే గాంధీజీని, మరొక 34 మంది ఆశ్రమవాసులను ప్రభుత్వం అరెస్టుచేసి, నాలుగు రోజుల తరువాత విడిచిపెట్టి, పూనాలో నివసించవలసిందిగా గాంధీజీని శాసించింది అందుకు ఆయన తిరస్కరించడంవల్ల ప్రభుత్వం ఆయనకు ఏడాది శిక్ష విధించింది అందువల్ల వందలాది సత్యాగ్రహులు వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించారు 1933 ఆగస్టులో ప్రారంభమైన వ్యక్తి సత్యాగ్రహం 1934 మార్చిదాకా కొనసాగింది

జైల్లో వున్న గాంధీజీ ఆగస్టు 16న నిరశన వ్రతం ప్రారంభించాడు హరిజన సేవా కార్యక్రమాలను కొనసాగించుటకు అవకాశం లేకుండా చేసిన ప్రభుత్వ చర్యకు వ్యతిరేకంగా ఆ నిరశన వ్రతం ప్రారంభమైంది ప్రారంభమైన వారం రోజులలోనే గాంధీజీ పరిస్థితి క్షీణించింది అందువల్ల ప్రభుత్వమాయనను విడుదల చేసింది 1934 మే 19న శాసనోల్లంఘన ఉద్యమాన్ని కాంగ్రెస్ విరమించింది కాంగ్రెస్‌పైనగల నిషేధాన్ని

జూన్‌లో ప్రభుత్వం తొలగించింది కాని యువజన సంఘాలపైన, రెడ్‌షర్ట్ వాలంటీర్లపైన, రైతు సంఘాలపైనగల నిషేధాలను తొలగించలేదు అంతటితో సంతృప్తిచెందక జూలైలో కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది

కాంగ్రెస్ సభ్యత్వానికి గాంధీజీ రాజీనామా చేసి, తన సర్వశక్తులను హరిజన సేవకు అంకితం చేశాడు 1932 సెప్టెంబరులో ప్రారంభించిన అస్పృశ్యతా నివారణ సంఘ కార్యక్రమాన్ని బలపరుస్తూ 1933 జనవరిలో ప్రారంభించిన హరిజన్ వారపత్రికలో వ్యాసాలు వ్రాస్తూ, దేశంలోని పలు ప్రాంతాలలో (12,500 మైళ్లమేర) సంచరించి, హరిజనోద్ధరణ ఆవశ్యకతను నొక్కిచెప్పాడు



# గాంధీజీ కారుమీద సనాతనుల బాంబు

హరిజన సేవకు గాంధీజీ అంకితంగావడం అనేకమందికి రుచించలేదు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం దారి తప్పే ప్రమాదం కలగవచ్చునని జవహర్‌లాల్ నెహ్రూ భావించాడు గాంధీజీ జైల్లో వున్నప్పుడే హరిజన సేవా కార్యక్రమాలను నిర్వహించుటకు అనుమతించడంద్వారా, ప్రభుత్వం ఏదో కుట్ర పన్నుతున్నదనే అనుమానం కాంగ్రెస్ నాయకుల్లో రేకెత్తింది

"అస్పృశ్యతా నివారణ, హరిజనుల దేవాలయ ప్రవేశం మాత్రమే గాంధీజీ చేపట్టిన కార్యక్రమాలు హరిజనుల పేదరికాన్ని తొలగించుటకు గాంధీజీ పూనుకోలేదు పైగా సహపంక్తి భోజనాల విషయంలోను, హరిజనులకు అగ్రవర్ణాలకు మధ్య వివాహాల విషయంలోను, ఎవరినీ నొప్పించకుండా, జాగ్రత్తగా అడుగు వేయవలసిందిగా హరిజన సంఘ కార్యకర్తలకు సలహా ఇచ్చాడు గతంలో వర్ణాశ్రమ ధర్మం మేలు చేసిందని సమర్థించాడు కాబట్టి గాంధీజీ ప్రారంభించిన కార్యక్రమంవల్ల హరిజనులకు పెద్దగా ఒరిగేదేమీ వుండదు" అని అతివాదులు ఈసడించారు

"కుల వ్యవస్థను పూర్తిగా రూపుమాపితే తప్ప, అంటరానివారుగా పరిగణించ బడుతున్నవారికి విముక్తి లేదు" అంటూ, డాక్టర్ అంబేద్కర్ హరిజన్ పత్రికకు సందేశ మివ్వడానికి నిరాకరించాడు

పంజాబ్‌లో 49 శాతం, బెంగాల్లో 48 6 శాతం సీట్లను ముస్లిములకు రిజర్వు చేసిన మాగ్డోనాల్డ్ అవార్డును గురించి గాంధీజీ మౌనం వహించడం మదనమోహన మాళవీయవంటి వారికి కోపకారణమైంది

ముస్లిములకు, తదితర మైనారిటీలకు సామ్రాజ్యవాదులు కల్పించిన రిజర్వేషన్లకు తోడు, హరిజనులకు మరికొన్ని రిజర్వేషన్లను పూనా ఒడంబడిక కల్పించింది కాబట్టి తమకు మిగిలేది హళ్ళికి హళ్ళి, సున్నాకు సున్నా మాత్రమేనంటూ పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలలో సవర్ణ హిందువులు ఆందోళన ప్రారంభించారు

"సింధు, పశ్చిమోత్తర ప్రాంతాలను ప్రత్యేక రాష్ట్రాలుగా విభజించడం, బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో ముస్లింలకు అధిక తర ప్రాముఖ్యత నివ్వడంవల్ల, ఆ రాష్ట్రాలన్నీ ముస్లిముల పాలనలోనే వుంటాయి ఆంగ్లో ఇండియన్లు, క్రిష్టియన్లు, భారతదేశంలో నివసించే యూరోపియన్లుకూడా ముస్లిములను బలపరుస్తారు అందువల్ల ముస్లిముల మద్దతు యూరోపియన్ పెట్టుబడిదారులకు లభిస్తుంది డా॥ అంబేద్కర్ బ్రిటిష్‌వారి ఒడిలో కూర్చున్నాడు కాబట్టి హరిజనులుకూడా ముస్లిముల ప్రక్కన చేరవచ్చు" అంటూ బాంబే ప్రెసిడెన్సీలో సవర్ణ హిందువులు ప్రతీకార చర్యలకు పూనుకున్నారు

1934 జనవరి 15న కలిగిన బీహార్ భూకంపం "సవర్ణ హిందువుల పాపాలకు భగవంతుడు విధించిన శిక్ష" అని గాంధీజీ చేసిన ప్రకటన దేశమంతా అనేక విమర్శలకు కారణమైంది రవీంద్రునిలాంటి మహామహులు విస్మయం చెందారు

కాగా 1934 ఏప్రియల్, జులై మాసాల మధ్య బుక్సార్, జసిదిహ్, అజ్మీర్ మున్నగు

చోట్ల గాంధీజీ జరుపతలపెట్టిన హరిజన మీటింగులను సవర్ణ హిందువులు భగ్నం చేశారు పూనాలో, జూన్ 25న ఆయన కారుమీద బాంబు విసిరారు అంతవరకెవరూ అలాంటి పనిచేయలేదు కాని మతోన్మాదులు మాత్రం ఆ పనికి పూనుకున్నారు ఆయన ప్రయాణిస్తున్న కారుమీద బాంబును వేశారు అయినా అప్పుడాయన తప్పించుకోగలిగాడు (చివరకు 1948 జనవరి 30న హిందూ మతోన్మాదియైన గాడ్సే పేల్చిన పిస్టల్ గుండ్లకు గురై, దివంగతుడయ్యాడు)

## అడ్డంకులను అధిగమించిన గాంధీజీ

1934 జూన్‌లో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం జరిగింది ఆ,సమావేశంలో పూనా ఒడంబడికను బలపరచనూలేదు, ఖండించనూలేదు కాబట్టి మదనమోహన మాళవీయా జాతీయ కాంగ్రెస్‌నుండి విడిపోయి, కాంగ్రెస్ నేషనలిస్టు పార్టీని స్థాపించాడు

1934 ఆగస్టులో హరిజనులకు దేవాలయ ప్రవేశం కలిగించే బిల్లు, కేంద్ర అసెంబ్లీలో ఓడిపోవడానికి తోడ్పడిన అధికార ప్రతినిధులు, సవర్ణ హిందూ నాయకుల మెప్పు పొందారు కాగా వైస్రాయి చంకలెగరేశాడు కాంగ్రెసుకు, బ్రాహ్మణాధిక్యతకు వ్యతిరేకంగా తమిళనాడులో "ఆత్మగౌరవ" ఉద్యమాన్ని ప్రారంభించిన రామస్వామి నాయకర్, అనతికాలంలోనే జస్టిస్ పార్టీకి లేనంత బలాన్ని పొందగలిగాడు. 1932లో సోవియట్ యూనియన్‌కు వెళ్లి వచ్చిన పిమ్మట రామస్వామి నాయకర్ కోయంబత్తూర్‌లో "స్టాలిన్‌హాలు"ను నిర్మించాడు తాను ప్రారంభించిన "కుడిఅరసు" పత్రికలో సింగారవేలు చెట్టియార్‌లాంటి కమ్యూనిస్టులు వ్రాసిన వ్యాసాలను ప్రచురించాడు అయినా ఆయన అట్టడుగు ప్రజల ఆర్థిక సమస్యలమీద కేంద్రీకరించలేదు కనుక జీవానందంలాంటి ప్రముఖులు విడిపోయి కమ్యూనిస్టు పార్టీలో చేరారు కాగా ఒకవైపున ఆత్మగౌరవ ఉద్యమం, మరోవైపున కమ్యూనిస్టు ఉద్యమం బలపడసాగాయి అందువల్ల తమిళనాడులో హరిజనోద్యమం చెప్పుకోదగినంత బలాన్ని పొందలేకపోయింది కేరళలోకూడా ఇలాంటి పరిస్థితే ఎదురైంది. అక్కడ "ఎఝువ" కులస్థులందరూ కమ్యూనిస్టు పార్టీవైపు మొగ్గారు

అయినా గాంధీజీ వెనకడుగువేయలేదు బాంబే, బెంగాల్ రాష్ట్రాలలో ఎదురైన వ్యతిరేకతను లెక్కచేయనూలేదు దేశం నలుమూలలా పర్యటించి, తన కార్యక్రమాన్ని అట్టడుగు ప్రజలలోకి తీసుకుపోయాడు. హరిజన వాడల్లోవుంటూ, అక్కడ పారిశుధ్య కార్యక్రమాల్ని ప్రారంభించాడు.

హరిజనులలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయ కూలీలు వారి దీనస్థితిని మెరుగుపరిచే ఆర్థిక కార్యక్రమాన్ని గాంధీజీ చేపట్టకపోయినా, అస్పృశ్యతా నివారణ కార్యక్రమం వారి నాకర్షించింది. బిర్లా అందజేసిన ఆర్థిక సహాయంతో కొన్ని హరిజన వాడలలో నిర్మించిన మంచినీటి బావులు వారికి ఉపశమనాన్ని కలిగించాయి ముఖ్యంగా హరిజనోద్యమానికి వ్యతిరేకంగా సనాతనులు సాగించిన దాడి, గాంధీజీ తమ నాయకుడిగా, మహాత్మునిగా హరిజనులు గుర్తించడానికి తోడ్పడింది గాంధీజీ కాంగ్రెస్ సభ్యుడు గాకపోయినా, ఆయన చేపట్టిన కార్యక్రమాలవల్లనే అత్యధిక సంఖ్యాక హరిజనుల అండదండలు కాంగ్రెస్‌కు లభించాయి జాతీయోద్యమం వ్యవసాయ కార్మిక వర్గంలోకి విస్తరించింది

అంతవరకూ జాతీయ నాయకులుగాని, కమ్యూనిస్టులుగాని, మరొకరుగాని

వ్యవసాయ కూలీల ఆర్థిక, సామాజిక స్థితిగతులను గురించి పెద్దగా పట్టించుకోలేదు 1917లో కాళేశ్వరరావు అస్పృశ్యతా నివారణ కార్యక్రమాన్ని చేపట్టి, విజయవాడలో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేశారు కొన్ని వందల సంవత్సరాల క్రితం బ్రహ్మనాయుడు కులవ్యవస్థను వ్యతిరేకించి, మాలకన్నమదాసును సేనాధిపతిగా నియమించాడు చాపకూడు (సహపంక్తి భోజనం) పెట్టించాడు 1923లో ఆచార్య రంగా వ్యవసాయ కూలీ మహాసభను జరిపాడు ఇలా కొన్ని కార్యక్రమాలు జరిగినప్పటికీ, కులానికీ వర్గానికిగల సంబంధాన్ని సరిగా అర్థం చేసుకోకపోవడం వలన అవి విజయాన్ని సాధించలేకపోయాయి కనుకనే "కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వారు రూపొందించిన కార్యక్రమ ముసాయిదాలో, అస్పృశ్యతా నివారణను చేర్చనందుకు ఆచార్య నరేంద్ర దేవును గాంధీజీ విమర్శించాడు " (టెండూల్కర్ వాల్యూమ్ 3, పుట 344)

## స్వరాజ్య పార్టీ పునరుద్ధరణ

1934లో జరిగిన బొంబాయి కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా చేశాడు అయినా కాంగ్రెస్‌కు అవసరమైన సలహాలను, తోడ్పాటును యిచ్చేందుకు అంగీకరించాడు

సత్యాగ్రహోద్యమం విరమింపబడింది కాబట్టి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మీసాలు మెలివేశారు ఆ స్థితిలో రవీంద్రనాథ ఠాగూర్ ఇలా అన్నాడు

"శాసనోల్లంఘనోద్యమం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నగ్నస్వరూపాన్ని ప్రపంచానికి బట్టబయలు చేసింది బ్రిటిష్ వారి ప్రతిష్ట నలుగురిలో నవ్వులపాలైంది ఇది యూరప్‌కు పెద్ద నైతిక అపజయం యూరప్‌వంక ఉన్నతభావంతో చూసిన ఆసియా, ఇప్పుడు యూరప్‌ను హీనభావంతో చూడడం తథ్యం "

జయాపజయాల మాట ఎలా వున్నప్పటికీ, భారతదేశంలోని వివిధ వర్గాలు, మత సంస్థలు తమ తమ హక్కుల సాధనకొరకు సన్నద్ధం కాసాగాయి శాసనసభలో ప్రవేశించడం అవసరమనే అభిప్రాయం కాంగ్రెస్ పెద్దలలో కొందరికి కలిగింది సత్యమూర్తి, భులాభాయ్ దేశాయ్, డా॥ అన్సారీ, డా॥ బి సి రాయ్ ప్రభృతులు ఎన్నికలలో పాల్గొనేందుకు స్వరాజ్య పార్టీని పునరుద్ధరించారు ఆ చర్యను రాజగోపాలాచారి సమర్థించాడు ఆ సమయంలో బిర్లాకు వ్రాసిన లెటర్‌లో గాంధీజీ ఇలా వివరించాడు

"శాసనసభల్లో ప్రవేశించాలనేవారు కాంగ్రెస్‌లో ఎప్పుడూ వుంటూనే వున్నారు. ఇప్పుడు కాంగ్రెస్ నాయకత్వం ఆ గ్రూపు చేతుల్లోనే వుండాలి" (ఇన్ ది షాడో ఆఫ్ ది మహాత్మ, పుట. 138)

కాంగ్రెస్ నాయకులు శాసనసభల్లో ప్రవేశిస్తే, తమ హక్కులు కాపాడబడతాయని జాతీయ పెట్టుబడిదారులు భావించారు కాగా 1934 ఏప్రియల్‌లో బిర్లా టాకూర్‌దాస్‌కు ఈ విధంగా సలహా యిచ్చాడు

"భులాభాయ్ దేశాయితో మీరు సత్సంబంధాలు కలిగి వుండవలసిందిగా కోరుతున్నాను" అని వ్రాసిన పిమ్మట కొన్నాళ్లకు ఒక హెచ్చరిక చేశాడు "స్వరాజ్య పార్టీవారు ఎన్నికల్లో పాల్గొని విజయమందాలంటే, విరాళాలు వసూలు చేయకతప్పదు కాబట్టి ఎన్నికల్లో పోటీ చేసేందుకు సరియైన వ్యక్తులను ఆ పార్టీవారు ఎంపిక చేయకపోతే విరాళాలివ్వకూడదు "

మరికొన్నాళ్లు గడిచిన పిమ్మట బిర్లా టాకూర్‌దాస్‌కు మరొక లెటర్ వ్రాస్తూ "వల్లభభాయ్ పటేల్, రాజాజీ, రాజేంద్రప్రసాద్ మున్నగువారు కమ్యూనిజానికి, సోషలిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు కాబట్టి, జాతీయ పెట్టుబడిదారులకు ప్రాతినిధ్యం వహిస్తున్న మనవంటివారు గాంధీజీకి సహాయపడుతూ సమష్టి గమ్యం కొరకు కృషి చేయడం అవసరం" (టాకూర్ దాస్ పత్రాలు)

## నెహ్రూ అభిప్రాయాలు - గాంధీజీ జోశ్యం

స్వరాజ్య పార్టీవారు కాంగ్రెస్‌లోనే వున్నప్పటికీ, మాళవీయా, ఆణేలాంటి వారు కమ్యూనల్ అవార్డు విషయంలో భేదించినందున కాంగ్రెస్‌నుండి విడిపోయి కాంగ్రెస్ నేషనలిస్టు పార్టీని స్థాపించారు పెట్టుబడిదారీ విధానాన్ని, భూస్వామ్య పద్ధతిని రద్దు చేయాలనే ఉద్యమాలను ఎదిరించి పోరాడుటకు హిందూ మహాసభ తీర్మానించి "ఆత్మరక్షణ" దళాలను సమీకృతం చేసింది

శాసనోల్లంఘనోద్యమాన్ని విరమించినందుకుగాను గాంధీజీ నాయకత్వాన్ని విమర్శించిన విఠల్‌భాయ్ పటేల్, సుభాష్‌చంద్రబోసులు ఆ సమయంలో యూరప్‌లో వున్నారు జవహర్‌లాల్ నెహ్రూ జైల్లో వున్నాడు కమ్యూనిస్టు భావాలను విస్తరింపచేసే మొనగాడుగా నెహ్రూను పరిగణించిన ప్రభుత్వం తిరిగి ఆయనను జైలుకు నెట్టింది

జైల్లో వుండగానే నెహ్రూ తన ఆత్మకథను రచించాడు ఇందిరకు అనేక లేఖలు వ్రాశాడు వాటిలో ఆయనకుగల సోషలిస్టు భావాలు వెల్లడైనాయి ఆరునెలలపాటు బయటవున్నప్పుడాయన "భారతదేశమా- ఎక్కడకు?" అనే మకుటంతో వ్రాసిన వ్యాసాలు గాంధీజీకి, ఆయనకుగల అభిప్రాయ భేదాలను స్పష్టంగా వెల్లడించాయి జాతీయ స్వాతంత్ర్య ధ్యేయం ప్రజల ఆర్థిక సాంఘిక సమస్యలను పరిష్కరించేదిగా వుండాలని వివరించాయి ఆ దశలో గాంధీజీ నరేంద్ర దేవుకు ఇలా వ్రాశాడు

"సామ్యవాద మంత్రాన్ని మనకు అందజేసిన నెహ్రూ, జైలు బయట వున్నట్లయితే, చల్లగా ఊపునందుకునేవాడే " కాని నెహ్రూకు గల సామ్యవాద భావాలను గురించి గాంధీజీ ఆందోళన చెందలేదు కనుకనే "నెహ్రూకుగల కమ్యూనిస్టు భావాలను చూచి భయపడవలసిన పనిలేదు" అని, "బాంబే క్రానికల్" కు ఇచ్చిన ఇంటర్వ్యూలో నొక్కి చెప్పాడు

కాంగ్రెస్‌లోని మితవాదులతోను, గాంధీజీతోను ఎంతగా భేదించినప్పటికీ నెహ్రూ కాంగ్రెస్‌ను విడిచిపెట్టలేదు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో సభ్యుడుగా చేరనూలేదు తాను కాంగ్రెస్‌నుండి బయటకుపోతే, అభివృద్ధి నిరోధకుల ప్రాబల్యమేర్పడుతుంది కాబట్టి బయటకు పోకూడదని నిర్ణయించుకున్నాడు

కాగా నరేంద్రదేవుకు వ్రాసిన లేఖలో భవిష్యత్ కాంగ్రెస్ నాయకత్వాన్ని గురించి గాంధీజీ ఇలా వ్రాశాడు

"నేను, నాతోపాటు వృద్ధ నాయకులు తప్పుకున్న తరువాత, కాంగ్రెస్ నాయకత్వమనే ముళ్ళ కిరీటాన్ని ధరించుటకు తగిన సహజసిద్ధమైన నాయకుడు జవహర్‌లాల్ నెహ్రూ "

అలా జోశ్యం చెప్పిన వెంటనే గాంధీజీ మరొక జోశ్యం చెప్పాడు "కాంగ్రెస్‌కు నాయకత్వం వహించగల సమర్థుడు సర్దార్ పటేల్ " (టెండూల్కర్ వాల్యూమ్ 3, పుట 386)

## కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ స్థాపన

జాతీయ కాంగ్రెస్‌లోనే వుంటూ, కాంగ్రెస్‌ను అతివాద పంథాకు మళ్లించాలనే భావం నాసిక్ జైల్లో సమావేశాలు జరిపిన జయప్రకాష్ నారాయణ్, అచ్యుత పట్వర్థన్, యూసఫ్ మెహరాలీ, అశోక్‌మెహతా, మినూ మసానీవంటివారికి కలిగింది 1934 ఏప్రియల్‌లో యు పి కాంగ్రెస్ నాయకుడు సంపూర్ణానంద్ సోషలిస్టు ప్రణాళికను రచించాడు మే నెలలో ఆచార్య నరేంద్రదేవ్ అధ్యక్షతన పాట్నాలో జరిగిన సమావేశంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ స్థాపన జరిగింది కాంగ్రెస్‌లోనే వుంటూ, మితవాద నాయకత్వాన్ని ఎదిరిస్తూ, కాంగ్రెస్ వెలుపలగల అతివాద గ్రూపులతో సహకరించుటకు నిర్ణయించారు అయినా వారి సోషలిస్టు భావాలు ఒకే విధంగా లేవు అతివాద జాతీయ భావాలనుండి, శాస్త్రీయ సామ్యవాద భావాల వరకూ వివిధ రకాలుగా వుండేవి కాగా అధ్యక్షుడు నరేంద్రదేవ్ శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాలను వివరించి, సంస్కరణ వాదాన్ని విమర్శించాడు

మితవాద కాంగ్రెస్ నాయకులకు ఒళ్లుమండింది సోషలిస్టు నాయకత్వాన్ని మురికితెట్ట (స్కమ్)గా వర్ణిస్తూ పట్టాభి సీతారామయ్య 1934 సెప్టెంబరు 21న సర్దార్ పటేల్‌కు ఒక జాబు వ్రాశాడు వర్గపోరాటం, ఆస్తుల స్వాధీనంవంటివి అహింసా సూత్రానికి వ్యతిరేకమంటూ కాంగ్రెస్ కమిటీ ఖండించింది "సార్వత్రిక కార్మిక సమ్మెలు, రైతుల పోరాటాలను గురించి నరేంద్రదేవ్ చెప్పే ఉపన్యాసాలు నిషా ఎక్కించేవిగాను, ప్రమాదభరితమైనవిగాను వున్నా"యని గాంధీజీ విమర్శించాడు కాగా జైల్లో వున్న నెహ్రూ తన బాధనిలా వ్యక్తం చేశాడు

"సోషలిజంమీద వర్కింగ్ కమిటీ చేసిన తీర్మానం చదివితే ఆశ్చర్యం కలుగుతోంది వారి అజ్ఞానాన్ని ఆ తీర్మానం వెల్లడిస్తోంది దాన్ని ఇతర దేశాలలో చదువుతారనే భావంరాగానే బాధ కలుగుతోంది "

ఆ దశలో పెట్టుబడిదారీ దేశాలు ఆర్థిక సంక్షోభంలో పడి కొట్టుకుంటోంటే, సోవియట్ యూనియన్ పంచవర్ష ప్రణాళికలద్వారా పురోగమిస్తోంది కాగా కరుడు గట్టిన విమర్శకులుకూడా సోవియట్ ప్రగతిని మెచ్చుకోసాగారు నూతన నాగరికత ప్రారంభమైందని పొగిడారు.

అదే సమయంలో ఇటలీ, జర్మనీ దేశాలలో ఫాసిస్టులు అధికారాన్ని కైవసం చేసుకొని, తమ ముష్కర సైనిక బలగాలతో ఇతర దేశాలను జయించేందుకు పూనుకున్నారు చైనా భూభాగాలను జపాన్ కబళించసాగింది అందువల్ల ప్రపంచ ప్రజలకు కలుగనున్న ప్రమాదాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ నాయకులతో పాటు నెహ్రూవంటివారుకూడా గుర్తించారు కాగా జాతీయవాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలిసి కృషి చేయాలనే కోర్కె ప్రబలింది అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకుడు జార్జి డిమిట్రాఫ్ యునైటెడ్ ఫ్రంట్ (ఐక్య సంఘటన) అవసరాన్ని వివరించాడు భారతదేశంలోని కమ్యూనిస్టులు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలోను, కాంగ్రెస్‌లోను చేరి పనిచేయసాగారు

## ట్రేడ్ యూనియన్ల పునరైక్యత

1934లో కార్మికోద్యమ ఐక్యతకొరకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి

ఫిబ్రవరి–మే నెలల మధ్య షోలాపూర్‌లోను, మే–జులై నెలల మధ్య నాగపూర్‌లోను పెద్ద సమ్మెలు జరిగాయి వాటిని మించిన సార్వత్రిక సమ్మె బొంబేలో ఏప్రియల్లో ప్రారంభమైంది కమ్యూనిస్టులు, రాయిస్టులు కలిసి జౌళిమిల్లుల్లో సమ్మెను బలపరిచేందుకు పూనుకున్నారు 1935లో కమ్యూనిస్టుల నాయకత్వానగల రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కలిసిపోయాయి (మరికొన్నేళ్లకు నేషనల్ ట్రేడ్ యూనియన్‌కూడా ఎ ఐ టి యు సి తో కలిసింది )

కనుక ప్రభుత్వాధినేతలు ఆందోళన చెందారు నిర్బంధ దమనకాండ ప్రారంభమైంది అయినా కార్మికోద్యమం బలపడసాగింది

మీరట్ ఖైదీలను విడిచిపెట్టినప్పటికీ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించినందున, కమ్యూనిస్టులు వర్కర్స్ అండ్ పెజంట్సు పార్టీ ద్వారా పనిచేయసాగారు అంతకంటే మంచి అవకాశం కమ్యూనిస్టులకు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీద్వారా లభించింది సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌లోని అతివాదులు చేతులు కలపడంవల్ల కార్మిక కర్షక ఉద్యమాలు బలపడ్డాయి

వాటిని బలపరచిన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ప్రతిష్ట పెరిగింది శాసనోల్లంఘన ఉద్యమం విరమింపబడడంవల్ల అసంతృప్తి చెందిన కాంగ్రెస్ కార్యకర్తలను కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆకర్షించింది యు పి రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు 11 మందిలోను 7గురు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరారు

కాగా రైతాంగ సమస్యలు, కార్మిక సమస్యలను గురించీ, స్వతంత్ర సంస్థానాలలో ప్రజా ఉద్యమాలను గురించీ కాంగ్రెస్‌లోని మితవాద నాయకులు సహితం ఆలోచించవలసి వచ్చింది.

## అఖిల భారత రైతు సంఘస్థాపన

సామ్రాజ్యవాదుల దోపిడీకి, జమీందార్ల పీడనకు వ్యతిరేకంగా 19వ శతాబ్దంలో దేశమంతటా అనేక రైతు పోరాటాలు జరిగాయి ఆ సమయంలో అనేక పోరాట కమిటీ లేర్పడ్డాయి అయినా సంఘ నిర్మాణం జరగలేదు కాని 1935 నాటికి బెంగాల్, బీహార్, యు పి, గుజరాత్, ఆంధ్ర మొదలగు ప్రాంతాలలో జిల్లా సంఘాల, రాష్ట్ర సంఘాల నిర్మాణం జరిగింది

ఆంధ్రలో కృష్ణాజిల్లా రైతు సంఘం 1915లోను, గుంటూరు, గోదావరి జిల్లాల రైతు సంఘాలు 1923లోను స్థాపించబడినాయి. ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం 1928లో స్థాపించబడింది జమీందారుల పీడనకు వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరిగాయి రీ సెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా ఏళ్లతరబడి ఎడతెగని పోరాటం కొనసాగింది

ఆంధ్రలో మాదిరిగానే బెంగాల్, బీహార్ మున్నగు రాష్ట్రాలలోకూడా జిల్లా సంఘాలు, రాష్ట్ర సంఘాలు ఏర్పడినాయి. కాబట్టి అఖిల భారత రైతు సంఘం స్థాపన అవసరమైంది కనుక 1935 అక్టోబర్‌లో ఎ ఐ సి సి. సమావేశం మద్రాసులో జరిగిన సమయంలో అఖిల భారత రైతు, వ్యవసాయ కార్మిక సభను జరిపేందుకు ఆచార్య రంగా పూనుకున్నాడు. కొద్దిమందితో సభ జరిగింది. సభను ప్రారంభించిన శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ ఒక సూచన చేసింది అఖిల భారత రైతు సంఘ స్థాపన కొరకు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వారి తోడ్పాటును పొందవలసిందిగా ఆచార్య రంగాను కోరింది

అటుపిమ్మట, అతివాద భావాలుగల రంగా, సహజానంద ప్రభృతులకు సోషలిస్టులకు మధ్య చర్చలు జరిగాయి 1936 ఏప్రిల్‌లో భారత జాతీయ కాంగ్రెస్ మహాసభ లక్నోలో జరుగుతున్న సమయంలోనే అఖిల భారత రైతు మహాసభకూడా జరిగింది అధ్యక్షుడుగా స్వామి సహజానంద సరస్వతి, కార్యదర్శిగా ఆచార్య రంగా ఎన్నికయ్యారు జయప్రకాష్ నారాయణ్, ఇందులాల్ యాగ్నిక్, రామమనోహర్ లోహియా, బంకింముఖర్జీ, కె ఎం అష్రాఫ్, అహమ్మద్దిన్, సోహన్‌సింగ్ జోష్, జడ్ ఎ.అహ్మద్, నంబూద్రిపాడ్, కార్యానందశర్మ మొదలగువారు సభలో పాల్గొన్నారు. కాంగ్రెస్ అధ్యక్షుడు నెహ్రూ మహాసభకు హాజరై, రైతుల కోర్కెలను బలపరుస్తూ సందేశమిచ్చాడు

"ఏ విధమైన దోపిడీకి తావులేని సంపూర్ణ, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యం కార్మికులకు, కర్షకులకు కావాలి ఉత్పత్తికి కారకులైన శ్రమజీవులు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించగలిగినప్పుడు మాత్రమే తమ ఆర్థిక రాజకీయ హక్కులను పొందగలుగుతారు కాబట్టి తమ హక్కుల కొరకు రైతాంగం జరిపే పోరాటాలు స్వాతంత్ర్యోద్యమంలో భాగం కావాలి" అని తీర్మానించడంతోపాటు 37 కోర్కెలుగల ప్రణాళికనుకూడా ఆ మహాసభ రూపొందించింది.

వ్యవసాయ రంగానికి సంబంధించిన కార్యక్రమాన్ని రూపొందించవలసిన అవసరాన్ని గుర్తిస్తూ, లక్నో కాంగ్రెస్ మహాసభకూడా ఒక తీర్మానాన్ని ఆమోదించింది కాని అఖిల భారత రైతు సంఘాన్ని తన అనుబంధ సంస్థగా గుర్తించేందుకు నిరాకరించింది

## భారత రాజ్యాంగ చట్టం

మొదట సైమన్ కమిషన్ నియామకం, తరువాత ప్రథమ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్, అటుపైన రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ 1932 నవంబర్ - డిసెంబరు నెలల్లో కొద్దిమంది ప్రతినిధులతో లాంఛనప్రాయంగా మూడవ రౌండు టేబుల్ కాన్ఫరెన్స్ జరిగిన పిమ్మట, 1933 మార్చిలో బ్రిటిష్ ప్రభుత్వమొక శ్వేతపత్రాన్ని ప్రకటించింది. బ్రిటిష్ పార్లమెంట్ సభ్యులతో సెలెక్టు కమిటీని ఏర్పాటు చేసింది ఆ కమిటీ రిపోర్టు అందిన తరువాత బ్రిటిష్ పార్లమెంట్‌లో రెండు సంవత్సరాల కాలం చర్చలు జరిగాయి అలా ఎనిమిదేళ్ళకాలం గడిచిన పిమ్మట 1935 ఆగస్టులో భారత రాజ్యాంగ చట్టాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది

1930-31నాటి శాసనోల్లంఘనోద్యమ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం సూచించిన హక్కులు సహితం 1935 నాటికి కుదించుకుపోయాయి. లాంక్‌షైర్ పెట్టుబడిదారుల నాయకుడుగా చర్చిల్ తెచ్చిన వత్తిడి నెగ్గింది. కేంద్ర శాసనసభకు ప్రత్యక్ష ఎన్నికలు బదులుగా పరోక్ష ఎన్నికలు జరుపుటకు నిర్ణయించారు అధికార యంత్రాంగం యొక్క ఆధిక్యతను మరింత పెంచారు రిజర్వేషన్లు, హక్కులు, హామీల విషయంలోను, విదేశాంగ విధానం, దేశరక్షణ, రైల్వేలు, రిజర్వుబ్యాంకు మున్నగువాటి విషయంలోను అధికారమంతా గవర్నర్లకు, ముఖ్యంగా వైస్రాయికి కట్టబెట్టారు.

50 శాతానికి పైగా సంస్థానాధీశులు ఫెడరల్ ప్రభుత్వంలో చేరుటకు అంగీకరించిన పిమ్మట మాత్రమే కేంద్రంలో ప్రభుత్వ నిర్మాణానికి తగిన చర్యలు తీసుకోబడతాయని వివరించారు కాని సంస్థానాధీశుల మీదగల బ్రిటిష్ సార్వభౌమాధికారాన్ని యథాతథంగా వుంచుకున్నారు కాబట్టి ఫెడరల్ ప్రభుత్వంలో చేరుటకు సంస్థానాధీశులు సిద్ధపడలేదు

కనుక కేంద్రంలో పాలన యథాతథంగానే వుండిపోయింది

గవర్నర్లకు విశేషాధికారాలు కల్పించినప్పటికీ, రాష్ట్రాలలో మాత్రం బాధ్యతాయుత ప్రభుత్వాలను ఏర్పాటు చేయుటకు నిర్ణయించారు ఓటు హక్కును కొంతవరకూ విస్తరించారు కాగా ఓటర్ల సంఖ్య 65 లక్షలనుండి మూడు కోట్లకు పెరిగింది

అయినా ఈ రాజ్యాంగ చట్టం మోసపూరితమని కాంగ్రెస్‌లోని అతివాదులు, మితవాదులుకూడా వ్యతిరేకించారు ఇది హిందువుల ఆధిక్యతను నెలకొల్పే "యూనిటరీ రాజ్యాంగం" అని ముస్లిం లీగ్ విమర్శించింది మొత్తంమీద లిబరల్స్‌తో సహా.అందరూ ఆ చట్టాన్ని వ్యతిరేకించారు

కష్టజీవులను సమీకరించి, వారి హక్కుల కొరకు పోరాటాలను సాగించడంద్వారా స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరుచుటకు కాంగ్రెస్‌లోని అతివాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు చేతులు కలిపారు

## కమ్యూనిస్టుల పాత్ర-సాధించిన బలం

మీరట్ జైలునుండి విడుదలైన పిమ్మట కమ్యూనిస్టు నాయకులు పి సి జోషిని ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు 1935 వేసవిలో జరిగిన 7వ కోమింటర్న్ కాంగ్రెస్ ఆమోదించిన యునైటెడ్ ఫ్రంట్ (ఐక్య సంఘటన) వ్యూహాన్ని చేపట్టి, అంతవరకూ అనుసరించిన సెక్టేరియన్ (ఒంటెత్తు) పోకడను విడనాడారు కాంగ్రెస్‌లోని అతివాదుల తోను, సోషలిస్టులతోను కలిసి కృషి చేయడంవల్లను, జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల ప్రభావంవల్లనూ, వర్గ పోరాటాలలో ముందు నిలబడడంవల్లనూ కమ్యూనిస్టుల ప్రతిష్ట పెరిగింది

బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు రజనీ పామిదత్, బెన్ బ్రాడ్లీలు లాసేన్‌లో జవహర్‌లాల్ నెహ్రూను కలుసుకొని చర్చించిన పిమ్మట 1936 మార్చి నాటి "లేబర్ మన్త్లీ" పత్రికలో ఒక థీసిస్‌ను ప్రచురించారు అదే దత్- బ్రాడ్లీ థీసిస్

సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సంఘటనగా కాంగ్రెస్‌ను రూపొందించేందుకు కమ్యూనిస్టులు కాంగ్రెస్‌లో చేరి కృషి చేయాలని, కార్మిక కర్షక సంఘాలను కాంగ్రెస్‌కు అనుబంధం చేయాలని, అతివాద ప్రణాళికతో ఎన్నికల్లో పాల్గొంటూ అధికారంలో పాలుపంచుకోకుండా వుండాలని, వయోజన ఓటింగ్‌ద్వారా రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వం మీద గట్టి వత్తిడి తీసుకురావాలని దత్-బ్రాడ్లీ థీసిస్ సూచించింది

తరువాత మాసం రోజులకు జరిగిన లక్నో కాంగ్రెస్ మహాసభలో పండిట్ నెహ్రూకూడా అలాంటి కోరికలనే వెల్లడించాడు

కాగా కమ్యూనిస్టు పార్టీ రూపొందించుకున్న యునైటెడ్ ఫ్రంట్ వ్యూహం సత్ఫలితాలనిచ్చింది శాసనోల్లంఘనోద్యమం విరమింపబడడంవల్ల అసంతృప్తి చెందిన కాంగ్రెస్ యువకులలో కొందరు కమ్యూనిస్టు పార్టీలో చేరారు హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ పార్టీకి చెందిన అజయ ఘోష్, విజయకుమార్ సిన్హా మొదలైనవారు, గదర్‌పార్టీకి చెందిన బాబా గురుముఖ్‌సింగ్, బాబా సోహన్‌సింగ్ భాక్నా, పృథ్వీసింగ్ ఆజాద్ ప్రభృతులు కమ్యూనిస్టు పార్టీ నాయకులయ్యారు చిటగాంగ్ యోధులు కల్పనాదత్, గణేశ్ ఘోష్, అనంతసింగ్ మున్నగువారితోపాటు అండమాన్ దీవుల్లోను, ఇతర జైళ్లలోనుగల

తీవ్రవాదులు కమ్యూనిస్టుపార్టీలో చేరారు పెషావర్‌లో ప్రజలపైన తుపాకులు పేల్చేందుకు నిరాకరించి జైళ్లపాలైన గార్వాలీ సైనిక నాయకులు విడుదలైన పిమ్మట కమ్యూనిస్ట్ పార్టీలో చేరారు

మలబార్‌లో కాంగ్రెస్‌ను పునరుద్ధరించి, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని స్థాపించిన కృష్ణపిళ్లై, నంబూద్రిపాద్, గోపాలన్‌లు కమ్యూనిస్టు పార్టీలో చేరి, కేరళ కమ్యూనిస్టు పార్టీ నాయకులయ్యారు

ఆంధ్రలో అనేకమంది కాంగ్రెసు యువకులు కమ్యూనిస్టు పార్టీలో చేరి రైతు, కూలీ, కార్మిక సంఘాలను పటిష్టం చేశారు "కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ రాష్ట్ర శాఖలో నూటికి 90 మంది కమ్యూనిస్టులే యన్ జి రంగా ప్రారంభించిన వేసవి పాఠశాలల్లో శిక్షణ పొందినవారిలో మూడోవంతు యువకులను కమ్యూనిస్టు పార్టీ ఆకర్షించింది "

## మితవాద కాంగ్రెస్ నాయకుల వ్యూహం

శాసనోల్లంఘనం ఆగిపోయినప్పటికీ, అశేష దేశభక్తుల త్యాగాలవల్ల కాంగ్రెసు బలపడింది అయినా కాంగ్రెసు కార్యకర్తల్లో అలముకున్న నిరాశను తొలగించడమెలా? తిరిగి సత్యాగ్రహ పంథాను అనుసరించే అవకాశం లేదు 1934-35లో గాంధీజీ తలపెట్టిన అఖిల భారత గ్రామీణ పరిశ్రమల సంఘం అడుగు ముందుకు వేయలేదు హరిజన కార్యక్రమం, అందరినీ ఆకర్షించలేకపోయింది

ఆ స్థితిలో అనేకమంది సోషలిస్టులుగా, కమ్యూనిస్టులుగా మారిపోయారు సోషలిజంకొరకు పోరాడాలనే ప్రచారం పెద్దఎత్తున ప్రారంభమైంది సంస్థానాల ప్రజలలోకూడా పోరాట వాంఛ ప్రస్ఫుటమైంది

కాబట్టి, అంతవరకు నో ఛేంజర్సు (శాసనసభల్లో ప్రవేశించకూడదనే వారు)గా పేరొందిన రాజేంద్రప్రసాద్, రాజగోపాలాచారివంటివారు ఎన్నికల కార్యక్రమానికి సుముఖులుగా మారి, బి సి రాయ్, భులాభాయ్ దేశాయ్ మున్నగు స్వరాజ్య పార్టీ నాయకులతో చేతులు కలిపారు

నెహ్రూను కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నుకున్నారు లక్నో, ఫెయిజ్‌పూరు కాంగ్రెసు మహాసభలలో ఆయన సామ్యవాద ఉపన్యాసాలిస్తుంటే విన్నారు ముగ్గురు సోషలిస్టులను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో చేర్చుకున్నా పూరుకున్నారు అవన్నీ ఓట్ల సంపాదనకు అవసరమని మితవాద నాయకులకు తెలుసు

కాని, అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును, ఆలిండియా కిసాన్ సభను-కాంగ్రెసుకు అనుబంధ సంస్థలుగా చేర్చుకునేందుకు మితవాదులు నిరాకరించారు

రైతు సమస్యలను పరిష్కరించదగు మార్గాలను సూచించేందుకు జయప్రకాష్ నారాయణ్, రాజేంద్రప్రసాద్, జయరాందాస్ దౌలత్‌రాములతో కూడిన కమిటీని ఏర్పరచినప్పటికీ, కమిటీ రిపోర్టు వెలువడకుండా చేయగలిగారు అయినా మితవాదులు సంతృప్తి చెందలేదు ఐక్య సంఘటనగా కాంగ్రెసును విస్తృతంజేసి, సామ్యవాదం కొరకు పోరాడాలంటూ పండిట్ నెహ్రూ చేస్తున్న ప్రచారానికి అడ్డకట్ట వేయాలనుకున్నారు కనుక 1936 జూన్ 29న రాజగోపాలచారి, పటేల్ మొదలగు కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులు 7గురు రాజీనామా చేశారు రాజీనామా లేఖ వార్ధాలోనే తయారు చేయబడింది కాబట్టి వారి రాజీనామా విషయం గాంధీజీకి తెలుసునని చెప్పవచ్చు

నెహ్రూ గాంధీజీని కలుసుకున్నాడు ఘర్షణకు పూనుకోకుండా, వెనకడుగు వేసేందుకు సిద్ధపడ్డాడు కాగా గాంధీజీ ఉభయపక్షాలకు రాజీచేసి పంపించాడు కాని నెహ్రూను మందలించడం అవసరమనుకున్నాడు కనుక జూలై 8, 15 తేదీలలో నెహ్రూకు రెండు ఉత్తరాలు వ్రాశాడు వాటి సారాంశ మీ విధంగా వుంది.

"మీరింకా అధికారంలోకి రాలేదు ఇతర మార్గాలద్వారా మీరు (కాంగ్రెస్) అధికారాన్ని పొందగలిగే దానికంటేముందుగానే మీకు అధికారాన్ని సిద్ధింపజేసే ప్రయత్నమే శాసనసభల ప్రవేశం కాబట్టి అసహనం మంచిదికాదు "

నెహ్రూ వెనుకడుగు వేశాడు గెలుపొందాలంటే కాంగ్రెస్ అధ్యక్షుడుగా నెహ్రూ వుండడం అవసరం గనుక, తిరిగి ఫెయిజ్‌పూర్ కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఆయనను ఎన్నుకున్నారు పార్లమెంటరీబోర్డు అధ్యక్షునిగా పటేల్‌ను ఎన్నుకున్నారు కనుక అభ్యర్థుల ఎంపిక, మంత్రివర్గ నిర్మాణం మున్నగు విషయాలలో అధికారమంతా సర్దార్ పటేల్ చేతుల్లోకి పోయింది కాంగ్రెస్ అభ్యర్థులు గెలుపొందేటట్లు చూడవలసిన బాధ్యత మాత్రం పండిట్ నెహ్రూ మీద మోపబడింది.

నెహ్రూ ఉపన్యాసాలతో ఉత్తేజితుడైన ఆచార్య రంగా రైతు హక్కులకు సంబంధించిన వాగ్దాన పత్రాన్ని తయారుజేశాడు ఆ పత్రం మీద సంతకాలు చేయవలసిందిగా ఆంధ్ర కాంగ్రెస్ అభ్యర్థులను కోరాడు కాని సర్దార్ పటేల్ కళ్లెర్రజేశాడు నెహ్రూ రంగాను బలపరచలేదు "ఏదో అపార్థం కలిగింది కాబట్టి సర్దుకుపోవడం మంచిది" అని రంగాకు సలహా యిచ్చాడు వాగ్దాన పత్రం రంగా ఉపసంహరించుకున్నాడు పటేలుకుగల బలం అందరికీ అర్థమైపోయింది

## పెటుబడిదారుల మద్దతు

కాంగ్రెస్ సోషలిస్టులు, కమ్యూనిస్టులు మాత్రమేగాక నెహ్రూకూడా సామ్యవాదాన్ని గురించి మహోపన్యాసాలివ్వడంవల్ల జాతీయ పెట్టుబడిదారులు భయపడ్డారు కాంగ్రెసును వ్యతిరేకించే హెచ్ పి మోడీవంటివారితో కాంగ్రెసును బలపరిచే వాల్‌చంద్ హీరాచంద్ ప్రభృతులు ఏకమయ్యారు. "వ్యక్తి స్వేచ్ఛకు, మత విశ్వాసాలకు, ఆస్తిహక్కులకు సోషలిజం వ్యతిరేకం" అంటూ 1936 మేలో ఒక ప్రకటన చేశారు దానిమీద 27గురు బొంబే పెట్టుబడిదారులు సంతకాలు చేశారు ఆ ప్రకటన చూచిన వెంటనే బిర్లా వాల్‌చంద్‌ను, ధాకూర్‌దాసును మందలించాడు

"ఆస్తిని స్వాధీనం చేసుకోవాలనే సామ్యవాద సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్నానని ఒక సంపన్నుడు చెప్పడం హాస్యాస్పదంగాను, మొరటుగాను కనిపిస్తుంది. స్వచ్ఛందంగా ఆస్తులను విడిచిపెట్టినవారికి ఆ విషయాన్ని వదలివేయాలి. అలాంటివారిని మనం బలపరిస్తే, అందరికీ మనం తోడ్పడగలం" అని బిర్లా వాల్‌చంద్ హీరాచంద్‌కు 1936 మే 26న ఉత్తరం వ్రాశాడు (ధాకూర్‌దాస్ పత్రాలు ఎఫ్ ఎన్.177 )

లక్నో కాంగ్రెస్‌లో నెహ్రూ యిచ్చిన ఉపన్యాసాలను, కాంగ్రెస్ మహాసభ చేసిన తీర్మానాలను సమీక్షించి, పిమ్మట పరిస్థితిని బిర్లా సరిగా అంచనా వేయగలిగాడు కాబట్టి కలకత్తానుండి బొంబేలోని ధాకూర్ దాసుకు ఈ క్రింది విధంగా జాబు వ్రాశాడు.

"మహాత్మాజీ చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నాడు. లక్నో కాంగ్రెస్‌లో ప్రజలకు కొత్త వాగ్దానాలు చేయలేదు. నెహ్రూ ఉపన్యాసమొక మార్గంగుండా చెత్తబుట్టలో

చేర్చబడింది నెహ్రూజీ అచ్చంగా ప్రజాస్వామ్యవాదియైన ఇంగ్లీషువానిలా కనిపిస్తున్నాడు తన భావాలను ప్రకటిస్తాడు కాని ఆచరణ కష్టసాధ్యమని గ్రహిస్తాడు కనుక ఆచరణ కొరకు పట్టుబట్టడు అంతా సవ్యంగానే సాగిపోతోంది "

దానికి జవాబుగా ధాకూర్‌దాస్ "నేనెన్నడూ జై (జవహర్‌లాల్) యొక్క నిజాయితీని శంకించలేదు ఆయనను సరియైన దారిలో నడిపించటానికి తగిన సంరక్షణ అవసరమని మాత్రమే భావించాను" అని వివరించాడు

అంతటితో పచ్చి మితవాద పార్టీని పెట్టాలనే ఆలోచనను మోడీ మొదలగు పెట్టుబడిదారులు మానుకున్నారు వల్లభాయ్ పటేల్, భులాభాయ్ దేశాయ్ మున్నగు మితవాద కాంగ్రెసు నాయకులద్వారా తమ కోరికలను సాధించుకొనడమే ఉత్తమమైన ఎత్తుగడగా అంగీకరించారు చివరకు దూరదృష్టిగల బిర్లా ధాకూర్‌దాస్‌కు ఇలా వ్రాశాడు

"రానున్న ఎన్నికలను వల్లభాయ్ గ్రూపు వారు కంట్రోల్ చేస్తారు వైస్రాయి లిన్‌లిత్‌గో గనుక జాగ్రత్తగా, పరిస్థితికి తగిన విధంగా వ్యవహరిస్తే, కాంగ్రెస్‌వారు మంత్రి పదవులను చేపట్టడం సంభవంగానే కనిపిస్తోంది."

## శాసనసభల ఎన్నికలు

అఖిల భారత ముస్లిమ్ ప్రజాప్రాతిధ్య సంస్థ (పార్లమెంటరీ బోర్డు)ను నిర్మించడంద్వారా ముస్లిములనందరినీ ఏకం జేసేందుకు మహమ్మదాలీ జిన్నా చేసిన ప్రయత్నం ఫలించలేదు పంజాబ్‌లోని యూనియనిస్టు పార్టీవారు, బెంగాల్లోని కృషక్ ప్రజాపార్టీవారు, ముస్లిమ్‌లీగుతో చేతులు కలపడానికి నిరాకరించారు కనుక ముస్లింలీగ్ విడిగానే ఎన్నికల్లో పాల్గొన్నది

ప్రభుత్వ మద్దతుగల జస్టిస్ పార్టీ మద్రాసు రాష్ట్రంలోను, నేషనల్ అగ్రికల్చరిస్ట్ పార్టీ యు పి లోను ఎన్నికల రంగంలో దిగాయి

దేశం మొత్తంమీద 1585 అసెంబ్లీ స్థానాలకు పోటీ జరిగింది వాటిలో 711 స్థానాలను కాంగ్రెస్ గెలుచుకున్నది ముస్లిములకు రిజర్వు చేసిన 482 స్థానాలలోను, 109 స్థానాలను మాత్రమే ముస్లిమ్‌లీగ్ గెలుచుకున్నది

చటారీ నవాబ్ నాయకత్వాన యు పి లో పోటీ చేసిన నేషనల్ అగ్రికల్చరిస్ట్ పార్టీ వారు, బొబ్బిలి జమీందారు నాయకత్వాన మద్రాస్ రాష్ట్రంలో పోటీ చేసిన జస్టిస్ పార్టీవారుకూడా నామరూపాలు లేకుండా పోయారు.

హరిజనులకు రిజర్వు చేసిన సీట్లలో అత్యధిక సీట్లను కాంగ్రెసు గెలుచుకున్నది బొంబాయి రాష్ట్రంలో 13 సీట్లను మాత్రమే అంబేద్కర్ నాయకత్వానగల ఇండిపెండెంట్ లేబర్ పార్టీ గెలుచుకోగలిగింది కాని ముస్లిములకు రిజర్వు చేయబడిన 482 సీట్లలో 58 సీట్లకు మాత్రమే పోటీచేసి, 26 సీట్లను మాత్రమే గెలుచుకోగలిగిన కాంగ్రెసుకు ముస్లిమ్ ప్రజానీకంలో గణనీయమైన బలం లేదని తేలిపోయింది

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో ముస్లిమ్‌లీగ్‌కు ఒక్కసీటుకూడా దక్కలేదు పంజాబ్‌లోగల ముస్లిమ్ సీట్లు 84లోను రెండు మాత్రమే లీగుకు దక్కాయి సింధులోగల 33 సీట్లలోను 3 దక్కాయి యు పి బొంబాయి రాష్ట్రాలలో మాత్రమే ముస్లిమ్‌లీగుయొక్క బలం కనుపించింది

కాంగ్రెస్‌కు మద్రాస్, బొంబాయి, యు పి, బీహార్, సి.పి , ఒరిస్సాలలో పూర్తి

మెజారిటీ లభించింది బెంగాల్, అస్సాం, సరిహద్దు రాష్ట్రాలలో కూడా బలమైన పార్టీగానే కాంగ్రెస్ పరిగణన పొందింది పంజాబ్, సింధ్ రాష్ట్రాలలో మాత్రమే కాంగ్రెస్‌కు చాలా తక్కువ సీట్లు లభించాయి

## మంత్రివర్గాల ఏర్పాటు

కాగా, కాంగ్రెస్ గెలిచిన రాష్ట్రాలలో మంత్రిపదవులు స్వీకరించాలా లేదా? అనే విషయంపైన తర్జన భర్జనలు జరిగాయి జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోసులతో సహా సోషలిస్టులు, కమ్యూనిస్టులు పదవీస్వీకారాన్ని వ్యతిరేకించారు కనుక 1937 మార్చి 30న ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశమైంది "గవర్నర్లు తమ ప్రత్యేకాధికారాలను ఉపయోగించరనే నమ్మకాన్ని, శాసనసభా కాంగ్రెస్ పార్టీ నాయకులు బహిరంగంగా ప్రకటించగలిగినప్పుడు మాత్రమే, మంత్రిపదవులను స్వీకరించాలి" అనే తీర్మానాన్ని రాజేంద్రప్రసాద్ ప్రవేశపెట్టగా, సర్దార్ పటేల్ బలపర్చాడు తీర్మానం నెగ్గింది "మంత్రి పదవులను స్వీకరించకూడదు" అని జయప్రకాష్ నారాయణ్ ప్రతిపాదించిన సవరణకు అనుకూలంగా 78 ఓట్లు, వ్యతిరేకంగా 135 ఓట్లు రావడంవల్ల సవరణ వీగిపోయింది వెంటనే బిర్లా వైస్రాయి ప్రైవేట్ సెక్రటరీకి లేఖ వ్రాస్తూ "కాంగ్రెస్‌లోని మితవాద పక్షానికిదొక గొప్ప విజయం" అని శ్లాఘించాడు (ఇన్ ది షాడో ఆఫ్ మహాత్మా, పేజీ 214)

హామీలు ఇవ్వడానికి గవర్నర్లు తిరస్కరించారు పదవుల స్వీకారాన్ని కాంగ్రెస్ తిరస్కరించింది బహిరంగంగా హామీలు ఇవ్వడానికి వైస్రాయి తిరస్కరించాడు కాని ఇరుపక్షాల మధ్య జరిగిన చర్చలవల్ల కాంగ్రెస్ నాయకులకు కొంత నమ్మకమేర్పడింది తమ ప్రత్యేక అధికారాలను గవర్నర్లు ఉపయోగించడం తేలికైన పనిగాదనే విశ్వాసంకూడా కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీల నాయకులకు కలిగింది ఆ విషయంలో జూన్ 21న వైస్రాయి ఇచ్చిన హామీ కీలకమైంది

కాగా గాంధీజీ మనసు మార్చుకున్నాడు మంత్రిపదవులను స్వీకరించడానికి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమ్మతించింది. "మంత్రిపదవుల స్వీకారానికి నెహ్రూను ఒప్పించడం సులభంగానే జరిగింది అందుకు నెహ్రూను అభినందించాలి" అంటూ 1937 జులైలో మహదేవ దేశాయ్ బిర్లాకు జాబు వ్రాశాడు

ఆరు రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలేర్పడ్డాయి వాయవ్య రాష్ట్రంలో, 8 మంది కాంగ్రేసేతర సభ్యులు కాంగ్రెసులో చేరడం వలన, అక్కడకూడా కాంగ్రెస్ మంత్రివర్గ మేర్పడింది

## ముస్లిమ్‌లీగ్ కోరిక-కాంగ్రెస్ తిరస్కారం

1934 వరకూ ఖలీ కుజ్జమాన్ కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు సభ్యుడు తరువాత ఆయన కాంగ్రెసును విడిచిపెట్టి ముస్లిమ్ లీగులో చేరాడు యు పి లో కాంగ్రెస్ మంత్రివర్గమేర్పడబోయేముందు కాంగ్రెస్, ముస్లిమ్‌లీగ్ కలిసి కొయలిషన్ మంత్రి వర్గాన్ని ఏర్పరచడం మంచిదని సూచించాడు నెహ్రూ, అజాద్ కలిసి ఖలీ కుజ్జమాన్, నవాబ్ ఇస్మాయిల్ ఖాన్‌లతో చర్చించారు "యు పి అసెంబ్లీలోని ముస్లిమ్ లీగ్ సభ్యులు యు పి కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలో కలిసిపోతే, ఉభయ పక్షాలతో కూడిన మంత్రివర్గ మేర్పరచవచ్చు"నని కాంగ్రెసు నాయకులు సూచించారు. అందుకు ముస్లిమ్‌లీగ్ నాయకులు

అంగీకరించలేదు

ఈ విషయంతోపాటు మరొక విషయంలోకూడా అంగీకారం కుదరలేదు చౌధురి ఖలీ కుజ్జమాన్, నవాబ్ ఇస్మాయిల్ ఖాన్లలో ఎవరో ఒకరిని మాత్రమే మంత్రివర్గంలో చేర్చుకుంటామని నెహ్రూ స్పష్టపరిచాడు. "చేర్చుకుంటే మా ఇద్దరినీ చేర్చుకోండి, లేకపోతే లేదు" అన్నారు లీగ్ నాయకులు అందువల్ల సంభాషణలు విఫలమయ్యాయి

"ఆనాడు జవహర్‌లాల్ గనుక లీగ్ నాయకుల సహకారాన్ని స్వీకరించివుంటే, పరిస్థితుల ప్రాబల్యం వల్ల ముస్లిమ్‌లీగ్ కాంగ్రెస్‌లో విలీనమై వుండేది కాని జవహర్‌లాల్‌యొక్క చర్య యు పి లో ముస్లిమ్‌లీగ్‌కు ప్రాణం పోసింది ముస్లిమ్‌లీగ్ యొక్క పునర్నిర్మాణం యు పి లోనే ప్రారంభమైందని, రాజకీయ విద్యార్థులకు కూడా తెలుసు ఆ అవకాశాన్ని జిన్నా ఉపయోగించుకొని దాడి ప్రారంభించాడు అలా ప్రారంభించిన దాడి దేశవిభజనకు దారి తీసింది" అన్నాడు అబుల్ కలాం ఆజాద్ (ఇండియా విన్స్ ఫ్రీడమ్)

రెండు సీట్లు ఇవ్వడానికి, కాంగ్రెస్ అధ్యక్షుడు నెహ్రూ నిరాకరించటంవల్లనే, ముస్లిమ్‌లీగ్‌తో ఒప్పందం కుదరలేదని అబుల్ కలామ్ ఆజాద్ విమర్శించాడు ఒప్పందం కుదిరివుంటే ముస్లింలీగ్ కాంగ్రెస్‌లో విలీనమై వుండేదని ఆయన భావించాడు ఆ పని జరుగనందువల్లనే మహమ్మదాలీ జిన్నా బలపడి, దేశ విభజనను సాధించగలిగాడని మౌలానా ఆజాద్ విశ్వసించాడు

కాని ఆనాటి పరిస్థితి అంత సులభంగా లేదు యు పి లోని జమీందార్లలో ఎక్కువమంది ముస్లిములు జమీందార్లకు వ్యతిరేకంగా రైతు పోరాటాలు జరుగుతున్నాయి వ్యక్తిగత ఆస్తిని స్వాధీనం చేసుకోడానికి ముస్లిం లీగ్ వ్యతిరేకం లీగ్ ఎన్నికల ప్రణాళికలోకూడా ఆ విషయం స్పష్టీకరించబడింది 1937 అక్టోబరులో లక్నోలో జరిగిన ముస్లిమ్‌లీగ్ సమావేశంలో ఖలీకుజ్జమాన్ ముస్లిమ్ రైతుల పరిస్థితిని మెరుగుపరచాలని ఒకవైపున చెపుతూ, మరోవైపున భూ సంస్కరణలను గట్టిగా వ్యతిరేకించాడు

కాగా, యు పి కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలో ముస్లిమ్‌లీగ్ లెజిస్లేచర్ పార్టీ లీనం కాకపోతే, కొయలిషన్ మంత్రివర్గం సరిగా పనిచేయజాలదని నెహ్రూ, నరేంద్రదేవ్, కె ఎమ్ అష్రాఫ్ మున్నగువారు భావించారు మంత్రివర్గంలో ఇద్దరు ముస్లిమ్ లీగ్ ప్రతినిధులు మాత్రమే వున్నప్పటికీ, సాంఘిక ఆర్థిక సంస్కరణలు సరిగా అమలు జరుగకుండా అడ్డుకోగలరని భయపడ్డారు

పైగా యు పి అసెంబ్లీలోని 228 స్థానాలలో 134 స్థానాలను కాంగ్రెస్ గెలుచుకున్నది జమియత్-ఉల్-ఉలేమా-ఇ-హింద్‌పైన ఆధిపత్యం నెరపుతున్న దేవ్‌బంద్ ఉలేమాల మద్దతు కాంగ్రెసుకు వున్నది ఖిలాఫత్ ఉద్యమ నాయకులు ప్రారంభించిన "అహ్రార్ పార్టీ" మద్దతుకూడా యు.పి, పంజాబ్ మున్నగు ఉత్తరాది రాష్ట్రాలలో కాంగ్రెస్‌కు లభించింది

1937 మేలో జరిగిన అహ్రార్ కాన్ఫరెన్స్ జిన్నాను ఎడాపెడా విమర్శించింది "జిన్నా పాతకాలపు రాజకీయవేత్త .. నవాబులు, ఖాన్ బహదూరులు, సర్ బిరుదాంకితులు కలసి ఏర్పరచిన పార్టీ ముస్లింలీగ్" అని దుయ్యబట్టింది "యు పి లో ముస్లిమ్‌లీగ్ జమీందార్లతోను, సివిల్, మిలిటరీ సర్వీసులకు చెందినవారితోను నిండివుంది" అని ఖలీ కుజ్జమాన్ అంగీకరించాడు. (పాత్‌వే టు పాకిస్తాన్ 173 )

కాగా ముస్లింలీగ్ కోరిన షరతులపైన లీగ్‌తో ఒడంబడిక చేసుకోవడంకంటే, ముస్లిమ్ ప్రజలను కూడగట్టుకునే కార్యక్రమాలు ప్రారంభించడం మంచిదని నెహ్రూ, అష్రాఫ్ మున్నగు కాంగ్రెస్ నాయకులు భావించారు

## కాంగ్రెస్ మంత్రివర్గాలు-వేసిన తప్పటడుగులు

ముస్లిమ్ ప్రజల సమీకరణ బాధ్యత అప్పగించబడిన కె ఎం అష్రాఫ్ ఏమీ చేయలేకపోయాడు ఈ వైఫల్యమే జిన్నా బలపడడానికి దారి తీసింది అంతేగాని, కాంగ్రెస్ లీగ్‌ల మధ్య యు పి లో ఒడంబడిక కుదరకపోవడంవల్ల జిన్నా బలపడలేదు

బెంగాల్ కృషక్ ప్రజాపార్టీలో అబుల్ మన్సూర్ అహ్మద్, షమ్సుద్దీన్ అహ్మద్, నౌషేర్ అలీలాంటి అతివాదులున్నందువల్ల వారి ఎన్నికల ప్రణాళికలో (1) ప్రతిఫల రహితంగా జమీందారీల రద్దు (2) కౌలుమక్తాల తగ్గింపు (3) నిర్బంధ ప్రాథమిక విద్య వంటి అంశాలను చేర్చారు జమీందారీల రద్దును మహమ్మదాలీ జిన్నా వ్యతిరేకించడం వలన, ముస్లిమ్‌లీగ్‌తో పొత్తుపెట్టుకునేందుకు, కృషక్ ప్రజాపార్టీ నిరాకరించింది లీగ్ నాయకుడైన నజిముద్దీన్‌కు-కృషక్ ప్రజాపార్టీ నాయకుడైన ఫజలుల్ హక్‌కు మధ్య 'పతౌఖలి' నియోజకవర్గంలో హెూరాహెూరీగా జరిగిన ఎన్నికల పోటీలో ఫజులుల్ హక్ గెలిచాడు లీగ్ దెబ్బతిన్నది. అయినా కృషక్ ప్రజాపార్టీకి తగినన్ని సీట్లు రాలేదు

కాంగ్రెస్ 50 స్థానాలలో గెలిచింది కనుక కాంగ్రెస్‌తో కలిసి కొయలిషన్ మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేసేందుకు కృషక్ ప్రజాపార్టీ సిద్ధపడింది కాని, రాజకీయ ఖైదీలనందరినీ వెంటనే విడుదల చేసేందుకు సిద్ధపడినప్పుడు మాత్రమే కృషక్ ప్రజాపార్టీతో చేతులు కలపగలమని బెంగాల్ కాంగ్రెస్ నాయకులు స్పష్టపరిచారు

"వెంటనే రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేయడానికి పూనుకుంటే గవర్నర్ అడ్డుపడతాడు మంత్రివర్గం రాజీనామా చేయవలసి వస్తుంది కనుక భూసంస్కరణలను ముందు అమలు పరుద్దాం, మెల్లమెల్లగా రాజకీయ ఖైదీలను విడుదల చేద్దాం" అని కృషక్ ప్రజాపార్టీ వారు వివరించారు అయినా కాంగ్రెస్ నాయకులు సమ్మతించలేదు కనుక లీగ్ నాయకులతోను, నళినీరంజన్ సర్కార్‌వంటి హిందూ మత నాయకులతోను చేతులు కలిపి ఫజులుల్ హక్ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు కాగా బెంగాల్లో ముస్లిమ్ లీగ్ బలపడడానికి తగిన అవకాశం దొరికింది

బెంగాల్ రాజకీయ ఖైదీలను వెంటనే విడుదల చేయాలని షరతు విధించిన కాంగ్రెస్ నాయకులు, తమ మంత్రివర్గాలున్న రాష్ట్రాలలో ఆ పనిచేయలేకపోయారు అండమాన్ జైళ్లలో వున్న రాజకీయ ఖైదీలు 1937 జులైలో నిరశన వ్రతం పూనినా ఫలితం పూజ్యమైంది కాబట్టి "రాజకీయ ఖైదీలను వెంటనే విడుదల చేయాలి లేదా కాంగ్రెస్ మంత్రులు రాజీనామా లివ్వాలి" అంటూ అతివాదులు ఆందోళన ప్రారంభించారు ఆ సమస్యపైన హరిపుర కాంగ్రెస్ సమావేశంలో అమీతుమీ తేల్చుకునేందుకు సిద్ధమయ్యారు. కాగా యు పి లో గోవిందవల్లభపంత్ మంత్రివర్గం, బీహార్‌లో శ్రీకృష్ణ సిన్హా మంత్రివర్గం రాజీనామా చేశాయి కాని కాంగ్రెస్ మహాసభ ముగియగానే తిరిగి అధికారాన్ని స్వీకరించాయి

"వెంటనే రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేయడానికి గవర్నర్లు అంగీకరించక పోయినప్పటికీ, ఆయా ఖైదీల నేరాలను, వారికి విధించిన శిక్షలను పరిగణనలోకి తీసుకుని

క్రమక్రమంగా విడుదల చేయడానికి అంగీకరించినందున, రాజీనామాలను ఉపసంహరించుకున్నాం" అని ఆ ఇరువురు ప్రధానమంత్రులూ ప్రకటించారు

అయితే బెంగాల్లో కృషక్ ప్రజాపార్టీ వారు చాచిన స్నేహహస్తాన్ని కాంగ్రెస్ నాయకులెందుకు తిరస్కరించినట్లు? వెంటనే రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలని దేనికి పట్టుబట్టినట్లు?

బెంగాల్ జమీందార్లలో అత్యధిక సంఖ్యాకులు హిందువులు వారి క్రిందనున్న కౌలుదార్లలో అధిక సంఖ్యాకులు ముస్లిమ్‌లు కాబట్టి ప్రతిఫల రహితంగా జమీలను రద్దుచేయాలని కృషక్ ప్రజాపార్టీ పట్టుబట్టారు ఆ పనిచేయడం ఇష్టంలేని బెంగాల్ కాంగ్రెస్ నాయకులు రాజకీయ ఖైదీలు బెంగాలుకు చెందినవారుగాబట్టి, వారిని విడుదల చేయనందుకు ఫజులుల్ హక్ మంత్రివర్గంమీద విమర్శల వర్షం కురిపిస్తూ, అతివాదులను సంతృప్తిపరచేందుకు కాంగ్రెస్ నాయకులు ప్రయత్నించారు

యు పి , బెంగాల్ రాష్ట్రాలలో కొయలిషన్ మంత్రివర్గాల ఏర్పాటును త్రోసిపుచ్చిన కాంగ్రెస్ నాయకులు, సింధ్, అస్సాం రాష్ట్రాలలో ఆ పని చేయలేదు. సింధ్ అసెంబ్లీలోగల 60 సీట్లలో 7 మాత్రమే కాంగ్రెస్‌కు వున్నాయి అయినా ముస్లిమ్‌లీగ్ మంత్రివర్గ మేర్పడకుండా చేసేందుకు కాంగ్రెస్ నాయకులు పూనుకున్నారు అల్లాబక్ష్‌కు మద్దతునిచ్చి, 1938 మార్చిలో ఆయన నాయకత్వాన మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు

అస్సాం అసెంబ్లీలోగల 108 సీట్లలోను కాంగ్రెస్‌కు 35 సీట్లున్నాయి కాగా పార్టీల మార్పిడిని ప్రోత్సహించడంలో సుభాష్‌చంద్రబోస్ నిమగ్నమయ్యాడు. చివరకు ఆయారాం గయారాంల తోడ్పాటుతో 1938 సెప్టెంబరులో అక్కడకూడా కాంగ్రెస్ మంత్రివర్గమేర్పడింది

ముస్లిమ్‌లీగ్ మంత్రివర్గమెక్కడా ఏర్పడలేదు తొమ్మిది రాష్ట్రాల మంత్రివర్గాలు కాంగ్రెస్ అధిష్టానవర్గంవారి చెప్పుచేతల్లో వున్నాయి కాబట్టి అధికారం కేంద్రీకృతమైంది ఎన్నికల విజయంతోపాటే కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డువారి పెత్తనం ప్రారంభమైంది

ప్రాంతీయ భేదాలు, ముఠా కుమ్ములాటలుకూడా అప్పుడే ప్రారంభమయ్యాయి 1937 లో సెంట్రల్ ప్రావిన్సెస్ (మధ్యప్రదేశ్) మంత్రివర్గ మేర్పడినప్పుడు డి పి మిశ్రా, రవిశంకర్ శుక్లాను వ్యతిరేకించి, ఎన్ బి ఖరేను బలపర్చాడు తిరిగి 1938లో శుక్లాను బలపరిచి ఖరేను వ్యతిరేకించాడు కాగా ఖరే దిగిపోయాడు శుక్లా గద్దెనెక్కాడు ఖరే మరాటా ప్రాంతంవాడు శుక్లా హిందీ మాట్లాడే జబల్‌పూర్ ప్రాంతంవాడు ఇలాంటి పోకడలను అడ్డుకునే ప్రయత్నంలో కాంగ్రెస్ అధిష్టానవర్గంవారి అదుపు (కంట్రోల్) మరీ పెరిగింది అందుకు కొందరు అధిక్షేపించారు మరికొందరు సమర్థించారు

## ముస్లిమ్‌లీగ్ ప్రచారం - కాంగ్రెస్ వ్యతిరేకత

1937 అక్టోబర్‌లో లక్నోలో అఖిల భారత ముస్లిమ్‌లీగ్ సమావేశం జరిగింది లీగ్ యొక్క ప్రతిష్టను పెంచుకునేందుకు ఆ సమావేశంలో కొన్ని తీర్మానాలు ఆమోదించబడ్డాయి మైనారిటీల హక్కుల రక్షణకు తగిన హామీలతో కూడిన సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని లీగ్ తీర్మానించింది వర్గ వైషమ్యాలను, మత కలహాలను కాంగ్రెస్ ప్రోత్సహిస్తున్నదని విమర్శించింది. 1937 సంవత్సరాంతంలోగా ఒక్క యు.పిలోనే లక్షమంది సభ్యులను చేర్చుకొని ముస్లింలీగ్ బలపడింది

అంతకంటే ఎక్కువగానే కాంగ్రెస్ బలపడింది 1936లో ఐదు లక్షల వరకూ వున్న కాంగ్రెస్ సభ్యత్వం, '37లో 31 లక్షలకు, '38లో 45 లక్షలకు పెరిగింది కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, మహిళా సంఘాలు అభివృద్ధికర కార్యక్రమాలతో ముందడుగు వేయసాగాయి స్వతంత్ర సంస్థానాలలో ప్రజల పోరాటాలు ప్రారంభమయ్యాయి

అందువల్ల ముస్లిమ్‌లీగ్ బలపడడానికి చేయవలసిన పనేమిటో జిన్నాకు బోధపడలేదు లీగ్ కోరినట్లుగా ముస్లిమ్‌లకు ప్రత్యేక నియోజకవర్గాలు లభించాయి సింధు, వాయవ్య ప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రాలుగా అవతరించాయి బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో ముస్లిమ్‌ల ఆధిక్యత నెలకొల్పబడింది అయినా ఎన్నికల్లో లీగ్ ఓడిపోయింది కనుక మహమ్మదాలీ జిన్నా ఒక ఎత్తు వేశాడు

1938 మేలో సుభాష్‌చంద్ర బోస్ (కాంగ్రెస్ ప్రెసిడెంట్)తో చర్చలు సాగించే సమయంలో, ముస్లిమ్‌ల ఏకైక ప్రతినిధిగా ముస్లిమ్‌లీగ్‌ను గుర్తించవలసిందిగా పట్టుబట్టాడు కాని అదెలా సంభవం?

యు పి , బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో మైనారిటీలుగా వున్న ముస్లిమ్‌ల మద్దతును లీగ్ పొందగలిగింది కాని బెంగాల్లో దాని పరిస్థితి బలహీనంగానే వుంది పంజాబ్‌లోను, వాయవ్య రాష్ట్రంలోను లీగ్ బలాన్ని గుర్తించవలసిన అవసరమే లేదు చివరకు సింధులోనైనా మంత్రివర్గాన్ని ముస్లిమ్‌లీగ్ ఏర్పరచలేకపోయింది కాబట్టి జిన్నా కోర్కెను బోస్ తిరస్కరించాడు కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ముస్లిమ్‌లీగ్ పెద్దఎత్తున ప్రచారం ప్రారంభించింది.

"ముస్లిమ్ సోదరులారా! కళ్లు తెరవండి ముస్లిమ్‌ల మెజారిటీగల సింధు, వాయవ్య రాష్ట్రాలలో సహితం మనమధ్య చీలికలవల్ల-కాంగ్రెస్ పెత్తనం చేస్తోంది వందేమాతరం గేయం విని విని మన చెవులు చిల్లులు పడుతున్నాయి బక్రీద్ పండుగనాడు కూడా గోవధను నిషేధిస్తున్నారు దేవనాగరి లిపిలో హిందీ, హిందూస్తానీ భాషలను ప్రోత్సహిస్తున్నారు ఉరుదూ భాషను తుడిచిపెట్టే ప్రయత్నాలు జరుగుతున్నాయి ముస్లిమ్‌లమీద హిందువులు దాడి చేస్తోంటే, కాంగ్రెస్ మంత్రులు చూస్తూ కూర్చుంటున్నారు" అంటూ కొంత నిజం, కొంత అబద్ధం కలబోసి ప్రచారం చేశారు

వందేమాతరం గేయంలోని కొన్ని చరణాలను (ముస్లింలకు అభ్యంతరకరమైన వాటిని) 1937 అక్టోబరులోనే కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తొలగించింది హిందూ-ముస్లిమ్ ప్రజల మధ్య సఖ్యతను సాధించేందుకు మాత్రమే వార్ధా బేసిక్ విద్యావిధానాన్ని కాంగ్రెస్ అంగీకరించింది ముస్లిమ్ నాయకుల పాలనలోగల బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో జరిగిన మతకలహాలకంటే తక్కువ మతకలహాలు కాంగ్రెస్ పాలనలోగల రాష్ట్రాలలో జరిగాయి కాబట్టి ముస్లిమ్‌లీగ్ చేసిన ఆరోపణలను గురించి, సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్‌తో విచారణ జరిపించేందుకు కాంగ్రెస్ సిద్ధపడింది అందుకు అంగీకరించవలసిందిగా లీగ్‌ను కోరింది కాని లీగ్ వొప్పుకోలేదు అదే గమనించదగిన విశేషం

## హిందూ మహాసభ-ఆర్.ఎస్.ఎస్.

కాంగ్రెస్‌మీద ఒకవైపునుండి దాడిచేస్తూ ముస్లింలీగ్ బలపడుతోంటే, మరోవైపునుండి దాడిచేస్తూ హిందూ మహాసభ బలపడింది. కొందరుకాంగ్రెసు వారుకూడా హిందూ మహాసభ సభ్యులుగా చేరారు సెంట్రల్ ప్రావిన్సెస్ (మధ్యపరగణాలు)లోని

కాంగ్రెస్ వారిలో కొందరు హిందూ మహాసభలో చేరి చురుకుగా పనిచేస్తున్నారని 1937లో అబుల్ కలాం ఆజాద్ ఫిర్యాదు చేశాడు హిందూ మహాసభ సభ్యులుగా వున్నవారికి కాంగ్రెస్‌లో తావులేదని 1938 డిసెంబరులో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానించవలసి వచ్చింది

అయినా హిందూ మహాసభ అంతకంతకూ బలపడసాగింది 1938 డిసెంబరులో హిందూ మహాసభాధ్యక్షుడుగా వీరసావర్కార్ ఎన్నికయ్యాడు అప్పుడు జరిగిన నాగపూర్ సమావేశంలో ఉపన్యసిస్తూ ఆయన "హిందువులందరం ఒక జాతి హిందూ మతతత్త్వ వాదులుగా పిలుబడినప్పటికీ, హిందూ జాతీయవాదులు వెనకడుగు వేయకూడదు" అన్నాడు

కె బి హెడ్గెవార్ నాయకత్వాన నాగపూర్‌లో ఏర్పాటు చేయబడిన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘం క్రమంగా యు పి , పంజాబ్‌లతోపాటు మరికొన్ని యితర ప్రదేశాలలోకూడా తన శాఖలను ఏర్పాటు చేసుకోగలిగింధి 1940లో గోల్వాల్కర్ నాయకత్వం వహించే నాటికే ఆర్ ఎస్ ఎస్ లక్షమంది కార్యకర్తలను సమీకరించుకోగలిగింది వారందరూ సుశిక్షితులూ, గట్టి క్రమశిక్షణగలవారు, రాజీలేని మతతత్త్వవాదులు అయిన కార్యకర్తలు

ఈ ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తలకు వ్యతిరేకంగా పంజాబ్‌లో ఇనయతుల్లాఖాన్ మష్రికి సమీకరించిన ఖాక్సార్లుకూడా తమ బలాన్ని ప్రదర్శించగలిగారు

## పెట్టుబడిదారుల పచ్చిస్వార్థం

మంత్రిపదవులను స్వీకరించేందుకు కాంగ్రెస్ సమ్మతించినప్పుడు, బిర్లా చాలా సంతోషించాడు కాని అనేకమంది జాతీయ పెట్టుబడిదారులు లోలోన భయపడసాగారు. కార్మికులు కోరే హక్కులను కాంగ్రెస్ మంత్రులు బలపరిస్తే, తమకు నష్టం కలుగుతుందని వారి భయం

కార్మికుల సంక్షేమంకొరకు 1937 అక్టోబరులో కాంగ్రెస్ లేబర్ కమిటీ వారొక ప్రణాళికను సిద్ధం చేశారు కాన్పూర్ జౌళి మిల్లులలో సమ్మెలమీద సమ్మెలు కొనసాగించిన "మజ్దూర్ సభ"ను గుర్తించవలసిందిగా యు పి మంత్రివర్గం మిల్లు యజమానులను వత్తిడి చేసింది కనుక కాంగ్రెస్ మంత్రివర్గాలున్న రాష్ట్రాలలోని పెట్టుబడిదారులు కొందరు సమావేశమై, కాంగ్రెస్‌ను వ్యతిరేకించే పార్టీలను బలపరిచేందుకు నిర్ణయించారు ఆ విషయాన్ని జె పి శ్రీవాత్సవ (బడా పెట్టుబడిదారు) వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ మెంబరైన పిమ్మట వేవెల్‌కు చెప్పాడు అది రికార్డు చేయబడింది అందులో యిలా వుంది·

"1937లో కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడిన పిమ్మట యు పిలోని కొందరు ప్రముఖ పారిశ్రామికవేత్తలు-అందరూ హిందువులే-సమావేశమై, ముస్లిమ్‌లీగ్‌కు, హిందూ మహాసభకు ఆర్థిక సహాయం చేయుటకు నిర్ణయించారు తమ లాభాలకు కాంగ్రెస్ ముప్పు తెచ్చిపెడుతుందనే భయంతో- కాంగ్రెస్‌ను వ్యతిరేకించే మతవాద పార్టీలను బలపరచడంద్వారా, కాంగ్రెస్ నాయకులను లోబరచుకోవచ్చునని భావించారు" (వేవెల్, ది వైస్రాయి జర్నల్ 30, నవంబర్ 1944)

ఇస్పహానీ మొదలగు ముస్లిమ్ పెట్టుబడిదారులతోపాటు కొందరు హిందూ పెట్టుబడిదారులుకూడా ఆర్థిక తోడ్పాటునివ్వడంవల్ల ముస్లిమ్‌లీగ్ బలపడిందనుట నిర్వివాదాంశం

అయినా పెట్టుబడిదారీ వర్గాన్ని లొంగదీసేందుకు కాంగ్రెస్ నాయకత్వం పూనుకోలేదు కార్మికులతోపాటు పెట్టుబడిదార్లను, రైతులతోబాటు జమీందార్లను, రుణగ్రస్తులతోపాటు వడ్డీ వ్యాపారులను, హిందువులతోపాటు ముస్లిమ్‌లను కూడ గట్టుకొనేందుకు కాంగ్రెస్ అధిష్టానవర్గం చేసిన ప్రయత్నంవల్ల జాతీయ కాంగ్రెస్ మితవాద పంథాలో పడిపోయింది.

కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడగానే రైతుల హక్కులు ప్రాధాన్యత వహించాయి కనీసం తమ రుణభారం, శిస్తుల బరువు తగ్గుతాయని, జిరాయితీ హక్కులు వగైరా లభిస్తాయనీ రైతులు ఆశించారు

కాని మంత్రులు ఇతర కార్యక్రమాలలో నిమగ్నమయ్యారు • 1932నుండి అమల్లోవున్న అత్యవసర చట్టాలను రద్దుచేశారు పత్రికలనుండి సేకరించిన ధరావత్తు సొమ్మును తిరిగి ఇచ్చివేశారు పత్రికా స్వాతంత్ర్యాన్ని గుర్తించారు

గాంధీజీ సూచించిన విధంగా నెలకు 500 రూపాయల జీతాన్ని మాత్రమే తీసుకున్నారు బంట్రోతులకు గాంధీ టోపీలు, ఖద్దరు దుస్తులు ఇచ్చారు కుటీర పరిశ్రమలను, స్వదేశీ వస్తువులను ప్రోత్సహించారు అలాంటి పనులద్వారా అచ్చమైన గాంధేయులుగా కన్పించడానికి ప్రయత్నించారు వర్గ సామరస్యం, అహింస, అస్పృశ్యతా నివారణ మున్నగువాటి ఆవశ్యకతను గురించిన ఉపదేశాలు పెరిగాయి

## ఆంధ్రలో రైతు పోరాటాలు

వర్గ పోరాటం లేకపోతే జమీందారీ విధానం రద్దు కాదని రైతు ఉద్యమ నాయకులకు తెలుసు గాంధీజీ కోరిన విధంగా జమీందార్లు, పెట్టుబడిదారులు ప్రజలకు ధర్మకర్తలుగా వ్యవహరించరనీ తెలుసు కాబట్టి వర్గ పోరాటానికి రైతులను సిద్ధం చేసేందుకు పూనుకున్నారు

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం తరపున, రైతు రక్షణ యాత్రాదళం 1937 జూలై 3న ఇచ్ఛాపురంనుండి బయలుదేరింది. ఆ దళానికి కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి (ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాధ్యక్షుడు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి) చలసాని వాసుదేవరావు (రాష్ట్ర కమ్యూనిస్టు నాయకుడు, రాష్ట్ర రైతు సంఘం ప్రధాన కార్యదర్శి) నాయకత్వం వహించారు యాత్రాదళం వారు 1512 మైళ్లు కాలినడకను, 542 మైళ్లు బస్సుల మీదను ప్రయాణం చేశారు ఆంధ్ర జిల్లాలోని అన్ని ఎస్టేట్లను దర్శించి, సభలు జరిపారు. ఆ సభలలో నాలుగున్నర లక్షలమంది రైతులు పాల్గొన్నారు చివరకు యాత్రాదళం 1938 మార్చి 27న మద్రాసు చేరుకొని, 1,100 అర్జీలతో కూడిన వినతిపత్రాన్ని శాసనసభకు సమర్పించింది ఆ వినతిపత్రంలో రైతులకు, కౌలుదార్లకు, వ్యవసాయ కూలీలకు సంబంధించిన సమస్యలన్నింటినీ వివరించి, పరిష్కారాన్ని సూచించడం జరిగింది

కాగా, జమీన్ రైతుల సమస్యలను పరిశీలించి రిపోర్టును తయారుచేసేందుకు ప్రకాశం కమిటీ నియామకం జరిగింది విచారణ సమయంలో జమీందార్ల అక్రమ చర్యలకు సంబంధించిన అనేక విషయాలు వెల్లడైనాయి కమిటీ రిపోర్టు తయారైంది నష్టపరిహారం కావాలని జమీందార్లు పట్టుపట్టారు కాబట్టి మద్రాస్ అసెంబ్లీలో ప్రధానమంత్రి రాజగోపాలచారి 1939 జనవరిలో తన అభిప్రాయాన్నిలా వెల్లడించాడు

"ప్రతి జమీందారూ తమకు ఈస్టిండియా కంపెనీ ఇచ్చిన సనద్ ప్రకారం, ఎస్టేట్ భూములమీద హక్కు ఏర్పడిందని వాదిస్తున్నాడు కాని ఈస్టిండియా కంపెనీకి భూమిపైన ఎట్టి హక్కులేదు తనకు లేని హక్కును ఎవరైనా మరొకరికి దానం చేయగలరా? అలాంటి దానం చెల్లుతుందని ఏ న్యాయమూర్తియైనా చెప్పగలడా? అనాదిగా భూముల యజమానులు రైతులే- రాజులు కాదు, నవాబులూ కాదు కాబట్టి తమను సనదుల ననుగ్రహించిన దాతకే ఎట్టి హక్కులూ లేనప్పుడు, తాము భూస్వాములమని జమీందార్లు భావించడం వెర్రితనం ఎందుకింత చర్చ? భూములమీద జమీందార్లకు హక్కు కలదని ఎవరైనా రుజువు చేయగలరా?" అని సవాల్ చేస్తూ, నష్టపరిహారం కోరడం సరియైన వాదన కాదని స్పష్టపరిచాడు అది విని జమీన్ రైతులు ఉప్పొంగిపోయారు కాని చట్టం మాత్రం రాలేదు

దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనుకున్న జమీందార్లు అనేక అక్రమ చర్యలకు పాల్పడ్డారు రైతు సంఘాల నాయకత్వాన రైతులు ఎదురుతిరిగారు మునగాల, కాళీపట్నం, గోపాలపురం, వెంకటగిరి, చుక్కపల్లి మొదలగు ఎస్టేట్లలో పోరాటాలు జరిగాయి. వందలాది రైతు సంఘ కార్యకర్తలను, కొంతమంది నాయకులను కూడా అరెస్టు చేశారు ఇలాంటి పరిస్థితే రాష్ట్రమంతటా నెలకొన్నది

రైతుల రుణ విమోచన విషయంలో కూడా చాలా జాగు చేశారు మొదట బాకీల వసూళ్లను నిలుపుజేస్తూ మారిటోరియం ప్రకటించారు తరువాత వడ్డీని 5½ శాతానికి తగ్గిస్తూ చట్టం చేశారు ఋణ విముక్తి జరుగుతుందనుకున్న రైతుల ఆశలు అడియాసలుగానే మిగిలిపోయాయి అలాగే అడవి పుల్లరిని కొంతవరకూ తగ్గించారు కాని, రద్దు చేయలేదు

## ఇతర రాష్ట్రాలలో పోరాటాలు

సంయుక్త రాష్ట్రాల (యు పి ) మంత్రి వర్గంకూడా వడ్డీరేటును తగ్గించింది అవధ్ (అయోధ్య) ప్రాంతంలోని కౌలుదార్లకు జిరాయతీ హక్కు కల్పించింది. కౌలు రేటును తగ్గించింది కానీ జమీందారీలను రద్దు చేయాలని 1936లోను, 1937లోను యు పి రాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఆమోదించిన తీర్మానాలను అధికారంలోకి రాగానే మర్చిపోయింది అయినా బీహార్ రాష్ట్రంలో జరిగినంత ఉధృతంగా రైతుల పోరాటాలు యు పి లో జరగలేదు మంత్రివర్గానికి పండిట్ నెహ్రూ యిచ్చిన మద్దతు కొంతవరకు పోరాటాలు తగ్గడానికి కారణమైంది

బొంబాయి రాష్ట్రంలో భూస్వాముల క్రిందనున్న కౌలుదార్లకు కొన్ని హక్కులు లభించాయి అడవిపుల్లరి రద్దు మొదలగు సమస్యలమీద జరిగిన సత్యాగ్రహ పోరాటం కొన్ని ఫలితాలను సాధించగలిగింది

జమీన్ రైతులకు, కౌలుదార్లకు జిరాయతీ హక్కులు కల్పించేందుకు బీహార్ మంత్రివర్గం పూనుకున్నప్పుడు, జమీందార్లు సత్యాగ్రహం చేస్తామని బెదిరించారు పైగా బీహార్ కాంగ్రెస్‌లో జమీందార్లదే పైచేయి. కాబట్టి రాజేంద్రప్రసాద్, అబుల్ కలాం ఆజాద్ కలసి, జమీందార్ల ప్రతినిధులతో సంభాషణలు జరిపారు ఉభయ పక్షాల మధ్య ఒక అంగీకారం కుదిరింది. కౌలుదార్ల చట్టం నీళ్లుగారిపోయింది. కాబట్టి "బీహార్ ప్రభుత్వం చాలా సబబుగా వ్యవహరించింది ఇతర ప్రభుత్వమేదీ ఇవ్వజూపని కొన్ని సదుపాయాలను

బీహార్ జమీందార్లు పొందగలిగారు అని ఒక జమీందారు మెచ్చుకున్నాడు" (డబ్ల్యు హౌసర్, ది బీహార్ ప్రావిన్షియల్ కిసాన్ సభ).

అందువల్ల స్వామి సహజానంద నాయకత్వాన బీహార్ రైతులు, కౌలుదార్లు అనేక పోరాటాలు జరిపారు రైతు యాత్రాదళ మొకటి పాట్నాలోని అసెంబ్లీ హాల్లో ప్రవేశించి, కొన్ని గంటలపాటు దాన్ని ఆక్రమించింది కాగా "కార్యకర్తల క్రమశిక్షణారాహిత్యంవల్ల స్వాతంత్ర్యం అయోమయమైపోతోంది" అని జి.డి బిర్లా ఆక్షేపించాడు (ఇన్ ది షాడో ఆఫ్ మహాత్మా పుట 228)

కార్యానంద శర్మ నాయకత్వాన మాంఘీర్ జిల్లాలో కౌలుదార్లు తమ హక్కుల కొరకు 1936నుండి 39 వరకు ఎడతెగకుండా పోరాడారు రాష్ట్రమంతటా కౌలు మొత్తాల వసూళ్లు 1938-39 నాటికి స్తంభించిపోయాయి కనుక పోలీస్ దళాలు జమీందార్లకు, భూస్వాములకు అండగా నిలబడ్డాయి అందుకు ప్రతీకారంగా "లగా లెగే కైసే? (మీరు పన్నులనెలా వసూలు చేస్తారు?) మా లారీలు జిందాబాద్ అని సహజానంద సరస్వతి యిచ్చిన నినాదం గ్రామ గ్రామాన ప్రతిధ్వనించింది "దీర్ఘకాలంపాటు కాషాయవస్త్రాలు దేశాన్ని ఉపయోగించుకున్నాయి కాగా నేనిపుడు రైతుల తరపున కాషాయ వస్త్రాల నుపయోగించుకుంటున్నాను" అంటూ స్వామి సహజానంద సరస్వతి రైతులకు అండగా నిలబడ్డాడు (డబ్ల్యు హౌసర్ థీసిస్, పుట 86)

కనీసం లక్నో, ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభలలో ఆమోదింపబడిన తీర్మానాలనైనా కాంగ్రెస్ మంత్రివర్గాలు అమలుజేయలేకపోయాయి కౌలుదార్లు, రైతులు గిరిజనులు పోరాడినపుడు మాత్రమే కొద్దిపాటు హక్కులు లభించాయి కాని, వాటితోపాటే అరెస్టులు, ప్రాసిక్యూషన్లు, 144 సెక్షన్ల విధింపులు పెరిగాయి కొంచెమెచ్చుతగ్గులతో, కాంగ్రెస్ మంత్రివర్గాలున్న ప్రతి రాష్ట్రంలోనూ ఇదే పరిస్థితి 1939 చివరలో అస్సాంలోని బోర్డొలాయ్ మంత్రివర్గం దేశరక్షణ చట్టాన్ని ఉపయోగించేందుకుకూడా వెనుకాడలేదు

రైతు సంఘ నాయకులు వర్గ పోరాటాన్ని, హింసను ప్రోత్సహిస్తున్నారని నిందిస్తూ 1938 సెప్టెంబరులో జరిగిన ఎ ఐ సి.సి సమావేశం తీర్మానించింది ధన, ప్రాణ రక్షణకు తగిన చర్యలను కాంగ్రెస్ మంత్రివర్గాలు చేపట్టవచ్చునని తెలియజేసింది ఆ తీర్మానాన్ని భులాభాయ్ దేశాయ్ ప్రతిపాదించాడు సుభాష్‌చంద్రబోస్ వ్యతిరేకించాడు కాని తీర్మానాన్ని గాంధీజీ గట్టిగా సమర్థించడంవల్ల వెనుకకు తగ్గాడు అంతటితో సంతృప్తి చెందకుండా సర్దార్ పటేల్, పురుషోత్తమ్‌దాస్ టాండన్ ప్రభృతులు పోటీ రైతు సంఘాన్నేర్పాటు చేశారు

## బెంగాల్లో పోరాటాలు

కృషక్ ప్రజాపార్టీ అధికారంలో నున్న బెంగాల్లోనైనా జమీందారీ పద్ధతి రద్దు కాలేదు ముందు జమీందారీ పద్ధతిని రద్దు చేయాలని కృషక్ ప్రజాపార్టీవారు పట్టుబట్టడం, ముందుగా రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని కాంగ్రెస్‌వారు పట్టుబట్టడంవల్ల, బెంగాల్లో ఆ రెండు పార్టీల కొయలిషన్ మంత్రివర్గ మేర్పడలేదన్న విషయమందరకూ తెలుసు అలా పట్టుబట్టిన కృషక్ ప్రజాపార్టీ జమీందారీ విధానాన్ని రద్దు చేయకుండా, కౌలురేట్లను మాత్రం తగ్గించింది. ఎస్టేట్ల రద్దు సమస్యను పరిశీలించేందుకు "ఫ్లౌడ్ కమిటీ"ని నియమించింది ఆ కమిటీ తన రిపోర్టును 1940 లో ప్రభుత్వానికి సమర్పించింది నష్టపరిహారమిచ్చి ప్రభుత్వం ఎస్టేట్లను స్వాధీనం చేసుకోవాలని,

స్వాతంత్ర్యం లభించిన పిమ్మటనే ఆ పనిచేస్తే బాగుంటుందని సూచించింది

ప్రభుత్వం సాచివేత చర్యలవల్ల అసంతృప్తి చెందిన కౌలుదార్లు, రైతులు, గిరిజనులు ఉవ్వెత్తున లేచారు నీటితీరువా తగ్గించాలని బర్ద్వాన్ జిల్లా రైతులు పోరాడి విజయాన్ని సాధించారు గారో హిల్సు గిరిజనులు మోనిసింగ్ నాయకత్వాన పోరాడి కౌలు రేటును పండిన పంటలో ½ నుండి ¼ కు తగ్గించుకోగలిగారు ఇలా అనేక పోరాటాలు జరిగాయి

నీటి తీరువా రేట్ల తగ్గింపు కొరకు సింధులోను, పంజాబ్‌లోను ఉద్యమాలు నడిచాయి భూమిశిస్తు తగ్గింపు కొరకు పంజాబ్‌లో ఉద్యమం కొనసాగింది కౌలుదార్ల భూములు అన్యాక్రాంతం కాకుండా జేసేందుకు పంజాబ్ ప్రభుత్వం తలపెట్టిన చర్యలను హిందూ మహాసభ వ్యతిరేకించింది అయినా కౌలుదార్లు తమ భూములను కాపాడుకోగలిగారు

## కొమిల్లా రైతు మహాసభ

ఉద్యమాల ప్రభావంవల్ల అఖిల భారత కిసాన్ సభ సభ్యత్వం 1937లో ఐదు లక్షలకు పెరిగింది 1937 జులైలో నియామత్‌పూర్‌లో జరిగిన కిసాన్ సభ సమావేశంలో కిసాన్ సభ జెండాగా ఎర్రజెండా ఆమోదింపబడింది 38 మేలో కొమిల్లాలో జరిగిన మూడవ అఖిల భారత కిసాన్ సభ అధిక ప్రాముఖ్యతను సంతరించుకుంది ఆ సభలో సోషలిస్టులు, కమ్యూనిస్టులు మాత్రమేగాక కాంగ్రెస్‌లోని అతివాదులుకూడా పాల్గొన్నారు కాంగ్రెస్‌లోని మితవాదులతోపాటు, ముస్లిమ్‌లీగ్‌కూడా ఆ సభను వ్యతిరేకించింది అయినా సభ జయప్రదమైంది గాంధీజీ ప్రబోధించిన వర్గ సామరస్యాన్ని ఆ సభ తిరస్కరించి, వర్గ పోరాటాన్ని బలపరిచింది జమీందార్ల దాడులకు వ్యతిరేకంగా సాయుధ పోరాటాలు సాగించేందుకు నిర్ణయించింది అంతిమ ఆశయంగా వ్యవసాయక విప్లవాన్ని ఆమోదించింది కాగా 1939 ఆఖరు నాటికి అఖిల భారత కిసాన్ సభ సభ్యత్వం 18 లక్షలకు పెరిగింది

## కార్మికవర్గం-కాంగ్రెస్

ఎన్నికల్లో సహజంగానే కార్మికులు కాంగ్రెసును బలపర్చారు కార్మిక సమస్యల పరిష్కారానికి కాంగ్రెస్ విజయం తోడ్పడుతుందని భావించారు

1937 ఏప్రియల్లో, బెంగాల్ జూట్ మిల్లు వర్కర్ల సమ్మెను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ బలపర్చింది ఫజలుల్ హక్ మంత్రివర్గం ప్రారంభించిన అణచివేత చర్యలను ఖండించింది అలాగే అమృతసర్‌లో సికిందర్ హయత్‌ఖాన్ చేపట్టిన కార్మిక వ్యతిరేక చర్యలనుకూడా ఖండించింది.

బెంగాల్ జూట్ వర్కర్ల సార్వత్రిక సమ్మె, అమృత్‌సర్ జౌళి కార్మికుల సమ్మె, కాంగ్రెసేతర మంత్రివర్గాలున్న రాష్ట్రాలలో జరిగాయి కాబట్టి కాంగ్రెస్ వాటిని బలపరిచింది కాని కాన్పూర్ మిల్లుల్లో ప్రారంభమైన సమ్మెల పరంపరవల్ల యు.పి కాంగ్రెస్ నాయకులు సంకటస్థితిలో పడిపోయారు కార్మికుల క్రమశిక్షణా రాహిత్యాన్ని ఖండిస్తూ, జి డి బిర్లా మహదేవ దేశాయికి జాబు వ్రాశాడు.

1937 అక్టోబర్‌లో కలకత్తా కార్మికులు జరిపిన బ్రహ్మాండమైన సభలో పండిట్ నెహ్రూ, సుభాష్ బోసులు పాల్గొన్నారు కార్మికులంతా ఏకమై, సుసంఘటితులై కాంగ్రెస్‌ను

బలపర్చవలసిందిగా కార్మికులకు విజ్ఞప్తి చేశారు కాని 1937 నవంబరులో ప్రారంభమైన అహమ్మదాబాద్ మిల్లు కార్మికుల సమ్మెను జూచి ఆశ్చర్యపోయారు

"అహమ్మదాబాద్ కార్మికుల్లో కూడా కమ్యూనిస్టుల పలుకుబడి ప్రారంభమై వుండాలి లేకపోతే గాంధేయ సిద్ధాంతాలకు కట్టుబడిన కార్మికులు- కాంగ్రెస్ మంత్రివర్గమున్న రాష్ట్రంలో సమ్మె చేసేవారు కాదు" అని మితవాద కాంగ్రెస్ నాయకులు భావించారు వెంటనే మద్రాస్ రాష్ట్రంలో సమ్మెలు ప్రారంభమయ్యాయి వాటిని రాజగోపాలాచారి మంత్రివర్గం వ్యతిరేకించింది

ఆ స్థితిలో ఎ ఐ టి యు సి, ఎన్ ఎఫ్ టి యు చేతులు కలిపి, 1938 ఏప్రియల్లో నాగపూర్‌లో సంయుక్త సమావేశాన్ని నిర్వహించాయి కార్మికుల బలం సుసంఘటితమైంది కార్మిక సంఘాల సభ్యత్వం 50 శాతం పెరిగింది కుల్టి, హీరాపూర్ స్టీల్ మిల్లుల్లో సమ్మె ప్రారంభమైంది మద్రాస్ రాష్ట్రంలో సమ్మెలు పెరిగాయి దేశమంతటా కార్మికులు తమ హక్కుల కొరకు ఆందోళన చేయసాగారు

కాగా పెట్టుబడిదారులొక బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించారు బాంబే, యు పి మున్నగు రాష్ట్రాలలోగల తమ పెట్టుబడులను స్వతంత్ర సంస్థానాలలోకి మళ్ళిస్తామని బెదిరించారు స్వతంత్ర సంస్థానాలలో కార్మిక చట్టాలు లేవు గనుక తమ పరిస్థితి భద్రంగా వుంటుందని ప్రచారం చేశారు

ఇకనేం? కాంగ్రెస్ నాయకులు ఆలోచనలో పడ్డారు పెట్టుబడిదారులకు అభయ హస్తం కనిపించింది తీవ్రవాద కార్మిక సంఘాల నెదిరించేందుకు సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్, జె బి కృపలానీ మున్నగు కాంగ్రెస్ నాయకులు, హిందుస్థాన్ మజ్దూర్ సభను ఏర్పాటు చేశారు

1938 నవంబర్‌లో "ట్రేడ్స్ డిస్ప్యూట్ యాక్టు" బొంబాయి రాష్ట్రంలో అమలులో కొచ్చింది కాంగ్రెస్ మంత్రివర్గం రూపొందించిన ఆ చట్టాన్ని బాంబే గవర్నర్ లూమ్లే శ్లాఘించాడు బిల్లును సెలెక్టు కమిటీకి నివేదించకుండా, త్వరత్వరగా చట్టం చేశారు మధ్యవర్తిత్వాన్ని విధిగా ఆమోదించి తీరాలన్నారు చట్టబద్ధంగాని సమ్మెలో పాల్గొనే కార్మికులకు ఆరు మాసాలవరకూ జైలు శిక్ష విధించబడుతుందన్నారు కాని, లాకౌట్ ప్రకటించే యజమానులను శిక్షించే క్లాజు చట్టంలో లేకుండా జేశారు యజమానులు గుర్తించని కార్మిక సంఘాల రిజిస్ట్రేషన్ దుర్భరమయ్యేటట్లు షరతులు విధించారు కనుక కమ్యూనిస్టుల నాయకత్వానగల కార్మిక సంఘాలను, సమ్మెలను అణిచివేసేందుకు కొత్తచట్టం ఉద్దేశించబడిందనే భావం పలువురికి కలిగింది

చట్టాన్ని నిరసిస్తూ బొంబాయి రాష్ట్రంలో సమ్మె జరిగింది గుల్జారీలాల్ నందా, ఖండూభాయ్ దేశాయ్‌వంటివారు తప్ప, తక్కిన కార్మిక నాయకులందరూ చట్టాన్ని వ్యతిరేకించారు ముస్లిమ్ లీగుతో సహా కాంగ్రేసేతర పార్టీలన్నీ చట్టాన్ని విమర్శించాయి నవంబర్ 6న బాంబేలో జరిగిన నిరసన సభలో 80 వేల మంది కార్మికులు పాల్గొన్నారు డాంగే, ఇందులాల్ యాజ్ఞిక్ మున్నగు నాయకులు చట్టాన్ని ఖండిస్తూ ఉపన్యసించారు

"చట్టంలోని రిజిస్ట్రేషన్ క్లాజులను పండిట్ నెహ్రూ విమర్శించాడు కాని మొత్తం మీద అది మంచి చట్టమేనని అంగీకరించాడు " (మార్కోవిట్స్, పుట. 218)

సుభాష్‌చంద్రబోస్ ప్రైవేటుగా తన వ్యతిరేకతను పటేలుకు తెలియజేశాడు కాని, ఆ వ్యతిరేకతనొక బహిరంగ సమస్యగా చేసేందుకు నిరాకరించాడు

కాగా మితవాద కాంగ్రెస్ నాయకులు పైచేయి సంపాదించారు కాంగ్రెస్ మంత్రివర్గాలు కార్మికులకు దూరమయ్యాయి అస్సామ్ ఆయిల్ కంపెనీ కార్మికులకు అనుకూలంగా ఒక ఐ సి ఎస్ ఆఫీసర్ యిచ్చిన తీర్పును సహితం బార్డోలాయ్ మంత్రివర్గం అమలుజరపలేకపోయింది పైగా 1939 అక్టోబర్‌లో దేశ రక్షణ నిబంధనలను విచ్చలవిడిగా ఉపయోగించి కార్మికుల సమ్మెను పోలీసులు భగ్నం చేస్తోంటే, అస్సాం మంత్రివర్గం చూస్తూ కూర్చున్నది "శాంతి భద్రతల పరిరక్షణలో తమకుగల బాధ్యతను కాంగ్రెస్ మంత్రివర్గాలు చక్కగా నిర్వర్తించాయి" అని ఆర్ కూప్‌లాండ్ మెచ్చుకున్నాడు

## సంస్థానాలలో ప్రజల పోరాటాలు

1937-39 మధ్యకాలంలో జాతీయోద్యమం సంస్థానాలలోకి విస్తరించి బల పడింది అంతకుముందే "ఆలిండియా స్టేట్స్ పీపుల్స్ కాన్ఫరెన్స్" వుంది కాని అది మధ్యతరగతి మేధావులవరకే పరిమితమై వుండేది వారు అప్పుడప్పుడు సభలు జరిపేవారు సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వాలేర్పడాలని, వాక్సభా పత్రికా స్వాతంత్ర్యం కావాలని తీర్మానాలు చేసేవారు అంతేకాని కార్మిక, కర్షక, ప్రజల హక్కులను గురించి పట్టించుకునే వారుకాదు

బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన ఫెడరల్ రాజ్యాంగ చట్టం (1935)లో సంస్థానాధీశులకు కొన్ని హక్కులివ్వబడ్డాయి కేంద్ర అసెంబ్లీలో ముస్లింలకు, ఇతర మైనారిటీ వర్గాలకు, యూరోపియన్లకు, హరిజనులకు రిజర్వుడు సీట్లు లభించినట్లే, సంస్థానాధీశులకు మూడోవంతు సీట్లు లభించాయి కేంద్ర అసెంబ్లీలోగల 375 సీట్లలో 125 సీట్లకు, కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌లోగల 276 సీట్లలో 104 సీట్లకు తమ యిష్టం వచ్చిన వారిని నామినేట్ చేసే అధికారం సంస్థానాధీశులకీయబడింది కాబట్టి మైనారిటీ వర్గాలతో సంస్థానాధీశులు చేతులు కలిపి బ్రిటిష్‌వారి అధికారాన్ని శాశ్వతంగా నిలబెట్టగలరనే భయం కాంగ్రెస్‌తోపాటు సంస్థానాల ప్రజలకుకూడా కలిగింది అయినా సంస్థానాల వ్యవహారాలలో జోక్యం చేసుకునేందుకు కాంగ్రెస్ నిరాకరించడంవల్ల, ప్రజలే ముందుకు రావలసి వచ్చింది కాగా, మైసూరులోను, మరికొన్ని సంస్థానాలలోను ప్రజల పోరాటాలు ప్రారంభమయ్యాయి బల్వంతరాయ్ మెహతా నాయకత్వాన స్టేట్స్ పీపుల్స్ కాన్ఫరెన్స్ చురుకుగా పనిచేయసాగింది మైసూరు ప్రజల పోరాటానికి మద్దతు నివ్వవలసిందిగా ప్రజలకు ఎ ఐ సి సి (1937 అక్టోబర్‌లో) విజ్ఞప్తి చేసింది మితవాద కాంగ్రెస్ నాయకులకది యిష్టం లేదు గాంధీజీకూడా తన అసంతృప్తిని వెల్లడించాడు కనుక 1938 ఫిబ్రవరిలో హరిపుర కాంగ్రెస్ సమావేశంలో ఒక రాజీ తీర్మానం ఆమోదింపబడింది "పూర్ణస్వరాజ్యం ఆశయం బ్రిటిష్ ఇండియాకు వర్తించినట్లే, సంస్థానాలకుకూడా వర్తిస్తుంది కాని ప్రస్తుతం సంస్థాన ప్రజల పోరాటాలకు నైతిక సహాయాన్ని, సానుభూతిని మాత్రమే కాంగ్రెస్ అందజేయగలుగుతుంది" అని వివరించడంతోపాటు సంస్థాన ప్రజల పోరాటాలు కాంగ్రెస్ పేరుమీద జరగకూడదని హరిపుర కాంగ్రెస్ శాసించింది

రెండు మాసాల తరువాత గాంధీజీ తన అభిప్రాయాన్ని వెల్లడించాడు సంస్థానాధీశులు తమ ప్రజలకు పౌరహక్కులిస్తే, స్వతంత్రంగా పనిచేయగల న్యాయస్థానాలను ఏర్పాటు చేస్తే, తమ ప్రీవీపర్సులను తగ్గించుకుంటే, తాను సంతృప్తిపడతానన్నాడు బాధ్యతాయుత ప్రభుత్వాల విషయాన్నిగాని, విలీన విషయాన్నిగాని ఆయన పట్టించుకోలేదు.

అయినా సంస్థానాలలో ఉద్యమాలు చెలరేగాయి 1937లో కె టి భాష్యం నాయకత్వానగల మైసూర్ స్టేట్ కాంగ్రెస్, కె సి రెడ్డి, హెచ్ సి దాసప్పల నాయకత్వానగల పీపుల్స్ ఫెడరేషన్ ఏకం కావడంవల్ల, గ్రామ ప్రాంతాలకు విస్తరించిన ఉద్యమం, 1938లో తీవ్రరూపం ధరించింది కాగా 1938 ఏప్రిల్ 11న కోలార్ జిల్లాలోని విదురస్వత గ్రామంలో సమావేశమైన పదివేల మంది ప్రజలమీద, మైసూరు మహారాజు పోలీసులు తుపాకులు కాల్చారు 30మంది చనిపోయారు తరువాత నెలరోజులకు సర్దార్ పటేల్‌కు, మీర్జా ఇస్మాయిల్ (మైసూర్ దివాన్)కు మధ్య ఒడంబడిక కుదిరింది ఆ ఒడంబడిక ప్రకారం స్టేట్ కాంగ్రెస్ మీదగల నిషేధం తొలగించబడింది కాని, అంగీకరించిన రాజ్యాంగ సవరణలను దివాన్ అమలు జరుపనందున 1939 సెప్టెంబరునుండి తిరిగి శాసనోల్లంఘనం ప్రారంభమైంది కాంగ్రెస్ పెద్దలు నిర్దేశించిన పంథాలోనే ఉద్యమం సాగడంవలన కాంగ్రెస్ బలపడింది

## హైదరాబాద్ స్టేట్‌లో ఉద్యమాలు

బ్రిటిష్‌వారి అడుగులకు మడుగులొత్తిన నిజాం నవాబ్ పాలన, మత ప్రాతిపదికపై నిరంకుశంగా సాగింది ప్రభుత్వం అనుమతి లేనిదే ప్రాథమిక పాఠశాలలు సైతం పెట్టుకోవడానికి వీలులేని స్థితిలో, కొమర్రాజు లక్ష్మణరావు ప్రోద్భలంతో వెలసిన గ్రంథాలయాలు తెలుగు పెద్దల సమావేశ కేంద్రాలుగా వుండేవి

1922లో మాడపాటి హనుమంతరావుగారి నాయకత్వాన స్థాపించబడిన ఆంధ్ర జన సంఘం 1930 నాటికి ఆంధ్ర మహాసభగా మారింది కాని, 1940 వరకూ ప్రజల యిబ్బందులను ప్రభుత్వ దృష్టికి తెచ్చే సంస్థగానే ఆంధ్ర మహాసభ వుండిపోయింది మరాట్వాడాలో మహారాష్ట్ర పరిషత్తుకూడా అలాగే పనిచేసింది అదే బాటలో కన్నడ పరిషత్తు నడిచింది అంతేగాని, వెట్టిచాకిరి, నిర్బంధ వసూళ్లు, జిరాయితీ హక్కులు మొదలగు సమస్యలమీద ప్రజలను సమీకరించలేదు

1927లో బహదూర్ యార్‌జంగ్ నాయకత్వాన స్థాపించబడిన ఇత్తేహాదుల్ ముసల్మీన్ సంస్థ హిందువుల మధ్య కుల వైషమ్యాలను రెచ్చగొడుతూ, హరిజనులను తమ మతంలో కలుపుకోసాగింది. పద్దెనిమిది వేలమంది హరిజనులు ముస్లిములుగా మారారు

అలాంటి కుటిల మతాంతరీకరణకు వ్యతిరేకంగా 1938 అక్టోబర్‌లో పండిట్ నరేంద్రజీ నాయకత్వాన ఆర్య సమాజంవారు సత్యాగ్రహం ప్రారంభించారు కృత్రిమ మతాంతరీకరణను ఆపివేయాలని, హిందువుల కెక్కువగా ఉద్యోగాలివ్వాలని డిమాండ్ చేశారు

స్వామి రామానంద తీర్థ నాయకత్వానగల స్టేట్ కాంగ్రెస్‌కూడా 1938 అక్టోబర్ 24 నుండి సత్యాగ్రహం ప్రారంభించింది దానికి రామానంద తీర్థ, రావి నారాయణ రెడ్డి, గోవిందదాస్ ష్రాఫ్, సిరాజుల్ హసన్, తిర్మజ నాయకత్వం వహించారు. స్టేట్ కాంగ్రెస్‌పైనగల నిషేధాన్ని తొలగించాలని, బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన జరగాలని డిమాండ్ చేశారు

సంస్థానం వెలుపల జరుగుతున్న ఘటనల ప్రభావం ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులపైన ప్రసరించింది కాగా వందేమాతరం గేయాన్ని పాడనారంభించారు.

అందువల్ల రెచ్చిపోయిన ప్రోఛాన్సలర్ 1938 డిసెంబర్ 12న వివిధ కాలేజీలనుండి 910 మంది విద్యార్థులను వెళ్లగొట్టాడు ఆ సమయంలో జైల్లోవున్న రామచంద్రరావు వందేమాతరం గేయాన్ని పాడాడు పాడకూడదన్నారు జైలు అధికార్లు. ఆయన వినలేదు పాటను ఆపలేదు పోలీసులు లారీలతో కొట్టినా ఆపలేదు దెబ్బదెబ్బకూ వందేమాతరం అని నినదిస్తూ స్పృహ తప్పి నేలకొరిగాడు కాగా ఆయనకు వందేమాతరం రామచంద్రరావు అనే పేరు కలిగింది

"సంస్థానాల వ్యవహారాల్లో జాతీయ కాంగ్రెస్ జోక్యం చేసుకోనప్పటికీ, మైసూర్, తిరువాన్కూర్ వగైరా సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వాల ఏర్పాటు కొరకు జరిగే పోరాటాలను జాతీయ కాంగ్రెస్ ప్రోత్సహిస్తున్నది" అని 1938 డిసెంబరులో నాగపూర్‌లో జరిగిన హిందూ మహాసభ సమావేశం విమర్శించింది కాని హైదరాబాద్ స్టేట్‌లో ఆర్య సమాజంవారు ప్రారంభించిన సత్యాగ్రహాన్ని బలపరచింది కాగా హిందూ మతవాదుల సత్యాగ్రహంతో కలిసిపోయే ప్రమాదమున్నది కాబట్టి స్టేట్ కాంగ్రెస్‌వారు ప్రారంభించిన సత్యాగ్రహ పోరాటాన్ని అపివేయవలసిందిగా గాంధీజీ సలహా యిచ్చాడు కనుక 1938 డిసెంబర్‌లో స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం ఆపివేయబడింది "ఈ నిర్ణయం యొక్క యుక్తతను మనం అర్థం చేసుకోలేం" అంటూ స్వామి రామానందతీర్థ తన ఆవేదనను వెల్లడించాడు (మెమాయిర్సు ఆఫ్ హైదరాబాద్ ఫ్రీడమ్ స్ట్రగుల్, పుట 107)

తరువాత గాంధీజీ కోరికపైన సర్ అక్బర్ హైదరీ సత్యాగ్రహులను విడిచిపెట్టాడు కాని స్టేట్ కాంగ్రెస్‌పైన విధించిన నిషేధాన్ని తొలగించలేదు కనుక రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి ప్రభృతులు నిరాశ చెందారు

అలాగే వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్న దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్ల రామచంద్రారెడ్డిలాంటివారినికూడా నిరాశ ఆవహించింది అయినా వారు వెనకడుగు వేయలేదు మార్క్సిజాన్ని అధ్యయనం చేసి, కమ్యూనిస్టులుగా మారారు ఆంధ్ర మహాసభకు నాయకత్వం వహించి, వర్గ పోరాటాలకు పూనుకున్నారు ఆంధ్ర కమ్యూనిస్టు నాయకుల సహకారంతో తెలంగాణా కమ్యూనిస్టు కమిటీ స్థాపన జరిగింది తెలంగాణా ప్రజలు సాగించిన సాయుధ విప్లవానికి అలా అంకురార్పణ జరిగింది

## ఒరిస్సా స్టేట్సులో పోరాటాలు

వెట్టి చాకిరి, అడవిపుల్లరి, నజరానాలు, జిరాయితీ హక్కులు మున్నగు సమస్యలను పరిష్కరించేందుకు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకుడైన నాభాకృష్ణచౌధరి పూనుకున్నాడు ఆయన నాయకత్వాన 1938 డిసెంబరులో ఢెంకనాల్ సంస్థానంలో సత్యాగ్రహం ప్రారంభమైంది. నయాఘర్, తాల్చేర్, రాణీపూర్ మున్నగు సంస్థానాలలోకూడా ఉద్యమం విస్తరించింది సంస్థానాధీశుల సాయుధ బలగాలను గిరిజనులు విల్లంబులతో ఎదిరించారు రాణీపూర్ రాజభవనం ముందు గుమిగూడిన ప్రజలమీద తుపాకి కాల్చిన మేజర్ బర్జల్ గెటీని ప్రజలు రాళ్లతోకొట్టి చంపారు. ప్రజల తిరుగుబాటులు, ప్రజలమీద సైనికుల కాల్పులు ఉధృతమయ్యాయి సంస్థానాల ప్రజలు వేలాదిగా వచ్చి కాంగ్రెస్ మంత్రివర్గ పాలనలోగల అన్‌గుల్, కోసల శిబిరాలలో తలదాచుకున్నారు ఆ స్థితిలో గాంధీజీ జోక్యం చేసుకొని, సత్యాగ్రహ ఉద్యమాన్ని విరమింపజేశాడు అందుకు ప్రతిఫలంగా నామమాత్రమైన రాజకీయ సంస్కరణలను సాధించగలిగాడు

గాంధీజీ చర్య సరియైనదేనని గోపబంధుచౌధురి నాయకత్వాన గల కాంగ్రెస్ పెద్దలు సమర్థించారు "ఆ చర్య శుద్ధ తప్పు" అని కిసాన్ సభ నాయకులైన సోషలిస్టులు, కమ్యూనిస్టులు గర్హించారు

## తిరువాన్కూరులో కాల్పుల పరంపర

1934-35లో కృష్ణపిళ్లే, నంబూద్రిపాద్, ఎ కె గోపాలన్ కలసి మలబార్‌లో కాంగ్రెస్‌ను బలోపేతం చేయడంతోపాటు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీనికూడా స్థాపించారు

"కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని స్థాపించి, ప్రప్రథమంగా మలబార్‌లో కాంగ్రెస్‌ను సామాన్య ప్రజల సంఘంగా మార్చడంతోపాటు నేను, కృష్ణపిళ్లై, నంబూద్రిపాద్ కమ్యూనిస్టులుగా మారాం" అని ఎ కె గోపాలన్ వెల్లడించాడు

1940 ప్రారంభం వరకూ మలబార్ కాంగ్రెస్ కమిటీ అతివాదుల ప్రాబల్యంలోనే వుండేది కనుక ప్రధాన కార్యదర్శిగా నంబూద్రిపాద్ ఎన్నికయ్యాడు మలబార్ ప్రక్కనగల తిరువాన్కూర్ సంస్థానంలోకూడా స్టేట్ కాంగ్రెస్ నిర్మాణం బలంగా వుండేది కాగా సి పి రామస్వామి అయ్యర్ (తిరువాన్కూర్ దివాన్) సాగించే దమనకాండకు వ్యతిరేకంగా స్టేట్ కాంగ్రెస్ 1938 ఆగస్టులో ఆందోళన ప్రారంభించింది వందలాది కార్యకర్తలు సత్యాగ్రహం చేశారు

శాసనోల్లంఘనాన్ని సహించలేని రామస్వామి అయ్యర్ పోలీసు కాల్పులకు పూనుకున్నాడు రెండునెలల కాలంలో 12సార్లు పోలీసు కాల్పులు జరిగాయి ఆ దమనకాండను సహించలేక వందలకొలది విద్యార్థులు, జట్లు జట్లుగా సత్యాగ్రహ పోరాటంలో పాల్గొన్నారు ప్రజల ఆందోళన ఉధృతమైంది అనేక సత్యాగ్రహ దళాలు మలబారునుండి బయలుదేరి తిరువాన్కూరులో ప్రవేశించి, శాసనోల్లంఘనంలో పాల్గొన్నాయి కాగా భాషా ప్రయుక్త రాష్ట్ర భావన బలపడింది

అయినా దివాన్ లొంగలేదు అందువల్ల కృష్ణపిళ్లే నాయకత్వాన అలెప్పీలోని కొబ్బరినార కార్మికులు రంగంలోకి దిగారు 1938 అక్టోబరులో సమ్మె ప్రారంభమైంది జీతాలు పెంచాలని, తమ సంఘాన్ని గుర్తించాలని, రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలని, వయోజన ఓటింగ్‌ద్వారా ఎన్నికైన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచాలని కార్మికులు డిమాండ్ చేశారు

దివాన్ రామస్వామి అయ్యర్ వెనకడుగు వేశాడు అయినా కుటిలబుద్ధిని విడిచిపెట్టలేదు ఉద్యమంలో చీలికలు కల్పించేందుకు, సత్యాగ్రహులమీదగల నిర్బంధాలను ఉపసంహరించి, సమ్మె చేస్తున్న కార్మికులమీదగల నిర్బంధాలను కొనసాగించాడు

ఈలోగా గాంధీజీతోపాటు, కాంగ్రెస్ హైకమాండ్‌వారుకూడా సత్యాగ్రహ పోరాటాన్ని విరమించవలసిందిగా సలహాలిచ్చారు రామస్వామి అయ్యర్ కొన్ని హక్కులను ప్రకటించాడు. కాగా పోరాటం విరమింపబడింది

పంజాబ్‌లోని పాటియాలా, కాల్సియా, కపుర్తలా, సిర్‌మూర్ సంస్థానాలలోను, రాజపుటాలోని కొన్ని ప్రాంతాలలోను పోరాటాలు జరిగాయి.

## రాజ్‌కోటలో గాంధీజీ

ముఖ్యమైన సంస్థానాలలో ప్రజల పోరాటాలు ప్రారంభంగావడానికిగల కారణాలను

గాంధీజీ పరిశీలించాడు తాను చెప్పిన సలహాలను సంస్థానాధీశులు పాటించకపోవడంవల్ల సత్యాగ్రహాలు ప్రారంభమయ్యాయని, చివరకవి వర్గ పోరాటాలుగా మారాయని గాంధీజీ విశ్వసించాడు కాగా వర్గ సామరస్యానికి దారితీయగల సత్యాగ్రహం అవసరమని భావించాడు అందుకు తగినవాడు జమ్నాలాల్ బజాజ్ అనే అభిప్రాయంతో జయపూర్‌లో సత్యాగ్రహం ప్రారంభించేందుకు ఆయనకు అనుమతినిచ్చాడు 1939 జనవరిలో జయపూర్ సత్యాగ్రహం ప్రారంభమైంది

గుజరాత్‌లోని రాజ్‌కోట సంస్థానంలో ప్రజాపరిషత్ నాయకుడైన యు ఎన్ దేబర్ నాయకత్వాన సత్యాగ్రహం ప్రారంభమైంది వర్తక వ్యాపారాలపైన విధించిన నిర్బంధాలను తొలగించాలని, సంస్థాన ఆదాయంలో సగంవరకూ హరిస్తున్న సంస్థానాధీశుని ప్రివీపర్సును బాగా తగ్గించాలని ప్రజాపరిషత్ కోరింది అందుకు రాజకోట దివాన్ వీరవాలా ఒప్పుకోలేదు

రాజ్‌కోట ఒక చిన్న సంస్థానం దాని ప్రజల్లో సగం మంది ముఖ్యపట్టణంలోనే నివసిస్తారు వర్తక వ్యాపారాలకు, సంస్థానాధీశుని ఖర్చులకు సంబంధించిన సమస్యలపైన సత్యాగ్రహం జరుగుతుంది కాబట్టి అది అహింసాయుతంగానే జరుగుతుందనే ఆత్మవిశ్వాసంతో గాంధీజీ స్వయంగా రంగంలో ప్రవేశించాడు ఆయన ప్రక్కన వల్లభాయ్ పటేల్ నిలబడ్డాడు 1939 ఫిబ్రవరిలో కస్తూరీబాయ్ గాంధీ, మణిబెన్ పటేల్ అరెస్టయ్యారు చివరకు మార్చి 3న గాంధీజీ నిరాహారదీక్ష పూనాడు సుభాష్‌చంద్రబోస్ అధ్యక్షతన త్రిపురలో కాంగ్రెస్ మహాసభ జరుగనున్న తరుణంలో, ఆ నిరాహారవ్రతం ప్రారంభమైంది

దివాన్ వీరవాలా దిగొచ్చాడు ఆయనకు, గాంధీజీకి మధ్య ఒడంబడిక జరిగింది గాంధీజీ నిరాహార వ్రతాన్ని విరమించాడు తరువాత పొలిటికల్ డిపార్టుమెంటువారి ప్రోత్సాహంతో, ఒడంబడికలోని షరతులకు వీరవాలా వక్రభాష్యం చెప్పాడు "అది తప్పు కావాలనుకుంటే, ఒడంబడిక పాఠాన్ని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి పంపుదాం ఆయన చెప్పిన భాష్యాన్ని అంగీకరిద్దాం" అన్నాడు గాంధీజీ

"గాంధీ ప్రారంభించిన నిరాహార వత్తిడి నన్ను భయకంపితుణ్ణి చేసింది కనుకనే నేనా ఒడంబడికకు అంగీకరించవలసి వచ్చింది" అని వీరవాలా ప్రచారం చేశాడు ఆ ప్రచారంతోపాటు ముస్లింలు, హరిజనులు ఎక్కువ సీట్ల కొరకు పట్టుబట్టేటట్లు ప్రోత్సహించాడు

1939 ఏప్రిల్ 29న కలకత్తాలో జరుగనున్న ఎ ఐ సి సి సమావేశానికి వెళుతున్న సమయంలో గాంధీజీ విలేకరుల ప్రశ్నకు జవాబిస్తూ, తాననుసరించిన విధానం సరియైనది కాదని ప్రకటించాడు

తన నిరాహార వ్రతం పూర్తిగా అహింసాయుతమైనదికాదని, వత్తిడిజేసే పద్ధతిలో అది ప్రారంభమైందని ప్రకటించి, 1939 మేలో సత్యాగ్రహాన్ని నిలిపివేశాడు

## విద్యార్థుల పోరాటాలు

విద్యార్థి సంఘాలను గుర్తించి, వాటికి ఎన్నికలు జరపాలని, వయోజన విద్యా కేంద్రాలు స్థాపించాలని అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ 1937లో ఆందోళన ప్రారంభించింది ఆ ఆందోళనలో భాగంగా రాజకీయ ఖైదీల విడుదల సమస్య ప్రాముఖ్యత వహించింది కాబట్టి విద్యార్థి ఉద్యమం నగరాలనుండి గ్రామాలవరకూ వ్యాపించింది

అతివాద రాజకీయాలు వారి నాకర్షించాయి

కాగా, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారాన్ని విద్యార్థులు చేపట్టారు ఇటాలియన్ ఫాసిస్టులకు, జర్మన్ నాజీలకు, జపాన్ దురాక్రమణలకు వ్యతిరేకంగా, చైనా, స్పెయిన్ దేశాలకు అనుకూలంగా 1938లో అనేక ప్రదర్శనలు నిర్వహించారు అందువల్ల అనేకమంది విద్యార్థులు కమ్యూనిస్టు పార్టీకి సన్నిహితులయ్యారు కొందరాపార్టీలో చేరారు

అది సహించలేని కాంగ్రెస్ మంత్రులు విద్యార్థుల ప్రదర్శనలను కొన్నిచోట్ల నిషేధించారు కమ్యూనిస్టుల నాయకత్వాన నడిచే వేసవి పాఠశాలలను సహితం విడిచిపెట్టలేదు కార్మిక, కర్షక విద్యార్థి, యువజన సంఘాలకు సానుభూతి చూపించే విధంగా కాంగ్రెస్‌ను మార్చాలనుకొన్న సోషలిస్టుల, కమ్యూనిస్టుల ప్రయత్నాలను మితవాద కాంగ్రెస్ నాయకులు ఎదిరించారు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల మెడలు వంచేందుకు ప్రజాపోరాటాలు అవసరమన్న అతివాదుల సూచనను సహితం తిరస్కరించిన కాంగ్రెస్ హైకమాండ్ శాంతి భద్రతల పరిరక్షణలో నిమగ్నమైంది

కాగా, కాంగ్రెస్ మంత్రివర్గాల చర్యలను పండిట్ నెహ్రూ విమర్శించాడు గోవిందవల్లభపంత్‌కు వ్రాసిన ఉత్తరాలలో తన భావాలను స్పష్టంగా వెల్లడించాడు

“1937కు పూర్వం రాష్ట్ర ప్రభుత్వాలు నెలకొల్పిన సంప్రదాయసిద్ధమైన పద్ధతిలోనే కాంగ్రెస్ మంత్రివర్గాలు కూడా (కొన్ని స్వల్పమైన మార్పులతో) పనిచేస్తున్నాయి” అని వివరిస్తూ, చివరకు “కాంగ్రెస్ మంత్రులు విప్లవ వ్యతిరేకులు” అని నిందించాడు (నెహ్రూ టు పంత్, బన్చ్ ఆఫ్ ఓల్డ్ లెటర్స్)

గాంధీజీకి వ్రాసిన లెటర్‌లోకూడా, నెహ్రూ తన బాధను వెల్లడించాడు “ఇక్కడ రాజకీయాలలో నాకు స్థానంలేదు ఈ రాజకీయాలకు నేను అనర్హుడను నేను యూరప్‌కు వెళ్లాలని నిర్ణయించుకోవడానికి ఇదొక కారణం” అని స్పష్టపరిచాడు (లెటర్ టు గాంధీ, 28 ఏప్రిల్ 1938 బన్చ్ ఆఫ్ ఓల్డు లెటర్స్)

అయినా నెహ్రూగాని, బోస్‌గాని కాంగ్రెస్ నాయకత్వం యొక్క మితవాద చర్యలను అరికట్టలేకపోయారు గాంధీజీ బోధించే అహింసను, వర్గసామరస్యాన్ని ఉపయోగించుకొని మితవాదులు బాగా బలపడ్డారు

## నేషనల్ ప్లానింగ్ కమిటీ స్థాపన

మద్యపాన నిషేధంవల్ల కలిగిన లోటును భర్తీ చేసుకునేందుకు మద్రాస్ ప్రధానమంత్రి రాజగోపాలాచారి అమ్మకం పన్ను విధించాడు బొంబాయి ప్రభుత్వం బట్టల అమ్మకంమీద పన్ను వేయడంతోపాటు, పట్టణ ఆస్తులపైనకూడా పన్ను విధించింది

కార్మికుల సంక్షేమంకొరకు కాంగ్రెస్ లేబర్ కమిటీ రూపొందించిన కార్యక్రమాన్ని చూచి కలవరపడిన పెట్టుబడిదారులు కొత్త పన్నుల విధింపువల్ల మరింత కలతచెందారు

ఆ స్థితిలో పెట్టుబడిదారులను సంతృప్తిపరిచేందుకు వైస్రాయి పూనుకున్నాడు దేశీయ పెట్టుబడిదారులకు నష్టదాయకమైన “ఇండో-బ్రిటిష్ వ్యాపార ఒడంబడిక”ను రద్దు చేశాడు. బ్రిటన్‌తో నూతన ఒడంబడికను చేసుకునే విషయంలో సలహాలిచ్చేందుకు కస్తూరిభాయ్ లాల్‌భాయ్, టాకూర్‌దాస్, జి డి బిర్లాలను అనధికార సభ్యులుగా నియమించాడు అయినా వారు వైస్రాయి పన్నిన వలలో చిక్కలేదు ఎనిమిది రాష్ట్రాలలో అధికారం నెరపుతున్న కాంగ్రెసుకు దూరంగావడం పెట్టుబడిదారులకు నష్టంగదా . ?

కాంగ్రెసు మంత్రివర్గాలుకూడా దేశీయ పెట్టుబడిదారులకు తోడ్పడసాగాయి స్వదేశీ వస్తువులకు మాత్రమే ఆర్డర్లు లభించడంవల్ల దేశీయ ఉత్పత్తిదారులకు, వర్తకులకు లాభించింది కిల్లిక్ నిక్సన్‌నుండి, బొంబే స్టీమ్‌నావిగేషన్ కంపెనీని వాల్‌చంద్ హీరాచంద్ స్వాధీనం చేసుకునేందుకు సర్దార్ పటేల్ తోడ్పడ్డాడు

పంచదార నిల్వలు పేరుకుపోతే బీహార్, యు పి మంత్రివర్గాలు సిండికేటును ఏర్పాటుచేసి సమస్యను పరిష్కరించాయి కాని సిమెంటు, వస్త్రాలు మున్నగువాటి కొనుగోళ్లు తగ్గడంవలన ధరలు పడిపోయే సూచనలు కనిపించాయి

సరుకులు ఎక్కువగా అమ్ముడుపోవాలంటే, ప్రజల కొనుగోలు శక్తి పెరగాలి సమగ్రమైన భూసంస్కరణలు అమలుజరిగినపుడు మాత్రమే ప్రజల కొనుగోలు శక్తి పెరుగుతుంది కాని కాంగ్రెస్ అందుకు సిద్ధంగా లేదు పెట్టుబడిదారులుకూడా ప్రతికూల ధోరణిని వ్యక్తం చేశారు కాగా నిత్యావసర వస్తువులను ఉత్పత్తిచేసే పారిశ్రామికులు కొన్ని సమస్యల నెదుర్కొనవలసి వచ్చింది

ఆ స్థితిలో మార్కెట్లను ఆక్రమించేందుకు బడా బ్రిటిష్ కంపెనీలు పూనుకున్నాయి కొన్ని అమెరికన్ కంపెనీలుకూడా రంగంలో దిగాయి ఎగుమతి దిగుమతి సుంకాలను తప్పించుకునేందుకు "ఇండియా లిమిటెడ్" పేరుతో రిజిష్టరు చేయబడిన సబ్సిడియరీ కంపెనీలద్వారా దేశీయ పరిశ్రమలను అణగద్రొక్కసాగాయి సబ్బుల ఉత్పత్తిలో గాడ్రేజ్‌ను వెనుకకు నెట్టి, లీవరు బ్రదర్సు ఆధిక్యతను సంపాదించింది ఇంపీరియల్ టొబాకో కంపెనీ రంగంలో దిగి, వజీర్ సుల్తాన్ కంపెనీని స్థాపించింది కెమికల్సు, రబ్బరు మున్నగు వాటి విషయంలో కూడా సబ్సిడియరీ కంపెనీల పోటీ పెరిగింది

ఆ ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తూ గాంధీజీ హరిజన్ పత్రికలో కొన్ని వ్యాసాలు వ్రాశాడు. "ఇండియా లిమిటెడ్"గా రిజిష్టరు చేయబడిన సబ్సిడియర్ కంపెనీల చర్యలను అరికట్టేందుకు తగిన తీర్మానాన్ని ఎన్ వి గాడ్గిల్ కేంద్ర అసెంబ్లీలో ప్రవేశపెట్టాడు. ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛాంబర్సు ఆఫ్ కామర్సు అండ్ ఇండస్ట్రీవారు ఆందోళన ప్రారంభించారు. కొత్త "ఇండో-బ్రిటిష్ ట్రేడ్ ఫాక్ట్"కు వ్యతిరేకంగా కేంద్ర అసెంబ్లీలోని కాంగ్రెస్ సభ్యులతోపాటు - వ్యాపార వర్గాలవారు కూడా ఓటు చేశారు అయినా ఫలితం పూజ్యమైంది

ఆ పరిస్థితిని అధిగమించి దేశీయ పరిశ్రమలు పెరగాలంటే, శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం కావాలి దేశంలో మూలాధార పరిశ్రమలు వృద్ధి పొందాలి అందుకు అవసరమైన పెట్టుబడిని బ్రిటిష్ ప్రభుత్వం సమకూర్చదు మూలాధార పరిశ్రమలు లాభదాయకంకావు కనుక పెట్టుబడిదారులు ముందుకురారు కాబట్టి, ఒక ప్రణాళికను రూపొందించేందుకు కాంగ్రెస్ పూనుకుంటే బాగుంటుందని భావించారు కాంగ్రెస్ అధ్యక్షుడు సుభాష్‌చంద్ర బోస్ తీసుకున్న చొరవతో జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన నేషనల్ ప్లానింగ్ కమిటీ ఏర్పడింది

పారిశ్రామికాభివృద్ధి కొరకు ప్రభుత్వ ప్రణాళిక (స్టేట్ ప్లానింగ్) అవసరమనే విషయాన్ని 1934లో మోక్షగుండం విశ్వేశ్వరయ్య నొక్కి చెప్పాడు దూరదృష్టిగల దేశీయ పెట్టుబడిదారులు, మూలాధార పరిశ్రమల (బేసిక్ ఇండస్ట్రీస్) స్థాపన, క్రమబద్ధత అజమాయిషీ, పెట్టుబడి సేకరణ మొదలగు విషయాలలో ప్రభుత్వ కంట్రోల్స్ వుండడం అవసరమేనని అంగీకరించారు ప్రభుత్వ అజమాయిషీ, కంట్రోల్సు లేకపోతే మూలాధార

పరిశ్రమలకు అవసరమైన పెట్టుబడులను సమకూర్చడం సాధ్యంగానిపని కనుకనే ప్రభుత్వ కంట్రోల్సుకు పెట్టుబడిదారులు అంగీకరించారు అయినా వైస్రాయి కార్యవర్గంలోని ఫైనాన్సు మెంబర్ గ్రిగ్ విశ్వేశ్వరయ్య సూచనను త్రోసిపుచ్చాడు కాబట్టి పారిశ్రామికాభివృద్ధి ప్రణాళికను సిద్ధం చేసే బాధ్యతను 1938 అక్టోబరులో కాంగ్రెస్ స్వీకరించింది

వెంటనే పరిశ్రమల మంత్రుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు ఆ సమావేశానికి విశ్వేశ్వరయ్యతోపాటు జి డి బిర్లా, లాలా శ్రీరామ్ మున్నగు బడా పెట్టుబడిదారులనుకూడా ఆహ్వానించారు తరువాత కొద్ది రోజుల్లోనే నేషనల్ ప్లానింగ్ కమిటీకి అనుబంధంగా 29 సబ్ కమిటీల నేర్పరిచారు వాటి సభ్యులలో ఎక్కువమంది పెట్టుబడిదారుల ప్రతినిధులే కాని కార్మికవర్గ ప్రతినిధులు, కుటీర పరిశ్రమల ప్రతినిధులు, సైంటిస్టులు, ఆర్థిక శాస్త్రవేత్తలు, హైదరాబాద్, మైసూర్ మున్నగు సంస్థానాల ప్రతినిధులు, బెంగాల్, పంజాబ్ ప్రభుత్వాల ప్రతినిధులుకూడా ఆయా కమిటీలలో సభ్యులుగా వున్నారు

కాగా, ఆనాటి పరిస్థితిని ఆధారంగా చేసుకొని ఏనాటికైనా సామ్యవాద ఆర్థిక వ్యవస్థను నిర్మించవచ్చునని పండిట్ నెహ్రూ భావించాడు కనుకనే ఆయా కమిటీల సమావేశాలలో పాల్గొంటూ, సామ్యవాద ప్రణాళికాబద్ధమైన పరిశ్రమల నిర్మాణం, ప్రభుత్వ రంగ పరిశ్రమలు, కీలక పరిశ్రమల మీద ప్రభుత్వ కంట్రోల్ వగైరా సమస్యలమీద తనకుగల అభిప్రాయాలను సవివరంగా వెల్లడించాడు అయినా పెట్టుబడిదారులు భయపడలేదు కాంగ్రెస్ మంత్రివర్గాలు ప్రదర్శించిన సామ్యవాద వ్యతిరేకత వారికి ధైర్యాన్ని కలిగించింది కాబట్టి మితవాద కాంగ్రెస్ నాయకులతో తమకుగల సత్సంబంధాలను కొనసాగిస్తూ, తమకు ఎక్కువ లాభదాయకంగా వుండే జాతీయ ప్రణాళికా రచనకు అన్నివిధాలా తోడ్పడ్డారు

జాతీయ ప్రణాళికా రచనకు అవసరమైన సమాచారాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు సరిగా అందజేయలేకపోయినా, కేంద్ర ప్రభుత్వం సహాయ నిరాకరణకు పూనుకున్నా, నేషనల్ ప్లానింగ్ కమిటీ పట్టుదల సడలలేదు ఏదో ఒక విధంగా శ్రమపడి ప్రణాళికా రచనకు అవసరమైన నివేదికలను సిద్ధం చేసింది వాటిలో ఈ దిగువ అంశాలున్నాయి·

(1) వ్యావసాయిక ఉత్పత్తులను పెంచడం, (2) పారిశ్రామిక ఉత్పత్తులను పెంచడం, (3) నిరుద్యోగాన్ని తగ్గించడం, (4) తలసరి ఆదాయాన్ని పెంచడం, (5) నిరక్షరాస్యతను రూపుమాపడం, (6) ఉద్యోగ అవకాశాలను పెంచడం, (7) ప్రజలందరికీ వైద్య సదుపాయాన్ని కలిగించడం (8) జీవిత ప్రమాణాన్ని పెంచడం

ఈ లక్ష్యాలను సాధించేందుకు చేపట్టవలసిన చర్యల విషయంలో ఆయా కమిటీల సభ్యుల మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడ్డాయి బడా పరిశ్రమల స్థాపనకు గాంధీ వ్యతిరేకమని చెపుతూ, కుటీర పరిశ్రమలకు అధికతర ప్రోత్సాహమివ్వడం మంచిదని కొందరు వాదించారు కాని పరిశ్రమల విషయంలో గాంధీజీ వెల్లడించిన అభిప్రాయాలు ఇలా వున్నాయి

"అధికార కేంద్రీకరణకు, కోట్లకు పడగలెత్తేందుకు యంత్రాలనుపయోగించడం పాపమని, అన్యాయమని నా నమ్మకం నిరుపేదలకు జీవనాధారమైన చేతివృత్తులను ధ్వంసం చేయకుండా, ప్రభుత్వ యాజమాన్యంలో స్థాపించబడే యంత్రాలకు నేను వ్యతిరేకిని కాను

" ప్రణాళిక ఏదైనాగాని, దానికి ఆర్థిక సమానత్వం పునాదిగా వుండాలి లేకపోతే

ఇసుకమీద కట్టిన భవనంలా కూలిపోతుంది" అని గాంధీజీ వివరించాడు

కాగా కాంగ్రెస్ నాయకులకు పెట్టుబడిదారులకు మధ్య సదవగాహన సత్సంబంధాలు ఏర్పడ్డాయి కాని 1939 సెప్టెంబర్ 3న రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడం, అక్టోబర్ మాసాంతంలో కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామాలివ్వడ జరిగిన పిమ్మట పెట్టుబడిదారులు యుద్ధ కంట్రాక్టులకు ఎగబడ్డారు వారి ధన దాహాన్ని తీర్చడానికి ప్రపంచ యుద్ధం బాగా పనికొచ్చింది

## సుభాస్ చంద్రబోస్ ఎన్నిక-కాంగ్రెస్‌లో చీలిక

1937 లో కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారాన్ని స్వీకరించగానే కొందరు భూస్వాములు, జమీందార్లు ఖద్దరు ధారులయ్యారు

అంతకుముందు జరిగిన మద్రాస్ అసెంబ్లీ ఎన్నికల్లో బొబ్బిలి, పిఠాపురం, మొదలగు జమీందార్లందరూ ఓడిపోయారు చల్లపల్లి జమీందారు గెలిచాడు ఆయన పార్టీ జస్టిస్ పార్టీ అది పూర్తి పరాజయాన్ని పొందింది కాబట్టి కాంగ్రెస్ మంత్రి వర్గమేర్పడగానే ఆయన ఖద్దరు ధరించాడు ఆయనతోపాటు మరొక జమీందారు అడుసుమల్లి గోపాలకృష్ణయ్యకూడా ముతక ఖద్దరు ధరించాడు "ఈ ఖద్దరు దుస్తులేమిటి?" అని నేను ప్రశ్నిస్తే- "మేం రాజభక్తులం, అధికారమెవరి చేతుల్లో వుంటుందో వారిని మేం అనుసరిస్తాం" అని జవాబిచ్చాడు గోపాలకృష్ణయ్య.

ఆ మాట అక్షరాల నిజం 1939లో కాంగ్రెస్ మంత్రివర్గాలు దిగిపోగానే వారు సన్నబట్టలు కట్టారు తిరిగి 1947లో ఖద్దరు బట్టలు వేసుకున్నారు అటుపైన చల్లపల్లి జమీందారు మంత్రిపదవి నందుకోగలిగాడు నాలాంటివారు జైళ్ళకు నెట్టబడ్డారు.

బెల్లంకొరకు చీమలు చేరినట్లుగా స్వార్థపరులు కాంగ్రెసులో చేరినప్పటికీ, 1938లో కాంగ్రెస్ అధ్యక్షుడుగా సుభాష్‌చంద్రబోస్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు బోస్‌తో సోషలిస్టులకు, కమ్యూనిస్టులకు కూడా మంచి సంబంధాలుండేవి అయినా కాంగ్రెస్ కార్యవర్గంలోకి వారినెవరినీ చేర్చుకోలేదు. నెహ్రూ అధ్యక్షుడుగానున్న కార్యవర్గంలో ముగ్గురు సోషలిస్టులుండేవారు కాని సుభాస్ చంద్రబోస్ వారిని వదిలివేశాడు

అదే సమయంలో మితవాదులకు-అతివాదులకు మధ్య సభ్యత్వ పోటీ ప్రారంభమైంది ఎక్కువమంది కాంగ్రెస్ సభ్యులను చేర్పించినవారు రాష్ట్ర కాంగ్రెస్ జనరల్ బాడీ సభ్యులుగాను, అంతకంటే ఎక్కువమందిని చేర్పించినవారు ఏ ఐ సి సి సభ్యులుగాను ఎన్నిక కాగలరు. కనుక ఇరుపక్షాలవారూ పోటీపోటీగా సభ్యులను చేర్పించారు

"జాతీయ కాంగ్రెస్ ఆశయాలలోను, సిద్ధాంతాలలోను నమ్మకంలేనివారు కాంగ్రెస్‌లో చేరుతున్నారు బోగస్ సభ్యత్వం పెరిగిపోతోంది" అని గాంధీజీ విమర్శించాడు

బోగస్ సభ్యత్వాన్ని ఎక్కువగా చేర్పించినవారు మితవాద పక్షంవారే కాంగ్రెస్ కమిటీలలోకి అతివాదులు ఎన్నిక కాకుండా చేసేందుకు వారలా చేశారు మితవాదులతో అతివాదులు పోటీపడ్డారు

1938లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి ఎన్నికలు జరిగాయి మితవాదుల అభ్యర్థిగా పట్టాభి సీతారామయ్య, అతివాదుల అభ్యర్థిగా ఎన్ జి రంగా అధ్యక్ష పదవికి పోటీ చేశారు అలాగే ప్రధాన కార్యదర్శి పదవికి గొట్టిపాటి బ్రహ్మయ్య, పుచ్చలపల్లి సుందరయ్య పోటీచేశారు. ఆ పోటీలో మితవాద నాయకులు నెగ్గారు తరువాత

ఉభయపక్షాలవారూ కలసి సంయుక్త కార్యదర్శిగా – కల్లూరి సుబ్బారావును సూచించారు కాని అందుకు ఆయన అంగీకరించక, నీలం సంజీవరెడ్డిని ఎన్నుకోవలసిందిగా విజ్ఞప్తి చేశాడు కాగా సంజీవరెడ్డి సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యాడు

ఆ పోటీలో అతివాదుల బలం బాగా కనిపించినందున, మితవాదుల కోపం పెరిగింది ఏదో ఒక సాకుతో అతివాదులను నెట్టివేసేందుకు పూనుకున్నారు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీవారు రాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి పంపిన 35 వేల సభ్యత్వ జాబితాను పట్టాభి రద్దుచేశాడు తరువాత జిల్లా కాంగ్రెస్ కమిటీ స్థానంలో మరుపిళ్ల చిట్టిని నియమించాడు

పశ్చిమ కృష్ణా కాంగ్రెస్ కమిటీ సుభాస్ చంద్రబోస్‌కు అప్పీలు జేసింది అయినా ఆయన ఏమీ చేయలేకపోయాడు కాంగ్రెస్ నాయకత్వం మితవాదం వైపుకు మొగ్గినా, కార్మిక, కర్షక, హక్కులకు భిన్నంగా వ్యవహరించినా, అధ్యక్ష పదవిలోనున్న బోస్ ఏమీ చేయలేకపోయారనుటకు ఇదొక నిదర్శనం

ఏమీ చేయలేకపోవడంవల్లనే కావచ్చు, ఆయన సహనం నశించింది ఎదురుతిరిగే ధోరణి పెరిగింది మరొక సంవత్సరంపాటు కాంగ్రెస్ అధ్యక్షుడుగా కొనసాగాలనుకున్నాడు ఆయన పేరుతోపాటు, మౌలానా అబుల్ కలాం ఆజాద్, పట్టాభి సీతారామయ్య పేర్లనుకూడా ప్రతినిధులు ప్రతిపాదించారు

"కొందరు కాంగ్రెస్ అగ్ర నాయకులు బ్రిటిష్ ప్రభుత్వ ఏజెంట్లతో రహస్య మంతనాలు సాగిస్తున్నారు కొద్ది మార్పులతో ఫెడరల్ రాజ్యాంగ చట్టం (1935)ను ఆమోదించుటకు సిద్ధపడుతున్నారు కాంగ్రెస్ ధ్యేయమైన సంపూర్ణ స్వాతంత్ర్యం విస్మరించబడుతోంది కాబట్టి, నియమిత గడువులోపల సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించుటకు పూనుకోవలసిన తరుణంలో నేను కాంగ్రెస్ అధ్యక్షుడుగా వుండాలనుకుంటున్నాను" అని సుభాష్ చంద్రబోస్ ప్రకటించాడు

ఆ ప్రకటన పటేల్, రాజేంద్రప్రసాద్ ప్రభృతులకు బాధ కలిగించింది "బ్రిటిష్ వారితో రహస్య మంతనాలు సాగిస్తున్నారనే అభాండాన్ని సుభాష్ చంద్రబోస్ తమ నెత్తిన వేశాడు" అని వారు బాధపడ్డారు. (రహస్య మంతనాల విషయాన్ని రుజువుచేసే సాక్ష్యాధారాలింతవరకూ కనిపించలేదు)

అయినా అతివాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఆ అభియోగాన్ని నమ్మారు కాగా ఎనిమిదిమంది సోషలిస్టు నాయకులు బోసును బలపరుస్తూ ప్రకటన చేశారు ఈలోగా మౌలానా ఆజాద్ తన నామినేషనును ఉపసంహరించుకున్నాడు ఇక మిగిలింది పట్టాభి మాత్రమే అధ్యక్ష పదవికి పోటీ చేయడం ఆయనకూ ఇష్టం లేదు కాని గాంధీజీ కోరినందున పోటీ చేశాడు 1939 జనవరి 28న ఎన్నిక జరిగింది. బోస్‌కు 1580 ఓట్లురాగా, పట్టాభికి 1377 ఓట్లు వచ్చాయి బోసు గెలిచాడు ఆయనను పట్టాభి హుందాగా అభినందించాడు కాని "పట్టాభి ఓటమి నా ఓటమి" అని గాంధీజీ ప్రకటించాడు "గాంధీజీ విశ్వాసాన్ని పొందలేకపోతే నా విజయం వ్యర్థం" అని బోస్ ప్రకటించాడు

నెహ్రూతో సహా 14 మందిని కార్యవర్గ సభ్యులుగా బోస్ నియమించాడు వారిలో బోసును బలపర్చిన అతివాదులెవరూ లేరు సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్, అబుల్ కలాం ఆజాద్ మున్నగు నాయకులు మాత్రమే కార్యవర్గ సభ్యులుగా నియమింపబడ్డారు

"సుభాస్ చంద్రబోస్ తమను బహిరంగంగా విమర్శించినందున, కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులుగా తాము పనిచేయజాలము" అని సర్దార్ పటేల్‌తోపాటు మరి పన్నెండు మంది సభ్యులు ఫిబ్రవరి 22న రాజీనామా చేశారు మరికొన్నాళ్లకు పండిట్ నెహ్రూకూడా రాజీనామా చేశాడు

1939 మార్చి 8-12 తేదీల మధ్య త్రిపుర కాంగ్రెస్ మహాసభ జరిగింది రాజ్‌కోటలో నిరసన వ్రతాన్ని చాలించిన గాంధీజీకూడా మహాసభకు విచ్చేశాడు సుస్తీగా వున్నప్పటికీ లక్ష్యపెట్టకుండా బోస్ అధ్యక్షత వహించాడు

గత 20 ఏళ్లనుండి కాంగ్రెస్ అనుసరించిన గాంధేయ పద్ధతులను సమర్థిస్తూ, పాతకార్యవర్గంమీద విశ్వాసాన్ని ప్రకటిస్తూ, గోవింద వల్లభ పంత్ తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు గాంధీజీతో సంప్రదించి, ఆయన సలహా ప్రకారం, కార్యవర్గ సభ్యులను నియమించవలసిందిగా బోసును కోరాడు ఆ తీర్మానానికి అనుకూలంగా 218 ఓట్లు, వ్యతిరేకంగా 133 ఓట్లు వచ్చాయి తరువాత అత్యధిక ఓట్ల తేడాతో బహిరంగ సభ తీర్మానాన్ని ఆమోదించింది కాంగ్రెస్ చీలిపోకుండా చూడాలనే ఆదుర్దావల్ల సోషలిస్టులు, రాయిస్టులు, కమ్యూనిస్టులు పంత్ ప్రతిపాదించిన తీర్మానాన్ని వ్యతిరేకించలేదు

రాజ్యాంగ నిర్ణయ సభ కొరకు కాంగ్రెస్ పట్టుబట్టాలని, అవసరమైతే బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాడేందుకు సన్నద్ధం కావాలని కోరుతూ జయప్రకాష్ నారాయణ్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని పండిట్ నెహ్రూతోపాటు కమ్యూనిస్టు నాయకుడు భరద్వాజ్‌కూడా బలపర్చాడు కాని, అందుకొక తేదీని నిర్ణయించాలనే కోర్కెను ప్రతినిధుల సభ తిరస్కరించింది గాంధీజీ సలహా ప్రకారం కార్యవర్గ సభ్యులను ఎంపిక చేసేందుకు సుభాష్‌చంద్రబోస్ ప్రయత్నించాడు. కాని గాంధీ అంగీకరించలేదు "నీ ఇష్టమొచ్చినవారిని కార్యవర్గ సభ్యులుగా నియమించుకునే హక్కు నీకు వున్నది కాబట్టి నేను ఎవరినీ సూచించదలచుకోలేదు" అని నిర్మొహమాటంగా చెప్పివేశాడు ఇక లాభం లేదని గ్రహించిన సుభాష్‌చంద్రబోస్ ఏప్రియల్ 29న కలకత్తాలో జరిగిన ఎ.ఐ సి సి సమావేశంలో తన రాజీనామాను సమర్పించాడు కాగా రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. "ఈనాడు జరుగుతున్న పెద్ద వర్గపోరాటం సామ్రాజ్య వ్యతిరేక పోరాటం ఆ పోరాటంలో ప్రధాన పాత్రను కాంగ్రెస్ వహించాలి" అని పి సి జోషి నేషనల్ ఫ్రంట్ పత్రికలో వ్రాశాడు

మేనెల 3వ తేదీన బోస్ ఫార్వర్డ్ బ్లాక్ నిర్మాణాన్ని ప్రకటించాడు జూన్‌లో వామపక్ష ఐక్య కమిటీని ఏర్పరచాడు ఆ కమిటీలో చేరేందుకు కమ్యూనిస్టులు అంగీకరించారు కాని సోషలిస్టులు, రాయిస్టులు అంగీకరించలేదు.

కాంగ్రెస్‌ను చీల్చడం కమ్యూనిస్టులకు కూడా ఇష్టంలేదు కాగా ఆ అవకాశాన్ని కాంగ్రెస్ నాయకులు ఉపయోగించుకున్నారు "రాష్ట్ర కాంగ్రెస్ కమిటీల అనుమతి పొందకుండా శాసనోల్లంఘనకు పూనుకోకూడదు" అంటూ జూలైలో జరిగిన ఎ ఐ సి సి. సమావేశంలో ఒక తీర్మానాన్ని ఆమోదింపజేశారు అందుకు వ్యతిరేకంగా బోస్ జూలై 9న నిరసన సభలు జరిపించాడు కనుక ఆగస్టు 11న జరిగిన ఎ ఐ.సి సి సమావేశం బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవినుండి బోసును తొలగించింది మరికొద్దిరోజుల్లోనే బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీని రద్దుచేసి, బి సి రాయ్, కిరణ్‌శంకర్ రాయ్ మున్నగువారితో కూడిన అడ్‌హక్ కమిటీని ఏర్పాటు చేశారు



# రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభం

సోవియట్ రష్యాను అణచివేయగలడనే నమ్మకంతో బ్రిటన్, ఫ్రాన్స్‌లు నాజీహిట్లరును సంతృప్తిపరచేందుకు, జకోస్లావేకియా స్వాతంత్ర్యాన్ని సహితం ఫణంగా పెట్టాయి అయినా హిట్లర్ దాహం తీరలేదు 1939 సెప్టెంబర్ 1న పోలెండ్ మీద దాడి చేశాడు బ్రిటన్, ఫ్రాన్స్‌లు తనతో యుద్ధానికి తలపడవని, "డాన్జిగ్ కారిడర్" సులభంగా తన హస్తగతమవుతుందని విశ్వసించాడు

కాని బ్రిటన్, ఫ్రాన్స్‌లు సెప్టెంబర్ 3న జర్మనీమీద యుద్ధాన్ని ప్రకటించాయి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది కాంగ్రెస్ మంత్రివర్గాలనుగాని, ఇతరులనుగాని సంప్రదించకుండానే వైస్రాయి లిన్‌లిత్‌గో ఇండియాను యుద్ధంలో దింపాడు

గతంలో అనేక దేశాలను జయించడానికి భారత సైనికులను బ్రిటన్ వినియోగించింది "భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని కోల్పోవడమేగాక, ఇతర దేశాల స్వాతంత్ర్యాన్ని హరించడంలో బ్రిటన్‌కు తోడ్పడింది" అనే అభిప్రాయం ఇతర దేశాలలో పాతుకుపోయింది కాబట్టి భారత సైనికులను యితర దేశాలకు పంపవద్దని కేంద్ర అసెంబ్లీ (యుద్ధం ప్రారంభం కాకముందే) వైస్రాయిని కోరింది

అంతకు చాలాకాలం ముందే కాంగ్రెస్ అలాంటి కోర్కెను వెల్లడించింది బ్రిటిష్ సామ్రాజ్య రక్షణ కొరకు భారత సైనికుల నుపయోగించడం తగదని హెచ్చరించింది అయినా వైస్రాయి లెక్కచేయలేదు నలభైకోట్ల ప్రజల భవిష్యత్తును తన గుప్పిటలో పెట్టుకొని యుద్ధాన్ని ప్రకటించాడు ఆ ప్రకటనతోపాటే అనేక ఆర్డినెన్సులనుకూడా జారీ చేశాడు వైస్రాయికి సర్వాధికారాలను కట్టబెట్టదలచిన బ్రిటిష్ పార్లమెంట్, ఇండియా రాజ్యాంగ చట్టాన్ని పదకొండు నిముషాలలో సవరించింది

సెప్టెంబర్ 14న కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం జరిగింది ఆ సమావేశానికి మహమ్మదాలీ జిన్నానుకూడా ఆహ్వానించారు కాని ఆయన హాజరు కాలేదు. సుదీర్ఘ చర్చల పిమ్మట కార్యవర్గం ఇలా తీర్మానించింది.

"ఇతరుల జోక్యం లేకుండా, తమచే ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్ణయ సభ రూపొందించే రాజ్యాంగం భారతీయులకు కావాలి స్వతంత్రంగా తమ దృక్పథాన్ని తామే నిర్ణయించుకొనుటకు తగిన స్వేచ్ఛ కావాలి. అలాంటి స్వేచ్ఛను యివ్వడానికి బ్రిటన్ సిద్ధపడకపోతే, బ్రిటిష్ సామ్రాజ్య రక్షణ కొరకు జరుగుతున్న యుద్ధానికి కాంగ్రెస్ తోడ్పడజాలదు కాబట్టి బ్రిటన్ దేని కొరకు యుద్ధం చేస్తున్నదో స్పష్టపరచాలి ప్రజాస్వామ్యం కొరకా లేక సామ్రాజ్య రక్షణ కొరకా? ఒకవేళ ప్రజాస్వామ్యం కొరకే బ్రిటన్ యుద్ధంలో దిగితే, భారతదేశం మాట ఏమిటో తేల్చి చెప్పాలి" అని ఆ తీర్మానం నిగ్గదీసింది

వెంటనే కార్మికులు ముందుకొచ్చారు ప్రభుత్వ నిర్బంధ పథకాలకు, యుద్ధానికి వ్యతిరేకంగా తొంభైవేలమంది బొంబే కార్మికులు అక్టోబర్ 2న సమ్మె చేశారు ఆ సాయంత్రం కాంగార్ మైదానంలో సభ జరిపి ఈ క్రింది తీర్మానాన్ని ఆమోదించారు.

"సామ్రాజ్యవాదుల కుట్రలకు పరాకాష్ఠగా యుద్ధం ప్రారంభమైంది ఇప్పటికే పలు దేశాల ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయారు ఇప్పుడీ యుద్ధం అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతకొక సవాలుగా పరిణమించింది కనుక ఈ సవాలును ఎదుర్కొని

కార్మిక వర్గ ఐక్యతను, స్వాతంత్ర్యం కొరకు పోరాడే ప్రజల సంఘీభావాన్నీ పెంపొందించవలసిందిగా ప్రపంచ ప్రజలకు, ముఖ్యంగా కార్మికులకు విజ్ఞప్తి జేస్తున్నాం."

కాగా వివిధ దేశాల కార్మికులకంటే ముందుగా, సామ్రాజ్యయుద్ధ వ్యతిరేకతను ప్రదర్శించి, ప్రపంచ కార్మికుల ఐక్యతను కాంక్షించిన కీర్తి బాంబే కార్మికులకు దక్కింది

ఈ యుద్ధం నాజీ జర్మనీకి- బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులకూ మధ్య జరుగుతున్నందున, యుద్ధ సన్నాహాలను భగ్నం చేయడానికి సోషలిస్టులు, కమ్యూనిస్టులు నిర్ణయించుకున్నారు భారతదేశానికి స్వాతంత్ర్యం లభిస్తేసరే, లేకపోతే బ్రిటిష్‌వారికి తోడ్పడకూడదని సుభాష్‌చంద్రబోస్ ప్రకటించాడు.

"ఫాసిజానికి వ్యతిరేకంగా బ్రిటన్, ఫ్రాన్స్‌లు పోరాడుతున్నాయి కాబట్టి యుద్ధ సన్నాహాలకు చేయూతనివ్వాలి" అని ఎం ఎన్ రాయ్ ప్రకటించాడు

"అయితే, నాజీ జర్మనీతో సంధిజేసుకొని, పోలెండులో సగభాగాన్ని సోవియట్ యూనియన్ ఆక్రమించడం తప్పుకాదా?" అని విమర్శ బయలుదేరింది ఆ విమర్శకు కమ్యూనిస్టు లీవిధంగా సమాధానం చెప్పారు

"సోవియట్ రష్యామీద దాడి చేయించేందుకు హిట్లరును బ్రిటన్, ఫ్రాన్స్‌లు బలపరిచాయి ఉభయులం కలసి హిట్లర్ దురాక్రమణను అరికడదామని స్టాలిన్ చేసిన ప్రతిపాదనను తిరస్కరించాయి జర్మనీ- రష్యాల మధ్య యుద్ధం జరిగితే, ఉభయులూ దెబ్బతినిపోతారని, తమ సామ్రాజ్యాలు పదిలంగా వుంటాయని భావించాయి కనుక (1) బ్రిటన్, ఫ్రాన్స్‌ల కుట్రలను భగ్నం చేసేందుకున్నూ, (2) అంతిమంగా హిట్లరుతో జరుగనున్న యుద్ధానికి సిద్ధమయ్యేందుకు తగినంత వ్యవధిని సంపాదించేందుకున్నూ (3) తన సరిహద్దుల మీద హిట్లర్ సైన్యాలు మోహరించకుండా దూరంగా నిలిపేందుకున్నూ, హిట్లరుతో స్టాలిన్ సంధి చేసుకోవలసి వచ్చింది" అని కమ్యూనిస్టులు వివరించారు

"ఎవరేమి చెప్పినా, అంతర్జాతీయతకంటే, జాతీయతకే అధికతర ప్రాముఖ్యత లభిస్తుంది" అన్నారు కాంగ్రెస్ నాయకులు ఆ అభిప్రాయమే క్విట్ ఇండియా తీర్మానానికి దోహదం చేసింది.

దేశ స్వాతంత్ర్యమే జాతీయ కాంగ్రెస్ లక్ష్యం అయినా అంతర్జాతీయ దృక్పథాన్ని కాంగ్రెస్ విడనాడలేదు "నా శత్రువు శత్రువు నా మిత్రుడు" అంటూ ఫాసిస్టుల వైపుకు మొగ్గలేదు అబిస్సీనియాను కబళించిన ముస్సోలినీ దురాగతాన్ని కాంగ్రెస్ ఖండించింది ముస్సోలినీ పంపిన ఆహ్వానాన్ని పండిట్ నెహ్రూ తిరస్కరించాడు ఫాసిస్టులను ప్రోత్సహించినందుకు సామ్రాజ్యవాదులను ఖండించాడు హిట్లర్, ముస్సోలినీల కుట్రలను వమ్ముజేసి, స్పానిష్ రిపబ్లిక్‌ను రక్షించేందుకు పోరాడుతున్న అంతర్జాతీయ స్వచ్ఛంద దళ సభ్యులను స్వయంగా కలుసుకొని, వారిని అభినందించాడు.

జకోస్లావేకియాను హిట్లర్ ఆక్రమించినప్పుడు, ఆ దేశ ప్రజలకు కాంగ్రెస్ తన సానుభూతిని తెలిపింది. హిట్లర్ చర్యను ఖండించడంతోపాటు మ్యూనిచ్ కుట్రకు బాధ్యులైన చేంబర్లేన్, డలాడియర్ల దుష్టబుద్ధినికూడా ఖండించింది జపాన్ దురాక్రమణను ఖండించి, చైనా ప్రజలతో సంఘీభావాన్ని కాంగ్రెస్ ప్రకటించింది కామ్రేడ్ ఛూటే కోరిక ననుసరించి, డాక్టర్ అతల్ నాయకత్వాన వొక వైద్య బృందాన్ని చైనాకు పంపింది ఈ అన్ని సందర్భాలలోను సోషలిస్టులు, కమ్యూనిస్టులు కాంగ్రెస్‌ను బలపర్చారు కాంగ్రెస్ నాయకులకంటే మిన్నగా ఫాసిజాన్ని ఖండించారు రిపబ్లికన్ స్పెయిన్‌ను బలపరుస్తూ,

జపాన్ దాడులను ఖండిస్తూ రవీంద్రుడు గేయాలు వ్రాశాడు

ఆ సమయంలో "నా శత్రువుయొక్క శత్రువు నా మిత్రుడు" అని భావించిన వారుకూడా లేకపోలేదు అలా భావించినవారిలో అగ్రగణ్యుడు సుభాష్‌చంద్ర బోస్, అయినా ఆయన తన అభిప్రాయాలను బహిరంగంగా వెల్లడించలేదు అందుకు కారణం, ఫాసిస్టు వ్యతిరేకత ప్రబలంగా వుండడమే ఈ విషయాన్ని నెహ్రూ యిలా వివరించాడు

"చైనాకు వైద్య బృందాన్ని పంపినప్పుడు సుభాష్‌చంద్ర బోస్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్నాడు ఆ పని ఆయనకు ఇష్టం లేదు అదేగాదు, ఏ విషయంలోనైనా సరే జపాన్, జర్మనీ, ఇటలీ దేశాలను విమర్శించడం తెలివితక్కువ పనిగా ఆయన భావించేవాడు ఆ దేశాలను వ్యతిరేకం చేసుకోవడం మంచిపని కాదనేవాడు మనోగత భావాలకు రాజకీయాలలో తావులేదని విశ్వసించేవాడు అయినా ఫాసిస్టుల దురాగతాలను, జపాన్ సైనిక కూటమి దాడులను ఖండిస్తూ ప్రవేశపెట్టిన తీర్మానాలను వ్యతిరేకించేవాడు కాదు ఆనాడు మన దేశంలో ఫాసిస్టు వ్యతిరేకత ఎంత బలంగా వున్నదో చెప్పడానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు " (జవహర్‌లాల్ నెహ్రూ "ది డిస్కవరీ ఆఫ్ ఇండియా")

ఫాసిస్టు వ్యతిరేకతను ఆధారంగా చేసుకొని, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ప్రపంచ ప్రజల తోడ్పాటును పొందేందుకు ప్రయత్నించారు బలహీన రాజ్యాల స్వాతంత్ర్యాన్ని కాపాడేందుకు, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించేందుకు మాత్రమే తాము నాజీజర్మనీపై కత్తిగట్టామని పదేపదే ప్రకటనలు చేశారు

"అయితే మీ కబంధ హస్తాలలో చిక్కి నలిగిపోతున్న దేశాలకు స్వేచ్ఛ నివ్వండి" అని వలస దేశాల నాయకులు డిమాండ్ చేశారు. "ఫాసిజంవల్ల ప్రపంచానికి కలుగనున్న ముప్పును 1935లోనే కాంగ్రెస్ గ్రహించింది ఫాసిజానికి తోడ్పడిన కుట్రలను ఖండించింది అయినా పరాధీన భారతదేశం అంతకంటే మిన్నగా ఏమీ చేయలేకపోయింది ఇప్పుడు ఫాసిజానికి వ్యతిరేకంగా జరుగుతున్న యుద్ధంలో తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించడానికి కాంగ్రెస్ సిద్ధంగా వుంది అయినా యుద్ధ ప్రయత్నాలకు జయప్రదం చేయగలమేరకైనా స్వాతంత్ర్యం లభించకపోతే బ్రిటిష్ ప్రభుత్వానికి తోడ్పడడం మాకు సాధ్యంగాని పని" అని నెహ్రూ ప్రకటించాడు ముస్లిమ్ లీగ్ నోరు విప్పకుండా మౌనం వహించింది

1939 అక్టోబర్ 17న కాంగ్రెస్, పంపిన సమాధానంలో వైస్రాయి శుష్కవాగ్దానాలు కురిపించాడు తన కార్యనిర్వాహక వర్గంలోకి మరి కొందరు భారతీయులను చేర్చుకుంటానన్నాడు యుద్ధకాలంలో అధికార మార్పిడి అసాధ్యమన్నాడు 1935 రాజ్యాంగ చట్టంలో మార్పులను కోరుతున్న వివిధ వర్గాలతో యుద్ధానంతరం సంప్రదించడానికి సంసిద్ధతను తెలియజేశాడు తన సూచనలను అంగీకరిస్తే, "యుద్ధానంతరం భారతదేశం, గొప్ప డొమినియన్ దేశాలమధ్య తగుస్థానాన్ని పొందగలదు" అని ఆశ చూపించాడు ఆ ఆశ అడియాస అన్నాడు గాంధీజీ

"బ్రిటన్ అడ్డుకోగలిగినట్లయితే భారతదేశంలో ప్రజాస్వామ్య ముండదని" వైస్రాయి ప్రకటన స్పష్టం చేసింది మరో రౌండ్ టేబిల్ సమావేశాన్ని గురించి వైస్రాయి వాగ్దానం చేశాడు కాని "పూర్వం జరిగిన సమావేశాలవలెనే ఇకముందు జరగబోయేది కూడా విఫలమై తీరుతుంది కాంగ్రెస్ రొట్టె అడిగితే, ప్రభుత్వం రాతిముక్క నిచ్చింది" అని గాంధీజీ విమర్శించాడు.

అయితే కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలో కొనసాగగూడదనే కోర్కె ప్రస్ఫుటమైంది అప్పటికే కాంగ్రెస్ మంత్రులు, శాంతి భద్రతలపేరుతో అమలు జరిపిన నిర్బంధ చర్యలవల్ల అపఖ్యాతి పాలైపోయారు కార్మిక కర్షక విద్యార్థి ఉద్యమాలను, సంస్థాన ప్రజల పోరాటాలను బలపరచకపోగా, కొన్ని సందర్భాలలో వ్యతిరేకించినందున కాంగ్రెస్ ప్రతిష్ఠ దిగజారింది కనుక కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలో వుండకూడదని, వుంటే ప్రజలకు వ్యతిరేకంగా దేశరక్షణ చట్టాన్ని అమలు జరపవలసి వస్తుందని, అందువల్ల కాంగ్రెస్ ప్రతిష్ఠ పూర్తిగా నశిస్తుందని కాంగ్రెస్ నాయకులు గ్రహించారు కాగా 1939 అక్టోబర్ 22న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమై, కాంగ్రెస్ మంత్రివర్గాలను రాజీనామా చేయవలసిందిగా కోరింది మరొక పది రోజుల్లో కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా లిచ్చాయి

## అతివాదుల యుద్ధవ్యతిరేకత

యుద్ధం ప్రారంభంకాగానే అతివాదులు రంగంలో దిగారు కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సోషలిస్టులు కలిసి యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు ప్రారంభించారు అక్టోబరు 2న బొంబే కార్మికులు చేసిన రాజకీయ సమ్మెవలెనే కాన్పూరు, పాట్నా, ఝరియా మొదలగు చోట్లకూడా రాజకీయ సమ్మెలు జరిగాయి 1939 సంవత్సరాంతంలోగా 110 సమ్మెలు జరిగాయి కార్మిక, కర్షక, విద్యార్థి సంఘాల నాయకులు ఏకమై, సామ్రాజ్యవాద వ్యతిరేక అఖిల భారత మహాసభను 1939 అక్టోబర్‌లో నాగపూర్‌లో జరిపారు ఆ సభలో కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులు, ఫార్వర్డుబ్లాక్ నాయకులు పాల్గొన్నారు సామ్రాజ్యవాదులకు ఫాసిస్టులకు మధ్య జరుగుతున్న యుద్ధాన్ని వ్యతిరేకించాలని తీర్మానించారు ఆ తీర్మానానుసారం పంజాబ్, యు పి , ఆంధ్ర, మలబార్, మద్రాసు ప్రాంతాలలో బ్రహ్మాండమైన యుద్ధవ్యతిరేక ప్రదర్శనలు జరిగాయి

అయినా వైస్రాయి బింకం సడలలేదు "ప్రస్తుతం కాంగ్రెస్ వెంటబడి పరుగెత్తకుండా వుండడమే నా ఉద్దేశ్యం కనుకనే కాంగ్రెస్ నాయకులతో సంభాషణలకు దిగకుండా వెనకడుగువేస్తున్నాను" అని 1940 ఫిబ్రవరిలో వైస్రాయి లిన్‌లిత్‌గో, ఇండియా కార్యదర్శిగా నున్న జెట్‌లాండ్‌కు తెలియజేశాడు

అబుల్ కలాం ఆజాద్ అధ్యక్షతన రాంఘర్‌లో 1940 మార్చిలో కాంగ్రెస్ మహాసభ జరిగింది "బ్రిటన్ ప్రధానంగా తన సామ్రాజ్యాన్ని కాపాడుకోవడంకోసమే యుద్ధం చేస్తున్నది. కాబట్టి ఈ యుద్ధంలో ప్రత్యక్షంగాకాని, పరోక్షంగాకాని కాంగ్రెస్ పాల్గొనకూడదు" అని మహాసభ తీర్మానించింది తగిన సమయమని గాంధీజీ భావించినప్పుడు, సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయించింది

అంతకుముందు అధ్యక్షపదవికి జరిగిన ఎన్నికలో ఎం ఎన్.రాయ్ ఓడిపోయాడు ఫాసిజానికి వ్యతిరేకంగా జరుగుతున్న యుద్ధంలో ఎలాంటి షరతులు లేకుండా బ్రిటన్‌కు సహాయపడాలని రాయ్ చేసిన వాదనను ఆ విధంగా మహాసభ త్రోసిపుచ్చింది. ఆజాద్‌కు 1,864 ఓట్లురాగా, రాయ్‌కి 183 ఓట్లు మాత్రమే వచ్చాయి

ఒకవైపున కాంగ్రెస్ మహాసభ జరుగుతుండగానే, మరోవైపున రాజీ వ్యతిరేక సభను సుభాష్‌చంద బోస్ ప్రారంభించాడు బ్రిటన్‌తో రాజీపడేందుకు ప్రయత్నిస్తున్న కాంగ్రెస్‌ను, గాంధీజీని నిశితంగా విమర్శించాడు ఆ సభలో సోషలిస్టులు, కమ్యూనిస్టులు పాల్గొనలేదు. అలాంటి సభ జరపడంవల్ల సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య ఉద్యమం

చీలిపోతుందనే భయంతో వారు ఎడంగా వుండిపోయారు

అయినా కమ్యూనిస్టులతోపాటు, జయప్రకాష్ నారాయణ్‌లాంటి సోషలిస్టు నాయకులుకూడా సాయుధ విప్లవాన్ని గురించి ఆలోచించసాగారు

## ముస్లింలీగ్ రాజకీయాలు-పాకిస్తాన్ తీర్మానం

కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా లిచ్చిన వెంటనే "విముక్తి దినోత్సవం" జరుపవలసిందిగా ముస్లింలను జిన్నా కోరాడు అలాగే డాక్టర్ అంబేద్కర్‌కూడా తనవారికి విజ్ఞప్తి చేశాడు అందువల్ల విభేదాలు పెరిగాయి

"విముక్తి దినోత్సవం జరపవలసిందిగా ముస్లిములను కోరడంతోపాటు, కాంగ్రెస్‌లోనున్న జాతీయ ముస్లిములపైన, ముఖ్యంగా అబుల్ కలాం ఆజాద్‌పైన జిన్నా విరుచుకుపడి, అభూతకల్పనలతో కూడిన నిందలను వారిపైన మోపాడు విముక్తి దినోత్సవం విఫలమైంది ఆ ఉద్యమానికి వ్యతిరేకంగా కొన్నిచోట్ల ముస్లింలు ప్రదర్శనలు జరిపారు. అయినా జిన్నా చేపట్టిన చర్యవల్ల వైరుధ్యాలు పెరిగాయి" అని పండిట్ నెహ్రూ వివరించాడు

జమియత్-ఉల్-ఉలేమా, అహ్రార్‌మిన్ సంఘాలవారు ఏకమై 1940లో ఢిల్లీలో సభ జరిపి, "ఆజాద్ ముస్లిమ్ కాన్ఫరెన్స్"ను స్థాపించి, ముస్లిమ్ లీగ్‌ను వ్యతిరేకించారు బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ఖండించారు

"ప్రతిదానిని కాదనడమే పనిగా పెట్టుకున్న పార్టీకి బ్రిటిష్‌వారి సానుభూతి లభించదు మీ వాదన గుర్తింపబడాలంటే, మీరూ మీ స్నేహితులూ కలసి వెంటనే ఒక పథకాన్ని రూపొందించుకోవాలి" అని 1940 ఫిబ్రవరి 6న జిన్నాకు వైస్రాయి హితవు చెప్పాడు (ఉమా కౌరా)

1940 మార్చిలో ముస్లింలీగ్ సమావేశం లాహోర్‌లో జరిగింది ఆ సమావేశంలో "పాకిస్తాన్" కావాలనే తీర్మానం ఆమోదింపబడింది

అసలీ కోర్కె 1930లో వెల్లడించబడిందని, ముస్లింలీగ్ మహాసభకు అధ్యక్షత వహించినప్పుడు మహాకవి ఇక్బల్ ఆ సూచన చేశాడని చెప్పడం జరిగింది కాని అది నిజం కాదు పశ్చిమోత్తర భారతదేశంలోగల ముస్లిమ్ మెజారిటీ ప్రాంతాలను పాకిస్తాన్‌గా ఏకంచేసి, ఒకే ఒక స్వయంపాలిత రాష్ట్రాన్ని రూపొందించాలని, ఆ రాష్ట్రం ఫెడరల్ ప్రభుత్వంలో భాగస్వామిగా వుండాలని ఇక్బల్ సూచించాడు అంతేగాని దేశాన్ని ముక్కలు చేయాలని ఆయన కోరలేదు

పంజాబీ ముస్లిమ్ విద్యార్థులు కేంబ్రిడ్జి యూనివర్శిటీలో చదువుతున్నప్పుడు, చౌధురీ రహ్మత్ ఆలీ నాయకత్వాన ఒక కమిటీగా ఏర్పడి 1933లో ఒక కరపత్రాన్ని, 1935లో మరొక కరపత్రాన్ని ప్రకటించారు. పంజాబ్, కాశ్మీర్, సరిహద్దు రాష్ట్రం, సింధ్, బెలూచిస్తాన్‌లను కలిపి "పాకిస్తాన్"గా ఏర్పాటు చేయాలని ఆ కరపత్రాలలో కోరారు. కాని ఆ కోర్కెనెవరూ ఖాతరు చేయలేదు

1938-39లో ముస్లిమ్‌లీగ్ నియమించిన కమిటీలు తయారుచేసిన నివేదికలేవీ దేశ విభజనను కోరలేదు కాని ఆకస్మాత్తుగా ముస్లిమ్ ప్రజల నాకర్షించగల ప్రత్యామ్నాయం కొరకు అస్త్రులు చాచడం ఆరంభమైంది. ఆ విషయంలో బ్రిటిష్‌వారి తోడ్పాటుకూడా లభించింది

"1939 మార్చిలో తూర్పున ఒక పాకిస్తాన్ ఫెడరేషనును, పశ్చిమోత్తర ప్రాంతంలో మరొక పాకిస్తాన్ ఫెడరేషన్‌ను ఏర్పరచాలని లీగ్ నాయకులు చేసిన విన్నపాన్ని ఇండియా కార్యదర్శి జెట్లండ్ ప్రభువు సానుభూతితో విన్నాడు" అని ఖలీ కుజ్జమాన్ వెల్లడించాడు

1939 డిసెంబరులో ఇండియాలో అనధికార పర్యటన జరిపిన స్టాఫర్డు క్రిప్సు, లియాకత్ అలీఖాన్‌తో జరిపిన చర్చల్లో "ఫెడరల్ ప్రభుత్వంనుండి విడిపోయే హక్కును రాష్ట్ర ప్రభుత్వాలకివ్వడం అవసరం" అని అంగీకరించాడు

చివరకు 1940 మార్చి 23న ముస్లింలీగ్ ఆమోదించిన తీర్మానాన్ని పంజాబ్ ప్రధానమంత్రి సికిందర్ హయత్ ఖాన్ తయారుచేశాడు దానిని కొంతవరకూ సవరించిన పిమ్మట బెంగాల్ ప్రధాన మంత్రి ఫజులుల్ హక్ ప్రతిపాదించగా, ఖలీ కుజ్జమాన్ బలపరిచాడు

ముస్లిములు మెజారిటీగానున్న పశ్చిమోత్తర ప్రాంతాలను ఏకం చేయడంద్వారా ఒక ఇండిపెండెంట్ స్టేట్‌ను, తూర్పు ప్రాంతాలను ఏకంజేయడంద్వారా మరొక ఇండిపెండెంటు స్టేటును ఏర్పరచాలి అని తీర్మానం కోరింది

స్టేట్ అనగా రాజ్యం, రాష్ట్రం అనే అర్థాలున్నాయి కాబట్టి ముస్లిమ్ లీగ్ కోరినది స్వయంపాలిత రాష్ట్రాలా? లేక రాజ్యాలా? అన్న విషయాన్ని వివరించకుండా, ఉద్దేశ పూర్వకంగానే మౌనం వహించారు కాబట్టి ప్రత్యేక పాకిస్తాన్ కావాలనే తీర్మానాన్ని ముస్లింలీగ్ ఆమోదించిందని పత్రికలు ప్రచారం చేశాయి

"ఇక్కడ ముస్లిముల రాజ్యం, అక్కడ హిందువుల రాజ్యం ఏర్పడేవిధంగా ఇండియాను విభజించే పాకిస్తాన్‌కు నేను వ్యతిరేకిని పాకిస్తాన్ అనగా పంజాబ్‌లో ముస్లిముల రాజ్యమేర్పడడమే అయితే, అలాంటి పాకిస్తాన్‌తో నాకెలాంటి సంబంధమూ వుండబోదు" అని 1941 మార్చి 11న పంజాబ్ శాసనసభలో ప్రధాన మంత్రి సికిందర్ హయత్‌ఖాన్ నిర్ద్వంద్వంగా ప్రకటించాడు

ఆ సమయంలో ముస్లిమ్ లీగ్ తీర్మానాన్ని వివరించడంలో పలువురు పలు విధాలుగా మాట్లాడారు కాని, ఆ తీర్మానం దేశ విభజనకు దారితీసింది. చివరకు పాకిస్తాన్‌నుండి బంగ్లాదేశ్ విడిపోవడానికికూడా ఆ తీర్మానమే దోహదం చేసింది

## అఖండ హిందూస్థాన్ నినాదం

"భారతదేశం హిందువులదేశం" అని వి డి సావర్కార్ ప్రకటించాడు. అఖండ హిందూస్థాన్ ఉద్యమాన్ని కె.యం మున్షీ ప్రారంభించాడు

అప్పటివరకూ సామ్రాజ్యవాదుల చంకబిడ్డగా జిన్నాను వర్ణిస్తూ, ముస్లిమ్ లీగును వ్యతిరేకించిన కొందరు ఉలేమాలు (మతగురువులు)కూడా తమ అభిప్రాయాలను మార్చుకున్నారు "భారతదేశ స్వాతంత్ర్యాన్ని నిర్ద్వంద్వంగా కోరుతున్నాను" అని జిన్నా ప్రకటించడం, భారతదేశం హిందువుల దేశమని హిందూ మహాసభ ప్రకటించడం ఉలేమాల మార్పుకు కారణమయ్యాయి బ్రిటిష్‌వారి అధికారంగాని, హిందువుల అధికారంగాని లేని స్వతంత్ర రాజ్యం తమకు లభిస్తుందని వారు భావించారు అదే భావం సామాన్య ముస్లిములలో కూడా కలిగింది కనుకనే వారు ఫ్యూడల్ వర్గాల నాయకత్వంలోనున్న ముస్లిమ్ లీగును బలపర్చారు మరొక విశేషమేమంటే, ముస్లిములు మెజారిటీగానున్న రాష్ట్రాలలోకంటే, ముస్లిములు మైనారిటీగానున్న రాష్ట్రాలలోనే పాకిస్తాన్

కావాలనే డిమాండ్ పెరగడం

1940 మేలో చర్చిల్ నాయకత్వాన బ్రిటన్‌లో కొయలిషన్ మంత్రివర్గ మేర్పడింది అప్పటికే జర్మన్ సైన్యాల బ్లిడ్జిక్రీగ్ దాడులకు ఫ్రాన్సు లొంగిపోయింది డన్‌కిర్క్‌వద్దగల బ్రిటిష్ సైన్యాలు సముద్రంలోకి నెట్టివేయబడ్డాయి కాబట్టి బ్రిటన్ రాజీకి రాకతప్పదనే భావం కాంగ్రెసు నాయకులకు కలిగింది అందుకు మరొక కారణంకూడా వుంది

కరుడుగట్టిన సామ్రాజ్యవాది చర్చిల్ అయినా ఆయన మంత్రివర్గంలో అట్లీ, స్టాఫర్డ్ క్రిప్సులాంటి లేబర్ పార్టీ నాయకులున్నారు 1939 జూన్‌లో వారికీ-నెహ్రూ, కృష్ణమీనన్‌లకు మధ్య ఒక అనధికార సమావేశం జరిగింది "ఇకముందు ఏర్పడబోయే లేబర్ పార్టీ ప్రభుత్వం-ఇండియాలో వయోజన ఓటింగ్‌ద్వారా ఎన్నికైన రాజ్యాంగ పరిషత్తుకు అధికారాన్ని బదిలీ చేస్తుంది కాని, ఇండియాలో బ్రిటిష్‌వారికిగల బాధ్యతల విషయంలోను, ప్రయోజనాల విషయంలోను బ్రిటనుకు - ఇండియాకు మధ్య ఒడంబడిక కుదిరినప్పుడు మాత్రమే అధికారాన్ని బదిలీ చేయగలుగుతుంది" అని అట్లీ, క్రిప్సులిద్దరూ నెహ్రూ, మీననులకు హామీ యిచ్చారు

కాగా కాంగ్రెస్ తన స్నేహహస్తాన్ని చాచింది "యుద్ధానంతరం ఇండియాకు స్వాతంత్ర్యమిస్తానని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించడంతోపాటు, కేంద్రంలో జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరిస్తే, హృదయపూర్వకంగా యుద్ధానికి తోడ్పడతాం" అని 1940 జూన్ 17న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానించింది

1940 ఆగస్టులో జర్మన్ విమానాల బాంబుదాడులకు గురై, ఇంగ్లండులోని పట్టణాలు నేలమట్టం కాసాగాయి ఆ స్థితిలో ఇండియాను కూడగట్టుకునేందుకు వైస్రాయి లిన్‌లిత్‌గో, ఇండియా కార్యదర్శి అమెరీ కలసి కొన్ని రాజీ ప్రతిపాదనలు తయారుచేశారు కాని ప్రధానమంత్రి చర్చిల్ వాటిని నీళ్లు కార్చాడు అందువల్ల 1940 ఆగస్టు 8న వైస్రాయి చేసిన ప్రకటనలో కొంచెమించుమించుగా, 1939 అక్టోబర్ 17న చేసిన వాగ్దానాలనే ఏకరువు పెట్టడం జరిగింది

అయినా శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించేందుకు గాంధీ సిద్ధపడలేదు "ఇప్పుడు శాసనోల్లంఘనం సాగించడం అసంబద్ధం తన స్వాతంత్ర్యమే ప్రమాదంలో పడిపోయిన దేశంతో, మన స్వాతంత్ర్యంకోసం ఎలా పోరాడగలం?" అని 1940 సెప్టెంబర్ 16న జరిగిన కాంగ్రెస్ కమిటీ సమావేశంలో గాంధీజీ ప్రశ్నించాడు

అయినా, కాంగ్రెస్ చాచిన స్నేహ హస్తాన్ని బ్రిటన్ తిరస్కరించింది సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలసి యుద్ధవ్యతిరేక చర్యలను ఉధృతం చేయడంవల్ల గాంధీజీ పునరాలోచనలో పడ్డాడు

"బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా" అనబడే ఘటనకు చిహ్నంగా నిర్మింపబడిన హాల్‌వెన్ మాన్యుమెంటును తొలగించాలని 1940 జులైలో సుభాష్‌చంద్ర బోస్ సత్యాగ్రహం ప్రారంభించాడు ఆ కల్పిత ఘటనవల్ల సిరాజ్-ఉద్-దౌలా గౌరవానికి భంగం కలిగిందని ఆరోపించాడు కనుక వందలాది ముస్లిం విద్యార్థులు సత్యాగ్రహంలో పాల్గొన్నారు ప్రభుత్వం లొంగింది బోస్ కోర్కె సఫలమైంది కాబట్టి అభిప్రాయ ప్రకటన పేరుతో, పరిమితమైన పద్ధతిలో శాసనోల్లంఘనం సాగించాలని గాంధీ నిర్ణయించుకున్నాడు

అదేసమయంలో - అనగా 1940 సెప్టెంబర్ 15న సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలిసి నిర్బంధ వ్యతిరేక దినం జరిపారు మలబార్‌లోని టెల్లీచేరీ, మత్తనూర్, మొరాజాలలో

పోలీసు కాల్పులు జరిగాయి అలాగే అనేకచోట్ల దమనకాండ ప్రజ్వరిల్లింది

"మన యువకుల మానసిక ప్రవృత్తిని నేను గమనించక తప్పదు దుర దృష్టవశాత్తూ యువకులను కమ్యూనిజం ఆకర్షిస్తోంది" అన్నాడు బిర్లాతో గాంధీజీ (ఠాకూర్‌దాస్ పత్రాలు, యస్ యన్ 177 )

అలా ఎంతో ఆలోచించిన పిమ్మట గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహానికి అనుమతించాడు కాని తనచే నియమింపబడినవారే సత్యాగ్రహం చేయాలన్నాడు తరువాత, "ఉదయం తొమ్మిది గంటలలోపున సత్యాగ్రహం చేయకూడదు ఆదివారాలలో చేయకూడదు క్రిస్మస్ రోజుల్లోను చేయకూడదు" అని స్పష్టం చేశాడు

## వ్యక్తిసత్యాగ్రహం

గాంధీజీ ఆదేశానుసారం 1940 అక్టోబరు 17న వినోబా భావే "బ్రిటన్ చేస్తున్న యుద్ధంలో భారతీయులెవరూ పాల్గొనకూడదు" అని వీధుల్లో ఉపన్యసిస్తూ అరెస్టయ్యాడు ఏదోవిధంగా కాంగ్రెస్‌వారిని రెచ్చగొట్టి, అణచివేయాలని కాచుకుకూర్చున్న ప్రభుత్వం నెహ్రూకు నాలుగేళ్ళ శిక్ష విధించింది ఆజాద్‌కు 18 నెలల శిక్ష వేసింది తరువాత సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్ మున్నగు పెద్దలు అరెస్టయ్యారు

క్రమంగా సత్యాగ్రహం చేసేవారి సంఖ్య పెరిగింది 31 మంది మాజీ మంత్రులు, 398 శాసనసభ్యులు, 22 మంది కేంద్ర అసెంబ్లీ సభ్యులు అరెస్టయ్యారు దేశరక్షణ చట్టం క్రింద అనేకమంది కమ్యూనిస్టులను, సోషలిస్టులను అరెస్టుచేసి హిజిలీ, దియోలీ క్యాంపు జైళ్లలో డిటెయిన్ జేశారు ఇతర చట్టాల క్రింద మరికొందరిని నిర్బంధించారు 1941 మే నెలనాటికి 20 వేల మంది అరెస్టయ్యారు ఆ తరువాత ఉద్యమం నీళ్ళుగారిపోయింది

"మన చేతులు కట్టివేయబడి వున్నాయి మన కళ్లకు గంతలు కట్టబడ్డాయి మన అవయవాలను కదల్చే స్థితిలో లేము మనముందున్న మార్గమేదో తెలియడంలేదు" అనే అయోమయంలో కాంగ్రెస్ నాయకులు పడిపోయారు

"కాంగ్రెసును సంప్రదించకుండా ఇండియాను యుద్ధంలో దింపినందుకుగాను బ్రిటిష్ ప్రభుత్వానికి-ఇబ్బంది కలగని రీతిలో - నిరసన తెలియజేయడం, కాంగ్రెసు మీద దాడిచేసే అవకాశాన్ని వైస్రాయికి కల్పించకుండా వుండడం" ధ్యేయంగా పెట్టుకొని ఉద్యమ స్వరూపాన్ని గాంధీ నిర్ణయించాడు . "అంతకుముందు కొన్ని సందర్భాలలో జరిగినట్లే పదునైన పోరాటాలను పక్కదారి పట్టించే ప్రయత్నం కూడా గాంధేయ వ్యూహంలో వుంది వ్యూహం, వెనకకు ముందుకు మెలికలు తిరగడానికదొక కారణంగా కనిపిస్తోంది" అన్నాడు సుమిత్ సర్కార్

## పెట్టుబడిదారుల ధనదాహం

పెట్టుబడిదారుల ధనదాహం తీర్చడానికి యుద్ధమొక వరప్రసాదమైంది భారత దేశంలోగాని, సరిహద్దులలోగాని యుద్ధం లేదు. అదెక్కడో యూరప్‌లో జరుగుతోంది కాబట్టి పెట్టుబడిదార్లు తమ దృష్టినెంతవరకూ సంపదను పెంచుకోవడం మీదనే కేంద్రీకరించారు.

వ్యవసాయక ఉత్పత్తుల ధరలు విపరీతంగా పెరగకుండా ప్రభుత్వం కంట్రోల్సు

విధించింది అయినా ధరలు కొద్దిగా పెరిగాయి అందువల్ల రైతులకు కొంత వెసులుబాటు కలిగింది కాని పారిశ్రామిక వస్తువుల ధరలు మాత్రం బాగా పెరిగాయి

దిగుమతులు ఆగిపోవడం, దేశంలో లభించే పారిశ్రామిక ఉత్పత్తి మీదనే ప్రభుత్వం ఆధారపడవలసి రావడంవల్ల, వాటి ధరలు బాగా పెరిగాయి ఫ్యాక్టరీలలో పనిచేసే వారి సంఖ్య 31 శాతం పెరిగింది కార్మికులను సంతృప్తిపరచేందుకు డియర్‌నెస్ అలవెన్సులిచ్చారు సబ్సిడీరేట్లపై అవసర వస్తువులందజేశారు పెట్టుబడిదారుల లాభాలు ఇబ్బడిముబ్బడిగా పెరుగసాగాయి

అలాంటి స్థితిలో రాజకీయ పోరాటాలు, ఘర్షణలు పెట్టుబడిదారులకు నచ్చవు కనుక బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీ పడవలసిందిగాను, యుద్ధ ప్రయత్నాలకు తోడ్పడ వలసిందిగానూ రాజకీయ పార్టీలను కోరారు ఆ విషయాన్ని గురించి ఖలీకుజ్జమాన్ ఇలా వ్రాశాడు

"బ్రిటిష్‌వారితో మరింత ఎక్కువగా సహకరించవలసిందిగా బడా పెట్టుబడిదారులు ముస్లిమ్ లీగును వత్తిడి చేశారు మా ముస్లిమ్ జాగీర్దార్లు, జమీందార్లుకూడా అలాగే వత్తిడి చేశారు ఈ జమీందార్ల లాభాలు కలప, రాక్షసబొగ్గు మొదలైనవాటి సరఫరాపై ఆధారపడి వున్నాయి కాబట్టి ఆ అవకాశాన్ని పోగొట్టుకోవడం వారికిష్టం లేదు" (పాత్‌వే టు పాకిస్తాన్, పుట 243)

ఆ స్థితిలో కొన్ని పెద్ద పరిశ్రమలను స్థాపించేందుకు ఇండియన్ పెట్టుబడిదారులు ముందుకొచ్చారు కాని ప్రభుత్వం అడ్డుకున్నది మైసూర్ దివాన్ మీర్జా ఇస్మాయిల్, వాల్‌చంద్ హీరాచంద్ మున్నగువారు కార్లు, ఓడలు, విమానాలు తయారుచేసేందుకు సిద్ధం చేసిన ప్లానులను ప్రభుత్వం తిరస్కరించి, వారిని నిరుత్సాహపరిచింది తిరస్కరించకపోతే యుద్ధానంతరం ఇండియాలో తమకు పోటీ పెరుగుతుందని భావించి ఆ పనిచేసింది

## సుభాష్ చంద్రబోస్ రహస్య యాత్ర

1940 నవంబర్ 29న జైల్లో నిరశనవ్రతం ప్రారంభించిన సుభాష్‌చంద్ర బోసును డిసెంబరు 5న ప్రభుత్వం విడుదలచేసి, గృహ నిర్బంధంలో వుంచింది ఎలాగైనా తప్పించుకుపోయి విదేశీ బలగాల సహాయంతో ఇండియాలోని బ్రిటిష్‌వారిమీద దాడి చేయాలని బోస్ నిర్ణయించుకున్నాడు మియా అక్బర్ షా ద్వారా, పంజాబ్‌లోనున్న కమ్యూనిస్టు నాయకుడు అచ్చర్‌సింగ్ చీనాతో సంబంధం పెట్టుకున్నాడు తనను రహస్యంగా సోవియట్ యూనియన్‌కు చేర్చవలసిందిగా సుభాష్ చంద్రబోస్ అచ్చర్‌సింగ్‌ను కోరాడు

మియా అక్బర్ షా, అచ్చర్‌సింగ్ చీనాలతో మరొక కమ్యూనిస్టు నాయకుడు భగత్‌రామ్ తల్వార్ చేతులు కలిపాడు ముగ్గురూ కలిసి సుభాస్‌చంద్ర బోస్‌ను కాబూలుకు చేర్చారు తరువాత ఆక్సస్ నదిని దాటించారు కాగా 1941 మార్చి 28న బోస్ బెర్లిన్‌లో ప్రవేశించాడు "1941లో భారతదేశంనుంచి బోస్ తప్పించుకుపోవడానికి భారత కమ్యూనిస్టులు బాగా సహాయపడ్డారు" అని హెచ్ వి కామత్ వెల్లడించాడు

## జర్మనీలో బోస్ కార్యకలాపాలు

బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుయ్యబడుతూ, భారత ప్రజలనుద్దేశించి బోస్ రేడియో

ప్రసంగాలు చేసేందుకు హిట్లర్ ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది కాని ఇతర కోర్కెలను తిరస్కరించింది భారతదేశాన్ని స్వతంత్ర దేశంగా ప్రకటించమని 1941 మే 29న హిట్లరును కలుసుకున్న సందర్భంలో బోస్ కోరినప్పటికీ ఫలితం శూన్యమైంది

జర్మనీకి ఖైదీలుగా చిక్కిన భారత సైనికులతో ఒక సైనిక పటాలాన్ని బోస్ నిర్మించాడు ఆ దళంలో మూడువేల మంది సైనికులుండేవారు వారినిగురించి హిట్లర్ ఇలా అన్నాడు

"భారత సైనికదళం ఉత్త జోక్ వారొక పురుగును కూడా చంపలేరు వాళ్ళని ఇంగ్లీషువాళ్ళకు ఎదురుగా నిలపడం బుద్ధిలేనిపని ఈ భారత సైనికులను ప్రార్థనా మందిరాలవద్దకు పంపితే, అక్కడ వాళ్ళు అత్యంత సాహసవంతులైన సైనికులవుతారు "

"మొదటినుండి బోసునుగాని, ఈతని సహచరులనుగాని నాజీలు నమ్మలేదు వారిపైన నిఘా వుంచారు ఉత్తరాలను సెన్సార్ చేశారు భారతదేశానికి ఉద్దేశించబడిన రేడియో ప్రసంగాలుకూడా సెన్సార్ చేయబడేవి" అని షైరర్ వివరించాడు

## రష్యాపైన హిట్లర్ దాడి

1941 జూన్ 22న సోవియట్ యూనియన్ మీద హిట్లర్ సైన్యాలు దాడి చేయడంవల్ల యుద్ధ స్వరూపం మారిపోయింది ప్రపంచంలోని ప్రజాస్వామ్యవాదులందరూ ఆందోళనతో సోవియట్ యూనియన్ వైపు చూడసాగారు 1941 ఆగస్టులో మరణశయ్యపై నున్న రవీంద్రుడు యుద్ధగతిని గురించి అడిగి తెలుసుకున్న పిమ్మట "హిట్లర్ రాక్షస మూకలను సోవియట్ సైనికులు మాత్రమే తిప్పికొట్టగలరు, సందేహంలేదు" అన్నాడు

రష్యాపై దాడి చేయకముందే బ్రిటన్‌తో సంధి చేసుకునేందుకు హిట్లర్ ప్రయత్నించాడు ఆ విషయాన్ని బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చించేందుకు హెర్‌హెస్‌ను నియమించి, అతనిని పారాచూట్‌ద్వారా ఇంగ్లండులో దింపాడు కాని అప్పటికే హిట్లర్ విషయంలో బ్రిటిష్ ప్రభుత్వానికి జ్ఞానోదయమైంది కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వం హెస్‌ను బంధించి, సోవియట్ రష్యాతో సంధిచేసుకున్నది

అయినా హిట్లర్ సైన్యాలు ముందుకు దూసుకుపోవడం, సోవియట్ రెడ్ ఆర్మీ వెనుకకు తగ్గడం అందరికీ ఆందోళన కలిగించింది. అదే సమయంలో ఆసియాను ఆక్రమించేందుకు జపాన్ సైన్యం సన్నద్ధమవుతున్న సూచనలు కనుపించాయి కనుక ప్రపంచ ప్రజలను కూడగట్టుకునేందుకు బ్రిటిష్ ప్రధాని చర్చిల్, అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టు కలసి అట్లాంటిక్ ప్రకటన చేశారు ప్రతి దేశానికి స్వాతంత్ర్యం స్వతస్సిద్ధమైన హక్కు అనీ, పరాధీన దేశాలకన్నింటికీ స్వాతంత్ర్యం సిద్ధింపచేస్తామని ప్రతిన బూనారు

ఆ ప్రతిన భారతదేశానికి కూడా వర్తిస్తుందని చాలామంది భావించారు కాని "ఫాసిస్టులవల్ల స్వాతంత్ర్యం కోల్పోయిన దేశాలకే అట్లాంటిక్ ప్రకటన వర్తిస్తుంది భారతదేశానికిగాని, బ్రిటిష్ వలసదేశాలకుగాని వర్తించదు" అంటూ సెప్టెంబరులో చర్చిల్ ప్రకటించాడు అయితే ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో ఇండియా ఎలా పాల్గొంటుంది? అనే ప్రశ్న ఉదయించింది

ఆ సమయంలో పలువురు కాంగ్రెస్ నాయకులు జైళ్ళలో వున్నారు అనేకమంది సోషలిస్టులు, కమ్యూనిస్టులు దియోలి, హిజిలీ మొదలగు క్యాంపు జైళ్లలో డిటెన్యూలుగా మగ్గుతున్నారు మిగిలినవారు రహస్యంగా వుంటూ, ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో

పాల్గొనేందుకు అవసరమైన స్వాతంత్ర్యం కొరకు పోరాడుతున్నారు కాని అది లభించడంలేదు అయితే ఏం చేయాలి?

"ఫాసిస్టు వ్యతిరేకత పేరుతో భారతీయులు యుద్ధానికి తోడ్పడితే, సామ్రాజ్య వాదులు బలపడతారు అంతేగాని సోవియట్ యూనియన్ బలపడదు" అని కమ్యూనిస్టు పార్టీ భావించింది ఇతర దేశభక్తులుకూడా అలాగే భావించారు

అయితే భారత కమ్యూనిస్టు పార్టీ అంతర్జాతీయతకంటే, జాతీయతకే ఎక్కువ ప్రాముఖ్యతనిస్తోందా? అన్న అనుమానం రేకెత్తింది భారత కమ్యూనిస్టు పార్టీ చేపట్టిన పంథా సరియైనది కాదని ఇతర దేశాల కమ్యూనిస్టు పార్టీలు భావించాయి సిద్ధాంతరీత్యా అనేక చర్చలు జరిగాయి అలా ఆరుమాసాలు గడచిన పిమ్మట భారత కమ్యూనిస్టు పార్టీ "ప్రజాయుద్ధ" నినాదాన్ని చేపట్టింది జాతీయ నాయకులను విడుదలచేసి, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచకపోతే, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధానికి ప్రజలను సమీకరించడం సాధ్యంకాదని ఆందోళన చేసింది

## పెరల్ హార్బర్‌పై జపాన్ దాడి

1941 నవంబర్‌లో జర్మన్ సేనల త్రిముఖదాడిని రెడార్మీ నిలువరించింది "నెపోలియన్ కనీసం మాస్కోను చూడగలిగాడు హిట్లరుకు అదీ సాధ్యంకాదు" అని స్టాలిన్ ప్రకటించాడు గ్రేట్ బ్రిటన్‌లోని ప్రజలు ఊపిరిపీల్చుకున్నారు కాని బ్రిటిష్ సామ్రాజ్యానికి జపాన్ సైన్యాల దాడి ప్రమాదం హెచ్చింది

కాబట్టి ఇండియా ప్రభుత్వం డిసెంబర్ 4న కాంగ్రెస్ నాయకులను విడుదల చేసింది మరొక మూడు రోజుల్లోనే జపాన్ యుద్ధ ఓడలు అకస్మాత్తుగా పెరల్ హార్బర్ మీద దాడిచేసి, పసిఫిక్ సముద్రంలోగల అమెరికా నావికాబలాన్ని ధ్వంసం చేశాయి కనుక జపాన్, జర్మనీ, ఇటలీలమీద అమెరికా యుద్ధాన్ని ప్రకటించింది జర్మనీ, జపాన్, ఇటలీ ఫాసిస్టు కూటమి గెలిస్తే ప్రపంచం అంధకార బంధురమవుతుందని ప్రజాస్వామ్య వాదులందరూ భయపడ్డారు

"రష్యా, బ్రిటన్, అమెరికా, చైనాల కూటమి వెనుక ప్రపంచవ్యాప్తంగాగల అభ్యుదయ శక్తులు నిలబడి వున్నాయి" అని నెహ్రూ ప్రకటించాడు

ఆ స్థితిలో చర్చిల్‌కు, రూజ్‌వెల్ట్‌కు మధ్య వాషింగ్టన్‌లో చర్చలు జరిగాయి ఇండియాలో రాజకీయ సంస్కరణల ఆవశ్యకతను రూజ్‌వెల్ట్ ప్రస్తావించాడు అయినా చర్చిల్ బుద్ధి మారలేదు

"బ్రిటిష్ ప్రభుత్వంలో మార్పు లేదు అయినా యుద్ధ పరిస్థితిని, దానివల్ల ఉత్పన్నమైన పరిణామాలను పరిగణించక తప్పదు కాంగ్రెస్ సానుభూతి దురాక్రమణకు గురియైనవారిపట్లనే వుంది కాని ఏం చేయాలి? -- స్వేచ్ఛ, స్వాతంత్ర్యంగల భారతదేశం మాత్రమే దేశాన్ని రక్షించుకోగల స్థితిలో వుంటుంది" అని 1941 డిసెంబరులో బార్డోలీలో సమావేశమైన కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది

దేశ రక్షణ విషయంలో అహింసా సిద్ధాంతాన్ని విడనాడేందుకు కాంగ్రెస్ సిద్ధమైంది గాంధీజీకి అది ఇష్టం లేదు. అహింసాయుత సత్యాగ్రహంద్వారా జర్మన్ సైన్యాలను ఎదిరించవలసినదిగా పోలెండ్, ఫ్రాన్సు మున్నగు దేశాల ప్రజలకు సలహా యిచ్చిన గాంధీజీ, భారతదేశం విషయంలో అహింసా సిద్ధాంతాన్ని ఎలా విడనాడగలడు? కాబట్టి

కాంగ్రెస్ నాయకత్వంనుండి తప్పుకున్నాడు

"వెంటనే భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తినివ్వాలి వైస్రాయి కార్యనిర్వాహక వర్గాన్ని జాతీయ ప్రభుత్వం స్థాయికి విస్తరించాలి" అని సప్రూ, జయకర్ మొదలగు లిబరల్ నాయకులు బ్రిటిష్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు

1942 ఫిబ్రవరిలో చాంగ్ కైషేక్ భారతదేశాన్ని సందర్శించాడు "శక్తివంతంగా యుద్ధంలో పాల్గొనడానికి తగిన రాజకీయాధికారాన్ని భారతదేశానికివ్వాలి" అని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరాడు అలాగే ఆస్ట్రేలియా విదేశాంగమంత్రికూడా కోరాడు

అట్లాంటిక్ ప్రణాళిక యావత్ ప్రపంచానికి వర్తిస్తుందని 1942 ఫిబ్రవరి 22న అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ ప్రకటించాడు ఫాసిస్టుల దురాక్రమణకు లోనైన దేశాలతోపాటు సామ్రాజ్యవాదుల పాలనలోగల దేశాలకు కూడా స్వాతంత్ర్యం సిద్ధింపజేయడమే అట్లాంటిక్ ప్రణాళిక లక్ష్యమని తేలిపోయింది

ఈలోగా జపాన్ సైన్యాలు ఆగ్నేయాసియా దేశాలను చుట్టబెట్టసాగాయి 1942 ఫిబ్రవరి 15న సింగపూర్‌ను, మార్చి 8న రంగూనును, 23న అండమాన్ దీవులను ఆక్రమించాయి

## క్రిప్సు రాయబారం

బ్రిటిష్ మంత్రివర్గ ప్రకటనను జేబులో పెట్టుకొని స్టాఫర్డ్ క్రిప్సు ఫిబ్రవరి 23న ఇండియాకు వచ్చాడు ఆ ప్రకటన ఇలా వుంది

"యుద్ధానంతరం ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి ఇవ్వబడుతుంది కామన్‌వెల్తులో కలిసి వుండటానికిగాని, విడిపోవటానికిగాని ఇండియాకు స్వేచ్ఛ వుంటుంది. రాష్ట్ర శాసనసభలు ఎన్నుకున్న ప్రతినిధులతో రాజ్యాంగ నిర్ణయ సభ ఏర్పాటు చేయబడుతుంది రాజ్యాంగ నిర్ణయ సభలో చేరకుండా ఏ రాష్ట్రమైనా వేరుగా వుండి పోవాలనుకుంటే- అలా వుండిపోయే హక్కు ఆ రాష్ట్రానికి వుంటుంది రాజ్యాంగ నిర్ణయ సభకు తమ ప్రతినిధులను నియమించవలసిందిగా సంస్థానాధీశులు కోరబడతారు కాబట్టి ప్రధాన భారతీయ వర్గాల నాయకులు వెంటనే కౌన్సిల్సులో ప్రవేశించి, తక్షణ సమస్యలను జయప్రదంగా పరిష్కరించుటకు పూనుకోవలసిందిగా ఆహ్వానిస్తున్నాము యుద్ధ వ్యవహారాలపైన కంట్రోలును బ్రిటిష్ ప్రభుత్వం కలిగివుంటుంది "

ఈ ప్రకటనను చూచిన వైస్రాయి లిన్‌లిత్‌గో తాను రాజీనామా చేస్తానని బెదిరించాడు కాగా వైస్రాయికి చర్చిల్ ఇలా వ్రాశాడు

"దురదృష్టవశాత్తూ మనకు వ్యతిరేకంగా ప్రచారమవుతున్న నీలి వార్తలను అమెరికన్‌ల అభిప్రాయాలను లెక్కజేయకుండా వుండటం సాధ్యంగానిపని మన నిజాయితీని రుజువు చేయడానికే క్రిప్సు రాయబారం ఉద్దేశించబడింది మన సూచనలను భారతీయులు తిరస్కరిస్తే, మన నిజాయితీ ప్రపంచానికి వెల్లడవుతుంది " (మాన్‌సెర్గ్-చర్చిల్ టు లిన్‌లిత్‌గో)

బ్రిటిష్ మంత్రివర్గ ప్రకటననుగాని, వైస్రాయికి చర్చిల్‌కు మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలనుగాని క్రిప్సు బహిరంగం చేయకుండానే, జాతీయ నాయకులతో సంభాషణలను ప్రారంభించాడు

తగిన అధికారం లభిస్తే, దేశ రక్షణకు పూనుకునేందుకు కాంగ్రెస్ తన సంసిద్ధతను తెలియజేసింది. కాంగ్రెస్ తరపున అధ్యక్షుడు ఆజాద్, నెహ్రూలు స్టాఫర్డ్ క్రిప్సుతో రాయబారం

నడిపారు బ్రిటిష్ యుద్ధమంత్రివర్గం రూపొందించిన ముసాయిదా ప్రకటన పత్రాన్ని క్రిప్పు వారికి చూపించాడు

సంస్థానాధీశులచే నియమించబడినవారు రాజ్యాంగ నిర్ణయ సభలో పాల్గొనేందుకు వీలు కల్పించే క్లాజును, రాజ్యాంగ నిర్ణయ సభలో పాల్గొనుటకు ఇష్టంలేని రాష్ట్రం వేరుగా వుండిపోడానికి స్వేచ్ఛనిచ్చే క్లాజును కాంగ్రెస్ నాయకులు విమర్శించారు

ఆ రెండు క్లాజులూ యుద్ధానంతరం లోతుగా పరిశీలించవలసిన సమస్యలకు సంబంధించినవి కాబట్టి వాటిని చర్చించకుండా దాటవేయడం మంచిదని నెహ్రూ చేసిన సూచనను క్రిప్పు ఆమోదించాడు

కాబట్టి వెంటనే తగినంత అధికారాన్ని జాతీయ నాయకులకు బదిలీ చేయడంపైన చర్చలు కేంద్రీకృతమయ్యాయి

"ఈ యుద్ధ సమయంలో ఫెడరల్ రాజ్యాంగ చట్టాన్ని సవరించే అవకాశం లేదు అయినా ఇపుడు ఏర్పాటు చేయబోయే ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ దాదాపు మంత్రివర్గం మాదిరిగానే పనిచేయగలుగుతుంది అందుకు ఆచరణ, సంప్రదాయం ప్రాతిపదికగా వుంటాయి 1937-39 మధ్యకాలంలో కాంగ్రెస్ మంత్రివర్గాలు స్వేచ్ఛగా పనిచేశాయి గవర్నర్లకుగల ప్రత్యేకాధికారాలు వినియోగించబడలేదు అలాగే ఇప్పుడుకూడా జరుగుతుంది" అని క్రిప్పు వివరించాడు పైగా, ఏప్రియల్ 4న చర్చిల్‌కు పంపిన కేబుల్‌లో "కొత్త ఏర్పాటు ప్రకారం ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ దాదాపుగా మంత్రివర్గంలాగానే వుంటుంది" అని తెలియజేశాడు

చివరకు దేశరక్షణ ఎవరి చేతుల్లో వుంటుందనే విషయంమీద చర్చలు ప్రారంభమయ్యాయి. ప్రజలను సమీకరించి, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో జయప్రదంగా పాల్గొనాలనే కోరికతో నెహ్రూ రాజీకి గట్టిగా ప్రయత్నించాడు ఆ సమయంలో అమెరికా అధ్యక్షుని ప్రతినిధిగా వచ్చి, ఇండియా ప్రభుత్వ అధికారులతో సైనిక వ్యవహారాలను చర్చిస్తున్న కల్నల్ జాన్‌సన్- ఉభయపక్షాల మధ్య ఏకాభిప్రాయ సాధనకు తోడ్పడ్డాడు కాగా దేశ రక్షణశాఖ భారతీయుని అధీనంలోనే వుండాలని, యుద్ధచర్యలకు, యుద్ధశాఖకు బ్రిటిష్ సైన్యాధిపతి నాయకత్వం వహించాలని అంగీకారం కుదిరింది

వెంటనే వైస్రాయి లిన్‌లిత్‌గో, సర్వసేనాధిపతి వావెల్ కలసి తమ వ్యతిరేకతను చర్చిల్‌కు విన్నవించారు బ్రిటిష్ యుద్ధమంత్రివర్గం నిర్ణయించిన అవధులను దాటి క్రిప్పు చాలా ముందుకు వెళ్ళాడని, తమతో సంప్రదించకుండా, కల్నల్ జాన్సన్ సలహాపై ఆధారపడి, కాంగ్రెస్ నాయకులు కోరినవాటికన్నింటికీ ఒప్పుకున్నాడని ఫిర్యాదు చేశారు కాగా బ్రిటిష్ యుద్ధమంత్రివర్గం క్రిప్పును మందలించి వెనుకకు లాగింది

క్రిప్పు ప్లేటు ఫిరాయించాడు సంభాషణలు భగ్నమయ్యాయి. అందుకు బాధ్యత కాంగ్రెస్ నాయకులదేనని క్రిప్పు ప్రకటించాడు ఆ ప్రకటనకు సమాధానంగా నెహ్రూ, తమకూ క్రిప్పుకూ మధ్య జరిగిన సంభాషణల వివరాలను ప్రకటించాడు ఏదో ఒక విధంగా ఒడంబడిక చేసుకోవాలనే కోర్కెతో క్రిప్పు వ్యవహరించాడని, బ్రిటిష్ మంత్రివర్గం వెనుకకు లాగడంవల్ల అబద్ధాలాడాడని తేలిపోయింది కాగా బ్రిటిష్ మంత్రివర్గ ప్రతిపాదనను అన్ని పార్టీలూ తిరస్కరించాయి

"సంభాషణలు విఫలంగావడానికి కారణం, క్రిప్పు రెండు నాల్కలతో వ్యవహరించడం కాదు, అధికారాన్ని భారతీయులకు బదిలీ చేయడానికి సిద్ధంగా వున్నట్లు చర్చిల్ చేసిన నటనే దీనికి కారణం" అన్నాడు టామ్‌లిన్‌సన్.

"భారతీయులతో ఒడంబడిక చేసుకోవాలనే బ్రిటిష్ ప్రభుత్వ కోరిక ఎంత గొప్పదో

ప్రపంచానికి వెల్లడైంది దీని ఫలితం బ్రిటన్‌లోను, యునైటెడ్ స్టేట్సులోను మనకు లాభదాయకంగా పరిణమించింది" అంటూ చర్చిల్ స్టాఫర్డ్ క్రిప్సును ఘనంగా అభినందించాడు (మాన్‌సెర్గ్ వాల్యూమ్-I)

## కోపకారణమైన ఘటనలు

ఇండియాలో క్రిప్సు కపటనాటకం నాటకం ఆడుతుండగానే, యుద్ధరంగంలో నిజమైన నాటకం ప్రదర్శితమైంది సింగపూర్, మలయా, బర్మాలను మూడు వారాలలోనే జపాన్ సైన్యాలు ఆక్రమించడంవల్ల వేలాది బ్రిటిష్ ఇండియా సైనికులు పట్టుబడిపోయారు మిగిలినవారు ఇండియాకు పరుగెత్తుకొచ్చారు పైమూడుదేశాలలోనుగల యూరోపియన్లు, తమకు దొరికిన రవాణా సాధనాలను స్వాధీనం చేసుకొని, వాటిద్వారా ఇండియాకు చేరారు కాని, దిక్కుతోచని భారతీయులు దట్టమైన అడవుల్లో, కొండల్లోబడి నడుస్తూ, మలేరియా మున్నగు రోగాలబారిపడి రోదిస్తూ, అన్నార్తులై పిల్లాజెల్లాతోసహా అలమటిస్తూ మాతృదేశానికి రావలసి వచ్చింది అలా రావడంలో తమ సర్వస్వాన్ని కోల్పోవడమేగాక అనేకమంది మరణించారు

ఆ సమయంలో యూరోపియనుల వర్ణ దురహంకారం, పచ్చిస్వార్థం స్పష్టంగా కనుపించాయి తాము పారిపోయివస్తున్న రైళ్లలో, ఓడల్లో భారతీయులను ఎక్కనివ్వలేదు బర్మానుండి ఇండియాకుగల రెండు రోడ్లలోను, మంచి రోడ్డును యూరోపియన్లకు రిజర్వు చేశారు అలాంటి చర్యల వివరాలన్నీ కాందిశీకులద్వారా దేశ ప్రజలందరికీ తెలిసిపోయాయి కాగా ప్రజల కోపాగ్ని ప్రజ్వరిల్లింది

అయినా కాంగ్రెస్ నిగ్రహం వహించింది ఏప్రియల్ నెలాఖరున అలహాబాద్‌లో సమావేశమైన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చైనా, రష్యాలకు సానుభూతి తెలిపింది ఫాసిస్టు వ్యతిరేక కూటమికి విజయం కలగాలని కోరింది.

ఆ సమావేశ సమయంలో గాంధీజీ తన అభిప్రాయాన్ని ఇలా వివరించాడు "ఇండియాకు స్వతంత్రం లభిస్తే, స్వతంత్ర భారతదేశం యొక్క ప్రధమ కర్తవ్యం జపాన్‌తో సంభాషణలు సాగించడం – జపాన్‌తో ఇండియాకు విరోధం లేదు" కాని జవహర్‌లాల్ నెహ్రూ చేసిన వివరణాత్మక కోరికపైన గాంధీజీ తన అభిప్రాయాన్ని మార్చుకున్నాడు అసలు గాంధీజీకి అలాంటి అభిప్రాయం కలగడానికిగల కారణాన్ని నెహ్రూ ఇలా వివరించాడు "బహుశా జపాన్, జర్మనీలు యుద్ధంలో విజయం సాధిస్తాయని గాంధీజీ ఊహించి వుండవచ్చు"

గాంధీజీయే కాదు, ఆ రోజుల్లో అనేకులు అలాగే అనుకున్నారు మూడు నెలల కాలంలోనే జపాన్ సేనలు ఆగ్నేయాసియాను ఆక్రమించి, ఇండియా సరిహద్దులకు చేరగలిగాయి అస్సాం, బెంగాల్ రాష్ట్రాలను విడిచిపెట్టి, ఛోటా నాగపూర్ ప్రాంతంలో జపాన్ సైన్యాలపై పోరాడేందుకు తగిన ప్లానులను బ్రిటిష్ ఇండియా సైన్యాధిపతులు సిద్ధం చేశారు కాబట్టి జపాన్ విజయం తథ్యమనిపించింది.

జర్మన్ సైన్యాలు సోవియట్ యూనియన్‌లోని దక్షిణ రాష్ట్రాలను ఆక్రమించి స్టాలిన్‌గ్రాడ్‌ను ముట్టడించాయి నేడో రేపో పట్టణం తన హస్తగతమవుతుందని గోబెల్సుతోపాటు హిట్లర్‌కూడా ప్రకటించాడు స్టాలిన్‌గ్రాడ్ పతనమైతే జర్మన్‌సేనలు బాకూనూనె గనులను స్వాధీనం చేసుకోగలుగుతాయి అక్కడినుండి ఇండియాకు చేరగలుగుతాయి అని అనేకులు జోస్యం చెప్పారు కాబట్టి జపాన్, జర్మనీలు గెలుస్తాయనే

వాతావరణ మేర్పడింది

దానికి తగినట్లుగానే బ్రిటిష్‌వాళ్లొక తప్పుడుపని చేశారు ఆనాటి బెంగాల్ రాష్ట్రంలోగల పడవలను, నావలను స్వాధీనం చేసుకొని, వాటిని ధ్వంసం చేశారు ఆ పని చేయకపోతే జపాన్ సైనికులు వాటిని స్వాధీనం చేసుకొని, దేశంలోనికి చొచ్చుకు వస్తారని భయపడ్డారు పులిని జూచి నక్క వాతలు పెట్టుకున్న చందంగా, సోవియట్ యూనియన్‌లో జరిగిన భూదగ్ధ విధానాన్ని చూచి, బెంగాల్ పడవలను ధ్వంసం చేశారు కాని ప్రజల వ్యతిరేకతను కొని తెచ్చుకున్నారు

"బెంగాల్ ప్రజల పడవలను ధ్వంసం చేయడమంటే, వారి అవయవాలను ఖండించడమే" అని 1942 మే 3న గాంధీజీ హరిజన్ పత్రికలో ఘాటుగా విమర్శించాడు

ఇండియాలోవున్న బ్రిటిష్, అమెరికన్, ఆస్ట్రేలియన్ సోల్జర్సులో ఎక్కువమంది వర్ణ దురహంకారానికి పాల్పడ్డారు మానభంగాలు మితిమీరిపోయాయి భారత మహిళల శీలాన్ని అపహరించిన విదేశీ సైనికుల చర్యలను కాంగ్రెస్ పదే పదే ఖండించింది కమ్యూనిస్టులు, సోషలిస్టులు తమ ఆగ్రహాన్ని ప్రకటించారు

జపాన్ సేనలు బర్మాను ఆక్రమించడంవల్ల బియ్యం దిగుమతులు ఆగిపోయాయి బియ్యం, ఉప్పులాంటివాటి కొరత ఏర్పడింది అవసర వస్తువుల ధరలు విపరీతంగా పెరగసాగాయి కాగా బెంగాల్లో దుర్భరమైన కరువు ప్రారంభమైంది ఆ కరువులో 34 లక్షలమంది చనిపోయారు అంటురోగాలు ప్రబలాయి కరువు వాతబడిన ప్రజలను ఆదుకోకుండా ప్రభుత్వం కళ్లు మూసుకుంది నిర్బంధ సేకరణద్వారా లభించిన ఆహార ధాన్యాలను సైన్యానికి సరఫరా చేస్తూ సంతృప్తిపడింది

బర్మా, మలయాలలో బాగా సంపాదించుకున్న భారతీయ వ్యాపారులు, కంట్రాక్టర్లు మొదలగువారు తమ సర్వస్వాన్నీ విడిచిపెట్టి, కట్టుగుడ్డలతో ఇండియాకు వచ్చారు వారి దీనస్థితిని చూచిన పెట్టుబడిదారులు - ఇండియా మీద జపాన్ దాడిచేస్తే తమకే గతి పడుతుందో? అని భయపడసాగారు. జపాన్‌వారి విమానదాడులకు తమ ఫ్యాక్టరీలు నేలమట్టమవుతాయని, యుద్ధ సమయంలో ప్రబలే అరాజకంవల్ల తాము బిక్షా ఫకీరులమై పోతామని భీతిల్లారు కాగా బ్రిటిష్‌వాళ్లు వెళ్లిపోతే జపాన్‌తో రాజీపడి, తమ ఆస్తులను రక్షించుకోవచ్చునని భావించారు

కానీ గాంధీజీ అభిప్రాయం మారింది మేనెల 26న పి సి జోషి (కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శికి) పంపిన సమాధానంలో యిలా వివరించాడు

"జపాన్ సైన్యాలు భారతదేశాన్ని విముక్తి చేస్తాయని భావించేవారితో నేను ఏకీభవించలేను. నిజానికి సుభాస్ చంద్రబోసును మనం ఎదిరించక తప్పదని నేను విశ్వసిస్తున్నాను" అని గాంధీజీ స్పష్టపరిచాడు.

ఆ స్థితిలో భారత స్వాతంత్ర్యోద్యమాన్ని విచ్ఛిన్నం చేసేందుకు ప్రభుత్వం తన సర్వశక్తులనూ కేంద్రీకరించింది రఫీ అహమ్మద్ కిద్వాయ్, శ్రీ కృష్ణదత్ పల్లీవాల్ మొదలగు నాయకులను నిర్బంధించి దమనకాండకు పాల్పడింది కాగా ప్రజలకోపాగ్ని ప్రజ్వరిల్లింది

## బ్రిటిష్‌ప్రభుత్వ కుటిలనీతి

అటు బర్మాను, ఇటు అండమాన్ దీవులను ఆక్రమించిన జపాన్ సైనిక బలగాలకు, బంగాళాఖాతంలో ఎదురులేని పరిస్థితి ఏర్పడింది

ఆ సమయంలో ఇండియామీద జపాన్ దాడిచేస్తే భారతీయుల హృదయపూర్వక

సహకారంలేనిచో దేశరక్షణ సాధ్యంగాదనే విషయాన్ని బ్రిటిష్ సేనానులతో సహా అందరూ గ్రహించారు

భారతీయుల సహకారం లభించాలంటే, దేశ రక్షణ విషయంలో తగినంత అధికారాన్ని భారతీయులకు- ముఖ్యంగా కాంగ్రెస్‌కు యివ్వాలి ఆ పనిచేస్తే, స్వతంత్ర భారత్ అవతరణకది దారితీస్తుందని చర్చిల్, లిన్‌లిత్‌గో వగైరా సామ్రాజ్యవాదులు భయపడ్డారు

కాగా, కాంగ్రెస్ నాయకుల వ్యతిరేకత వల్లనే క్రిప్సు రాయబారం విఫలమైందని ప్రపంచానికి చాటుతూ, జాతీయోద్యమాన్ని విచ్ఛిన్నం చేసేందుకు పూనుకున్నారు

జపాన్ దాడిచేస్తే, అస్సాం, బెంగాల్ రాష్ట్రాలను రక్షించడం సాధ్యంగాదు గనుక, ఛోటా నాగపూర్ ప్రాంతం వరకూ క్రమపద్ధతిలో వెనుకకు తగ్గాలని, జపాన్ సైన్యాలు దూసుకురాకుండా భూదగ్ధ విధానాన్ని అమలు జరపాలని బ్రిటిష్ సేనానులు వ్యూహం పన్నారు

ఆ వ్యూహం ప్రకారం బెంగాల్లోని వేలాది పడవలను ధ్వంసం చేశారు అందువల్ల లక్షలాది బెంగాల్ ప్రజలు తమ జీవనాధారాన్ని కోల్పోయారు రవాణా సాధనాలు లేనందున బెంగాల్ కరువు తీవ్రమైంది

ప్రభుత్వ దుష్టబుద్ధికి మరొక మచ్చుతునక మద్రాస్ హార్బరును ధ్వంసం చేయబూనడం జపాన్ విమానమొకటి హార్బర్‌మీద బాంబునువేసి వెళ్లగానే, మద్రాస్‌మీద దాడికి జపాన్ సేనలు వస్తున్నాయనే నీలి వార్త దావానలంలా వ్యాపించింది వెంటనే అధికారులు తమ కుటుంబాలను మద్రాసునుండి పంపివేశారు. కొందరు సెలవు పెట్టి పారిపోయారు జపాన్ సేనలు రావడం లేదని తెలిసిన తరువాత హార్బరును ధ్వంసంచేసే పని ఆగిపోయింది

మద్రాస్ హార్బర్ మీదుగా వెళ్ళినట్లే, వైజాగ్ హార్బర్ మీదుగాకూడా ఒక జపాన్ విమానం బాంబువేసి వెళ్లింది అధికారులు తమ ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని, ఎడ్లబళ్ల పోలు కర్రలను నిటారుగా నిలబెట్టి, అవి విమానాలను పడగొట్టే ఫిరంగులనే భ్రమను శత్రువుకు కలిగించేందుకు - పోలుకర్రలపైన నల్లటి టార్పాలినులు కప్పారు హార్బరును కాపాడేందుకు ఫిరంగులు లేవు గనుక ఆ పని చేశారు భారతదేశ రక్షణ విషయంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చర్యలు అంత చక్కగా వున్నాయన్నమాట

జపాన్ సేనలనెదిరించే శక్తిలేకపోయినా, నిరాయుధ దేశభక్తులను, ప్రజలను నిర్బంధాలపాలు చేసే శక్తి సామ్రాజ్యవాదులకుంది కాబట్టి ప్రజలను కరువుకాటకాలకు అప్పగిస్తూ ఏదో ఒక సాకుతో దేశభక్తులను జైళ్లకు నెట్టసాగారు కొన్ని ప్రాంతాలనుండి ప్రజలను నిర్బంధంగా ఖాళీ చేయించారు ఆ ప్రజలగతి అధోగతిగా మారింది

## ముందు నుయ్యి, వెనుక గొయ్యి

ఆ స్థితిలో ఏమి చేయాలో తోచక కాంగ్రెస్ నాయకులు అయోమయ స్థితిలో పడిపోయారు. "ప్రభుత్వ నిర్బంధకాండకు వ్యతిరేకంగా సత్యాగ్రహం ప్రారంభిస్తే, అది యుద్ధ చర్యలకు ఆటంకమవుతుంది అందువల్ల ఫాసిస్టులకు లాభిస్తుంది ప్రపంచ ప్రజాభిప్రాయం కాంగ్రెసుకు వ్యతిరేకమవుతుంది" అని పండిట్ నెహ్రూ భావించాడు

చైనాపైన జపాన్ ప్రారంభించిన దాడిని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు సమర్థిస్తున్న సమయంలోను, అబిస్సీనియా, స్పెయిన్ మున్నగు దేశాలను ఫాసిస్టులకు కట్టబెడుతున్న

సమయంలోను, ఫాసిస్టు దురాక్రమణలను ఖండించిన కీర్తి కాంగ్రెస్‌కున్నది ఒక దేశాన్ని మరొకదేశం కొల్లగొట్టడానికి వీలులేని అంతర్జాతీయ స్థితిని, నిరాయుధీకరణను, ప్రపంచ శాంతిని కాంక్షిస్తూ కాంగ్రెస్ 1930లోనే తీర్మానించింది కనుక తన అంతర్జాతీయ దృక్పథానికి భిన్నంగా కాంగ్రెస్ ఎలాంటి చర్యనూ చేపట్టజాలదుకదా?

ఈ మానసిక ఘర్షణ దేశంలో కొనసాగుతున్న తరుణంలోనే, నిరాశవల్ల జనించిన తెగింపుకూడా కనిపించసాగింది. ప్రజల భావాలను పసిగట్టగల గాంధీజీ కొన్ని వ్యాసాలు వ్రాసి, నూతన మార్గాన్ని చూపించాడు ఏమీ చేయకుండా చేతులు ముడుచుకు కూర్చోవడం, పరిస్థితులకు దాసోహమనడం ఆయన సహించలేకపోయాడు దురాక్రమణ నెదిరించి పోరాడేందుకు, భారతదేశానికి స్వాతంత్ర్యం లభించకపోతే ఏదో ఒకటి చేయాలనే ధోరణి గాంధీజీలో కనిపించింది

అంతర్జాతీయ పరిస్థితులను గాంధీజీ అవగాహన చేసుకున్నాడు ఆయనగారి అంతర్జాతీయ దృక్పథంలో మార్పులేదు కాని సామ్రాజ్యవాదుల కుటిల నీతికి, అణచివేత చర్యలకు దాసోహమంటే, భారతదేశ స్వాతంత్ర్యాన్ని అందరూ విస్మరిస్తారని, మొదటి ప్రపంచ యుద్ధానంతరం జరిగినట్లే, ఈ యుద్ధానంతరంకూడా భారతదేశంతోపాటు మరికొన్ని దేశాలుకూడా వలస రాజ్యాలుగానే వుండిపోతాయని ఆయన భావించాడు అయితే ఏం చేయాలి? అన్న ప్రశ్నకు ఆయన స్పష్టంగా జవాబు చెప్పలేదు

"ఇండియాను భగవంతునికి అప్పగించండి చట్టబద్ధ అరాజకం పాలు చేయకండి" అని బ్రిటిష్ ప్రభుత్వాన్ని అర్థించాడు

"జపాన్ వాళ్లను దూరంగా వుంచాలని, బ్రిటిష్ వారికన్నా నేను ఎక్కువ ఆసక్తితో వున్నాను భారతదేశ జలాలలో బ్రిటన్ ఓడిపోతే, అది ఇండియాను మాత్రమే పోగొట్టుకుంటుంది కాని జపాన్ జయిస్తే, ఇండియా తన సర్వస్వాన్నీ కోల్పోతుంది" అని గాంధీజీ వివరించాడు

"అక్షరాజ్యాలు ఒలకబోసే స్నేహపూర్వక మాటలకు నేను మురిసిపోను వారు భారతదేశానికి రాగలిగితే, విమోచనపరులుగా రారు ఓడిపోయినవారి ఆస్తులను పంచుకొనేవారుగా మాత్రమే వస్తారు" అని 1942 జూన్ 21న హరిజన్ పత్రికలో స్పష్టం చేశాడు

"బ్రిటిష్‌వాళ్లు మమ్మల్ని గౌరవప్రదంగా బ్రతకనివ్వడమూలేదు, గౌరవప్రదంగా చావనివ్వడమూ లేదు" అన్నాడు గోవింద వల్లభపంత్.

"ఈ యుద్ధంలో బ్రిటన్, అమెరికా, చైనా, రష్యాలు ఓడిపోవడం భారతీయుల అభిమతంకాదు నూతన జాతీయ ప్రభుత్వం, అన్ని పార్టీల ప్రతినిధులతో కూడివుంటుంది అది దేశ రక్షణను, రోజువారీ పరిపాలనను కొనసాగించగల స్థితిలో వుంటుంది" అని హరిజన్ పత్రికలో గాంధీజీ వ్రాశాడు

చివరకు 1942 జులై 14న వార్ధాలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమై యిలా తీర్మానించింది



# క్విట్ ఇండియా!

"బ్రిటిష్ వారు తక్షణం భారతదేశంనుండి వైదొలగాలి ఫాసిజంవంటి నియంతృత్వాలను, జాతి వివక్షతలను కూల్చివేయటానికి యిది అవసరం భారతదేశ ప్రయోజనాలకేగాక, ప్రపంచ శాంతికికూడా ఈ చర్య దోహదం చేస్తుంది" అని కాంగ్రెస్ వర్కింగ్ కమిటి డిమాండ్ చేసింది

అలా డిమాండ్ చేయడంతోపాటు "జపాన్పై యుద్ధం చేసేందుకు మిత్రరాజ్యాల సేనలు భారతదేశంలో వుండడానికి, జాతీయ ప్రభుత్వం అనుమతిస్తుంది" అని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ హామీ యిచ్చింది

"ఉద్యమాన్ని ప్రారంభించవలసి వస్తే, అది అహింసాయుతంగానే వుంటుంది" అని విదేశీ పత్రికలవారికి గాంధీజీ హామీ యిచ్చాడు

"గత మూడు నెలలుగా దేశంలో జపాన్ అనుకూల భావాలను ఎదిరించుతూ వున్నాం నిజానికి యివి జపాన్ అనుకూల భావాలు కావు బ్రిటిష్ వ్యతిరేక భావాలు మాత్రమే కాగా జపాన్తో రాజీ పడడం అనూహ్యమైన విషయం భారతదేశం నిస్తబ్ధతలో పడకూడదని మాత్రమే కోరుతున్నాం" అని పండిట్ నెహ్రూ వివరించాడు

కాంగ్రెస్ ఉద్యమాన్ని ప్రారంభించవలసిన అవసరం లేకుండా చేయవలసిందిగా కోరుతూ 1942 జులై 25న చాంగ్ కైషేక్ రూజ్వెల్ట్కొక ఉత్తరం వ్రాశాడు ఆ ఉత్తరాన్ని రూజ్వెల్ట్ చర్చిల్కు పంపాడు అయినా చర్చిల్ మొండికెత్తాడు "బ్రిటిష్ సామ్రాజ్యాన్ని రద్దు చేసేందుకు నేను, ఘనత వహించిన చక్రవర్తికి ప్రధానమంత్రిని కాలేదు" అని ఖచ్చితంగా ప్రకటించాడు

## భిన్నాభిప్రాయాలు

రాష్ట్రాలకు స్వయం నిర్ణయాధికారమిచ్చే ప్రాతిపదికపై ముస్లిమ్లీగ్తో రాజీపడి, జాతీయ ప్రభుత్వం స్థాపనకొరకు పట్టుపట్టడం మంచిదని, 1942 ప్రారంభంనుండి రాజగోపాలాచారి వాదిస్తూ వచ్చాడు ఆ వాదనను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ త్రోసిపుచ్చినందున రాజగోపాలాచారితోపాటు భూలాభాయ్ దేశాయ్కూడా రాజీనామా చేశాడు

పటేల్, కృపలానీ, రాజేంద్రప్రసాద్ మున్నగువారితోపాటు, అచ్యుత పట్వర్ధన్ నరేంద్రదేవ్ మొదలగు సోషలిస్టు నాయకులుకూడా ఏదో ఒక విధమైన పోరాటం కావాలని పట్టుబట్టారు

కరువు కాటకాల బారిపడకుండా సాధ్యమైనంతవరకూ ప్రజలకు కాపాడేందుకు, అరాచక పరిస్థితులేర్పడిన చోట్ల ప్రజలకు తోడ్పడేందుకు కాంగ్రెస్ ప్రారంభించిన కార్యక్రమాలు కార్యకర్తలను ఆకర్షించలేకపోయాయి భారత భూభాగాలను జపాన్ ఆక్రమిస్తే, వారితో సహకరించవద్దని, ఆస్తులను, భవనాలను స్వాధీనం చేసుకొనేందుకు జపాన్వారు పూనుకుంటే ప్రాణాలొడ్డి ప్రతిఘటించమని కాంగ్రెస్ నాయకులు చేసిన విజ్ఞప్తులు ప్రజల చెవికెక్కలేదు. కాగా, కాంగ్రెస్ కార్యకర్తలలో అత్యధికులు పోరాటానికి సిద్ధమయ్యారు

తమ తమ ప్రయోజనాల దృష్ట్యా ముస్లింలీగ్, హిందూ మహాసభలు రెండూ

క్విట్ ఇండియా తీర్మానాన్ని వ్యతిరేకించాయి "ఉద్యమాన్ని ప్రారంభించవద్దు" అని లిబరల్ పార్టీ నాయకులు కాంగ్రెస్‌కు విజ్ఞప్తి చేశారు

"యుద్ధానంతరం వయోజన ఓటింగ్‌ద్వారా స్వయం నిర్ణయాధికార హక్కును రాష్ట్రాలకు యిచ్చే హామీపై, ముస్లిమ్‌లీగ్‌తో రాజీపడి, బ్రిటిష్ ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకురావడం అవసరం ఒకప్రక్క జాతీయ ప్రభుత్వం కొరకు వత్తిడిచేస్తూనే, మరో ప్రక్క జపాన్ దాడిని తిప్పికొట్టేందుకు సర్వసన్నద్ధం గావడం మంచిది జాతీయోద్యమ నాయకత్వాన, ఫాసిజానికి వ్యతిరేకంగా, అనధికార ప్రజాసమీకరణ జరిగితే, ఆ బలంతో సామ్రాజ్యవాదులను జయించడం తేలిక" అని కమ్యూనిస్టు పార్టీ స్పష్టం చేసింది

సామాన్య ప్రజల కోర్కెలు కాంగ్రెస్ నాయకులకు తెలుసు కనుక కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ క్విట్ ఇండియా తీర్మానంతోపాటు ఈ క్రింది తీర్మానాన్నికూడా ఆమోదించింది

"సంస్థానాధీశులు, జమీందార్లు, జాగీర్దార్లు, వడ్డీ వ్యాపారులు మున్నగు పెట్టుబడి దారులు, తమ సంపదను, కార్మిక కర్షక కష్టజీవుల కృషి ఫలితంగా పెంచుకుంటున్నారు కాబట్టి అంతిమంగా అధికారం కష్టజీవులకు దక్కితీరాలి "

అందువల్ల ప్రజలు ఉత్తేజితులయ్యారు త్యాగాలకు సిద్ధంగా వుండవలసిందిగా గాంధీజీ ప్రజలకు విజ్ఞప్తి చేశాడు కానీ కార్యక్రమమేదీ యివ్వలేదు

క్విట్ ఇండియా (ఇండియాను విడిచిపెట్టి పోండి) అని బ్రిటిష్‌వారిని కాంగ్రెస్ కోరింది విడిచిపెట్టకపోతే చేయవలసిన పనిని గాంధీజీ నిర్ణయించాలి కాబట్టి గాంధీజీ మనసులోవున్న కార్యక్రమాన్ని తెలుసుకొనేందుకు నెహ్రూతోసహా నాయకులందరూ ప్రయత్నించారు

"ఏదో ఒక విధమైన రాజీ జరుగుతుందనే నమ్మకం నాకున్నది కాబట్టి గౌరవప్రదమైన రాజీ కొరకు గట్టిగా ప్రయత్నిస్తాను" అని గాంధీజీ జవాబిచ్చాడు

కానీ చర్చిల్, లిన్‌లిత్‌గోలు అందుకు సిద్ధంగా లేరు ఏదో ఒక సాకు జూపి కాంగ్రెస్‌ను అణచివేసేందుకు వ్యూహం పన్నారు "కాంగ్రెస్ నాయకులు పైకి ఏమి చెప్పినా, లోలోన పంచమాంగదళంగా వ్యవహరిస్తున్నారని, కాంగ్రెస్‌వారి కోర్కెను మన్నిస్తే ఇండియా జపాన్ సేనల హస్తగతమవుతుందని" ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం ప్రారంభించారు అందువల్ల దేశభక్తుల కోపాగ్ని ప్రజ్వరిల్లింది

"నిరాశవల్ల జనించిన తెంపరితనం సర్వత్రా కనిపించింది ఉద్రేకం పైచేయి సంపాదించి, తర్కాన్ని హేతువాదాన్ని వెనుకకునెట్టింది" అని నెహ్రూ అభిప్రాయపడ్డాడు

"ప్రజల మనోగత భావాలను గాంధీజీ అర్థంపట్టి చూడగలిగాడు అయినా, తొందరపడలేదు వైస్రాయితో చర్చలకు తన సంసిద్ధతను తెలియజేశాడు తాను ఏ కార్యక్రమాన్ని ప్రారంభించినా, అది అహింసాయుతంగానే వుంటుందన్నాడు కాని, ఆ కార్యక్రమమేమిటో చెప్పలేదు రాజీ ప్రయత్నాలు విఫలమైతే, ప్రభుత్వ దమన కాండను నిరసిస్తూ, ఒకరోజు మాత్రం హర్తాళ్ జరుపవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తానని ఏదో మాటల సందర్భంలో అన్నాడు. అంతేగాని పోరాట కార్యక్రమాన్ని చేపట్టలేదు ఎలాంటి త్యాగాలకైనా సిద్ధంగా వుండవలసిందిగా మాత్రమే గాంధీజీ ప్రజలకు విజ్ఞప్తి చేశాడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకూడా అలాగే విజ్ఞప్తి చేసింది" అని నెహ్రూ వివరించాడు

## ఎ.ఐ.సి.సి. సమావేశం

బ్రిటిష్ ప్రభుత్వ సమాధానంకొరకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ యిచ్చిన 24 రోజుల

గడువు ఆగస్టు 7తో ముగుస్తుంది కాబట్టి ఆ రోజున అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశాన్ని బొంబాయిలో ఏర్పాటు చేశారు పండిట్ నెహ్రూ ప్రతిపాదించిన క్విట్ ఇండియా తీర్మానానికి డాక్టర్ కె ఎం అష్రాఫ్, ఎస్ జి సర్దేశాయ్ సవరణలు ప్రతిపాదించారు కానీ అవి వీగిపోయాయి ఎ ఐ సి సి సభ్యులుగా వున్న కమ్యూనిస్టులు తప్ప తక్కినవారందరూ తీర్మానానికి అనుకూలంగా ఓటు చేశారు

చైనా, రష్యాల విజయాన్ని ఎ ఐ సి సి కాంక్షించింది మిత్ర రాజ్యాల విజయం వల్ల ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని వలస రాజ్యాలు స్వాతంత్ర్యాన్ని పొందగలవని విశ్వసించింది సాయుధంగానూ, నిరాయుధంగానూ ఫాసిజాన్ని ఎదిరించేందుకు తగిన స్వేచ్ఛ భారతదేశానికి అవసరమని ఉద్ఘాటించింది చైనా, రష్యాలలో ప్రజలు మనస్ఫూర్తిగా యుద్ధంలో పాల్గొంటున్నందువల్లనే, దురాక్రమణదారులు గెలవలేకపోతున్నారని వివరించింది అన్ని పార్టీల ప్రతినిధులతో కూడిన జాతీయ ప్రభుత్వాన్ని కేంద్రంలో నెలకొల్పి, రాష్ట్రాలకు స్వయం నిర్ణయాధికార హక్కుతోసహా ఫెడరల్ రాజ్యాంగ రచన కొరకు, రాజ్యాంగ నిర్ణయ సభను యుద్ధానంతరం సమావేశపరిచేందుకు సమ్మతించ వలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరింది

అందుకు ప్రభుత్వం సమ్మతించకపోతే, గాంధీజీ సూచించిన పద్ధతిలో సత్యాగ్రహం ప్రారంభించాలని ప్రజలకు విజ్ఞప్తి చేసింది ఒకవేళ ప్రభుత్వం గాంధీజీతోసహా కాంగ్రెస్ నాయకులందరినీ జైళ్లలో బంధిస్తే, దేశభక్తులు తలవంచకూడదని, ఎవరికి తోచిన విధంగా వారు అహింసాయుత సమరం సాగించాలని కోరింది

ఆ సమయంలో ఉద్వేగ భరితమైన దీర్ఘోపన్యాసమిచ్చిన గాంధీజీ 'డు ఆర్ డై' చావో బ్రతుకో తేల్చుకునేందుకు సిద్ధంకండి అని విజ్ఞప్తి చేసినప్పటికీ, పోరాట స్వరూపాన్ని వివరించలేదు

"కాంగ్రెస్ అధ్యక్షుడు అబుల్ కలాం ఆజాద్‌తోపాటు గాంధీజీకూడా అంత్యోపన్యాసం యిచ్చాడు ఇరువురూ ఒకే మాటను నొక్కి చెప్పారు బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధిగా వున్న వైస్రాయిని కలుసుకోవడంతోపాటు, గౌరవప్రదమైన ఒడంబడికకు తోడ్పడవలసిందిగా మిత్ర, రాజ్యాల అధినేతలకు విజ్ఞప్తి చేయబోతున్నామని ప్రకటించారు" (జవహర్‌లాల్ నెహ్రూ, ది డిస్కవరీ ఆఫ్ ఇండియా)

బ్రిటిష్ సామ్రాజ్యాన్ని యధాతథంగా నిలుపుకోవడమే చర్చిల్ అండ్ కంపెనీ ధ్యేయం ఇండియా స్వతంత్రమైతే సామ్రాజ్యం కూలిపోతుందని చర్చిల్‌కు తెలుసు కాబట్టి క్విట్ ఇండియా తీర్మానంవల్ల లభించిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా కాంగ్రెస్‌మీద విరుచుకుపడేందుకు సైనిక, పోలీసు బలగాలను ప్రభుత్వం సిద్ధం చేసింది కాగా, మిత్రదేశాల అధినేతలకు విజ్ఞప్తి చేసే అవకాశాన్ని కాంగ్రెస్ నాయకులకు యివ్వకుండా, అర్ధరాత్రి సమయంలో గాంధీజీతోసహా కాంగ్రెస్ నాయకులందరినీ అరెస్టు చేసింది

## ప్రభుత్వ దమనకాండ - ప్రజల తిరుగుబాటు

1942 ఆగస్టు 9న సూర్యోదయం కాకముందే దేశవ్యాప్తంగాగల కాంగ్రెసు నాయకులనందరినీ అరెస్టు చేశారు దమనకాండ ప్రారంభ కేంద్రం బొంబే నగరం కాబట్టి, ప్రజల తిరుగుబాటుకూడా అక్కడే ప్రారంభమైంది ఆగస్టు 9 నుండి 14 వరకూ నగరంలో పనులన్నీ స్తంభించిపోయాయి విద్యార్థులు విజృంభించి పోలీసులమీద

భాంబులు విసిరారు

ఆగస్టు 10నుండి 17 వరకూ కలకత్తా నగరంలో పూర్తి హర్తాళ్ జరిగింది పాట్నా సెక్రటేరియట్‌వద్ద ప్రజలకు, పోలీసులకు మధ్య ఘర్షణ జరిగింది పట్టణం రెండు రోజులపాటు ప్రజల స్వాధీనమైంది. ఆగస్టు 12న ఢిల్లీలో కార్మికులు సమ్మె చేసి, ప్రభుత్వ యంత్రాంగాన్ని స్తంభింపజేశారు "ఢిల్లీ ఘటనలకు కారణం కార్మికుల సమ్మె" అని లిన్‌లిత్‌గో అమెరీకి తెలియజేశాడు "లక్నో, కాన్పూర్, బాంబే, నాగపూర్, అహమ్మదాబాద్ కేంద్రాలలో కార్మికులు సమ్మె ప్రారంభించారు" అని కూడా 13వ తేదీన లిన్‌లిత్‌గో అమెరీకి తెలియజేశాడు

జమ్‌షెడ్‌పూర్‌లోని తాతా ఐరన్ అండ్ స్టీల్ వర్క్సులో ఆగస్టు 20 నుండి 13 రోజులపాటు సమ్మె జరిగింది జాతీయ ప్రభుత్వ మేర్పడేంతవరకూ సమ్మె జేస్తామని కార్మికులు ప్రకటించారు కాని యజమానులు నచ్చజెప్పినమీదట పనిలో చేరారు

అహమ్మదాబాద్ మిల్లు వర్కర్లు మూడున్నర నెలలపాటు సమ్మె చేశారు కాగా "స్టాలిన్‌గ్రాడ్ ఆఫ్ ఇండియా"గా అహమ్మదాబాద్‌ను గోవింద సహాయ్ వర్ణించాడు

## తెనాలిలో కాల్పులు

ఆగస్టు 12న తెనాలిలో విద్యార్థులు సమ్మె చేశారు విద్యార్థులతో కాంగ్రెస్ కార్యకర్తలు చేతులు కలిపారు అందరూ కలిసి కల్లూరి చంద్రమౌళిగారి నాయకత్వాన ఊరేగింపు జరిపి, హర్తాళ్‌ను జయప్రదం చేయించారు ఆఖరున రైల్వే స్టేషనులోని కాంటీనును మూసివేయించేందుకు వెళ్ళారు కాంటీన్ మేనేజర్ నిరాకరించడంవల్ల ఘర్షణ ప్రారంభమైంది

తెనాలినుండి గుంటూరు వెళ్ళే రైలును ప్రజలు ఆపివేసి, దానికి నిప్పుపెట్టారు రైల్వేస్టేషనును, రైల్వే సిగ్నల్సునుకూడా ధ్వంసం చేశారు వెంటనే గుంటూరునుండి జిల్లా కలెక్టర్, పోలీస్ సూపర్నెంట్ రిజర్వు బలగాలతో తెనాలివచ్చి ప్రదర్శకులమీద కాల్పులు జరిపించారు ఆ కాల్పుల్లో ప్రయాగ వీరరాఘవయ్య, జాస్తి అన్నయ్య, అమ్మినేని సుబ్బారెడ్డి, గాలి రామకోటయ్యలతోపాటు మరో ముగ్గురు మరణించారు 11 మంది గాయపడ్డారు

చీరాలలో 500మంది విద్యార్థులు ఊరేగింపుగా వెళ్ళి మేజిస్ట్రేట్ కోర్టును మూసివేయించారు తరువాత సబ్ రిజిస్ట్రార్ ఆఫీస్, సేల్సుటాక్సు ఆఫీసులను మూసి వేయించారు చివరకు రైల్వే స్టేషనుమీద దాడి చేశారు అప్పటికి ప్రదర్శకుల సంఖ్య 1500కు పెరిగింది ట్రాలీమీద వెళుతున్న సైనిక రిక్రూటింగ్ ఆఫీసరును, మరొక రైల్వే అధికారిని పట్టుకుని, వారిచేత "గాంధీజీకి జై" అనిపించి విడిచిపెట్టారు రిజర్వు పోలీసులొచ్చేలోగా ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు

ఆగస్టు 13న గుంటూరులోని గాంధీ పార్కునుండి బయలుదేరిన ప్రదర్శనలో రెండువేలమంది పాల్గొన్నారు ప్రదర్శన కొంతదూరం సాగిన పిమ్మట పోలీసులు తుపాకులు కాల్చగా ఇద్దరు మరణించారు పలువురు గాయపడ్డారు పోలీసుల కాల్పులను బార్ అసోసియేషన్ ఖండించింది వారం రోజులపాటు విద్యార్థులు సమ్మె జేశారు

కృష్ణాజిల్లాలోని ఉప్పులూరు స్టేషన్ సమీపంలో రైలుపట్టాలు తొలగించినందున, ఆగస్టు 14న రిజర్వు పోలీసులను తీసుకుపోతున్న ప్రత్యేక రైలు ప్రమాదానికి గురైంది పాలకొండ రైల్వే స్టేషన్‌మీద 1500 మంది దాడిచేసి గూడ్సు షెడ్డును తగలబెట్టారు

ఆకివీడు, అత్తిలి, నిడుబ్రోలు, దెందులూరు, ఉండి మొదలగు రైల్వే స్టేషన్లు కూడా ప్రజల కోపాగ్నికి గురయ్యాయి చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి దగ్గర ఒక గూడ్సు రైలు పడిపోయింది 1500 చోట్ల టెలిఫోన్, టెలిగ్రాఫ్ తీగలు తెంచి వేయబడ్డాయి

## పోలీస్ స్టేషన్లపై దాడులు

ఆగస్టు 17న పాలకొల్లులో ప్రజలు పోలీస్ క్వార్టర్సుమీద దాడిచేసి వాటిని పడగొట్టారు సబ్‌జైలును, ట్రెజరీని కాపాడుతున్న పోలీసులనుండి తుపాకులను గుంజుకున్నారు ఆ సమయంలో రిజర్వు పోలీసులు జరిపిన కాల్పులవల్ల ఒక వ్యక్తి మృతి చెందాడు

ఆకివీడు పోలీస్‌స్టేషనుమీద ప్రజలు దాడిచేసి, పోలీసులవద్దనున్న లారీలను, తుపాకులను గుంజుకున్నారు స్టేషన్‌లోని రికార్డులను తగులబెట్టారు అల్లూరు పోలీస్‌స్టేషనుమీద హఠాత్తుగా యాభైమంది దాడిచేసి, అక్కడనున్న ముగ్గురు పోలీసులను బంధించి, రికార్డులు, ఫర్నిచరు ధ్వంసం చేశారు ఆకివీడు, కళింగపట్నం మున్నగుచోట్ల పోస్టాఫీసులు పూర్తిగా దగ్ధమైపోయాయి

1942 ఆగస్టు 17న భీమవరంలో జరిగిన బహిరంగసభలో రెండువేలమంది పాల్గొన్నారు సభానంతరం విద్యాలయాలను మూసివేయించేందుకు పూనుకున్నారు తమ స్కూలును మూసివేయడానికి స్థానిక యు ఎల్ సి ఎం వారు నిరాకరించడంవల్ల ఉద్రిక్తత పెరిగింది స్కూలు బల్లలు, కుర్చీలు ముక్కలయ్యాయి స్కూలు మూతపడింది

అక్కడనుండి ప్రజలు ఆర్ డి ఓ ఆఫీసుకు వెళ్ళారు రాజీనామా పత్రంమీద ఆర్ డి ఓ తో సంతకం చేయించి, ఆయన చేతికి కాంగ్రెస్ జెండా యిచ్చి, ఊరేగింపులో కొంతదూరం నడిపించారు ఆర్.డి ఓ ఆఫీసు, డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు ఆఫీసు తగలబెట్టారు. కలెక్టరు క్యాంపు ఆఫీసుమీద జాతీయ జెండాను ఎగరేసి, టౌన్ పోలీసుస్టేషన్‌మీద దాడికి బయలుదేరారు

ప్రజలు స్టేషన్ సమీపంలోకి రాగానే పోలీసులు కాల్పులు ప్రారంభించారు. అయినా జనం ముందుకు తోసుకువెళ్ళారు కాని స్టేషనులో ప్రవేశించలేకపోయారు ఆ ఘర్షణకు ముగ్గురు మరణించారు 5గురు తీవ్రంగా గాయపడ్డారు ప్రజలు నిప్పు పెట్టడంవల్ల ,పోలీస్ క్వార్టర్సులో కొన్ని తగలబడిపోయాయి ఇన్‌స్పెక్టర్ కుటుంబ సభ్యులు తప్పించుకు పారిపోయారు.

## ప్రభుత్వ ఘాతుక చర్యలు

ఇలా దేశమంతటా ఉప్పొంగుతున్న దేశభక్తిని కాలరాచేందుకు వైస్రాయి పూనుకున్నాడు ఆగస్టు 15న పాట్నా వద్ద ప్రజలమీద విమానాలనుండి ఫిరంగులు కాల్చేందుకు సైన్యానికి అనుమతినిచ్చాడు. బీహార్‌లోని భాగల్పూర్, మాంఘీర్ జిల్లాల్లోను, బెంగాల్లోని నాడియా, తామ్‌లుక్ ప్రాంతాలలోను, ఒరిస్సాలోని తాల్‌చేర్ ప్రాంతాలలోను ప్రజలమీద విమానాలనుండి ఫిరంగులు కాల్చడంతోపాటు, బాంబులుకూడా వేశారు

"గ్రామాలను తగలబెట్టేందుకు ప్రభుత్వం, ఇన్‌సెన్‌డియరీ దళాలను ఉపయోగించింది సాముదాయక జరిమానాల పేరుతో విచ్చలవిడిగా అధికార దోపిడీలు కొనసాగాయి. హింసా చర్యలలో నూతన పద్ధతులను ప్రవేశపెట్టారు ఆసనాలలో

రూళ్లకర్రలు దూర్చడంలాంటి పైశాచిక చర్యలు పూనుకున్నారు నేనెంత ప్రయత్నించినా అధికార ఉన్మత్తతను ఆపలేకపోయాను" అని అజాంగర్ జిల్లా మేజిస్ట్రేట్ ఆర్ హెచ్ నిబ్లెట్ తన డైరీలో వ్రాసుకున్నాడు

'1857లో జరిగిన సిపాయి తిరుగుబాటు తరువాత, పెద్దఎత్తున ప్రారంభమైన ప్రజల తిరుగుబాటు ఇదే యుద్ధ పరిస్థితిని దృష్టిలో వుంచుకొని, తిరుగుబాటు యొక్క ఉధృతాన్ని ప్రపంచానికి వెల్లడించకుండా కప్పిపెట్టవలసి వచ్చింది" అని ఆగస్టు 31న లిన్‌లిత్‌గో చర్చిల్‌కొక టెలిగ్రాం పంపాడు "పట్టణాలలోని మధ్యతరగతి ప్రజలు, విద్యార్థులు కలసి ప్రారంభించిన పోరాటాలను అణచివేసేందుకు 57 సైనిక బెటాలియన్‌లను ఉపయోగిస్తున్నాం" అని ఇండియా ప్రభుత్వం అమెరికాకు తెలియచేసింది

అందువల్ల పోరాటం పట్టణాలనుండి గ్రామసీమలకు విస్తరించింది టెర్రరిస్టు కార్యకలాపాలు పెరిగాయి రవాణా మార్గాల మీదను, పోలీస్ సైనిక కేంద్రాల మీదను దాడులు ప్రారంభమయ్యాయి భారత్-నేపాల్ సరిహద్దు ప్రాంతాలలో జయప్రకాష్ నారాయణ్ నాయకత్వాన గెరిల్లా పోరాటం ప్రారంభమైంది

పగలు వ్యవసాయంచేస్తూ, రాత్రిళ్ళు రవాణా మార్గాలను ధ్వంసం చేసే రైతు దళాలు కర్ణాటకలో నిర్మింపబడ్డాయి తామ్‌లుక్, సతారా, తాల్‌ఛేర్ మున్నగుచోట్ల స్వతంత్ర ప్రభుత్వాల స్థాపనకూడా జరిగింది అయినా అవి ఎక్కువకాలం నిలవలేకపోయాయి

## సామూహిక జరిమానాలు-ముస్లిములు వగైరాల మినహాయింపు

రైల్వేలు, టెలిగ్రాఫ్ లైన్లు మున్నగు వాటిని ధ్వంసం చేసేవారికి కొరడా దెబ్బల శిక్షనుండి మరణశిక్ష వరకూ విధించే అధికారాన్ని జిల్లా కలెక్టర్లకు కట్టబెడుతూ ఒక ఆర్డినెన్సును ప్రకటించారు ప్రజలమీద సామూహిక జరిమానాలు విధించేందుకు మరొక ఆర్డినెన్సును ప్రకటించారు సామూహిక జరిమానాలనుండి ముస్లిములు, క్రైస్తవులు, షెడ్యూల్డ్ తరగతులు, ప్రభుత్వోద్యోగులు మినహాయింపబడ్డారు విభజించి పాలించే నీతికి ఇదొక మచ్చుతునక

గుంటూరు జిల్లాలో రూ 3,21,681 సామూహిక జరిమానాల క్రింద వసూలు చేశారు పశ్చిమగోదావరిలో రూ 2,48,285 వసూలు చేశారు కృష్ణా, కడప, కర్నూల్, అనంతపురం, నెల్లూరు జిల్లాలలోకూడా సామూహిక జరిమానాలు విధింపబడినాయి

1942 సెప్టెంబర్ 20వ తేదీన జగ్గయ్యపేటలో రెడ్‌క్రాస్ నిధికొరకు, కృష్ణాజిల్లా కలెక్టర్, చింతామణి నాటక ప్రదర్శనను ఏర్పాటు చేశాడు ప్రదర్శనను తిలకిస్తున్న కలెక్టర్‌మీద ఉద్యమకారులు రెండు చేతి బాంబులు విసిరారు కలెక్టర్ గాయపడలేదు కాని ఆరుగురు ప్రేక్షకులు గాయపడ్డారు ఆ సందర్భంలో 9 మందికి కఠిన శిక్షలు విధించారు 1943 ఫిబ్రవరిలో బెజవాడలో సోదాలు జరిపి కొన్ని నాటుబాంబులను, ఆయుధాలను స్వాధీనం చేసుకున్నారు.

ఆంధ్ర జిల్లాల మొత్తంమీద 21 చోట్ల పోలీసు కాల్పులు, కొన్నిచోట్ల సైనికుల కాల్పులుకూడా జరిగాయి యాభై ముగ్గురు ప్రాణాలు కోల్పోయారు 677 మందికి గాయాలు తగిలాయి ప్రత్యేక క్రిమినల్ కోర్టులలో 897 మందికి శిక్షలు విధించారు. మామూలు కోర్టుల్లో 3134 మందికి శిక్షలు పడ్డాయి ఇద్దరికి మరణశిక్ష, 285 మందికి కొరడా దెబ్బల శిక్ష వేశారు

దేశం మొత్తంమీద 91,836 మందిని అరెస్టు చేశారు. 332 రైల్వే స్టేషనులను, 945 పోస్టాఫీసులను ఉద్యమకారులు ధ్వంసం చేశారు 664 చోట్ల బాంబులు విసిరారు అరవై ముగ్గురు పోలీసులు బాంబుదెబ్బలవల్ల మరణించారు పదివేల మంది దేశభక్తులు ప్రాణాలర్పించారు మానభంగాలు లెక్కలేకుండా జరిగాయి తామ్‌లుక్ సబ్ డివిజన్‌లో 74 చోట్ల మానభంగాలు జరిగాయి అక్కడ ఒకే ఒక గ్రామంలో 46 మంది తమ శీలాన్ని కోల్పోయారు కొన్నిచోట్ల, విమానాలనుండి ఫిరంగులు కాల్చారు ప్రశాంతంగా సత్యాగ్రహం చేసిన సరిహద్దు రాష్ట్రంలోకూడా వేలాది ప్రజలను అరెస్టు చేశారు ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్‌ను పోలీసులు లారీలతో కొట్టారు హైద్రాబాద్ సంస్థానంలో రామానందతీర్థ, మేల్కోటే, రాజలింగం, నారాయణరావు, రామచంద్రరావు, పద్మజానాయుడు మున్నగు ప్రముఖులనందరినీ అరెస్టు చేశారు

## కమ్యూనిస్టు పార్టీ కృషి

"ఒకే భాష, నాగరికత, సంస్కృతి కలిగి, భౌగోళికంగా కలసివున్న ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలకు స్వయం నిర్ణయాధికార హక్కును ఇచ్చినట్లైతే ముస్లిముల భయం తీరిపోతుంది మత ప్రాతిపదికపై జిన్నా చెప్పే ద్విజాతి సిద్ధాంతం తెచ్చిపెట్టగల ప్రమాదం తొలగిపోతుంది కాంగ్రెస్, ముస్లిమ్ లీగులు ఏకమైతే, కేంద్రంలో జాతీయ ప్రభుత్వ స్థాపనను బ్రిటిష్ ప్రభుత్వం తిరస్కరించజాలదు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ సన్నాహంలో పాల్గొనడంద్వారా జాతీయ స్వాతంత్ర్య శక్తులు బాగా బలపడతాయి. ఆ స్థితిలో దేశ స్వాతంత్ర్యాన్ని అరికట్టడం ఎవరికీ సాధ్య కాదు" అంటూ కమ్యూనిస్టు పార్టీ ప్రచారం చేసింది.

గాంధీజీని, కాంగ్రెస్ నాయకులను దురుద్దేశపూర్వకంగా ప్రభుత్వం అరెస్టు చేసినప్పుడు, వారి విడుదల కొరకు ఆందోళన ప్రారంభించింది నిర్హేతుకంగా జాతీయ నాయకులను అరెస్టు చేయడంవల్ల దేశంలో జపాన్ అనుకూలత పెరిగే ప్రమాదమున్నదని బ్రిటిష్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది. జాతీయ ప్రయోజనాలను సాధించుకునేందుకు అంతర్జాతీయ దృక్పథం అవసరమని దేశభక్తులకు వివరించింది

అయినా కమ్యూనిస్టులు కోరేది చైనా, రష్యాల స్వాతంత్ర్యమేగాని భారతదేశ స్వాతంత్ర్యం కాదని కొందరు ప్రచారం సాగించారు "కమ్యూనిస్టులకు మాతృదేశం భారతదేశం, పితృదేశం రష్యా దేశం" అని మరికొందరు ప్రచారం చేశారు

"జర్మనీ ఆర్యులది వారి పార్టీ నాజీపార్టీ, వారి పతాక గుర్తు స్వస్తిక్, వారి నాయకుడు హిట్లర్, ఆర్యుల క్షాత్ర ధర్మాన్ని పునరుద్ధరించేందుకు అవతరించిన మహానాయకుడు సంభవామి యుగే యుగే కనుకనే మన బోసుబాబు జర్మన్ సైన్యాల అండతో భారత ఖండాన్ని విముక్తిచేయ పూనుకున్నాడు" అంటూ హిందూ మతతత్త్వవాదులు చంకలెగరేశారు. "భారతదేశంలోని ఆర్యులు, బానిసబుద్ధిగల ఆర్యులు" అని హిట్లర్ వేసిన నిందను గుట్టుచప్పుడు కాకుండా దిగమింగారు.

ఇలాంటి మోసపూరిత ప్రచారాలను బట్టబయలు చేయడమేగాక, బ్రిటిష్ ప్రభుత్వం ప్రారంభించిన దుష్ట ప్రచారాన్ని కూడా కమ్యూనిస్టు పార్టీ వమ్ము చేయగలిగింది

కళా వెంకటరావు పేరుతోనున్న ఆంధ్ర సర్క్యులర్‌కు ఎ.ఐ.సి.సి గాని, గాంధీజీగాని ఆమోదం తెలుపలేదని ప్రకటించింది అంతేగాక, ఆ సర్క్యులర్‌లో హింసాత్మక చర్యలను

ప్రోత్సహించే వాక్యమేదీ లేదని రుజువు చేసింది కాగా, కాంగ్రెస్ నాయకులు జపానుకు అనుకూలురు" అంటూ బ్రిటిష్ ప్రభుత్వం ప్రారంభించిన దుష్ప్రచారం విఫలమైపోయింది

కాని ఎ ఐ సి సి పేరుతో కొన్ని సర్క్యులర్లు వెలువడినాయి రకరకాల పోరాట పద్ధతులు సూచించబడినాయి కాబట్టి, వాటితో కాంగ్రెసుకు ఎలాంటి సంబంధమూ లేదని స్పష్టంగా చెప్పవలసిన అవసరమేర్పడింది కాగా పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ కలసి 1945 సెప్టెంబర్ 21న ఈ క్రింది ప్రకటన చేశారు

"ఏ ఐ సి సి గాని, గాంధీజీగాని అధికారయుతంగా ఎలాంటి ఉద్యమాన్ని ప్రారంభించలేదు "

కాంగ్రెస్ ఉద్యమాన్ని ప్రారంభించలేదనే విషయం అనేకమందికి తెలియదు క్విట్ ఇండియా తీర్మానాన్ని క్విట్ ఇండియా ఉద్యమంగా అనేకులు పరిగణించారు అందులో పాల్గొననందుకు కమ్యూనిస్టు పార్టీని తిట్టిపోశారు పార్టీ ఆఫీసులమీద దాడి చేశారు అయినా కమ్యూనిస్టులు వెనుకడుగువేయలేదు

## స్టాలిన్ ప్రకటన

1942 నవంబర్ నాటికి హిట్లర్ సైన్యంమీద సోవియట్ రెడార్మీ పైచేయి సంపాదించింది నవంబర్ 7న జరిగిన సోవియట్ విప్లవ 25వ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తూ స్టాలిన్ ఇలా ప్రకటించాడు

"జాతి దురహంకారాన్ని రూపుమాపడం, అన్ని జాతులకు సమాన హక్కులు కల్పించడం, చిన్న పెద్ద దేశాల స్వాతంత్ర్యంతోపాటు వాటి భౌగోళిక హద్దులను కాపాడడం, అన్ని దేశాలకు స్వాతంత్ర్యమివ్వడం, ఆయా దేశాల ప్రజలు తమకిష్టమైన రాజ్యాంగాన్ని రూపొందించుకునేందుకు తగిన హామీనివ్వడం, అవసరమైన దేశాలకు ఆర్థిక సహాయాన్ని అందించడం, ప్రజాస్వామ్య వ్యవస్థలను పునరుద్ధరించడం; హిట్లర్ పాలనను భూస్థాపితం చేయడం యు యస్.యస్ ఆర్ ధ్యేయం" అని నిర్ద్వందంగా ప్రకటించాడు

స్టాలిన్ ప్రకటన ఆసియా, ఆఫ్రికాలలోని పలు దేశాల ప్రజలకు ఉత్తేజాన్ని కలిగించింది ఇండియాకు స్వాతంత్ర్యం లభిస్తే, సామ్రాజ్యవాదం అంతరిస్తుందని అనేకులు గ్రహించారు కాగా "ఇండియా మాటేమిటి?" అని అమెరికాను ప్రశ్నించారు

"ఆసియా, ఆఫ్రికా ఖండాలలో నేను ఎక్కడికి వెళ్ళినా, ఇండియా మాటేమిటి? అనే ప్రశ్నకు జవాబు చెప్పవలసి వచ్చింది కైరోనుండి షాంఘైవరకూ ఆ ప్రశ్న నన్ను వెంటాడింది. భారతీయుల స్వాతంత్ర్య కాంక్షను కాలరాచి, నిర్బంధ దమనకాండను ప్రారంభించడంవల్ల తరిగిపోయింది బ్రిటిష్‌వారి పరువుకాదు, తరిగిపోయింది అమెరికనుల ప్రతిష్ఠ సుమా! అని పలువురు నన్ను హెచ్చరించారు" అని వెండెల్ విల్కీ, వన్ వరల్డ్ అనే పుస్తకంలో వ్రాశాడు.

1913లో ఇండియానుండి తప్పించుకుపోయిన రసవిహారీ బోస్ (ప్రముఖ టెర్రరిస్టు నాయకుడు) జపాన్‌లో స్థిరపడ్డాడు అయన కృషి ఫలితంగా బాంకాక్‌లో 1942 జూన్‌లో ఒక సభ జరిగింది జపాన్, హాంకాంగ్, చైనా, ఇండో చైనా, ఫిలిప్పైన్సు, మలయా, బర్మాలలో నివసించే భారతీయుల ప్రతినిధులు ఆ సభలో పాల్గొన్నారు ఇండియాకు వెంటనే స్వాతంత్ర్యం సాధించుటకు తగిన నిబంధనావళితో భారత జాతీయ సమితిని ఎన్నుకున్నారు.

# అజాద్ హింద్ ఫౌజ్

సింగపూర్, బర్మా, మలయా మున్నగుచోట్ల జపాన్‌కు యుద్ధ ఖైదీలుగా చిక్కిన భారత సైనికుల్లో కొందరిని కూడగట్టుకొని, కెప్టెన్ మోహన్‌సింగ్ "అజాద్ హింద్ ఫౌజ్" (స్వతంత్ర భారతసైన్యం) అనే పేరుతో స్వచ్ఛంద సైనిక దళాన్ని నిర్మించాడు ఆ దళంలో 1942 ఆగస్టు నాటికి 16వేల మంది చేరారు ఆ స్వచ్ఛంద సైనిక దళాన్ని బలోపేతం చేసేందుకు కెప్టెన్ మోహన్‌సింగ్ చేసిన సూచనలను జపాన్ ప్రభుత్వం తిరస్కరించింది

పైగా చైనాలో జపాన్ సేనల ప్రవర్తన మోహన్‌సింగ్‌కు బాధ కలిగించింది జపాన్ ప్రభుత్వం చెప్పే మాటలను అయన నమ్మలేకపోయాడు కాగా స్వచ్ఛంద సైనిక దళ నాయకత్వంనుండి తప్పుకున్నాడు వెంటనే ఆయనను యుద్ధ ఖైదీగా జపాన్ సేనాధిపతులు నిర్బంధించారు

ఆ స్థితిలో రసవిహారీ బోస్ నాయకత్వానగల భారత జాతీయ సమితివారు సుభాష్ చంద్రబోస్‌ను ఆహ్వానించారు తాను జర్మనీలో వుండడంకన్నా, తూర్పు రంగంలో వుంటే భారత స్వాతంత్ర్య సంపాదనకు ఎక్కువగా తోడ్పడగలనని సుభాష్ చంద్రబోస్ భావించాడు కాగా 1943 ఫిబ్రవరి 8న ఒక జర్మన్ జలాంతర్గామిలో ప్రయాణమై మెడగాస్కర్‌కు ఈశాన్యంగా నాలుగు వందల మైళ్ల దూరంలోనున్న రహస్య స్థావరానికి చేరుకున్నాడు అక్కడనుండి జపాన్ వారి జలాంతర్గామిలో ప్రయాణించి సుమత్రా దీవికి చేరి, చివరకు 1943 జూన్ 13న విమానంలో టోకియో చేరాడు

బ్రిటిష్ వారి పాలనను తుదముట్టించి, భారతదేశం స్వతంత్రంగా మనగలిగేందుకు అవసరమైన సహాయమంతా చేస్తామని జపాన్ ప్రధాని టోజో బోస్‌కు వాగ్దానం చేశాడు (టోజో వాగ్దానంకూడా హిట్లర్ వాగ్దానంలాంటిదేనని చరిత్ర రుజువు చేసింది )

# నేతాజీ నాయకత్వం

పిమ్మట భారత స్వాతంత్ర్య సమితి అధ్యక్ష పదవిని బోస్ స్వీకరించాడు అజాద్ హింద్ ఫౌజ్ ఏర్పడిన విషయాన్ని 1943 జూలై 5న ప్రపంచానికి చాటి చెప్పాడు సంపూర్ణ సైన్య సమీకరణకు పూనుకొని "ఛలో ఢిల్లీ" నినాదమిచ్చాడు ఆగష్టు 25న స్వయంగా భారత జాతీయ సైన్యానికి (ఇండియన్ నేషనల్ ఆర్మీకి) నాయకత్వం వహించాడు సైనికుల సంఖ్య 40 వేలకు పెరిగింది

అంతటితో ఆగకుండా, తన అధ్యక్షతన తాత్కాలిక భారత ప్రభుత్వాన్ని ఏర్పరచాడు ఆ ప్రభుత్వం అక్టోబరు 23న బ్రిటన్, అమెరికాలపై యుద్ధం ప్రకటించింది తాత్కాలిక ప్రభుత్వ అధ్యక్షుని హెూదాలో బోస్ స్వయంగా రేడియోలో యుద్ధ ప్రకటన చేశాడు ఆ తాత్కాలిక ప్రభుత్వాన్ని జర్మనీ, ఇటలీ, జపానులతోపాటు మరో ఆరు దేశాలు గుర్తించాయి

"అధికార భాష హిందుస్తానీ, త్రివర్ణ పతాక జాతీయ పతాక, జనగణమన గేయం జాతీయ గేయం" అని ప్రకటించాడు జపాన్‌వారు తనకు అప్పగించిన అండమాన్ దీవుల పేరును "షహీద్" దీవులని, నికోబార్ దీవుల పేరును "స్వరాజ్య" దీవులనీ మార్చివేశాడు

భారత జాతీయ సైన్యమే భారతదేశాన్ని విముక్తి చేయాలని బోస్ కాంక్షించాడు కాని భారత సైన్యాల యుద్ధ పటిమను జపాన్ శంకించింది కాబట్టి జపాన్ సైన్యమే

భారతదేశంమీద దాడి చేస్తుందని, విముక్తిచేసిన ప్రాంతాలను బోసుకు అప్పగిస్తుందనీ వివరించింది అందుకు బోస్ అంగీకరించలేదు భారత సైనికులే బ్రిటిష్ ప్రభుత్వాన్ని పడగొట్టాలని పట్టబట్టాడు అయితే సరే అన్నది జపాన్ ప్రభుత్వం

1944 ఫిబ్రవరిలో బోస్ తన భారత జాతీయ సైన్యం (ఐ ఎన్ ఎ)తోపాటు రంగూన్‌నుండి బయలుదేరి భారతదేశ సరిహద్దులకు చేరుకున్నాడు జాతీయ సైన్యం వెంట జపాన్ సైన్యాలు నడిచాయి

1944 మేలో భారత జాతీయ సైన్యం (ఐ.ఎన్ ఎ) రెండుచోట్ల బ్రిటిష్ సైన్యాలను ఓడించింది బ్రిటిష్ సైనికులు చాలామంది చనిపోయారు జాతీయ సైనికదళంలో ఒక భాగం, జపాన్ సైన్యాల మద్ధతుతో నాగాలాండ్‌లో ప్రవేశించి, కోహిమాలో జాతీయ పతాకను ప్రతిష్టించింది మరొక దళం మణిపూర్‌లో ప్రవేశించి, ఇంపాల్ నగరాన్ని వశపరచుకున్నది

కాని పసిఫిక్ సముద్రంలో హెచ్చిన అమెరికా వారి దాడులను ఎదుర్కొనేందుకు జపాన్ తన వైమానిక నావికాబలాలను పసిఫిక్ ప్రాంతానికి మరలించడంవల్ల భారత జాతీయ సైన్యం వెనకకు తగ్గవలసి వచ్చింది ఆ తిరోగమనంలో అనేకమంది మరణించారు 1945 ప్రారంభంలో ఎదురుదాడి సాగించిన బ్రిటిష్ సేనలు మే నెలలో బర్మాను స్వాధీనం చేసుకోగలిగాయి భారత జాతీయ సైన్యంలో బ్రతికివున్నవారంతా యుద్ధ ఖైదీలుగా పట్టుబడిపోయారు

## విమాన ప్రమాదంలో నేతాజీ

సుభాష్ చంద్రబోస్‌తోపాటు ఆయన సహచరులు కొందరు తప్పించుకొని, అతికష్టంమీద బాంకాక్ చేరుకున్నారు 1945 అగస్టు 13న జపాన్ ప్రభుత్వం బోసును సింగపూర్‌కు పిలిపించి, తాను మిత్ర రాజ్యాలకు లొంగిపోతున్నట్లు తెలిపింది అగస్టు 16న బోస్ సైగాన్ వెళ్లాడు అక్కడినుండి కల్నల్ హబిబుర్ రహమాన్‌తో కలిసి విమానంలో టోక్యోకు బయలుదేరాడు అగస్టు 19న ఫార్మోజాలోని తైపాహూ విమానాశ్రయంలో జరిగిన విమాన ప్రమాదంలో గాయపడి, ఆసుపత్రిలో దివంగతుడయ్యాడు 22న టోక్యో రేడియో బోస్ మరణవార్తను ప్రపంచానికి ప్రసారం చేసింది.

అయినా కొందరు భారతీయులా వార్తను విశ్వసించలేదు చివరకు అదొక రాజకీయ వివాదాంశంగా మారింది షానవాజ్ కమిటీ, ఖోస్లా కమిషన్ బోస్ మరణవార్తను ధ్రువీకరించిన పిమ్మట వివాదం సమసిపోయింది

## బెంగాల్ కరువు - ప్రభుత్వ నిర్లక్ష్యం

ఏ దేశమైనా సరే, తమ యుద్ధ సన్నాహాలకు ప్రాతిపదికగా సమర్థవంతమైన ఆహారశాఖను ఏర్పరచక తప్పదు ఆహారోత్పత్తి, ఆహారధాన్యాల నిల్వలు, సరఫరా, పంపిణీ, రేషనింగ్ మున్నగు సమస్యలను సక్రమంగా పరిష్కరించలేని దేశంలో ప్రమాదం తప్పదు ఈ విషయం బ్రిటిష్ ప్రభుత్వానికి బాగా తెలుసు కనుకనే బ్రిటనులో యుద్ధారంభంలోనే కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశారు కాని, ఇండియాను కరువు రాకాసికి అప్పగించారు 1943లో కరువు బారిబడి ప్రజలు మరణిస్తున్న సమయంలో కళ్లు తెరిచి, ఆహారశాఖను ఏర్పాటు చేశారు కాని అప్పుడు కూడా "ఇండియాలో ఆకలి చావులు సాధారణంగా

జరుగుతూనే వుంటాయి" అని అమెరీ బుకాయించాడు "కరువు బాధ్యత యావత్తూ బెంగాల్ ప్రభుత్వానిదే"నని వైస్రాయి బుకాయించాడు

కలకత్తా యూనివర్శిటీ నిర్వహించిన సర్వే ప్రకారం, 34 లక్షల మంది బెంగాలీలు కరువు వాతపడి మరణించారని, బెంగాల్ ప్రజల్లో 46 శాతం వరకూ అంటురోగాల బారిపడి కృశించారని వెల్లడైంది ఇంత ఘోరంగా లేనప్పటికీ, అస్సాం మున్నగు తూర్పు ప్రాంతాలలోను, కేరళ, రాయలసీమ వగైరా దక్షిణ ప్రాంతాలలోను ఆకలి చావులు, అంటురోగాలు ఆందోళన కలిగించాయి

## కమ్యూనిస్టు పార్టీ చొరవ

ఆ స్థితిలో కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు నడుములు బిగించారు బ్లాక్ మార్కెటీర్లను పట్టి ప్రభుత్వానికి అప్పగించారు కరువు నివారణ కేంద్రాల వద్దను, అంటురోగ నివారణ కేంద్రాలవద్దను స్వచ్ఛంద సేవాదళాలుగా ఏర్పడి, దీనజనులకు సేవ చేశారు రాజకీయాలతోను, కుల మత విభేధాలతోను నిమిత్తం లేకుండా కరువు నివారణ కమిటీలను ఏర్పాటు చేశారు బెంగాల్ రాష్ట్ర కమిటీకి కాంగ్రెస్ నాయకుడైన డాక్టర్ బి సి రాయ్‌ని అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు

కవులు, గాయకులు, కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి, మహిళా సంఘాల వారు దళాలుగా ఏర్పడి, దేశమంతటా బెంగాల్ కరువు నివారణ నిధిని వసూలుచేసి, బెంగాల్ రాష్ట్ర కరువు నివారణ కమిటీకి పంపించారు

బెంగాల్ ప్రజల దీనగాధలను వర్ణించిన పాటలను ఆయా దళాలవారు పాడుతోంటే విని, ప్రజలు కంట తడిబెట్టేవారు కొందరు డబ్బులిచ్చేవారు కొందరు బట్టలు, కొందరు బియ్యం, అలా ఎవరికి చేతనైన సాయం వారు చేసేవారు

అలా 1943లో ప్రారంభమైన కరువు నివారణ కార్యక్రమాలు క్రమంగా బెంగాల్, ఆంధ్ర, కేరళ మున్నగు ప్రాంతాలలో బ్లాక్ మార్కెట్ వ్యతిరేక ఉద్యమం బలపడడానికి తోడ్పడినాయి

## నల్లధనం పాత్ర

యుద్ధ కాంట్రాక్టులద్వారా కొందరు, బ్లాక్ మార్కెట్‌ద్వారా మరికొందరు ఆర్జించిన నల్లధనంయొక్క పాత్రను పండిట్ నెహ్రూ యిలా వర్ణించాడు

". కలకత్తా నగర వీధులు శవాలతో నిండి వున్నప్పటికీ, ధనిక వర్గాలకు చెందిన పదివేలమంది కలకత్తా నగరవాసుల విలాస జీవితంలో ఎలాంటి మార్పులేదు గుర్రపు పందాలు యధావిధిగా సాగిపోయాయి ఆహారధాన్యాల సరఫరాకు లభించని రైలు వాగన్లు పందెపు గుర్రాలను తీసుకురావడానికి లభించాయి గుప్పెడు మెతుకులు దొరకక, ప్రతిరోజూ వేలాది ప్రజలు మరణిస్తోంటే, ఆహార ధాన్యాల వ్యాపారంద్వారా గడించిన ధనంతో కొందరు మేటలు వేశారు" అని నెహ్రూ విమర్శించాడు అయితే ఏం చేయాలి? తిండి దొంగల ఆట కట్టించడం తేలికైన విషయం కాదు జీవితావసర వస్తువుల బ్లాక్ మార్కెట్‌వల్ల కలిగే కష్టనష్టాలను వివరించి, ప్రజలను సమీకరించి, బలమైన ఉద్యమాన్ని నిర్మించగలిగినప్పుడు మాత్రమే బ్లాక్ మార్కెట్‌ను అరికట్టడం సాధ్యమవుతుంది అందుకు తగినంతమంది సుశిక్షితులైన కార్యకర్తలు కావాలి దొంగవ్యాపారుల కావలి కుక్కలుగా బ్రతికే రౌడీలను ఎదిరించి తరిమివేయగలశక్తి కార్యకర్తలకు వుండాలి అలాంటి శక్తి

సామర్థ్యాలుగలవారుంటే బ్లాక్ మార్కెట్‌ను అరికట్టడం సాధ్యమేనన్న విషయం బెజవాడవంటి చోట్ల రుజువైంది

## రౌడీల ప్రయోగం

విజయవాడలో 1943 జనవరి, ఫిబ్రవరి మాసాలలో కమ్యూనిస్టు పార్టీవారి ఆఫీసులమీద రౌడీ గాంగుల దాడులు జరిగాయి ఈ దాడుల వెనుక కొద్దిమంది కాంగ్రెస్ అభిమానులతోపాటు, ఎక్కువమంది బ్లాక్‌మార్కెట్ వ్యాపారులున్నారు చీకటి వ్యాపారాన్ని వెలుగులోకి లాగుతున్న కమ్యూనిస్టులమీద కోపంతో, బ్లాక్ మార్కెట్ వర్తకులు రౌడీలను ప్రయోగించారు కాని కమ్యూనిస్టుల పట్టుదలను సడలించలేకపోయారు

ఇండియామీద జపాన్ దాడి చేస్తే, గెరిల్లా యుద్ధ పద్ధతుల్లో ఎదిరించేందుకు సిద్ధంగా వున్న కమ్యూనిస్టులకు రౌడీగాంగుల పనిపట్టడం సులభమైంది బ్లాక్ మార్కెట్‌కు వ్యతిరేకంగా గట్టిగా కృషి చేయడంవల్ల ప్రజల అండదండలు కమ్యూనిస్టు పార్టీకి లభించాయి కుక్కిన పేనుల్లా రౌడీలు అణగారిపోయారు

## అధిక ఆహారోత్పత్తి

ఆహార సమస్యకు తాత్కాలిక పరిష్కారం రేషనింగ్ దొంగ నిల్వలను అరికట్టి రేషనింగ్‌ను సక్రమంగా అమలు జరిపితే, వేలాది ప్రజలను కరువు వాతబడి మరణించకుండా కాపాడవచ్చు కాని ఆహార సమస్యను శాశ్వతంగా పరిష్కరించకపోతే ప్రమాదం వెంటాడుతూనే వుంటుంది ఈ నగ్నసత్యాన్ని గుర్తించిన కమ్యూనిస్టు పార్టీ అధిక ఆహారోత్పత్తి కార్యక్రమాలను చేపట్టింది

బంజరు భూముల్లో వ్యవసాయ కూలీలను, పేద రైతులను ప్రవేశపెట్టి, వాటిని సాగు చేయించారు వ్యవసాయ పనిముట్లు, ఎరువులు, విత్తనాలు కంట్రోలు ధరలకు అందేటట్లు చేయడానికి రైతు సంఘాలు కృషి చేశాయి కోళ్ల పెంపకం, చేపల పెంపకం, పాడి పశువుల పెంపకం, వ్యవసాయాభివృద్ధికి అనుసరించవలసిన నూతన పద్ధతులు మొదలగు వాటిపైన అనుభవజ్ఞులతో పుస్తకాలు వ్రాయించి, ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం ప్రచురించింది

అన్నిటికంటే ముఖ్యమైనది కృష్ణ కాలువల మరమ్మత్తు పని బెజవాడవద్ద కృష్ణ కాలువల్లో పూడిక పెరగడంవల్ల, కాలువల్లో ప్రవహించవలసిన 9,600 క్యూసెక్కుల నీరు 8,400 క్యూసెక్కుల వరకూ తగ్గింది అందువల్ల డెల్టాలోని కాల్వచివరగల భూములకు నీరు సరిగా అందక పంటలు పాడైపోయేవి కాబట్టి, రైతు సంఘం స్వయంగా కాల్వల మరమ్మతులు ప్రారంభించింది వేలాది రైతులు, స్వచ్ఛంద సేవకులు మట్టి తట్టలు మోసి ఆదర్శప్రాయులయ్యారు రైతు సంఘ నాయకులతోపాటు, కమ్యూనిస్టు పార్టీ నాయకులు సుందరయ్య, రాజేశ్వరరావు, చంద్రశేఖరరావు ప్రభృతులుకూడా మట్టితట్టలు మోశారు కాగా ఉత్సాహభరితులైన బెజవాడ పట్టణ ప్రజలుకూడా మరమ్మతు పనులలో స్వచ్ఛందంగా పాల్గొన్నారు నెలరోజుల్లో మరమ్మతులు పూర్తయ్యాయి అదనంగా 70 వేల ఎకరాలు సాగులోకి వచ్చాయి ఇలాంటి పనులు గోదావరి డెల్టాలోను జరిగాయి

## జమీందారుల దాడి

1939 నవంబరు నెలారంభంలో కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా చేసిన

వెంటనే దేశమంతటా జమీందారీ వర్గాలు తిరిగి విజృంభించాయి 1941 వరకూ ఒకే రైతు సంఘంలో వుంటూ, ఒకే పతాకతో ఐక్యంగా కృషి చేసిన సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెస్ నాయకుల మధ్య విభేదాలు పొడసూపాయి

1923లోనే వ్యవసాయ కూలీ సభను ఏర్పాటుచేసి, 1929లో రాష్ట్ర రైతు ఉద్యమాన్ని సంఘటితం చేసి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీకి ప్రథమ అధ్యక్షుడుగా వ్యవహరించి, రైతు సంఘ కార్యకర్తలకు వేసవి పాఠశాలలు నిర్వహించి, అఖిల భారత రైతు ఉద్యమ నాయకుడుగా పేరొందిన ఆచార్య ఎన్ జి.రంగా 1942 ప్రారంభంలో రాష్ట్ర రైతు సంఘాన్ని రద్దుచేసి, తాత్కాలిక కమిటీలను నియమించాడు ఆ చర్యను అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షుడు స్వామి సహజానంద సరస్వతి తిరస్కరించాడు అందువల్ల రైతు ఉద్యమంలో చీలిక ఏర్పడింది ఆ చీలికను జమీందార్లు బాగా ఉపయోగించుకోగలిగారు అనేకమంది రైతులను వెడలగొట్టి, వారి భూములను తమ స్వంత కమతాలుగా చూపించసాగారు అందువల్ల శ్రీకాకుళం జిల్లాలోని మందసానుండి నెల్లూరు జిల్లాలోని వెంకటగిరి వరకూ అనేక ఎస్టేట్లలో రైతులు ఎదురుతిరిగి పోరాడారు వారికి అండగా రైతు సంఘాలు నిలబడ్డాయి కాగా జమీందార్ల దుష్ట పన్నాగాలు చాలవరకూ అరికట్టబడినాయి బెంగాల్, బీహార్, మలబార్ మున్నగు రాష్ట్రాలలోకూడా జమీందార్లకు, రైతులకు మధ్య అనేక పోరాటాలు జరిగాయి వేలాది రైతు సంఘ కార్యకర్తలు అరెస్టయ్యారు కొందరు పోలీసుల తుపాకి కాల్పులకు గురై మరణించారు మరికొందరు జమీందార్ల, గుండాల దాడులవల్ల అసువులు వీడారు

క్విట్ ఇండియా తీర్మానాన్ని ఆసరాగా చేసుకొని, జాతీయోద్యమాన్ని పూర్తిగా అణచివేసేందుకు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం పూనుకోవడంవల్ల దొంగ వ్యాపారుల, జమీందార్ల పంట పండింది కాగా ఇటు జమీందార్లను బ్లాక్ మార్కెటీర్లను ఎదిరించడం, అటు కాంగ్రెస్ నాయకుల, ఇతర దేశభక్తుల విడుదలను సాధించడం ధ్యేయంగా కమ్యూనిస్టు పార్టీ కృషి చేసింది

## రాజకీయ ఖైదీల విడుదల

ద్వీపాంతరవాస శిక్షలు, జీవిత ఖైదులు అనుభవిస్తున్న బెంగాల్ టెర్రరిస్టులు, గదర్ పార్టీ వీరులు, టెహ్రీ ఘర్వాల్ వీరులు మున్నగువారితోపాటు, కొందరు కాంగ్రెస్ కార్యకర్తలుకూడా 1943లో విడుదలయ్యారు

1944 జనవరి 26న దేశమంతటా అత్యంత ఉత్సాహపూరితంగా స్వాతంత్ర్య దినోత్సవం జరిగింది 1944 ఫిబ్రవరి 22న కస్తూరీబాయి గాంధీ జైల్లోనే దివంగతురాలైనదన్న వార్త విని ప్రజలు కంట తడిపెట్టారు దేశమంతటా జరిగిన నిరసన సభలలో కమ్యూనిస్టులు ముందు నిలబడ్డారు భీమవరంలాంటిచోట్ల ప్రభుత్వం నిరసన సభలను నిషేధించింది గుంటూరు మొదలగుచోట్ల కొందరిని అరెస్టు చేసింది అయినా సభలు జరిగాయి నిరసన వెల్లడైంది

## అఖిల భారత రైతు మహాసభ

1944 ఏప్రియల్ 14, 15 తేదీలలో అఖిల భారత రైతు మహాసభను బెజవాడలో జరుపుటకు నిర్ణయం జరిగింది కాని ప్రభుత్వం అనుమతిని నిరాకరించింది ఎందువల్ల

నిరాకరించారో తెలుపవలసిందిగా గద్దె రంగయ్య నాయుడు, భులాభాయ్ దేశాయ్ ప్రభృతులు కేంద్ర అసెంబ్లీలో ప్రభుత్వాన్ని నిగ్గదీశారు

"మహాసభకు వచ్చే వేలాది ప్రజలకు ఆహారాన్ని సమకూర్చడం ప్రభుత్వానికి సాధ్యంకాదు కనుక అనుమతిని నిరాకరించవలసి వచ్చింది" అని ప్రభుత్వం కుంటి సాకులు చెప్పింది

"అయితే మా ఏర్పాట్లు మేమే చేసుకుంటాం ఒక కిలో బియ్యంగాని, ఒక తులం పంచదారగాని ప్రభుత్వంనుండి ఆశించం" అంటూ ఆహ్వానసంఘం ముందుకొచ్చింది అందువల్ల మరొక సాకు చూపడానికి వీలులేక, సమావేశ తేదీలు దగ్గరకొచ్చిన తరువాత ప్రభుత్వం అనుమతినిచ్చింది

ఆహ్వాన సంఘం రైతులకు అప్పీలు చేసింది కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి మున్నగు జిల్లాల రైతులు ఎడ్లబళ్లు కట్టుకొని, బియ్యం, పచ్చళ్ళు మున్నగు ఆహార పదార్థాలతో సహా మహాసభకు వచ్చారు పంజాబ్‌నుండి గదర్‌పార్టీ ఉద్యమ నిర్మాతలు బాబా సోహన్‌సింగ్ ఖాక్నా, గురుముఖ్‌సింగ్, తేజ్‌సింగ్ మున్నగువారు ప్రతినిధులుగా రావడం, జైళ్ళనుండి విడుదలైన ఘర్వాల్ వీరులు, టెర్రరిస్టు విప్లవకారులు ప్రతినిధులుగా రావడం ప్రజలకు ఉత్సాహాన్ని గలిగించాయి కాంగ్రెస్ నాయకుడు బులుసు సాంబమూర్తి మహాసభలో పాల్గొని ఉపన్యసించాడు గాంధీజీని, యితర కాంగ్రెస్ నాయకులను వెంటనే విడుదల చేయాలనే తీర్మానాన్ని మహాసభ అధ్యక్షుడు స్వామి సహజానంద సరస్వతి ప్రతిపాదించగా బంకిం ముఖర్జీ, పి సి జోషీ మున్నగువారు బలపర్చారు లక్షమందికి పైగా ప్రజలు కరతాళధ్వనులతో తీర్మానాన్ని ఆమోదించారు తరువాత రైతులకు, వ్యవసాయ కూలీలకు సంబంధించిన వివిధ తీర్మానాలు, ఆహార సమస్యకు అధికాహారోత్పత్తికి సంబంధించిన తీర్మానాలు ఆమోదింపబడినాయి మేనెల 6వ తేదీన గాంధీజీని ప్రభుత్వం విడుదల చేసింది

మహాసభ సందర్భంలో ఏర్పాటు చేయబడిన పశువుల ప్రదర్శన, కుటుంబ నియంత్రణ సమాచార కేంద్రం, ప్రజానాట్యమండలి వారి సాంస్కృతిక ప్రదర్శనలు ప్రజలనెంతగానో ఆకర్షించాయి

కరువు నివారణ కొరకు, కార్మిక, కర్షక, వ్యవసాయ కూలీలు హక్కులకొరకు, అన్నింటికంటే ముఖ్యంగా కాంగ్రెస్ నాయకుల విడుదల కొరకు, జాతీయ ప్రభుత్వ స్థాపన కొరకు నిర్విరామంగా కృషి చేయడంవల్ల 1942లో ఐదువేల వరకూ వున్న కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం 1944 నాటికి 25 వేలకు పెరిగింది కిసాన్ సభ సభ్యత్వం 3 లక్షలనుండి 6 లక్షలకు, ఎ ఐ టి యు సి సభ్యత్వం 3 లక్షలనుండి 5 లక్షలకు పెరిగాయి

## సామ్రాజ్యవాదుల ఎత్తుగడలు

1943 ప్రారంభంలో జర్మన్ సేనల మీద రెడార్మీ పైచేయి సంపాదించింది పసిఫిక్ రంగంలో అమెరికనుల వైమానిక నావికాబలాలు విజృంభించాయి కాగా యుద్ధ గతి మిత్రరాజ్యాలకు అనుకూలంగా మారింది

"1857 సిపాయి తిరుగుబాటు తరువాత అత్యంత తీవ్రమైన తిరుగుబాటుగా భావించబడిన క్విట్ ఇండియా ఉద్యమం, దాదాపుగా ఎలాంటి ప్రాణనష్టం లేకుండానే

అణగారిపోయింది భారతీయ ఉద్యోగులు, అధికారులు చేసిన అమోఘమైన కృషివల్లనే యీ విజయం సాధ్యమైంది" అని చర్చిల్ కోతలు కోశాడు

ఆ విషయం పచ్చి అబద్ధమని అనేకులకు తెలుసు అసలు క్విట్ ఇండియా పోరాటం ఎలా జరిగిందోనన్న విషయాన్ని డాక్టర్ మజుందార్ చక్కగా వివరించాడు

"సేనా నాయకుడు లేని సేనల పోరాటం 1942లో జరిగిన తిరుగుబాటు సేనాధిపతి తికమకపడ్డాడు కాని సైనికులు తమ పోరాట పటిమను ప్రదర్శించారు స్వాతంత్ర్యం కొరకు తమ ప్రాణాలొడ్డి అమరులయ్యారు" అన్నాడు మజుందార్

"ప్రజలకు పిచ్చెత్తించేందుకు పూనుకున్న ప్రభుత్వం హింసాకాండకు ప్రజలు వీరోచితంగా జవాబు చెప్పారు" అన్నాడు గాంధీజీ

ఇండియా ప్రభుత్వ రికార్డులు, లిన్‌లిత్‌గోకు - చర్చిల్, అమెరీలకు మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు వాస్తవ విషయాలను వెల్లడించాయి తిరుగుబాటును అణచేందుకు ప్రభుత్వం 60 చోట్ల సైన్యాన్ని వినియోగించిందని, 538 చోట్ల కాల్పులు జరపడంతోపాటు, 300 చోట్ల విమానదాడులుకూడా జరిపిందని స్పష్టమైంది ఈ వివరాలు ఆనాడు వెల్లడి కాకపోయినప్పటికీ, ప్రభుత్వ దమనకాండను ప్రతిఘటించి ప్రజలు పోరాడిన విషయం ప్రపంచానికి వెల్లడైంది కాగా బ్రిటిష్ ప్రభుత్వం దుష్ప్రచారానికి పూనుకొంది "భారతదేశంలో జరిగిన హింసాకాండకంతకూ బాధ్యత గాంధీదే"నని ప్రచారం చేసింది ఆ ప్రచారానికి నిరసనగా గాంధీజీ 1943 ఫిబ్రవరిలో నిరాహారదీక్ష ప్రారంభించాడు

గాంధీజీని వెంటనే విడుదల జేయాలంటూ అనేక పట్టణాలలో విద్యార్థులు సామూహిక నిరాహారదీక్షలు పూనారు ఊరేగింపులు జరిపారు మదనపల్లి మొదలగు చోట్ల పోలీసులు చేసిన లాఠీఛార్జీలవల్ల పలువురు విద్యార్థులు గాయపడ్డారు కమ్యూనిస్టులతోపాటు, కార్మిక, కర్షక వ్యవసాయ కార్మిక సంఘాలు, బార్ అసోసియేషన్లు, మహిళా సంఘాలు, అధ్యాపక సంఘాలు గాంధీజీ విడుదలను డిమాండ్ చేశాయి వైస్రాయి కార్యనిర్వాహక సభ్యులు ముగ్గురు రాజీనామా లిచ్చారు అయినా "గాంధీని విడిచిపెట్టవలసిన అవసరం లేదు" అని చర్చిల్ మొండికెత్తాడు "కేంద్ర ప్రభుత్వంలో చేరవలసిందిగా కాంగ్రెస్ నాయకులను, ముస్లింలీగ్ నాయకులను ఆహ్వానించడం మంచిది" అని 1943 సెప్టెంబర్‌లో వేవెల్ చేసిన సూచననుకూడా చర్చిల్ తిరస్కరించాడు "ఈ విషయాన్ని సాధ్యమైనంతవరకూ దాటవేయడం మంచిపని హిట్లర్ మొండితనంలాంటి మొండితనం మనకూ అవసరమే" అని ఇండియా కార్యదర్శి అమెరీ వేవెల్‌కు సలహా యిచ్చాడు

కాని, 1944 మే 5న "అనారోగ్య కారణాలవల్ల గాంధీని విడుదల జేస్తున్నాం" అని ప్రకటించారు అదెందువల్ల జరిగినట్లు?

## పరిస్థితుల ప్రభావం

క్విట్ ఇండియా ఉద్యమాన్ని గురించిన వివరాలను మిత్రరాజ్యాలలోని ప్రజాస్వామ్యవాదులు తెలుసుకోగలిగారు ఇండియాలో జరుగుతున్న రక్తపాతానికి, ఆకలిచావులకు బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వానిదేనని విమర్శించారు

"యుద్ధానంతరం అన్ని దేశాలకు స్వాతంత్ర్యం లభించాలి. అదే సోవియట్ యూనియన్ ధ్యేయం" అని స్టాలిన్ చేసిన ప్రకటన, "అట్లాంటిక్ ప్రణాళికయొక్క లక్ష్యం

అన్ని దేశాలకూ స్వాతంత్ర్యం లభించడం" అని అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్టు చేసిన ప్రకటన చర్చిల్ మస్తిష్కాన్ని కలచివేయసాగాయి

ఉద్యమాన్ని రెండు నెలల్లోనే అణచివేయగలిగామని బ్రిటిష్ ప్రభుత్వం కోతలు కోసినప్పటికీ, జయప్రకాష్ నారాయణ్, రామమనోహర లోహియా మొదలగు సోషలిస్టుల నాయకత్వాన అక్కడక్కడ, ముఖ్యంగా ఇండియా, నేపాల్ సరిహద్దు ప్రాంతాలలో సాగుతున్న సాయుధ పోరాటాలను అణచలేకపోయారు

ఉత్తరప్రదేశ్‌లోని తూర్పు ప్రాంతాలలోను, బీహార్ రాష్ట్రంలోను రైతులు తిరగబడి అనేక పోలీసుస్టేషన్లను స్వాధీనం చేసుకున్నప్పుడు, సైన్యాన్ని పిలిపించి, అనేక గ్రామాలను తగలబెట్టి, ప్రభుత్వం ఆ తిరుగుబాటును అణచివేసింది కాని ఉద్రిక్తత తగ్గలేదు

సతీష్ సామంత నాయకత్వాన రైతులు మిద్నపూర్ జిల్లాలోని తామ్‌లుక్ సబ్‌డివిజన్‌లో స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకున్నారు ఒరిస్సాలోని బాలసోర్ జిల్లాలో పంచాయతీల పాలన ఏర్పాటు చేయబడింది అవి 1944 ప్రారంభంలోకూడా అలాగే వున్నాయి

కాగా కాంగ్రెస్ నాయకులతో సంభాషణలు సాగించడం అవసరమని మార్షల్ వేవెల్ భావించాడు 1943 అక్టోబరులో లిన్‌లిత్‌గో స్థానంలో వైస్రాయిగా నియమింపబడి నప్పటినుండి బ్రిటిష్ లేబరు పార్టీ అభిప్రాయాలను, దేశంలోని రాజకీయ పార్టీ బలాబలాలను అంచనా వేయసాగాడు

## కమ్యూనిస్టు పార్టీ బలం

సామ్రాజ్యవాదానికి కమ్యూనిస్టు పార్టీ బద్ధ శత్రువు అనే విషయం బ్రిటిష్ ప్రభుత్వానికి బాగా తెలుసు కమ్యూనిస్టు పార్టీపైనగల నిషేధాన్ని 1942 జులైలో తమ అవసరంకొద్దీ తొలగించినప్పటికీ, కమ్యూనిస్టు పార్టీని వారెన్నడూ విశ్వసించలేదు కనుకనే జపాన్ సేనల దాడిని ఎదిరించేందుకు గెరిల్లా యుద్ధ పద్ధతుల్లో శిక్షణ పొందాలని, ఆయుధాలు సమకూర్చుకోవాలని కమ్యూనిస్టు పార్టీ చేసిన ప్రయత్నాలను ప్రభుత్వం వ్యతిరేకించింది కమ్యూనిస్టులకు ఆయుధాలు యివ్వకూడదంటూ బీహార్ గవర్నరు వైస్రాయికి యిలా వ్రాశాడు

"పైపైన చూస్తే కమ్యూనిస్టులు ఫాసిస్టు వ్యతిరేకులు లోతుగా జూస్తే సామ్రాజ్య వ్యతిరేకులు కాబట్టి, వారి కోర్కెను మన్నించి ఆయుధాలిస్తే, వాటిని ఎవరిమీదనైనా ఉపయోగించవచ్చు " (స్టెగార్ట్ టు లిన్‌లిత్‌గో, 6 మే 1942)

"ఇటీవల ప్రకటించబడిన ప్రభుత్వ పత్రాలను పరిశీలిస్తే ఒక విషయం స్పష్టంగా తెలుస్తోంది గెరిల్లా యుద్ధంలో శిక్షణ పొంది, ఆయుధాలు సమకూర్చుకునేందుకు కమ్యూనిస్టులు చేసిన ప్రయత్నాన్ని పలువురు ప్రభుత్వాధినేతలు అనుమానించి వ్యతిరేకించారు" అని సుమిత్ సర్కార్ తన మోడరన్ ఇండియా గ్రంథంలో వ్రాశాడు

"ఆయుధాలివ్వకపోవడమేకాదు, కొందరు కమ్యూనిస్టు నాయకులను జైళ్ళనుండి విడుదలకూడా చేయలేదు అయినా కరువు నివారణ, రేషనింగ్, అధికాహారోత్పత్తి, బ్లాక్ మార్కెట్ నిరోధం మున్నగు ప్రజాహిత కార్యక్రమాల ద్వారానూ, ప్రభుత్వ దమనకాండను వ్యతిరేకించడంద్వారానూ కమ్యూనిస్టు పార్టీ బలపడింది అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి కార్యక్రమాల ద్వారా జస్టిస్ రాజమన్నార్, తాపీ ధర్మారావు, బలరాజ్

సహానీ, ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్, కైఫీ అజ్మీ, సుచిత్ర ముఖర్జీ, విష్ణుదేవ్ మున్నగు ప్రముఖుల సహాయ సహకారాలను పొందగలిగింది అందుకు సందేహం లే"దంటూ సుమిత్ సర్కార్ యిలా వ్రాశాడు

"కాంగ్రెస్‌నుండి వేరుబడడంవల్ల కలిగిన ఒంటరితనం కమ్యూనిస్టు పార్టీకి మేలు చేసింది పార్టీ సభ్యులలో చిత్తశుద్ధిని, త్యాగనిరతిని, పోరాట పటిమను పెంచింది కరువు నివారణ కొరకు దృఢదీక్షతో సమర్థవంతంగా కృషి జేయడంవల్ల బెంగాల్లో కమ్యూనిస్టు పార్టీ బలపడింది ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధ నినాదం సామాన్య ప్రజలను ఆకర్షించలేకపోయినప్పటికీ, ప్రపంచ సమస్యలను అర్థం చేసుకోగల మేధావులను ఆకర్షించింది"

బ్రిటిష్ పాలనను జాతీయ కాంగ్రెస్ వ్యతిరేకిస్తున్నట్లే, ముస్లిం లీగ్‌కూడా వ్యతిరేకిస్తున్నదని చెప్పడం, జాతుల స్వయం నిర్ణయాధికార హక్కుకు– పాకిస్తాన్ డిమాండ్‌కు మధ్య సారూప్యతను కల్పించడం, నేతాజీ బోసును క్విస్లింగ్‌గా చిత్రించడంలాంటి తప్పులవల్ల కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్‌వారి విమర్శలకు, సోషలిస్టుల ఫార్వర్డ్ బ్లాకిస్టుల క్రోధానికి గురైందని సుమిత్ సర్కార్ భావించాడు అయినా కాంగ్రెస్, ముస్లింలీగ్‌ల తర్వాత మూడవ పెద్ద పార్టీగా కమ్యూనిస్టు పార్టీ బలపడిందన్నాడు

"సాంస్కృతిక పునరుజ్జీవన కార్యక్రమాలద్వారా మేధావులను ఆకర్షించినట్లే, వర్గ సంఘాలద్వారా కార్మిక, కర్షక, వ్యవసాయ కూలీలను కమ్యూనిస్టు పార్టీ సమీకరించ గలిగింది కాగా, కేరళ, కోస్టల్ ఆంధ్ర, తెలంగాణా, ఉత్తరబెంగాల్లో మాత్రమేగాక, పంజాబ్, బొంబే, తమిళనాడుల్లోని కొన్ని ప్రాంతాలలోకూడా కమ్యూనిస్టు పార్టీ బలపడింది "

ఒకవైపున కమ్యూనిస్టు పార్టీ బలం పెరుగుతోంటే, మరోవైపున ఫార్వర్డ్ బ్లాక్, సోషలిస్టు పార్టీలు సాయుధ పోరాటాలకు పూనుకొని బలపడ్డాయి అహింసాయుత సత్యాగ్రహ పోరాటం తెరమరుగైపోయింది 1944 ఫిబ్రవరి 22న కస్తూరిబా గాంధీ జైల్లోనే దివంగతురాలైననాటినుండి గాంధీజీ ఆరోగ్యం క్షీణించసాగింది ఆయనకేదైనా జరిగితే ప్రమాదం తప్పదని గ్రహించడంవల్ల, మే 6న గాంధీజీని విడిచిపెట్టారు కనుకనే కాబోలు– "గాంధీ యింకా మరణించలేదేం?" అని 1944 జూలై 5న వేవెల్‌కు పంపిన నీతిబాహ్యమైన టెలిగ్రాంద్వారా చర్చిల్ వాకబు చేశాడు

## గాంధీజీ ఆదేశాలు

భారతదేశానికి స్వాతంత్ర్యమిస్తామని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటిస్తే, ఉద్యమాన్ని ఆపుజేసేందుకు కృషి చేస్తానని 1944 జులై 27న గాంధీజీ వైస్రాయికొక లేఖ వ్రాశాడు దానికి జవాబుగా క్రిప్సు రాయబారంనాటి ప్రతిపాదనలను వైస్రాయి ఏకరువు పెట్టాడు అయినా ఉద్యమాన్ని విరమింపజేసేందుకు గాంధీజీ ప్రయత్నించాడు కనుకనే క్విట్ ఇండియా ఉద్యమ వార్షికోత్సవాన్ని జరిపేందుకు అనుమతి కోరిన వారిని యిలా ఆదేశించాడు

"వార్షికోత్సవం జరపడంలో తప్పులేదు కాని ప్రభుత్వం నిషేధిస్తే జరపకండి జరిపితే పరిస్థితి కలుషితమయ్యే ప్రమాదముంది కాబట్టి ఆగస్టు 9న ప్రభుత్వ దమనకాండకు నిరసనగా నిరాహారదీక్షలతోను, ప్రార్థనలతోను సరిపెట్టుకోండి" అని ఆదేశించడమేగాక, రహస్య కార్యకలాపాలు సాగిస్తున్న వారంతా ప్రభుత్వానికి

లొంగిపోవలసిందిగా కోరాడు ఆ కోరికను మన్నించి కర్నూల్ జిల్లా కాంగ్రెస్ నాయకులు నివర్తి వెంకట సుబ్బయ్య పోలీసులు లొంగిపోయాడు అలాగే మరికొందరుకూడా లొంగిపోయారు కాని ఫార్వర్డ్ బ్లాక్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలకు చెందినవారు లొంగిపోలేదు అయినా పోరాటాలు నీళ్లుగారిపోయాయి ఆ స్థితిలో జిన్నాతో సంభాషణలు జరిపేందుకు గాంధీజీ పూనుకున్నాడు

## గాంధీ-జిన్నా సంభాషణలు

జిన్నాతో గాంధీ సంభాషణలు సాగించాలని, జాతీయ ప్రభుత్వ స్థాపన కొరకు కాంగ్రెస్, లీగులమధ్య ఒడంబడిక జరగాలని పదేపదే కమ్యూనిస్టు పార్టీ చేసిన విజ్ఞప్తిని కాంగ్రెస్ నాయకులతో సహా అనేకమంది గతంలో విమర్శించారు సోవియట్ యూనియన్‌లో గుర్తించినట్లే, ఇండియాలో కూడా వివిధ జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని గుర్తించడం జరిగితే దేశ సమగ్రత కాపాడబడుతుందనే అభిప్రాయంతో డాక్టర్ అధికారి వ్రాసిన వ్యాసాన్ని జూచి దుమ్మెత్తిపోశారు

కాని, రాజగోపాలచారి ఫార్ములా (సూత్రము) ప్రాతిపదికగా జిన్నాతో సంభాషణలు సాగించేందుకు 1944 జులైలో గాంధీజీ తన సంసిద్ధతను తెలియజేశాడు ఆ ప్రయత్నాన్ని హిందూ మహాసభ గట్టిగా వ్యతిరేకించింది అయినా గాంధీజీ తన ప్రయత్నాన్ని విరమించుకోలేదు

"పంజాబ్, సింధ్, బలూచిస్తాన్, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రం, బెంగాల్, అస్సాం రాష్ట్రాలు వేరుపడేందుకు కాంగ్రెస్ అంగీకరించాలి ఆ విషయంలో కొద్దిపాటి మార్పులకు లీగ్ అంగీకరిస్తుంది" అని జులై 30న జిన్నా పట్టుబట్టాడు చివరకు సెప్టెంబర్‌లో గాంధీ-జిన్నా సంభాషణలు విఫలమయ్యాయి

అయినా కేంద్ర అసెంబ్లీలో కాంగ్రెస్, లీగ్ సభ్యుల మధ్య సయోధ్య కొనసాగింది 1935 నాటి ఫెడరల్ రాజ్యాంగ చట్టానికి లోబడి కేంద్రంలోను, రాష్ట్రాలలోను కాంగ్రెస్, లీగ్ ప్రతినిధులతో కూడిన సంయుక్త మంత్రివర్గాలను ఏర్పాటు చేసే విషయంలో భులాభాయ్ దేశాయ్, లియాకత్ అలీఖానుల మధ్య ఒడంబడిక జరిగిందనే వార్తలు వ్యాపించాయి ఆ స్థితిలో వైస్రాయి వేవెల్ బ్రిటిష్ ప్రధానికొక లేఖను అక్టోబరు 24న వ్రాశాడు కాంగ్రెస్ నాయకులతో సాగించే సంభాషణలు సర్వరోగ నివారిణిగా ఉపకరిస్తాయని, భారతదేశంపై తమ పెత్తనాన్ని నిలుపుకోవచ్చునని ఆశించి ఆ లేఖ వ్రాశాడు

## వేవెల్ లేఖ - చర్చిల్ జవాబు

"యుద్ధానంతరం మనం ప్రపంచ ప్రజల అభిప్రాయాన్ని, బ్రిటిష్ ప్రజాస్వామ్య వాదుల అభిప్రాయంతోపాటు సైన్యంయొక్క అభిప్రాయాన్నికూడా పరిగణనలోకి తీసుకోవలసి రావచ్చు ఆ స్థితిలో భారతదేశాన్ని బలప్రయోగంతో అణచివుంచడం అసాధ్యం లోగడ మనం డివేలరా, జాఘ్లుల్ వంటి తిరుగుబాటుదారులతో సంభాషణలు సాగించలేదా? కాబట్టి యుద్ధం ముగిసేలోగానే కాంగ్రెస్‌వారిని విడుదలజేసి, వారి నాయకులతో సంభాషణలు సాగించడం అవసరం లోగడ మనం కాంగ్రెస్‌వారి శక్తి సామర్థ్యాలను మిక్కిలి ఉపయుక్తమైన మార్గాలకు మళ్లించాం ఒకప్పుడు పాలనా సంబంధమైన సమస్యల వైపుకు, మరొకప్పుడు రాజ్యాంగ నిర్మాణం వైపుకు ఆకర్షించాం

అలాంటి పనినే యిప్పుడుకూడా చేయకపోతే లాభంలేదు అనేక డివిజన్ల సైనికులను ఇళ్లకు పంపించివేయడం వల్లను, పెరగనున్న నిరుద్యోగం వల్లను ఏర్పడే పరిస్థితులు, జాతీయ అందోళన ఉధృతం కావడానికి ఉపకరిస్తాయి" (వేవేల్- వైస్రాయి జర్నల్)

ఇంత వివరంగా వేవేల్ వ్రాసినప్పటికీ, కరుడుగట్టిన సామ్రాజ్యవాది చర్చిల్ తగిన చర్య తీసుకోలేదు 1945 మార్చిలో సహితం "సంభాషణల సమస్యను సాధ్యమైనంత కాలం దాటవేయాలి" అని ఆదేశించాడు కాగా వేవేల్ యిలా అభిప్రాయపడ్డాడు

"భారతదేశాన్ని పాకిస్తాన్, హిందూస్తాన్, ప్రిన్సెస్‌స్తాన్ వగైరాలుగా విభజించడానికి ఆయన (చర్చిల్) అనుకూలమైనట్లుగా కనిపిస్తోంది " (వేవెల్- వైస్రాయి జర్నల్)

చివరకు బ్రిటనులో ఎన్నికలు మరొక మాసం రోజుల్లో జరుగనున్నప్పుడు చర్చిల్ దారిలోకొచ్చాడు 1945 జూన్‌లో భారత జాతీయ నాయకులతో సంభాషణలు సాగించేందుకు వేవెల్‌కు అనుమతినిచ్చాడు జూన్ 14న వేవెల్ కాంగ్రెస్ నాయకులను విడుదలచేసి, వైస్రాయి కార్యనిర్వాహక వర్గాన్ని ఏర్పాటుచేసే విషయంలో సంభాషణలకు రావలసిందిగా ఆహ్వానించాడు అందుకు కాంగ్రెస్ నాయకులు సమ్మతించారు అయితే 1942 ఆగస్టులో క్విట్ ఇండియా తీర్మానం చేసి, జైళ్లకు వెళ్ళిన కాంగ్రెస్ నాయకులేమి సాధించినట్లు?

"ఎంత విరుద్ధంగా కనుపించినా, కాంగ్రెస్ నాయకుల నిర్బంధము, ఉద్యమం యొక్క విఫలత కాంగ్రెసుకొక లాభాన్ని చేకూర్చాయి 1944 ప్రారంభంలో నేతాజీ నాయకత్వాన భారత జాతీయ సైన్యం, తూర్పు సరిహద్దుల్లో ప్రవేశించినపుడు వారిని ఆహ్వానించడమా? వ్యతిరేకించడమా? అన్న సమస్యను తేల్చుకోవలసిన అవసరం, జైళ్ళలో వున్న కాంగ్రెస్ నాయకులకు కలగలేదు" అన్నాడు సుమిత్ సర్కార్

"కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలో వున్నప్పుడు, ప్రతిదానికీ అలాగే, అలాగే అంటూ సంతరించుకున్న అపఖ్యాతిని 1942 నాటి జైళ్ల ప్రవేశం తుడిచివేసింది కాంగ్రెస్ ప్రతిష్ఠ పెరగటానికి జైళ్ళ కార్యక్రమం తోడ్పడింది" అన్నాడు డి డి కోశాంబి

కాంగ్రెస్ నాయకుల నిర్బంధంవల్ల మాత్రమే కాంగ్రెస్ ప్రతిష్ఠ పెరగలేదు పాట్నా, బొంబే, గుంటూరు మున్నగుచోట్ల విద్యార్థులు సాగించిన వీరోచిత కృత్యాలు, ఖాందేష్, సతారా, జంబుసార్ వగైరా చోట్ల రైతులు చేసిన తిరుగుబాట్లు, కోరాపుట్ వంటి చోట్ల ప్రజ్వరిల్లిన గిరిజన తిరుగుబాట్లు, తామ్రలిప్త, సుతహిత, నందిగ్రామ్ వగైరా ప్రదేశాలలో కొనసాగిన రహస్య కార్యకలాపాలు, సోషలిస్టులు సాగించిన సాయుధ పోరాటాల వంటివన్నీ కలిసి జాతీయ కాంగ్రెస్ ప్రతిష్ఠను పెంచాయి

ఫార్వర్డ్ బ్లాక్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలకు కమ్యూనిస్టు పార్టీకి మధ్య పెరిగిన విరోధంవల్ల మితవాద కాంగ్రెస్ నాయకత్వం బలపడింది



# సిమ్లా సంభాషణలు

వేవెల్ ఆహ్వానాన్ని పురస్కరించుకొని జిన్నా నాయకత్వాన ముస్లింలీగ్ ప్రతినిధి వర్గం, అబుల్ కలాం అజాద్ నాయకత్వాన కాంగ్రెస్ ప్రతినిధి వర్గం సిమ్లా చేరాయి

"కొత్తగా ఏర్పరచే కేంద్ర ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్లో తాను, సర్వసైన్యాధిపతి తప్ప తక్కిన వారందరూ భారతీయులే వుంటారు కౌన్సిల్లో సగంమంది సవర్ణ హిందువులు, సగంమంది ముస్లిములు వుండాలి ప్రస్తుత రాజ్యాంగ చట్టం ప్రకారమే కౌన్సిల్ పని చేస్తుందికాని, కొత్త రాజ్యాంగ చట్టాన్ని రూపొందించేందుకు అనుమతిస్తాం" అని వేవెల్ ప్రతిపాదించాడు

కౌన్సిల్లో సగంమంది ముస్లిములుండేందుకు కాంగ్రెస్ నాయకులు అభ్యంతరం చెప్పలేదు కాని సగం మంది సవర్ణ హిందువులుండాలనే షరతును వ్యతిరేకించారు లేకపోతే కాంగ్రెస్‌ను సవర్ణ హిందువుల పార్టీగా పరిగణిస్తారని గ్రహించారు కాగా తాము నియమించే ప్రతినిధులు వివిధ మతాలకు చెందినవారై వుంటారని చెప్పారు

ముస్లిమ్ సభ్యులనందరినీ నియమించే హక్కు ముస్లిమ్‌లీగుకు మాత్రమే కలదని జిన్నా వాదించాడు ముస్లిములు వ్యతిరేకించే బిల్లును చట్టం చేయాలంటే, మూడింట రెండు వంతుల మెజారిటీ వుండాలని పట్టుబట్టాడు (అంటే ముస్లింలీగ్‌కు వీటో హక్కు కావాలని కోరాడన్నమాట) జిన్నా కోర్కెలను వేవెల్ వ్యతిరేకించలేదు కాగా 1945 జూన్ 25నుండి జులై 14 వరకూ సాగిన సిమ్లా సంభాషణలు విఫలమయ్యాయి

ముస్లిమ్ సభ్యులనందరినీ నియమించే హక్కు ముస్లింలీగుకు లేదని, దాని బలం తగ్గిందని వేవెల్‌కు తెలుసు అయినా బ్రిటన్‌లో జరిగిన ఎన్నికల్లో ఓట్లు సంపాదించేందుకు చర్చిల్ ఆడమన్న నాటకమాడాడు

## ముస్లింలీగ్ బలం

1942 ఆగస్టునుండి కాంగ్రెస్‌ను అణచివేసేందుకు ప్రభుత్వం సాగించిన దమనకాండవల్ల ముస్లింలీగ్ బలపడింది కాంగ్రెస్ శాసనసభ్యులను ప్రభుత్వం అరెస్టు చేయడంవల్ల, 1942 ఆగస్టులో అస్సాంలోను, అక్టోబరులో సింధులోను, '43 మార్చిలో బెంగాల్లోను, మేలో పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలోను ముస్లింలీగ్ మంత్రి వర్గాలేర్పడ్డాయి పెద్దఎత్తున వాలంటీర్ దళాల నిర్మాణం జరిగింది

బెంగాల్లో హిందూ జమీందార్లవల్ల బాధపడిన ముస్లిం కౌలుదార్లు, పంజాబ్‌లో హిందూ వడ్డీవ్యాపారులవల్ల ఆస్తులు కోల్పోయిన పేద ముస్లింలు ముస్లిం లీగు వైపుకు మొగ్గారు

"ముస్లింలీగు కోరే పాకిస్తాన్‌లో హిందూ పారిశ్రామిక వేత్తల గుత్తాధికార ముండదని, తమ పరిశ్రమలు పెరగడానికి మంచి అవకాశముంటుందని, చిన్న పరిశ్రమలుగల ముస్లిములు భావించారు ఉద్యోగాలు భాగా లభిస్తాయని చదువుకున్న వాళ్ళు భావించారు" అని అమియబక్షి వివరించాడు కాగా లీగ్ బలపడింది

అయినా బెంగాల్ రాష్ట్ర ప్రధానమంత్రి ఫజులుల్‌హక్ గట్టిగా జిన్నాను వ్యతిరేకించాడు కాగా బెంగాల్ శాసనసభలోని యూరోపియన్ సభ్యుల మద్దతుతో (కాంగ్రెస్ శాసనసభ్యులు జైళ్ళలో వున్నారు గాబట్టి) ఫజులుల్ హక్కును జిన్నా గద్దెనుండి దింపి,

నజిముద్దీన్‌ను గద్దెనెక్కించాడు. ఆ విషయంలో ఇస్పహానీల ధనబలం జిన్నాకు తోడ్పడింది

ఫజులుల్ హక్ వ్యతిరేకించినట్లే జిన్నాను పంజాబ్ ప్రధానమంత్రి సికందర్ హయత్‌ఖాన్‌కూడా వ్యతిరేకించాడు 1942 డిసెంబర్‌లో సికందర్ హయత్‌ఖాన్ చనిపోయిన పిమ్మట ప్రధానమంత్రి కాగలిగిన ఖిజర్ హయత్‌ఖాన్‌కూడా జిన్నాను వ్యతిరేకించి, జాట్ నాయకుల తోడ్పాటుతో యూనియనిస్టు పార్టీ అధికారాన్ని నిలబెట్టగలిగాడు

కాంగ్రెస్ నాయకుల విడుదల పిమ్మట ముస్లింలీగ్ బలం రోజు రోజుకు తగ్గిపోయింది పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో ముస్లింలీగ్ మంత్రివర్గం పతనమైంది డాక్టర్ ఖాన్ సాహెబ్ నాయకత్వాన కాంగ్రెస్ మంత్రివర్గం అధికారాన్ని చేపట్టింది 1945 మార్చిలో బెంగాల్లో నజిముద్దీన్ మంత్రివర్గం పతనమైంది సింధు, అస్సాం రాష్ట్రాలలోని ముస్లింలీగు మంత్రివర్గాల పతనం తప్పదనే పరిస్థితి ఏర్పడింది "పోరాడి పాకిస్తాన్ సాధిస్తాం" అని ముస్లింలీగ్ ఎన్ని కోతలు కోసినా, పోరాటానికి అది సిద్ధంగా లేదని అందరకూ తెలుసు అయినా జిన్నా కోరిన గొంతెమ్మ కోర్కెలను వైస్రాయి వేవెల్ తిరస్కరించలేదు

## వేవెల్ భయం

1945 జులైలో జరిగిన ఎన్నికల్లో బ్రిటిష్ లేబర్ పార్టీ సాధించిన ఘనవిజయంవల్ల వేవెల్ కాళ్లు వణికాయి లేబర్ పార్టీ అధికారంలోకి రాగానే ఇండియాకు స్వాతంత్ర్య మిస్తామని 1938లో లేబర్ పార్టీ నాయకులు నెహ్రూ, కృష్ణమీననులకు హామీ యిచ్చిన విషయాన్ని వేవెల్ గుర్తుచేసుకున్నాడు కాగా సాధ్యమైనంత త్వరలో లేబర్‌పార్టీ ప్రభుత్వం ఇండియాను కాంగ్రెస్‌కు కట్టబెడుతుందని వేవెల్ భయపడ్డాడు కాబట్టి రాజీ సంభాషణలను త్వరితం చేయడానికి బదులు, వాటికి "బ్రేక్స్" వేశాడు అయినా మారిన ప్రపంచ పరిస్థితివల్ల ఆ బ్రేకులు విరిగిపోయాయి

## మారిన ప్రపంచం

1945 మేలో జర్మనీ లొంగిపోయింది ఆగస్టులో జపాన్ లొంగిపోయింది హిట్లర్ నాజీ ఇజం ముస్సోలిని ఫాసిజం, టోజో మిలిటరీ ఇజం భూస్థాపితమయ్యాయి తూర్పు యూరప్ దేశాలలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, కార్మిక, కర్షక పార్టీలవారు కలసి ప్రభుత్వాలను ఏర్పాటు చేశారు ఫ్రాన్సు, ఇటలీలలో సోషలిస్టుల, కమ్యూనిస్టుల బలం బాగా పెరిగింది చైనీస్ కమ్యూనిస్టు పార్టీ అధికారాన్ని స్వాధీనం చేసుకోగల స్థాయికి ఎదిగింది వియత్నాం, ఇండోనేషియాలలో సామ్రాజ్య వ్యతిరేక వెల్లువ ప్రారంభమైంది ఫ్రెంచి, డచ్ పాలనను తిరిగి నెలకొల్పేందుకు సామ్రాజ్యవాదులు చేసిన ప్రయత్నాలకు వ్యతిరేకంగా ప్రజల పోరాటాలు ప్రారంభమయ్యాయి యుద్ధంలో అలసిపోయిన బ్రిటిష్ సైనికులు, నలిగిపోయిన బ్రిటిష్ ప్రజలు, చితికిపోయిన ఆర్థిక పరిస్థితి లేబర్ పార్టీ ప్రభుత్వానికొక హెచ్చరికగా నిలిచాయి కాబట్టి ప్రభుత్వం ఎత్తుగడలకు పూనుకుంది

## ఎన్నికల ప్రకటన

"రాజ్యాంగ పరిధిలో జరిగే కార్యక్రమాలు ఆందోళనకారులను ఆకర్షించడం అవసరం" అని 1945 ఆగస్టు 14న ఉత్తరప్రదేశ్ గవర్నర్ వైస్రాయికి జాబు వ్రాశాడు

ఎన్నికల కార్యక్రమాన్ని ప్రకటించవలసిందిగా ఆగస్టు 21న బ్రిటిష్ ప్రధాని అట్లీ వైస్రాయిని ఆదేశించాడు 1935 నాటి ఫెడరల్ రాజ్యాంగ చట్ట పరిధిలోనే కేంద్ర అసెంబ్లీకి, రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు జరుగుతాయని వైస్రాయి ప్రకటించాడు కనుక కాంగ్రెస్ నాయకులు తమ అసంతృప్తిని వేవెల్‌కు తెలిపారు జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తారా లేదా? అని ప్రశ్నించారు

వైస్రాయి వేవెల్‌కు, బ్రిటిష్ ప్రధాని అట్లీకి మధ్య లండన్‌లో చర్చలు జరిగాయి తరువాత సెప్టెంబరు 19న వేవెల్ ఒక ప్రకటన చేశాడు "త్వరలోనే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాం" అని హామీ యిచ్చాడు అంతేగాని స్వాతంత్ర్యమిస్తామనే హామీ ఆ ప్రకటనలో లేదు

వైస్రాయి కార్యనిర్వాహకవర్గం ఏర్పాటు విషయంలో ప్రధాన భారతీయ పార్టీలతో జరిగే సంభాషణలను త్వరితం చేస్తామని వేవెల్ చెప్పాడు స్వతంత్ర సంస్థానాధీశుల ప్రతినిధులతోను, శాసనసభ్యులతోను కూడిన రాజ్యాంగ నిర్ణయ సభను ఏర్పాటు చేస్తామని, ఎన్నికల తరువాత ఆ విషయంపైన ప్రధాన రాజకీయ పార్టీలతో సంభాషణలు జరుపుతామని ప్రకటించాడు

అంటే, వయోజన ఓటింగ్‌ద్వారా ఎన్నికైన ప్రతినిధులతో రాజ్యాంగ నిర్ణయ సభను ఏర్పాటు చేస్తామని 1938లో ఫిల్కిన్సులో జరిగిన అనధికార సమావేశంలో లేబర్ పార్టీ నాయకులు ఇచ్చిన వాగ్దానాన్ని 1945లో తిరగదోడారన్నమాట

అందువల్ల భారతదేశ స్వాతంత్ర్యం విషయంలో కన్సర్వేటివ్ పార్టీ పాలసీకి, లేబర్ పార్టీ పాలసీకి మధ్య పెద్దగా తేడా లేదని తేలిపోయింది అయినా ఎన్నికలు ముగిసేంత వరకూ, ఎన్నికల విజయం మీదనే కేంద్రీకరించాలని, పోరాటాలు తలపెట్టకూడదని కాంగ్రెస్ కార్యకర్తలకు నాయకులు సలహా యిచ్చారు

## కమ్యూనిస్టు పార్టీ డిమాండ్

వయోజన ఓటింగ్‌ద్వారా రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు జరగాలి ఆ శాసనసభలు ఎన్నుకున్న ప్రతినిధులతో, భారత రాజ్యాంగ నిర్మాణ సభ ఏర్పాటు కావాలని కమ్యూనిస్టు పార్టీ డిమాండ్ చేసింది జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని గుర్తిస్తే దేశ ఐక్యత కాపాడబడుతుందని విశ్వసించింది బ్రిటిష్ ప్రభుత్వంపైన లేనిపోని నమ్మకాలు పెట్టుకోవద్దని కాంగ్రెస్‌ను, ముస్లింలీగును హెచ్చరించింది. కాంగ్రెస్-లీగు-కమ్యూనిస్టు పార్టీలు ఏకమై, దేశ స్వాతంత్ర్యం కొరకు అంతిమ పోరాటం సాగించడం అవసరమని విజ్ఞప్తి చేసింది

కాంగ్రెస్‌కూడా వయోజన ఓటింగ్ కొరకు పట్టుపట్టివుంటే, ముస్లింలీగు పని యిరకాటంలో పడేది పరిమిత ఓటింగ్‌ద్వారా ముస్లింలీగ్ గెలిచినన్ని సీట్లను వయోజన ఓటింగుద్వారా అయితే గెలిచి వుండేదికాదు 1954లో వయోజన ఓటింగుద్వారా పాకిస్తాన్‌లో జరిగిన ప్రథమ ఎన్నికల్లోనే ఆ విషయం రుజువైంది తూర్పు పాకిస్తాన్‌లో ముస్లింలీగు తుడిచిపెట్టుకుపోయింది పశ్చిమ పాకిస్తాన్‌లో కూడా తన బలాన్ని కోల్పోయింది

వయోజన ఓటింగును కాంగ్రెస్ డిమాండ్ చేస్తే బ్రిటిష్ ప్రభుత్వం వేసిన ఎత్తుగడలు విఫలమయ్యేవి అయినా కాంగ్రెస్ పరిమిత ఓటింగు పద్ధతికి అంగీకరించింది గతంలో

తాను కోరిన వయోజన ఓటింగు పద్ధతిని విస్మరించింది వయోజన ఓటింగు కావాలంటూ అనేక ఉపన్యాసాలిచ్చిన జవహర్‌లాల్ నె[హ్రూకూడా గుట్టుచప్పుడు గాకుండా ఊరుకోవడమేగాక, కమ్యూనిస్టుపార్టీ మీద విరుచుపడ్డాడు

## కమ్యూనిస్టులమీద కాం[గెస్‌వారి దాడి

కల్లూరి చం[దమౌళి అధ్యక్షతన ఏలూరులో జరిగిన కాం[గెస్ కార్యకర్తల సమావేశంలో పాల్గొనకుండా కా[టగడ్డ నారాయణరావు (కాం[గెస్ ఎం ఎల్ ఏ)ను నిరోధించారు ఆయన కమ్యూనిస్టు పార్టీ వాడని, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనలేదని నిందించారు ఆలిండియా కాం[గెస్ కమిటీ సభ్యులైన కమ్యూనిస్టులమీద నె[హ్రూ దుమ్మెత్తిపోశాడు

అనేకచోట్ల కమ్యూనిస్టులమీద కాం[గెస్‌వారి దాడులు జరిగాయి నె[హ్రూ యిచ్చిన ఉపన్యాసం విని పె[టేగిన కాం[గెస్‌వాదులు బొంబాయిలోని కమ్యూనిస్టు పార్టీ కేం[ద కార్యాలయంమీద దాడి చేసి, దానికి నిప్పుపెట్టారు

క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలోగాని, వేరొక సమస్య విషయంలోగాని కమ్యూనిస్టు పార్టీ చేసిన తప్పేమిటో? నిర్ధారించవలసిందిగా పి సి జోషి చేసిన విన్నపానికి గాంధీజీ నుండి సమాధానం రాలేదు

అందువల్ల 1945 అక్టోబరు 5న కమ్యూనిస్టులు తమ ఎ ఐ సి సి సభ్యత్వాలకు రాజీనామా లిచ్చిన పిమ్మటకూడా కాం[గెస్ నాయకులు- ముఖ్యంగా జవహర్‌లాల్ నె[హ్రూ కమ్యూనిస్టు పార్టీమీద దాడిని విరమించుకోలేదు

క్విట్ ఇండియా తీర్మానాన్ని వ్యతిరేకించడం, వివిధ జాతుల స్వయం నిర్ణయాధికారం [పాతిపదికగా ముస్లింలీగుతో కాం[గెస్ ఒడంబడిక చేసుకోవాలని కోరడం కమ్యూనిస్టుల [దోహబుద్ధికి తార్కాణమని నె[హ్రూ [పచారం చేశాడు

కాని, [క్రిప్సు [పతిపాదనలను ఆమోదించడం మంచిదని రాజగోపాలాచారి చెప్పిన మాటగాని, క్విట్ ఇండియా తీర్మానాన్ని వ్యతిరేకించి కాం[గెస్‌నుండి తప్పుకున్న రాజగోపాలాచారి, భులాభాయ్ దేశాయ్ మున్నగువారి [పకటనలుగాని, ముస్లింలీగు కోరిన పాకిస్తాన్ కోర్కెకు అనుగుణంగా రాజగోపాలాచారి రూపొందించిన ఫార్ములాగాని కాం[గెస్ నాయకుల ఆ[గహానికి గురికాలేదు పైగా వారిని కాం[గెస్ నాయకులుగానే పరిగణించారు వారిలో కొందరిని అభ్యర్థులుగా ఎన్నికల్లో నిలబెట్టారు

"గతంలో ఎవరైతే మనను విమర్శించారో, మన కార్య[కమాలను వ్యతిరేకించారో, వారినే యీ ఎన్నికల్లో కాం[గెస్ అభ్యర్థులుగా నిలబెట్టడం జరిగింది" అని నె[హ్రూ తన అసమ్మతిని పటేలుకు తెలియజేశాడు కాని "వ్యక్తిగత తగాదాలలోను, [పాంతీయ కుమ్ములాటలలోను తలదూర్చాలనే కోర్కె నాకు లేదు" అని జాబు[వాసి సరిపెట్టుకున్నాడు (నె[హ్రూ టు పటేల్ 31-10-45. సర్దార్ పటేల్సు కరస్పాండెన్సు)

## మరొక విషయం

మిద్నపూర్‌లో [పభుత్వ దమనకాండ సాగుతున్న సమయంలో శ్యామ[పసాద్ ముఖర్జీ బెంగాల్ రాష్ట్ర మం[తివర్గంలో సభ్యుడుగా వున్నాడు ఆగస్టు తిరుగుబాటులో పాల్గొనవద్దని ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తలను గోల్వాల్కర్ ఆదేశించాడు. హిందూ మహాసభ సభ్యులు

శాసనసభలనుగాని, స్థానిక సంస్థలనుగాని విడిచిపెట్టకూడదని సావర్కార్ ఆజ్ఞాపించాడు ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ పార్టీకి అవసరమైన నిధులను ఎం ఎన్ రాయ్‌కి సబ్సిడీలద్వారా ప్రభుత్వం అందజేసింది అయినా వారినెవరినీ కాంగ్రెస్ నాయకులు దూషించలేదు కాని ప్రభుత్వంతో సహకరించారనే నిందను మోపి కమ్యూనిస్టు పార్టీని దూషించారు

## పెట్టుబడిదారుల కాంక్ష

యుద్ధకాలంలో పారిశ్రామికోత్పత్తి చెప్పుకోదగినంతగా పెరగలేదు వస్త్రాలు, ఇనుము, ఉక్కు, సిమెంటు, కాగితం ఉత్పత్తులు మాత్రం కొంత పెరిగాయి జాతీయ పెట్టుబడిదారులు కెమికల్, ఇంజనీరింగ్ పరిశ్రమలను ప్రారంభించారు కాని బ్రిటిష్ వారి వ్యతిరేకతవల్ల ఓడలు, విమానాలు, కార్లు నిర్మించేందుకు పూనుకోలేకపోయారు కాగా పారిశ్రామికోత్పత్తి మొత్తంమీద 20 శాతం మాత్రమే పెరిగింది అయినా పెట్టుబడిదారుల లాభాలు మాత్రం విపరీతంగా పెరిగాయి ఉత్పత్తి జేసిన సరుకులను బ్లాక్ మార్కెట్‌లో అమ్మడం, అధిక లాభాపేక్షతో ఆహార ధాన్యాల వ్యాపారం (స్పెక్యులేటివ్ బిజినెస్) చేయడం, షేర్ మార్కెట్ కార్యకలాపాలను అధికం చేయడం ద్వారా పెట్టుబడిదారులు తమ లాభాలను విపరీతంగా పెంచుకోగలిగారు

"ఇండియాలోని పెట్టుబడిదారులొక ప్రత్యేక తరగతికి చెందినవారు ఉత్పత్తిని పెంచడానికి తగిన చొరవగాని, సమర్థతగాని వీరికిలేదు అమిత లోభము, అత్యాశ, స్పెక్యులేషన్‌మీద వెర్రి నమ్మకం వీరికున్నాయి" అన్నాడు కోశాంబి

ఏమైతేనేం? తమ చేతుల్లో ధనరాశులు పోగుపడ్డాయి కాబట్టి టాటా, బిర్లా, ఠాకూర్‌దాస్, శ్రీరామ్, కస్తూరిభాయ్ లాల్‌భాయ్ మున్నగు పెట్టుబడిదారులంతా కలసి 1944 జనవరిలో ఒక "ప్లాన్" తయారుచేశారు 1939లో నెహ్రూ అధ్యక్షతన నేషనల్ ప్లానింగ్ కమిటీ చేసిన నిర్ణయాలకు అనుగుణంగానే పెట్టుబడిదారుల ప్లాన్ తయారైంది అందుకు గల కారణాన్ని కోశాంబి యిలా వివరించాడు

"ఆ తరుణంలో పెట్టుబడిదారీ వర్గానికి నెహ్రూ నాయకత్వం అవసరమైంది అంతకుముందు ప్రజలు సాగించిన పోరాట సమయాలలో అవసరమైన మేరకు గాంధీజీ ఉపదేశాలను ఉపయోగించుకొని, తక్కిన ఉపదేశాలను తత్త్వశాస్త్ర సూత్రాలుగా వర్ణించిన 'బుద్ధికుశలత' వారికున్నది" అన్నాడు కోశాంబి

మారిన ఆర్థిక, రాజకీయ పరిస్థితులుకూడా విదేశీ పెట్టుబడిదారులతో చేతులు కలపడానికి బిర్లా, టాటాలవంటి వారికి అవకాశమిచ్చాయి కాగా 1945 వేసవిలో బిర్లా, టాటాలతో కూడిన ప్రతినిధి వర్గం ఇంగ్లండ్, అమెరికాలకు వెళ్లింది హిందూస్తాన్ మోటార్స్ నిర్మాణం విషయంలో బిర్లాకు, న్యూఫీల్డ్‌కు మధ్య ఒడంబడిక జరిగింది టాటాకు, ఇంపీరియల్ కెమికల్స్‌కు మధ్య మరో ఒడంబడిక కుదిరింది

## ముస్లిం పెట్టుబడిదారుల చర్యలు

దేశ విభజన జరిగితే తమకు గుత్తాధిపత్యం లభిస్తుందని ఇస్పహానీ, ఆదంజీ మున్నగు ముస్లిమ్ పెట్టుబడిదారులు ముస్లింలీగును బలపర్చారు ముస్లింలీగు ప్రెస్సుకు ధనసహాయం చేయడమేగాక, స్టార్ ఆఫ్ ఇండియా అనే సాయంకాల పత్రికను కలకత్తాలో ప్రారంభించడానికి, డాన్ పత్రికను ఢిల్లీలో ప్రారంభించడానికి కూడా ధన సహాయం

చేశారు జిన్నా ఆశీస్సులతో "ఫెడరేషన్ ఆఫ్ ముస్లిం ఛాంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్"ను 1945 ఏప్రిల్‌లో ఏర్పరచారు ముస్లిం బ్యాంకులను, విమాన సంస్థను స్థాపించేందుకు ప్లానులు సిద్ధం చేశారు కాగా జాతీయ పెట్టుబడిదారులు రెండుగా చీలిపోయారు ముస్లిం పెట్టుబడిదారులు ముస్లిం లీగును బలపరిస్తే, తక్కినవారు కాంగ్రెస్‌ను బలపర్చారు అయినా హిందూ మహాసభతో తమకుగల సంబంధాలను హిందూ పెట్టుబడిదారులు విడిచిపెట్టలేదు

ఇలా చీలిపోయిన పెట్టుబడిదారులు స్వలాభాపేక్షతో, బ్రిటిష్ ప్రభుత్వ ప్రతిపాదనలు అంగీకరించవలసిందిగా కాంగ్రెస్ నాయకులను, ముస్లింలీగ్ నాయకులను ప్రోత్సహించారు

## ఐ.ఎన్.ఎ. సైనికుల అరెస్టు-ప్రజల తిరుగుబాటు

యుద్ధం ముగియగానే బ్రిటిష్ ప్రభుత్వం మదమెక్కిన పనులు రెండు చేసింది వాటిలో మొదటిది - వియత్నాం, ఇండోనేషియా దేశాలను ఫ్రెంచి, డచ్ సామ్రాజ్య వాదులకు కట్టబెట్టేందుకు భారత సైనిక దళాలను పంపడం రెండవది - భారత జాతీయ సైన్యం (ఐ ఎన్ ఎ)లో చేరినవారిని బంధించి సైనిక న్యాయస్థానంలో విచారించడం మెదలకుండా హిట్లర్ సైన్యాలు లొంగిపోయిన డచ్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తిరిగి ఇండోనేషియా, వియత్నాములను ఆక్రమించడానికి అవసరమైన సైనిక సహాయాన్ని ఇండియా ప్రభుత్వం పంపడం భారతీయులకు కనువిప్పు కలిగించింది ఇతరుల సామ్రాజ్యాన్ని నిలబెట్టేందుకు సాయపడుతున్న బ్రిటిష్ ప్రభుత్వం, తనకు తానుగా ఇండియాకు స్వాతంత్ర్యమివ్వదని స్పష్టపడింది కాబట్టి దేశమంతటా తిరుగుబాటు వాతావారణ మేర్పడింది

ఆ స్థితిలో ప్రభుత్వం అజాద్ హింద్ ఫౌజ్ (ఐ ఎన్ ఎ) వారిపైన విచారణ ప్రారంభించింది 1945 నవంబరులో ఢిల్లీలోని ఎర్రకోటలో సైనిక న్యాయస్థానం ఎదుట, హిందూ ముస్లిమ్ సిక్కు మతాలకు చెందిన పి కె సెహ్‌గాల్, షానవాజ్‌ఖాన్, గురుబక్షిసింగ్ దిల్లానులను ముద్దాయిలుగా నిలబెట్టింది

"అరెస్టు చేసిన 20 వేల మందిలోను 7వేల మందిని బంధించి వుంచాలని, కొన్ని వందలమంది మీద విచారణ జరిపించాలని, తక్కిన వారిని సర్వీస్‌నుండి తొలగించాలని ప్రభుత్వం నిర్ణయించింది " (మాన్‌సెర్గ్ వాల్యూమ్ 6)

కాగా దేశమంతటా అసమ్మతి చెలరేగింది కాంగ్రెస్‌తోపాటు ముస్లిమ్‌లీగ్‌కూడా అసమ్మతి తెలిపింది ముద్దాయిల తరఫున వాదించేందుకు భులాభాయ్ దేశాయ్, కైలాసనాధకట్జూ, తేజ్‌బహదూర్ సప్రూ, అసఫాలీ మున్నగు ప్రసిద్ధ న్యాయవాదులు పూనుకున్నారు జవహర్‌లాల్‌కూడా బారిష్టరు గౌను వేసుకుని కోర్టుకు వెళ్లాడు

"ఇదొక ప్రత్యేకమైన అసమ్మతి ఇదివరకెన్నడూ ఇలాంటి అసమ్మతి వెల్లడి కాలేదు ఇది మత భేదాలను అతిక్రమించి దేశవ్యాప్తమైంది" అని గూఢచారి శాఖ అభిప్రాయపడింది

"ఖైదీలలో హిందూ-ముస్లిమ్ భావం మచ్చుకైనా కనిపించలేదు విచారణకు సిద్ధంగా వున్నవారిలో ఎక్కువమంది ముస్లిములు వారిలో కొందరు జిన్నాను గట్టిగా విమర్శించారు పాకిస్తాన్ విషయంలో విభేదాలను పెంచుతున్నాడనే అభిప్రాయాన్ని వెల్లడించారు" అని నవంబర్ 20న ఎర్రకోటలోని ఐ ఎన్ ఏ ఖైదీలను కలసి మాట్లాడిన ప్రముఖ జర్నలిస్టు బి శివరావు ప్రకటించాడు

ఐ ఎన్ ఎ ఖైదీలను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ, 1945 నవంబర్ 21న కలకత్తాలో ఫార్వర్డ్ బ్లాక్ నాయకత్వాన విద్యార్థుల ఊరేగింపు జరిగింది ఈ ఊరేగింపులో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానగల స్టూడెంట్స్ ఫెడరేషన్ వారు పాల్గొన్నారు అంతవరకూ ఆ రెండు పార్టీల మధ్యనున్న కక్షలు ఆ సమయంలో సమసిపోయాయి ఊరేగింపు డల్హౌసి స్క్వేరుకు చేరకుండా పోలీసులు నిరోధించారు అయినా విద్యార్థులు వెనుకకు తిరగకుండా రోడ్డుమీద కూర్చున్నారు ఆ సమయంలో ముస్లిమ్ లీగ్ జెండాతో ఇస్లామియా కాలేజి విద్యార్థులు వచ్చి కలిశారు

ఊరేగింపు వద్దకు వచ్చి ఉపన్యసించవలసిందిగా నేతాజీ సోదరుడైన శరత్‌చంద్ర బోసును విద్యార్థి నాయకులు అర్థించారు అయినా ఆయన వొప్పుకోలేదు

అయినా విద్యార్థుల దీక్ష సడలలేదు అందరూ కలసి ముందుకు సాగడానికి ప్రయత్నించారు పోలీసు కాల్పులు జరిగాయి ఒక హిందూ విద్యార్థి, మరొక ముస్లిమ్ విద్యార్థి మరణించారు కాగా నవంబర్ 22, 23 తేదీలలో కలకత్తా నగరమంతా పోరాట రంగంగా మారిపోయింది టాక్సీ డ్రైవర్లయిన సిక్కులు సమ్మె చేశారు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానగల ట్రామ్‌వే వర్కర్లు కూడా సమ్మె చేశారు కలకత్తా కార్పొరేషన్ ఆఫీసుతోపాటు అనేక ఫ్యాక్టరీలు మూతపడ్డాయి ప్రజలు పూనుకుని రైళ్లను ఆపివేశారు రోడ్లమీద బారికేడ్లు నిర్మించారు పోలీసులకు అండగా సైనికులొచ్చి కాల్పులు జరిపినా ప్రజలు చెదిరిపోలేదు "కాల్పులు జరుగుతున్నా ప్రజలు వెనకడుగు వేయలేదు ఒకటి రెండు చోట్ల వెనకడుగు వేసినా, వెంటనే తిరిగి విజృంభించారు" అని గవర్నర్ కేసీ వైస్రాయికి తెలియజేశాడు (కేసీ టు వేవెల్ 1-1-1946)

మొత్తం మీద 14 చోట్ల కాల్పులు జరిగాయి 33 మంది చనిపోయారు రెండువందలమంది గాయపడ్డారు సైనిక, పోలీసు వాహనాలు 150 వరకూ ధ్వంసమయ్యాయి 70మంది బ్రిటిష్ సోల్జర్లు, 37గురు అమెరికన్ సోల్జర్లు గాయపడ్డారు చివరకు ప్రభుత్వం వెనుకకు తగ్గి, డల్హౌసీ స్క్వేరులో విద్యార్థుల ఊరేగింపు ప్రవేశించేందుకు అనుమతించింది కాని, నాయకుల విమర్శకు పోరాట వీరులు గురయ్యారు

## పోరాటాలకు నాయకుల వ్యతిరేకత

హింసా చర్యలను ప్రోత్సహిస్తున్నారంటూ కమ్యూనిస్టులను శరత్‌చంద్రబోస్ ఘాటుగా విమర్శించాడు నవంబర్ 24న బాంబేలో జరిగిన ఎన్నికల సమావేశంలో మాట్లాడుతూ సర్దార్ పటేల్ "చిన్న చిన్న సమస్యలమీద పోరాటాలకు దిగి, శక్తి సామర్థ్యాలను వ్యర్థం చేసుకుంటున్నారు" అని విమర్శించాడు (ఇండియన్ యాన్యుయల్ రిజిస్టర్)

సైనిక చర్యద్వారా దేశాన్ని విముక్తి చేయలేకపోయినప్పటికీ, నేతాజీతోపాటు ఆజాద్ హింద్ ఫౌజ్ (ఐ ఎన్ ఎ) వారంతా ప్రజలకు ప్రీతిపాత్రులయ్యారు నేతాజీ సాహసం ప్రజలకు – ముఖ్యంగా బెంగాలీలకు గర్వకారణమైంది ఐ ఎన్ ఎ వారి చైతన్యం ఇండియన్ ఆర్మీలోకి విస్తరిస్తుందని బ్రిటిష్ ప్రభుత్వం భయపడింది అయినా ఐ ఎన్ ఎ ఖైదీలను విడుదల చేయాలంటూ కలకత్తా విద్యార్థులు, ప్రజలు సాగించిన పోరాటం నాయకుల విమర్శకు గురైంది

1945 సెప్టెంబర్‌లో జరిగిన ఎ ఐ సి సి సమావేశంలో పాల్గొన్న పలువురు కాంగ్రెస్ నాయకులు 1942లో సాయుధ పోరాటాలు సాగించినవారిని వీరులుగా చిత్రించి

కీర్తించారు కాని కలకత్తాలో జరిగిన పోరాటం తరువాత మనసు మార్చుకున్నారు కనుకనే 1945 డిసెంబర్ 7-11 తేదీల మధ్య కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అహింసాయుత సత్యాగ్రహ పోరాటంమీద ధృఢమైన విశ్వాసాన్ని ప్రకటిస్తూ తీర్మానించింది

అయితే ఐ ఎన్ ఏ వారిని విడుదల చేయాలని కాంగ్రెస్ కోరడం దేనికి? అనే ప్రశ్నకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడు, ప్రముఖ న్యాయవాది అయిన అసఫాలీ ఒక ప్రైవేట్ సంభాషణలో ఇలా జవాబిచ్చాడు

"ఐ ఎన్ ఎ వారిని విడుదల చేయాలని కోరకపోతే మా పార్టీ బలం తగ్గిపోతుంది కనుకనే విడుదలను కోరుతున్నాం కాని మా కాంగ్రెస్ పార్టీ అధికారాన్ని చేపట్టగలిగితే, సైన్యంనుండి ఐ ఎన్ ఎ వారిని తొలగిస్తాం వారిలో కొందరిమీద విచారణ జరిపినా జరుపవచ్చు " (సుమితా సర్కార్, మోడరన్ ఇండియా)

ఎవరి ఉద్దేశాలు ఎలాంటివైనా, దేశమంతా జరిగిన నిరసన ప్రదర్శనలు, వివిధ పార్టీల అసమ్మతి, కలకత్తా విద్యార్థులు, ప్రజలు ఏకమై సాగించిన వీరోచిత పోరాటం బ్రిటిష్ ప్రభుత్వాన్ని లొంగదీశాయి కాగా ఐ ఎన్ ఎ వారిపైన మోపిన రాజద్రోహ నేరాన్ని, (చక్రవర్తిపై యుద్ధానికి తలపడినారన్న నేరాన్ని) డిసెంబర్ 1న ప్రభుత్వం ఉపసంహరించుకున్నది తోటి ఖైదీలను హత్య చేసినవారిని, చిత్రహింసలకు గురి చేసినవారిని మాత్రం తప్పకుండా శిక్షిస్తామని ప్రకటించింది 1946 జనవరిలో అనేకమందిని విడిచిపెట్టింది

## బ్రిటిష్‌వారి భయం

భారత సైనిక దళాలను ఇండోనేషియా, వియత్నాంలకు పంపడంవల్ల భారతీయులకు కోపం రావడం, ఐ ఎన్ ఏ విచారణకు వ్యతిరేకంగా కలకత్తాలో పోరాటం చెలరేగడం బ్రిటిష్‌వారి ఆందోళనకు కారణమయ్యాయి 1942 ఆగస్టు ఉద్యమంలో అసువులు బాసిన అమరవీరులను కీర్తిస్తూ, వారి మృతికి కారకులైన అధికారులను కఠినంగా శిక్షించాలని కోరుతూ సర్దార్ పటేల్ ప్రభృతులు, ముఖ్యంగా పండిట్ నెహ్రూ చేసిన ఉపన్యాసాలవల్ల బ్రిటిష్ ప్రభుత్వం భయపడింది ఆహార ధాన్యాల కొరత, ధరల పెరుగుదల, నిరుద్యోగం, సైన్యంలో అసంతృప్తి, కార్మికుల ఆందోళన, రైతుల తిరుగుబాట్లు మున్నగువాటి నుపయోగించుకొని మరొక ఉద్యమాన్ని కాంగ్రెస్ ప్రారంభిస్తుందేమోనని ప్రభుత్వ నేతలు భీతిల్లారు ఈ విషయంలో తన అనుమానాలను వ్యక్తంచేస్తూ 1945 నవంబర్ 10న సెంట్రల్ ప్రావిన్సెస్ గవర్నర్ ట్విన్‌హామ్, వేవెల్‌కొక లెటర్ వ్రాశాడు సర్వసేనాని అకిన్ లెఖ్ కూడా దేశంలో పరిస్థితిని వివరిస్తూ డిసెంబర్ 1న వేవెల్‌కు లెటర్ వ్రాశాడు అటుపైన కాంగ్రెస్ నాయకుల ఉపన్యాసాలను వేవెల్ గట్టిగా విమర్శించాడు

కాంగ్రెస్ నాయకులు చేసిన ఉద్రేకపూరిత ఉపన్యాసాలవల్ల దేశీయ పెట్టుబడిదారులుకూడా ఆందోళన చెందారు. ఆ విషయంలో బిర్లాకు కలిగిన ఆందోళనను భారత రాజ్యాంగ కార్యదర్శి పెథిక్ లారెన్సు గుర్తించాడు "బిర్లాతో సంభాషణల విషయంలో గాంధీజీ స్థానాన్ని సర్దార్ పటేల్ ఆక్రమించాడు" అని లారెన్సు తెలుసుకున్నాడు (ఇన్ ది షాడో ఆఫ్ మహాత్మా)

"కాంగ్రెస్‌కు అండగానున్న పెట్టుబడిదారులు, తమ ఆస్తిపాస్తులేమైపోతాయోనని భయపడుతున్నారు" అని డిసెంబర్ 5న పెథిక్ లారెన్సుకు వేవెల్ తెలియజేశాడు ఆ మరునాడొక లండన్ అఫిషియల్‌కు బిర్లా ఈ విధంగా హామీ యిచ్చాడు

"హింసా చర్యలనుగాని, సందిగ్ధ స్థితినిగాని చూడాలని నెహ్రూగాని, మరొక రాజకీయ నాయకుడుగాని అనుకోవడంలేదు ప్రజల అసహనం, ప్రస్తుత పరిస్థితి ఉద్రేకపూరిత ఉపన్యాసాలకు కారణమవుతున్నాయి నాయకులుకూడా ఈ పరిస్థితికి లోనవుతున్నారు అయినా ఒక హద్దూ, అదుపూ లేని ఉపన్యాసాలు అంతకంతకూ తక్కువగా వినబడతాయనుకుంటున్నాను" (మాన్ సెర్గ్ వాల్యూమ్ 6)

కాగా డిసెంబర్ రెండోవారంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు అహింసాయుత సత్యాగ్రహంమీద తమకుగల విశ్వాసాన్ని పునరుద్ఘాటించారు

విడుదలైన ఐ ఎన్ ఏ ఖైదీలకు జరిగిన సన్మానసభకు ప్రభుత్వ సైనికులు మిలిటరీ యూనిఫారమ్సుతో హాజరయ్యారని 1946 జనవరిలో పంజాబ్ గవర్నర్ వైస్రాయికి రిపోర్టు చేశాడు కాగా పరిస్థితి చేయిదాటకముందే కాంగ్రెస్‌తోను, ముస్లింలీగుతోను సంభాషణలు సాగించడం అవసరమని బ్రిటీష్ ప్రభుత్వం భావించింది భారత నాయకులతో చర్చించేందుకు "కాబినెట్ మిషన్" ఇండియాకు వెళుతుందని 1946 జనవరి 22న ప్రకటించింది అయినా ఫిబ్రవరిలో మరొక తిరుగుబాటును ప్రభుత్వం ఎదుర్కొనవలసి వచ్చింది

## ఫిబ్రవరి పోరాటం

అబ్దుల్ రషీద్ అనే ఐ ఎన్ ఏ ఖైదీకి విధించిన ఏడేళ్ళ కఠిన శిక్షకు వ్యతిరేకంగా మరొకమారు కలకత్తా ప్రజలు పోరాడారు మొట్టమొదట ముస్లింలీగుకు చెందిన విద్యార్థులు సమ్మెకు పిలుపిచ్చారు వారితో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానగల విద్యార్థి ఫెడరేషన్ చేతులు కలిపింది విద్యార్థులు, కార్మికులు, హిందువులు, ముస్లిములు ఏకమై, 1946 ఫిబ్రవరి 11న ప్రదర్శనలు జరిపారు

ఫిబ్రవరి 12న కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన పిలుపునందుకొని కార్మికులు సమ్మె చేశారు కలకత్తా చుట్టుపట్లగల ఫ్యాక్టరీలన్నీ మూతబడ్డాయి వెల్లింగ్టన్ స్క్వేర్‌లో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది ప్రదర్శకుల నుద్దేశించి ముస్లిమ్‌లీగ్ నాయకుడు సుహ్రావర్దీ, కాంగ్రెస్ నాయకుడు సతీష్‌దాస్ గుప్తా, కమ్యూనిస్టు పార్టీ నాయకుడు సోమనాథ్ లాహిరి ఉపన్యసించారు

ఫిబ్రవరి 12-13 తేదీలలో పోలీసులకు, ప్రజలకు మధ్య కొన్నిచోట్ల, సైనికులకు, ప్రజలకు మధ్య కొన్నిచోట్ల వీధి పోరాటాలు జరిగాయి ఆ పోరాటాలలో 84 మంది దేశభక్తులు చనిపోయారు 3 వందలమంది గాయపడ్డారు అయినా విద్యార్థుల సమ్మె 15వ తేదీవరకూ కొనసాగింది కలకత్తా విద్యార్థుల సమ్మెకు సానుభూతిగా బాంబే విద్యార్థులుకూడా సమ్మె చేశారు

## రేషన్ల తగ్గింపుకు వ్యతిరేకత

1945లో బెంగాల్, బాంబే రాష్ట్రాలలో పంటలు దెబ్బతిన్నాయి 30 లక్షల టన్నుల ఆహార ధాన్యాల కొరత ఏర్పడిందని వేవెల్ ప్రకటించాడు అమెరికానుండి ఆహార ధాన్యాలు అందుతాయో, లేదో చెప్పలేనన్నాడు కాగా రేషన్లను తగ్గించడం తప్ప

మరో మార్గం కన్పించడంలేదని 1946 జనవరి 29న ప్రకటించాడు

యుద్ధకాలంలో లండన్ ప్రజలలో ప్రతి ఒక్కరికి 2800 కాలరీల విలువగల ఆహార పదార్ధాలను ప్రతిరోజూ బ్రిటిష్ ప్రభుత్వం అందజేసింది 1945లో హాలెండుకు లక్షల కొలది టన్నుల ఆహార పదార్ధాలను సరఫరా చేసింది కానీ భారతీయుల గోడు వినిపించుకోలేదు తమ సామ్రాజ్యం అంతం కాబోతున్న సమయంలోకూడా అదే పాలసీని కొనసాగించింది కాగా కార్మికులు, పోస్టల్ ఉద్యోగులు, రైల్వే కార్మికులు మున్నగువారు సమ్మెలకు సిద్ధమయ్యారు

ముస్లిమ్‌లీగ్ నాయకులతోపాటు కాంగ్రెస్ నాయకులుకూడా రేషనింగు తగ్గించేందుకు అంగీకరించారు "రేషనింగును తగ్గించడం దూరదృష్టితో చేసిన పని" అని మెచ్చుకోవడమేగాక "బ్రిటిష్‌వారిపుడు తాత్కాలిక పాలనా బాధ్యతలను నిర్వహిస్తున్నారు కాబట్టి సమ్మెలకు తావులేదు" అని అబుల్ కలామ్ ఆజాద్ ప్రకటించాడు (మాన్ సెర్గ్ వాల్యూమ్ 6)

"అయినా ఆకలితో మలమలమాడే ప్రజలు మెదలకుండా వుండలేకపోయారు ఫిబ్రవరి నెల మధ్యలో 80 వేల మంది ప్రజలు అలహాబాదులో ప్రదర్శన జరిపి, రేషన్ షాపులమీద దాడి చేశారు" (ఇబిడ్) ఇంత పెద్దఎత్తునగాకపోయినా ఏదో ఒకవిధమైన ప్రదర్శనలు దేశమంతటా జరిగాయి

## నావికా సైనికుల పోరాటం

1946 ఫిబ్రవరి 18, 23 తేదీల మధ్య జరిగిన నావికా సైనికుల తిరుగుబాటు స్వతంత్ర భారత అవతరణను త్వరితం చేసింది అయినా భారత స్వాతంత్ర్య సమరచరిత్రలో ఆ పోరాట యోధులకు తగిన స్థానం లభించలేదు

తమకు తినడానికి పనికిరాని అన్నం పెడుతున్నారని, అధికార్లు తమను బండబూతులు తిడుతున్నారని తల్వార్ నౌకలోని రేటింగ్సు ఫిర్యాదు చేశారు ఆ ఫిర్యాదును కమాండింగ్ ఆఫీసర్ కింగ్ త్రోసిపుచ్చడమేగాక "అడుక్కుతినే గాడిదలకు వెన్నరొట్టెలు కావాలా?" అని తిట్టిపోశాడు ఇక చేసేదిలేక ఫిబ్రవరి 16న రేటింగ్స్ అందరూ అర్ధాకలితో పడుకున్నారు 17వ తేదీన పెట్టిన అన్నంలో రాళ్లు, పురుగులు వున్నాయి కనుక వారి సహనం నశించింది ఫిబ్రవరి 18న నిరాహారదీక్ష పూనారు ఎవరూ పనికి వెళ్లలేదు అసలు పక్కలమీద, నుండి లేవనేలేదు

బొంబాయి రేవులో నావికాదళానికి చెందిన నౌకలు 60దాకా వున్నాయి తల్వార్ నౌకలో ప్రారంభమైన సమ్మె వార్త ఇతర నౌకలకు చేరింది ఆ నౌకలలోనివారుకూడా అనేక బాధలు పడుతున్నారు కాబట్టి ఫిబ్రవరి 19న వారు సమ్మె చేశారు. ఫోర్టు బారక్సు, కాజిల్ బారక్సు మొదలైన వాటిలోకూడా సమ్మె జరిగింది ఎం ఎస్ ఖాన్ నాయకత్వాన సమ్మె కమిటీ ఏర్పడింది నౌకలమీద కాంగ్రెస్–ముస్లిమ్‌లీగ్–కమ్యూనిస్టు పార్టీల జెండాలు రెపరెపలాడాయి

"మంచి ఆహారమివ్వాలి తెల్లవారితో సమంగా జీతభత్యాలివ్వాలి సర్వీస్ నిబంధనలను మార్చాలి ఐ.ఎన్ ఎ ఖైదీలను విడుదల చేయాలి ఇండోనేషియా నుండి భారత సైనిక దళాలను వెనుకకు రప్పించాలి" అనే ముఖ్యమైన కోర్కెలతోపాటు మరికొన్ని సాధారణ కోర్కెలనుకూడా చేర్చిన పత్రాన్ని పై అధికారులకు పంపించారు

ఈలోగా అడ్మిరల్ గాడ్‌ఫ్రే బాంబర్ విమానంలో వచ్చాడు సమ్మెను విరమించక పోతే బాంబులు కురిపిస్తానని బెదిరించాడు బ్రిటిష్ యుద్ధ నౌకలను బొంబాయికి పంపుతామని పార్లమెంటులో బ్రిటిష్ ప్రధాని అట్లీ ప్రకటించాడు ఈ బెదిరింపులతోపాటు, బాంబే నావికా సైనికుల సమ్మె వివరాలుకూడా ఇతర ప్రాంతాలలోని నావికా సైనికులకందాయి

కరాచీ రేవులోను, మనోరా దీవివద్దను వున్న ఓడలలో సైనికులు ఫిబ్రవరి 20న సమ్మె ప్రారంభించారు అదే రోజున కలకత్తా, విశాఖపట్నం రేవులవద్దనున్న నౌకలలోకూడా సమ్మె ప్రారంభమైంది తరువాత కొచ్చిన్, అండమాన్ దీవులు మున్నగు రేవులలోనున్న నావికా బలగాలకుకూడా సమ్మె వ్యాపించింది

సమ్మె చేస్తున్న నావికా సైనికులమీద కాల్పులు జరిపేందుకు బలూచీ సైనికులు, గూర్ఖా సైనికులు నిరాకరించారు బాంబేలోనున్న భారత వైమానికులు తమ సంఘీభావాన్ని ప్రకటించారు కలకత్తాలోనున్న మూడు పయనీర్ సైనిక దళాలు నావికా సైనికుల సమ్మెకు సానుభూతిగా సమ్మె చేశాయి

కాబట్టి నావికా సైనికులను బ్రిటిష్ సైనికులు ఫిబ్రవరి 21న చుట్టుముట్టారు వారివద్ద అన్ని రకాల ఆయుధాలూ వున్నాయి నావికా సైనికులకవిలేవు అయినా తమను చుట్టుముట్టి ఫిరంగి గుళ్లు కురిపించిన బ్రిటిష్ సోల్జర్సును ఎదుర్కొని పోరాడారు

నావికా సైనికులను బలపరుస్తూ ఫిబ్రవరి 22న హర్తాళ్ జరపవలసిందిగా కమ్యూనిస్టు పార్టీ ప్రజలకు విజ్ఞప్తి చేసింది బాంబేలో మిల్లులన్నీ మూతబడ్డాయి ఆఫీసులు, దుకాణాలు తెరవలేదు ప్రజలంతా రోడ్లమీదకొచ్చి బ్రిటిష్ సోల్జర్లనడ్డుకునేందుకు బారికేడ్లు నిర్మించారు నావికా సైనికులకు అవసరమైన ఆహార పదార్థాలనందజేశారు

కలకత్తా, కరాచీ, విశాఖపట్నం, మద్రాస్ మొదలగుచోట్ల హర్తాళ్ జరిగింది అస్సాం, గోల్డెన్ రాక్ మున్నగుచోట్ల రైల్వే కార్మికులు సమ్మె చేశారు మద్రాసులోను మరికొన్ని చోట్లను పోలీసు కాల్పులు జరిగాయి అనేకమందిని పోలీసులు అరెస్టు చేశారు అన్నింటికంటే పెద్ద పోరాటం బాంబేలో జరిగింది నావికా సైనికులకు బ్రిటిష్ సైనికులకు మధ్య కాల్పులు జరిగాయి ఫిబ్రవరి 22-23 తేదీలలో బొంబాయి నగరం భారతీయులకు-బ్రిటిష్ వారికి మధ్య యుద్ధరంగంగా మారింది 300 మంది భారతీయులు అమరవీరులయ్యారు 1046 మంది గాయపడ్డారు

నావికా సైనికుల సమ్మె పోరాటాన్ని కమ్యూనిస్టు పార్టీ గట్టిగా బలపర్చింది కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులు అచ్యుతపట్వర్ధన్, అరుణా అసఫాలీ మున్నగువారు బలపర్చారు కాని కాంగ్రెస్, ముస్లిమ్‌లీగ్ నాయకులు వ్యతిరేకించారు

"బాంబేకు రావలసిందిగా అరుణా అసఫాలీ కోరిన కోర్కెకు నెహ్రూ సమ్మతించాడు కాని, ఉద్రేకంతో ప్రారంభించిన హింసాయుత చర్యలను అణచవలసిన అవసరమున్నదని ప్రకటించాడు కొన్నాళ్లు గడిచిన పిమ్మట, ప్రజలకు-సైన్యానికి మధ్యనున్న ఉక్కుగోడను బద్దలుగొట్టినందుకు నావికా సైనికులను మెచ్చుకున్నాడు " (మాన్ సెర్గ్ వాల్యూమ్ 6)

"గొడవలు మానండి, ఎవరి పనులు వారు చేసుకోండి" అని సర్దార్ పటేల్ సలహా యిచ్చాడు శాంతిభద్రతలు కాపాడేందుకు వాలంటీర్లను పంపుతామని కాంగ్రెస్ నాయకుడు ఎస్ కె పాటిల్, లీగ్ నాయకుడు చుండ్రిగర్ ప్రభుత్వానికి తెలియజేశారు " (సుమిత్ సర్కార్, మోడరన్ ఇండియా)

"నావికా సైనికులు బాధలుపడుతోంటే శాంతియుతంగా వాటిని తీర్చుకునేందుకు ప్రయత్నించాలి లేదా రాజీనామా చేయాలి హింసాయుత చర్యల కొరకు హిందువులు, ముస్లిములు, ఇతరులు ఏకం గావడం పవిత్రమైన పనిగాదు" అని గాంధీజీ ప్రకటించాడు (ఇబిద్)

"రాజకీయాలలో హిందువులను, ముస్లిములను ఏకం చేయడంకంటే, పోరాటాలలో ఏకం జేయడం తేలిక" అని అరుణా అసఫాలీ ప్రకటించింది (సర్దార్ లెటర్స్)

"ఏ విధంగానైనా సరే, ఒకే సమయంలో హిందువులతోను, ముస్లిములతోను ఘర్షణ పడవలసిన అవసరం మనకు కలగకుండా చూచుకోవాలి" అని వేవెల్ తన క్రింది అధికారులకు చెప్పాడు (వైస్రాయిస్ జర్నల్)

ఇంత జరిగిన పిమ్మట సర్దార్ పటేల్, జిన్నాల హామీపైన ఆధారపడి నావికా సైనికులు లొంగిపోయారు కాని పటేల్, జిన్నాలు యిచ్చిన హామీలు అమలు జరగలేదు ఎందువల్ల?

"సైన్యంలో క్రమశిక్షణను పాడుచేయకూడదు స్వతంత్ర భారతదేశంలోకూడా మనకు సైన్యం కావాలి" అని సర్దార్ పటేల్ తేన్నేటి విశ్వనాధంకు 1946 మార్చి 1న ఉత్తరం వ్రాశాడు అదీ అసలు సంగతి (సర్దార్ లెటర్సు)

కాని, నావికా సైనికులొక ఉదాత్తమైన, మరువరాని సందేశాన్ని ప్రజలకు పంపించారు

"మానవ జాతి జీవనంలో మా సమ్మె ఒక చారిత్రక ఘటన చరిత్రలో తొలిసారిగా సైనికుల రక్తం, ప్రజల రక్తం కలిసి ప్రవహించింది ఈ విషయాన్ని మేమెన్నడూ మరిచిపోము మా సోదరీసోదరులైన మీరుకూడా మరిచిపోరని మాకు తెలుసు. మన గొప్ప జాతి చిరకాలం వర్ధిల్లాలి జైహింద్" (ది అర్ ఐ.ఎన్.స్ట్రయిక్ పుట-75)

## ఎన్నికల ఫలితాలు

1945 నవంబరులో ఎన్నికల ప్రకటన జరిగినప్పటినుండి కాంగ్రెస్ నాయకులు ఎన్నికలమీద కేంద్రీకరించారు. ఎన్నికలు పరిమిత ఓటింగుతో జరిగాయి. ధనికులకు, భూస్వాములకు, విద్యాధికులకు మాత్రమే కేంద్ర అసెంబ్లీ ఓట్లుండేవి వారు నూటికి ఒకరుకూడా లేరు నూటికి పదిమంది చొప్పున మాత్రమే రాష్ట్ర అసెంబ్లీ ఓటర్లుండేవారు అందువల్ల కేంద్ర అసెంబ్లీలో ముస్లిములకు రిజర్వు చేసిన 30 సీట్లను ముస్లింలీగు గెలుచుకోగలిగింది రాష్ట్ర శాసనసభల్లో రిజర్వు చేసిన 509 స్థానాలలోనూ 442 స్థానాలను స్వాధీనం చేసుకోగలిగింది 1934 ఎన్నికల్లో పంజాబ్ అసెంబ్లీలోని 175 సీట్లలో రెండింటిని మాత్రమే గెలవగలిగిన లీగ్ యీ ఎన్నికల్లో 79 సీట్లను గెలవగలిగింది

అయినా జిన్నాకు వ్యతిరేకంగా నిలబడిన ఖిజర్ హయత్‌ఖాన్ అకాలీదళ్, కాంగ్రెస్ సభ్యుల సహకారంతో పంజాబులో మంత్రివర్గాన్ని ఏర్పరచగలిగాడు పాకిస్తాన్‌లో భాగాలుగా ముస్లింలీగ్ డిమాండ్ చేసిన అస్సాంలోను, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలోను కాంగ్రెస్ మంత్రివర్గాలేర్పడినాయి. సింధు, బెంగాల్ రాష్ట్రాలలో ఏర్పడిన లీగ్ మంత్రివర్గాలు సహితం, యూరోపియన్ సభ్యుల సహకారంతోను, ప్రభుత్వ మద్దతుతోను నిలబడ గలిగాయి.

కాగా వయోజన ఓటింగుద్వారా ఎన్నికలు జరిగినట్లయితే, రిజర్వేషన్లు వున్నప్పటికీ

ముస్లింలీగ్ తన బలాన్ని ప్రదర్శించగలిగి వుండేదికాదని పలువురు మేధావులు అభిప్రాయపడ్డారు కాని పరిమిత ఓటింగుకు కాంగ్రెస్ నాయకులంగీకరించడంవల్ల ముస్లింలీగ్ పంట పండింది

జనరల్ నియోజక వర్గాలలోని ఓట్లలో నూటికి 91 3 ఓట్లను పొందగలిగిన కాంగ్రెస్, కేంద్ర అసెంబ్లీలోగల 102 స్థానాలలోను 57 స్థానాలను గెలువగలిగింది బెంగాల్, సింధు, పంజాబ్ రాష్ట్రాలలో తప్ప, తక్కిన అన్ని రాష్ట్ర శాసనసభలలోను ఆధిక్యతను సంపాదించి మంత్రివర్గాలను ఏర్పాటు చేసింది

ఆ ఎన్నికల్లో హిందూ మహాసభ పూర్తిగా ఓడిపోయింది కమ్యూనిస్టు పార్టీ బెంగాల్లో మూడు సీట్లను, మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలో రెండేసి సీట్లను గెలిచింది అవికూడా కార్మికులు బలపరచడంవల్ల లభించాయి అయినా కొన్ని నియోజకవర్గాలలో కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్‌కు గట్టిపోటీ నివ్వగలిగింది కాని ఓడిపోయింది కనుక సర్దార్ పటేల్ సంతోషించాడు

"కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన గట్టి పోటీని తట్టుకొని కాంగ్రెస్ అభ్యర్థులను గెలిపించినందుకు మిమ్ములను అభినందిస్తున్నాను" అని సర్దార్ పటేల్ కాళేశ్వరరావుకొక లేఖ వ్రాశాడు (పటేల్ టు కాళేశ్వర్రావు 27 మార్చి 1946)

కాని మద్రాస్ గవర్నర్ వైస్రాయికి పంపిన రిపోర్టులో "ఇకముందు రాబోయే ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ మెజారిటీని పొందగలుగుతుందని మితవాద కాంగ్రెస్ నాయకులు భయపడుతున్నారు" అని వెల్లడించాడు (నై-టు వేవెల్ 5 ఏప్రిల్ 1946 మాన్‌సెర్గ్ వాల్యూమ్ 7)

అవి ఆనాటి ఎన్నికల ఫలితాలు కలకత్తా, బాంబే, కరాచీ మున్నగు ప్రదేశాలలో విద్యార్థులు, ప్రజలు, కార్మికులు, నావికా సైనికులు కలసి బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పోరాడుతున్న సమయంలో కాంగ్రెస్ నాయకులు పరిమిత ఓటింగుకు అంగీకరించి, ఎన్నికలపైన కేంద్రీకరించడం గమనించవలసిన విషయం

## మంత్రుల రాయబారం అసలు రహస్యం

1946 మార్చి 24న భారత నాయకులతో సంభాషణలు జరిపేందుకు బ్రిటిష్ కాబినెట్ మంత్రులు ముగ్గురు-పెథిక్ లారెన్సు, స్టాఫర్డ్ క్రిప్పు, అలెగ్జాండర్ - ఢిల్లీ చేరుకున్నారు. ఈలోగా వైస్రాయి వేవెల్ ఒక ప్లాను తయారుజేశాడు బ్రిటిష్ ఆర్మీని, అధికారులను ముస్లిములు మెజారిటీగానున్న ప్రాంతాలకు తరలించి, తక్కిన దేశాన్ని కాంగ్రెస్‌కు అప్పగించడం అవసరమని ఆ ప్లానులో సూచించాడు అంటే, జిన్నా కోరిన పాకిస్తానును చల్లగా ముస్లింలీగుకు కట్టబెట్టేందుకు ప్లాన్ వేశాడన్నమాట కాని ఆ ప్లానును క్యాబినెట్ మిషన్ తిరస్కరించింది

కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వ ఏర్పాటుపైన, రాజ్యాంగ నిర్ణయ సభలో అనుసరించవలసిన సూత్రాలపైన చర్చలు జరిగాయి మార్చి 15న కామన్సు సభలో బ్రిటిష్ ప్రధాని అట్లీ మాట్లాడుతూ "భారతదేశానికి త్వరలోనే సంపూర్ణ స్వాతంత్ర్యమిస్తాం మైనారిటీల హక్కులను రక్షిస్తాం కాని మెజారిటీవారి పురోగమనాన్ని అడ్డుకునే మైనారిటీ వారి వీటోను తిరస్కరిస్తాం" అంటూ చేసిన ప్రకటన కాంగ్రెస్ నాయకుల ఆశలను పెంచింది

కాబినెట్ మిషన్ సభ్యులు కాంగ్రెసు నాయకులకు సన్నిహితంగా వుంటున్నారనే అనుమానం వేవెలుకు కలిగింది ఒకసారి క్రిప్సు స్వయంగా గాంధీజీకి మంచినీళ్ళు తెచ్చి యివ్వడంవల్ల వేవెల్ మరీ భయపడ్డాడు "కాబినెట్ మిషన్ కాంగ్రెస్‌వారి జేబుల్లో వుంది" అని వైస్రాయ్ జర్నల్ విమర్శించింది

ఒక్కొక్కప్పుడు కాబినెట్ మిషన్ కొద్దిగా కాంగ్రెస్ వైపుకు మొగ్గుతున్నట్లు కనిపించేది కాని అలా కనిపించడం, బ్రిటిష్ లేబర్ పార్టీకి భారత జాతీయతమీదనున్న అనుమానంవల్ల మాత్రంకాదు పోరాటానికి దిగకుండా కాంగ్రెస్‌ను అధికారంవైపుకు ఆకర్షించాలనే తాపత్రయమే దానికి కారణం అందుకు ఉదాహరణగా, '46 మార్చి 29న వేవెల్ వెలిబుచ్చిన అభిప్రాయాన్ని చూడవచ్చు

"సామూహిక ఉద్యమాన్ని లేదా విప్లవాన్ని ప్రారంభించగల శక్తి కాంగ్రెస్‌కున్నది కాంగ్రెస్‌వారందకు పూనుకుంటే, మనం వారిని అణచివేయగలగడం సందేహాస్పదం కనుక ఉద్యమం ప్రారంభం కాకుండా చూడడం అవసరం" అని వేవెల్ భావించాడు (వైస్రాయ్ జర్నల్, పుట 232)

"కనుక తేలికగా త్వరగా అందనున్న అధికారంమీదగల మోహంతో, ఏ విధంగానైనా సరే సాంఘిక వ్యవస్థను యధాతధంగా నిలపాలనే కోర్కెతో, కాంగ్రెస్ నాయకులు మరోసారి తమ ఆయుధాలను ద్వారాలకు వేలాడగట్టారని నిర్ణయించకుండా వుండడం కష్టం" అన్నాడు సుమిత్ సర్కార్

1946 ఏప్రియల్లో మలబార్, ఢాకా, బీహార్, ఢిల్లీ, అండమాన్ దీవుల పోలీసులు సమ్మె చేశారు మే నెలలో రైల్వే వర్కర్లు సమ్మె నోటీసులిచ్చారు జులైలో పోస్టల్ వర్కర్లు సమ్మె చేశారు ఆ సమ్మెను బలపరుస్తూ కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన పిలుపు నందుకొని కలకత్తాలోని హిందూ-ముస్లిం ప్రజలందరూ కలసి శాంతియుతంగా, సంపూర్ణ సార్వత్రిక బంద్‌ను జయప్రదం చేశారు మొత్తంమీద 1946లో 1629 సమ్మెలు జరిగాయి వాటిలో 19,41,948 మంది పాల్గొన్నారు కనుక ఆగస్టులో సమావేశమైన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ" క్రమశిక్షణలేని కార్మికులు తమ కర్తవ్యాలను మరిచి సమ్మెలకు పూనుకుంటున్నారు" అని విమర్శించింది

"రైల్వే వర్కర్ల కోరికలు సమర్థనీయమైనవి కావని, వాటిని అంగీకరించడం ప్రమాదకరమని జవహర్లాల్ వెల్లడించిన అభిప్రాయం, వైస్రాయికి సంతోషాన్ని కలిగించింది ఢిల్లీలో విద్యుత్ శాఖ ఉద్యోగుల సమ్మెను అణచేందుకు సైనికులను, బ్రిటిష్ సాంకేతిక సిబ్బందిని పిలిపించాలని శరత్‌చంద్రబోస్ చేసిన ప్రతిపాదన వైస్రాయికి ఆశ్చర్యాన్ని గలిగించింది " (వైస్రాయి జర్నల్, పుటలు 279, 352)

## మూడు దొంతర్ల పధకం

కాంగ్రెస్ నాయకుల అభిప్రాయాలను విని వేవెల్ సంతోషించినప్పటికీ ముస్లింలీగును బలపర్చడం ఆయన మానలేదు పాకిస్తాన్ కావాలనే మొండిపట్టును జిన్నా విడువలేదు కాగా జిన్నా కోరిన పాకిస్తాన్ లభించడం అసంభవమని కాబినెట్ స్పష్టం చేసింది

"ముస్లింలీగ్ కోరుతున్న పాకిస్తాన్‌లో, ముస్లిమేతరులు మెజారిటీగానున్న ప్రాంతాలున్నాయి బెంగాల్, అస్సాం రాష్ట్రాల జనాభాలో 48 3 శాతం ప్రజలు ముస్లిములు

కారు పంజాబ్‌లోని అంబాలా, జలంధర్ డివిజన్లలో హిందువులు, సిక్కులు అధిక సంఖ్యలో వున్నారు మతం ప్రాతిపదికగా లీగ్ కోరుతున్న స్వయంనిర్ణయాధికార హక్కును సర్వత్రా వర్తింపజేస్తే, బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలోని ముస్లిమేతరులు విడిపోవడం తథ్యం అప్పుడా రెండు రాష్ట్రాలను విభజించవలసి వస్తుంది అందువల్ల శతాబ్దాలుగా సాగుతున్న సంబంధాలు తెగిపోతాయి పరిపాలనా సంబంధమైన సమస్యలతోపాటు సైనిక ఆర్థిక సమస్యలుకూడా తలెత్తుతాయి దేశ విభజన జరిగితే తమకు ప్రత్యేక సర్వస్వతంత్ర రాష్ట్రం కావాలని సిక్కులు కోరుతున్నారు కాబట్టి ముస్లింలీగ్ కోరే పాకిస్తాన్ రూపొందదు" అని కాబినెట్ మిషన్ వివరించింది

తరువాత మేనెల 16న ఒక కొత్త పథకాన్ని సూచించారు దాని ప్రకారం కేంద్రంలో ఫెడరల్ ప్రభుత్వముంటుంది దేశరక్షణ, కమ్యూనికేషన్లు, విదేశాంగ విధానంపైన మాత్రమే కేంద్ర ప్రభుత్వానికి అధికారముంటుంది ఈ అధికారానికి సంస్థానాలుకూడా లోబడి వుంటాయి

రాష్ట్రాలు మూడు భాగాలుగా విభజించబడతాయి మొదటి భాగంలో హిందూ మెజారిటీ రాష్ట్రాలుంటాయి రెండోదానిలో పంజాబ్, సింధు, బలూచిస్తాన్, సరిహద్దు రాష్ట్రాలుంటాయి మూడో దాంట్లో బెంగాల్, అస్సాం రాష్ట్రాలుంటాయి

ఈ గ్రూపులు కేంద్రానికి, రాష్ట్రాలకు మధ్యనుంటాయి రాజ్యాంగ నిర్మాణ సభకు ప్రతినిధులను ఎన్నుకోవడంతోపాటు, శాసనసభలను, కార్యనిర్వాహక వర్గాలను కలిగివుండే హక్కుకూడా యీ గ్రూపులకు వుంటుంది వీటిక్రింద రాష్ట్రాలుంటాయి

ఈ పథకాన్ని కాంగ్రెస్ ఒప్పుకోదని వేవెల్, జిన్నా భావించారు. కాంగ్రెస్ ఒప్పుకోకపోతే, మధ్యంతర మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవలసిందిగా వేవెల్ తనను ఆహ్వానిస్తాడని జిన్నా ఉవ్విళ్లూరాడు కనుక జూన్ 6న కాబినెట్ మిషన్‌వారి పథకానికి ఆమోదం తెలిపాడు కాని రాష్ట్రాల గ్రూపింగ్ తప్పనిసరిగా జరిగితీరాలని కోరాడు

"తప్పనిసరిగా రాష్ట్రాలను కలపడమంటే, రాష్ట్రాల స్వయం నిర్ణయాధికారాన్ని త్రోసిపుచ్చడమే"నని కాంగ్రెస్‌వారు వాదించారు

"అయా గ్రూపులలో రాష్ట్రాలను చేర్చడం తప్పనిసరిగా జరుగుతుంది కాని రాజ్యాంగ రచన జరిగిన పిమ్మట, కావాలనుకుంటే విడిపోయే హక్కు రాష్ట్రాలకుంటుంది" అని కాబినెట్ మిషన్ హామీ యిచ్చింది అలా కొన్ని హామీలు, వివరణలు లభించినందున జూన్ 24న కాంగ్రెస్ నాయకులుకూడా కాబినెట్ మిషన్ రూపొందించిన పథకాన్ని ఆమోదించారు

"కాబినెట్ మిషన్ పథకాన్ని కాంగ్రెస్, లీగులు ఆమోదించడం అద్భుతమైన విషయం" అని అబుల్ కలాం అజాద్ మెచ్చుకున్నాడు (ఇండియా విన్సు ఫ్రీడమ్, పుట 151)

"కాబినెట్ మిషన్ పథకాన్ని కాంగ్రెస్ ఆమోదించినప్పుడు వేవెల్ అసంతృప్తి చెందాడు" (వైస్రాయి జర్నల్, 25 జూన్)

జులై 7న జరిగిన ఎ ఐ సి సి సమావేశం బ్రిటిష్ మంత్రివర్గ ప్రతినిధుల పథకానికి ఆమోదముద్ర వేసింది అబుల్ కలాం అజాద్ స్థానే ఆయన సూచనపై నెహ్రూను కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకుంది

## నెహ్రూ అభిప్రాయాలు-జిన్నా వ్యతిరేకత

జులై 10న నెహ్రూ తన వ్యక్తిగత అభిప్రాయాలను పత్రికా విలేకరులకు వెల్లడించాడు "స్వాతంత్ర్యాన్ని గురించి వైస్రాయిగాని, ముస్లింలీగ్‌గాని ఆలోచిస్తున్న విధంగా నేను ఆలోచించడంలేదు విదేశీ పలుకుబడిని పూర్తిగా తొలగించుకోవడమే స్వాతంత్ర్యం అవసరమైతే బ్రిటనుతో తెగతెంపులు చేసుకొని, భారత రిపబ్లిక్‌ను స్థాపించడం అవసరం" అన్నాడు

బ్రిటిష్ మంత్రివర్గ ప్రతినిధుల పథకాన్ని గురించి, కాంగ్రెస్ ఆమోదాన్ని గురించి విలేకరులు అడిగిన ప్రశ్నలకు జవాబుగా పండిట్ నెహ్రూ "ఏ ఒడంబడికలూ కాంగ్రెస్‌ను బంధించలేవు అయా పరిస్థితులలో పొడచూపే సమస్యలను స్వేచ్ఛగా ఎదుర్కొని పరిష్కరించడానికి కాంగ్రెస్ ప్రయత్నిస్తుంది రాజ్యాంగ పరిషత్తులో చేరేందుకు మేం అంగీకరించాం కాబినెట్ మిషన్ పథకాన్ని, మంచిదనుకున్న రీతిలో మార్చడానికిగాని, సవరించడానికిగాని మాకు హక్కుంది" అని వివరించాడు

"అస్సాం, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రం వ్యతిరేకిస్తున్నాయి కాబట్టి బహుశా రాష్ట్రాల గ్రూపింగ్ జరగకపోవచ్చు" అనికూడా నెహ్రూ ప్రకటించాడు నెహ్రూ చెప్పిన వాటిపైన జిన్నా యిలా వ్యాఖ్యానించాడు

"రాజ్యాంగ పరిషత్తులో కాంగ్రెస్‌కు మెజారిటీ వుంటుంది కాబట్టి కాబినెట్ మిషన్‌వారి పథకాన్ని కాంగ్రెస్ మార్చివేస్తుంది అందువల్ల హిందువుల నియంతృత్వం క్రింద ముస్లిములు బ్రతకవలసి వస్తుంది నెహ్రూ వెల్లడించిన అభిప్రాయాల పర్యవసానమిదే "

కాబినెట్ మిషన్ పథకానికి జూన్ 6న తెలిపిన ఆమోదాన్ని జులై 29న ముస్లింలీగ్ ఉపసంహరించుకుంది బ్రిటిష్ వారిచ్చిన బిరుదులను త్యజించవలసిందిగా ముస్లిములకు విజ్ఞప్తి చేసింది పాకిస్తాన్ కొరకు 1946 ఆగస్టు 16న ప్రత్యక్ష కార్యాచరణ ప్రారంభించవలసిందిగా జిన్నా విజ్ఞప్తి చేశాడు

## తాత్కాలిక ప్రభుత్వం-మతకలహాలు

ఈలోగా తాత్కాలిక ప్రభుత్వాన్ని కేంద్రంలో ఏర్పరచేందుకు వేవెల్ ప్రయత్నించాడు కాని కాంగ్రెస్ తరపున 5గురు హిందువులు, లీగ్ తరపున 5గురు ముస్లిములు, షెడ్యూల్డు కులాల తరపున ఒకరు, సిక్కుల తరపున ఒకరు తాత్కాలిక ప్రభుత్వంలో వుండాలని జిన్నా కోరిన కోర్కెను కాంగ్రెస్ తిరస్కరించడంతో వేవెల్ ప్రయత్నం విఫలమైంది

తరువాత వేవెల్ తన ప్లానును కొద్దిగా మార్చుకున్నాడు అధికారంలోకి కాంగ్రెస్ నాయకులను ఆహ్వానించకపోతే సమ్మెలను బలపరుస్తారేమోనని భయపడ్డారు

"కాంగ్రెస్ నాయకులు ప్రభుత్వ బాధ్యతను స్వీకరిస్తే, అరాజక శక్తులను అణచి వేయవలసిన అవసరాన్ని గుర్తిస్తారు కమ్యూనిస్టు పార్టీని విచ్ఛిన్నం జేస్తారు బహుశా కాంగ్రెస్‌లోని అతివాదుల చర్యలనుకూడా వారు అరికట్టవచ్చు అంతేగాక, పాలనా సంబంధమైన వ్యవహారాలలో నిమగ్నమైనప్పుడు రాజకీయాలను గురించి ఆలోచించే సమయం వారికంతగా లభించదు" అని జులై 31న భారత రాజ్యాంగ కార్యదర్శికొక లేఖ వ్రాశాడు

"బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పడకపోతే, కార్మికవర్గ చర్యలను తట్టుకోవడం అసాధ్యం రోజు రోజుకు సమ్మెలు పెరిగిపోతున్నాయి" అని ఆగస్టు 9న గూఢచారి శాఖ డైరెక్టర్ రిపోర్టు పంపాడు

ఆగస్టు 5న వేవెల్‌కొక వార్త అందింది విస్తరిస్తున్న అరాజకాన్ని అరికట్టేందుకు తాత్కాలిక ప్రభుత్వంలో కాంగ్రెస్ చేరాలని సర్దార్ పటేల్ కోరుతున్నాడని, తన అభిప్రాయాన్ని బలపరచకపోతే కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి రాజీనామా ఇవ్వడానికికూడా సిద్ధపడుతున్నాడని వేవెల్‌కు తెలిసింది కాగా వేవెల్ కొంత స్థిమితపడ్డాడు (వైస్రాయి జర్నల్)

ఆగస్టు 16న కలకత్తాలో మత మౌఢ్యం చెలరేగింది మూడు రోజులపాటు మారణహోమం జరిగింది మత కలహాలను ఆపేందుకు బెంగాల్ రాష్ట్ర ప్రధానమంత్రి, సుహ్రావర్ది ప్రయత్నించలేదు సరికదా, ఆగస్టు 16ను ప్రత్యక్ష కార్యాచరణ సెలవు దినంగా ప్రకటించాడు ఆరోజున కలకత్తా మైదానంలో గుమిగూడిన ముస్లిముల నుద్దేశించి ప్రసంగిస్తూ పోలీసుల ప్రమేయం, సైనికుల ప్రమేయం లేకుండా చేస్తానని హామీ యిచ్చాడు కాగా వెంటనే హిందువుల మీద ముస్లిముల దాడి ప్రారంభమైంది తరువాత హిందువులు, సిక్కులు కలసి ఎదురుదాడి జేశారు కలకత్తా నగరం ఇరుపక్షాల రౌడీలకు, గూండాలకు, దొంగలకు మధ్య రణరంగంగా మారింది ఆగస్టు 19 నాటికి కనీసం 4 వేల మంది మరణించారు పదివేలమంది గాయపడ్డారు

"ఆస్తులు దోచుకునేందుకుగాని, పవిత్ర స్థలాలను పాడుజేసేందుకుగాని, స్త్రీల శీలాన్ని చెరిచేందుకుగాని ఎవరూ పూనుకోలేదు . కంటబడిన హిందువులను, సిక్కులను ముస్లిములు చంపడం, హిందువులు, సిక్కులు ముస్లిములను చంపడమే ధ్యేయంగా విజృంభించారు మొత్తంమీద హిందువులకంటే ముస్లిములే ఎక్కువగా మరణించి వుంటారనే విషయాన్ని వైస్రాయికూడా తెలుసుకున్నాడు " (మాన్‌సెర్గ్, వాల్యూమ్ 8)

"సుహ్రావర్ది తన మద్దతుదారులతోపాటు ఎక్కువకాలాన్ని లాల్‌బజార్‌లోని పోలీసు కంట్రోల్ రూమ్‌లోనే గడిపాడు స్వమతస్థుల బాధలను వింటూ ఆగ్రహావేశంలో మునిగిపోయాడు" అని ఆగస్టు 22న బెంగాల్ గవర్నర్ బర్రోస్ వైస్రాయికి పంపిన రిపోర్టులో వ్రాశాడు

ఇంత జరుగుతున్నా గవర్నర్ సైన్యాన్ని ఉపయోగించలేదు 24 గంటల తరువాత మాత్రమే సైన్యం రంగంలో దిగింది జులైలో పోస్టల్ వర్కర్ల సమ్మెను బలపరచిన హిందువులు, ముస్లిములు ఆగస్టులో గొంతులు కోసుకున్నారు ఆగస్టు 16న కలకత్తాలో ప్రారంభమైన మతకలహాలు సెప్టెంబరు 1న బాంబేకు వ్యాపించాయి అక్కడ గుంపులు గుమిగూడి దాడి చేయలేదు కాని దొరికినవారిని చల్లగా మట్టుపెట్టడం, రోడ్ల మలుపుల్లో క్రీనీడలో కాపువేసి, దారినపోయేవారిని చంపడంలాంటి ఘాతుకాలు జరిగాయి "కాగా 162 మంది హిందువులు, 158 మంది ముస్లిములు సెప్టెంబరులో హత్య జేయబడ్డారు" (మాన్‌సెర్గ్ వాల్యూమ్ 8)

ఆనాడు బాంబేలో కాంగ్రెస్ మంత్రివర్గ ముండడం, నిర్దాక్షిణ్యంగా మతకలహాలను అణచివేసేందుకు ప్రభుత్వం పూనుకోవడంవల్ల అవి అంతటితో ఆగిపోయాయి

తాత్కాలిక ప్రభుత్వ ఏర్పాట్లపై ఆగస్టు 27న గాంధీజీ, నెహ్రూ వేవెల్‌తో సంభాషించారు. ఆ సమయంలో వేవెలొక కుయుక్తి పన్నాడు ముస్లింలీగ్ కోరిన విధంగా రాష్ట్రాల కంపల్‌సరీ గ్రూపింగుకు అంగీకరించవలసిందని, లేకపోతే రాజ్యాంగ సభను

ఏర్పాటు చేయడం కష్టతరమవుతుందని మెల్లగా తెలియజేశాడు వేవెల్ మాట్లాడిన తీరును చూచి గాంధీజీ "మేము సోల్జర్సుం కాకపోవచ్చు మాలో కొందరికి 'లా' తెలిసి వుండకపోవచ్చు అయినా మేమందరం అరమరికల నెరుగని వారం" అని ఎత్తిపొడిచాడు

"ఒకదారికొస్తున్న సంభాషణలను భగ్నం చేయకండి" అని భారత రాజ్యాంగ కార్యదర్శి వైస్రాయికొక టెలిగ్రాం పంపాడు (వైస్రాయ్ జర్నల్)

చివరకు 1946 సెప్టెంబర్ 2న పండిట్ నెహ్రూ ఉపప్రధానిగా కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వమేర్పడింది అప్పుడుకూడా నెహ్రూ ముస్లింలీగ్ కోరిన కంపల్సరీ గ్రూపింగును వ్యతిరేకించాడు అవసరమైతే ఆ విషయాన్ని, కాబినెట్ మిషన్ పథకంలో సూచించిన విధంగా ఫెడరల్ కోర్టుకు నివేదించగలమని హామీ యిచ్చాడు

## రాజకీయ చదరంగంలో మానవ మారణహోమం

కలకత్తా మతకలహాల తరువాత రెండు నెలలకు తూర్పు బెంగాల్‌లోని నౌఖాళి, తిప్పెరా జిల్లాలలో హిందువులమీద ముస్లిములు దాడి చేశారు అక్కడ రైతుల్లో అత్యధికులు ముస్లిములు భూస్వాములు, వ్యాపారులు, లాయర్లు మున్నగు సంపన్నులలో అత్యధికులు హిందువులు, పైగా జమీందారీ వ్యతిరేకత గూడుకట్టుకున్న ప్రాంతమది, కనుక ముస్లిం గూండాలకు, దొంగలకు మంచి అవకాశం దొరికింది

కాగా వారు లీగ్ నాయకుల మద్దతుతో పథకాలు వేశారు సన్నాహాలు పూర్తిజేశారు 1946 అక్టోబరులో హిందూ జమీందార్ల, వ్యాపారుల, విద్యావేత్తల ఇళ్లమీద దాడులు ప్రారంభించారు అల్లరి మూకల సంఖ్య అంతకంతకూ పెరిగింది కోట్లకొలది ఆస్తులను కొల్లగొట్టారు అదే వారి ధ్యేయం అంతేగాని కలకత్తాలో లాగా దొరికిన వారినందరినీ చంపడం కాదు అయినా మూడు వందలమందిని చంపారు అనేకచోట్ల స్త్రీల శీలాన్ని చెరిచారు అయినా సుహ్రావర్డీ ప్రభుత్వం యాభైమందిమీద మాత్రమే కేసులు పెట్టింది ఈ వార్తలు విన్న బీహార్ రైతులు మూకుమ్మడిగా అక్టోబరు 25న ముస్లింల మీద దాడిచేసి 7వేల మందిని చంపారు కాగా నెహ్రూ చలించిపోయాడు మతకలహాలింకా కొనసాగితే విమానాలనుండి బాంబులు కురుపిస్తానని (తాత్కాలిక ప్రభుత్వ ఉపప్రధాని హెూదాలో) బెదిరించాడు ఆ బెదిరింపును గాంధీజీ ఆక్షేపించాడు "మీరు గనుక మళ్లీ మతోన్మాదులైతే మొదట నన్ను చంపండి" అని బీహార్ ప్రజలను హెచ్చరించాడు దాడులు నిలిచిపోయాయి

బీహార్‌లో కొందరు హిందూ జమీందార్లు తమ రైతుల అసంతృప్తిని పక్కదారి పట్టించేందుకు హిందూ రైతులను రెచ్చగొట్టి ముస్లిములమీద దాడి జేయించి వుంటారని నెహ్రూ అనుమానించాడు "రాష్ట్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వంతోపాటు కొందరు కాంగ్రెస్ వారుకూడా మతతత్వానికి లోనయ్యారని నెహ్రూ అభిప్రాయపడ్డాడు అయినా నెహ్రూ ఏమీ చేయలేకపోయాడు మతకలహాలు బీహార్‌నుండి ఉత్తరప్రదేశ్‌కు వ్యాపించాయి తీర్థయాత్రకై ఘటముక్తేశ్వరుకు వచ్చిన హిందువులు వేయిమంది ముస్లిములను ఊచకోత కోశారు " (సుమిత్ సర్కార్, మోడరన్ ఇండియా)

## తాత్కాలిక ప్రభుత్వంలో లీగ్ చేరిక

మతకలహాలు గాంధీజీకి చాలా బాధ గలిగించాయి మతకలహాలను, దేశ విభజనను అరికట్టేందుకు ముస్లిం లీగుతో ఒడంబడిక చేసుకోవలసిందిగా ఆయన కాంగ్రెస్

నాయకులకు సలహా యిచ్చాడు కాంగ్రెస్ అందుకు సిద్ధమైంది ప్రభుత్వంలో చేరవలసిందిగా జిన్నాను వేవెల్ కోరాడు కాంగ్రెస్ తరపున అసఫాలీ మంత్రివర్గంలో వుంటే లీగ్ తరపున షెడ్యూల్డు కాస్ట్‌కు చెందిన జోగేన్ మండల్‌ను మంత్రివర్గంలో చేర్చవచ్చునని సలహా చెప్పాడు అందుకు జిన్నా అంగీకరించాడు

అయితే క్యాబినెట్ మిషన్ పథకాన్ని వ్యతిరేకిస్తూ ముస్లింలీగ్ చేసిన తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని నెహ్రూ కోరాడు అలా చేసేందుకు జిన్నా అంగీకరించాడని వేవెల్ హామీ యిచ్చాడు నెహ్రూ సరేనన్నాడు కాగా 1946 అక్టోబరు 26న లీగ్ ప్రతినిధులు తాత్కాలిక కేంద్ర ప్రభుత్వంలో చేరారు

కాని ముస్లిం లీగ్ తీర్మానం ఉపసంహరింపబడలేదు ప్రత్యక్ష కార్యాచరణ పిలుపును జిన్నా విడవనూ లేదు పైగా మంత్రివర్గంలోని లీగ్ సభ్యులు అడుగడుగునా నెహ్రూకు అడ్డంకులు కల్పించారు అలా ముస్లింలీగ్ వేసిన రాజకీయ చదరంగపుటెత్తులు హిందూ-ముస్లిముల మధ్య ద్వేషానలం భగ్గుమనడానికి దోహదం చేశాయి అలాంటి ప్రమాదకర పరిస్థితిలో సహితం, ప్రజలు ఎక్కడ తమ హక్కుల కొరకు పోరాడారో, అక్కడ అన్ని మతాలవారూ కలిసే పోరాడారు

ప్రజా పోరాటాలకు, కాంగ్రెస్ నాయకత్వం వహిస్తుందేమోనన్న భయంతో 1946 జూన్ నెలాఖరున 5 డివిజన్ల బ్రిటిష్ సైన్యాన్ని ఇండియాకు రప్పించడానికి ప్రయత్నాలు జరిగాయి (మాన్‌సెర్గ్ వాల్యూమ్ 8) ఆ సమయంలో 8 రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలున్నాయి రెండు రాష్ట్రాలలో ముస్లిం లీగు, ఒక రాష్ట్రంలో యూనియనిస్టు పార్టీ అధికారంలో వున్నాయి అయినా రాష్ట్ర ప్రభుత్వాలకు తెలియకుండా కేంద్ర ప్రభుత్వం "ఆపరేషన్ అస్సైలమ్" పథకాన్ని తయారుచేసింది ప్రజాపోరాటాలను అణచివేయడానికి ఉద్దేశించిన పథకమది ఆ పథకానికి సంబంధించిన పత్రం, బాంబే గవర్నర్ కార్యదర్శిద్వారా కమ్యూనిస్టు పార్టీకి అందగానే, వారు దాన్ని తమ పత్రికల్లో ప్రకటించి, జాతీయ నాయకులను హెచ్చరించారు కాని ఆ సమయంలో పోరాటాలను వ్యతిరేకిస్తూ, తాత్కాలిక ప్రభుత్వంలో చేరేందుకు జాతీయ నాయకులు సిద్ధపడినందున సామ్రాజ్యవాదుల గుండెలు కుదుటబడ్డాయి మత కలహాలు పెరిగినా వారికి చీమకుట్టలేదు ఎంతవరకూ సమ్మెలను, పోరాటాలను అణచివేస్తూ అందుకు కాంగ్రెస్‌వారి మద్దతును పొందేందుకు ప్రయత్నించారు

"సమ్మెలకు, పోరాటాలకు, ఎక్కువగా కమ్యూనిస్టుల ఆందోళనే కారణం" అన్నాడు కేంద్ర కార్మిక శాఖా మంత్రి జగజీవనరామ్ (వైస్రాయ్ జర్నల్, 14 జనవరి 1947) మద్రాసు రాష్ట్రంలో జనవరి 22న కమ్యూనిస్టులను మూకుమ్మడిగా అరెస్టుచేసి, డిటెన్షన్ ఆర్డినెన్స్‌ను ప్రకాశం మంత్రివర్గం ప్రకటించింది కాగా కాంగ్రెస్ నాయకుల మీద వేవెల్‌కు నమ్మకం కుదిరింది

## కౌలుదార్ల పోరాటం

1946 సెప్టెంబరులో బెంగాల్ రాష్ట్ర కిసాన్ సభ కౌలుదార్ల ఉద్యమం ప్రారంభించింది ఫ్లాడ్ కమిషన్ సూచించినట్లుగా పండిన పంటలో మూడింట రెండు వంతులు (తెభాగా) కౌలుదార్లకు దక్కాలని డిమాండ్ చేసింది కాగా నవంబరు నాటికి ఉద్యమం బాగా బలపడింది. అనేకమంది కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు, విద్యార్థులు

కౌలుదార్ల పక్షాన నిలబడి పోరాడారు దినాజ్‌పూర్, జల్పాయ్‌గురి, రంగపూర్, మాల్డా, మైమన్‌సింగ్, మిద్నపూర్, 24 పరగణాలలో ఉద్యమం విస్తరించింది "రాజవంశీలు" మున్నగు గిరిజనులు, హిందూ-ముస్లిం కౌలుదార్లు ఏకంగా నిలబడి, పోలీసు దాడులను తిప్పికొట్టారు హాజీ మహమ్మద్ దనేష్, నియామత్ ఆలీ మొదలైనవారితోపాటు కొందరు మౌల్వీలుకూడా ఉద్యమంలో పాల్గొన్నారు "శతాబ్దాలుగా మూగబోయిన కౌలుదార్లు ఒక చేతిలో లాఠీని, మరొక చేతిలో ఎర్రజెండాను పట్టుకుని, పంట పొలాలలో కదం తొక్కుతున్నారు" అని స్టేట్సుమన్ పత్రిక, 1947 మార్చి 19న వ్రాసింది పోలీసు దాడుల నెదిరిస్తూ 50 మంది ఆత్మార్పణ చేశారు పోలీసు బలగాల నెదిరించేందుకు ప్రజలు ఆయుధాలు కావాలన్నారు కాని కమ్యూనిస్టు పార్టీ వాటిని సమకూర్చలేకపోయింది ఆ స్థితిలో బెంగాల్ రాష్ట్ర విభజన సమస్య ముందుకొచ్చింది కాగా తెభాగా ఉద్యమం తెరమరుగైంది

శ్యామ్‌రావ్, గోదావరి పెరులేకర్ మొదలగు బొంబే కమ్యూనిస్టులు థానా జిల్లాలోని 'వార్లీ' గిరిజన తెగవారి మధ్య నివసిస్తూ, వెట్టిచాకిరీని రూపుమాపారు ఫారెస్టు కంట్రాక్టర్ల దోపిడీని అరికట్టారు అటుపైన గిరిజనుల రుణ విముక్తికొరకు ఉద్యమం ప్రారంభించారు ఉత్తరప్రదేశ్‌లో రైతు ఉద్యమం, అనేక రాష్ట్రాలలో వ్యవసాయ కూలీల ఉద్యమాలు తీవ్రమయ్యాయి

## ఆంధ్రలో పోరాటాలు

బ్లాక్ మార్కెట్ నిరోధం, బంజరుభూముల సాగు, కూలీరేట్ల పెంపు, జమీందారీల రద్దు, విద్యార్థుల సమస్యలు మున్నగువాటి విషయంలో కమ్యూనిస్టు పార్టీ సాగించిన ఉద్యమాలు 1947 ప్రారంభం నాటికి బాగా బలపడ్డాయి 1946లో పరిమిత ఓటింగు పద్ధతిపై జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా కమ్యూనిస్టు పార్టీ రూపొందిందనే అభిప్రాయం కాంగ్రెస్ నాయకులకు సహితం కలిగింది కాగా భూస్వామ్య వర్గాల, వ్యాపార వర్గాల మద్దతు కొరకు రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వం ప్రయత్నించింది

దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనే కోర్కెతో అనేకమంది జమీందార్లు కుత్సిత చర్యలకు పాల్పడ్డారు సాముదాయక భూములను అమ్ముకోవడం, దొంగలెక్కలు సృష్టించి, బకాయిలు చూపించి రైతుల పొలాలను వేలం వేయించడంలాంటి చర్యలకు పూనుకున్నారు కనుక రైతు సంఘ నాయకత్వాన రైతులు ఎదురుతిరిగారు మందసా నుండి వెంకటగిరి వరకూగల అన్ని ఎస్టేట్లలోనూ పోరాటాలు జరిగాయి ప్రకాశం ప్రభుత్వం రైతుల కౌలుదార్ల రక్షణ చట్టం, అడవుల అన్యాక్రాంత నిషేధ చట్టం చేసింది కాని అవి రెండూ నిష్ప్రయోజనమేనని రుజువయ్యాయి

అధికార యంత్రాంగం జమీందార్లకు అనుకూలంగా పనిచేయడంవల్ల తమ స్వంత కమతాలనుండి రైతులను కౌలుదార్లను, జమీందార్లను వెళ్లగొట్టేందుకు పూనుకున్నారు అందువల్ల పోరాటాలు ఉధృతమయ్యాయి అనేక ఎస్టేట్లలో రైతులు శిస్తులు చెల్లించలేదు 144 సెక్షన్ ధిక్కరించి రైతులు పోరాడారు కాగా వేలాది రైతులమీద 107 సెక్షన్ క్రింద సెక్యూరిటీ కేసులు బనాయించబడ్డాయి చల్లపల్లి జమీలో నలుగురిని, బుచ్చంపేట జమీలో ఐదుగురిని పోలీసుల తుపాకులు బలిగొన్నాయి కనుక ఎస్టేట్లను రద్దుచేయాలనే ఉద్యమం ప్రబలమైంది అదే సమయంలో తమిళనాడులో మిరాశీదార్లకు వ్యతిరేకంగా కౌలుదార్ల

పోరాటాలు, మలబార్‌లో రైతుల పోరాటలు ఉవ్వెత్తున లేచాయి భూస్వామ్య పద్ధతిని రద్దు చేయాలనే కోర్కె బలపడింది

ఆంధ్ర కమ్యూనిస్టు నాయకుల అండదండలతో తెలంగాణా కమ్యూనిస్టులు జాగీర్దార్ల ఘాతుక చర్యలకు, నిజాం ఫ్యూడల్ పాలనకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించారు కమ్యూనిస్టుల నాయకత్వంలో తిరువాన్కూర్ ప్రజలు తమ హక్కుల కొరకు తిరుగుబాటు చేశారు

కనుక మద్రాసు రాష్ట్రంలోని కమ్యూనిస్టులను జైళ్లలో బంధించేందుకు ప్రకాశం మంత్రివర్గం నిర్ణయించింది 1947 జనవరి 22న మద్రాసు రాష్ట్రమంతటా దొరికిన కమ్యూనిస్టులనందరినీ అరెస్టుచేసి, ప్రివెంటివ్ డిటెన్షన్ ఆర్డినెన్స్‌ను ప్రకటించింది ముందు అరెస్టులు, తరువాత ఆర్డినెన్స్ ప్రకటన జరిగాయి కనుక వందలాది కమ్యూనిస్టులు జైళ్లలో నిర్బంధింపబడ్డారు తక్కినవారు రహస్యంగా వుంటూ ఉద్యమాలు నడిపారు

## కార్మిక సమ్మెలు

1947 జనవరి 21న కలకత్తాలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ప్రారంభమైన "ట్రామ్‌వే" వర్కర్ల సమ్మె 85 రోజులపాటు జయప్రదంగా జరిగింది హిందువులు, ముస్లిములు ఏకమై సమ్మెను బలపర్చారు కనుక సమ్మె జయప్రదమైంది ఆ సమ్మె ప్రారంభమైన వెంటనే పోర్టు ఎంప్లాయీస్ సమ్మె, హౌరా ఇంజనీరింగ్ వర్కు్సలో సమ్మె ప్రారంభమయ్యాయి కాన్పూర్‌లో లక్షమంది జౌళి మిల్లుల కార్మికులు సమ్మె చేశారు బొగ్గు గనుల కార్మికులు సమ్మె నోటీసులిచ్చారు కరాచీ, గోల్డెన్‌రాక్, కోయంబత్తూరులాంటి పలు తావులలో సమ్మెలు జరిగాయి పోలీసు కాల్పులవల్ల కార్మికుల రక్తం చిందింది కమ్యూనిస్టుల నాయకత్వాన గిరిజన పోరాటాలుకూడా ప్రారంభమయ్యాయి అన్నిటికంటే ఎన్నదగిన నిరసన ప్రదర్శన కలకత్తాలో జరిగింది

హిందువులు, ముస్లిములు కలసి 1946 జులైలో కలకత్తాలో జరిగిన సమ్మెలను బలపర్చారు ఆగస్టులో గొంతులు కోసుకున్నారు అయినా 1947 జనవరి 21న ఏకమై, "వియత్నాం జోలికి పోకండి" అని నినాదాలిస్తూ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా గొప్ప ప్రదర్శన జరిపారు వియత్నాంను ఆక్రమించేందుకు వెళ్ళే ఫ్రెంచి విమానాలను డమ్ డమ్ విమానాశ్రయంలో దిగనివ్వకుండా చేశారు ఆ సందర్భంలో పోలీసు కాల్పులకుకూడా గురయ్యారు.

## లీగ్ మంత్రుల సహాయ నిరాకరణ

వివిధ మతాలకు చెందిన ప్రజలు తమ హక్కులకొరకు కలిసి పోరాడుతోంటే, వివిధ పార్టీల నాయకులు రాజకీయ చదరంగంలో ఎత్తుకు పైఎత్తు వేయడంలో నిమగ్నమయ్యారు నెహ్రూ నాయకత్వాన కేంద్రంలో ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వం ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడింది

1946 డిసెంబరు 9న రాజ్యాంగ పరిషత్ సమావేశం జరిగింది. ముస్లింలీగ్ సభ్యులు హాజరు కాలేదు అయినా పరిషత్ అధ్యక్షునిగా రాజేంద్రప్రసాద్‌ను ఎన్నుకున్నారు ప్రాథమిక హక్కులను గురించీ, మైనారిటీల రక్షణను గురించీ నివేదిక తయారుజేసేందుకొక సంఘాన్ని నియమించారు తిరిగి 1947 జనవరి 20న రాజ్యాంగ పరిషత్

సమావేశమైనప్పుడు కూడా లీగ్ సభ్యులు హాజరుకాలేదు

అటుపైన ఆర్థిక మంత్రి లియాకత్ అలీఖాన్ పెద్ద వ్యాపారుల మీద విపరీతంగా పన్నులు వేస్తూ తయారుచేసిన బడ్జెట్‌ను 1947 ఫిబ్రవరిలో ప్రవేశపెట్టాడు అందుకు సంతోషిస్తూ వైస్రాయి వేవెల్ "ఇదొక తెలివైన పని పెద్ద వ్యాపారులపైన పెంచిన పన్నును కాంగ్రెస్ మంత్రులు వ్యతిరేకించలేరు కనుక కాంగ్రెస్‌కు, దానిని బలపరిచే పెట్టుబడిదారులకు మధ్య చీలిక కలగవచ్చు" నన్నాడు

ఆ సమయంలో మత కలహాలనరికట్టి, దేశ సమగ్రతను కాపాడేందుకు నౌఖాలి, కలకత్తా, బీహార్, ఢిల్లీలలో పాదయాత్ర చేస్తున్న గాంధీజీ ఒక సూచన చేశాడు "ప్రధాన మంత్రి పదవిని జిన్నాకు కట్టబెట్టి, మెజారిటీ ప్రజల, హక్కుల రక్షణ కొరకు బ్రిటిష్ వైస్రాయి మరికొంత కాలంపాటు ఇండియాలో వుంటే దేశ విభజన తప్పిపోతుంది" అని వైస్రాయికి తెలియజేశాడు (సుమిత్ సర్కార్ మోదరన్ ఇండియా)

కాని, అదొక విపరీతమైన సాహస ప్రయత్నమని నెహ్రూ, పటేల్ త్రోసిపుచ్చి, అమీతుమీ తేల్చుకునేందుకు సిద్ధమయ్యారు

రాజ్యాంగ పరిషత్ సమావేశాలను ముస్లింలీగు బహిష్కరించినందున, తాత్కాలిక ప్రభుత్వంనుండి లీగ్ ప్రతినిధులు తప్పుకోవాలని నెహ్రూ కోరాడు పరిస్థితిని గురించి చర్చించేందుకు నెహ్రూ, జిన్నా, వేవెల్, బలదేవ్‌సింగ్‌లను లండన్‌కు రావలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వం ఆహ్వానించింది అందరూ వెళ్లారు అక్కడ జరిగిన చర్చలలో బ్రిటిష్ మంత్రులు జిన్నావైపు మొగ్గారు దేశాన్ని గ్రూపులుగా విభజించి, ఆ గ్రూపులలో రాష్ట్రాలను చేర్చడాన్ని బ్రిటిష్ ప్రభుత్వం సమర్థించింది లీగు ప్రతినిధులు గైరుహాజరైన కాలంలో చేయబడిన రాజ్యాంగ పరిషత్ తీర్మానాలను అంగీకరించవలసిందిగా ముస్లిం లీగును వత్తిడి చేయలేమనికూడా బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టపరిచింది

రాజ్యాంగ పరిషత్ సమావేశాలను బహిష్కరించే లీగు ప్రతినిధులను తాత్కాలిక మంత్రివర్గంనుండి తొలగించాలని కాంగ్రెస్‌వారితోపాటు యితరులుకూడా వైస్రాయిని కోరారు వైస్రాయి అందుకు అంగీకరించలేదు కనుక నెహ్రూతోపాటు యితర మంత్రివర్గ సభ్యులుకూడా రాజీనామాలిచ్చారు బ్రిటిష్ ప్రభుత్వానికదొక చిక్కు సమస్యగా తయారైంది తాత్కాలిక మంత్రివర్గంనుండి లీగ్ సభ్యులను తొలగించినా, లేక కాంగ్రెస్ వారి రాజీనామాలను ఆమోదించినా తీవ్ర పరిణామాలు కలుగక తప్పవు కాబట్టి 1947 ఫిబ్రవరి 20న బ్రిటిష్ ప్రధాని అట్లీ, కామన్స్ సభలో చారిత్రాత్మక ప్రకటన జేశాడు 1948 జూన్ 30లోగా బ్రిటన్ భారతదేశాన్ని విడిచిపెట్టిపోతుందని ఖచ్చితంగా చెప్పివేశాడు

## అట్లీ ప్రకటన

"1948 జూన్ 30లోగా అన్ని పార్టీలూ కలిసి నూతన రాజ్యాంగాన్ని రూపొందించి, నూతన ప్రభుత్వాన్ని ఏర్పరిస్తే, అధికారాన్ని ఆ ప్రభుత్వానికి అప్పగిస్తాం లేకపోతే అపుడు అధికారంలోవున్న రాష్ట్ర ప్రభుత్వాలకు అధికారాన్ని దఖలు పరుస్తాం ఒకవేళ అదీ సాధ్యం కాకపోతే భారతీయులకు లాభం చేకూర్చగల రీతిలో ఏదో ఒక సంస్థకు అధికారాన్ని అప్పగిస్తాం" అని అట్లీ ప్రకటించాడు. ఆ ప్రకటనను వ్యతిరేకిస్తూ చర్చిల్ "స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు కాని, ఈ సమయంలో అధికారాన్ని కాంగ్రెస్‌కు అప్పగించడమంటే, ఆకలితోవున్న లక్షలాది ప్రజలను రాస్కెల్స్‌కు, రోగ్స్‌కు అప్పగించడమే అవుతుంది ఒక్క

గ్లాసెడు నీళ్ళు, ఒక్క రొట్టె ముక్క సహితం పన్నులనుండి తప్పించుకోలేవు గాలి మాత్రమే స్వేచ్ఛగా లభిస్తుంది ఆకలితో మాడే లక్షలాది ప్రజల రక్తం అట్లీ తలపైన కారుతోంది అల్పమైన రాజకీయాలలో పడి ఇండియా కొట్టుకుపోతుంది" అని తిట్టిపోశాడు వెంటనే చర్చిల్ మాటలను అట్లీ ఖండించాడు అటుపిమ్మట అసలు విషయాన్ని క్రిప్పు యిలా బైటపెట్టాడు

"భారతీయుల కోర్కెకు వ్యతిరేకంగా ఇరవైఏళ్ళపాటు మనం ఇండియాలో వుండగలగాలి లేదా నానాటికి క్లిష్టమవుతున్న పాలనా బాధ్యతలను వదులుకోవాలి ఇండియాలో వుండేందుకు తగినంత బలగం మనకు లేదు కాబట్టి మొదటి మార్గాన్ని బ్రిటన్ ఎన్నుకోజాలదు అందుకు బ్రిటిష్ ప్రజలు సహితం అంగీకరించరు వివిధ వర్గాల భారతీయులంతా మనకు వ్యతిరేకమవుతారు ప్రపంచ ప్రజాభిప్రాయంకూడా మనకు వ్యతిరేకమవుతుంది కనుక రెండో మార్గమే మనకు శరణ్యం" అని స్టాఫర్డ్ క్రిప్పు బ్రిటిష్ పార్లమెంటులో వివరించాడు

ఇండియానుండి అప్పటికే బ్రిటిష్ ప్రభుత్వానికి కొన్ని నివేదికలందాయి "కాంగ్రెస్ నాయకుల మీద ప్రజలకు అభిమానం తగ్గుతోంది కాంగ్రెస్‌లో తీవ్రమైన ఆంతరంగిక కలతలు, వామపక్షమంటే భయం ఏర్పడినాయి కార్మికులవల్ల కలుగగల ప్రతిబంధకాల ప్రమాదం స్పష్టంగా కనిపిస్తోంది" అని కేంద్ర ప్రభుత్వంలోని సీనియర్ ఐ సి ఎస్ అధికారి వి పి మీనన్ 1947 జనవరిలో రిపోర్టు వ్రాశాడు "పటేల్‌తో నేను జరిపిన సంభాషణవల్ల కమ్యూనిస్టు పార్టీని నిషేధించడానికి ఆయన సుముఖంగా వున్నట్లు గ్రహించగలిగాను" అని వేవెల్ రిపోర్టు వ్రాశాడు (వైస్రాయి జర్నల్, జనవరి 1) "మందుగుండు సామాగ్రిని తీసుకువెళ్లే ఓడ సముద్రంలో అగ్నిప్రమాదానికి లోనవుతున్నట్లుగా వుంది ఇండియా పరిస్థితి మంటలు మందుగుండుకు అంటుకోకముందే ఆర్పివేయాలి" అని లార్డ్ ఇస్మే హెచ్చరించాడు

"ఇండియాలో యింకా మనం వుండాలంటే కనీసం 5 లక్షల బ్రిటిష్ సోల్జర్లు కావాలి" అని లండన్ డెయిలీ మెయిల్ పత్రిక వ్రాసింది ప్రపంచ ప్రజాభిప్రాయం బ్రిటన్‌కు వ్యతిరేకంగా వెల్లడైందని సోవియట్ విదేశాంగ మంత్రి మాలటోవ్, ఐక్య రాజ్యసమితిలో భారతదేశ స్వాతంత్ర్యాన్ని గురించి రెండుసార్లు ప్రశ్నించాడు కాగా ఇండియానుండి వైదొలగేందుకు బ్రిటిష్ ప్రభుత్వం సిద్ధమైంది

అయినా అట్లీ ప్రకటనలో చిత్తశుద్ధి కొరవడింది కనుకనే "బ్రిటిష్ ఇండియాలో అధికారాన్ని భారతీయులకు బదిలీ చేయగానే, స్వతంత్ర సంస్థానాల విషయంలో చక్రవర్తికిగల అధికారాల్ను, బాధ్యతలుకూడా రద్దు అవుతాయి అయినా యీ అధికారాలను, బాధ్యతలను బ్రిటిష్ ఇండియాలో ఏర్పడే ఏ ప్రభుత్వానికీ దఖలుపరచం" అని అట్లీ ప్రకటించాడు అంటే పాకిస్తాన్ విభజనతోపాటు మరికొన్ని చీలికలకుకూడా అవకాశం కల్పించాడన్నమాట

## మతకలహాలు

ఇండియాను సాధ్యమైనన్ని భాగాలుగా విభజించి ప్రయోజనం పొందాలనే కుటిలయత్నం అట్లీ ప్రకటనలో కనిపిస్తున్నప్పటికీ, అతిత్వరలో లభించనున్న దేశ స్వాతంత్ర్యం కాంగ్రెస్ నాయకుల నాకర్షించింది ఆ సమయంలో వేరొక దారి వారికి

కన్పించలేదు బ్రిటిష్ వారి ఆట కట్టించాలంటే పెద్ద ఉద్యమాన్ని ప్రారంభించాలి. ఆ పనిచేస్తే మతకలహాలు, వర్గ పోరాటాలు అదుపు తప్పిపోతాయి, సాంఘిక వ్యవస్థ తలక్రిందులవుతుందని కాంగ్రెస్ నాయకులు భయపడ్డారు కాగా పోరాట పంధాను విడిచిపెట్టి, రాజీమార్గాన్ని చేపట్టారు

ఈలోగా పంజాబ్‌లో ముస్లిములు, సిక్కులు సర్వ సన్నద్ధమయ్యారు ముస్లింలీగ్ శాసనోల్లంఘన ఉద్యమాన్ని చేపట్టి, ఖిజర్ హయత్‌ఖాన్ మంత్రివర్గాన్ని 1947 మార్చి 3న కూలదోసింది ఆ మరునాడు లాహెూర్ శాసనసభ ఎదుట, తారాసింగ్ నాయకత్వాన సిక్కుల ప్రదర్శన జరిగింది తారాసింగ్ తన ఖడ్గాన్ని ఝుళిపిస్తూ "ఖాల్సా పరిపాలిస్తుంది" అని ప్రకటించాడు వెంటనే లాహెూర్, అమృతసర్, ముల్తాన్, అటోక్, రావల్పిండి పట్టణాలలోను, వాటి చుట్టుప్రక్కలగల పల్లె ప్రాంతాలలోను మతకలహాలు చెలరేగాయి 1947 ఆగస్టు 15 నాటికి 5 వేల మంది హత్య చేయబడ్డారు ఎక్కువమంది హిందూ-సిక్కు వర్తకులు, వడ్డీ వ్యాపారులు హత్యాకాండకు గురయ్యారు అందుకు ప్రతీకారంగా అమృతసర్‌లోని ముస్లిములను సిక్కులు చంపివేశారు

బెంగాల్ రాష్ట్రాన్ని విభజించాలని హిందూ మహాసభ, పంజాబ్‌ను విభజించాలని అకాలీదళ్ డిమాండ్ చేశాయి విభజించకపోతే బెంగాల్ ముస్లిముల పాలనలో హిందువులు, పంజాబ్ ముస్లిముల పాలనలో సిక్కులు అణగారిపోతారనే ఆందోళన చెలరేగింది దేశ విభజన జరిగినా, లేక ముస్లిం మెజారిటీ రాష్ట్రాలను గ్రూపులుగా ఏర్పరిచినా తమకు ప్రమాదం తప్పదని హిందూ - సిక్కు మతపెద్దలు ప్రచారం చేశారు కాగా కలకత్తాలో మళ్లీ మతకలహాలు చెలరేగాయి మార్చి 26 నుండి ఏప్రియల్ 1 వరకూ మారణకాండ కొనసాగింది అటు తరువాతకూడా ముస్లిములు ఎక్కువగా నివసించే ప్రాంతాలలో హిందువులు కన్పించినా, హిందువులు ఎక్కువగా నివసించే ప్రాంతాలలో ముస్లిములు కనిపించినా ప్రాణాలు కోల్పోయారు

నౌఖాలినుండి లాహెూర్‌వరకూ జరిగిన మత కలహాలవల్ల పలువురు కాంగ్రెస్ కార్యకర్తలు, నాయకులుకూడా లౌకిక భావాలకు స్వస్తి చెప్పారు కమ్యూనిస్టులు బలంగా వున్న చోట మతకలహాల నాపేందుకు వారు కృషి జేశారు ఆ కృషిలో కొందరు ఆత్మార్పణం కూడా జేశారు అయినా వారి బలం పరిమితం గాబట్టి అంతకంటే మరేమీ చేయలేక పోయారు మతకలహాలను దేశవిభజన కొరకు ముస్లిం లీగు నాయకులు వుపయోగించుకున్నారు "నరుక్కు ఛస్తే చావనీ" అని ప్రభుత్వం ఉపేక్షించింది ఒక్క గాంధీజీ మాత్రమే మతకలహాలనాపేందుకు మానవాతీతమైన కృషి చేశాడు ఆ కృషిలోనే ఆత్మార్పణం చేశాడు

## మహోన్నత మానవత్వం

నేడో రేపో స్వాతంత్ర్యం సిద్ధిస్తుందనే నమ్మకం కలిగిననాటినుండి గాంధీజీ అభిప్రాయాలకూ, నెహ్రూ, పటేల్ అభిప్రాయాలకూ పొంతన లేకుండా పోయింది. అవసరమైతే జిన్నాకు పట్టంగట్టి, దేశవిభజన జరగకుండా చూడాలని, "మత ప్రాతిపదికపై జాతిని నిర్ణయించే సిద్ధాంతం తప్పు"అని రుజువు చేయాలని గాంధీజీ చేసిన ప్రయత్నం పటేల్, నెహ్రూ మున్నగువారికి నచ్చలేదు. కాగా గాంధీజీ ఎక్కువగా మతసామరస్యం పైననే కేంద్రీకరించాడు మత కలహాలను ఆపగలిగితే, దేశవిభజనను అరికట్టవచ్చునని

విశ్వసించాడు  ఆయన నమ్మిన అహింస, హృదయ పరివర్తన సిద్ధాంతాలను ప్రత్యక్షంగా అమలు జరిపి చూపించేందుకు ముందు కలకత్తా వెళ్ళాడు  అక్కడ నుండి నౌఖలి, బీహార్, ఢిల్లీలలో పాదయాత్ర సాగించాడు  ఆయన ఎక్కడకు వెళితే అక్కడ మతకలహాలు ఆగిపోయాయి  మహోన్నత మానవత్వం ముందు మతోద్రేకం తలవంచింది

1947 మార్చి24న మౌంట్‌బాటెన్ వైస్రాయి పదవిని స్వీకరించగానే గాంధీజీని కలుసుకోవాలని కోరాడు  మార్చి 31న గాంధీజీ ఢిల్లీ వచ్చాడు  దేశ విభజన జరుగుతుందేమోనని భయపడుతున్న అబుల్ కలాం అజాద్‌ను చూచి గాంధీజీ "కాంగ్రెస్ కనుక దేశ విభజనను అంగీకరిస్తే, ఆ విభజన నా మృతదేహం మీదుగా జరుగుతుంది" అని హామీ యిచ్చాడు  మూడు రోజులపాటు గాంధీజీ-మౌంట్‌బాటెనుల మధ్య ప్రత్యేక సమావేశాలు  జరిగాయి

అప్పటికే సర్దార్ పటేల్ దేశవిభజనను అంగీకరించేందుకు సిద్ధమయ్యాడు ఆయనను నెహ్రూ అనుసరించాడు  1947 మార్చి 10న వేవెల్‌తో మాట్లాడుతూ "నెహ్రూ క్యాబినెట్ మిషన్ పథకం అమలు జరిగితే, అదే ఉత్తమమైన పరిష్కారమవుతుంది  లేదా దానికి ప్రత్యామ్నాయం బెంగాల్‌ను, పంజాబ్‌ను విభజించడమే" అన్నాడు (వైస్రాయ్ జర్నల్) అంటే దేశ విభజనను అంగీకరించేందుకు సిద్ధమయ్యాడన్నమాట  మరొక నెలరోజులలో కాంగ్రెస్ అధ్యక్షుడు కృపలానీ "న్యాయసమ్మతంగా పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలను విభజిస్తే, మేము పోరాటానికి దిగకుండా పాకిస్తాన్ ఏర్పాటుకు అంగీకరిస్తాం" అని మౌంట్‌బాటెన్‌కు తెలియజేశాడు  (హెచ్ వి హడ్సన్  ది గ్రేట్ డివైడ్ )

కనుక దేశ విభజనకు కాంగ్రెస్ నాయకులను- ముఖ్యంగా నెహ్రూను ఒప్పించగలిగినవాడు మౌంట్‌బాటెన్ లేదా ఆయన భార్య అనుకోవడం పొరపాటు  ఆయన రాకముందే ఆ విషయం తేలిపోయింది  కాగా, రాష్ట్రాల విభజన సమస్య ప్రధానంగా ముందుకొచ్చింది

దేశాన్ని, రాష్ట్రాలను విభజించడానికి పూనుకుంటే, మతకలహాలు మరీ పెరిగి పోతాయని గాంధీజీ భయపడ్డాడు  విభజించకపోతే మతకలహాలను ఆపలేమని మౌంట్‌బాటెన్ వాదించాడు  "కాంగ్రెస్ గనుక దేశ విభజనకు అంగీకరిస్తే, దేశంలో ఎక్కడా మతకలహాలు వుండబోవని మౌంట్ బాటెన్ చెప్పాడు  మతకలహాలను మొగ్గలోనే తుంచడానికి కఠిన చర్యలు తీసుకుంటానని హామీ యిచ్చాడు" అని అజాద్ వెల్లడించాడు (కాని తరువాత జరిగిన మారణహోమం గాంధీజీ భయాన్ని రుజువు చేసింది )

రామ్-రహీం ఒకడేనని గాంధీజీ నమ్మకం  హిందువులు, ముస్లిములు, అన్నదమ్ములవలె జీవించాలనేదే ఆయన కోరిక  కనుక మతకలహాలను ఆపడానికి విభజన తోడ్పడితే మంచిదే  లేకపోతే ఏం చేయాలి? ముస్లింలీగు దేశ విభజనను కోరుతుంటే, హిందూ మహాసభ, అకాలీదళ్ రాష్ట్రాల విభజనను కోరుతున్నాయి  అందుకు కాంగ్రెస్ అంగీకరిస్తోంది  కనుక తాను అడ్డుపడకూడదనుకున్నాడు  వెనుదిరిగి మళ్లీ కలహాలనాపేందుకు కలకత్తా వెళ్లాడు గాంధీజీ

## మౌంట్‌బాటెన్ ప్లాన్

1947 మార్చి 24, మే 6 మధ్య వివిధ పార్టీల నాయకులతో మౌంట్‌బాటెన్ 133 సమావేశాలు జరిపాడు  కాబినెట్ మిషన్ ప్లాను పనికిరాదని త్రోసివేసి, ఒక కొత్త

ప్లాను తయారుజేశాడు దానికి "ప్లాన్ బాల్కన్" అని పేరుపెట్టారు అందులోని ముఖ్యాంశాలు (1) అధికారాన్ని బదిలీ చేయకముందే రాష్ట్రాలు గ్రూపులుగా ఏర్పడితే, ఆ గ్రూపులకు అధికారాన్ని కట్టబెడతారు లేకపోతే ఆయా రాష్ట్రాలకు కట్టబెడతారు (2) బెంగాల్, పంజాబ్ రాష్ట్రాల విభజన జరగాలా? లేదా? అని నిర్ణయించే హక్కును, రాష్ట్ర అసెంబ్లీలలోని మైనారిటీ సభ్యులకు యిస్తారు (3) స్వతంత్ర సంస్థానాలు, రాష్ట్రాలు లేదా గ్రూపులు తమకు యిష్టమైతే ఇండియాలో చేరవచ్చు, లేదా పాకిస్తాన్‌లో చేరవచ్చు, లేదా స్వతంత్రంగా వుండిపోవచ్చు

ఈ పథకాన్ని మే 10న సిమ్లాలో మౌంట్‌బాటెన్ నెహ్రూకు తెలియజేశాడు నెహ్రూ దాన్ని గట్టిగా వ్యతిరేకించాడు ఆ పథకాన్ని అమలుజరిపితే దేశం ముక్కలు చెక్కలైపోతుందని, యుద్ధాలు బ్రద్దలవుతాయని విమర్శించాడు కనుక దేశాన్ని ముక్కలు జేసేందుకు ఉద్దేశించిన మౌంట్‌బాటెన్ పథకం బుట్టదాఖలైంది

## వి.పి.మీనన్ సూచన

"రాజ్యాంగ సభ నిర్ణయాల కొరకు వేచివుండకుండా, ఇండియాకు విడిపోయే హక్కుతో సహా అధినివేశ ప్రతిపత్తినివ్వడం బాగుంటుంది" అని 1947 జనవరిలో భారత రాజ్యాంగ కార్యదర్శికి వి పి మీనన్ చేసిన సూచన ఆధారంగా సంభాషణలు ప్రారంభ మయ్యాయి "అధినివేశ ప్రతిపత్తివల్ల శాంతియుతంగాను, త్వరితంగాను అధికారం బదిలీ జరుగుతుంది పలుకుబడిగల బ్రిటిష్‌వారి స్నేహం ఇండియాకు లభిస్తుంది అవసరమైనంతవరకూ ఐ సి ఎస్ ఆఫీసర్లను, బ్రిటిష్ సైనిక సిబ్బందిని ఉపయోగించు కోడానికి వీలవుతుంది" అని మీనన్ వివరించాడు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమున్నప్పటికీ, అనాటి పరిస్థితిలో అధినివేశ ప్రతిపత్తి విషయ మాలోచించదగినదేనని సర్దార్ పటేల్ భావించాడు కాగా సంభాషణలు ఊపందుకున్నాయి నిర్ణయాలు నిముషాలమీద జరిగిపోయాయి

దేశ విభజనతోపాటు బెంగాల్, పంజాబ్ రాష్ట్రాల విభజనకుకూడా అంగీకరించారు ఇండియాకు, పాకిస్తాన్‌కు అధినివేశ ప్రతిపత్తినివ్వాలని నిర్ణయించారు తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌లను కలిపేందుకు 8 వందల మైళ్ల పొడవున కారిడరును (దారిని) ఏర్పాటు చేయాలని జిన్నా కోరిన కోర్కెను తిరస్కరించారు స్వతంత్ర సంస్థానాలు ఇండియాలోగాని, పాకిస్తాన్‌లోగాని చేరవచ్చు లేదా స్వతంత్రంగా వుండిపోవచ్చునని అంగీకరించారు

బెంగాల్ విభజన విషయంలో ముస్లిములు ఆందోళన జెందారు రాష్ట్ర విభజన జరిగితే తూర్పు బెంగాల్ బలహీనపడుతుంది పంజాబ్ ముస్లిముల పెత్తనం తప్పదు కాబట్టి బెంగాల్ రాష్ట్రాన్ని యధాతధంగా, స్వతంత్రంగా వుండనివ్వాలని, బెంగాల్ ముస్లిము నాయకులు సుహ్రావర్దీ, అబుల్ హషీమ్ మున్నగువారు కోరారు ఆ కోర్కెను శరత్‌చంద్రబోస్ సమర్థించాడు అయినా, ఆ కోర్కె తిరస్కరించబడింది "బెంగాల్ విభజింపబడిన తరువాత రెండు రాష్ట్రాలేర్పడతాయి అవి ఇండియాలో చేరాలో లేక పాకిస్తాన్‌లో చేరాలో నిర్ణయించే హక్కు ఆ రాష్ట్రాలలోని శాసనసభ్యులకుంటుంది అంతేగాని, స్వతంత్రంగా వుండే హక్కు ఏ రాష్ట్రానికి వుండదు" అని తీర్మానించారు

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రం స్వతంత్రంగా వుంటుందని ఆ రాష్ట్ర నాయకులు ప్రకటించారు అలా వుండే హక్కు బెంగాల్ రాష్ట్రానికి లేనట్లే, సరిహద్దు రాష్ట్రానికీ

లేదని జిన్నా వాదించాడు ఆ రాష్ట్రం ఇండియాలో చేరాలో, పాకిస్తాన్‌లో చేరాలోనన్న విషయాన్ని నిర్ణయించే హక్కును సహితం ఆ రాష్ట్ర శాసనసభకు యివ్వకూడదని, అక్కడ ప్లెబిసైట్ జరపాలని పట్టుబట్టాడు ప్లెబిసైటును కాంగ్రెస్ నాయకులు వ్యతిరేకించారు అన్ని రాష్ట్రాలలో వున్నట్లే ఆ రాష్ట్ర శాసనసభకు కూడా యిష్టం వచ్చిన డొమినియనులో చేరే హక్కున్నదని వాదించారు కాని జిన్నా మొండికెత్తాడు ఆ సమస్యపైన పట్టుబట్టి, పథకాన్ని భగ్నం చేయడం యిష్టం లేక కాంగ్రెస్ నాయకులు ఒప్పుకున్నారు కనీసం వయోజన ఓటింగుద్వారా ప్రజాభిప్రాయం తెలుసుకోవాలని పట్టుబట్టినా బాగుండేది కాని కాంగ్రెస్ వారాపని చేయలేదు కనుక ప్లెబిసైటును సరిహద్దు రాష్ట్ర కాంగ్రెస్ బహిష్కరించింది

అలా రూపొందిన పథకాన్ని జూన్ 2న జరిగిన సమావేశంలో కాంగ్రెస్, సిక్కు నాయకులామోదించారు తరువాత ముస్లింలీగ్ ఆమోదముద్ర వేసింది జూన్ 15న ఎ ఐ సి సి సమావేశం జరిగింది జూన్ 3న ప్రకటించబడిన ప్రతిపాదనవల్ల ఇండియాలోని కొన్ని ప్రాంతాలు విడిపోతాయి ఇది చాలా విచారకరమైన విషయం అయినా ఈనాటి పరిస్థితిలో వేరొక మార్గం లేనందున, ఆ ప్రతిపాదనలను ఎ ఐ సి సి ఆమోదిస్తున్నది" అని తీర్మానించింది తీర్మానానికి అనుకూలంగా 157గురు, వ్యతిరేకంగా 29 మంది ఓటు చేశారు "జూన్ 3న ప్రకటించబడిన పథకం భారతదేశానికి నిజమైన స్వాతంత్ర్యాన్నివ్వదు సామ్రాజ్యవాదుల ద్విముఖ విధాన పర్యవసానమే యీ పథకం ఇపుడు దేశాన్ని రెండు శతృదేశాలుగా విభజిస్తున్నారు విభజించబడిన ప్రాంతాలలోని అభివృద్ధి నిరోధక శక్తులతో ఒడంబడికలు చేసుకుని, ఉభయ దేశాలను తమ పలుకుబడిలో వుంచుకోవాలని పథకం వేశారు" అని కమ్యూనిస్టు పార్టీ తీర్మానం వెల్లడించింది "నిస్సహాయులుగా వున్న హిందువులు, ముస్లిములు తమ ముందు జరుగుతున్న ఘటనలను చూచి సంతోషించడం లేదు" అన్నాడు గాంధీజీ అయినా జులై 18న బ్రిటిష్ పార్లమెంటు ఆమోదంతో "భారత స్వాతంత్ర్య చట్టం" పైన రాజముద్ర పడింది 1947 ఆగస్టు 15న అమలు జరిగింది

## స్వతంత్ర సంస్థానాల విలీనం

జులై ఆరంభంలో, కేంద్రంలో ఏర్పరచబడిన సంస్థానాల శాఖను పటేల్ చేపట్టాడు దాని కార్యదర్శిగా వి పి మీనన్ నియమింపబడ్డాడు "ఈ పరిణామంవల్ల సంస్థానాధీశులయెడ కేంద్ర ప్రభుత్వానికిగల దృక్పథం మారిపోతుంది" అని భోపాల్ నవాబ్ ప్రకటించాడు అంతవరకూ కాన్‌రాడ్ కార్ఫీల్డు నాయకత్వాన కేంద్ర ప్రభుత్వ రాజకీయ శాఖవారిచ్చిన ప్రోద్బలం సంస్థానాధీశుల ఆశలను పెంచేది బ్రిటిష్ సార్వభౌమాధికారం రద్దు అవుతుంది గనుక తాము స్వతంత్రంగా సంస్థానాలను పాలించగలుగుతామని ఉవ్విళ్లూరేవారు కాని నూతన పరిణామాన్ని జూచి భయపడ్డారు కనుక పటేల్ వారికి కొంత ఆశ కల్పించాడు "సంస్థానాధీశులకు కాంగ్రెస్ వారు విరోధులు కారు సంస్థానాధీశులతోపాటు, వారి పాలనలోగల ప్రజలుకూడా సుఖశాంతులతో వర్ధిల్లాలని కోరుతున్నాం" అని జులై 5న ప్రకటించాడు

ఆ ప్రకటనవల్ల సంస్థానాధీశుల భయం కొంతవరకూ తీరిపోయింది కాశ్మీర్, హైదరాబాద్, తిరువాన్కూర్ మున్నగు సంస్థానాధీశులు స్వతంత్రంగా వుండాలని

నిర్ణయించుకున్నారు కాని ప్రజల పోరాటాలు వారి ఆట కట్టించాయి ఒకవైపు వరాలిస్తూ, మరొకవైపున ప్రజల తిరుగుబాటును చూసి భయపెడుతూ, అతి చాకచక్యంగా సంస్థానాలను విలీనం చేసేపనికి సర్దార్ పటేల్ పూనుకున్నాడు కనుక 1947 ఆగస్టు 15 నాటికి కాశ్మీర్, జునాఘడ్, హైదరాబాద్ తప్ప, తక్కిన సంస్థానాలన్నీ ఇండియాలో విలీనమై, రక్షణ విదేశాంగ విధానం, కమ్యూనికేషన్లపైన అధికారాన్ని కేంద్ర ప్రభుత్వానికి అప్పగించేందుకు అంగీకరించాయి

ఆ మూడింటపైన అధికారం వారికెన్నడూ లేదు అదివరకు వాటిపైన అధికారం బ్రిటిష్‌వారికుండేది ఇపుడు కేంద్ర ప్రభుత్వానికుంటుంది అందువల్ల వారికి పోయిందేమీ లేదు పైగా దేశరక్షణ, విదేశాంగ విధానం, కమ్యూనికేషన్లపైన అధికారం నెరపే శక్తి వారికి లేనూ లేదు కాబట్టి వాటిని కేంద్రానికప్పగించారు కాని తమ యిష్టానుసారం సంస్థాన ప్రజలను పాలించదలచారు అందుకు అనుగుణంగా చిన్న సంస్థానాల కలయిక ప్రారంభమైంది సంస్థానాధీశుల దుష్ట పథకాలను వమ్ము చేసేందుకు ప్రజలు ఉవ్వెత్తున లేచారు

స్వాతంత్ర్యం సిద్ధించిననాడు ఇండియాలో చిన్నా పెద్ద సంస్థానాలు 565 వున్నాయి దేశ విస్తీర్ణంలో 48 శాతాన్ని అవి ఆక్రమించాయి దేశ జనాభాలో దాదాపు 25 శాతం ప్రజలు సంస్థానాలలో వున్నారు వాటిని అలాగే వుండనిస్తే, భారతదేశం తిరిగి అంతర్యుద్ధాలకు లోనై, బానిసత్వంలోకి నెట్టబడేది కనుక ప్రజలు తిరుగుబాట్లు చేశారు ప్రజల పక్షాన నిలబడి కమ్యూనిస్టులు, సోషలిస్టులు మున్నగువారితోపాటు కొందరు కాంగ్రెస్‌వారుకూడా పోరాడారు

కాశ్మీర్ మహారాజాకు వ్యతిరేకంగా షేక్ అబ్దుల్లా నాయకత్వాన నేషనల్ కాన్ఫరెన్స్ ప్రారంభించిన "క్విట్ కాశ్మీర్" ఉద్యమం 1946 నాటికే బాగా బలపడింది మే నెల 20న షేక్ అబ్దుల్లాను అరెస్టు చేశారు సంస్థానంలో ప్రవేశించకూడదన్న నిషేధాన్ని ధిక్కరించినందుకు నెహ్రూను జూన్ 20న అరెస్టు చేసి మరునాడు విడిచిపెట్టారు అయినా వందలాది కాశ్మీరీలను జైళ్ళలో కుక్కారు కాగా ఉద్యమం పెరిగింది మహారాజు పరిస్థితి 1947 లో అస్తుబిస్తుగా తయారైంది ఒరిస్సాలోని ధెంకనాల్, తాల్చేర్ వగైరా సంస్థానాలు, ప్రజామండలి ప్రారంభించిన పోరాటాలను అణచలేక పతనమయ్యే పరిస్థితేర్పడింది జునాఘడ్, మైసూరు మున్నగు అనేక సంస్థానాలలో ప్రజలు విజృంభించారు తిరువాన్కూర్ ప్రజల పోరాటం అందరికీ కనువిప్పు కలిగింది వాటన్నింటినీ మించిన సాయుధ పోరాటం హైదరాబాద్ స్టేట్‌లో ఉరకలు వేసింది కాగా ప్లాన్ ప్రకారం సంస్థానాధీశులను తొలగించేందుకు సర్దార్ పటేల్ సిద్ధమయ్యాడు

## స్వతంత్ర సంస్థానాలలో పోరాటాలు

ఇండియాకు స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని తేలిపోయినపిమ్మట సంస్థానాధిపతులు- ముఖ్యంగా తిరువాన్కూరు మహారాజా, హైదరాబాద్ నవాబ్ తమ సంస్థానాలను స్వతంత్ర రాజ్యాలుగా ప్రకటించటానికి సిద్ధమయ్యారు ఆ విషయం తెలియగానే గాంధీజీ ఇలా హెచ్చరించాడు

"సర్ సి పి రామస్వామి అయ్యర్ సమర్థుడైన పరిపాలకుడు. బ్రిటిష్‌వారు వైదొలగగానే తిరువాన్కూరు సంస్థానం స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తుందని ఆయన చెప్పాడు

అంటే బ్రిటిష్ వారున్నంతవరకూ సంస్థానం ఇండియాలో కలిసి వుంటుందని, అధికారం భారతీయుల చేతికి రాగానే ఇండియన్ యూనియన్‌నుండి విడిపోతుందని వివరించాడన్న మాట ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం ఆ స్థితికి బ్రిటిష్‌వారి ప్రవర్తన దోహదం చేస్తున్నట్లయితే అందుకు వారు చిరకాలం సిగ్గుపడవలసి వుంటుంది హైదరాబాద్ సంస్థానంవారుకూడా సరియైన మార్గమెంచుకుంటారని విశ్వసిస్తున్నా పత్రికలలోని వార్తలు నిజమైతే, నైజాం నవాబ్ జారీచేసిన ఫర్మానా పూర్తిగా తప్పు సంస్థానాధీశులు స్వతంత్రులు కావడమంటే, సంస్థాన ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోవడమన్నమాట నాకు తెలిసినంతవరకూ అటువంటి స్థితిని ఎవరూ సహించరు సంస్థానాధీశులు తమ భవిష్యత్తును స్పష్టంగా తెలుసుకోవాలి "

## పున్నప్రా - వాయలార్ పోరాటం

తిరువాన్కూర్ సంస్థానంలో నిరంకుశపాలన అంతరించాలని, వయోజన వోటింగ్‌ద్వారా ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పాలని కమ్యూనిస్టుపార్టీ, ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కలిసి ఉద్యమాన్ని ప్రారంభించాయి కొబ్బరి పీచు కార్మికులు, వ్యవసాయ కూలీలు, బెస్తవారు పడుతున్న కష్టాలను తొలగించాలని కూడా పట్టుబట్టాయి అందుకు ప్రతీకారంగా యజమానులు, భూస్వాములు కలిసి కష్టజీవుల వేతనాలను తగ్గించారు కాగా సమ్మెలు ప్రారంభమయ్యాయి సమ్మె చేస్తున్నవారిమీద పోలీసులు, గూండాలు కలిసి దాడి చేశారు కార్మికులు ప్రతిఘటించారు కనుక సాయుధ దళాలొచ్చి అనేకమంది కార్మికులను నాయకులను అరెస్టుచేసి, చిత్రహింసలకు గురిచేశాయి మానభంగాలు జరిగాయి

1946 అక్టోబరులో కార్మిక నాయకులకూ - ప్రభుత్వానికీ మధ్య రాజీ చేసేందుకు పట్టం తానుపిళ్లే చేసిన ప్రయత్నం సర్ సి పి రామస్వామయ్యర్ మొండిపట్టువల్ల భగ్నమైంది అక్టోబరు 19న కమ్యూనిస్టు పార్టీని, షెర్తలాయ్ పీచు ఫ్యాక్టరీ కార్మిక సంఘాన్ని, బెస్తవారి సంఘాన్ని, సంస్థాన ప్రభుత్వం నిషేధించింది తరువాత సంస్థాన కాంగ్రెస్‌తోపాటు మరికొన్ని సంఘాలను నిషేధించింది కాంగ్రెస్ నాయకులైన కేశవన్, శంకరపిళ్ళేలను అరెస్టు చేసింది కనుక అక్టోబరు 21న కె సి జార్జి, సదాశివన్, టి వి థామస్ మున్నగు నాయకులు సార్వత్రిక సమ్మెకు పిలుపునిచ్చారు సమ్మె జయప్రదమైంది "అమెరికన్ మోడల్ మాకొద్దు, దివాన్ నిరంకుశత్వం నశించాలి బాధ్యతాయుత ప్రజాప్రభుత్వ మేర్పడాలి" అనే నినాదాలతో బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిగాయి

దివాన్ రామస్వామి అయ్యర్ మండిపడ్డాడు తాను రూపొందించిన అమెరికన్ మోడల్ పాలనను అమలుజరిపి తీరుతానని పట్టుబట్టాడు మార్షల్‌లాను ప్రకటించి, సాయుధ బలగాలను సన్నద్ధం చేశాడు ఉద్యమం చట్టవిరుద్ధమని, సమ్మెలను విరమించి లొంగిపోవాలని హెచ్చరించే కరపత్రాలను విమానాలద్వారా విరజిమ్మించాడు కాని తన అమెరికన్ మోడల్ రాజ్యాంగాన్ని ప్రకటించలేకపోయాడు

ఆ స్థితిలో పున్నప్రా గ్రామంపైకి నలువైపులనుండి పోలీసు బలగాలు వచ్చిపడ్డాయి ఆ బలగాలు వెనక్కు వెళ్లిపోవాలని ప్రజలు కోరారు ప్రజల కోర్కెను తిరస్కరించడమేగాక, పోలీసులు కాల్పులు ప్రారంభించారు ప్రజలు నేలపై పడుకొని ధైర్యంగా పోలీసులను ప్రతిఘటించారు కర్ర బల్లాలు పుచ్చుకొని, పొట్టలమీద పాకుతూ పోలీసు దళాలను చుట్టుముట్టారు కొన్ని గంటలపాటు పోరాటం జరిగింది కొందరు పోలీసులూ

మరికొందరు ప్రజలూ చనిపోయారు చివరకు పోలీసు బలగాలు తిరోగమించాయి పోలీసు శిబిరాలను ధ్వంసం చేయగలిగిన ప్రజలు డజను రైఫిళ్లు, స్టెన్‌గనులూ చేజిక్కించుకున్నారు

కనుక అక్టోబరు 26న సైన్యం విమానాలనుండి వాయలార్‌లో దిగడానికి ప్రయత్నించింది కాని విఫలమైంది కాగా 27న అనేకమంది సైనికులు నావలమీద వచ్చి వాయలార్‌మీద విరుచుకుపడ్డారు అయినా ప్రజలు వీరోచితంగా ప్రతిఘటించారు మధ్యాహ్నం 12 గంటలకు ప్రారంభమైన పోరాటం సాయంత్రం 5 గంటలకు ముగిసింది 8 వందల మంది ప్రజలు నేలకొరిగారు ప్రతిఘటన ముగిసిన తరువాత సైనికులు వాయలార్ గ్రామంమీదపడి చేతికి దొరికిన స్త్రీలను, పిల్లలనుకూడా చంపారు వందలకొలది ఇళ్లను తగలబెట్టారు తరువాత షెర్తలాయ్, అంబలపూళ తాలూకాలలో కనివినీ ఎరుగని దమనకాండ నెలల కొలది కొనసాగింది విచ్చలవిడిగా సంచరించగలిగిన సైనికులు, పోలీసులు అనేకవేలమందిని అరెస్టు చేశారు వారిలో చాలామందిని హింసించి, అంగహీనులను చేశారు విజయోన్మాదంతో దివాన్ రామస్వామయ్యర్ ఉప్పొంగిపోయాడు మరొక 20 ఏళ్లదాకా తిరువాన్కూరు సంస్థానంలో తన మాటకు ఎదురు చెప్పగలిగే వారుండరని దంభాలు పలికాడు

కాని మలబార్ కమ్యూనిస్టుల సహాయ సహకారాలతో సంస్థాన కమ్యూనిస్టు పార్టీ, ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లు తిరిగి విజృంభించాయి 1947 ప్రారంభంలో పోరాటాలు ప్రజ్వరిల్లాయి "అమెరికన్ మోడల్ రాజ్యాంగాన్ని అమలుపరచదలచుకుంటే, కమ్యూనిస్టు ప్రమాదం తప్పదు" అని వి పి మీనన్ రామస్వామి అయ్యర్‌ను హెచ్చరించాడు తాను వెనుకకు తగ్గకపోతే సాయుధ విప్లవం తప్పదని రామస్వామి అయ్యర్‌కూడా గ్రహించాడు కనుక తిరువాన్కూర్ సంస్థానం ఇండియాలో విలీనమైంది సంస్థానాన్ని స్వతంత్రంగా వుంచాలనే రామస్వామి అయ్యర్ కలలు కల్లలైనాయి ప్రజల పోరాటాలను చూపి హెచ్చరిస్తూ, అవసరమైనప్పుడు బెదిరిస్తూ సంస్థానాధీశులను లొంగదీసే కాంగ్రెస్ నాయకుల వ్యూహం సఫలమైంది

## తెలంగాణా పోరాటం

బ్రిటిష్‌వారెంత ప్రోత్సహించినా ప్రజల పోరాటాల ముందు తిరువాన్కూరు పాలకుడు తల వంచాడు కాని హైదరాబాద్ నవాబ్ తల వంచలేదు గూండా దళాలను, సైనిక పోలీసు బలగాలను ఉపయోగించి ప్రజలను రక్తపుటేరుల్లో ముంచడానికి పూనుకున్నాడు అయనకు మద్దతుగా జాగీర్దార్లు, దేశముఖులు వగైరా ఫ్యూడల్ వర్గాలవారున్నారు ఖాశిం రజ్వీ నాయకత్వానగల ఇత్తెహాదుల్ ముసల్మీన్ గూండాలు పోలీసులు గ్రామాలపైబడి దోచుకుంటూ, స్త్రీల శీలాన్ని హరిస్తూ స్వైరవిహారం చేశారు ఆ చర్యలను కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలతోబాటు కొందరు ముస్లిమ్ పెద్దలుకూడా వ్యతిరేకించారు నవాబ్, పాలనతోపాటు ఫ్యూడల్ వ్యవస్థ కూడా రద్దుకావాలని, ప్రజాస్వామ్యం నెలకొనాలని ఉద్యమం ప్రారంభించారు

అటు తరువాత సంస్థాన కాంగ్రెస్‌వారు సామరస్య పూర్వకమైన ఉద్యమాన్ని నడిపితే, కమ్యూనిస్టులు సమరశీల పోరాటాలు సాగించారు ఆ స్థితిలో ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు తెలంగాణా, హైదరాబాద్‌లలోని కాంగ్రెస్‌వారికి సాయం చేస్తే, ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులు తెలంగాణా కమ్యూనిస్టులకు అండగా నిలబడ్డారు కాగా

తెలంగాణా ప్రజల ప్రతిఘటన పెరిగింది

1946 జులై 4న దొడ్డి కొమరయ్య అనే కమ్యూనిస్టును, విసునూరు దేశముఖ్ హత్య చేయించాడు ఆ దేశముఖ్ సామాన్యుడు కాదు అయన స్వాధీనంలో వేలకొలది ఎకరాల పొలముండేది ఆయనకొక కోట, సివిల్, క్రిమినల్ అధికారాలు వుండేవి కాగా ఇష్టం వచ్చినట్లు ప్రజలను దోచుకొనేవాడు ఆ దోపిడిని అరికట్టి, ప్రజల హక్కులను సాధించేందుకు కమ్యూనిస్టు పార్టీ, సంఘం (ఆంధ్ర మహాసభ) కలిసి ఉద్యమాన్ని ప్రారంభించాయి నల్లగొండ జిల్లాలోని జనగాం, సూర్యాపేట, హుజూర్‌నగర్ తాలూకాలలో ఉద్యమం బాగా బలపడింది తరువాత ఖమ్మం, వరంగల్ జిల్లాలకు విస్తరించింది వెట్టిచాకిరీ, నజరానా, నిర్బంధ వసూళ్ళు, భూముల అన్యాక్రాంతాలు ఆగిపోయాయి

1946 ఏప్రియల్లో స్టేట్ కాంగ్రెస్‌పైనగల నిషేధాన్ని నైజాం ప్రభుత్వం తొలగించిన పిమ్మట, దిగంబరరావు బిందూ అధ్యక్షతన స్టేట్ కాంగ్రెస్ కార్యాచరణ సంఘం ఏర్పడింది ఆ సంఘం అక్టోబరు 28న సమావేశమై ఈ క్రింది కార్యక్రమాన్ని చేపట్టింది

(1) పటేల్, పట్వారీలచేత రాజీనామాలిప్పించి, వారి దస్తరాలను స్వాధీనం చేసుకొని, గ్రామ ప్రాంతాలలో నిజాం పాలనను అంతమొందించుట
(2) లెవీ ధాన్యమివ్వకుండా ప్రజలను సమీకరించి, ప్రభుత్వ యంత్రాంగాన్ని, రజాకార్ రాక్షసులను ఎదిరించుట-
(3) సంస్థానమునకు, ఇండియన్ యూనియన్‌కు మధ్యగల సరిహద్దులను ధ్వంసం చేయుట
(4) రజాకార్లకు, మిలిటరీకి ఉపయోగపడకుండా ప్రభుత్వ విశ్రాంతి భవనములను పడగొట్టుట
(5) మిలిటరీని, రజాకార్లను నిరోధించేందుకు వంతెనలను పడగొట్టి, రహదారులను ధ్వంసం చేయుట
(6) ఆర్ టి సి బస్సులను, రైళ్లను ఆపివేసి, ప్రభుత్వం పతనమైందని రుజువు చేయుట
(7) అబ్కారీ ఆదాయాన్ని ఆపేందుకు తాటిచెట్లను నరుకుట
(8) గెరిల్లా దళాలను నిర్మించి సైనికులపైన, రజాకార్లపైన మెరుపుదాడులు చేయుట
(9) గ్రామాలను రిపబ్లిక్కులుగా ప్రకటించి, పంచాయతీ పాలనను, గ్రామరక్షణ దళాలను ఏర్పరచుట
(10) ధనవంతులను దోపిడీ చేసేందుకు పూనుకుంటున్న కమ్యూనిస్టు పార్టీకి దూరంగా వుండుట

ఇవీ సంస్థాన కాంగ్రెస్‌వారి కార్యక్రమాలు. వీటిని అమలు జరిపేందుకు అవసరమైన సైనిక శిక్షణను కార్యకర్తలకు యిప్పించారు 1947లో ఆత్మార్పణ దళాలు నిర్మాణమయ్యాయి అయినా పోరాటాలలో పాల్గొన్న పలువురు కార్యకర్తలు మృతవీరులయ్యారు కనుక సంస్థాన కాంగ్రెస్‌వారి పోరాట కేంద్రాలను సంస్థాన సరిహద్దుల వెలుపలకు తరలించారు.

ఈలోగా రజాకార్ల బలం నైజాం నవాబును ధిక్కరించగల స్థాయికి పెరిగింది కాసిం రజ్వీకి ఎదురులేకుండా పోయింది. రజాకార్ల దాడులతోపాటు మిలటరీ బలగాల దాడులు హెచ్చాయి కాగా స్టేట్ కాంగ్రెస్‌వారి కార్యక్రమానికి వర్గపోరాటాన్ని జతపరచిన కమ్యూనిస్టులు సంస్థాన ప్రజలతో కలిసివుంటూ సాయుధ పోరాటాలు సాగించారు బల్లాలు, వడిసెలలు, కారపు ముంతలు, మజల్ లోడింగ్ తుపాకులు పుచ్చుకొని కమ్యూనిస్టు

దళాలు రజాకార్ల కాంపులమీద, పోలీసు క్యాంపులమీద అర్ధరాత్రి సమయంలో ఆకస్మిక దాడులు చేసినప్పుడు "దళం ఆయారే" అంటూ రజాకార్లు, పోలీసులు పారిపోయేవారు వారి ఆయుధాలన్నీ కమ్యూనిస్టులకు దక్కేవి

కనుక గెరిల్లా దళాల సంఖ్య పెరిగింది ఒక్కొక్క దళంలో నూరునుండి నూట ఇరవైవరకూ సైనిక శిక్షణ పొందినవారుండేవారు సైనిక శిక్షణ పొందినవారి సంఖ్య రెండువేలకు పెరిగింది వేలకొలది గ్రామాలలో ప్రజారక్షణ దళాలేర్పడ్డాయి కనుక తెలంగాణా ప్రాంతంలో విప్లవం ప్రారంభమయ్యే పరిస్థితులేర్పడ్డాయి

1947 మే 7న హైదరాబాద్ మైదానంలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో జయప్రకాశ్ నారాయణ్ ఉపన్యసించిన పిమ్మట నగరంలో అనేక బహిరంగ సభలు జరిగాయి నిషేధాజ్ఞలను ధిక్కరించి ప్రజలు ముందుకొచ్చారు నైజాం ప్రభుత్వం 317 మందిని అరెస్టు చేసింది ప్రజలకు పోలీసులకు నగరంలో అనేక ఘర్షణలు జరిగాయి అయినా నైజాం నవాబ్ ఇండియన్ యూనియన్‌లో చేరకుండా మొరాయించాడు

## ప్రజల ఆగ్రహం

1947 జూన్, జులై మాసాలలో మౌంట్‌బాటెన్ ప్లానుగా పేర్కొనబడిన పథకంయొక్క వివరాలను శరవేగంతో పూర్తిచేశారు బెంగాల్, పంజాబ్ అసెంబ్లీలలోని మైనారిటీ శాసనసభ్యులు ప్రత్యేకంగా సమావేశమై, ఆ రాష్ట్రాల విభజనకు ఓట్ చేశారు పరిమిత ఓటింగ్‌ద్వారా అస్సాంలోని సిల్హెట్‌జిల్లా తూర్పు పాకిస్తాన్‌లో కలిపివేయబడింది అలాగే నూటికి పదిమంది సమ్మతితో సరిహద్దు రాష్ట్రాన్ని పశ్చిమ పాకిస్తాన్‌లో కలిపారు "తనతోపాటు తన ఉద్యమాన్ని కూడా కాంగ్రెస్ నాయకులు తోడేళ్ళకు అప్పగించారు" అని సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ విమర్శించాడు జాతీయ ముస్లిమ్‌ల అభిప్రాయాలను పటేల్, నెహ్రూలు లక్ష్యపెట్టలేదని అబుల్ కలాం అజాద్ బాధపడ్డాడు

ఇండియాలోని పరిస్థితులను ఏమాత్రం ఎరుగని రాడ్‌క్లిఫ్ నాయకత్వాన నియమింపబడిన రెండు కమిటీలు శరవేగంతో సరిహద్దులను నిర్ణయించాయి అందువల్ల కొన్ని విపరీత పరిస్థితులు ఏర్పడ్డాయి పంజాబ్‌లోని గురుదాస్‌పూర్, బెంగాల్లోని మూర్షిదాబాద్, నాడియా జిల్లాలు తమవి కాకుండా పోయాయని ముస్లింలు కోపగించుకుంటే, పంజాబ్‌లోని లాహోర్‌తోపాటు కెనాల్ కాలనీ ప్రాంతం, బెంగాల్లోని ఖుల్నా, చిటగాంగ్ పర్వత ప్రాంతాలు తమవి కాకుండా పోయాయని హిందువులు కోపగించుకున్నారు అయినా ఎవరి కోపాన్నీ లెక్కచేయకుండా ముస్లిం లీగ్‌తోపాటు కాంగ్రెస్ కూడా ముందుకు సాగింది కాంగ్రెస్ నాయకుల కోరికపై, ఇండియన్ డొమినియన్‌కు గవర్నర్ జనరల్‌గా వుండేందుకు మౌంట్‌బాటెన్ అంగీకరించాడు పాకిస్తాన్‌కు గవర్నర్ జనరల్‌గా తానే వుండాలని జిన్నా నిర్ణయించుకున్నాడు "ఇదివరకెన్నడూ లేనంత ఏకీభావంతో అందరూ కలిసి, మానవ మారణహోమానికి దారితీసేమార్గంలో పయనించారు" అని పంజాబ్‌లోవున్న బ్రిటిష్ అధికారి ఫెండెరల్ మూన్ అభిప్రాయపడ్డారు ఇవేవి పట్టించుకోకుండా గాంధీజీ బెంగాల్లో చెలరేగిన మత కలహాల నాపడంలో నిమగ్నమయ్యాడు



# స్వతంత్ర భారత్ అవతరణ

1947 ఆగస్టు 14న భారత రాజ్యాంగ పరిషత్తు సమావేశమైంది స్వాతంత్ర్య సమరంలో అసువులు బాసిన అమరవీరులను స్మరిస్తూ పరిషత్ సభ్యులు రెండు నిముషాలు మౌనంగా నిలబడ్డారు పరిషత్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ గాంధీజీని ప్రస్తుతిస్తూ ప్రసంగించాడు ఆనాడు ఢిల్లీ నేత్రపర్వంగా అలంకరింపబడింది ఆగస్టు 14 ముగిసి 15 ప్రారంభం కానున్న సమయంలో లక్షలాది ప్రజలు ఎర్రకోటవద్దకు చేరారు వేదికపైన జాతీయ నాయకులు కూర్చున్నారు కొంచెం దూరంలో మౌంట్‌బాటెన్‌తోపాటు ఆయన సలహాదారులు కూర్చున్నారు 31 ఫిరంగులు పేలాయి జయజయధ్వానాలమధ్య నెహ్రూ త్రివర్ణ పతాకను, జాతీయ పతాకను ఎగురవేశాడు

"బాధలుపడి, త్యాగాలుచేసి భారతీయులు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న ఈ శుభ సమయంలో దేశసేవకు అంకితమవుతున్నాము ప్రపంచశాంతికి, అభ్యున్నతికి తోడ్పడుతూ ప్రపంచ రాజ్యాలలో సముచిత స్థానాన్ని పొందగల విధంగా భారతదేశాన్ని తీర్చిదిద్దేందుకు కృషి చేస్తాము" అని రాజ్యాంగ పరిషత్ సభ్యులు ప్రమాణం చేశారు

"అనేక సంవత్సరాల క్రితం మనం చేసిన స్వాతంత్ర్య ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేరలేదు కాని దాదాపుగా నెరవేరింది అర్ధరాత్రి సమయంలో ప్రపంచమంతా నిద్రపోతున్నప్పుడు భారతదేశం మేల్కొని స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొంటున్నది గతంనుండి భవిష్యత్తుకు అడుగువేసే సమయం, చిరకాలంగా మౌనం వహించిన జాతియొక్క అంతరాత్మ మేల్కొని ప్రబోధిస్తున్న సమయం, చరిత్రలో బహు అరుదుగా లభించే సమయం - ఈనాడు వచ్చింది ఈ పవిత్ర సమయంలో భారతదేశ సేవకు, భారత ప్రజల సేవకు, ప్రపంచ ప్రజల ఉన్నతాశయాలకు అంకితమవుదామని మనం ప్రతిజ్ఞ చేద్దాం" అంటూ జవహర్‌లాల్ నెహ్రూ ప్రసంగించాడు

దేశమంతటా ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. అంతకు ఒకరోజు ముందుగా రామస్వామి రెడ్డియార్ మంత్రివర్గం జైళ్లలోనున్న కమ్యూనిస్టులను విడుదల చేసింది జాతీయ పతాకకు కమ్యూనిస్టులు శాల్యూట్ చేశారు కాంగ్రెస్ నాయకులందరూ గాంధీజీని పొగిడారు కాని గాంధీజీ హృదయం స్పందించలేదు స్వాతంత్ర్య దినోత్సవ సందేశమివ్వ వలసిందని కోరగా- "నేను సందేశమిచ్చే స్థితిలో లేను" అని సమాధానమిచ్చాడు ఉపవాసముండి ప్రార్థనచేస్తూ ఆగస్టు 15న తన మనస్సును హిందూ-ముస్లిం సఖ్యతమీద లగ్నం చేశాడు

## గాంధీజీ హత్య

భారత ఉపఖండానికి స్వాతంత్ర్యం సిద్ధించింది ప్రజల ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి కాని పాకిస్తాన్‌లోని లక్షలాది హిందువులకు, సిక్కులకు, ఇండియాలోని లక్షలాది ముస్లిములకు అది ప్రాణాంతకమైంది. కనీవిని ఎరుగని విధంగా బెంగాల్‌నుండి పంజాబ్‌వరకూ మానవ మారణహోమం జరిగింది మత కలహాలను మొగ్గలోనే త్రుంచి వేస్తామని మౌంట్ బాటెన్ చెప్పిన మాటలు కల్లలైనాయి కాంగ్రెస్‌లీగ్ నాయకులతోపాటు హిందూ-ముస్లిం సిక్కు పెద్దలొకచోట సమావేశమై, బ్రిటిష్‌వారి ప్రమేయం లేకుండా,

ఒడంబడికకు రాగలిగితే మతకలహాలుండవని గాంధీజీ చెప్పినమాటలెవరికీ పట్టలేదు

ఆ సమయంలో గాంధీజీ బెంగాల్లో వున్నాడు ఆయన ఎక్కడకు వెళితే అక్కడ మతకలహాలు ఆగిపోయాయి అయినా తూర్పు బెంగాల్లోని వేలాది హిందువులు ప్రాణాలు గుప్పెట పెట్టుకొని కాందిశీకులుగా పశ్చిమబెంగాల్లో ప్రవేశిస్తే, పశ్చిమ బెంగాల్లోని ముస్లిమ్‌లు వేలాదిగా తరలి, తూర్పు బెంగాల్‌కు వెళ్ళిపోయారు

మానవ మారణకాండ ఎక్కువగా పంజాబ్‌లో జరిగింది సరిహద్దుకు తూర్పునవున్న ముస్లిములు, పడమరన వున్న సిక్కులు, హిందువులు మారణహోమంలో సమిధలయ్యారు అటూ ఇటూ కాందిశీకులను చేరవేస్తున్న రైళ్లలో కొన్ని కేవలం శవాలను మాత్రమే చేరవేశాయి అందువల్ల మతోన్మాదం పెరిగింది లాహెూర్ ప్రాంతంనుండి సిక్కులను, హిందువులను తుడిచిపెట్టేందుకు ముస్లిములు పూనుకోగా, అమృత్‌సర్ ప్రాంతంనుండి ముస్లిములను తుడిచిపెట్టేందుకు సిక్కులు పూనుకున్నారు ఢిల్లీలోని ముస్లిములను వెళ్లగొట్టేందుకు హిందువులు దాడిజేస్తే, నైరుతి పంజాబులోని హిందువులను వెళ్ళగొట్టేందుకు ముస్లిములు దాడిచేశారు ఆ సమయంలో భాగల్పూరులోవున్న బ్రిటిష్ అధికారి పెండెరల్ మూన్ ఇలా ప్రకటించాడు

"భాగల్పూరులో వున్న ముస్లిములకు, ముఖ్యంగా ముస్లిమ్ రైతులకు, హిందువుల ఆస్తిమీద, హిందూ కన్యలమీద వున్న ఆసక్తి, హిందువులను చంపడం మీద లేదు ఉభయ మతాలవారూ సమ ఉజ్జీలుగావున్న తూర్పు పంజాబ్, మధ్య పంజాబ్ ప్రాంతాలలో ఒకరినొకరు తుడిచివేసేందుకు తలపడ్డారు పశ్చిమ పంజాబ్‌నుండి కాందిశీకులుగా వస్తున్న 20 లక్షల మంది సిక్కులకు తగినంత భూమిని చూపెట్టేందుకుగాను, తూర్పు పంజాబ్‌లోని ముస్లిములను తరిమివేయడంలో సిక్కులు మొండిపట్టుదలను ప్రదర్శించారు." (పెండెరల్ మూన్, డివైడ్ అన్డ్ క్విట్)

"అందువల్ల మతకలహాలలో లక్షా ఎనభైవేల మంది మరణించారు అలా మరణించిన వారిలో సిక్కులు, హిందువులు అరవైవేలు, ముస్లిములు లక్షా ఇరవైవేలు" అని పెండేరల్ మూన్ అంచనా వేశాడు 1948 మార్చి నాటికి 60 లక్షలమంది ముస్లిములు ఇండియానుండి పాకిస్తాన్‌కు వెళ్లిపోగా, 45 లక్షల మంది హిందువులు, సిక్కులు పాకిస్తాన్‌నుండి ఇండియాకు వచ్చారు తూర్పు పంజాబులోని 47 లక్షల ఎకరాల పంట పొలాలను ముస్లింలు విడిచిపెట్టిపోతే, పశ్చిమ పంజాబ్‌లోని 67 లక్షల ఎకరాల పొలాలను హిందువులు, సిక్కులు విడిచిపెట్టి వచ్చారు "మొత్తంమీద ముస్లిములు ఎక్కువమంది చనిపోగా, హిందువులు, సిక్కులు ఎక్కువగా ఆస్తిని కోల్పోయారు" అని పెండెరల్ మూన్ ప్రకటించాడు.

దేశ సమస్యలమీద అప్పుడప్పుడు తన అభిప్రాయాలను వెల్లడించినప్పటికీ గాంధీజీ 1947 జనవరినుండి కేవలం మత కలహాల నివారణకొరకే తన యావచ్ఛక్తిని వినియోగించాడు కొద్దిమంది అనుచరులతో నౌఖాలీలోని కాలిబాటలమీద ప్రయాణం చేశాడు కోపోద్రిక్తులైన ముస్లిములొకసారి దారికడ్డంగా వేసిన చెత్తపెంటను స్వహస్తాలతో తొలగించి ముందుకు సాగాడు ఆ ముస్లిముల ఇళ్లలోనే బసచేశారు "నా మాట వినే వారెవరూ లేకపోతే ఒంటరిగానే నేను ముందుకు సాగుతాను" అని ప్రకటించాడు. కనుక నౌఖాలీలో మతకలహాలు ఆగిపోయాయి ఆయన చేసిన ఆత్మార్పణ హెచ్చరికవల్ల బీహారులోనూ ఆగిపోయాయి

1947 ఆగస్టు 15కు కొద్ది రోజులముందు కలకత్తాలో ప్రారంభమైన మతకలహాల నాపేందుకు వెళ్ళిన గాంధీజీ, సుహ్రావర్దీని వెంటబెట్టుకొని బెలియాఘాటులో పాదయాత్ర చేశాడు పరిస్థితి కుదుటపడింది కాని ఆగస్టు 31న మళ్లీ మతకలహాలు ప్రారంభ మయ్యాయి కనుక గాంధీజీ ఆమరణ నిరాహారదీక్ష పూనాడు మతకలహాలాగిపోయాయి

కాశ్మీర్‌లో అధిక సంఖ్యాక ప్రజలు ముస్లిములు, మహారాజా హిందువు ఆయన నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడిన కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్స్ బాగా బలపడింది కాని కాన్ఫరెన్స్ అధ్యక్షుడు షేక్ అబ్దుల్లాతోపాటు పలువురు నాయకులుకూడా జైళ్లలో వున్నారు వారంతా లౌకికవాదులు మతం ప్రాతిపదికగా దేశాన్ని విభజించడానికి వారు వ్యతిరేకం కాశ్మీర్ సంస్థానం ఇండియాలో విలీనం కావాలని వారు కోరారు అయినా మహారాజా వినలేదు

జిన్నా చెప్పిన "ద్విజాతి సిద్ధాంతం" తప్పు అనీ, హిందువులు-ముస్లిములు అన్నదమ్ములవంటివారని కాశ్మీర్ ముస్లిములు రుజువు చేయటంవల్ల గాంధీజీ సంతోష పరవశుడై కాశ్మీర్ వెళ్లాడు మహారాజుకు, నేషనల్ కాన్ఫరెన్స్‌కుమధ్య ఒడంబడిక జరిగేందుకు తోడ్పడ్డాడు షేక్ అబ్దుల్లా ప్రభృతులు జైళ్ళనుండి విడుదలయ్యారు

మతకలహాల నాపేందుకు పంజాబ్‌కు వెళ్లాలని గాంధీజీ భావించాడు అక్కడ జరిగిన మానవ మారణకాండ ఆయన మనసును కలచివేసింది కాగా ఒక ముస్లిం లీగ్ నాయకునితో మాట్లాడుతూ "నా ప్రాణాన్ని బలిపెట్టి అయినా మతకలహాల నరికట్టదలచుకున్నాను ఇండియాలోని ముస్లిములు రోడ్లమీద దేకుతూ బ్రతకడాన్ని నేను సహించలేను ఆత్మగౌరవంతో ధైర్యంగా నిలబడి ముస్లింలు బ్రతకగలగాలి" అని శపథం చేశాడు (ఖలి కుజ్జమాన్, పాత్‌వే టు పాకిస్తాన్ )

ఆ సమయంలో ఢిల్లీలోని హిందువులు ముస్లిముల మీద దాడి చేశారు ఆ ఘాతుక చర్యను జూచి ఆగ్రహావేశపరవశుడైన ప్రధాన మంత్రి నెహ్రూ, ఒక జీపులో నిలబడి స్టెన్‌గన్ పుచ్చుకొని ఢిల్లీ నగర రోడ్లపైన పరవళ్లుతొక్కాడు కీలక ప్రాంతాలలో సైనికులను నిలిపాడు అయినా కలహాలు ఆగలేదు హరిజన కాలనీలో వుంటూ మత సామరస్యంకొరకు గాంధీజీ చేసిన కృషికూడా ఫలించలేదు కాగా 1948 జనవరిలో గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించాడు ఆ సమయంలో తనను దర్శించిన సర్దార్ పటేల్‌తో ముచ్చటిస్తూ, పాకిస్తాన్‌కు యివ్వదేలిన 55 కోట్ల రూపాయలను వెంటనే యిచ్చివేయవలసిందిగా కోరాడు ఆ మొత్తాన్ని వెంటనే యిస్తే కాశ్మీర్‌మీద సాగిస్తున్న దాడిని ఉధృతం చేసేందుకు జిన్నా వుపయోగించుకుంటాడని పటేల్ సందేహించాడు అంతట గాంధీ "నీవు యిదివరకటి పటేలువుకాదు" అని విమర్శించాడు

ఆ విమర్శవల్ల బాధపడిన పటేల్ వెంటనే ఆ మొత్తాన్ని పాకిస్తాన్‌కు పంపించాడు మత సామరస్యాన్ని కాపాడుతామని హిందూ-ముస్లిం మతపెద్దలు జనవరి 18న గాంధీజీ ఎదుట ప్రమాణం చేశారు కనుక గాంధీ నిరాహార వ్రతాన్ని విరమించాడు ఆ ఘటనలు హిందూ మతోద్రేకాన్ని మరింత పెంచాయి బాంబేలో జరిగిన కుట్ర ప్రకారం జనవరి 20న గాంధీజీమీద బాంబు విసిరారు కాని అది గాంధీజీకి తగలలేదు తనకు రక్షణ కల్పిస్తానని పటేల్ చేసిన సూచనను గాంధీజీ తిరస్కరించాడు

జనవరి 27న తమ ప్రార్థన మందిరానికి వచ్చి సందేశమివ్వవలసిందిగా గాంధీజీని ముస్లిం మతపెద్దలు ఆహ్వానించారు ముస్లిముల ప్రధాన శత్రువుగా గాంధీజీని వర్ణిస్తూ

ముస్లింలీగ్ చేసిన ప్రచారాన్ని, ఆ ఆహ్వానం వమ్ము చేసింది కనుక గాంధీజీ ముస్లిముల ఆహ్వానాన్ని మన్నించాడు అందువల్ల హిందూ మతోన్మాదుల గుండెలు మండాయి గాంధీజీని హత్య చేసేందుకు బాంబేలో కుట్ర జరిగిందనే విషయం తెలిసిన పిమ్మటకూడా, కుట్రను భగ్నం చేసేందుకు తగిన చర్యలను పోలీసులు చేపట్టలేదు కాగా 1948 జనవరి 30 సాయంత్రం 5 గంటల సమయంలో నాధురామ్ గాడ్సే పేల్చిన పిస్టల్ గుళ్లకు గురై "హే రామ్" అంటూ బాపూజీ తన మనమరాండ్ర చేతుల్లోకి ఒరిగిపోయాడు గాంధీజీ మరణవార్తను విని దుఃఖసాగరంలో మునిగిన ప్రజలనుద్దేశించి పండిట్ నెహ్రూ "భౌతికంగా గాంధీజీ అదృశ్యమయ్యారు కాని దేశాన్ని కాంతిమయం చేసిన ఆయన జ్యోతి వేయి సంవత్సరాల తరువాతకూడా యీ దేశంలోనేగాక ప్రపంచమంతటా వెలుగుతూనే వుంటుంది" అని ధైర్యం చెప్పాడు

## సంస్థానాల విలీనంలో రెండోఘట్టం

1947 ఆగస్టు 15న స్వతంత్ర భారత జాతీయ పతాక ఎర్రకోటపై ఎగిరినప్పటికీ, దేశానికి నిజమైన స్వాతంత్ర్యం రాలేదనే అభిప్రాయం అతివాదులకు, ముఖ్యంగా కమ్యూనిస్టులకు కలిగింది అందుకు కొన్ని బలమైన కారణాలున్నాయి సంపూర్ణ స్వాతంత్ర్య కోర్కెను కాంగ్రెస్ నాయకులు విడనాడి అధినివేశ ప్రతిపత్తికి అంగీకరించడం, గవర్నర్ జనరల్, సర్వసేనాధిపతి మున్నగు అత్యున్నత పదవుల్లో బ్రిటిషువారుండడం, సంస్థానాధీశులకు స్వేచ్ఛనివ్వడం? జమీందారీ వ్యతిరేక, పెట్టుబడిదారీ వ్యతిరేక పోరాటాలపైన రాష్ట్రాలలోని కాంగ్రెస్ ప్రభుత్వాలు ఆంక్షలు విధించడం మున్నగు కారణాలు అతివాదులలో అనుమానాలను రేకెత్తించాయి దేశంలో ఫ్యూడలిజం వున్నంతవరకూ బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెత్తనం తప్పదని వారు భావించారు కనుక అప్పటికే ఉధృతంగా సాగుతున్న జమీన్ రైతుల పోరాటాలను, సంస్థాన ప్రజల పోరాటాలను మరింత ఉధృతం చేశారు

కనుకనే ఇతర ఎస్టేట్లతోపాటు దేవాదాయ, ధర్మాదాయ ఎస్టేట్లనుకూడా మద్రాసు ప్రభుత్వం రద్దుచేసింది క్రమంగా దేశమందన్ని రాష్ట్రాలలోను ఎస్టేట్లను రద్దుచేశారు

మైసూరు మహారాజు పాలన రద్దు కావాలని స్టేట్ కాంగ్రెస్ ప్రారంభించిన ఉద్యమం సఫలమైంది తిరువాన్కూరులో కమ్యూనిస్టులు, ట్రేడ్ యూనియన్లు చేసిన పోరాటాలుకూడా జయప్రదమయ్యాయి జునాఘడ్ సంస్థానాధిపతి పాకిస్తాన్‌లో విలీనమయ్యేందుకు సిద్ధపడిన సమయంలో ఉప్పొంగిన ప్రజల తిరుగుబాటుకు మద్దతుగా పటేల్ పోలీసు దళాలను పంపి సంస్థానాధిపతిని తొలగించాడు ఒరిస్సాలోని తాల్చేర్, నీలగిరి, డెంకనాల్ వగైరా సంస్థానాధిపతులు ఏర్పరచుకున్న కూటమికి వ్యతిరేకంగా ప్రజామండలి ప్రారంభించిన పోరాటం, గిరిజనుల తిరుగుబాటు ఉధృతమయ్యాయి ఆ సంస్థానాధిపతులు తమ నిరంకుశ పాలనకు స్వస్తి చెప్పకపోతే వారిని దేవుడుకూడా రక్షించలేడని సర్దార్ పటేల్ హెచ్చరించాడు కాగా 1947 డిసెంబరులో అక్కడ సంస్థానాధీశుల పాలన అంతమైంది

ప్రజల పోరాటాలను చూసి సంస్థానాధీశులను లొంగదీయడంతోపాటు, పటేల్ వారికి కొన్ని వరాలుకూడా ఇచ్చాడు కొందరిని రాజ ప్రముఖులుగా నియమించి, కొద్దిమందికి గవర్నర్ పదవులుకూడా కట్టబెట్టాడు పెద్ద మొత్తాలలో రాజ భరణాలు

చెల్లించుటకు నిర్ణయించాడు కొన్ని సంస్థానాలను కలిపి యూనియన్లుగా ఏర్పాటుచేసి, వాటిలో ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వాల పాలనకు ప్రోది చేశాడు తిరువాన్కూరు, కొచ్చిన్‌వంటి యూనియన్లు కథియవాడ్, రాజస్తాన్, పంజాబ్, వింధ్యప్రదేశ్ మొదలగుచోట్ల ఏర్పడినాయి కాని సంస్థానాల సరిహద్దులుమాత్రం భాషా ప్రయుక్త రాష్ట్రాలేర్పడేంతవరకూ అలాగే వుండిపోయాయి

నేషనల్ కాన్ఫరెన్స్‌వారెంత వత్తిడి చేసినా కాశ్మీర్ మహారాజు తన సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేసేందుకు ఒప్పుకోలేదు జిన్నా ప్రోద్బలంతో పఠానులు 1947 అక్టోబరు 22న కాశ్మీరు పైన దండయాత్ర చేశారు నాలుగురోజుల్లోనే శ్రీనగర్ శివార్లలో ప్రవేశించారు కాశ్మీరును ఇండియాలో విలీనం చేస్తూ నేషన్ కాన్ఫరెన్స్ తీర్మానించింది విధిలేక మహారాజాకూడా విలీనాన్ని ప్రకటించాడు గవర్నర్ జనరల్ సమ్మతిగాని, సర్వసేనాని ఆకిన్‌లెక్ అనుమతిగాని లేకుండానే కాంగ్రెస్ మంత్రివర్గం అక్టోబరు 27న విమానాలద్వారా సైనిక దళాలను శ్రీనగర్‌లో దింపింది 24 గంటలలోనే భారత సైనికులు పఠానులను శ్రీనగర్‌నుండి తరిమివేశారు అయినా సామ్రాజ్యవాదుల కుట్రలవల్ల జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రంలోని కొంతభాగాన్ని అజాద్ కాశ్మీర్ పేరుతో పాకిస్తాన్ తన స్వాధీనంలో వుంచుకోగలిగింది

ఇండియా-పాకిస్తాన్‌ల బలాబలాలు కాశ్మీరులో తేలిన పిమ్మటకూడా నైజాం నవాబ్ భీష్మించుకు కూర్చున్నాడు విదేశాలనుండి ఆయుధాలను, విమానాలను తెప్పించుకోవాలని, పోర్చుగీసువారినుండి గోవాను కొనివేయడంద్వారా ఒక రేవు పట్టణాన్ని కలిగి వుండాలని ప్రయత్నించాడు 1947 జూన్ 3న బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ప్రకటన ప్రకారం తనకు స్వేచ్ఛ కలదని, తన రాజ్యం స్వతంత్రంగా వుంటుందని ప్రకటించాడు

1947 నవంబరు నాటికి కాశిం రజ్వీ నాయకత్వానగల రజాకార్ల సంఖ్య 50 వేలకు చేరింది బెజవాడ మీదుగా దాడిచేసి ఐందరును స్వాధీనం చేసుకుంటానని కాశిం రజ్వీ ప్రకటించాడు ఆయన ఇష్టప్రకారం నడుచుకోవలసిన స్థితిలో నైజాం నవాబ్ పడిపోయాడు ఆ స్థితిలో మౌంట్‌బాటెన్ మధ్యవర్తిత్వంవల్ల భారత ప్రభుత్వానికి, నైజాం ప్రభుత్వానికి మధ్య 1947 నవంబరు 27న యధాతథ ఒడంబడిక జరిగింది కాగా, మరొక ఏడాదిపాటు తన ప్రయత్నాలను సాగించుకునేందుకు నవాబుకు మరొక అవకాశం దొరికింది కాశిం రజ్వీ ఛలో ఢిల్లీ నినాదాన్ని యిచ్చాడు ఈ పరిణామాన్ని గమనించిన స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడు, స్వామి రామానంద తీర్థ "ఏ సంస్థానాధిపతి మీదనూ చూపని మెతకదనాన్ని భారత ప్రభుత్వం నైజాం నవాబుమీద చూపుతోంటే ఆశ్చర్యం కలుగుతోంది" అని విమర్శించాడు (మెమాయిర్సు ఆఫ్ హైదరాబాద్ ఫ్రీడమ్ స్ట్రగుల్)

పరిస్థితి విషమించింది రజాకార్ల దాడులు, దోపిడీలు మితిమీరిపోయాయి నైజాం సైనికులు సరిహద్దుల వద్దనున్న భారత సైనికులమీద కాల్పులు సాగించారు సామ్రాజ్యవాదుల అండదండలతో తన పాలనను సాగించగలననే ధైర్యం నవాబుకు చిక్కింది వి పి మీనన్ హెచ్చరించినా రజాకార్ దళాలను రద్దు చేసేందుకు దివాన్ లాయక్ అలీ తిరస్కరించాడు నైజాం ప్రభుత్వం సైనికులు, పోలీసులు, రజాకార్లు కలిసి స్త్రీలు, పిల్లలతో సహా అనేకమందిని హత్య జేశారు వందలకొలది గ్రామాలను దోచుకున్నారు మొత్తంమీద 21వేల మంది దేశభక్తులను జైళ్లలో బంధించారు ఈ దారుణ కృత్యాలను కట్టిపెట్టవలసిందిగా బషీర్ అలీ మీర్జా, అఫ్జల్ మునీమ్ ప్రభృతులు

చెప్పిన సలహాను నవాబ్ పెడచెవిన బెట్టాడు ఇమ్రోజ్ పత్రికా సంపాదకుడు షోయబుల్లాఖాన్‌ను రజాకార్లు కాల్చి చంపారు హత్యలు, మానభంగాలు, గృహ దహనాలు మితిమీరిపోయాయి 83వేల చదరపు మైళ్ల విస్తీర్ణంగల హైదరాబాద్ స్టేట్‌ను స్వతంత్రంగా వుండనిస్తే, తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌లతోపాటు, ఇండియా నడిగడ్డమీద మరో పాకిస్తాన్ ఏర్పడుతుంది కనుక హైదరాబాద్ సంస్థానాన్ని ఇండియాలో విలీనం చేయాలని దేశభక్తులందరూ పోరాడారు కాని అందరికంటే మిన్నగా కమ్యూనిస్టులు పోరాడారు రావి నారాయణరెడ్డి, మఖ్దుం మొహియుద్దీన్, బద్దం ఎల్లారెడ్డి ప్రభృతుల నాయకత్వాన కమ్యూనిస్టులు గెరిల్లా పోరాటం ప్రారంభించారు వారికి పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు మొదలగు ఆంధ్ర కమ్యూనిస్టుల అండ దండిగా లభించింది కాగా, 41వేల చదరపు మైళ్ల విస్తీర్ణంగల తెలంగాణాలో గెరిల్లా యుద్ధం ప్రజ్వరిల్లింది అందువల్ల కమ్యూనిస్టుల బలం పెరిగింది 4వేల మంది గెరిల్లా సైనికులు, 10వేల మంది గ్రామ రక్షణదళ సభ్యులు ప్రాణాలకు తెగించి పోరాడారు

సాయుధ ప్రతిఘటన జయప్రదమైన ప్రాంతాలలో వెట్టి చాకిరి రద్దుచేయబడింది అక్రమంగా దేశముఖులు ఆక్రమించుకున్న భూములను తిరిగి రైతులు స్వాధీనం చేసుకున్నారు నిరుపేదలు, వ్యవసాయ కూలీలు కలిసి ప్రభుత్వ భూములను పంచుకున్నారు కౌలు రేట్లు తగ్గించబడినాయి ధాన్య రూపేణా యిచ్చిన అప్పుల మీద విధించిన 'నాగు' వడ్డీని రద్దు జేశారు మొత్తంమీద రెండు వేల గ్రామాలలో నైజాం ప్రభుత్వం పాలన అంతమైంది పది లక్షల ఎకరాల భూములు పేదలకు లభించాయి స్త్రీలు గౌరవప్రదంగా జీవించగలిగారు మూఢనమ్మకాలు తగ్గాయి జానపద బాణీలలో రచించబడిన గేయాలను పాడుకుంటూ ప్రజల ఉద్యమాన్ని బలపర్చారు కనుక ఉద్యమం రోజు రోజుకూ బలపడుతూ విస్తరించింది

ఆ స్థితిలో 1948 సెప్టెంబరు 13న కేంద్ర ప్రభుత్వం చేపట్టిన "పోలీస్ చర్య" ననుసరించి, భారత సైన్యాలు నైజాం స్టేట్‌లో ప్రవేశించాయి రెండు, మూడు రోజుల్లోనే నైజాం నవాబ్ లొంగిపోయాడు "యధాతధ ఒడంబడిక గడువు నవంబరువరకూ వుండగా సెప్టెంబరులోనే పోలీసు చర్యను తీసుకోవడం దేనికి?" అనే ప్రశ్న ఉదయించింది. ఆ ప్రశ్నకు జవాబు చెపుతున్నాడా అన్నట్లుగా వి పి మీనన్ జనరల్ చౌధురితో ఇలా అన్నాడు "రజాకార్ల సమస్యా, కమ్యూనిస్టుల సమస్యా ఒకేరకంగా వున్నాయి అయినా రెంటినీ ఒకే సమయంలో ఎదుర్కోవడం మంచిదికాదు కాబట్టి ముందు రజాకార్‌లను బంధించి జైళ్లలో పెట్టు, తరువాత కమ్యూనిస్టులను నిలువరించి తుడిచిపెట్టు" (వి పి మీనన్, ది స్టోరీ ఆఫ్ ది ఇంటిగ్రేషన్ ఆఫ్ ఇండియన్ స్టేట్స్)

కాబట్టి రజాకార్లతోపాటు కమ్యూనిస్టులనుకూడా అణచివేసేందుకు పోలీసు చర్య ఉద్దేశించబడిందని అర్థమవుతోంది అయినా తెలంగాణా గెరిల్లా పోరాటం నైజాం నవాబు ఆట కట్టించడానికి తోడ్పడిందని, భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి నాంది పలికిందని చెప్పవచ్చు

## ఆశానిరాశలు

స్వాతంత్ర్యం లభించిన పిమ్మట ఇండియా తన స్వంత విదేశాంగ విధానాన్ని రూపొందించుకున్నది అభివృద్ధి చెందుతున్న దేశాలతోను, సోషలిస్టు దేశాలతోను సఖ్యత

నెరపుతూ అలీన ఉద్యమాన్ని బలోపేతం చేసింది నయా వలస వాదాన్ని వ్యతిరేకించింది వర్ణ వివక్షతను ఖండించింది ప్రజాస్వామ్యం ప్రాతిపదికగాగల రాజ్యాంగాన్ని 1950 జనవరిలో ప్రకటించారు వయోజన ఓటింగ్‌తోపాటు, వాక్సభాపత్రికా స్వాతంత్ర్యాలు లభించాయి రాజులు, నవాబులు, జమీందారులు తొలగించబడ్డారు 1956లో భాషా ప్రయుక్తరాష్ట్రా లేర్పడినాయి ప్రభుత్వ రంగంలో మూలాధార పరిశ్రమ లేర్పడినాయి పంచవర్ష ప్రణాళికలద్వారా పారిశ్రామిక ఉత్పత్తిని, ఆహారధాన్యాల ఉత్పత్తిని పెంచి, ఆర్థికాభివృద్ధిని సాధించేందుకు పూనుకోవడం జరుగుతోంది దేశ రక్షణ పటిష్టమైంది ఇవన్నీ గణనీయమైన విజయాలే

కానీ, తన మరణానికి ముందు గాంధీజీ "27 లక్షల గ్రామాలకు ఆర్థిక, సామాజిక న్యాయం కలుగజేయవలసి వుంది కనుక కాంగ్రెస్‌ను రద్దుచేసి లోక్‌సేవక్ సంఘాన్ని నిర్మించండి" అని చేసిన హెచ్చరికను నాయకులు తిరస్కరించారు దేశభక్తులు పదవులకోసం ఎగబడటంవల్ల త్యాగం తగ్గింది స్వార్థం హెచ్చింది అధికారపీఠం చుట్టూ తిరిగిన స్వార్థపరులు పదవులనందుకోగలిగారు బ్యురాక్రసీ, దమనకాండ పెరిగాయి లంచగొండితనం, బ్లాక్ మార్కెట్, కల్తీ సరుకుల అమ్మకం సర్వత్రా వ్యాపించాయి ఎన్నికల్లో ధనబలం, కండబలం ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి మత కలహాలు జరుగుతూనే వున్నాయి కుల, మత, ప్రాంతీయ తత్వాలు, అవినీతి అంతకంతకూ ప్రబలమవుతున్నాయి టెర్రరిజం అమాయకుల ప్రాణాలను బలిగొంటోంది నిరుద్యోగం విపరీతంగా పెరిగింది మంత్రుల మాటలు కోటలు దాటుతోంటే, చేతలు గడప దాటడంలేదు అయినా ఒక విషయం మాత్రం తధ్యం విలియమ్ మారిస్ చెప్పినట్లుగా మరో ఉద్యమం వచ్చి తీరుతుంది

"తమ హక్కుల కొరకు ప్రజలు పోరాడతారు అందులో ఓడిపోయినా కొన్ని హక్కులు లభిస్తాయి వాటిని చూచి మురిసిపోతారు కొంతకాలం తర్వాత, ఆ హక్కులు సమగ్రంగా లేవని తెలుసుకుంటారు. సమగ్రమైన హక్కుల కొరకు మరొక తరంవారు మరొక పేరుతో పోరాడక తప్పదు" (విలియం మారిస్, ఫ్రీడమ్ ఆఫ్ జాన్ బుల్)





# రచయిత గురించి

ముక్కామల నాగభూషణం గారు 1910 ఫిబ్రవరి 4న కృష్ణాజిల్లా బుద్ధవరం గ్రామంలో జన్మించారు

1921లో బెజవాడలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ఒక వలంటీరుగా పాల్గొన్నారు తదాదిగా స్వాతంత్ర్య సమరంలోనూ, జమీందారీ వ్యతిరేక పోరాటాలలోనూ పాల్గొన్నారు జైళ్లకు వెళ్లారు రాజమండ్రి జైలునుండి తప్పించుకు పోయారు సంవత్సరాల తరబడి అజ్ఞాతవాసంలో వుండి పోరాడారు

బాల్యం నుండి సంఘ సంస్కరణోద్యమంతోనూ, రైతు ఉద్యమంతోనూ, జాతీయ ఉద్యమంతోనూ సన్నిహిత సంబంధాలున్నాయి పెక్కు సంస్కరణ వివాహాలు చేయించారు మహావక్త

వివిధ ఉద్యమాలకు సంబంధించిన అనేక వ్యాసాలు, పాటలు, పుస్తకాలు రాశారు వీరు రాసిన, ఆకాశవాణి విజయవాడ కేంద్రంవారు ప్రసారం చేసిన సంగీత రూపకాలలో కొన్నింటికి జాతీయ, అంతర్జాతీయ ప్రశంసా పత్రాలు లభించాయి దశాబ్ద కాలంపాటు వీరు ప్రగతి, ఆంధ్రవాణి వారపత్రికలకు సంపాదకులుగా వున్నారు

1943లో ప్రజానాట్యమండలి స్థాపనకు దోహదంచేసి, 1948లో అది ప్రభుత్వ నిషేధానికి గురయ్యేటంతవరకూ ఆర్గనైజరుగా వుంటూ దాని అభివృద్ధికి కృషి చేశారు ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ అధ్యక్షుడుగా జమీందారీ విధానం రద్దు కొరకు అనేక పోరాటాలు నిర్వహించారు తత్ఫలితంగా 1948లో జమీందారీ విధానం రద్దైంది

ప్రభుత్వ సహాయంతో నిమిత్తం లేకుండా హరిజనులకు కాలనీలు నిర్మించారు మంచినీటి బావులు తవ్వించారు విజయవాడలోని గాంధీ పర్వతంపైగల నిర్మాణాలన్నీ ఈయన కృషి ఫలితంగా రూపొందినవే విజయవాడ చుట్టు పక్కల గల విద్యాలయాల నిర్మాణంలో వీరి పాత్ర వుంది కోటీ యాభై లక్షల వ్యయంతో ఎదురుమొండి, ఈలచెట్లదిబ్బ దీవులకు సాగునీటి సౌకర్యం కల్పించారు

ప్రాంతీయ అభివృద్ధి సంఘానికి, కృష్ణాజిల్లా రచయితల సంఘానికి, దీనజన సంక్షేమ సమితికి, ఆంధ్ర క్రికెట్ అసోసియేషనుకు, అధ్యక్షులుగా వుండి, ఆయా రంగాలలో ఎన్నదగిన కృషి చేసిన వీరు 1992 జూలై 25న దివంగతులయ్యారు